# డా॥ వాసిరెడ్డి సీతాదేవి

# సాహిత్యం



# మట్టి మనిషి

డా॥ వాసిరెడ్డి సీతాదేవి

సాహిత్యం

మొదటి సంపుటం

# మట్టిమనిషి



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్ - 500 001.

**Dr. Vasireddy Seethadevi Sahithyam Vol. I** : MATTI MANISHI (Novel)

ప్రచురణ నెం. 2217

ప్రతులు : 1000

మొదటి ముద్రణ : జూన్, 2000

మొదటి ముద్రణ : 1972

నాల్గవ ముద్రణ : 1994



టైటిల్ డిజైన్ : రాజా

వెల: రూ. *135-00*

ప్రతులకు :

**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**

విజ్ఞానభవన్, 4-1-435, బ్యాంక్ స్ట్రీట్

హైదరాబాద్ - 500 001.

**విశాలాంధ్ర బుక్ హౌస్**

విజయవాడ, బ్యాంక్ స్ట్రీట్/సుల్తాన్‌బజార్ హైదరాబాదు,

అనంతపురం, విశాఖపట్నం,

తిరుపతి, గుంటూరు, హన్మకొండ, కాకినాడ.

కళాంజలి గ్రాఫిక్స్ విఠల్‌వాడి, హైదరాబాదు. ఫోను : **3229831**

# సమర్పణ



అమ్మా !

నువ్వే నా బడీ,

నా గుడీ కూడ;

ఈ లోకం నుంచి వెళ్ళిపోయిన

నీకు ఇంతకంటే ఏమి ఇవ్వగలను !!

# ఎవరీ..... మనిషి?

నవల ప్రధానంగా వినోదదాయకంగా వుండాలి. విజ్ఞానం కొరకు ఎవరూ నవలలు చదవరు. అందుకు వేరే గ్రంథాలున్నాయి. ఇతర వ్యాపకాలనుంచి విశ్రాంతి పొందడానికి, తల్రబద్దలుచేసే ఆలోచనలనుంచి మనస్సును మరల్చి ఆటవిడుపుగా కాలక్షేపం చేయడానికి నవలలు చదువుతూ వుంటారు. కనుక నవల నడక సాఫీగా వుండాలి. తేలిక భాష, సరళమైన శైలివుండి భావానికి తగిన భాష, భాషకు తగినశైలి అమరినప్పుడు నవలను చదవడానికి ప్రయత్నం చేయవలసిన అవసరం వుండదు. నవలే చదివిస్తుంది.

నవల ఇతివృత్తం ఎక్కువ మందిని ఆకర్షించగలగాలి. ''లోకో భిన్నరుచిః.'' మరి విభిన్న రుచులుగల స్త్రీ పురుషులను సమంగా ఆకర్షించే కథావస్తువును ఎన్నుకోవాలి. సామాజికులలో విద్యాధికులు వున్నారు. విమర్శకులు వున్నారు. మేధావులున్నారు. నవల వీరిని మాత్రమే చదివించితే చాలదు. వీరికి మాత్రమే వినోదం కలిగితే చాలదు. వీరితోపాటు లారీలు తోలుకునే డ్రైవరులున్నారు. హోటళ్ళలో కప్పులు కడిగే క్లీనరులున్నారు. లాండ్రీలలో బట్టలుతికే రజకులున్నారు. కేవలం ఇంటిపనుల్లోనే నిమగ్నులై వుండే మహిళలున్నారు. నవల వీరందర్నీ చదివించి, వీరికీ వినోదం కల్గించి, అందరూ ఆనందించేటట్లు వుండాలి. విశాలమైన మానవతా దృష్టిని ప్రదర్శించే నవల మాత్రమే అందరినీ ఉత్సాహపరచి, ఆకర్షిస్తుంది.

కథావస్తువు ఎంత ఆసక్తిజనకంగా వున్నా, సన్నివేశాలూ, సంఘటనలు సహజంగా లేకపోతే రచన రక్తికట్టదు. సన్నివేశాలు సందర్భశుద్ధి కలిగి సహజంగా కథనుంచే ఉత్పన్నం కావాలి; భూమిలో నాటిన విత్తనం క్రమంగా నేలను చీల్చుకుని మొక్కగా మొలకెత్తినట్లు సన్నివేశాలు ఉత్పన్నమై కథాగమనానికి తోడ్పడాలి. సంఘటనలు పాత్రలను ఆవిష్కరిస్తుంటే, పాత్రలు కథను నడిపిస్తుంటాయి.

ఏ పాత్రా పానకంలో పుడకవలె వుండకూడదు. ప్రతి పాత్రకూ ఒక వ్యక్తిత్వం వుంటూ పాత్రల చేష్టలు ఆ పాత్రల శీలానికి అనుగుణంగా వుండాలి. పాత్రల సంభాషణలు ఆ పాత్రల ప్రవృత్తిని బహిర్గతం చేస్తూ కథ సాగిపోవడానికి ప్రోదిచేయాలి.

కథకు ఆదిమధ్యాంతములు వుండాలి. ముగింపు ప్రారంభానికి సహజమైన పరిణామంగా స్ఫురించాలి. ఆరోహణావరోహణలు క్రమానుగతంగా జరిగితే నవల అందమైన ఆర్చివలె వుంటుంది. అసందర్భాలు, అసంబద్ధాలు వుండరాదు. తెరచాపవలె అతుకుల బొంతగా గాక కొత్త తానువలె వుండాలి.

నవలా లక్షణాలను సోమర్ సెట్ మామ్ ఈ పై విధంగా వివరించారు. ఈ దృష్టితో మామ్ గొప్ప నవలలుగా పది నవలలను పేర్కొని సమీక్షించారు. ఏ భాషలో వ్రాసినా, ఏ కాలంలో వ్రాసినా నవలకు ఈ లక్షణాలు వుండవలసిందే

కదా! వీటన్నింటినీ సంతరించుకున్న నవల సలక్షణమై శోభిల్లుతుంది.

తెలుగు నవలకు నూరేండ్లు నిండిన సంవత్సరం ఇది. మొదటి ఏడెనిమిది దశాబ్దాలలో ఎన్ని నవలలు వచ్చినవో చివరి రెండు మూడు దశాబ్దాల్లోనూ అన్ని నవలలు, అంతకంటే ఎక్కువ సంఖ్యలో కూడా వచ్చినవి. అనువాదాలు తగ్గి, అనుసరణలు పోయి, స్వతంత్ర రచనలు విరివిగా వస్తున్నవి. పుస్తకాలు చదువరులను వెతికే రోజులు పోయి, చదువరులు పుస్తకాలను ఎన్నుకునే రోజులు వచ్చినవి. 'చదవడానికి పుస్తకాలేవీ?' అని అడిగే రోజులు పోయి 'ఏ పుస్తకం చదవా'లని విచారించే రోజులు వచ్చినవి.

చదువరులలో పఠనాసక్తిని కల్గించిన చౌకబారు సాహిత్యం క్రమంగా తగ్గి, పాఠకులలో ఉన్నత ఆశయాలను, ఉదాత్తమైన ఆలోచనలను, అభ్యుదయకరమైన భావాలను కలిగించే సాహిత్యం వస్తున్నది. ఒకప్పుడు అడ్డంగా మాత్రమే పెరుగుతూవున్న తెలుగు నవలా సాహిత్యం ఇప్పుడు నిలువుగా కూడా పెరుగుతూ వుంది.

పాశ్చాత్య సాహిత్యంచేత ప్రభావితులై కొంతకాలం ప్రతిబింబాలను చిత్రించిన రచయితలు - వెనుకటి అనుభవంతో భారతీయతను బాగా ఆకళింపు చేసుకుని దేశిసాహిత్యాన్ని సృష్టించి, భారతీయ సాహిత్య ప్రపంచంలో తెలుగు సాహిత్యానికి ఒక విశిష్ట స్థానాన్ని సంపాదించారు. ఒకప్పుడు తెలుగు రచయితలపై వంగ సాహిత్య ప్రభావం ఎక్కువగా వుండేది. ప్రసిద్ధ వంగ రచయితల కథానికలు, నవలలు ఎన్నో తెలుగులోకి వచ్చినవి. తెలుగు నవలా వికాసానికి ఇవి అన్నీ తోడ్పడినవి.

అయితే వర్తమాన సమాజాన్ని, సమాజంలోని సంఘర్షణలను, సామాజికులపై పరిసరాల ప్రభావాన్ని సహజంగా, వాస్తవికంగా చిత్రిస్తున్న రచనలు ఇంకా తక్కువగానే వున్నవి. అవగాహనపై శ్రద్ధ తగ్గి, ఊహాగానంపై మక్కువ పెరగడంతో రచనలు అవాస్తవికంగా వుంటున్నవి. ఎక్కువ నవలలు ఒకే ఇతివృత్తం కలిగి వుంటున్నవి. స్వానుభవాలను సార్వజనీనమైనవిగా చిత్రీకరింపగల నేర్పు లేకపోతే పాత్రలు, సన్నివేశాలు, సంఘటనలు అసహజంగా వుండి, నవల తేలిపోతుంది.

ఎన్నో మంచి నవలలు వస్తున్నవి. కొన్ని గొప్ప నవలలుగా నిలబడి వుంటున్నవి. మన చరిత్రను, సంస్కృతిని, నాగరికతను వివరించే నవలలతోపాటు వర్తమాన సమాజంలోని మంచి చెడ్డలను వెల్లడించే నవలలూ వస్తున్నవి. కొంత ఎక్కువ తక్కువలో అన్నీ ప్రజాదరణను పొందుతున్నవి. ముద్రాపకుల, ప్రకాశకుల సంఖ్య పెరుగుదలే ఇందుకు నిదర్శనం.

ఈ సంవత్సరం ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారి ''ఉత్తమ నవల'' బహుమతి పొందిన వాసిరెడ్డి సీతాదేవిగారు ఇప్పటికి అయిదు నవలలు ఆంధ్ర పాఠక లోకానికి అందించారు. అయిదవ నవల ఈ ''మట్టిమనిషి'' ''ఆంధ్రప్రభ'' ఆదివారం అనుబంధంలో ధారావాహికంగా ప్రచురణ అయి, పాఠకులను విశేషంగా ఆకర్షించిన ఈ నవలకు పరిచయ వాక్యాలు అవసరం లేదు. స్మృతిపథం నుంచి తొలగని ''మట్టిమనిషి''ని ఎవరికి గుర్తుచేయాలి?

సీతాదేవిగారు ''పరిచయ వాక్యాలు'' వ్రాయాలని పట్టుబట్టడంచేత అనవసరమైన పనిని అవసరంగా చేయవలసివచ్చింది. వారం వారం ప్రచురిస్తున్నప్పుడు ఆరువందల పేజీల నవలా అన్నభావం కలగలేదు. సీతాదేవిగారు ఎన్నుకున్న ఇతివృత్తం అలాంటిది. సాధారణమైన యవనికపై వర్తమాన సమాజంలోని కనకయ్యలను, రామనాథబాబులను, సాంబయ్యలను, వెంకటపతులను – వీరందరితోపాటు నాయిక వరూథిని వంటి స్త్రీలను చిత్రీకరించడం సాధ్యంకాదు. దేవీ ప్రసాదరాయ్ చౌధురి కళాఖండాలను – ముఖ్యంగా ''శ్రమజీవులు'' శిల్పాన్ని స్ఫురణకు తెస్తున్న ఈ ''మట్టిమనిషి''ని మాటలతో రూపొందించడానికి ఇంత పెద్ద 'కాన్వాస్' అవసరమే. అంత పెద్ద యవనికను తీసుకున్నప్పుడు నిండుగా చిత్రించడానికి ఎంత లేఖనానైపుణ్యం వుండాలి!

నేటి సమాజానికి సీతాదేవిగారు పట్టిన నిలువుటద్దం ఈ నవల. తమ ప్రతిబింబాలను చూచుకునే సామాజికులు ''ఇది నా ముఖమే సుమా!'' అని ఆశ్చర్యపోతారు. కొందరు ''నేను నిజంగా ఇలా వున్నానా?'' అనే ఆలోచనలోపడి స్వస్వరూపజ్ఞానం కలిగి సిగ్గుపడతారు. ఈ ప్రతిబింబాలను చూచుకుంటున్న వారివెనక నిలబడి తమాషా చూస్తున్నవారు ''ఈ ప్రపంచంలో ఎలా మెలగడం, ఎలా బ్రతకడం?'' అనే విచారణలో పడతారు.

ప్రతి గ్రామంలోనూ ఊరుబోయిన సాంబయ్య ఒకడు ఊరుచివర వుంటాడు. నడిబజార్లో పెద్దలుకట్టిన భవంతిలో పిత్రార్జితం కరిగిస్తూ గొప్పలకుపోయే బలరామయ్య వుంటాడు. ఊరుబోయిన సాంబయ్యకు వెంకటపతివంటి కొడుకూ, భద్రయ్యగారి బలరామయ్యకు వరూథినివలె గారాబంగా పెరిగే కడగొట్టు కూతురూ వుండటం సహజమే. బలరామయ్యలు, సాంబయ్యలు వుంటున్న వూళ్ళో కనకయ్యలు అవతరించక తప్పదు.

ఎందరు బలరామయ్యలున్నా, మరెందరు సాంబయ్యలున్నా ఒక్క కనకయ్యన్నా లేకపోతే గ్రామ జీవితం నిస్సారమై పథ్యపు తిండివలే వుంటుంది. గ్రామాల్లోని కనకయ్యలే బస్తీలకుపోయి నాగరికులై రామనాథబాబులుగా రూపొందుతారు. ఈ ఆరుగురే ప్రధాన పాత్రలు. మిగతా పాత్రలన్నీ వీరికి పనులు చేసి పెట్టే పరికరాలు, వీరిచుట్టూ తిరిగే ఉపగ్రహాలు.

పోతే సాంబయ్య మనవడు రవి సీతాదేవిగారు ముందు ముందు వ్రాసే నవలల్లో కథానాయకుడు కావచ్చును. పెరిగి పెద్దవాడై, ఉన్నవ లక్ష్మీనారాయణగారు సృష్టించిన తక్కెళ్ళ జగ్గడంతగా రవి ప్రసిద్ధి కెక్కవచ్చును. ''వస్తానా... వస్తా. తెస్తా నీ కోసం – తుపాకి'' అనే రవి మాటలతో ఈ నవలను ముగించారు సీతాదేవిగారు.

షేక్స్పియర్ నాటకాలలో నాయికలేగాని నాయకులు లేరని రస్కిన్ అన్నారు. నేటి సమాజంలో నాయకుడుగా వుండతగ్గవాడు లేడేమో మరి, సీతాదేవి గారి నవలల్లోనూ నాయికలే గాని నాయకులు కన్పించరు. వరూథిని కథానాయిక. వెంకటపతి పెండ్లికి ముందు సాంబయ్య కొడుకు; పెండ్లి తర్వాత వరూథిని

మొగుడు. అతడు నాయకుడు కాదు. అయితే కింగ్ లియర్‌లోని కింగ్ లియర్ వలె 'మట్టిమనిషి'లోని మట్టిమనిషి సాంబయ్య. కొడుకు వెంకటపతి, కోడలు వరూథిని జీవించినంతకాలం నానాబాధలు పెట్టి, కష్టార్జితమైన లక్షల ఆస్తిని హరింపచేస్తే అవసాన దశలో సాంబయ్యను ఆదుకున్నవాడు మనవడు రవి.

పాత్రలను సృష్టించడంలో సీతాదేవిగారి ప్రజ్ఞ ఈ రవిపాత్ర కల్పనలో కన్పిస్తుంది. వరూథిని కాపురానికి వెళ్ళిన తొలిరాత్రే వెంకటపతిని దగ్గరకు రానివ్వదు. వెంకటపతిపై ఆమెకు ఎప్పుడైనా జాలి కలిగేదిగాని ప్రేమ ఎప్పుడూ లేదు. అందువల్ల రవి వెంకటపతి కొడుకేనా అన్న అనుమానం ఆఖరువరకూ పాఠకుల్ని బాధిస్తుంది. ఈ అనుమానం నివృత్తి చేయడంలో సీతాదేవిగారు చూపిన నేర్పు సునిశితమైన వారి హృదయాన్నీ, నిశితమైన పరిశీలనా శక్తినీ, చక్కగా విశదం చేస్తున్నది.

వెంకటపతి వదిలివెళ్ళిన తర్వాత సాంబయ్య తాతతో వుంటున్న రవిని తీసుకు వెళ్ళడానికి రామనాథబాబు వస్తాడు. తిరిగి పబ్లిక్ స్కూలులో చేర్పిస్తాను రమ్మని రవిని అడిగాడు. రామనాథబాబును చూడగానే ప్రాణాలు లేచివచ్చినట్లు ''బాబాయ్'' అంటూ పరుగెత్తిన రవి ఒక నిర్ణయం తీసుకోవలసి వచ్చినప్పుడు తాత సాంబయ్య దగ్గరికే పరుగుతీసి ఆ 'మట్టిమనిషి' వొడిలో వాలిపోతాడు. రక్త సంబంధం!

ఈ సత్యాన్ని నిరూపించడానికి సీతాదేవిగారు మరొక సన్నివేశాన్ని కూడా ఎంతో హృదయంగమంగా, అతిస్వాభావికంగా చిత్రించారు. రవిని వెంటబెట్టుకుని వెంకటపతి వూరుదాకా వస్తాడు. తండ్రి సాంబయ్య ఎక్కడ వుండేదీ వివరంగా చెప్పి, వెళ్ళమంటాడు. తనతో రానందుకు రవి వెంకటపతిని తిట్టుకుంటూ కొంత దూరం సాగి, అమాంతం ''నాన్నా, నాన్నా'' అని ఏడుస్తూ వెనక్కి తిరిగి వెంకటపతి వెళ్ళినవైపు పరుగుతీస్తాడు! రక్తస్పర్శ కొంతన్నా లేకపోతే ఆ ఆవేదన కలుగుతుందా?

సీతాదేవిగారి రచనాశిల్పంపై ఎంతైనా వ్రాయవచ్చును. మట్టిమనిషి నిండా మరపురాని సన్నివేశాలెన్నో వున్నాయి.

నాయిక వరూథిని పాత్రపోషణను కూడా ఎంతో సమర్థవంతంగా చేశారు. రామనాథబాబును చంపించడానికి అన్ని. ఏర్పాట్లు చేసి, తన పన్నాగం నెరవేరిందని అనుకుని, రామనాథబాబు చనిపోయి వుంటాడన్న నిశ్చయానికి వచ్చిన వరూథినికి జీవితేచ్ఛ నశించి తప్పతాగి ప్రాణాలు తీసుకుంటుంది. స్త్రీ లింత కర్కశంగా ప్రవర్తించినా అంతరాళాలలో 'ప్రేమ' ఉంటుందని చూపి, చివరికి వరూథిని చనిపోయిందని తెలుసుకున్న పాఠకుడు 'పాపం' అని నిట్టూర్చేటట్లు ఆ పాత్రను పోషించారు.

ఆ విధంగానే రామనాథబాబుపై ఎంత అసహ్యం కలిగినా, చివరికి రవి కొరకు వెళ్ళడంతో ఆ పాత్రను కూడా అంత జుగుప్స కలగని విధంగా చిత్రీకరించారు.

ఇక కనకయ్య, కనకయ్య రాజకీయాలు – నేడు ఊరూరా, ప్రతిరోజూ

అందరూ అనుభవిస్తున్నవాట్నే ఎంతో సహజంగా వర్ణించారు.

భూమినే నమ్ముకున్న రైతు ఆశలు, ఆరాటాలు, అనుభవాలు ఎలా వుంటవో ''మట్టిమనిషి'' సాంబయ్యలో ప్రతిబింబింపచేసి చావులేని మనిషిని సృష్టించారు.

గ్రామీణ ప్రయోగాలను ఎంత చక్కగా ఉపయోగించారో గ్రహించడానికి రెండు మూడు వాక్యాలు చాలును: ''నీ సిగతరగ! ఏందే ఆ పాలికేకలు?'' ''ఎంతసేపు గూటుత్నారా ఆ గంజీ?'' ''అదే కామాలి. నేను పట్టి కుదిపితే ఉంగడిపడ్డ గొడ్డులా బిగిసిపో యుండాడు.''

చదువరులకు వినోదాన్ని కల్గిస్తూనే వారికి తెలియకుండా కొన్ని జీవిత సత్యాలను మనస్సుకు పట్టేటట్లు చెప్పారు సీతాదేవిగారు. వియ్యానికీ కయ్యానికీ సమస్థాయి చూసుకోలేకపోవడంవల్లనే సాంబయ్య కష్టం చివరికి మట్టిపాలైపోయింది. కష్టార్జితం బూడిదపాలైంది. పల్లెటూరు వదిలి బస్తీకెక్కి విలాస జీవితానికి అలవాట్రై, ఆశలు పెంచుకుని చివరికి బ్రతకలేక చావవలసివచ్చింది. హద్దుమీరిన, కాలుజారిన 'ఆడదాని' బ్రతుకు నేటి సామాజికులమధ్య ఎంత దుర్భరంగా వుంటుందో వరూథిని జీవితం వివరించింది.

ప్రసిద్ధ ఆంగ్ల నవలా రచయిత్రి జేన్ ఆస్టిన్ పాత్రల సృష్టిని గురించీ, సన్నివేశాల కల్పనను గురించి మాసింగ్‌హామ్ అన్నమాటలు గుర్తుకొస్తున్నాయి 'మట్టిమనిషి'లోని పాత్రల హావభావ ప్రదర్శనలను చూస్తుంటే, మాటలను వింటుంటే. ''ఆమె సృష్టించిన పాత్రలు ఎంతో వైవిధ్యంతో అపురూపంగా మలచబడి, విభిన్న మనస్తత్వాలను ప్రతిబింబిస్తూ వుంటాయి. మనకు అత్యంత సన్నిహితంగా తెలిసిన వ్యక్తులతో ఎంతో గొప్పగా అనేక పాత్రలను సృష్టించింది. పరంపరాగతమైన అనుభవాలకు అవి ప్రతినిధులుగా నిలుస్తాయి. ఆమె వర్ణించిన ఘట్టాలు, సామాన్య మానవుని భావావిష్కరణలు, చిత్రించిన పాత్రల ధోరణులు - కొంతవరకు నేను ఎప్పుడూ కలిసే వ్యక్తులను చూస్తున్న అనుభూతిని కల్గించినవి.''

సీతాదేవిగారి రచనల్లో ఈ పోకడలు, ఈ ఛాయలు చాలావరకు కన్పిస్తవి. మామ్ చేసిన నవలా నిర్వచనానికి అతి సన్నిహితంగా వున్న ఈ నవల ఆంధ్ర పాఠక లోకం ఆదరణను విశేషంగా పొందడంలో ఆశ్చర్యం లేదు. మంచి నవలలను అందిస్తున్న సీతాదేవిగారి లేఖినినుంచి ఇంకా ఇంకా మంచి నవలలు రాగలవనే విశ్వాసాన్ని కల్గిస్తున్నది ఈ 'మట్టిమనిషి'.

ఆంధ్రప్రభ
పరీధావి, ఉగాది. } పండితారాధ్యుల నాగేశ్వరరావు

# డా॥ వాసిరెడ్డి సీతాదేవి సాహిత్యం

## 5 సంపుటాల్లో

**మొదటి సంపుటం**

మట్టిమనిషి — *రు.135-00*

**రెండవ సంపుటం**

సమత + వైతరణి
+ అర్చన + తిరస్కృతి — *త్వరలో*

**మూడవ సంపుటం**

అడవిమల్లె + ఉరితాడు
+ వెన్నెల మండుతోంది
కోతి కొబ్బరికాయ + మానిని మనసు — *త్వరలో*

**నాల్గవ సంపుటం**

రాబందులు – రామచిలుకలు +
మృగతృష్ణ + మళ్ళీ తెల్లవారింది +
తొణికిన స్వప్నం — *త్వరలో*

**ఐదవ సంపుటం**

సావేరి + మరోదెయ్యం కథ
+ బంధితుడు + బొమ్మరిల్లు — *త్వరలో*



# మట్టిమనిషి-చాలా గట్టిమనిషి

డాక్టర్ (కుమారి) వాసిరెడ్డి సీతాదేవిగారు రచించిన ఈ ''మట్టిమనిషి'' నవల నేటికి ఇరవై ఏళ్ళ కిందట 1972లో తొలిసారి గ్రంథరూపంలో వెలువడింది. (దీనికి ఒక చారిత్రాత్మక ప్రాధాన్యత ఉందని గుర్తుంచుకోవాలి.) ఈ నవల ఒక దినపత్రిక ఆదివారం అనుబంధంలో ధారావాహికంగా ప్రచురితమై పాఠకలోకాన్ని ఆకట్టుకుంది. గ్రంథరూపంలోనికి వచ్చాక ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారి ఉత్తమ నవల పురస్కారాన్ని అందుకుంది. ఇప్పటికి మరి రెండుసార్లు పునర్ముద్రితమైంది.

ఇది డాక్టర్ సీతాదేవిగారు రచించిన నవలలో అయిదవది. ఆ పిమ్మట ఆమె ఎన్నో నవలలు రాశారు. అభ్యుదయ దృక్పథం, సామాజిక చైతన్యం, సామ్యవాద విశ్వాసం, సాంఘిక ప్రయోజనం, రచనా బాహుళ్యం, ఇతివృత్తవైవిధ్యం, కథన చాతుర్యం, పాత్రోన్మీలనం, శైలీ విన్యాసం మొదలైనవి ఈమె రచనలలో గణుతికెక్కిన గుణాలు. ''సమత'', ''మరీచిక''వంటి నవలలు చెప్పుకోదగ్గవి. కొన్ని (నాలుగు) చలనచిత్రాలుగా తర్వాత రూపొందాయి. ''మరీచిక''ను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అతివాద నవలగా భావించి నిషేధించినా, ఉత్తరోత్తరా దానిని ఉపసంహరించుకొనక తప్పలేదు. ''సమత''ను ''ప్రజా నాయకుడు'' అనే పేరుతోను, ''మృగతృష్ణ''అదే పేరుతోను నిర్మాతలు చలన చిత్రాలుగా నిర్మించారు. ఎన్ని నవలలు రచించినా ఎంత చరిత్ర సృజించినా డాక్టర్ సీతాదేవిగారి సృజనాత్మక జీవితంలో ''మట్టిమనిషి''కి ఒక విశిష్టత ఉంది.

ఈ నవల గ్రంథరూపంలో వెలువడిన సంవత్సరం 1972 కి గల ఒక చారిత్రాత్మక ప్రాధాన్యత గురించి ముందే చెప్పుకోవాలి. ఆంధ్ర నవలా సాహిత్యానికి అది శతజయంతి సంవత్సరం. సరిగ్గా అప్పటికి నూరేళ్ళ కిందట 1872లో మొట్టమొదటి తెలుగు నవల వెలుగు చూసింది. దీనికి ఒక ప్రోద్బలం ఉంది. 1869 నుండి 1872 జనవరి దాకా భారతదేశానికి గవర్నర్ జనరల్‌గానూ, వైస్రాయిగానూ ఉన్న లార్డ్ మేయో ''బెంగలీ వారి ఆచారాలను తెలిపే గ్రంథం రచించే వారికి బహుమానం ఇస్తాన'' ని 1871లో కలకత్తాలో ఒక ప్రకటన చేశాడు. బెంగాలులోని రచయితలు దీనికి ఎలా స్పందించారో గాని కర్నూలులో పెద్ద ప్రభుత్వోద్యోగిగా ఉంటున్న నరహరి గోపాలకృష్ణమసెట్టిగారు మాత్రం ''తెలుగు దేశము వారి ఆచారములు తెలుపునట్టి ప్రబంధమొకటి రచిస్తే తెలుగు చదివేవారికి ఉపయుక్తంగా ఉంటుంద''ని భావించి, తన నేర్పుకొలది 1872లో ''శ్రీ రంగరాజు చరిత్ర'' అనే నవల రచించారు.

అప్పటికి ఇంగ్లీషులోని ''నోవల్''అనే రచనా ప్రక్రియకు సరైన తెలుగు మాట దొరకక గోపాలకృష్ణమసెట్టిగారు 'శ్రీ రంగరాజు చరిత్ర'ను 'నవీన ప్రబంధం'

విభిన్న మార్గాలుంటాయన్న అవగాహనను స్పష్టంగా ఏర్పరచుకొన్నారు. సమాజంలోని వర్గాల మధ్య సంఘర్షణను అవగతం చేసుకొన్నారు. సామ్యవాద సాహిత్యాన్ని అధ్యయనం చేశారు. రష్యన్ విప్లవాన్ని బోధపరుచుకొన్నారు. పరదేశాల్లోని శ్రామిక రాజకీయాలను అవగతం చేసుకున్నారు. స్వదేశానికి వచ్చాక తమ జిల్లాలోని ఒక గ్రామాన్నీ, దానికి చెందిన మాలపల్లినీ క్షేత్ర పరిశోధనా కేంద్రంగా మనసులో నిలుపుకొని సాహుకార్లకూ, పంచమ వ్యవసాయ కూలీలకూ గల ఉత్పత్తి సంబంధాలను అధ్యయనం చేశారు. వివిధ వర్గాలకు ప్రాతినిధ్యం వహించే వ్యక్తులను జాగ్రత్తగా గమనించి, వారి మనస్తత్వాలనూ, ప్రవర్తనలనూ విశ్లేషించి గుర్తుపెట్టుకొన్నారు. 1921లో ఆయనను పర్రప్రభుత్వం అరెస్టు చేసింది. జైలులో ఉన్నప్పుడు మానసికంగా ముందే ప్లాను వేసుకొన్న నవలను వాడుక భాషలో రచించసాగారు. దానిపేరు 'మాలపల్లి'. దీని ప్రథమ భాగం ఇరవై అధ్యాయాలూ 1922లో పుస్తక రూపంలో వెలువడింది.

ఉన్నవ వారి నవల వెలుగు చూసిన వెంటనే ఇందులో బోల్షివిజాన్ని ప్రచారం చేసే ప్రబలమైన భావాలున్నాయని ప్రభుత్వం భావించి వెంటనే నిషేధించింది. పచ్చి కమ్యూనిజాన్ని ప్రబోధించే భాగాలను, పెట్టుబడిదారులకు వ్యతిరేకంగా కూలీల సంఘీభావాన్నీ శక్తులనూ ప్రోత్సహించే భాగాలను ఈ నవల నుండి తొలగించాలని 1923లో ప్రభుత్వం ఆదేశించినప్పుడు 'కమ్యూనిజాన్ని ప్రచారం చేయడం తప్పేమీ కాదనీ పెట్టుబడికి వ్యతిరేకంగా శ్రామికుల ఐక్యతను ప్రోత్సహించడం దోషం కాదనీ ఉన్నవవారు ధైర్యంగా ప్రభుత్వానికి రాసిన లేఖలో చెప్పారు. ప్రజా ప్రతినిధులూ, పత్రికలు ప్రభుత్వ చర్యను ఖండించారు. ఇది అత్యుత్తమ నవల అని ప్రశంసిస్తూ, 'కన్యాశుల్కం' తర్వాత 'మాలపల్లి' అన్ని విధాల ఎన్నిక చేయదగ్గ రచన అంటూ సి. ఆర్. రెడ్డిగారు ప్రభుత్వ న్యాయశాఖ సభ్యునికి ఉత్తరం రాశారు.

మొట్ట మొదటి తెలుగు నవల 'శ్రీ రంగరాజు చరిత్ర' [1872] వెలువడిన యాభై సంవత్సరాలకు ఉన్నవ వారి 'మాలపల్లి' [1922] వస్తే దీని తర్వాత ఇంకో యాభై ఏళ్ళకి 1972లో డాక్టర్ వాసిరెడ్డి సీతాదేవిగారి 'మట్టిమనిషి' ఆంధ్ర నవలా సాహిత్యంలో అడుగు పెట్టింది. సమాజంలోని ఉత్పత్తి పద్ధతులనూ, వర్గ సంబంధాలనూ, వివిధ మానసిక ప్రవృత్తులనూ, వాటికి గల ఆర్థిక కారణాలను విశ్లేషణ చేస్తూ మూడుతరాల జీవితాలలో వివిధ పరిణామాలను నవలలో రచయిత్రి చాలా సామర్థ్యంతో చిత్రించారు. గురజాడ అప్పారావుగారి వారసత్వాన్ని కవిత్వంలో అభ్యుదయ కవులు స్వంతం చేసుకొంటే ఉన్నవ వారి ఉన్నతాశయాలకూ, ఉత్తమ ప్రమాణాలకూ డాక్టర్ వాసిరెడ్డి సీతాదేవిగారు తమ వారసత్వపు వాటాను చాటుకొంటూ, సామాజిక వాస్తవికతను చిత్రిస్తూ, భూస్వామ్య వ్యవస్థలోని వివిధ పరిణామాలకు ఈ నవలలో నిలువుటద్దం పట్టారు.

'మట్టిమనిషి' నవలలోని కథానాయకుడు సాంబయ్య. ఆది నుంచి అంతం దాకా మట్టిమనిషే. మట్టిలో పుట్టాడు, మట్టిలో పెరిగాడు. అతనికి ప్రకృతే

చదువు నేర్పింది. ఈ నేల అతని పలక. నాగలే అతని బలపం. పొలమే అతని బడి. రోజుకొక్క మాట ఈ భూమి నేర్పితే దానిని భూమ్మీదనే దిద్దాడు. తల్లీ, దైవం, గురువూ అతనికి ఈ భూమే. అతని తండ్రి వెంకయ్య కట్టుబట్టలతో పొట్ట చేత్తో పట్టుకొని ఆ గ్రామానికి బ్రతుకు తెరువు కోసం వచ్చాడు. మోతుబరి రైతు వీరభద్రయ్య అతనిని పాలేరుగా పెట్టుకొన్నాడు. కొన్నేళ్ళ తర్వాత పాలేరు పని మానేసి రెండెకరాల పొలం మగతాకి తీసుకున్నాడు. పెళ్ళాంతో పాటు అహర్నిశలు పొలం పని చేసేవాడు. క్రమేణా పన్నెండు ఎకరాలు కౌలుకు తీసుకొన్నాడు. ప్రతి యేడూ పుట్టీ, పుట్టిన్నర ధాన్యం వెనకేసి పదిపన్నెండు సంవత్సరాలలో రెండెకరాల పొలం కొన్నాడు. కొడుకు సాంబయ్య చేతికి అందివచ్చాడు. వెంకయ్యా, అతని భార్యా, కొడుకూ ఎండనకా, వాననకా కష్టించి, ఆ శ్రమను పంట రూపంలో ఇంటికి తెచ్చుకొనేవారు. తల్లీ తండ్రీ పోతూ సాంబయ్యకు అయిదెకరాల పొలం, ఇల్లూ ఇచ్చారు.

భూమినే నమ్ముకొన్న సాంబయ్య ఆ భూమిమీద వచ్చినది పొదుపుచేసి తనకు కొడుకు పుట్టేనాటికి ఏడెకరాల మాగాణీ, మూడెకరాల మెట్ట, ఇళ్ళ స్థలం, దొడ్లు-దోవలు సంపాదించి ఊళ్ళో ఉన్న చిన్నకారు రైతుల్లో ఒకడుగా నిలబడ్డాడు. ఆ కొడుకుకు పెళ్ళీడు వచ్చేనాటికి ఎనభై ఎకరాల సుక్షేత్రమైన మాగాణీ, దొడ్లు దోవలు, కొత్తగా కట్టిన డాబా ఇల్లు, పాతిక వేల కవిలె సంపాదించాడు సాంబయ్య. పాటుబడి పనిచేసే అతడు ప్రజాకవి వేమనగారు చెప్పిన ఒక పద్యాన్ని నిజం చేశాడు.

భూమిలోన పుట్టు భూసారమెల్లను
తనువులోన పుట్టు తత్త్వమెల్ల
శ్రమములోన పుట్టు సర్వంబు ధనమౌను
విశ్వదాభిరామ వినుర వేమ

శ్రమటోడ్చి శ్రమిస్తేనే ధనం ఉత్పత్తి అవుతుంది. గురజాడ అప్పారావుగారు కూడా దేశమనే దొడ్డ వృక్ష మూలం నరుల చెమటలతో తడిస్తేనే ధనం పంటలు పండుతాయని చెప్పారు. 'మట్టిమనిషి'లో సాంబయ్యకి ఈ మహాకవుల ప్రబోధాలు స్వానుభవంవల్ల తెలిసివచ్చాయి. ''చెమటంటే మట్టికిష్టం. అందుకే అదున్న చోట మట్టి వుంటుంది... ఈ నేలా, ఈ గాలీ, ఈ ఆకాశం చెమటోడ్చే వాడి సొత్తు. అందల మెక్కేవాడిది కాదు'' - ఇదీ సాంబయ్య తాత్త్విక చింతన, జీవన దర్శనం.

ఆస్తీ అంతస్తు పెరిగాక తన తండ్రి ఏ ఇంట్లో పాలేరుగా పని చేశాడో ఆ ఇంటి వారితోనే వియ్యమొందాలన్న పరువైన కోరిక సాంబయ్యలో పాతుకుంది. ఆగర్భ భూస్వామి బలరామయ్య తండ్రి పోయేనాటికి రెండువందల ఎకరాల మొనగాడి భూమికి అధిపతి. ఆస్తితోపాటు ఆస్తిపరులకంటె అహంకారాన్నీ, అభిజాత్యాన్నీ వారసత్వాలుగా పొందాడు. ఉన్నవానికంటె హెచ్చులు పోవటం, తనకు మించిన పనులు చెయ్యటం అతనికి స్వతహాగా వచ్చిన గుణాలు. అతనికి

నలుగురు కొడుకులు, ముగ్గురు కూతుళ్ళు ఉన్నారు. నలుగురు కొడుకులనూ బస్తీకి పంపించి, వారి చదువుల నిమిత్తం వేలకు వేలు ఖర్చు పెట్టాడు. కానీ అందరికీ చదువబ్బలేదు. ఇద్దరు కూతుళ్ళకు పెళ్ళిళ్ళు చేసి కాపురాలకు పంపించాడు. నలుగురు కొడుకులూ నాలుగు దార్లయ్యారు. నలభైవేల అప్పంది. నలుగురు కొడుకులూ పంచుకొంటే తలా పాతికెకరాలు రావు. కొడుకులకు పంచగా తన వాటాకు పద్దెనిమిది ఎకరాల మాగాణీ, మేడా వచ్చాయి. మూడో అమ్మాయి పెళ్ళి చేయాలి. నలభైవేల అప్పు పెరిగి వడ్డీతో, అరవైవేలయింది. పైకి పరువుగా ఉన్నా ఉత్త మేడిపండు. గత్యంతరం లేక ఆ అమ్మాయిని సాంబయ్య కొడుకు కిచ్చి పెళ్ళి చేయక తప్పలేదు. ఇస్తానన్న కట్నం ఇవ్వలేకపోయాడు. పెళ్ళయినా కూతురు పుట్టింటే మూడేళ్ళు ఉండిపోయింది. చివరకు ఈ పెళ్ళి కుదిర్చిన మధ్యవర్తి సలహాని పాటించి సాంబయ్య కోడల్ని కాపురానికి రానిచ్చాడు. బతికి చెడి చితికి పోయిన పాత భూస్వామ్యం చివరకు చిట్లిపోయింది.

సమధర్మసంస్థాపన జరిగేదాకా భూస్వామ్య వ్యవస్థ సమాజం నుండి అస్తమించదు. నేలను నమ్ముకొని రెక్కలు ముక్కలు చేసుకొని సాంబయ్యలాంటి వాళ్ళు షావుకార్లయితే ఏనాడూ నేలను దున్నక రైతులకూ పెట్టుబడిదారులకూ మధ్య దళారీలుగా ప్రవర్తించి, అమ్మేవాళ్ళకూ, కొనేవాళ్ళకు మధ్య ఏజెంట్లుగా వ్యవహరించి ఊరివాళ్ళ దయాధర్మాలమీద కుటుంబాన్ని పోషించుకొని చిన్న చిన్న పెట్టుబడులతో వ్యాపారం ప్రారంభించి, ఆ లాభాలతో క్రమేణా బడా భూస్వాములయ్యే వ్యక్తులు కూడా ఉంటారు. అటువంటివాడే ఈ నవలలోని కనకయ్య పాత్ర. ఇరవై ఏళ్ళనాడు అంగవస్త్రంలో కాగితాలు చుట్టుకొని తిరిగినవాడు పదేళ్ళ క్రితం గోనెపట్టా సంచితో తిరిగి, తర్వాత తోలు సంచిలో డాక్యుమెంట్లు పెట్టుకొనే స్థితికి వచ్చాడు. ఒకనాడు పలచగా, బక్కగా, తిండిలేక ఆవురావురుమంటూ తిరిగిన కనకయ్య ఆకారంలోనూ, అంతస్తులోనూ మార్పు వచ్చింది. కాలువగట్టు కింద పదెకరాల పొలం కొన్నాడు. ఇల్లు ఊడదీసి మరో నాలుగువేలు పెట్టి పెంచి కట్టాడు. తాను తొలి రోజుల్లో ఏ రైసు మిల్లు ఓనరు కోసం రైతుల దగ్గర్నుంచి ధాన్యం తోలిపించేవాడో ఆ మిల్లులోనే పావలా వాటా సంపాదించాడు. చిన్నకారు కొని అద్దెలకు తిప్పాడు. విరాళాలతో ఆడపిల్లలకు పెళ్ళిళ్లు చేసి అత్తవారిళ్ళకు పంపించాడు. చందాలమీద కొడుకుని అల్లుణ్ణి చదివించి లాయర్లను చేశాడు. బస్తీలో పెద్ద పెద్ద మోసాలలో పక్కపాత్రలు ధరించి లెక్కలేనంత ఆర్జించాడు. భూములు సంపాదించడమేకాక ఒకనాటి ఆగర్భ భూస్వామి బలరామయ్య మేడను కొని, ఊరికల్లా బడాబడా షావుకారయ్యాడు. సమితి ప్రెసిడెంటయ్యాడు. పాత భూస్వాములు పోయినా వారి స్థానంలో కొత్త భూస్వాములు వస్తారుగానీ ఆ వ్యవస్థ సమూలంగా మారదు.

సాంబయ్య కొడుకూ కోడలూ ఆమె ప్రసవం మిషమీద పల్లెటూరు వీడి బస్తీకి వెళ్ళిపోయారు. అక్కడే కాపురం పెట్టారు. ముప్పయి సంవత్సరాల

వయసు దాకా ''మట్టిమనిషి''గానే పొలంమీద బతికిన సాంబయ్య కొడుకు భార్య మోజులకోసం పల్లెలో తండ్రి ఆర్జించిన సొమ్ము బస్తీకి తరలించసాగాడు. చీమలు పుట్టలు పెట్టినట్టు సాంబయ్య సంపాదించిన భూముల్ని తక్కువ ధరలకు బలాత్కారంగా అమ్మించేశాడు. నమ్మరాని వ్యక్తులను నమ్మి, చేతకాని వ్యాపారాలు చేసి చేతులు కాల్చుకున్న ఆ దంపతులు బస్తీలోని మోసాల, దగాల, అక్రమాలకు అక్కరవచ్చే పోలీసు యంత్రాంగం, అమానుషాలకు వెనుకాడని గూండాల తండాలు మొదలైన సాలెగూట్లో చిక్కుకున్నారు. వ్యామోహాలకు బానిసలై, వ్యసనాలకు వశవర్తులై జీవితాలను కాల్చుకున్నారు. సాంబయ్య కోడలు ఆత్మహత్య చేసుకొంది. కొడుకు అప్రయోజకుడై ఆ మార్గానే అనుసరించదలచాడు. చక్కగా చదువుకొంటున్న మనవడు దిక్కులేనివాడయ్యాడు. ఇవి భూస్వామ్య వ్యవస్థలో ఉంటూ భూమిని నమ్ముకోక అమ్ముకొనే జీవితాలలోని దుష్ఫలితాలు.

కష్టార్జితం భ్రష్టమైపోయినా సాంబయ్య ఓటమిని అంగీకరించడు. స్వగ్రామంలో దిబ్బమీద ఒంటరిగా బతుకుతూ కూరగాయలు పండిస్తూ బతుకు వెళ్ళబుచ్చుతున్నాడు. తల్లిదండ్రులకు దూరమైన సాంబయ్య చిన్నారి మనవడు తాత దగ్గరకు చేరి తానూ ఒక మట్టిమనిషిగా మారాడు. ఒకనాడు తన మోచేతులకింద నీళ్ళు తాగిన కనకయ్య తనకు ఒక నాలుగు ఎకరాలు కౌలుకు ఇవ్వ నిరాకరిస్తే నిరాశ చెందకుండా సాంబయ్య మనవడితోపాటు బంజరు దున్ని బంగారు పండించసాగాడు.

అయితే, ఈ వ్యవస్థలో భూమి దున్నేవాడిది కాదు. పట్టా ఉన్నవాడికే గాని పాటుబడిన వాడికి ఫలసాయం దక్కదు. సాంబయ్య, మనవడు ఓదెలు కట్టి కుప్పవేస్తుంటే ప్రెసిడెంటు కనకయ్య పట్టాదారుణ్ణీ, పోలీసు బలగాన్నీ వెంటపెట్టుకొని వచ్చి భూమిని దున్నేవాడికి కాకుండా హక్కుదారుడికి అప్పగించాడు. వరికుప్ప మీద ఉన్న సాంబయ్య తూలి కిందపడ్డాడు. మట్టిలో పుట్టినవాడు, మట్టిలో పెరిగినవాడు, మట్టిలోనే కలవడానికి ప్రాణాలు విడిచాడు. కొత్త మట్టిమనిషిగా తయారవుతున్న మనవడు ఒకప్పుడు ఇంగ్లీషు చదువుకొన్నాడు. కనుక ''దిస్ లాండ్ ఈస్ మైన్''అంటూ తన హక్కు చాటుకుంటూ ఉద్రేకంతో కర్ర విసిరి పట్టాదారున్ని గాయపరిచాడు.

పోలీసులు ఆ కుర్రాణ్ణి అరెస్టు చేశారు. తీసుకుపోతూ ఉంటే దిబ్బమీద తన తాతకు సమాధి కట్టమని ఆ కుర్రాడు కోరాడు. ''మా పొలాల మధ్య, ఇళ్ళ మధ్య సమాధులు కట్టడానికి.....ఇది ఊరా వల్లకాడా?'' అని ప్రెసిడెంటు కనకయ్య ఎద్దేవా చేశాడు. కుర్రాడు ఆగ్రహం పట్టలేక ''నీ ఊరు వల్లకాడు చేస్తాను, నీ యిల్లు తగల బెడ్తాను. వస్తాను, తిరిగివస్తా, తెస్తా నీకోసం తుపాకీ''అని శపథం చేశాడు.

''ఈ భూమి నీదేరా, ఈ పంట నీదేరా''అని సాంబయ్య సందేశం నింగీ నేలా నిండిపోయి ప్రతిధ్వనించింది. సాంబయ్య నినాదమే కాదు – సామ్యవాద

సూక్తం కూడా ఎలుగెత్తి దున్నేవాళ్ళ ప్రతి ఒక్కరి అణువణువునా ప్రతిధ్వనిస్తోంది. సౌమ్యంగా భూస్వామ్య వ్యవస్థకు అంతిమ పరిష్కారం జరగకపోతే ప్రతి కొత్త మట్టిమనిషీ తుపాకీ పట్టక తప్పదు. అగ్రవర్గాల దౌర్జన్యాలే ఉగ్రవాదానికి ఊపిరిపోస్తాయి.

"కొత్తా పాతా యావత్తూ ఒక మూస నుండి కరిగి సమ్మిళితమై ఒక నూతన శక్తిగా విజృంభించి జగన్నాథుని రథంవలె పరిభ్రమిస్తున్నది. ఇది నిజంగా జగన్నాథుని రథమే. ఈ త్వరను, ఈ మహాశక్తిని యెదిరించడానికి ఎవరికి సాధ్యమౌతుంది?" అని 1922లో ఉన్నవవారు చెప్పిన మాటనే 1972లో డాక్టర్ వాసిరెడ్డి సీతాదేవిగారు సూచనప్రాయంగా తమ నవలలో స్పష్టపరిచారు. "మట్టిమనిషి" ఉత్తమ సమాజ నిర్మాణానికి గట్టి పునాదిని నిర్దేశిస్తున్నది.

త్యాగరాయ నగరు
26, అక్టోబరు 1992.

ఆరుద్ర

ఒరేయ్ రవీ, వినరామరి! ఈనేల నా పలక, నాగలే నా బలపం, పొలమే నా బడి, భూమ్మీద దిద్దాను. రోజుకు ఒక్కొక్కమాట ఈ భూమే నాకు నేర్పింది. నా తల్లి, దైవం, గురువూ ఈ భూమేరా రవీ! ఇప్పుడు చెప్పరా మనవడా! నీ బడి గొప్పదో, నా బడి గొప్పదో! నీ చదువెక్కువో, నా చదువెక్కువో..." అంటాడు సాంబయ్య. అతడు డబ్బయ్యేళ్ళ వృద్ధుడు. తరతరాల వ్యవసాయ జీవనానికి ప్రతినిధి.

మట్టిమనిషి మూడు తరాల కథ. మూడు తరాల్లోనూ వరుసగా సాంబయ్య, వరూధిని, రవి అనే పాత్రలపైన నడుస్తుంది. కండలు కరిగించి, ఎముకలు విరిచి, చెమటలూర్చి మట్టికొొక వైభవాన్ని సంతరించిన వారు సాంబయ్య . విశృంఖల ప్రవర్తనతో, వికారపు ప్రలోభాలతో ఆ మట్టి వైభవాన్ని కాలరాచి, జీవితంలో భంగపడిన హతభాగ్యురాలు వరూధిని, తనను తాను వెంకటపతి కుమారుడిగాగానీ, వరూధిని కొడుకుగా గానీ క్లెయిమ్ చేసుకోలేని స్థితిలో సగర్వంగా సాంబయ్య మనవడినని చెప్పుకోగలిగిన పదేళ్ళ పసివాడు రవి. గ్రాఫులో చిత్రించి చూపాలంటే 45 డిగ్రీలకోణంతో సూటిగా పైకి దూసుకెళ్ళే గీత సాంబయ్య, అక్కడి నుంచి వాలుగా భూపతనమయ్యే గీత వరూధిని. చివర ప్రశ్నార్థకపు గుర్తు కవి.

రైతుకు భూమితోగల అనుబంధాన్ని వివిధ దృక్కోణాల నుంచి సర్వతోముఖంగా చిత్రించిన నవల మట్టిమనిషి. పొట్ట చేతబట్టుకుని, ఉత్తరాది నుంచి వలసవచ్చి, వీరభద్రయ్య గారింట్లో పాలేరుగా చేరి పొలం కౌలుకు చేస్తూ, మిగుల్చుకున్న డబ్బుతో చిన్నరైతుగా పరిణమించిన వెంకయ్య కుమారుడు సాంబయ్య. పగటిపూట భార్యతోనే మాట్లాడి ఎరుగడంటే, ఇక ఇరుగు పొరుగువాళ్ళతో ఏమాత్రం సంబంధం కలిగి ఉంటాడు? అతడికున్న ధ్యాసల్లా ఒక్కటే. తన పొలం ప్రక్కపొలం ఎవరిదీ, వాళ్లేమైనా అమ్మే ఆలోచనలో ఉన్నారా అని. ఈ భూమిదాహం ఎంతటిదంటే సాంబయ్య పొలం పనుల్లోపడి భార్య ఆరోగ్యాన్ని కూడా పట్టించుకోడు. రిజిస్ట్రేషను తర్వాత పొలం స్వాధీనమైన రాత్రి రెండుజాములదాకా, కొన్న పొలం గట్టు తెగ్గొట్టి పాత పొలంలో కలుపుకుని అప్పుడా నేల విస్తీర్ణం గమనిస్తూ ఉప్పొంగిపోతాడు, చేతపైసా లేకపోయినా ఎట్లాగో మల్లగుల్లాలుపడి, ఏనాటికో కాలవ వచ్చి సాగుకు తయారు అవుతుందన్న దూరాలోచనతో పెనుబీడు ఒకటి కొనేస్తాడు. కొంత భూమిని ఆడమనిషిపైన రాసిపెట్టవలసి వస్తుందని రెండో పెళ్ళి మానేస్తాడు. అనుకున్నంత పొలం చేతికి రానందుకని కుమారుడికి కూడా సకాలంలో పెళ్ళిచేయక ముదిరిపోనిస్తాడు. ఎట్లాగైతేనేం, తన కుమారుడికి పెద్ద భూస్వామి కొడుకన్న పట్టం కట్టబెడతాడు. ఒకప్పుడు తన తండ్రి పాలేరుగా ఉన్న కుటుంబంలోని అమ్మాయితోనే కుమారుడికి పెళ్ళి జరిపించి, విజయకేతనం ఎగరవేస్తాడు.

సాంబయ్య హయాంలో కథకు రంగస్థలం పల్లెటూరే. కాని కోడలు వరూధిని

సాంబయ్య హయాంలో కథకు రంగస్థలం పల్లెటూరే. కాని కోడలు వరూధిని కాపురానికి రావడంతో కథకు పాడుగాటి కాళ్ళొచ్చేస్తాయి. అప్పటినుంచి కథారంగం నగరమైపోతుంది. కర్ణుడి చావుకు పెక్కు కారణాలున్నట్టుగా వేంకటపతి అమాయకత్వం, కనకయ్య లౌక్యం, రామనాథబాబు కాముకత్వం, మోహనరావు అవకాశవాదం, శంకరరావు కుటిలత్వం, గుర్నాథం నీచత్వం – ఇలా ఎన్నో కారణాలు పచ్చని కాపురాన్ని కుక్కలు చింపిన విస్తరిగా మార్చేస్తాయి.

చిట్టచివర మళ్ళీ కథ పల్లెటూరికి చేరుకునేటప్పటికి సాంబయ్య చేతుల్లో సత్తువలేదు. మనిషి వింటి దబ్బలా వంగిపోయాడు. కంకాళ మాత్రుడు . అయినా పొలంపట్ల, జీవితంపట్ల మక్కువ చావలేదు. మనవణ్ణి చూడగానే ఆ ముసలివగ్గులో జీవనోత్సాహం విజృంభిస్తుంది. అరువు చేసిన సాగుబడి పొలం కోతకు గుర్రై కొట్టుకపోకుండా మురికికాలువ కుఅడ్డంగా పడుకున్నాడంటే ఏమనుకోవాలి?

మహాభారతంలో భీష్మనిర్యాణం ఎలాంటిదో, 'మట్టిభారతం'లో సాంబయ్య నిర్యాణం కూడా అలాంటిదే!

తెలుగులో గొప్ప నవలలు రాలేదా? అన్న ప్రశ్నకు ఒక దృష్టాంతపూర్వకమైన నడుత్తరం – 'మట్టిమనిషి' నవల 'ఇల్లు చూసి ఇల్లాలిని చూడు, గట్టు చూసి రైతును చూడు' అని గదా సామెత, మట్టిమనిషి నవలకు, రచయిత్రి సీతాదేవిగారికి గల లంకె కూడా అలాంటిదే!

– మధురాంతకం రాజారాం

• ఆంధ్రప్రభ అధ్యయనం, జూన్ 30, 1972. •

# మట్టి మనిషి

చుక్కలు వెలవెలబోతున్నాయి. తొలివెలుగులు మంచుతెరల్ని తోసుకుంటూ వస్తున్నాయి.

"ఏసోబూ! ఎల్లమందా! ఇంకా దిక్కులు చూస్తారేంరా? వూ! కానియ్యండి."

"అయ్యగారిదే ఆలస్యం."

కూలీలంతా తలగుడ్డలు బిగించి కుప్పచుట్టూ కమ్మారు. సాంబయ్య పైపంచ నడుంచుట్టూ కట్టుకుని వరికుప్పచుట్టూ మూడుసార్లు ప్రదక్షిణంచేసి కుప్పమీదకు ఎగబాకి నడికొప్పు పగలదీశాడు.

కూలీలంతా తలా వో మోపు అందుకున్నారు.

సాంబయ్య వరిమోపు వాటేసుకుని కుప్పమీదనుంచి దూకాడు.

"తొలిపన అయ్యగారు నూరిస్తే ఈ ఏడు బంగారం రాల్తుంది."అన్నాడు ఎల్లమంద.

"అయ్యగారికి ఆనవాయితే గందా!"అన్నాడు ఏసోబు.

సాంబయ్య పన పైకెత్తి గాలిలోకి విసిరాడు.

అరుణకాంతుల్లో నక్షత్రాల్లా వరికంకులు మెరిశాయి. ముందున్న బల్లమీద మూడుసార్లు బాది పనవిప్పి కళ్ళంమీదకు విసిరాడు.

ఏసోబూ, ఎల్లమందా చెరో పనా నూర్చి కళ్ళంమీదకు విసిరారు.

నూర్పిడి బల్లమీద మెరిసిపోతున్న తడిపాడి ధాన్యాన్ని రెండు చేతుల్తో పోగుచేశాడు. సాంబయ్య తన జీవిత సర్వస్వమూ, తన ఐశ్వర్యమూ అయిన ధాన్యాన్ని ఆప్యాయంగా చూసుకొని ఎల్లమందకేసి తిరిగి "ఏరా! ఎట్టా వుంది రాలుబడి?" ఆశగా అడిగాడు.

"తమరు పట్టింది బంగారం. పది పుట్లకేం తక్కువ రాలదు." పరిశీలనగా రాలిన ధాన్యపు కుప్పకేసి చూసి అంచనా చెప్పాడు ఎల్లమంద.

సాంబయ్య గుండెలు పొంగినై. కండలు ఉబ్బినై, బరబరా మోపులు లాగుతూ బల్లమీద బాదసాగాడు. మిగతా కూలీలంతా సాంబయ్య వూపును అందుకోవడానికి ప్రయత్నించసాగారు.

బారెడు పొద్దెక్కింది.

ఎద్దులు వడుపుగా కళ్ళం తిరుగుతున్నాయి.

కళ్ళంచుట్టూ గడ్డి కడియం నడుం ఎత్తుకు లేచింది. కుప్ప సగం నూర్పిడి అయింది.

కూలీలు అన్నం మూటలు విప్పుకొని కుంట ఒడ్డున కూర్చున్నారు.

సాంబయ్య గడ్డిగూటిలో కూర్చొని అన్నంమూట విప్పాడు. కొరివికారప్పచ్చడి కలిపి చేతివాటు ముద్దచేసి ఎత్తాడు.

''దొరగారూ! దొరగారూ!''రామి ఆదుర్దాగా సాంబయ్య గూటి ముందుకు పరుకెత్తుకొచ్చింది.

సాంబయ్య నోటిదాకా వచ్చిన ముద్దను గిన్నెలోకి వదిలేసి రామికేసి చిరాగ్గా చూశాడు.

''నీ సిగతరగ! ఏందే ఆ పాలికేకలూ?''

''అయ్యగారూ, అమ్మగారికి నొప్పులొచ్చినయ్!''

సాంబయ్య చివాల్న గూటిలోనుంచి బయటకొచ్చాడు. ఎంగిలి చెయ్యి భుజానవున్న పంచకు తుడుచుకున్నాడు. రామి ముఖంలోకి చూస్తూ అడిగాడు:

''పిల్లా, పిల్లాడా?''

''ఇంకా పెసవం అవలేదు. నొప్పులు మోపుగా వున్నాయి! అమ్మగారు అల్లాడిపోతున్నారు. తొందరగా బయలుదేరండయ్యగారూ!''రామి గొంతులో భయం తొణికింది.

''వోసి నీయమ్మ! మగాణ్ణి నేనొచ్చేం జేస్తానే? చాకలి రత్తికి కబురు పెట్టారా?''

''మా పుల్లి రత్తి కోసం లగెత్తింది. నేనేమో ఇట్టా లగెత్తుకొచ్చాను.''

సాంబయ్య రాలిన ధాన్యం, ఇంకా కొట్టవలసిన కుప్పకేసి పరకాయించి చూశాడు.

''సరే, నువ్వు పద! ఎల్తా ఎల్తా చాకలి రత్తి మనింటికి ఇంకా వెళ్ళిందో లేదో చూడు. ఆ ముండేడ చచ్చిందో? ఇంటికాడ లేకపోతే రేవుకాడ వుందేమో చూడు.''సాంబయ్య రామిని తొందరచేశాడు.

ఇంకా ఏమో చెప్పాలనుకున్న రామి, సాంబయ్య ముఖం చూసి గుటక మింగి, వెనక్కు తిరిగి పరుగెత్తింది.

సాంబయ్య కుంటదగ్గర తాపీగా అన్నం తింటున్న కూలీలను కేకవేశాడు.

''ఎంతసేపు గూటుతార్రా–ఆ గంజీ? తొరగ ఎక్కండి కుప్పమీదకు!''

సాంబయ్య కేకలకు కూలీలు తత్తరపోయారు. కుంటలో గిన్నెలు ఆదరాబాదరాగా కడిగి కళ్ళందగ్గరకు పరుగెత్తుకొచ్చారు.

సాంబయ్య అన్నం గిన్నెమీద పడ్డ చెత్తపరకలను తీసే తీరిక లేక అంతా కలిపి నాలుగు ముద్దల్లో తిని గూటిలోనుంచి బయటకొచ్చాడు. కూలీలు చుట్ట ముక్కన్నా కాల్చకుండా పనిలోకి రావడంచేత మందగొండిగా పనిచేస్తున్నారు.

సాంబయ్య తలగుడ్డ గట్టిగా బిగించి ''వొరేయ్ ఎల్లమందా! ఏసోబూ! ఏందిరా ఆ కొట్టుడు? సచ్చు చేతుల్నాయాళ్ళలారా! పొద్దు నెత్తిమీద కొచ్చేసరికి నూర్పిడి అవాలి!''అంటూ కళ్ళంమీద కొచ్చాడు.

సాంబయ్య ఒడుపుకూ, ధాటికీ కూలీలు సతమతమైపోయారు. నూర్పిడి

వడిగా సాగింది. బంగారు తీగలు జడివానలా కురిశాయి.

పొద్దు నెత్తిమీదకు వచ్చేసరికి కుప్పకొట్టడం అంతా అయిపోయింది. సాంబయ్య గబగబా ధాన్యం రాసిపోయించాడు. చుట్టూ గీతలు గీసి ఆనవాళ్ళు పెట్టుకున్నాడు.

''ఎల్లమందా! ఇటా!''అని అరిచాడు.

ఎల్లమంద చేతులు కట్టుకొని ఎదురుగా నిలబడ్డాడు.

''ఒరేయ్! నేపోతున్నా! పొద్దుకూకేలోపల మళ్ళీ వస్తా. ఈలోపల గడ్డంతా తొక్కించి కింద గింజలన్ని వేరే రాసి పోయించు.''

''అట్టాగే దొరా!''

''అట్టాగే అంటే కాదురోయ్. గడ్డి బాగా దులపాలి కడెంలోకి గింజపోయిందో పంబరేగిందే! తెలుసా?''

''అదేంటయ్యగోరూ! తవరు సెప్పాలా! నాకు తెల్దా?''

సాంబయ్య ఎల్లమందను దగ్గరగా పిల్చి మెల్లగా చెప్పాడు:

''ఆ కుంటిగాడ్ని, దమ్మిడీగాడ్ని వో కన్నేసి వుంచు. ఎందుకయినా మంచిది!''

అంత నమ్మకం తనమీద వుంచినందుకు ఉబ్బితబ్బిబ్బై ''అట్నే దొరా!''అన్నాడు ఎల్లమంద.

సాంబయ్య చేలో పనిచేస్తున్న వాళ్ళందర్నీ పరకాయించి చూసి ''మన చేనుదాటి పిట్ట బయటకు పోకూడదు! తెలిసిందా? తూర్పార వేళకు నే నొస్తా. గింజ పోకూడదు. తెలిసిందా!''అంటూ హెచ్చరించేడు.

తలకు బిగించిన పైపంచ విప్పి భుజాన వేసుకొని గూటి పక్కన వున్న ముల్లుగర్ర అందుకొని సాంబయ్య ధాన్యంరాసి, కల్లాంపైకిలేస్తున్న గడ్డి కడియం, మరోసారి పరికించి పనిచేస్తున్న కూలీలను తేరిపారచూసి బయలుదేరాడు.

సాంబయ్య పాదాల ధాటికి మాగాటి గనెం జవజవలాడిపోతుంది. ఆజానుబాహువులు గరుత్మంతుని రెక్కల్లా పంటగాలిని చీలుస్తున్నాయి. అతని చేతిలోని ముల్లుగర్ర ఆదిశివుని శూలంలా ఆకాశంకేసి చూస్తోంది. ఆరడుగుల నిండైన విగ్రహం. కోడెతాచులాంటి వయస్సులో వున్న అతని నరాలు - కాయ కష్టంలో కండలు తిరిగిన కండరాలను ధనుస్సును లాగిపట్టిన నారిలా బిగించి పట్టివున్నాయి. మెలితిరిగిన అతని మీసాలు గవదలు దాటి గాలిలో ఆడుతున్నాయి. ఒత్తుగా మెడల మీదకు జారిన అతని జుట్టూ, నాగలిదుంపలా మొనతేలిన ముక్కూ, తీక్షణమైన చూపులూ, ఆ నడక తీరూ - అంతా భూమిని నమ్మి, భూమిమీదే బతికే మనిషిలా వున్నాడు సాంబయ్య.

తన అయిదెకరాల మాగాణి ఖండిక గనెందాటి కాలవగట్టుమీద కొచ్చాడు సాంబయ్య. కాలవగట్టు మీద ఒక క్షణం ఆగి తన మాగాణి చూసుకొన్నాడు.

ఆ భూమి - ఆ బంగారు భూమి తనది. దాన్ని తన తల్లీ తండ్రీ అహర్నిశలూ శ్రమించి ఆర్జించారు. తను చెమటోడ్చి, రాయీ రప్పాతీసి బాగుచేసుకున్నాడు. తన భూమికి - తన ఆస్తికి వారసుడు పుట్టబోతున్నాడు.

తన వంశోద్ధారకుడు ఈపాటికి భూమిమీద పడివుంటాడు.

సాంబయ్యకు ఒళ్ళు పులకరించింది. గుండెలు పొంగాయి. చకచకా అంగాపంగా వేసుకుంటూ కాలవగట్టుమీద నడుస్తున్న సాంబయ్య తన వంశ చరిత్రంతా మననం చేసుకోసాగాడు –

సాంబయ్య తండ్రి వెంకయ్య. వెంకయ్య పొట్ట చేత్తోపట్టుకొని ఆ వూరు వచ్చాడు. ఉత్తరాదినుండి వచ్చాడు కనుక ఆ వూళ్ళో అంతా అతన్ని ''ఉత్తరాది వెంకయ్య''అని పిల్చేవాళ్ళు. కట్టు బట్టలతో వచ్చిన వెంకయ్య మొదట్లో కూలిపనిచేసి బతికేవాడు. కాని త్వరలోనే ఊళ్ళోవాళ్ళ దృష్టిలో వెంకయ్య నమ్మకమైన మనిషని నిగ్గుతేలాడు. మోతుబరిరైతు వీరభద్రయ్య అతన్ని తన పాలేరుగా పెట్టుకున్నాడు. నాలుగేళ్ళు తిరిగేసరికి నాలుగొందలు వెనకేసి వెంకయ్య వేసవి కాలంలో ఉత్తరాదికి – తన దేశం వెళ్ళాడు. మళ్ళీ ఊడ్పులరోజులకు తన యిల్లాలితో తిరిగి భద్రయ్యగారింటికి వచ్చాడు. భార్యతో తిరిగివచ్చిన వెంకయ్య వీరభద్రయ్యగారింటికి వచ్చాడు. వీరభద్రయ్యగారింట్లో పాలేరుపని మానేసి చినవీరయ్యగారి పొలం రెండెకరాలు కమతానికి తీసుకొన్నాడు; వీరయ్యగారి వాముల దొడ్డికి పక్కగా వున్న బొందల్లో చిన్న పాకవేసుకొని కాపరం పెట్టాడు. భార్య మంగమ్మ ఆ ఇంటా ఈ ఇంటా మంచి సెబ్బరకువెళ్ళి వూడిగం చేసేది. పచ్చళ్ళు పెట్టి, వడ్లు దంచి, కారం కొట్టి, పప్పులు బాగుచేసి ఇల్లు గడిపేది.

వెంకయ్య పెళ్ళాంతోసహా పొలంలో అహర్నిశలూ పనిచేసి పండించేవాడు. కౌలుకు ఇచ్చిన చినవీరయ్యగారికి గింజ బీరుపోకుండా వప్పచెప్తున్న వెంకయ్య నిజాయితీమీద గ్రామంలో వాళ్ళకు గురి ఏర్పడింది. భరణం పొలం మీద బతుకుతున్న వితంతువు రెండెకరాలు కౌలుకు తీసుకున్న వెంకయ్య రెండేళ్ళు తిరిగేసరికి పన్నెండెకరాలు కౌలు వ్యవసాయం చేయసాగాడు. బండీ, ఎద్దులజతా కొన్నాడు. ప్రతియేడూ పుట్టీ పుట్టెన్నర ధాన్యం వెనకేసుకోసాగాడు.

పది సంవత్సరాలు గడిచాయి. వెంకయ్య రెండెకరాల పొలం కొన్నాడు.

స్వంత పొలం అది. తన భూమి! వెంకయ్యకు భూమ్మీద మమకారం, సంపాదనమీద ఆరాటం పెరిగాయి. పొలం కొనటానికి కొద్దిగా అప్పు చేశాడు. ఆ అప్పు తీరేదాకా వెంకయ్య, వెంకయ్య భార్య నిద్రపోలేదు.

అప్పులు తీరి స్వంత సేద్యంలో నిలదొక్కుకుంటున్నాడు వెంకయ్య. అప్పుడే సాంబయ్య పుట్టాడు. అప్పటికే మంగమ్మ పొరిగిళ్ళలో చాకిరి చెయ్యటం మానివేసింది.

వెంకయ్య అరకకట్టి బయలుదేరితే, మంగమ్మ కొడుకు నెత్తుకొని భర్తతోపాటు పొలం వెళ్ళేది.

పాతిక సంవత్సరాలు గడిచాయి. వెంకయ్య కాడిగట్టు పొలం మరో రెండెకరాలు కొన్నాడు. తను వుంటున్న ఇంటిస్థలం కూడా కొన్నాడు. ఇవన్నీ కొనటానికి మళ్ళీ కొంత అప్పు చేయాల్సి వచ్చింది. ఆ అప్పు తీరేదాకా, తను కాపరం పెట్టిన ఆ మొదటి పాకలోనే ఉండటానికి నిశ్చయించుకొన్నాడు. ఎప్పుడో తప్ప కూలీల

అవసరం లేకుండానే వెంకయ్య కుటుంబం ఎల్లపాదీ పొలంలోనే పడివుండి పనులు చేస్తుండేవాళ్ళు. భార్య, కొడుకూ వెంకయ్యతోపాటే కష్టించి, ఆ శ్రమను పంటరూపంలో ఇంటికి తెచ్చుకొనేవాళ్ళు. వెంకయ్య ఎంత పొదుపుగా వ్యవసాయం చేస్తున్నాడో మంగమ్మ కూడా అంత పొదుపుగానే సంసారాన్ని గడుపుకొస్తుంది. కొడుకు సాంబయ్య తండ్రి వారసత్వం పుణికిపుచ్చుకొన్నాడు. తండ్రి మాటకు జవదాటి ఎరుగడు.

సాంబయ్యకు పాతికేళ్ళు రాగానే పెళ్ళయింది. ఇంటి పనుల్లో ఆరితేరిన పిల్లను చూసి పెళ్ళి చేశారు. అయితే సాంబయ్యకు పిల్లను ఉత్తరాదిలోనే వెతకాల్సిన పనిలేకపోయింది. ఆ వూరుకు రెండామడ దూరంలో వున్న పాలెంలో పెళ్ళి చేశాడు తండ్రి. పదహారు రోజుల పండగయిపోగానే సాంబయ్య, పెళ్ళాం దుర్గమ్మను వెంటబెట్టుకొని ఇంటి కొచ్చాడు. దుర్గమ్మ భర్తతో పగలు ఎప్పుడూ మాట్లాడి ఎరుగదు. ఇంట్లో వడ్లు దంచడం, పాడిగేదెను చూసుకోవడం, ఇంత ఉడకేసి పెట్టడం దుర్గమ్మ పనిగా వుండేది. తల్లీ దండ్రీతోపాటు సాంబయ్య పొలంలో కష్టపడి పనిచేసేవాడు. వెంకయ్యకు వీలుచూసుకొని కోడలు కూడా పొలం వస్తే బాగుండునని వుండేది. కాని అత్త మంగమ్మ ''ఆసెళ్ళే, అది ఎండలో ఏం కాగుద్దిలే. ఇంటి పట్టున అది కూడా వుండకపోతే ఇల్లెట్టా!'' అనేది.

దుర్గమ్మ కాపరానికి వచ్చిన కొన్నాళ్ళకు వోరోజు; వారంరోజులుగా మంచు పడుతోంది. రాత్రిళ్ళు పొలాన పిల్లపెసరచేనుకు కాపలా పడుకొన్న వెంకయ్య ఏడో రోజు తెల్లవారి లేవలేదు. సాంబయ్య తండ్రికి అన్నం మూట తీసుకొని పొలానికి వచ్చాడు. చేలో గొడ్లుపడి మేస్తున్నాయ్. సాంబయ్య పరుగు పరుగున వెళ్ళి గొడ్లను అదిలించాడు. అప్పటికే కుంచం గింజలవార గొడ్లు తొక్కేసినయ్. సాంబయ్యకు మొదటిసారిగా తండ్రిమీద కంపరం కలిగింది.

''ఎక్కడ సచ్చాడీ ముసలాడు?'' అంటూ ధూంధాంలాడుతూ గూటిదగ్గర కొచ్చాడు సాంబయ్య. అన్నంమూట దించుతూ తొంగి చూశాడు. తండ్రి నిగడతన్ని పడుకొని వుండడం చూశాడు.

''అయ్యోయ్, ఏందీ! ఇంకా పడుకున్నావ్?'' పిలిచాడు కొడుకు.

వెంకయ్య పలకలేదు. ఉలకలేదు. గుడిసెలోకి వంగి తండ్రిని కదిలించాడు.

''అయ్యోయ్! ఏందిది? అయ్యోయ్!'' అంటూ బిగ్గరగా అరచాడు.

పొలంమీదున్న మరో మనిషి సహాయంతో తండ్రిని ఇంటికి చేర్చాడు.

ఆచార్యులవారు వచ్చి చూసి వెంకయ్యకు ధనుర్వాతం వచ్చిందన్నాడు! సాంబయ్యకు అర్థంకాక నోరు తెరిచాడు.

''అదే సాంబయ్యా! గుర్రంవాతం! వయస్సు దాటినవాడు. రాత్రిళ్ళు మంచులో పడుకుంటే రాదామరి?'' అన్నాడు వరదాచారి.

''అదే కామాలి. నేను పట్టికుదిపితే ఉంగిడిపడ్డ గొడ్డులా బిగిసిపోయుండాడు మా అయ్య!'' సాంబయ్యకు తండ్రి జబ్బేదో వరదాచారి చెప్పగా అర్థమయినట్లు అన్నాడు.

మంగమ్మ వెంకయ్యను చుట్టుకొని భోరున ఏడ్చింది.

అలా వెంకయ్య మూడురోజులు మంచంలో వున్నాడు. నోరు బలవంతాన లాగి రోజుకు మూడుపూటలా వరదాచారి మందు నూరి పోశాడు. ప్రొద్దుట పోసిన మందు సాయంకాలం, సాయంకాలం పోసిన మందు పొద్దుటా తిరిగి పెదవుల సందుల్నుంచి బయటకు కక్కడం తప్పించి వెంకయ్య చూపూ పలుకూ ఎరగడు. మూడోరోజు రాత్రి వెంకయ్య - తాతముత్తాతలు పుట్టిన గడ్డవదిలి ఈ వూరికి వచ్చిన వెంకయ్య - తిరిగి వాళ్ళు వెళ్ళినచోటుకే వెళ్ళాడు. భర్త ఏడూరు చూడకుండానే మంగమ్మ పోయింది. తెల్లవారుజామున వాములదొడ్లో జనపకట్టె లాగుతున్న మంగమ్మకు పురుగు ముట్టింది. తెరలు తెరలుగా నురుగులు కక్కడం మొదలుపెట్టింది. నాలుగోసారి నురుగుకక్కినప్పుడుగాని సాంబయ్యకు ఊళ్ళోవాళ్ళిచ్చిన సలహా బుర్రకెక్కలేదు. ఎడ్లబండికట్టి జల్లలో తల్లినివేసుకొని పెళ్ళాన్ని తీసుకొని ఐదుకోసులదూరంలోవున్న రైల్వేస్టేషన్‌కు బయలుదేరాడు. స్టేషన్ ఇంకా కోసెడు ఉందనగానే మంగమ్మ కాస్తా కన్నుమూసింది. దుర్గమ్మ జల్లబండిలో బావురుమంది. దుర్గమ్మ ఏడుపుని అదుపులోపెట్టి, సాంబయ్య బండిని వెనక్కు తిప్పాడు. దుర్గమ్మ అత్తశవం పక్కన కూర్చొని వెనక్కు వెనక్కు చూడటం మొదలుపెట్టింది. దుర్గమ్మ అంతవరకు పొగబండిని చూడలేదు. దూరంగా తాటితోపు వెనకనుంచి, పైకి లేస్తున్న పొగమాత్రం కన్పించింది పాపం దుర్గమ్మకు.

అయ్యా, అమ్మా పోయాక సాంబయ్యకు రెక్కలు విరిగినట్టయ్యింది. పొలం పని తన ఒక్కడివల్లా కావడం లేదు. దుర్గమ్మనుకూడా వీలు చిక్కినప్పుడల్లా పొలం తీసుకెళుతున్నాడు. కలుపుకూ, కాయకోతకూ - ఇంకా ఇలాంటి చిన్న చిన్న పనులకు కూడా కూలీలను పెట్టాల్సి వచ్చినప్పుడు సాంబయ్యకు గుండెలు చిక్కపట్టేవి. బిళ్ళకుడుముల్లాంటి వెండిరూపాయి లివ్వాలంటే ప్రాణాలు అవిసిపోయేవి. కూలికింద తాలూ బోలూ ధాన్యమూ, గడ్డీ, గాదమూ మాత్రమే ఇచ్చేవాడు. అట్లా ఇష్టమయిన కూలీలే సాంబయ్యకు పనిచేయడానికి వచ్చేవాళ్ళు.

అత్తమామల చావుతో దుర్గమ్మకు ఇంటిచాకిరి కొంత తగ్గినా అలవాటులేని పొలంపని కొంత కష్టంగానే వుండేది. రాత్రిళ్ళు భర్తతోపాటు పొలంలోనే వుండాల్సి వచ్చినప్పుడు బెంగకూడా పడేది. అమ్మా నాన్నా గుర్తుకొచ్చేవాళ్ళు. పెళ్ళయినప్పుడు వూళ్ళోవాళ్ళు, బంధుకోటి ''దుర్గమ్మ అదృష్టవంతురాలు'' అన్నారు కొష్టం, పొలం పుట్రా, ఇల్లూ, వాకిలీ, పాడీపంట వున్న ఇంటికి ఆమె కోడలుగా వెళ్తున్నందుకు.

గుబులుగా వున్న దుర్గమ్మ ఒకోసారి సాంబయ్య మాటకు వెంటనే జవాబు చెప్పేదికాదు. మోచేత్తో కసుక్కున పొడిచే వాడు సాంబయ్య ''ఎక్కడే నీ ధ్యాసంతా! చెప్పేదీ నీక్కాదూ?'' అనేవాడు సాంబయ్య.

ఉగాది పండగరోజు తెల్లవారుఝామునే లేచి దుర్గమ్మ అలుకులూ ముగ్గులూ పూర్తిచేసింది. గారెలకు పిండి రుబ్బి, బూరెలకు పిండి దంచింది. మధ్యాహ్నానికి పిండివంటలన్నీ పూర్తిచేసి, దబరాగిన్నెలో పెట్టి భర్తకోసం ఎదురు చూడసాగింది

దుర్గమ్మ. మెట్టపొలాన వున్న కందికట్టే, మాగాణిలో వున్న జనపకట్టే, బేరం ఇచ్చేసి బయానా పుచ్చుకొని తిరిగొచ్చాడు సాంబయ్య. వస్తూనే గాబుదగ్గరకెళ్ళి మొలపంచమీదే చన్నీళ్ళు గుమ్మరించుకొన్నాడు. ఛాతీమీద మట్టిని అరచేత్తో రుద్ది, మెడకింద మునిగోళ్ళతో గీకి బుడబుడా నెత్తిమీద నీళ్ళు గుమ్మరించుకొంటూ

''ఎక్కడే నువ్వూ? కొత్త చాపులు పట్టుకురా! తొందరగా! పేగులరుస్తున్నాయ్.'' కేక వేశాడు సాంబయ్య.

దుర్గమ్మ కొత్త ఉత్తరీయానికీ, కట్టుపంచకూ పసుపురాసి పరిగెత్తుకొంటూ గాబుదగ్గిరకొచ్చింది. పంచలందుకొని, వాటితోనే సాంబయ్య తలా వళ్ళూ తుడుచుకొంటూ దుర్గమ్మను చూసి ''ఏమిటే వండావ్? పద! పద! వడ్డించు!'' అన్నాడు.

దుర్గమ్మ లోపలకెళ్ళి పీటవాల్చి కంచంలో భోజనం వడ్డించి, గారెలూ, సజ్జబూరెలూ గిన్నెలో పక్కన వుంచింది. సాంబయ్య తడీపొడీగా వున్న కొత్త పంచ కట్టుకొని, పైపంచెతో జుట్టు సాగదీసి తుడుచుకొంటూ వచ్చి పీటమీద కూర్చున్నాడు.

రెండేసి గారెలూ, సజ్జబూరెలూ, లుంగచుట్టి తింటున్న సాంబయ్యను కన్నార్పకుండా చూస్తూ ఎదురుగ చతికిలబడి కూర్చుంది దుర్గమ్మ. ఆమె మనసులో వున్న భావాన్ని భర్తకు ఎలా చెప్పాలో తోచక భర్తకేసి కళ్ళు మెరిపిస్తూ, సిగ్గుపడుతూ కూర్చుంది. భర్త అదేమీ పట్టించుకోకుండా తిండిలో పడిపోయాడు.

''బూరెలు బాగా కుదిరినై'' అంటూ సాంబయ్య ఇంకోపట్టు పట్టసాగాడు.

''మరి గారెలో?'' ఊరికే అంది దుర్గమ్మ, అలా అయినా భర్త తనలోని మార్పును గమనిస్తాడేమోనన్న ఆశతో.

''ఆ! గారెలా? మనచేలో మినుములేగా? బలే పసందుగా...'' అంటూ సాంబయ్య నోట్లో బూరె కుక్కుకొని దుర్గమ్మకేసి చూసి ఆగిపోయాడు.

ఎందుకు ఈ రోజు దుర్గమ్మ మెరిసిపోతోంది? తనను చూసి సిగ్గుపడుతోందేమిటి? తలంటుకొని కొత్తచీర కట్టుకొన్నదా? అదా సంగతి?

''ఎనిమిదిరూపాయలు పోతే పోయినయ్! కోక బాగుందిలే! రంగు వుంటుందంటావా?'' సాంబయ్య అర్థం చేసుకొన్నంతలో గ్రహించింది అది.

దుర్గమ్మకు కోపం వచ్చింది. అయినా భర్త ముందు దానికి విలువలేదని ఆమెకు తెలుసు.

''ఉంచండి! అన్నీ మీరే తినేస్తారే? వచ్చేవాళ్ళకేం పెడతాం?'' అంది దుర్గమ్మ.

సాంబయ్య బిత్తరపోయాడు. భార్య ఎప్పుడూ తనతో ఇలా మాట్లాడి ఎరగదు. ఎవరికి పెడ్తుంది? అలగాజనానికి వేరే వండుద్దిగా? మరి ఆ వచ్చేవాళ్ళెవళ్ళో? దాని పుట్టించి తరఫువాళ్ళు ఎవరైనా వస్తున్నారా?

''ఏమేవ్? మీ తమ్ముడెవడైనా వస్తున్నాడా?'' ఎద్దేవగా అడిగాడు సాంబయ్య.

''కాదు, రావాల్సినవాడే వస్తున్నాడు'' దుర్గమ్మ పెళుసుగా సమాధానం చెప్పింది.

''నీ అక్కుదారుడే వస్తున్నాడు." మళ్ళీ అదే ధోరణిలో అన్నది దుర్గమ్మ.
నోట్లో ఉన్నది గుటకమింగి, నీళ్ళు తాగి సాంబయ్య అన్నాడు:
''అక్కుదారుడా? వాడెవడేవ్?"
''వారసుడు, నీ వంశాన్ని నిలిపేవాడు."కిలకిలా నవ్వింది దుర్గమ్మ.
అర్థంచేసుకొన్న సాంబయ్య దుర్గమ్మ నోట్లో సజ్జబూరె కుక్కాడు. దుర్గమ్మ ఉక్కిరిబిక్కిరైపోయింది.
వేళ్ళు తెరిచీ, మడిచీ అన్నది ''ఇంకా ఎనిమిది నెల్లు."
మొదటి వారంరోజులూ దుర్గమ్మను కొత్తగా, వింతగా, శ్రద్ధగా చూశాడు సాంబయ్య. ఆ తర్వాత ఆ బులుపు తీరినట్లయింది సాంబయ్యకు.
దుర్గమ్మకు ఏడోనెల నిండగానే తమ్ముడు వచ్చాడు.
''బావా! మా అయ్య అప్పను తీసుకురమ్మన్నాడు. ఏకువజామున బయలుదేరుతాం." అన్నాడు దుర్గమ్మ తమ్ముడు సాంబయ్యతో.
''ఇప్పుడిక్కడ దానికేం తక్కువయిందంట?" సాంబయ్య విసురుగా అన్నాడు.
గడపలో నిలబడివున్న నిండుచూలాలు దుర్గమ్మ గుండెలు అవిసిపోయినయ్.
''అదికాదు బావా? ఎడ్డయినా పుట్టింటోనే పురుడు పోసుకోవాలి గదా? అమ్మా అయ్యా మరీ మరీ చెప్పారు. ఎట్టాగయినా అప్పను తీసుకురమ్మని" అన్నాడు దుర్గమ్మ తమ్ముడు.
''ఇప్పుడెట్టా వస్తుందిరా? పంటలు ఇంటికి వచ్చే తరుణంగదా? పని ఎద్దడి మోపుగా వుంది. నేను చూస్తే రేతింబవళ్ళు పొలంలోనే వుంటున్నానుగందా? ఇంటిదగ్గర అదికూడా లేకపోతే ఎట్టా జరుగుద్ది?" సాంబయ్య ఈసారి కొంచెం తగ్గినట్టే అన్నాడు.
''అప్పా! ఏందేమరి?! బావ ఇట్టా అంటున్నాడు?" అక్కయ్యకేసి చూస్తూ గోళ్ళు గిల్లుకుంటూ అన్నాడు తమ్ముడు.
దుర్గమ్మ భర్తకేసి ఆదుర్దాగా చూసింది. భర్త చలించలేదు. దుర్గమ్మ పైట చెంగుతో కళ్ళద్దుకొని, బొటనవేలితో మండిగం రాస్తూ నిలబడింది.
''ఏంటే? అట్టా ఇదయిపోతావ్? ఇక్కడ నువ్వేం బరువులు మోస్తున్నావ్? ఈ ఎద్దడిలో నువ్వెళితే ఎక్కడి దక్కడ ఆగంకాదంటే? ఆడదానివి నీకుండొద్దే ఆ ఆలోచన?" భార్య ముఖంలోకి చూస్తూ అన్నాడు సాంబయ్య.
''తమ్ముడూ! నేను రానని చెప్పరా అమ్మోళ్ళకి! నాకిక్కడ బాగానే వుంది లేరా!" దుర్గమ్మ గట్టిగా చెప్పటానికి ప్రయత్నించి విఫలమైంది.
సాంబయ్య మళ్ళీ అందుకొన్నాడు.
''చూడరా! దానికేం కష్టం లేకుండానే చూసుకొంటున్నానురా! రామికి సలకగింజలిచ్చి అచ్చంగా మీ అక్కయ్యకోసమే వుంచానురా? సలకగింజల్లా! సలకగింజలు! ఇప్పుడొచ్చి అక్కను తీసుకెళ్తానంటున్నావ్!"

''వంటతప్ప ఊడ్చూ, పాడీ అంతా రామి చేస్తుంది. ఇంకా మీ అక్కకు పనేంటిరా? ఇంత ఉడకేసి పడేయటమేగదరా? అది చెయ్యలేకపోతే ఆ పనీ నేనే చేసుకుంటానుమరి. తప్పేదేముంది?''

సాంబయ్య కర్రతీసుకొని దండెంమీద పంచ భుజాన వేసుకొని, బావమరిది వంక చూస్తూ ''నాలుగురోజులుంటావా!'' అని అడిగాడు.

''మాకూ అక్కడ పనులున్నాయ్! ఇంకెందుకు బావా? రేప్పొద్దెళ్తా'' తడీ పొడిగా అన్నాడు సాంబయ్య బావమర్ది.

''ఉండరా రెండురోజులు! అంత దూరంనుంచి వచ్చావ్.'' అన్నాడు సాంబయ్య పొలం బయలుదేరుతూ.

కనుచీకటి పడుతుండగా సాంబయ్య పొలంనుంచి తిరిగి ఇంటి మొహం పట్టాడు. వీరభద్రయ్యగారి దొడ్డిదాటి మలుపు దిరిగి తనఇంటిముందు నెరాబాలోకి వచ్చిన సాంబయ్యకు, వాములదొడ్డి పెణ్ణెం తెరిచినట్లనిపించి, గబగబా అటుకేసి వెళ్ళాడు. దొడ్లోనుంచి ఓ మనిషి నెత్తిన మూటపెట్టుకొని, గబగబా గేటుదాటి బయటికిపోవటం సాంబయ్య కళ్ళబడింది! చీకటిలో మనిషి ఆనవాలు తెలియటం లేదు. నాలుగు అంగల్లో ముందుకెళ్ళి, చేతిలోవున్న బాణాకర్ర ఆ వెళ్ళేవాడి పిక్కలకేసి విసిరాడు. పోతున్న మనిషి బిక్కచచ్చి నిలబడిపోయాడు.

''ఎవడ్రా నువ్వు? ఆగక్కడ?'' అంటూ సాంబయ్య అతనికి ఎదురెళ్ళి నిలబడ్డాడు.

''నేనే బావా?''

''ఒరే! నువ్వంటరా! మరేంట్రా ఈ దొంగపని?'' సాంబయ్య క్రోధంతో అడిగాడు.

''కాదు బావా! అక్కే ఇచ్చింది.''

''ఇస్తుందిరా నీ అక్క? దానమ్మ మొగుడిసొమ్ముగదూ?'' అంటూ చేతిలో ఉగ్గంకట్టివున్న తోపేలా లాక్కొని బావమరిదిని నెత్తిమీదవున్న మూటతో సహా, ఇంట్లోకి నడిపించుకొచ్చాడు.

గాబరాపడిన దుర్గమ్మ ప్రాణాలు ఉగ్గపట్టుకొని తమ్ముడికీ, భర్తకి మధ్య నిలబడింది.

''ఎన్నాళ్ళనుంచి ఇట్లా దోచిపెడుతున్నావే!'' కళ్ళెర్రజేసి అడిగాడు సాంబయ్య.

''రామ!రామ! ఇంతవరకు మన సొమ్ము పూచికపుల్లంత ఎరుగరు. చేలో పండినయ్‌గదా! ఇంట్లో రెండు గేదెల పాడి అవుతుందిగదా అని ఇచ్చాను.''

''నోరుముయ్! తప్పుడుకూతలు కుయ్యమాకు. ఎవడబ్బ సొమ్మే తేరగా పెట్టటానికి? పోతుల్లాగ వున్నారు నీ తమ్ముళ్ళు - పనిచేసుకొని బతకాలే!'' అని సాంబయ్య విసురుగా ఇంట్లోకి వెళ్ళిపోయాడు.

మినుములూ, కందులూ, బియ్యమూ విడివిడిగాకట్టి నింపిన మూట అక్కడ వదిలేసి దుర్గమ్మ తమ్ముడు చరచరా బయటకు నడిచాడు.

"తమ్ముడూ! ఆ వెన్నపూస గిన్నె అన్నా తీసుకెళ్ళరా!" సగం చచ్చి అంది దుర్గమ్మ.

"మీ సొమ్ము మాకేం అక్కర్లేదు. ఆయన్నే తిని కొవ్వెక్కనియ్" అని విసురుగా వెళ్ళిపోయాడు దుర్గమ్మ తమ్ముడు.

అలా వెళ్ళిపోయిన తమ్ముణ్ణే తల్చుకుని దుర్గమ్మ కుమిలి కుమిలి ఏడ్చింది. భర్తకు అన్నంపెట్టి వసారాలోకి వచ్చి కూర్చుంది. అవసరమైనా పెళ్ళాన్ని పిలవకుండా సాంబయ్య అన్నం తిని లేచాడు. పొద్దు పోయినా అన్నం తినకుండా కూర్చుంది దుర్గమ్మ. తెలిసికూడా కనీసం అన్నం తినమనైనా అనకుండా వెళ్ళి పడుకున్నాడు సాంబయ్య. కొంచెంసేపటికే దుర్గమ్మకు సాంబయ్య గుర్రు వినిపించింది.

ఏం మనిషి? మనిషా పసరమా?

ఆమె కడుపులో వున్న బిడ్డ కదిలాడు. దుర్గమ్మను ఏదో తెలియని భయం ఆవహించింది. మంచంమీద ఒత్తిగిలి పడుకుంది.

సాంబయ్య పంటకాలవదాటి రోడ్డెక్కాడు. ఈపాటికి తన భార్య ప్రసవించి ఉంటుంది. ప్రొద్దుటనంగ నొప్పులు ఆరంభమైనవి రామి చెప్పింది. ఇంతకీ చాకలి రత్తి ఇంటికెళ్ళి కాన్పు చేసిందా? ఏం బిడ్డో? ఆడపిల్ల! కాదు - మగబిడ్డే! దుర్గమ్మ ఆ రోజు అన్నదిగా, వారసుణ్ణే - హక్కుదారుణ్ణే ఇవ్వబోతున్నానని?

తను పట్టింది బంగారం అవుతోంది. తనకు అదృష్టం కలిసి వస్తోంది. వారసుడే- వంశోద్ధారకుడే పుట్టి వుంటాడు.

ఆలోచనలతో సాంబయ్య హృదయం ఆనందనిలయం అయింది.

తన తండ్రి కట్టుబట్టల్తో ఈ వూరు వచ్చాడు. తను పుట్టేనాటికి తన తండ్రికి రెండెకరాలు మాత్రమే వుంది. ఇప్పుడు తన కొడుకు ఎంత ఆస్తికి వారసుడు అవుతున్నాడో! నాలుగెకరాల మాగాణి- మూడెకారాల మెట్ట, ఇళ్ళ స్థలమూ, దొడ్లూ- దోవలు. తనూ ఊళ్ళో వున్న సన్నకారు రైతుల్లో ఒకడుగా నిలబడ్డాడు. పిల్లవాడి అదృష్టం. ఈ సంవత్సరం బంగారం పండింది. తన తండ్రి కౌలుకు చేసిన కాంతమ్మ పొలం అమ్మకానికి వచ్చింది. కాంతమ్మ మరణానంతరం భర్త తరఫు వారసులు తగూలాడుకొని ఏకాడికయినా అమ్మాలనే ప్రయత్నంలో వున్నారు. నిలవ రొఖ్ఖం, పంటమీద వచ్చేదీ కలిపి ఆ పొలం కొనుక్కోవచ్చు! అప్పుడు తన కొడుకు పదమూడెకరాల ఆసామి బిడ్డ. వాడికేం? అదృష్టజాతకుడు!

ఇంటిముందు కొచ్చిన సాంబయ్య ఆలోచనలు ఆగిపోయినయ్. నట్టింట్లో నలుగురైదుగురు ఆడవాళ్ళు హడావిడిగా తిరగటం గమనించిన సాంబయ్య, చేతిలో కర్ర అవతల పారేసి గబగబా ఇంట్లోకి వెళ్ళాడు. గదిలో నుంచి బయటికి వచ్చిన మంత్రసాని రత్తిని, కళ్ళతోనే ప్రశ్నించాడు.

''కొడుకు పుట్టాడు సాంబయ్యగోరూ, కొడుకు!'' దాని గొంతులో సంతోషం, విషాదం మిళితమై వున్నాయి.

''నేనూ, అదీకూడా కొడుకే అనుకుంటున్నాంలే!'' గర్వంగా అంతకంటే వేరే జరగటానికి వీల్లేదన్నట్టుగా అన్నాడు సాంబయ్య.

''కాని, కాన్పుచాలా కష్టంమీద అయిందయ్యగోరూ!'' అంది మంత్రసాని. అప్పటికిగాని సాంబయ్య బుర్రకెక్కలేదు. సాంబయ్య భార్యవున్న గదిలోకి వెళ్ళాడు. ఊడిపోతున్న తలగుడ్డను లాక్కుని ''రత్తీ! ఇలా అయిందేంటే? అయ్యవార్లకు కబురు చేశారా?'' అన్నాడు.

రామి వరదాచార్యుల కొడుకు రామాచారిని వెంటబెట్టుకొని వచ్చింది.

రామాచార్యులు దుర్గమ్మ నాడి పరీక్షించి ''శీతలం కమ్మింది. బాలింతరాలకు శీతలం కమ్మకూడదు'' అన్నాడు.

దుర్గమ్మకు బరువుగా వుందని ఆనోటా ఆనోటా ఊరంతా వ్యాపించింది. సాంబయ్య కుటుంబంతో పెద్దగా సంబంధం లేనివాళ్ళుకూడా చూట్టానికి వచ్చారు.

రామాచార్యులు కల్వంలో మందు నూరుతున్నాడు. సాంబయ్య దిగాలుపడి మందు నూరుతున్న ఆచార్యులకేసి చూస్తూ కూర్చున్నాడు.

''సాంబయ్యా! దుర్గమ్మను పట్నం తీసుకెళ్ళటమే మంచిదేమో?'' వచ్చినవాళ్ళలో ఓ పెద్ద ముత్తయిదువు సలహా ఇచ్చింది. పట్నల ఆసుపత్రి అనగానే సాంబయ్య బిత్తరపోయాడు. ఆలోచించాడు. అంతగా బుర్ర బద్దలు కొట్టుకోవాల్సింది ఏమీ లేదనిపించింది.

పట్నం తీసుకెళ్ళి ఆసుపత్రిలో వుంచాలంటే చాలా ఖర్చు అవుతుంది. తను కూడా వెళ్ళటం అంటే పొలంలో పంట, ఈనగాచి నక్కలపాలు చేసినట్టే! అయినా తన కుటుంబంలో ఇంతవరకు అయ్యవార్ల మందులుతప్ప మరొహటి ఎరుగరు. ఈ రోజు పట్నం మందులు మాత్రం పనిచేస్తాయా?

సాంబయ్య మొండితనానికి అమ్మలక్కలు ముక్కుమీద వేలేసుకున్నారు. గుసగుసలాడుకున్నారు.

''షావుకారు రామయ్య భార్య పట్నం ఆసుపత్రిలోనేగా మరణించింది. ఐదొందలు ఖర్చు పెట్టాడు. బిడ్డా తల్లీ కూడా దక్కలేదు. ఇంతకీ ఆయుషుండాలి. డాక్టర్లు మందులైతే ఇస్తారుగాని ప్రాణంపోస్తారా ఏం?''.

సాంబయ్య వెలిబుచ్చిన అభిప్రాయాలకు చాలామంది ఏకీభవించినట్లే తలలు ఊపారు. అయితే మధ్యాహ్నానికి చూడవచ్చిన ఇరుగుపొరుగువాళ్ళు తప్పుకొన్నారు. మంత్రసాని రత్తీ, రామీమాత్రం దుర్గమ్మను కనిపెట్టుకొని వున్నారు. రామాచార్యులు రోజుకు మూడుసార్లు వచ్చి చూసి పోతున్నాడు.

మూడోరోజు తెల్లవారుఝామునకు దుర్గమ్మకు తెలివి వచ్చింది. భర్తను పిలిచి కుర్రాణ్ణి ఎత్తుకు రమ్మంది. సాంబయ్య పిల్లవాణ్ణి చేతుల్లో పెట్టుకొని, భార్య మంచంపక్కనే గొంతు కూర్చున్నాడు.

''నే పోతున్నా! వాణ్ణయినా సరిగా చూసుకో!'' దుర్గమ్మ చెంపలు కన్నీటితో తడిసినయ్. సాంబయ్య గుండెల్లో కలుక్కుమంది. దుర్గమ్మను తను సరిగా చూసుకోలేదా?

సాంబయ్య పరుగెత్తుకెళ్ళి రామాచార్యులను నిద్రలేపుకొచ్చాడు.

దుర్గమ్మ వళ్ళు నీటికుండలా అయిపోయింది. ఎక్కడో నాడి క్షీణంగా కొట్టుకుంటున్నట్లనిపించింది రామాచార్యులకు.

''సాంబయ్యా! చూడు, ఆఖరి ప్రయత్నం చేద్దాం! ఏమంటావ్?''

సాంబయ్య రామాచారి చేతులు పట్టుకొని ''ఎట్టాగయినా బతికించండి. మీ ఋణం ఉంచుకోను'' అన్నాడు.

''అయితే గరళ ప్రయోగం చేస్తాను.'' ఆగ్నేయాస్త్రం ప్రయోగించబోతూన్న ద్రోణాచార్యులవారిలా అన్నాడు రామాచార్యులు.

''దాని అదృష్టం. మీ హస్తవాసి. కానివ్వండి తొందరగా.'' అన్నాడు సాంబయ్య.

దుర్గమ్మ నోరు బలవంతాన తెరిచాడు సాంబయ్య. రామాచారి నాగుబాము విషం చనుబాలులో రంగరించి పోశాడు దుర్గమ్మ అంగిట్లో.

''సూర్యోదయం అయేసరికి గుణం తెలుస్తుంది.'' పిండితో చేతులు రుద్దుకొని తుడుచుకుంటూ చెప్పాడు రామాచారి.

సూర్యోదయమయింది. దుర్గమ్మకు విషం పనిచేసింది. భవబంధాలనుంచి విముక్తురాలయింది.

సాంబయ్య తల్లీ తండ్రీ పోయినప్పుడు బాధపడ్డాడు. కాని, కంటి వెంట నీరు కార్చలేదు. దుర్గమ్మ చావును భరించలేకపోయాడు.

నులకమంచంలో, పొత్తిళ్ళలో ఉన్న పసిగుడ్డును చూసుకునేసరికి సాంబయ్య నవనాడులూ కుంగిపోయాయి.

పిల్లాడు తల్లిలేనివాడైపోయాడు. అది తలపుకు రాగానే సాంబయ్య బిడ్డను గుండెలకు అదుముకొని కుమిలిపోయాడు. సాంబయ్య నిజంగానే ఏడ్చాడు. అయినా అతని కంటివెంట నీటిచుక్క రాలలేదు. చూపులు చెమ్మగిల్లాయి. అంతవరకే.

## 3

సాంబయ్య భార్యకు విషం పోయించి చేతులారా చంపించాడని ఊళ్ళో చెడ్డవాళ్ళతోపాటు మంచివాళ్ళుకూడా చాలామంది చెప్పుకున్నారు. పిసినారి సాంబయ్య రెండువందలు ఖర్చు పెట్టి వైద్యం చేయించటానికి వెనకాడి ఆ పని చేశాడనీ, లేకపోతే దుర్గమ్మ బతికేదనీ సాంబయ్యను అర్థంచేసుకొన్న కొద్దిమంది మంచివాళ్లూ అన్నారు. అయితే అందరూ ''సాంబయ్య కర్కోటకుడు'' అనే అన్నారు.

ఊళ్ళో ఎంతమంది ఏమనుకొన్నా సాంబయ్యకు వచ్చిన నష్టమేమీ కన్పించలేదు. సాంబయ్యకు ఏనాడూ ఇరుగు పొరుగు వాళ్ళతో సంబంధాలు లేవు. తనేమో, తన పొలమేమోతప్ప మరోహటి ఎరగడు. ఊళ్ళోవాళ్ళ జోలి పట్టించుకోడు. తన

వ్యవహారాల్లో ఇతరులు జోక్యం కలిగించుకోవడం ఇష్టం ఉండదు, సాంబయ్యకు కావలసిందల్లా తన పొలం పక్కపొలం ఎవరిదీ, వాళ్ళేమయినా అమ్మే ఆలోచనలో ఉన్నారా అన్నంతవరకే.

అయినా సాంబయ్యను ఊళ్ళో వాళ్ళు వెలివేసినట్లు చూడసాగారు. కాని నిజానికి జరిగింది - సాంబయ్యనుంచి వాళ్ళే దూరమైపోయారు. సాంబయ్యకు ఇటు అత్తవారితో కూడా సంబంధాలు తెగిపోయినై.

దుర్గమ్మ చావుతో సాంబయ్యలో కొంత మార్పు రాకపోలేదు. పొలమూ, సంపాదనామీద కేంద్రీకరించివుండే అతనిధ్యాస కొంతవరకు కొడుకుమీదకుకూడా మళ్ళింది.

నామకరణం రోజున ఊళ్ళోవాళ్ళను కొందర్ని పిలిచాడు. ఆ పిలిచినవాళ్ళలోకూడా వచ్చినవాళ్ళు చాలా తక్కువమంది. అందులో ముఖ్యుడు కనకయ్య. కనకయ్య చాలా బీదతనంలో వున్నాడు. అతను చేసే పనల్లా పొలాలు అమ్మిపెట్టటం, కొనిపెట్టటమూను. ఆ సందర్భాల్లోనే సాంబయ్యకు కనకయ్య అవసరం కలిగేది. ఏ కుటుంబం ఆర్థిక ఇబ్బందుల్లో వుందో, దొడ్డిదోవలు ఎవరెవరు అమ్ముకొనే స్థితిలో పడ్డారో - ఆరాలు తీసి కనకయ్య సాంబయ్య చెవులో ఊదేవాడు. అప్పట్నించి సాంబయ్య, వాళ్ళు అమ్మేదాకా పనికట్టుకొని వెళ్ళి వాళ్ళను పలకరించి వస్తూండేవాడు. సాంబయ్య కనకయ్యను పూర్తిగా నమ్మేవాడుకాదు. గీచిగీచి ఆరాలు తీసేవాడు సాంబయ్య.

"ముహూర్తం దగ్గిరపడుతుంది. మరి నామకరణం కానిద్దామా?" అన్నాడు పురోహితుడు.

"కొంచమాగండి! ఇంకా రావాల్సినవాళ్ళు చాలామంది వున్నారు" అన్నాడు కనకయ్య.

"వచ్చినంత వరకు చాలు, ఇహ కానియ్యండి" అన్నాడు సాంబయ్య.

ఇక వచ్చేవాళ్ళు లేరని సాంబయ్యకు తెలుసు. ఆ సంగతి తెలిసే, సాంబయ్య దృష్టికి తేవటానికి అలా అన్నాడు కనకయ్య. సాంబయ్యకు కావాల్సినవాడు తనేననే ఉద్దేశ్యాన్ని సాంబయ్యకు తెలియజెప్పడంలో లౌక్యాన్ని ఉపయోగించాడు కనకయ్య.

సాంబయ్య కొత్తపంచలు కట్టుకొని, కొడుక్కు కొత్తచొక్కా తొడిగి ఒళ్ళో కూర్చోపెట్టుకొని పీటమీద కూర్చున్నాడు. తతంగం పూర్తిచేసి పురోహితుడు అడిగాడు:

"పేరు - పేరు చెప్పండి!"

"వంశోద్ధారకుడు వాడు. వాళ్ళనాన్నగారిపేరే పెట్టుకుంటాడ్లే సాంబయ్య." కుర్రాడి బుగ్గ నిమురుతూ అన్నాడు కనకయ్య.

సాంబయ్య ఓ క్షణం ఆలోచనలో పడ్డాడు.

"వెంకటపతి!"

''ఆహా! తండ్రి పేరు కలిసొచ్చేట్టు మామంచిగా పెట్టుకొన్నాడుసాంబయ్య''
అన్నాడు కనకయ్య సాంబయ్యను ఉబకేస్తూ.

ఎప్పుడూ నవ్వని సాంబయ్య మొహంలో నవ్వు కన్పించింది.

''మాతాతపేరు చలపతి. మా నాన్న పేరు వెంకయ్య. తండ్రి తాతల పేర్లు కలిసొచ్చేట్టు పెట్టాను. ఎలా వుంది?'' అన్నాడు సాంబయ్య.

''ఓహో! ఇంకేం? తండ్రి తాతల పేర్లు బాగా కలిశాయి. వెంకటపతి! చాలా బాగుంది. ఇదిగో ఇక్కడ బియ్యంమీద రాయండి!'' అన్నాడు పురోహితుడు బ్రహ్మయ్య.

సాంబయ్య ముఖం చూసి నాలుక్కొరుక్కొని బ్రహ్మయ్య తనే పళ్ళెంలో వున్న బియ్యం మీద ''వెంకటపతి'' అని రాశాడు. మరో పది నిముషాలు హడావిడి చేసి, సంభావనలన్నీ రాబట్టుకొని చక్కాపోయాడు పురోహితుడు బ్రహ్మయ్య.

భోజనాలయాక కనకయ్య వెళ్తానని లేచి, మళ్ళీ కూర్చున్నాడు. సాంబయ్య పసికట్టి భుజాన నిద్రపోతున్న పిల్లవాణ్ణి లోపల పడుకోపెట్టటానికి వెళ్ళాడు. ఇంట్లోకిపోతే మళ్ళీ త్వరలో బయటకురాడని గ్రహించిన కనకయ్యకూడా సాంబయ్యతోపాటు లోపలకు వెళ్ళాడు.

''ఈ రోజు దుర్గమ్మ వుంటే ఎంత సంతోషించేదో?'' అన్నాడు కనకయ్య.

పిల్లవాణ్ణి వత్తిగిల పడుకోబెడుతున్న సాంబయ్యకు ఆ మాటలు గుచ్చుకున్నాయి. మాట్లాడకుండా వచ్చి పంచలో మంచంమీద కూలబడ్డాడు. సాంబయ్యవంతు బాధకూడా తనే పొందుతున్నట్టు మొహంపెట్టి కనకయ్య సాంబయ్య పక్కనే కూర్చోబోయాడు.

''కనకయ్య ! వెళ్తానంటివే మరి?''

''ఆ అవును! వెళ్ళాలి, చాలా తొందరపనేవుంది. ఐదురూపాయలు కావాలి. వచ్చే బేస్తవారం ఇచ్చేస్తా!'' అసలు సంగతి జారవిడిచాడు కనకయ్య.

సాంబయ్య కావిడి పెట్టి తెరిచి, వెనకవున్న కనకయ్యకు కన్పించకుండా, గుడ్డమూటవిప్పి, మూడు రూపాయలు బయటికి తీసి, మళ్ళీ మూటకట్టి, కావిడిపెట్టె మూసివచ్చాడు.

''ఇంద, మూడు రూపాయలు. లోగడ పాత బాకీ తాలూకు రెండుంబావలా ఇంకా నువ్వు ఇవ్వాలి. అంతా కలిపి బేస్తవారం ఇచ్చెయ్!'' అన్నాడు సాంబయ్య.

కనకయ్య బిత్తరపోయాడు. ధాన్యం అమ్మినప్పట్లో ఆ బాకీ రద్దుచేశాడనే ఉద్దేశ్యంతో వున్న కనకయ్య అతన్ని కొంతకాలం అప్పు కూడా అడగలేదు. అది మాఫీ చేశాడని నిర్ధారణ చేసుకున్నాకనే కనకయ్య అదీ మంచి అదను చూసుకొని తెలివితేటల్ని ప్రదర్శించాడు.

''అమ్మ! సాంబయ్య! డబ్బంటే ఎంత బిగువు?'' అనుకొని, ''ఏదీ? అదా? అదే - ఆ చిల్లరబాపతు! సద్దుబాటు చేశాననుకున్నానే?'' అంటూ సాంబయ్య చేతినుండి రూపాయలు వడిసిపట్టి గుంజుకొని, ''మళ్ళీ చస్తే నీ గుమ్మం

తొక్కుతానా?" అన్నట్టు ముఖం పెట్టి అంగలు పంగలు వేసుకొంటూ వెళ్ళిపోయాడు కనకయ్య.

సాంబయ్యకు ఇటు ఇంట్లో పసిగుడ్డు, అటు పొలాన పంటా, రెండూ సాగటం కష్టంగా అనిపించింది. చాకలి రత్తిని పిల్చి రెండు రోజులు ఇంట్లో పిల్లాడ్ని చూసుకోమని చెప్పి సాంబయ్య భార్య పుట్టింటికి వెళ్ళాడు.

అత్తా మామా, బావమరదులు సాంబయ్యను చూసి ముభావంగా వున్నారు. బయిటివాణ్ణి చూసినట్లు చూశారు. ఏదో గొంతుమీదకు రాకపోతే ఇలా రాడని వాళ్ళల్లో వాళ్ళు మధనపడ్డారు.

"బుడ్డోడు ఎట్టా వున్నాడు! ఆణ్ణికూడా తీసుకొస్తే చూసేవాళ్ళంగా?" అన్నాడు సాంబయ్య మామ.

"బాగానే వున్నాడు. ఆడి పనిమీదే వచ్చాను" అన్నాడు సాంబయ్య.

"వాడికి నీళ్ళూ, పాలూ ఎవరు చూస్తున్నారూ?" అడిగింది సాంబయ్యఅత్త.

"అదే కష్టంగా వుంది. ఎవరైనా మీఎరికలోవుంటే చూడండి" అన్నాడు సాంబయ్య ముక్తసరిగా.

సాంబయ్య ధోరణి చూస్తే అల్లుడు మళ్ళీ పెళ్ళి చేసుకొనే ప్రయత్నంలో వున్నాడనిపించి వాళ్ళు బిగిసిపోయారు.

"నీకు బరువైతే ఆణ్ణి ఇక్కడే వదిలేయ్. ఆమ్మాత్రం పెంచలేమా?" అంది సాంబయ్య అత్త.

"వాడు నాకేం బరువు? వాడికోసమేగా ఈ అవస్తంతా? వాణ్ణి చూసుకుంటూ ఇంట్లో వుండే ముసలమ్మ ఎవరన్నా మనవాళ్ళల్లో దొరుకుతారేమో చూడమని చెప్పటానికే వచ్చాను" అన్నాడు సాంబయ్య.

అత్తా మామా ఊపిరి పీల్చుకున్నారు.

"భోజనానికిలే. ఏవేఁ? ఒడ్డించు!" భార్యను పురమాయించాడు సాంబయ్య మామ.

ఆ మధ్యాహ్నం సాంబయ్యమామా అత్తా బాగా ఆలోచించి ఓ నిర్ణయానికి వచ్చారు. వాళ్ళకు దూరపు బంధువుల్లో వయసు మళ్ళిన ఓ ముసలావిడ వుంది. చెల్లెలి భర్త తాలూకు బంధువుల ఇంట్లో వూడిగం చేసి బతుకుతోంది. ఆ మనిషి అయితే తమ మనవడికి పోషణ బాగా జరుగుతుందనీ, తమ మనిషికనక సాంబయ్య ఇంట్లో మళ్ళీ జొరబడే అవకాశం దొరుకుతుందనీ ఆశపడ్డారు.

రాత్రికి ఆవిడను పిలిపించి సాంబయ్య ముందు నిలబెట్టారు. సాంబయ్యకు ఆవిణ్ణి చూడగానే "ఇది మరీ ముసల్ది! ఏం పని చెయ్యగలుగుతుందబ్బా!" అని అనిపించింది. గత్యంతరంలేక, ఆవిడ నమ్మకాన్ని గురించి అత్తమామలు పదేపదే చెబుతుంటే ఒప్పుకున్నాడు.

''అయితే, ఏం ఇయ్యమంటుంది?" అన్నాడు సాంబయ్య.

''అన్నం, బట్టలూ ఇచ్చి, సాలుకు పుట్టేడు గింజలు ఇస్తే బాగుంటుంది." అన్నాడు సాంబయ్య మామ.

''ఏంటేంటీ? అన్నం బట్టలూ యిచ్చి ఏడాదికి పుట్టేడు గింజలు కొలవాలా? నావల్ల కాదు." అని పంచ దులుపుకొని సాంబయ్యలేచి నిలబడ్డాడు.

''ఆయ నేమిస్తాడో చెప్పమనండి!" అంది రామమ్మ. ఆ ముసలమ్మ గొంతులో నిరాశ స్ఫురించింది.

''ఏడాదికి రెండు జతలు పంచెలూ, తిండీ ఇచ్చి, పందుంగింజలిస్తా. ఇష్టమయితే బయలుదేరమనండి." నిక్కచ్చిగా చెప్పాడు సాంబయ్య.

ముసలమ్మ నీరుకారిపోయింది. చివరకు ఒప్పుకొంది.

అయినా ముసలమ్మ ఇంటి పనిలో ఎలాంటి అశ్రద్ధా చూపలేదు. పిల్లవాణ్ణి సొంత మనవడిలాగే చూసుకొంది. ఇంటి చాకిరి అంతా వంచిన నడుం ఎత్తకుండా - అసలు వొంగిపోయిన నడుమే కాబట్టి చేసుకుపోయేది. సాంబయ్యకు రామమ్మ వచ్చాక చాలా బాధ్యతలు తప్పినట్లుగా వుంది. పుల్లాపిడకా పోకుండా ఇంటికి కుక్కకాపలా కాస్తుంది. వెంకటపతికి తల్లి కొదవలేకుండా వుంది. సాంబయ్య తన దృష్టినంతా పొలం మీదనే కేంద్రీకరించటానికి వీలుగావుంది. ముసలమ్మకు ఇచ్చే బట్టలూ, పెట్టే తిండీ, కొలిచే గింజల వారకంటే తనకు లాభసాటిగానే వుందని భావించాడు సాంబయ్య.

వెంకటపతికి ఏడాది వెళ్ళింది. పిల్లాడు వళ్ళుచేసి నిగనిగలాడుతున్నాడు. వాడి అదృష్టం. ఆ ఏడు సాంబయ్య పొలం వెర్రిగా పండింది. ధాన్యం అమ్మిన డబ్బు భద్రంచేసి, కొడుకుని భుజాన వేసుకొని, గొడ్లసావిట్లో తిరుగుతోన్న సాంబయ్యకు కనకయ్య పిలుపు విన్పించింది.

''ఎవరూ? కనకయ్యా ! ఇటురా! సావిట్లోకి." సాంబయ్య తిరిగి కేకవేశాడు. కనకయ్య ముచ్చెమటలు తుడుచుకుంటూ సాంబయ్య ముందుకొచ్చి పడ్డాడు.

''ఏంటా హడావిడి? రొప్పుతున్నావ్? ఏంటి యిసేషం!'' సాంబయ్య సాలోచనగా అడిగాడు. కనకయ్య అలా వచ్చాడంటే ఏదో పనిమీదే వస్తాడని సాంబయ్యకు అనుభవమైనదే.

''అదే- కాంతమ్మను - మనవర్తి పొలం కాంతమ్మను కింద పెట్టారు!" వగరుస్తూ చెప్పాడు కనకయ్య.

''డెబ్భై పైచిలుకు లేవూ! ఇంకెంతకాలం బతుకుద్ది లేవయ్యా?" సాంబయ్య అంటీ అంటనట్టు అనేశాడు. ఆ వార్తలో ప్రత్యేకత ఏమీ లేనట్టూ, దాంతో తనకేం సంబంధం లేనట్టూ, ముఖం పెట్టి, చంకలో వున్న కొడుకును ముద్దాడటం మొదలు పెట్టాడు.

కనకయ్య పని రబ్బరు బొమ్మలోంచి గాలి తీసేసినట్లయింది. కాసేపు గట్టిగా గాలి పీల్చుకొని, వదిలి, పుంజుకొని సాంబయ్యను నిలదీసినట్లు అడిగాడు:

''ఏం సాంబయ్యా! మనోవర్తి పొలం పదెకరాలు కొనే ఉద్దేశ్యం మానుకున్నావా?''

''నీ గత్తర దొంగల్దోల! ఏంటి కనకయ్యా తొందర? అవతల మనిషి ఇంకా...''

''ఆఁ, ముసల్ది సచ్చిందాకా ఆ పొలం అట్టాగే వుంటదనుకుంటున్నావా? అప్పుడే బేరం కూడా మొగ్గుకొచ్చింది.'' కనకయ్య సాంబయ్యమీద మారణాస్త్రం లాంటిదే ప్రయోగించాడు.

సాంబయ్య చుట్టూ కట్టుకొన్న గోడ పెచ్చులు పెచ్చులుగా వూడి రాలి పడి పోయినట్లయింది. కొడుకును ఇంట్లో వదిలి పైపంచ భుజాన వేసుకొని, ఇంత పొగాకు చేత్తో పట్టుకొని బయటకువచ్చాడు.

కనకయ్య ధీమాగా అరుగుమీద కూర్చొని కాలిబొటనవేలు ఆడించసాగాడు. ఇంత పొగాకు కనకయ్య మీదకు విసిరి సాంబయ్య అడిగాడు:

''కనకయ్యా! ఇంతకీ ఏంది కత?''

''వీరభద్రయ్యగారి కొడుకు బలరామయ్య లేడూ? అప్పుడే వడ్లమూడి వెళ్ళాడంట.'' చుట్టమొన కొరికి ఊస్తూ చెప్పాడు కనకయ్య.

సాంబయ్య చుట్ట వెలిగించుకొని ''ఇదిగో చూడు కనకయ్యా! ఎంత మనవర్తికి వారసులయితే మాత్రం మనిషి ఇంకా ఆడవుండగానే బేరం పెడ్తారంటావా?'' అన్నాడు.

''కాంతమ్మ భర్త తమ్ముడి కొడుకు పైలా పచ్చీసు మనిషి. బస్తీలుపట్టి తిరుగుతుంటాడ్లే! అయినకాడికి అమ్మేరకం. వున్నదంతా ఆర్పి గుంటకాడినక్కలా ఆ ముసలమ్మ చావుకోసం ఎదురుచూస్తూ కూర్చున్నాడు. ఇక్కడ ముసలమ్మను కింద పెట్టగానే బలరామయ్య మన ఊరి పొలిమేర దాటాడు.''

''ఎట్టెట్టా!''సాంబయ్య మెత్తపడిపోయాడు. చేతికందింది కాస్తా బలరామయ్య కొట్టేస్తాడేమోనని జంకు పట్టుకొంది.

''ఆ మరేమిటి? మూటమీద మూటలుగట్టి, నెత్తిమీన చుక్కలు లెక్కలు పెట్టుకొనే మనిషనుకొన్నావా బలరామయ్య? ఏదో కాడిగట్టు పొలం, మీ తండ్రి హయాం నుంచి దానిమీద బతికినవాళ్ళు! దానిమీద మనసున్నవాళ్ళు కదా అని నేను కళ్ళల్లో వత్తులు వేసుకొని, ఆ లావాదేవీలు గమనిస్తున్నామరి! ఇదంతా ఎవరికోసం చేస్తున్నానంటావ్ సాంబయ్యా!''

''ఆ మాట నేను కాదన్నానటయ్యా?''గుటకమింగి అన్నాడు సాంబయ్య.

''ఏదో! మన సాంబయ్యకు ఎలా అయినా ఆ పొలం కలిస్తే బాగుంటుందనికానీ, లేకపోతే ఈపాటికి, ఏదీ, ఈపాటికి ఆ బలరామయ్యకే బేరం పైసలుచేసి, నాలుగు పైసలు కళ్ళచూసేవాణ్ణా కాదా? నువ్వే చెప్పు సాంబయ్యా?''

''అంతవరకెందుకులే కనకయ్యా? నీ మాట నేనెప్పుడయినా తోసేశానా? చెప్పు! నీ సలహా సంప్రదింపులు లేకుండా ఒక్క వ్యవహారం చెయ్యలేదుగదయ్యా! అది నీకు తెలవదా ఏం?''

''సరేలే! వట్టి మాటలెందుగ్గానీ, ఇంతకీ కాంతమ్మ మనవర్తి చేను నీక్కావాలా? వద్దా? తేల్చి చెప్పు?''కనకయ్య కరుగ్గానే అన్నాడు.

''అదేదో నువ్వే చూడు!''సాంబయ్య తన ముక్కుతాళ్ళు పూర్తిగా కనకయ్య చేతుల్లో పెట్టాడు.

''అయితే బయలుదేరు. ఆ బలరామయ్య వడ్లమూడి వదలివచ్చేముందే మనం అక్కడ వుండాలి! ఇక మిగతా భాగోతం నేను నడుపుతా. నువ్వట్టా చూస్తా వుండు!''

సాంబయ్య చొక్కా తగిలించుకొని, కర్ర తీసుకొని బయలుదేరాడు.

''బయానాకు డబ్బు తెస్తున్నావా? వట్టి చేతులు ఆడించుకుంటూ వస్తున్నావా?'' ఓ చురక విసిరాడు కనకయ్య సాంబయ్యమీదకు.

మొలపంచన దోపిన మూటను ఓసారి తడివిచూసుకొని సాంబయ్య సాలోచనగా అన్నాడు:

''ఇంతకీ ఆ ముసలమ్మ చావకపోతేనో?''

''ఆ, చావక ఉట్టిగట్టుకొని ఏలాడ్తది! పదవయ్యా! నువ్వూ నీ అపశకునపుమాటలూను!''అంటూ కనకయ్య వడ్లమూడి మట్టిరోడ్డు ఎక్కాడు.

అలా వెళ్ళిన సాంబయ్యా, కనకయ్యా వడ్లమూళ్ళో మూడురోజులు ఉండి పోవాల్సివచ్చింది. ఇంతకీ బలరామయ్య ఆ ఊరు అసలు రానేలేదు. బలరామయ్య బస్తీకి వెళ్ళాడని తెలుసుకున్న కనకయ్య ఈ విత్తనం వేసి సాంబయ్యకు పురెక్కించాడు. కాంతమ్మ వారసుడు పాపారావుతో, బలరామయ్య పొలం బేరం ఆడి వెళ్ళినట్లు చెప్పమన్నాడు కనకయ్య. ఇద్దర్నీ – అమ్మేవాణ్ణీ కొనేవాణ్ణీ కిందా మీదా పెట్టి పొలం బేరం కుదిర్చాడు కనకయ్య. కనకయ్య చెప్పినట్టు పాపారావు పొలం అయిన కాడికి అమ్ముకుపోయేరకంగా కన్పించలేదు సాంబయ్యకు. తను పెడదామన్నరేటుకంటే ఎకరానికి రెండొందలు ఎక్కువే చెప్పాడు. సాంబయ్య తలకిందులైపోయాడు. కనకయ్యను కసురుకున్నాడు. ఆ బలరామయ్యవల్లే ఇదంతా అయిందనీ, పాపారావు రేటు పెంచాడనీ, లేనిమనిషిమీద తోసేశాడు కనకయ్య.

ఏమయినా బంగారంలాంటి భూమి! తన వంశానికి అచ్చి వచ్చింది. ఆ భూమిచేసే తన తండ్రి బాగుపడ్డాడు. పైగా కాడిగట్టు పొలం. ఆ భూమిమీదవున్న మమకారం, ఆస్తి పెంచుకోవాలన్న తాపత్రయం సాంబయ్యను ముందుకుతోసినై. ఆలస్యం అయితే చెయ్యి జారిపోతుందని అనుక్షణం బెదిరించసాగాడు కనకయ్య.

బేరం ఖాయమయింది. బలవంతంమీద మొలన ఉన్న మూటవిప్పి పైకం లెఖ్ఖపెట్టి బయానా ఇచ్చాడు సాంబయ్య. బతుకుజీవుడా అన్నట్టు నిట్టూర్చాడు కనకయ్య. అయితే కనకయ్య అనుకొన్నట్టు, సాంబయ్య ఆశించినట్టు కాంతమ్మ మూడురోజుల్లో చనిపోలేదు. మళ్ళీ పుంజుకుందని మంచంమీద వేశారు.

అది తెలిసి పాపారావు బస్తీకి ప్రయాణం అయాడు. బయానా డబ్బులు

జేబులో వేసుకొని, సాంబయ్యా, కనకయ్యా కాళ్ళీడ్చుకుంటూ ఇంటిముఖం పట్టారు. త్రోవలో సాంబయ్య కనకయ్యను చెడామడా తిట్టాడు.

''చస్తది చస్తది అన్నావ్? ఆ ముండ చావలేదు. ఈ ముండాకొడుకేమో బిళ్లకుడుముల్లాంటి రూపాయలు జేబులో వేసుకొని వెళ్ళాడు. ఆ ముండ ఎప్పుడు చస్తదో? మళ్ళీ ఈ గాడ్డికొడుకు మనకెక్కడ దొరుకుతాడో? ఈ తొలేకాశినాటికి భూమి స్వాధీనం కాకపోతే అంతా నష్టమే. వచ్చే పంటమీద ఆశపడే ఇంత ధర పెట్టా మరి!''

కనకయ్య కుక్కిన పేనులా మాట్లాడకుండా సాంబయ్య వెనకే నడిచి ఊరు చేరాడు.

రోజూ సాంబయ్య పొలం వెళ్ళేముందూ, పొలంనుంచి వచ్చేప్పుడూ, అటు కనకయ్య ఇంటిమీదుగా వెళ్తూ కాంతమ్మ ఇంట్లోకి తొంగిచూసి, ఆమె ఆరోగ్యాన్ని గురించి వాకబుచేసి పోతూవుండేవాడు. సాంబయ్య మనాది పడి పోయాడు. కూలీలమీదా, ఇంట్లో ముసలమ్మమీద విరుచుకుపడుతూండేవాడు.

నెలరోజులు తిరక్కముందే ఓ రోజు కనకయ్య గాలివాటుగా వచ్చి సాంబయ్య ఇంట్లో పడ్డాడు.

''ఈసారి ఖాయం! దేవుడు దిగొచ్చినా ఆ కాంతమ్మ యీసారి బతకదు. అసలిప్పటికి అంతా అయిపోయి వుండాలి.'' వగరుస్తూ చెప్పాడు కనకయ్య.

సాంబయ్యకు చర్రున కోపం వచ్చింది. మళ్ళీ డబ్బు అవసరమై గుంజుకుపోవటానికి కనకయ్య ఎత్తు వేస్తున్నాడనుకున్నాడు.

''ఆ కాంతమ్మ నిన్నూ నన్నూ వల్లకాటికి సాగనంపిగాని తను పోదు!''

సాంబయ్య మాటలకు కనకయ్య గుండెలు చిక్కపట్టినై. తన చావనేసరికి కనకయ్య నిజంగా చావంచే ఏమిటో ఆలోచిస్తున్నట్టున్నాడు.

చీకటి పడుతుండగా కాంతమ్మ శవం సాంబయ్య ఇంటిముందునుంచి వెళ్ళింది. మోసేవాళ్ళ కుదుపులకు శవం తల ఊగుతూ నోరు తెరుచుకొని, నిలబడ్డ సాంబయ్య కనకయ్యలకేసి చూసింది.

''సాంబయ్యా! అదృష్టవంతుడివి''అన్నట్టు కనకయ్య సాంబయ్యకేసి చూశాడు.

కాంతమ్మ చచ్చిన పదిరోజులకే పాపారావును పట్టుకొని పొలం రిజిష్టరు చేయించుకున్నాడు. పొలం స్వాధీనమయిన రాత్రి రెండు ఝాములదాకా ఐదెకరాల పొలంగట్టు తెగగొట్టి తన పొలంతో కలుపుకున్నాడు సాంబయ్య. గనెంమీద నిలబడి మొత్తం పొలాన్ని చూసుకొన్నాడు. తొమ్మిది ఎకరాల పొలం! సుక్షేత్రమయిన మాగాణి. అది తనది! బంగారం పండిస్తాడు. తన కొడుకు వెంకటపతి అదృష్టజాతకుడు. తొమ్మిదెకరాల మాగాణి! మూడెకరాల మెట్ట! వాడు పెరిగి పెద్దవాడయి ప్రయోజకుడయేసరికి తన ఆస్తిని ఇంతకు నాలుగింతలు చెయ్యగలడు.

దప్పికగొన్న వాడికి నీళ్ళిస్తే దాహం తీరుతుంది. కాని సాంబయ్యకు పట్టుకొంది

భూమిదాహం. అది తాగినకొద్దీ పెరగసాగింది. ఆ రాత్రి కొడుకుని పక్కలో వేసుకొని పడుకున్నాడు సాంబయ్య.

పొలం దమ్ముచేసి నాట్లు వేయించాడు సాంబయ్య. మెట్టచేలో వేరుసెనగ విత్తులు చల్లాడు. ఈ సంవత్సరం దేవుడనుగ్రహిస్తే తొమ్మిదెకరాల మాగాణీ, మూడెకరాల మెట్టా బాగా పండితే, మళ్లీ డబ్బు నిలవచేసుకోవచ్చు. ఉన్న నిలవంతా పొలం కొనటానికే అయిపోయింది. ఎన్నో రోజుల తర్వాత భోషాణంలో వున్న కొయ్యపెట్టె ఖాళీ అయింది. మళ్ళీ దాన్ని నింపేదాకా తనకు నిద్రపట్టదు.

అన్నం తిని మీసాలు తుడుచుకుంటున్న సాంబయ్యకు కనకయ్య రావటం కన్పించింది. పొలం కొన్నదగ్గర్నుంచీ అంత అభిమానం చూపించటంలేదు కనకయ్యమీద సాంబయ్య. ప్రస్తుతం తన దగ్గర నిలువ రొఖ్ఖం లేదు. ఇప్పట్లో బేరసారాలు తను చేసేది ఏమీ లేదు. మాసూలు అయింతర్వాత నాలుగురోజులు ధాన్యం మిల్లుకు తోలేప్పుడు తప్ప కనకయ్యతో పనిలేదు. కనకయ్యను పూసుకుతిరిగినా, మాట్లాడినా నష్టంతప్ప లాభంలేదు. పొగాకుకాడ దగ్గిరనుంచీ తిండిగింజలదాకా అప్పూ సొప్పూ అంటూ గుంజుకుపోతాడు. ఇహ డబ్బు సంగతి సరేసరి! రూపాయలు కరిగించుకు తాగుతాడేమో మరి! వీడి కడుపుడక! ఎప్పుడూ ఆలోపాలోమంటూ ఉంటాడు.

లోపలకు దూసుకువస్తున్న కనకయ్యను చూసి తుండుగుడ్డ భుజాన వేసుకొని గబగబా బయటకు వచ్చాడు సాంబయ్య.

''అదేంటి సాంబయ్యా! నేను నీకోసం ఇంట్లోకి వస్తావుంటే నువ్వేమో వీధిలోకి పోతావు?''

''గరువున తాటిమట్టలు కొట్టిస్తున్నా. క్షణం లేకపోతే తలో మట్టా లాక్కుపోతారు కనకయ్యా! నీకు తెలియందేముంది?'' అంటూ సాంబయ్య కనకయ్యకేసి చూడకుండానే వీధిలోకి వచ్చి ముందుకు నడక సాగించాడు. వీధిమలుపు తిరిగాక వెనక్కు తిరిగి చూశాడు.

కనకయ్యను తప్పించుకున్నాననుకొన్న సాంబయ్య నిరాశచెందాడు. పిల్లిలా కనకయ్య సాంబయ్యను అనుసరిస్తున్నాడు.

కనకయ్యను గరువుదాకా రానిస్తే పది తాటిమట్టలూ, గులకలూ మోపు కట్టక మానడు. వట్టిచేతులతో తిరిగిపోవటం కనకయ్య వంశంలోనే లేదు. ఎలాగయినా కనకయ్యను అక్కడే వదిలించుకోవటం మంచిదని తోచిన సాంబయ్య చటుక్కున ఆగి నిలబడి అన్నాడు:

''అరెరే, కనకయ్యా! నువ్వటోయ్ వెనక నడిచేది? నువ్వప్పుడే వెళ్ళిపోయావనుకుంటున్నాను, చెప్పొద్దూ? ఏం సంగతి?''

''గరువు పొలానికేగా? ఏంలేదు. నేనూ అటే వస్తున్నా పద!'' కనకయ్య మామూలుగా అన్నట్టు అన్నాడు.

సాంబయ్య అనుమానం దృఢపడింది. వీడు తాటిజిబులూ, మట్టలూ మోపుకట్టందే వదలడు ఇవ్వాళ!

''ఈ ఏడు తాటాకుతోపాటు గులకా, మట్టాకూడా బేరం ఇచ్చేసాను'' అన్నాడు సాంబయ్య.

''నీ గులకా మట్టా ఎవడిక్కావాలయ్యా?''విదిలించినట్టు అని కనకయ్య సాంబయ్య ముఖంలోకి చూశాడు.

నొసలు ఎగరేసి, కాలు జాడించి నడుస్తూ మళ్ళీ అన్నాడు కనకయ్య:

''గంగానమ్మ దిబ్బ దిగువున పన్నెండెకరాల మెట్టచేనువుంది చూడూ?''

''ఏదీ? ఆ డొంకమలుపులో వున్నదేగా?''

''ఆఁ! అదే - పరమయ్య మనవడిది!''

''వట్టి నాసిచేను. రాయిరప్పా! అదెవడు కొంటాడయ్యా తలకుమాసినోడు!''అన్నాడు సాంబయ్య. ఎటుదిరిగీ సాంబయ్య దగ్గర డబ్బులేదు. కొనే ఎత్తుగానీ, ఉద్దేశ్యంగానీ అతనికి లేదు. అందుకనే ఆ మాట అన్నాడు. అయినా సాంబయ్య అన్నదాంట్లో కొంత నిజం లేకపోలేదు.

కనకయ్య సాంబయ్య ముఖంలోకి వ్యంగ్యంగా చూసి గూళ్ళెగరేస్తూ అన్నాడు:

''ఇదుగో సాంబయ్యా! ఎద్దుముడ్డి పొడుచుకొనేవాడికి నీకేం తెలుసు, వ్యవహార లక్షణం?''

కనకయ్య మాటల్లో, ప్రవర్తనలో ఏదో పెద్ద రహస్యం ఇమిడి వుందని సాంబయ్య పసికట్టాడు. అలా సాంబయ్యకు అనుమానాలూ, ఆశలూ కల్పించటంలో కనకయ్య కృతకృత్యుడయాడు.

''నువ్వు నీ కమీసన్ కొట్టటానికి సవాలక్ష మాటలు చెబుతావ్! ఎవడు నమ్ముతాడయ్యా నీ మాటలు?'' సాంబయ్య మాటల్లో కరకుతనమున్నా అనే ధోరణి అతి సౌమ్యంగానే వుంది. అలా వుంటేగాని కనకయ్య దారికి రాడని తెలుసు.

''నా మాటలు నమ్మి నువ్వు చెడిందేమిటో చెప్పయ్యా సాంబయ్యా? నాది ముష్టి కమీషను! సంవత్సరమంతా సంపాదించినా ఒక్క పిల్లముండ పెళ్ళికూడా చేయలేకపోతున్నా! ఆ కాంతమ్మ మనవర్తి పొలం బలరామయ్య కిప్పిస్తే ఐదొందలకు తక్కువ కాకుండా ముట్టేది. పిల్లదాని పెళ్ళి ఎల్లమారిపోయేది!''

''ఏంది కనకయ్యా? అక్కడికి నువ్వేదో నాకు ఊరికినే చేసినట్టు మాట్లాడుతున్నావ్? అటూ ఇటూ కూడా గుంజావుగదయ్యా?''

''ఏందయ్యా గుంజింది? అణా, పరకా పాతబాకీలు దగ్గిరనుంచి లెఖ్ఖలు కట్టి ఇరగ్గోసి కదయ్యా ఇచ్చావూ?'' కోపాన్ని నటిస్తూ, ''ఇహ చూస్తే లాభసాటి పొలాల బేరం నీ దగ్గిరకు తీసుకురాను''అన్నట్లు మాట్లాడటం మొదలుపెట్టాడు కనకయ్య.

''ఇదిగో కనకయ్యా! కొత్తదయినా పాతదయినా బాకీ బాకీయేగదా?

ఇహనెప్పుడూ నా దగ్గరకు ఏ అవసరానికీ రానివాడిలా మాట్లాడతావేం?" బాగా తగ్గి అన్నాడు సాంబయ్య.

మాట జారాడు. తన పొరపాటును గ్రహించాడు సాంబయ్య. కనకయ్యకు తను అలుసు ఇచ్చినట్టయిపోయిందని మధనపడి, అయినా కనకయ్యతో తనకు అవసరాలు తప్పవుకదా అని సర్దిచెప్పుకొన్నాడు.

ఇనుము మెత్తబడింది. కనకయ్య సమ్మెట ఎత్తాడు.

''చూడు సాంబయ్యా! ఆ వాగువొడ్డు తుమ్మలబీడు పక్కది ఎవరిది?" అడిగాడు కనకయ్య.

''ఏదీ? ఆ తుమ్మలబీడు పక్కదా? నాకు తెలిసింతర్వాత అందులో నాగలిక్కరు మోపినట్లు నేను చూడలేదు. తుప్పపొదలు తప్ప అందులో ఏముందయ్యా? ఏంటి కనకయ్యోయ్! ఇయ్యాళ నీ చూపంతా ఎందుకూ కొరగాని భూములమీదకు పోతోంది? ఎవడ్ని ముంచాలనయ్యా?"

''ముంచుతానో తేల్చుతానో చూస్తూ వుండు. అది బంగారం కాబోతుంది - బంగారం!" ఈసారి కనకయ్యకు నిజంగానే కోపం వచ్చింది.

''నీలాటి పిసినారికి అంత అదృష్టం ఎట్లా వస్తుందయ్యా? అదృష్టజాతకుడు ఎవడో కొంటాడు ఆ పొలం అంతా! రెండేళ్ళు తిరిగేసరికి - చూడు.....నువ్వు కొన్న కాంతమ్మ పొలం, దానికి బలాదూరు కాకపోతే....నీ చెప్పు నా మెళ్ళో తగిలించు....."

సాంబయ్య బిత్తరపోయాడు.

''ఏందీ? నీకేమయినా పిచ్చా? నక్కకూ నాగలోకానికీ సంబంధం ఏమిటి? పనికిరాని నాపచేనును నా మాగాణీతో పోటీ పెడ్తారా?"

''ఆ! నవ్విన నాపచేనే మాగాణీ అవబోతుందయ్యా పిచ్చివాడా!"అని కనకయ్య నాలుక్కరచుకొన్నాడు.

సాంబయ్య అయోమయంలో పడిపోయాడు. ఎంత ఆలోచించినా బుర్రకు తట్టటంలేదు.

ఇందులో ఏదో కిటుకు వుంది. కనకయ్య సామాన్యుడు కాడు.

''తస్సాదియ్యా! ఇదంతా మాగాణీ అవటమే? భగీరథుడెవరన్నా గంగ నెత్తుకొని దిగివస్తున్నాడా?"బుర్ర బద్దలుకొట్టుకొని ఆలోచించగా సాంబయ్య మాట్లాడగలిగింది అది.

''ఆ! సాక్షాత్తూ ఆ గంగమ్మతల్లే వస్తున్నాదయ్యా! కాలవ పడబోతుందయ్యా, కాలవ!"

సాంబయ్య ఠక్కున ఆగి నిలబడ్డాడు.

''నిజంగా కాలువ వస్తోందా? నీకెవరు చెప్పారు? ఎట్టా తెలిసిందీ?"

''మా బావమరిది తమ్ముడు రెవిన్యూలో పనిచేస్తున్నాడు కదయ్యా! వాడు చూసేది ఆ కాలవకు సంబంధించిన సెక్షనేనట." గర్వంగా చెప్పాడు కనకయ్య.

''ఎప్పుడు తెలిసిందేమిటీ సంగతి?''

''ఎప్పుడో ఎక్కడయ్యా? రాత్రే మావాడు వచ్చాడు. తెల్లారిలేచి ఇట్లా పొలాలమీద పడ్డాను. వాడు కొన్ని సర్వే నెంబర్లు ఇచ్చాడు. అటునుంచి కాలవ పోతుందట." అని కనకయ్య సాంబయ్యను ఎగాదిగా పరిశీలనగా చూశాడు. సాంబయ్య తన తోవలో పడుతున్నట్టు తోచాక మళ్ళీ అందుకొన్నాడు కనకయ్య:

''ఈ సంగతి ఇంకా మనవాళ్ళెవరికీ తెలియదు. ఆ బలరామయ్య చెవున వేస్తే ధరలు పెరక్కముందే ఓ ఏభయ్ ఎకరాలన్నా కొనుక్కుంటాడు."

''కనకయ్యా! నువ్వేదో తెలివికలవాడివనుకున్నాను"అన్నాడు సాంబయ్య మొలపంచ బిగించుకుంటూ.

''ఏం?''

''నీ కసలు బుద్ధి లేదయ్యా?'' తలగుడ్డ బిగించుకుంటూ మందలించినట్లు సాంబయ్య అన్నాడు.

''ఆ మాట నిజమే సాంబయ్యా! లేకపోతే నిన్ను పట్టుకు వేలాడతానా?''

''నాకు నువ్వూ నీకు నేనూకాక ఏమయిపోతాం కనకయ్యా? ఆడపిల్లలు గలవాడివి. అదనుచూసి నాలుగు డబ్బులు వెనకేసుకో." తన మాటలు తనకే కొత్తగా తోచాయి సాంబయ్యకు.

కనకయ్యకు తను చెప్పాల్సిన అవసరంలేదు. అయినా ఈసారి కనకయ్య తప్పటడుగు వేసినట్లు అనిపించింది. సాంబయ్యలో వేళ్ళు తన్నిన స్వార్థం, భూమిమీద ఉన్న కాపీనం చిగురించి మొగ్గలు తొడిగాయి.

''నీ దగ్గరేముందయ్యా ఇంకా? ఉన్న రొఖ్ఖం అంతా కాంతమ్మ పొలం కొంటానికే సరిపోయిందన్నావుగా?" కనకయ్య సాంబయ్యను పూర్తిగా తన తోవలోకి లాక్కొచ్చాడు.

''ఆ మాట నిజమే కనకయ్యా! కాని నువ్వు తల్చుకుంటే అడ్డేముంది?'' నువ్వే శరణ్యం అన్నట్లు మాట్లాడాడు సాంబయ్య.

''ఈ కాలువ సంగతి అందరికీ తెలిసేముందే ఇక్కడ భూమి కొన్నవాడిదే అదృష్టం. అంతా బంగారమే!'' అన్నాడు కనకయ్య.

''నేను చెప్పేదీ అదే కదా? ఈ సంగతి మనమధ్యనే ఉంచు మరి! మనకు పోటీ లేకుండా చూడు. పంట చేతికొచ్చేదాకా ఈ రహస్యం దాచగలిగావంటే నీ ఋణం వుంచుకోను కనకయ్యా! ఎట్లా లేదన్నా ఈ సంవత్సరం ఇరవైపుట్ల ధాన్యం ఇంటికొస్తది. ఏభయ్‌కంటె ఇప్పుడు మెట్టపొలానికి పెట్టేవాడులేడు. తుమ్మలబీటి పక్కదయితే ఇంకో పది తగ్గొచ్చు. ఏమంటావు కనకయ్యా?''

కనకయ్య ఆలోచనలో పడినట్టు నటించసాగాడు. కొంచెంసేపు మౌనం వహించి, తర్వాత తల పంకించి అన్నాడు:

''ఇది సర్కారుతో పని. మనం దాచాలంటే మాత్రం దాగుతుందా సాంబయ్యా?'' నొసలెగరేశాడు కనకయ్య.

‘‘సర్కారులో వుంది నీ బావమర్ది తమ్ముడేనంటివిగా? ఆ మాత్రం చెయ్యడా ఏం నువ్వు చెబితే?’’ ముఖం చిట్లించాడు సాంబయ్య.

‘‘అహా! మన మాట వినడనికాదనుకో. వాడూ నాలుగు డబ్బులు తెచ్చుకునేవాడేగదా అని ఆలోచిస్తున్నాను.’’

కనకయ్య చెప్పినదాంట్లో బేసబబు ఏమీ కనిపించలేదు సాంబయ్యకు. అయితే కనకయ్య అప్పుడే డబ్బులుకక్కించే ప్రయత్నంలో వున్నట్టనిపించింది. ఆమాత్రం లాభంలేంది వాళ్ళుమాత్రం ఎందుకు తనకు సహాయం చేస్తారు?

‘‘అదంతా మనలో మనం చూసుకుందాంలే! సరే! మళ్ళీ సాయంకాలం కన్పిస్తావుగా? జాగ్రత్త, ఈ సంగతి ఊళ్ళో ఎవరికీ పొక్కకూడదు!’’

‘‘పెందలాడే వస్తావుగా!’’ అన్నాడు కనకయ్య.

‘‘పొద్దుకూకే లోపలే వస్తా!’’ అని సాంబయ్య పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ, చేతిలో కర్ర ఊపుకుంటూ తాటితోపుకేసి నడిచాడు. కనకయ్య వదులుగా వున్న జుట్టు గట్టిగా కట్టుకుని ఊళ్ళోకి తిరిగి వచ్చాడు.

తాటితోపులోని ఆకూ, మట్టలమీద సాంబయ్యదృష్టి నిలవటంలేదు. ఏసోబుకు అజమాయిషీ అప్పగించి, కనకయ్య చెప్పిన పొలాలన్నీ తిరిగి చూసొచ్చాడు. కాలవ పడితే మాగాణి కాబోయే భూమంతా తిరిగి చూసుకొన్నాడు. అందులో బీదా బిక్కీ, డబ్బు అవసరాలతో కుంగిపోయే కుటుంబాలవాళ్ళ పొలాలన్నీ తిరిగి తిరిగి ఎంచుకొన్నాడు. సాయంకాలం అయేసరికి తాటితోపులోకి వచ్చి ఆకులూ, మట్టలూ పేర్పించి, ఓ మోపెడు మట్టలూ, గులకలూ, విడివిడిగా మోపులు కట్టించి ఏసోబు నెత్తినపెట్టి సాంబయ్య బయలుదేరాడు.

ఏసోబు వెంటరాగా సాంబయ్య నేరుగా కనకయ్య ఇంటికొచ్చాడు. అప్పుడే బయటకు వెళ్ళబోతున్న కనకయ్య సాంబయ్యను చూసి ఉక్కిరిబిక్కిరి అయిపోయాడు. ఏసోబు నెత్తిన వున్న తాటి మట్టల మోపు తానే స్వయంగా దించి, కనకయ్య దొడ్లో వేశాడు సాంబయ్య. ‘‘సాంబయ్య మంచి వూపులో వున్నాడు. ఈ రోజుకు తాటిమట్టలతోనే సరిపెడతాడా ఏం ఖర్మ!’’అనే ఆలోచన వచ్చింది కనకయ్యకు.

ఇంటిముందు మంచంవాల్చి సగౌరవంగా సాంబయ్యను కూర్చోబెట్టాడు కనకయ్య.

‘‘మీ ఇంటికే బయలుదేరా! సమయానికి నువ్వే వచ్చావ్?’’ అన్నాడు కనకయ్య.

పెద్దపిల్లను కేకవేసి మంచినీళ్ళు తెప్పించాడు. ఆ పిల్ల ఖాళీచెంబు తీసుకెళుతుంటే –

‘‘ఇదే మా పెద్దమ్మాయి. లగ్నాలు పెట్టుకొన్నాం. అయిన సంబంధమే. అయినా పెళ్ళి ఖర్చులు వుండనే వున్నాయిగా!’’ ఉండలోనుంచి దారాన్ని బయటకు లాగాడు కనకయ్య.

‘‘పెళ్ళెప్పుడు?’’ సాంబయ్య అడిగాడు.

‘‘ఎంతో గడువు లేదు’’ వేళ్ళు లెఖ్కవేసి ‘‘ఇంకా ఇరవై రోజులుంది. నాకు

చేతనయింది నేను సంతన చేసుకున్నాను. మీ వంతు అయిదు వందలు!" అన్నాడు కనకయ్య.

సాంబయ్య గొంతులో ఉంగిడి పడ్డట్టు అయింది. ఐదు వందలు! ఇప్పుడు తన దగ్గిర ఐదుకాసులన్నా లేవు!

''ఏమిటి కనకయ్యా, అంత దగ్గిర్లో లగ్గాలు పెట్టుకున్నారు? ఎటూ కాని సమయమే? డబ్బుకు కటకటలాడిపోతున్నారు జనం. ఓ మూణ్ణెల్లు ఆగలేవా?"నసిగాడు సాంబయ్య.

''అవతలవాళ్ళు తొందరపెడుతుంటే తప్పనిసరి అయి తల వూపాను." కనకయ్య ఓ పట్టు పట్టేట్టే అనిపించింది సాంబయ్యకు.

తనను పెద్ద చిక్కులోనే పడేశాడు. తను కాదంటే ఈ రాత్రికే బలరామయ్య దగ్గిరకు పరుగెత్తేలా వున్నాడు! అయినకాడికి ఆ బలరామయ్య - అదునైన పొలం అంతా కొనేస్తాడు. ఏం చేయడం?

''యీ ఏడే గదా కాంతమ్మ పొలం కొన్నాను? మళ్ళీ పంటవచ్చే దాకా నా చేతిలో దమ్మిడీ తిరగదే? నన్నిట్టా అడకత్తెరలో పడేస్తే ఎట్టా చెప్పు?" ప్రాధేయపడుతూ అన్నాడు సాంబయ్య.

కనకయ్య సాంబయ్య పరిస్థితికి సానుభూతి చూపించాడు.

''నాకు తెలియందేముంది సాంబయ్యా, నీ పరిస్థితి? దానికేదన్నా ఉపాయం ఆలోచించాలి మరి!"

''నన్ను కోసినా కానీ దొరకదు. ఆ ఉపాయమేదో నువ్వే చూడు మరి."

కనకయ్య ఆలోచించినట్టు నటించాడు. అంతకుముందే ఆలోచించి పెట్టుకున్న విషయాన్ని బయటపెట్టాడు:

''మన ధాన్యం కొనే శేషావతారం లేడూ?"

''ఉంటే? ధాన్యం మిల్లుచేరందే పైకం ఎట్లా ఇస్తాడూ?"

''అట్టా ఇచ్చేకాడికి యీ కనకయ్య ఎందుకు? అంతా నాకు వదులు సాంబయ్యా, రేపేపాటికి రూపాయలు నీ చేతిలో రాల్తాయ్!"

సాంబయ్య ఆశ్చర్యంలో మునిగిపోయాడు, కనకయ్య భరోసా చూసి. వెంటనే అనుమానపు నీడలు సాంబయ్య బుర్రలో అల్లుకుపోయాయి.

''అలువులు సులువులకు ధాన్యం కట్టుకోడు కదా?" సాంబయ్య నసిగాడు.

''నేనేం అంత వెర్రివెంగళాయి ననుకున్నావా? దానికీ ఓ పద్ధతి ఉంటుంది. ఆ వ్యవహారాలన్నీ నీకు తెలియవులే. అంతా నే చూసుకుంటాను. తెల్లవారుఝామునే బయలుదేరుదాం. సరేనా?" కనకయ్య లేచి నిలబడ్డాడు. వ్యవహారం అంతా పరిష్కరించినట్టు నిట్టూర్పు విడిచాడు.

సాంబయ్య గోవులా తల ఆడించి లేచాడు. పైపంచ దులిపి భుజాన వేసుకొని ఇంటి ముఖం పట్టాడు. ఆ రాత్రంతా ఏదో ఆలోచించాలని ప్రయత్నించాడు. కాని బుర్రకేమీ తట్టలేదు.

తెల్లవారుఝామునే కనకయ్యవచ్చి సాంబయ్యను లేపుకొని బస్తీకి తీసుకెళ్ళాడు.

సాంబయ్య బొటనవేలుకు సిరారాసి కాగితంమీద అద్దించాడు కనకయ్య. ముద్దరపడిన చోట ఊది శేషావతారం చేతికిచ్చాడు. శేషావతారం వెయ్యి రూపాయలు తెచ్చి కనకయ్య చేతిలో పెట్టాడు. ఐదువందల రూపాయలు తను జేబులో వేసుకొని, మిగతా ఐదువందల్ని ''ఇంద, లెక్క చూసుకో!'' అంటూ సాంబయ్య చేతిలో పెట్టాడు కనకయ్య.

సాంబయ్యకు ఇదంతా ఓ పట్టాన అంతుపట్టలేదు.

''ఈ ఐదువందలూ ఇప్పుడు నేనేం చేసుకోను?'' అన్నాడు అమాయకంగా సాంబయ్య.

బస్తీకి వెళ్ళగానే సాంబయ్యకు వున్న మతి సగం పోయింది. శేషావతారం, కనకయ్య మాటలు వింటుంటే ఆ మిగతా సగంకూడ పోయినట్టయింది.

''అయితే నా దగ్గిర వుంచమంటావా?'' చెయ్యిజాపుతూ అన్నాడు కనకయ్య.

''అహా, అది కాదు. ఈ డబ్బు ఏ లెఖ్ఖన ఇచ్చినట్టు? కొంచెం ఇడమర్చి చెప్పమని నే ననేది.''

''నీ తెలివి బంగారంగానూ! ఇందులో ఏముందయ్యా! రైతులందరికీ ఇచ్చే పద్ధతిలోనే నీకూ ఇచ్చా. కొత్తేముంది?'' అన్నాడు శేషావతారం.

''నే చెబుతా విను సాంబయ్యా! నీకు పండిన ధాన్యం అంతా శేషావతారం మిల్లుకు తోలాలి. ఆ రోజున్న రేటు ప్రకారమే మన ధాన్యానికి ధర కడతారు. మనకు ముందు డబ్బు ఇచ్చినందుకుగాను బస్తాకు అర్ధరూపాయి ఇరగ్గోసుకుంటాడు. అంతే!'' కనకయ్య పక్కనున్న రాసిలో గుప్పెడు వేరుశనక్కాయలు తీసుకొని వొలిచి నోట్లో వేసుకుంటూ అంత సులువుగానూ చెప్పాడు.

''బస్తాకు అర్ధరూపాయ తగ్గుతుందా? అంటే మూడొందలు బస్తాలు తోలితే నాకు నూటఏభయ్ రూపాయలు తగ్గుతాయా? పుట్టి ధాన్యం ఉట్టినే తీసుకొంటాడా శేషావతారం? ఇదేందయ్యా ఇంతన్యాయం కనకయ్యా?''

''అదంతేలే సాంబయ్యా, లే పోదాం!'' అంటూ లేచాడు కనకయ్య. మరో నాలగు గుప్పెళ్ళు శనక్కాయలు తీసి పైపంచ కొసన కట్టాడు.

మిల్లుగేటు దాటిపోతున్న కనకయ్యను శేషావతారం కేకవేశాడు. ఒక్క పరుగులో కనకయ్య శేషావతారం దగ్గిరకొచ్చి ''మళ్ళీ నీ గొడవేమిటి శేషావతారం?'' అన్నాడు గొంతు తగ్గించి సాంబయ్య వినకుండా.

''వెయ్యి రూపాయలకూ ఈ నాలుగు నెలలవడ్డీ గురించి చెప్పలేదేమయ్యా సాంబయ్యకూ?''

''మనిషి అసలే కంగారులో వున్నాడు. అది చెబితే బెదిరిపోతాడు. నువ్వుండవయ్యా! తర్వాత చూసుకుందాం'' అన్నాడు కనకయ్య.

''అది కాదు కనకయ్యా! ఆయన ముందే చెప్పలేదని తర్వాత పేచీ పెడితేనో?''

''ఆ వడ్డీ గిడ్డీ అంతా నోటులో రాసేవుంది కదయ్యా! ఆయన ఇవ్వనంటే

మాత్రం చెల్లుతుందా? నువ్వేమీ మాట్టాడక ఊరికే వుండు."

"అది సరేననుకో. ఎందుకైనా మంచిది. ఓ మాట చెబితే బాగుంటాది కదా అని?" శేషావతారం గుణిశాడు.

"ఆ సంగతి ఇంటికి పోయాక సమయం చూసుకొని నేను చెబుతాగా! నువ్వేం కంగారు పడొద్దు" అంటూన్న కనకయ్య సాంబయ్య ముందుకు రావడం చూసి గాబరా పడ్డాడు.

ఇంటికి రావడంతోనే సాంబయ్య బొడ్లో దోపిన నోట్ల పొత్తిని తీసి భద్రం చేశాడు. చొక్కా విడిచి దణ్ణానవేస్తూ "రావమ్మా! బుడ్డోడు ఎక్కడ?" అని అడిగాడు.

"మద్దేన్నటేలనుంచీ కాక తగిలింది. ముద్దకూడా తినలే, పడుండాడు!" అంది ముసలమ్మ.

సాంబయ్యకు అంతా అశుభంగా తోచింది. అసలు ఇలా డబ్బు తేవటమే ఏదో పెద్ద అరిష్టంగా వుంది! దానికితోడు యింటికొచ్చేటప్పటికి పిల్లాడు పడక వేశాడు.

సాంబయ్య ఇన్ని వేన్నీళ్ళు మీద పోసుకొని అన్నం పళ్ళెం ముందు కూర్చున్నాడు. ఆకలి దహించుకుపోతోంది. కాని అన్నంమీద మనసు నిలవటంలేదు. అన్నం అయితే మామూలుగా తినేంతే తిన్నాడు. కానీ అందులో రుచిగానీ, ఆనందంగానీ, తృప్తిగానీ పొందలేదు. ఎద్దులకు ఎండుగడ్డీ, జనపకట్టే, రెండూ కలిపి వేసి వచ్చి బరువుగా మంచంమీద వాలాడు. పక్క దుప్పటి చుట్టచుట్టి తలకింద పెట్టుకొని నిద్రపోవడానికి ప్రయత్నించాడు. పడుకొన్న అయిదు నిమిషాల్లోనే గుర్రుపెట్టి నిద్రపోయే సాంబయ్యకు ఆ రాత్రి వెంటనే నిద్ర రాలేదు. కనకయ్యా, శేషావతారం, బస్తాకు అర్ధరూపాయి కోత...మనసులో మెదిలాయి. అంతా చీకటి చీకటిగావున్న మనసులో వెలుగురేఖ ఒకటి కదులాడింది. కొత్త కాలవలో నీళ్ళు జలజలా ప్రవహిస్తున్నాయి. ఎనభై ఎకరాల మెట్ట మాగాణి అయింది. పుట్లకొద్దీ ధాన్యం బస్తాలకు ఎత్తుతున్నాడు. నాలుగామళ్ళ దూరంలోవున్న ఊళ్ళల్లో సహితం తనగురించి చెప్పకొంటున్నారు. ఊళ్ళో బలరామయ్యకంటే తనే ఆస్తిపరుడు. తన కొడుకు వెంకటపతి లక్షాధికారి. అదృష్టజాతకుడు. ఇప్పుడేకనక దుర్గి వుండివుంటే ఎంత మురిసిపోయేదో! సాంబయ్య ఆలోచనలు దుర్గమ్మమీదకు మళ్ళాయి.

ఆచారి గరళం పోసేముందు దుర్గమ్మ తనకేసి చూసిన చూపులు ఇంకా గుర్తేవున్నాయి.

"దుర్గమ్మా! నీకేం తక్కువ చేశానే? ఆనాడు డబ్బులు వృధాచేస్తే నీ కొడుక్కు ఇంత అదృష్టం ఎలా పట్టేది?" దుర్గమ్మను గురించిన ఆలోచనలన్నీ బలవంతాన వెనక్కు తోశాడు సాంబయ్య.

పొద్దున్న లేస్తూనే సాంబయ్య కనకయ్య ఇంటిమీదకెళ్ళి పడ్డాడు.

వేపపుల్ల నోట్లోనుంచి బయటకుతీసి, చేదుగా ఊసి "ఏంటి సాంబయ్యా?

ఇంత పొద్దన్నే ఊడిపడ్డావ్?" అన్నాడు కనకయ్య.

"ఇట్టాంటి వ్యవహారాల్లో జాగుచెయ్యటం మంచిది కాదు. పరమయ్య మనవడి మెట్ట బేరం చేయ్!"

కనకయ్య ఆశ్చర్యపోయాడు. సాంబయ్య ఇంత మెలుకువతో వుంటాడని ఇంతవరకు గ్రహించలేదు.

"ఏమిటి సాంబయ్యా, నీ చాదస్తం? ఐదొందల్తో ఎంత కొంటావయ్యా? కొంటే ఓ ఏభయ్ ఎకరాలు కొనిపడెయ్యాలి. నువ్వు ఐదూ పదీ కొంటానికి తాప్రతయపడితే ఏం జరుగుద్దో తెలుసా?"

"ముందుగా కొనగలిగినంత కొనేస్తే మేలుకదా అని!"

"కొంపలారిపోతాయ్! నువ్విలా కక్కుర్తిపడితే బలరామయ్య పసికట్టేస్తాడు. ఇందులో ఏదో వుందని అందరూ ఎగబడతారు. అప్పుడు నీకు అమ్మేవాడుకూడా దొరకడు."

"మళ్ళీ పంటవచ్చి మనచేతిలోకి పైకం వచ్చేదాకా యీ కాలువ సంగతి బయటపడకుండా వుంటుందంటే నాకు నమ్మకంలేదు" అంటూ సాంబయ్య కనకయ్య కళ్ళలోకి చూశాడు. అసలు సాంబయ్యకు కనకయ్యమీదే నమ్మకంలేదు. తన దగ్గర గుంజవలసిందేదో ముందే గుంజుకొన్నాడు. రేపోమాపో ఆ బలరామయ్యకూ, తోటపాలెం వెంకట్రామయ్యకు కూడా చెప్పి డబ్బు గుంజుకుంటాడు. ఇట్టా వాళ్ళిద్దర్నీ తనమీద పోటీపెడితే తను తట్టుకోలేడు. వాళ్ళు మోతుబరి ఆసాములు. లంకెలబిందెల్లో లక్ష్మి మూలుగుతోంది. వాళ్ళతో తనేం పోటీ పడగలడు! డబ్బు చేతిలో పడ్డాక కనకయ్య మనిషికాడు. అసలు అతడు తన ఇంటిచాయలకన్నా రాడు. కనకయ్యను ఆదమరిచి ఉండటానికి వీల్లేదు. తనపని అయ్యిందాకా కనకయ్యను వెన్నాడాల్సిందే మరి.

"ఏంది సాంబయ్యా! ఏదో గట్టి ఆలోచనే పెట్టుకొన్నావ్!" చెంబులో నీళ్ళు పుక్కిలించి ఉమిసి అరుగుమీదనుంచి లేచి నిలబడి అన్నాడు కనకయ్య.

"మొనగాడి చెక్కలన్నీ ఏరిపెట్టాను. మొత్తం ఏభై ఎకరాల పైచిలుకుంది. ఎకరం వందలోపు పడుతుంది ఇప్పుడయితే!"

"నీ సోది పాడుగానూ! అదంతా నిజమేనయ్యా! అంత డబ్బెక్కడుందయ్యా కొనటానికి?" చిరాగ్గా అన్నాడు కనకయ్య.

"ఆ శేషావతారం వున్నాడుగా? కాకపోతే నాలుగైదేళ్ళ పంట ఇద్దాం! చూడు మరి కనకయ్యా!"

కనకయ్య బిత్తరపోయాడు. సాంబయ్య తెగువ చూస్తుంటే కనకయ్య కాళ్ళు వణికాయి.

"ఇదిగో సాంబయ్యా! బాగా ఆలోచించే మాట్లాడుతున్నావా? తొందరపడకు." పై పంచతో ముఖం తుడుచుకొనే నెపంతో తన ముఖంలోని భావాలను కప్పుకున్నాడు కనకయ్య.

''నేనంతా ఆలోచించే వచ్చా. ఇక నీదే ఆలస్యం." తన నిర్ణయాన్ని స్పష్టంగా ప్రకటించాడు సాంబయ్య.

కనకయ్య ఇంట్లో పెళ్ళి పనులయేముందు సాంబయ్య తన వ్యవహారాలన్నీ పూర్తిచేసుకున్నాడు. శేషావతారంచేత అప్పు ఇప్పించి, సాంబయ్యచేత డెభ్భై రెండెకరాల మెట్టపొలం కొనిపించాడు కనకయ్య. సాంబయ్య గుండెలు తేలికపడ్డాయి. ఆ లావాదేవీల్లో కనకయ్యకు బాగానే ముట్టింది. వీలు చిక్కినప్పుడల్లా కొత్తగా కొన్న పొలంకి వెళ్ళి రాయీ రప్పా ఏరిపారేసి వస్తూండేవాడు సాంబయ్య. ఊళ్ళో అందరికీ ఆశ్చర్యం వేసింది - సాంబయ్య యీ పనికిరాని పొలం ఎందుకు కొన్నాడా అని! ఐదారుగురు సాంబయ్య మొహానే అడిగేశారు. సాంబయ్య ముఖావంగా ''ఏదో పడివుంటుందిలే! అవతలవాళ్ళకు డబ్బు అవసరం అని గొంతుమీద కూర్చుంటే కొన్నా!''అంటూండేవాడు.

వాళ్ళు సాంబయ్య అటువెళ్ళగానే ''కనకయ్య ఈయనకి టోపీ వేశాడు. తన ఇంట్లో పెళ్ళి పబ్బం గడుపుకొన్నాడు'' అని నవ్వుకొనేవారు.

కనకయ్య కూతురి పెళ్ళి బాగానే జరిపించాడు. సాంబయ్య పెళ్ళిలో ఇంకా ఏదైనా ఇస్తాడని ఆశపడ్డాడు కనకయ్య. కాని, సాంబయ్య కానీ రాలనివ్వలేదు.

''నా దగ్గిరేముంది ఇంకా? తలవరకూ మునిగి వున్నా'' అన్నాడు.

సాంబయ్య తను శేషావతారం దగ్గర డబ్బు తెచ్చింది ఇంకా ఎవరికీ తెలియదనే భ్రమలోనే వున్నాడు.

సంక్రాంతి పండగ వచ్చింది. సాంబయ్య ధాన్యం శేషావతారం మిల్లుకు తోలాడు. శేషావతారం డబ్బు లెక్కకట్టి నోటుమీద పన్నెండొందలకు నలభైనాలుగు తక్కువగా చెల్లువేశాడు. రెండువేలు అప్పుతీరిపోతుందని అంచనా వేసుకొని వచ్చిన సాంబయ్య బిత్తరపోయాడు. మొత్తం ఏడువేలకూ రూపాయి వడ్డీ కట్టి, వడ్డీ మినహాయించిన వైనం చెప్పాడు శేషావతారం.

''బస్తాకు అర్ధరూపాయి ఇరగ్గోసుకుంటున్నావుగా? ఇంకా ఈ వడ్డీ గిడ్డీ ఏమిటి?'' దురుసుగా అడిగాడు సాంబయ్య.

శేషావతారం నోరుతెరిచి సాంబయ్యకేసి చూశాడు. ''ఏమిటయ్యా ఇది కనకయ్యా!''అని అరిచాడు.

అప్పటికే కనకయ్య మిల్లు ఆవరణలోనుంచి వెళ్ళి ఐదునిముషాలయింది.

''ఇదుగో నోటు. కావాలంటే చదివించుకో!'' అంటూ సాంబయ్య మొహంమీద ప్రోనోటు ఆడించాడు శేషావతారం.

ఆ పట్టు వరసగా వారంరోజులు కనకయ్య సాంబయ్యకు చిక్కలేదు. సాంబయ్యపని కుడితిలోపడ్డ ఎలుక చందమయింది. ఈ లెఖ్ఖన ఎన్నేళ్ళకు అప్పుతీరుతుంది? పొలం సాగుకు ఎప్పుడు వస్తుంది? వచ్చే ఏడన్నా కాలువ పడితే రెండేళ్ళల్లో తను అప్పుతీర్చుకొని నిలతొక్కుకోగలడేమో?

# 5

వెంకటపతికి నాలుగో ఏడు వచ్చింది. అటూ ఇటూ పరుగులు తీస్తూ నడుస్తున్నాడు. మాట్లాడుతున్నాడు. కొడుకు ముద్దూ ముచ్చటా చూస్తూ తన్మయత్వం పొందాల్సిన సాంబయ్య, పరధ్యాన్నంగా పిల్లవాడికేసి చూసీచూడనట్టు చూసేవాడు. మనిషికి మనేదు ఎక్కువయింది. ఆ ఏడు పైరుమీద వుండగా గాలివాన వచ్చి పంటంతా దెబ్బతింది. కూలిగింజలకు, తిండిగింజలకు బొటాబొటిగా సరిపోయింది. మరుసటేడు పంటకు తెగులు సోకింది. ధాన్యం సగానికి సగమే రాలింది. ధాన్యం అమ్మగా వచ్చిందాంట్లో మూడోవంతు వడ్డీకే సరిపోయింది. మూడేళ్ళపంట, గింజ బీరుపోకుండా శేషావతారానికి ఇచ్చాడు. అయినా యింకా ఐదువేలకు పైచిలుకు అప్పు చూపిస్తున్నాడు శేషావతారం. ఇంకో సంవత్సరము ఇలాగే దెబ్బతింటే తను అప్పుతీర్చలేడు. మాగాణి పొలం శేషావతారానికే కట్టపెట్టాల్సివస్తుంది. ఈనగాచి నక్కలకు పెట్టినట్టయింది. దురాశకుపోయి ఋణభారాన్ని నెత్తికి ఎత్తుకున్నాడు. అదంతా ఆ కనకయ్యగాడు చేసిన మోసం! వాడు తన కొంప నిలువునా తీశాడు. ఇప్పటికి రెండేళ్ళుగా "ఇదిగో కాలువ, అదిగో వస్తుంది" అంటూ నమ్మిస్తున్నాడు.

ఇంకా ఏం కాలువ? వాడి శార్ధం! సాంబయ్యకు వళ్ళు మండిపోయింది. ముసలమ్మ పళ్ళెంలో అన్నం పెట్టింది. అన్నం ముందు కూచోబోయినవాడు, ఏదో పూనినట్టు లేచి కర్ర చేతపట్టుకొని కనకయ్య ఇంటిమీద పడ్డాడు.

అప్పుడే అన్నంతిని తేపుకుంటూ బయటకు వచ్చిన కనకయ్య సాంబయ్య వాలకం చూసి బెదిరిపోయాడు.

"ఏదయ్యా కాలువ? వస్తదీ వస్తదీ అంటూ నా కొంప నిలువునా కూల్చావ్?" నిలదీసి అడిగాడు సాంబయ్య.

"తొవ్వేవాణ్ణి నేనా ఏంటి? మా బావమరిది తమ్ముడు చెప్పాడు. నీ మీద అభిమానంతో ఆ మాట నీ చెవున వేశాను." కనకయ్యమాట పూర్తికాకముందే సాంబయ్య చేతిలోని బాణాకర్ర గాల్లోకి రివ్వున లేచింది.

కనకయ్య తలవంచి పక్కకు దూకాడు. చెవులను రాచుకుంటూ వసారా గుంజకు తగిలింది కర్ర. కప్పులోనుంచి జలజలా గుల్ల రాలింది. కిందపడ్డ బల్లి కదలకుండా నేలకు కరుచుకుపోయింది! మళ్ళీ సాంబయ్య కర్ర పైకెత్తేసరికి కనకయ్య బజార్నపడ్డాడు. సాంబయ్య గోచి బిగించి కనకయ్య వెంటపడ్డాడు. కనకయ్య షావుకారు బలరామయ్య ఇంట్లోకి జొరబడటం కన్పించిది. కసిగా కర్ర బలరామయ్య ఇంటిముందు రోడ్డుమీద బాది ఇంటికొచ్చాడు సాంబయ్య.

వంటింట్లో అన్నంమీద బోర్లించిన బుట్టను తోసేసి పళ్ళెంలో అన్నం కుక్క తినడం కనిపించింది సాంబయ్యకు. పిచ్చికోపంతో కుక్కను బాదాడు. పళ్ళెం ఎగిరి అంతదూరంలోపడి చొట్టబోయింది. గదంతా అన్నం మెతుకులు చెల్లాచెదురుగా

పడ్డాయి. నోటికాడికూడు కుక్కలపాలైంది. తనను శనేశ్వరం చుట్టుకొంది. ఆ ముసల్ది ఎక్కడ చచ్చింది? ఇట్టా, వడ్డించిన అన్నం కుక్కలపాలు చేస్తూ తనేం చేస్తున్నట్టు? తన తిండి తింటూంటే ఆ ముసలిదానిక్కూడా వళ్ళు బలిసినట్టుంది. ముప్పూటలా తిండి, సంవత్సరానికి రెండు జతలు పాడుం పంచలు - పైగా పందుం గింజలు! ఈ ముండ చేసేదేమిటి? పైగా ఇట్టాంటి పనులా?

''ఓ రావమ్మా! ఎక్కడ సచ్చావ్?'' అంటూ సాంబయ్య ఇల్లంతా వెతికాడు. పడమటింట్లో పిల్లవాడు ఆదమరచి నిద్రపోతున్నాడు. ముసలమ్మ అక్కడా లేదు. సాంబయ్యకు వళ్ళుమండిపోయింది. ఇది ఈ పాటప్పుడు ఎక్కడ చచ్చినట్లు? గొడ్ల సావిట్లోకి వచ్చి చూశాడు. అక్కడా లేదు. సాంబయ్య మనసులో అనుమానం తుమ్మముల్లులా గుచ్చుకుంది. ఈ ముసల్ది ఇంట్లో బియ్యం ఉప్పూ,పప్పూ బయటకు చేరవేయటంలేదుగదా? అందుకే తన యిల్లు గుల్లయిపోతుంది.

సావిట్లోకి వచ్చిన సాంబయ్యను చూసి ఎద్దులు ముట్టెలుచాచి గుంజుకొన్నాయి. అరెరే! ఎద్దులకు మేతవేయటంకూడా తను మర్చిపోయాడు. ఈ రోజంతా తన చుట్టూ పిశాచాలు చిందులు తొక్కుతున్నట్టుగా వుంది. ఎద్దుల మేతకోసం వాములదొడ్లోకి వచ్చిన సాంబయ్యకు పిడకలగూటి కానుకొని కూర్చొన్నట్టుగా వున్న ఓ ఆకారం కన్పించింది. పరకాయించి చూశాడు. అడుగు ముందుకు వేస్తూ - ''ఎవరా మడిసీ?'' కేక వేశాడు.

గబగబా అడుగులు ముందుకు వేశాడు. రాములమ్మలాగుంది. ఇంత రాత్రప్పుడు పిడకలగూటిదగ్గరేం చేస్తున్నట్టు? ఇంట్లో దొంగిలించిందంతా మూటగట్టి ఇక్కడ దాచి, వీలు చూసుకొని దాటేస్తున్నట్లుంది! దొంగముండ! దీన్ని నమ్మి తను ఇంతకాలం ఇంట్లో పెట్టుకొన్నాడు.

పిడకలగూటి దగ్గర కెళ్ళిన సాంబయ్య వంగి ముసలమ్మ ముఖంలోకి ముఖంపెట్టి చూశాడు. ముసలమ్మ ఉలకలేదు. పలకలేదు. అంతా దొంగెత్తువేస్తుంది. పట్టుబడేసరికి ఈ ఎత్తు వేస్తుంది ముసలమ్మ. జబ్బపట్టుకొని ఊపాడు. రామమ్మ అమాంతం సాంబయ్య చేతిమీద వాలిపోయింది. సాంబయ్య గాబరాపడ్డాడు. ముక్కు దగ్గర వేలుపెట్టి చూశాడు. గాలి పీలుస్తూనే వుంది. బతికే వుంది.

''రావమ్మా! రావమ్మా! ఏమయిందంట?''

ముసలమ్మ కళ్లు తెరిచింది. సాంబయ్య ముఖంలోకి జాలిగా చూసింది. నోరు తెరిచింది. మూతి ఓ పక్కకు తోసుకుపోయింది. మాట బయటికి పెగిలిరాలేదు. చేతులాడించటానికి ప్రయత్నించింది. ఓ చెయ్యి కదల్లేదు.

సాంబయ్య ముసలమ్మని ఇంట్లోకి చేర్చాడు. ఆవిడను కుక్కి మంచంలో పడేసి రామాచారి దగ్గరికి పరిగెత్తాడు.

రామాచారి ముసలమ్మను పరీక్షచేసి ''పక్షవాతం! లాభంలేదు'' అన్నాడు.

''అయితే ముసలమ్మ లేచి తిరగలేదన్నమాటేగా?'' తన అభిప్రాయాన్ని ప్రశ్నరూపంలో వదిలాడు సాంబయ్య.

''ఆహా! అక్షరాలా!'' అని ఆచారి నాలుగు మాత్రలూ, రెండు పొట్లాలూ ఇచ్చి సంచి చుట్టుకొని లేచి నిలబడ్డాడు.

''బియ్యం నిండుకున్నె. రేపు ఓ అర బస్తా పంపించండి సాంబయ్యగారూ!''

''అరబస్తా ధాన్యమా? ఇప్పుడు ఇబ్బందిగా ఉందే? ఉన్నవి మా తిండికే సరిపోయేట్టులేవుమరి!'' సాంబయ్య నసుగుతూ అన్నాడు.

''అదేమిటి సాంబయ్యగారూ? ఈ సంవత్సరంలో మీరిచ్చిందేమిటి? తుమ్మినా దగ్గినా వస్తున్నానా? పిల్లాడికి సుస్తీ చేసినా, ముసలమ్మకు జబ్బు చేసినా చూస్తున్నానా? మందులు మాకు మాత్రం ఊరికినే వస్తాయా?'' రామాచారి కటువుగా అన్నాడు.

సాంబయ్య మెత్తబడ్డాడు. పిల్లవాడిమాట ఎత్తేటప్పటికి సాంబయ్య గుండెలు బితుక్కుమన్నాయి.

''అఁహా! అదిగాదు ఆచార్లుగారూ! ఇవ్వననటంలేదు. ఉన్న పరిస్థితి చెప్పాను, అంతే. రేపు పంపిస్తాలే అరబస్తా. తరుగూ బొరుగూ అయితే ఆ తర్వాత నేను సర్దుకుంటానులే.''

''ఈ పొట్లాలూ, గుళికలూ అయ్యాక ముసలమ్మకు ఎట్లాగుందో చెప్పండి. తగ్గకపోతే పట్నంనుంచి మందులు తెప్పించాల్సి వుంటుంది. '' పిడుగులాంటి మాటను సాంబయ్యమీదకు విసిరి ఆచారి చక్కాపోయాడు.

నిద్రలోవున్న వెంకటపతి కలవరిస్తూ లేచి కూర్చొని బిగ్గరగా ఏడవటం మొదలుపెట్టాడు. సాంబయ్య కొడుకును భుజానవేసుకొని సముదాయించసాగాడు. ఓ అరగంట ఏడ్చి వెంకటపతి తండ్రి వడిలో నిద్రపోయాడు. తొలికోడి కూసింది. సాంబయ్య తల బరువుగా తూలిపోతోంది. కొడుకు పక్కనే మేను వాల్చాడు.

తన కేదో శని పట్టుకొంది. కొడుకు అదృష్టజాతకుడనుకొన్నాడు. కాని వాడికి ఒకో ఎడువస్తుంటే తనకు ఇబ్బందులు పెరుగుతూనే వున్నాయ్. తన కష్టార్జితమంతా శేషావతారం మిల్లులో పోస్తున్నాడు. ముసలమ్మ ఆసరాగా వుంటుందనుకొంటే అది కాస్తా మంచాన పడ్డది. ఇప్పుడు దానికిచ్చే ధాన్యం, పెట్టే తిండీ అంతా దండగే. పైగా మందులకూ, మాకులకూ ఖర్చు. అదంతా ఎవడు భరిస్తాడు? దానిక్కూడా కాచిపోసేదెవరు?

ఇంకా బాగా చీకటి వుండగానే మాలపల్లెకువెళ్ళి ఏసోబును లేపి, ముసలమ్మ సంగతి చెప్పి, ఆమెను వచ్చి తీసికెళ్ళమని అత్తవారికి కబురు పంపాడు.

తెల్లవారి చాకలిరత్తి పిల్లవాడికి నీళ్ళుపోసి ఇంటి పైపనులన్నీ చూసుకుంది. సాంబయ్య స్వయంగా ఇంతవండి పిల్లవాడికి పెట్టి, తను తిన్నాడు. ముసలమ్మ నోరు తెరచుకొని అలాగే పడివుంది.

రెండోరోజు ఉదయానికల్లా, ముసలమ్మ కూతురూ, సాంబయ్య పెద బావమరిదీ వచ్చారు.

సాంబయ్యకు బావమరిది తన తండ్రి చెప్పిన సలహా వినిపించాడు.

ముసలమ్మ కూతురు సుబ్బమ్మ ఇంట్లో వుండేట్టూ, తల్లినీ, పిల్లడ్నీ చూసుకొంటూ ఇంటిపనులన్నీ చేసుకొనేట్టూ, అందుగ్గాను ఇంకో సలకగింజలు అదనంగా సాంబయ్య ఇస్తే సరిపోతుందనీ మామగారి సలహా.

సాంబయ్య జెర్రిగొడ్డులా లేచాడు.

''ఆ ముసల్దానితో కానీ, దాని కూతురితో కానీ నాకేం పనిలేదు'' అంటూన్న సాంబయ్య కళ్ళు అప్రయత్నంగానే సుబ్బమ్మమీద పడ్డాయి! సుబ్బమ్మ ఓరగా చూసి, పైట సర్దుకొని, తల పక్కకు తిప్పుకొంది. సాంబయ్య గుండెలు గుబగుబలాడాయి. ముక్కుల్లోనుంచి వేడిగాలి బయటకొచ్చింది.

''అయితే ముసలమ్మకు రావాల్సిందేదో పడేయ్! నీకు చేసే చాకిరి ఇంకో ఊర్లో చేసుకుంటారు. మునిగిపోయిందేమీలేదు.'' రుస రుసలాడుతూ అన్నాడు సాంబయ్య బావమరిది.

''ఏంటిరా రావాల్సింది? నిరుటేడుది ఎప్పుడో ఇచ్చేసాను. పోతే జరిగే ఏడాదిలో ఒక్కనెలేగా ఆ ముసలమ్మ చేసింది? మొన్నటినుండీ మంచానే పడి వుండే! ఆవార మందూ మాకూ ఇప్పించాను. దాని కదే సరిపోయింది. నేనివ్వాల్సిందేమీ లేదు. మీరు ముసలమ్మను తీసుకెళ్ళొచ్చు.''

సాంబయ్య ముఖంలోకి తలెత్తి నేరుగా చూసింది సుబ్బమ్మ. సుబ్బమ్మ కళ్ళలోకి చూసిన సాంబయ్యకు రోమాలు నిక్కపొడిచినట్టయింది. తను తొందరపడి మాట జారాడు. సుబ్బమ్మలాంటిది ఇంట్లో వుంటే అన్నిటికీ ఉపయోగమే!

''ఇదేంది బావా? ఇంతన్యాయమా? ముసలమ్మకు ఓపిక వున్నన్నినాళ్ళూ ఊడిగం చేయించుకొని, ఇప్పుడా మనిషి మంచాన పడగానే తోసేస్తున్నావ్? ఇప్పుడేమయిపోవాలా మడిసి? ఏ వజాన బతకాలి?'' యీసడింపుగా మాట్లాడాడు బావమరిది.

సాంబయ్య ఆలోచించాడు. ఆ ఆలోచనలలో సగభాగం, వాడిపోతూ తొంగిచూస్తోన్న సుబ్బమ్మ యవ్వనం చుట్టూనే తిరిగాయి.

''ఇదిగోరా! నువ్వు చెప్పావని ఒప్పుకుంటున్నా! సుబ్బమ్మను ఇంట్లో పెట్టుకోవటానికి ఒప్పుకొంటున్నా. ఆ ముసలమ్మ కిచ్చిందే ఈ మనిషికీ ఇస్తాను. ముసలమ్మను నువ్వు తీసుకెళ్ళి, మీ ఇంట్లో పెట్టుకొని చూసుకోండి.'' రాజీగా అన్నాడు సాంబయ్య.

సాంబయ్య బావమరిది నొసలెగరేసి చూశాడు. సుబ్బమ్మ బిగిసిపోయి సాంబయ్యకేసి చూసింది.

''ఏంట్రా! అట్టా మిటకరించుకొని చూస్తావ్? కావాలంటే సుబ్బమ్మకు సాలు చివరకు ఏదో రూపంలో అదనంగా ముట్టజెపుతాను. అది నాకు వదిలేయండి!'' తన మాటలకు తనే ఆశ్చర్యపోయినట్టు మొహం పెట్టాడు సాంబయ్య. అందులో ఏదో లౌక్యం, గూఢార్థం స్ఫురింపజేసినట్టు సాంబయ్య భావించాడు.

దాని ఫలితం కోసం సుబ్బమ్మ కళ్ళలోకి గుచ్చి గుచ్చి చూశాడు.

''మా అమ్మను ఎవరిపంచనో పడేసి నేను ఇక్కడెందుకుండాలి? మంచాన పడినదాన్ని నేను చూడకపోతే ఎవరు చూస్తారూ?'' సాగదీస్తూ అంది సుబ్బమ్మ.

''బావా! కూతురు నీకు ఊడిగం చేస్తుంటే తల్లిని మేం చూసుకోవాలా?'' పరుషంగా అడిగాడు బావమరిది.

''ఊరికే చేస్తుందేమిటిరా? ఈవిడకిచ్చే దాన్యం మీరు తీసుకొని ముసలమ్మను పోషించండి. మీకు మాత్రం కష్టమేముంది? ఆ ముసల్ది ఇంకా ఎంతకాలం బతుకుద్ది కనకా?''

కుక్కిమంచాన పడివున్న రామమ్మ కళ్ళు సాంబయ్య వైపుకు తిరిగాయి. ఆ కళ్ళలోని క్రోధమూ, జుగుప్సా సాంబయ్యకు స్పష్టంగా కన్పించాయి. ముసలమ్మ బలవంతాన మంచంమీదనుంచి లేవబోయి కిందకు దొర్లింది. సుబ్బమ్మా, సాంబయ్య బావమరిదీ వెళ్ళి లేవదీశారు. రామమ్మ మళ్ళీ ఆ మంచంమీద పడుకోనంది. కూతుర్ని చూసి బయటకు నడవమని సైగ చేసింది. సాంబయ్య బావమరిదికి రామమ్మ దూరపుచుట్టమే! అతని పెద్దమ్మ తోటికోడలు. అతనిమీద ఒరిగిపోయి ముసలమ్మ గొంతు పెకలించుకొంది. ఆ వున్న ఒక చెయ్యీ కాలూ ఆడిస్తూ సాంబయ్యకేసి చింతనిప్పుల్లా కళ్ళు చేసుకొని చూసింది. నాలుక మెలి తిరిగిపోతుండగా, శాపనార్థాలు పెట్టేందుకు చెయ్యి ముందుకు చాచి ''నా-ఉసురు...నీ-నీకు-కొ-ట్టా...'' మిగతామాటలు గొంతులోనే లుంగచుట్టుకుపోయాయి. ఊగిపోతున్న తల్లిని పట్టుకొని గడప దాటించింది సబ్బమ్మ. వెనక్కు తిరిగి సాంబయ్య ముఖంలోకి సూటిగా చూసి ''మా అమ్మ ఉసురు నీకొడతదిలే! ఇంతన్యాయం చేసినోడివి, నువ్వేం బాగుపడతావ్? ఆ భగవంతుడు చూట్టంలా! నీ కాలూ, చెయ్యీ ఇరగ! నీ నోట్లో పురుగులు పడవూ?'' పెటీపెటీమని మెటికలు విరిచి, ఖాండ్రించి గోడమీద ఊసి, తల్లిని తీసుకొని రోడ్డెక్కింది సుబ్బమ్మ. సాంబయ్యకు ఒళ్ళు తెలియని కోపం వచ్చింది. తాటిమట్ట తీసుకొని నడిబజార్లో సుబ్బమ్మ తాట వలవాలనిపించింది.

''తప్పుడు ముండల్లారా? ఫోండి నా ఇంటిముందునుంచి!'' బావమరిదికేసి చూస్తూ మళ్ళీ అరిచాడు సాంబయ్య. ''ఇంకా ఎందుకోయ్ అట్టా నిల్చున్నావ్? కదులు ముందు. మీరెవరూ ఇక నా గడప తొక్కొద్దు!''

''నా చెల్లెలు దుర్గమ్మ గొంతుకోశావు! ముసలమ్మను అన్యాయం చేశావు. నువ్వేం మడిసివి! బుడ్డోడిమీద ఆపేక్ష చంపుకోలేక ముసలమ్మను పంపించాం. ఇహ బుద్దొచ్చింది. నీ గడపతొక్కితే చెప్పుచ్చుక్కొట్టు!'' అంటూ విసురుగా వెళ్ళిపోయాడు సాంబయ్య బావమరిది.

వాళ్ళు వెళ్ళాక సాంబయ్యకు నెత్తిమీదనుంచి పెద్ద బరువు దించినట్టయింది. వచ్చినప్పుడు ఓరచూపులు చూసిన సుబ్బమ్మకూ, వెళ్ళేప్పుడు నోటికొచ్చినట్టు కూసిన సుబ్బమ్మకూ ఎంతో తేడా కన్పించింది. సుబ్బమ్మను ఇంట్లో పెట్టుకోవటానికి

తను ఆశపడిన మాట నిజం! కాని తప్పుడుముండ! ఎట్టా వాగింది? ఒకవేళ దాన్ని ఇంట్లో పెట్టుకొని అలుసు ఇచ్చివుంటే, తన కొంప నిలువునా కూల్చేది. తన పరువు బజారుకు ఈడ్చేది కదూ?

జరగనిదాన్ని గురించి ఊహించుకుంటూ మనస్సును కుదుటపెట్టుకున్నాడు చేజేతులా సుబ్బమ్మను పోగొట్టుకున్నానేమోననే బాధను, పరిపరివిధాల అనర్థాలను ఊహించుకొని, అవి తప్పించుకొన్నాననే సంతృప్తిని తెచ్చిపెట్టుకొని, అణచుకున్నాడు.

ఏది ఏమయినా ఒక్క ఆలోచన మాత్రం సాంబయ్య మనస్సుకు ఊరట కలిగించింది. సుబ్బమ్మమీది మోజుతో ముసలమ్మను కూడా ఇంట్లో పెట్టుకోవటానికి ఇష్టపడితే, తల్లీ కూతుళ్ళ తిండిబట్టలూ, పైగా వాళ్ళకిచ్చే ధాన్యమూ, అంతా కలిసి బోలెడు ఖర్చయేది. దానికితోడు సుబ్బమ్మకు ఓసారి తను లొంగిపోయాడో, తన పరువుతోపాటు ఇల్లుకూడా దోచేసేది? వెళ్ళేముందు దాని ధోరణి చూస్తే అలాగే కన్పించింది. ఈ అప్పుల భారంతో ఆ తల్లీ కూతుళ్ళను కూడా నెత్తిన వేసుకొంటే, నేల కరవటం మాట వాస్తవం. ఎలా అయినా తన తండ్రీ తనూ కష్టపడి సంపాదించిన ఆస్తిని కాపాడుకోవాలి. తన కోర్కెలూ, తన సుఖమూ ఆస్తిని హరించేవేగాని పెంచేవిగావు. తను కోర్కెల్ని చంపుకొంటాడు. ఆస్తిని కాపాడుకోవటమే తన జీవితధ్యేయం. తన కొడుకును - తన వంశాంకురాన్ని - ఆస్తిపరుణ్ణి చెయ్యాలి.

## 6

వెంకటపతికి ఐదేళ్ళు నిండి ఆరోఏడు వచ్చింది. అప్పటికి సాంబయ్య అప్పు చాలా వరకు తీరిపోయింది. కలిసొస్తే వచ్చేఏటికి అప్పు పూర్తిగా తీరిపోతుంది. తన కష్టం అక్కరకొచ్చింది. కనకయ్యలాటి మోసగాళ్ళు, శేషావతారంలాంటి దురాశాపరులూకూడా తనను తన భూమినుంచి దూరం చెయ్యలేకపోయారు. తను తన రెక్కలమీద ఆధారపడ్డాడు. తను నేలను నమ్ముకొని బతుకుతున్నాడు. అహర్నిశం పొలంలో శ్రమించాడు. రాత్రిళ్ళు పొలాన పడుకోవాల్సి వచ్చినప్పుడు పసివాణ్ణి కూడా తనతోపాటే పడుకోబెట్టుకొంటున్నాడు.

ఆయేడు కుప్పనూర్పిళ్ళ ఎద్దడిలో తెల్లవారుఝామున నిద్రపోతున్న కొడుకుని భుజానవేసుకొని పొలంపోయాడు. మూడురోజులుపాటు ఇంటికికూడా రాలేదు. పొలానే అన్నం వండించుకుతిన్నాడు. రెండో రోజు బాగా మురికిపట్టిన వెంకటపతిని చెరువులో కడిగి తుడిచి ఎండలో నిలబెట్టాడు. వెంకటపతి పెంపుకు తగినట్లే దృఢంగా వున్నాడు. పసిముఖం ఎండకుమాడి, గాలికివాడి మొద్దుబారినట్లుండేది. కేరింతలు కొడుతూ, పొలాన కల్లంలో దూడలవెంట తిరుగుతున్న వెంకటపతిని చూసి సాంబయ్య హృదయం ఆనందంతో పరవళ్ళుతొక్కేది. కాని కూలిజనం వెంకటపతిని చూసి జాలిపడేవారు.

''తల్లిలేనిబిడ్డ, పాపం! ఇంట్లో మనిషినికూడా పెట్టకుండా ఆదా చేస్తున్నాడు

బిడ్డడు పోషణలేక బండబారిపోతున్నాడు." అలా మాట్లాడుకుంటూ సాంబయ్య కన్పించగానే అంకిళ్ళు నొక్కుకుంటూ ఆగిపోయేవారు ఆడకూలీలు.

ఊళ్ళో జనం సాంబయ్యనుగురించి చెప్పుకోవడంకూడా వృధా అనేదశకు వచ్చారు. ఎన్ని అన్నా ఆ మనిషికి చీమ కుట్టదు. ''నన్ను ముట్టకు నా మాలకాకి" అన్న పద్ధతిలో వున్నా సాంబయ్యమీద ఊళ్ళో చాలామందికి ఏవగింపుగా వుండేది. ఎప్పుడైనా సాంబయ్య ఎదురుపడితే కనకయ్య మొహం చాటేసి పక్కవాటున వెళ్ళేవాడు. కనకయ్య చేసిన ప్రచారంతో సాంబయ్యకువున్న కాస్త పరపతికూడా పోయింది. అంతా ఆకట్టుకొందామనే దురాశతో సాంబయ్యే ఊబిలో దిగాడనీ, అందులో తన ప్రమేయం ఏమీ లేదనీ, అడిగిన వాళ్ళకూ, అడగనివాళ్ళకూ చెప్పాడు. ఏదో రోజున ఆస్తంతా వడ్డీలకింద శేషావతారంకు జమ అవుతుందని కనకయ్య రూఢిగా చెప్పటంతో, షావుకారు బలరామయ్యకు సాంబయ్య పొలంమీద కన్నుపడింది.

పాతికా పరకా చేబదులుగా ఇస్తూ కనకయ్యను చేరదీశాడు. ఎలాగయినా శేషావతారంమీద వత్తిడితెచ్చి సాంబయ్య పొలం వేలానికి తెప్పిస్తే కనకయ్య కష్టం తను వుంచుకోనని వాగ్దానం చేశాడు బలరామయ్య.

''ఇహ జరగబోయేది అదేగా!" చూస్తూవుండు. ఆరునెలల్లో అది జరక్కపోతే నన్ను పేరుపెట్టి పిలవొద్దు" అని చెపుతూ బలరామయ్య దగ్గర కనకయ్య తన పబ్బం గడుపుకుంటూ రాసాగాడు. అలాంటి ఆరు నెలలు ఆరుగడిచి పోయాయి. అయినా సాంబయ్య పొలం వేలానికి రాలేదు. ఇంతకు ముందుకంటే సాంబయ్య ధైర్యంగా కన్పిస్తున్నాడు. వచ్చే ఏటితో తన అప్పులుతీరి ఒడ్డున పడ్తానని సాంబయ్య అంటున్నాడని, ఆనోటా, ఆనోటా బలరామయ్యకు తెలిసింది. కనకయ్యకు కబురు పంపితే ఇంట్లో వుండీ ఊరెళ్ళాడని చెప్పిపంపించాడు.

ఓ రోజు పొలం వెళుతున్న సాంబయ్య చెరువుగట్టుమీద బలరామయ్యకు ఎదురైనాడు. సాంబయ్య ఎదురైతే చూసీ చూడనట్టే వెళ్ళే బలరామయ్య ఆగి పలకరించాడు:

''ఏం సాంబయ్యా, దమ్ము పూర్తయిందా?"

బలరామయ్య మాట వింటూనే సాంబయ్య ఠక్కున ఆగి పక్కకు తొలగి నిల్చున్నాడు. బలరామయ్య కుటుంబం అంటే సాంబయ్యకు భయం భక్తీ రెండూ వున్నాయి. సాంబయ్య తండ్రి వెంకయ్య, బలరామయ్య తండ్రి భద్రయ్య దగ్గర పాలికాపు నౌకరి చేసినవాడు. అది సాంబయ్య నరాల్లో జీర్ణించుకుపోయింది. ఆ కుటుంబం అంటే మనసులో తెలియని అక్కసుకూడా వుండేది. కాని మళ్ళీ ఆ కుటుంబంవాళ్ళు ఎవరైనా యెదురుపడితే నీరుకారిపోతాడు.

బలరామయ్య సాంబయ్య ఎదురు పడితే మాట్లాడ్డం జరిగితే అదీ అతిగర్వంగా ''నువ్వు ఆ వెంకయ్య కొడుకువే"నని గుర్తుచేస్తున్నట్లు మాట్లాడేవాడు. కాని ఈరోజు బలరామయ్య గొంతులో కొంత ఆప్యాయత ధ్వనించింది. అది

తెచ్చిపెట్టుకొన్నదే కావచ్చు. అవతలివాడికి ముఖ్యం పలకరింపులోని ఆదరణ, ఆపేక్షా - అంతే!

"ఆ! - పూర్తయింది. ఎల్లుండి నాటు వేద్దామని. నారుకూడా తయారుగా వుంది."

"అయితే ముందెత్తునే నాటు పడుతుందన్నమాట. ముందెత్తునాటు ఇరగపండాలి మరి!"

"ఏ ముంపో రాకుండా వుండాలిగదా?" ఆశాశంకేసి చూస్తూ అన్నాడు సాంబయ్య.

"ఇదుగో చూడు సాంబయ్యా ! ఆ మెట్టపొలం ఎందుకట్టా పాడుపెట్టటం? చాప్పో, గిప్పో ఏస్తే గొడ్లమేతకన్నా వస్తదిగదా?" విషయం మార్చి అన్నాడు బలరామయ్య.

సాంబయ్యకు కాళ్ళు భూమిలోకి దిగిపోయినట్లయింది, మెట్టపొలం సంగతి రాగానే. అది తన తెలివితక్కువకు నిదర్శనంగా బీడుపడివుంది. అందులో వ్యవసాయం చేస్తే ఖర్చులు కూడా గిట్టవని సాంబయ్యకే కాదు, బలరామయ్యకు కూడా తెలుసు.

"ఏదీ! వెసులుబాటు చిక్కటంలా. ఈ ఏటికి అట్టాగేవుంచి వచ్చేఏటికి ఏదో ఒకటి చేద్దాం అనుకుంటున్నా" పరువు నిలుపుకోవటానికన్నట్టు మాట్లాడి "మరి వస్తా!" అంటూ వెంకటపతి చెయ్యిపట్టుకొని ముందుకు సాగాడు సాంబయ్య.

"అరేరె ! ఆ బుడ్డోడు మీవాడా ఏంటీ? ఆ పక్కన ఆడతావుంటే ఏ అలగావాళ్ళ పిల్లాడో అనుకున్నా. పేరేంటి?" బలరామయ్య మీసాలకింద విషపునవ్వు కదిలింది.

ముందుకు నడిచిన సాంబయ్య ఆగి నిలబడ్డాడు. గిరున వెనక్కు తిరిగి బలరామయ్య ముఖం చితకపొడవాలనిపించింది. కాని ఆ పని చెయ్యగల అంతస్తుగానీ, సాంఘిక బలంగానీ తనకు లేదని తెలుసుకున్న సాంబయ్య "నీ కళ్ళకు అలగావాడిలాగా కనిపించినవాడే ఎనభై ఎకరాల గరువుకూ, పదెకరాల మాగాణికి వారసుడు. వీడు నా కొడుకు. వెంకటపతి!" అన్నాడు. సాంబయ్య కంఠం కంచుగంటలా మోగింది.

కొడుకు నెత్తుకొని, చెరువు గట్టంతా కదంతొక్కుతూ వెళ్ళిపోయాడు సాంబయ్య.

బలరామయ్యకు నసాళానికి అంటింది. కాళ్ళల్లో జంకు పుట్టింది. వంకెక్కర ఆడించుకుంటూ, సాంబయ్యను చూపు కందినంతవరకూ చూస్తూ నిల్చున్నాడు.

మాగాణి గట్టుమీద కొడుకుని దింపి వాడికేసి కొత్తగా చూసినట్టు చూసుకొన్నాడు. వంటికి అతుక్కుపోయివున్న మురికిలాగు మినహా వెంకటపతి వంటిమీద ఏమీలేదు. గిరజాలు తిరిగిన నల్లటి జుట్టూ, గుబురు కనుబొమలూ -

వెంకటపతి తండ్రికి నిజంగా పూటకూటికి లేనివాడింట్లో పెరుగుతున్నవాడిలాగే కన్పించాడు. సాంబయ్య హృదయం మొదటిసారిగా చిత్తడినేల అయింది. వెంకటపతిని గుండెలకు హత్తుకొని వళ్ళంతా నిమిరాడు.

''నువ్వు అలగావాడి బిడ్డవు ఎలా అవుతావురా? తొంభై ఎకరాల ఆసామి బిడ్డవు!''

ఆమాటే మనస్సులో మళ్ళీమళ్ళీ అనుకున్నడు సాంబయ్య.

ఇహ తన కొడుకుని అలా పెంచటానికి వీల్లేదు. మంచి బట్టలు కుట్టించాలి. బళ్ళో వెయ్యాలి. వేళ్ళమీద లెక్కకట్టి వెంకటపతికి ఐదేళ్ళు దాటాయని తెలుసుకున్నాడు.

పొలం పనిలో వున్న సాంబయ్య మనసు, గనెంమీద నత్తగుల్లలతో ఆడుకుంటున్న కొడుకుమీదే లగ్నమయింది. వాడ్నిగురించే ఆలోచన. వాణ్ణి ఎంతవాణ్ణి చెయ్యాలి? బలరామయ్య కొడుకులకంటే తన కొడుకే పెద్ద ఆస్తిపరుడు కావాలి ! బలరామయ్య నలుగురు కొడుకులూ, ముగ్గురు ఆడపిల్లలూ పెరిగి పెద్దవాళ్ళయి, పెళ్ళిళ్ళయి ఆస్తిపంచుకొంటే తలా ఏభై ఎకరాలు రాదు. ఆ రోజుకు తను ఈ ఆస్తి ఇబ్బడి చేస్తాడు. తనకొడుకు వెంకటపతి - వెంకయ్య మనుమడు వెంకటపతి, వీరభద్రయ్య మనమళ్ళకంటే ఆస్తిపరుడౌతాడు. వాళ్ళకంటే పెద్దఫాయిలో వుంటాడు. అప్పుడే బలరామయ్యను తనూ చూస్తాడు. అతని ముఖం మీదే తనూ అనగలడు. తప్పకుండా అలగా వాడెవడని అడగ్గలడు!

వెంకటపతికి కొత్త లాగూ చొక్కా కుట్టించాడు. పురోహితుడ్ని అడిగి మంచిరోజు తెలుసుకొన్నాడు. తలంటిపోసి, కొడుక్కు కొత్త లాగూ చొక్కా తొడిగి, బడికి తీసుకెళ్ళాడు. పంతులు త్రిపురయ్య వరండాలో పిల్లోడితో నిలబడ్డ సాంబయ్యనుచూసి గబగబా దగ్గిర కొచ్చాడు.

''కుర్రాడ్ని బడిలో వేస్తున్నారా? శుభం! కబురుపెడ్తే నేనే వచ్చి అక్షరాభ్యాసం చేయించి బడికి తీసుకొచ్చేవాణ్ణిగా?'' అన్నాడు.

అక్షరాభ్యాసం తంతులాంటిది చేస్తే నాలుగు డబ్బులు రాలేవి త్రిపురయ్యకు. ఆ ఖర్చు తప్పించుకోటానికే సాంబయ్య సరాసరి పిల్లవాణ్ణి బడికి తీసుకొచ్చాడు.

''తల్లిలేని పిల్లాడు! ఇప్పుడేం బడిలే అని సాచాత చేశాను. పిల్లాడికి నాలుగు అచ్చరంముక్కలు అబ్బితే మంచిదని ఆలోచించాను. మీ కష్టం వుంచుకోనులెండి. పిల్లాడ్ని మీరు కనిపెట్టి వుండాలి.''

''పేరూ?'' కుర్రాడిచెయ్యి పట్టుకొని అడిగాడు త్రిపురయ్య.

''వెంకటపతి !''

''వెంకటపతి! బాగుంది!'' అంటూ పంతులుగారు వెంకటపతిని లోపలికి తీసుకెళ్ళటానికి ప్రయత్నించాడు. వెంకటపతి తండ్రిచెయ్యి వదిలిపెట్టకుండా గింజుకొన్నాడు. త్రిపురయ్య గద్దించేసరికి వెంకటపతి బావురుమన్నాడు. సాంబయ్య కరిగిపోయాడు.

''పోనీ ఇవ్వాళ్టికి ఊరుకోండి. రేపు వస్తాళ్ళే!'' అన్నాడు సాంబయ్య.

''కొత్తలో పిల్లలందరూ ఇలాగే చేస్తార్లే. ఇవ్వాళ మంచిరోజు - శ్రీ కారం చుట్టిస్తాను. ఏదీ, పలకా బలపం తెచ్చారా?'' అడిగాడు త్రిపురయ్య.

సాంబయ్య బుర్ర గోక్కున్నాడు.

''ఇదిగో, ఇప్పుడే తెస్తా !'' అంటూ సాంబయ్య కోమటికొట్టుకు ఆదరాబాదరాగా పరుగెత్తుకెళ్ళాడు. కోమటి రెండురకాల పలకలు చూపించాడు. ఒకటి బేడరకం. రెండోది అణారకం. చిన్నపిల్లవాడికి బేడపలక అనవసరం అని, అణా ఇచ్చి పలకా, కాణీ ఇచ్చి రెండు బలపాలూ కొన్నాడు. సాంబయ్య తిరిగి స్కూలుకొచ్చి త్రిపురయ్యకు పలకా బలపం ఇచ్చాడు. సాంబయ్య చూస్తుండగానే త్రిపురయ్య వెంకటపతికి అక్షరాలు దిద్దిపెట్టాడు. సంతృప్తిగా కొడుకుని చూసుకొని, అటునుంచే పొలం వెళ్ళాడు.

సాయంకాలం పొలంనుంచి ఇంటికివచ్చిన సాంబయ్యకు ఇంటిముందు ఒంటరిగా ఆడుకొంటూ కొడుకు కన్పించాడు. కొడుకుని ఎత్తుకొని లోపలకు తీసుకొళ్ళాడు. డబ్బాలోనుంచి వేయించిన శనగలు తీసి ఇన్ని వాడిజేబులో పోశాడు. వెంకటపతి కేరింతలు కొడుతూ, శనగలు తింటూ ఆడుకొంటున్నాడు. కొడుకును చూస్తుంటే హఠాత్తుగా గుర్తొచ్చింది.

''ఒరేయ్! అబ్బాయ్ పలకా, బలపం ఏవిరా?''

''పోయింది.''

''ఎక్కడరా పారేశావ్?'' తండ్రిగొంతు కర్కశంగా వుంది.

''బలపం పోయింది. పలక పోలా.''

''మరదెక్కడ పెట్టావ్! చూపించు?''

వెంకటపతి ఇంటి ముందు రాళ్ళ కుప్పలో దాచిన పలకతెచ్చి తండ్రి చేతికిచ్చాడు. ఒకపక్క బందులు జారిపోయాయి. పలక అడ్డంగా పగిలివుంది.

''అయ్యో కొత్తపలక ! అణాకానీ దండగయింది. రోజు కొక పలక పగలగొడ్తే, వీడి చదువుకే పుట్టెడుగింజలు అమ్మాలి'' అనుకున్నాడు, సాంబయ్య.

''అరే అబ్బాయ్! ఇట్టా పలకలు పగలుకొట్టకూడదు. చదువురాదు.''

''రాకపోతే ఏం?''

వెంకటపతి సమాధానం తండ్రిని ఆలోచనలో పడేసింది. అవును! చదువు రాకపోతే ఏం? తనకు చదువు వచ్చా? అందుకని నష్ట మేమొచ్చింది?

''ఛ! అట్టా అనకూడదు. బాగా చదువుకో!''

''చదువుకొంటే ఏం వస్తది?''

''గొప్పోడి వవుతావ్!''

''అంటే నీ అంత ఔతానా?'' చేతులు బారలుజాపుతూ అన్నాడు వెంకటపతి. కొడుక్కు చెప్పటానికి సాంబయ్యకు సమాధానం దొరకలేదు.

ఉన్న కుటుంబాల పిల్లలతో సమానంగా నిలబెట్టాలనే కాంక్షతోనే సాంబయ్య కొడుకును బడికి పంపాడు. భూస్వామి కుటుంబాలలోని పిల్లలంతా బడికి

వెళ్తున్నారు. మంచిబట్టలు వేసుకొంటున్నారు. తన కొడుకుకూడా మంచిబట్టలు వేసుకొని బడికి వెళ్ళాలి. అంతే, అంతకంటే తనుకోరేది ఏమీలేదు. ఆ బలరామయ్య తన కొడుకును చూసి ఎద్దేవ చేశాడు. ఊళ్ళో ఎవరూ తనకొడుకును వేలెత్తి చూపటానికి అవకాశం ఇవ్వకూడదు.

పసిగుడ్డుగా వున్నప్పట్నించీ, ఇంట్లో ఉన్నా, పొలంలోవున్నా సాంబయ్య కనుసన్నల్లోనే పెరిగాడు వెంకటపతి. ఇప్పుడు వాడు స్కూలుకు వెళ్ళడంతో సాంబయ్యకు తన కొడుకు, తననుంచి దూరమౌతున్నట్లనిపించేది. ఒకొకప్పుడు దిగులుగాకూడా వుండేది.

మధ్యాహ్నం ఇంటినుంచి కొడుకుకోసం స్కూలుకు వచ్చేవాడు. స్కూల్లో వున్న కొడుకుని ఎత్తుకొని పొలం తీసుకుపోయేవాడు.

ఒకోసారి పంతులు మొత్తుకొనేవాడు. ‘‘సాంబయ్యగారూ ! కుర్రాణ్ణి మధ్యలో స్కూలునుంచి తీసుకెళ్ళటం మంచిదికాదు. వాడికి బడిమీద శ్రద్ధ తగ్గిపోతుంది'' అనేవాడు.

పంతులు అలా అన్నప్పుడల్లా ‘‘ఇవ్వాళ్టికే లెండి. వీడు కళ్ళముందు లేకపోతే గుబులెత్తుతుంది'' అని సమాధానం చెప్పి, కుర్రాడ్ని భుజాన వేసుకొని అదేపోత పోయేవాడు సాంబయ్య.

## 7

వెంకటపతికి తొమ్మిదేళ్ళు నిండాయి. కుర్రాడు బాగా తేలాడు. వాడు పరుగెత్తుతుంటే భూమి గతగతలాడేది.

శేషావతారం దగ్గిర తెచ్చిన అప్పు తీరి సాంబయ్య ఒడ్డున పడ్డాడు. ఆరేళ్ళ శ్రమ - తొమ్మిదెకరాల మాగాణిలో పండిన పంట అంతా ఆ శేషావతారం ఇంటికే చేరింది. మూడెకరాల గరువులో పండిన మెట్టపంటతోనే తనూ, తన కొడుకూ బతికారు. లేకపోతే ఏనాడో తన మాగాణి శేషావతారం భుక్తం అయేది. బలరామయ్యా, కనకయ్యా ఆశ్చర్యపోయారు. శేషావతారం వడ్డీలు, ఇరక్కోతలూ కడ్తూ, ఏడువేల అప్పు, ఆరేళ్ళలో తీర్చగలిగిన సాంబయ్య పట్టుదలనూ, ఓపికనూ లోలోపలే మెచ్చుకోక తప్పలేదు. నాలుగేళ్ళనాడు నిలవడబ్బున్న బలరామయ్య ఇప్పుడు అడపా దడపా అప్పులు చేస్తున్నాడు. ఇద్దరు కొడుకులు బస్తీలో చదువుతున్నారు. పెద్దకూతురు పెళ్ళిచేసి తిరిగి చూసుకొనేసరికి బలరామయ్యకు నిలవడబ్బు హరించుకుపోగా పదివేలదాకా అప్పు అయింది. ఇప్పటికే రెండేళ్ళ వడ్డీ దానిమీద పేరుకుపోయింది. మరో రెండేళ్ళలో తీర్చకపోతే ఇరవై ఎకరాలన్నా అమ్మాల్సివుంటుంది. వచ్చే అదాయం కొడుకుల చదువులకూ, అల్లుడి మర్యాదలకూ చాలడంలేదు. అతని ఆస్తి కర్పూరంలా హరించిపోసాగింది.

బలరామయ్య ఆఖరుకొడుకు వెంకటపతి ఈడువాడు. కడగొట్టు కూతురు వెంకటపతికంటే ఆరేళ్ళు చిన్నది. బలరామయ్య ఇంటికి దగ్గర్లోవున్న

రామలింగేశ్వరాలయంలో, సాయంత్రంపూట ఊళ్ళోపిల్లలు ఆడుకొంటూ వుంటారు. వెంకటపతి సాయంత్రం అయేసరికి ఆ వూరి పిల్లలతో చేరి ఆడుకొంటూండేవాడు.

ఓరోజు బలరామయ్య కొడుకు, కూతురుతో కలిసి వెంకటపతి కోతికొమ్మంచి ఆడటం చూశాడు సాంబయ్య. క్షణకాలం ఆనందంలో మునిగిపోయాడు. తనకొడుకు పెద్ద అంతస్థుగల బలరామయ్య పిల్లలతో ఆడుకోవటం సాంబయ్యకు గర్వంగానే అనిపించింది. కాని సాంబయ్యను ఏదో తెలియని భయం ఆవహించింది. వెంటనే వెంకటపతి చెయ్యి పుచ్చుకొని ఇంటికి లాక్కొచ్చాడు.

''ఇకనుంచి నీవా పిల్లలతో ఆడొద్దు.''

''ఆడుకుంటే ఏం?''

''చెడిపోతావ్. వాళ్ళు పెద్దవాళ్ళు.''

సాంబయ్య కొడుక్కు అంతకంటే వివరంగా చెప్పలేకపోయాడు. వెంకటపతి అలాటివాళ్ళతో కలిసిమెలిసి తిరిగితే వాళ్ళ బుద్ధులే అలవడుతయ్యనే ఖచ్చితమైన అభిప్రాయాని కొచ్చాడు సాంబయ్య. వాళ్ళకు వున్నది ఖర్చుపెట్టడం, మంచీ, చెడూ తెలియకుండా దుబారా చేయటం తప్ప మరొహటి తెలియదు. వాళ్ళ వంశంలో వాళ్ళు వళ్ళొంచి పనిచేసే రకం కాదు. అలాంటి పిల్లల స్నేహం పడితే వెంకటపతి తప్పక చెడిపోతాడు. వాళ్ళనుంచి దూరంగా వుంచాలి తన కొడుకును.

వెంకటపతి చదువు అంతంత మాత్రంగానే సాగుతోంది. తీరా చూస్తే వాడు బడికెళ్ళి నేర్చుకుంటున్న మంచికంటే చెడే ఎక్కువగా వున్నట్టు తోచింది సాంబయ్యకు.

ఓరోజు సాంబయ్య పొలాన్నుంచి వచ్చి ఇంట్లో కొడుకు లేకపోవటం చూసి చిరాకుపడ్డాడు. రాత్రి భోజనసమయం అయినా వెంకటపతి రాకపోయేప్పటికి గాబరాపడ్డాడు. ఊరంతా వెతికాడు. చెరువుబడ్డునా, గుడిదగ్గరా, ఎక్కడా పిల్లవాడు కన్పించలేదు. ఇద్దరు ముగ్గుర్ని అడిగి చూశాడు. కాని వాడి జాడ తెలియలేదు. బలరామయ్యగారి ఇంటిముందుకొచ్చి నిలబడ్డాడు. లోపలకు వెళ్ళటానికి మనస్కరించలేదు. వీధి అరుగుపక్కన అట్లాగే నిలబడ్డాడు. బలరామయ్య భోజనంచేసి తేపుకొంటూ బయటకు వచ్చాడు. వీధి అరుగుమీద కూర్చొని చుట్ట వెలిగించబోతూ, గోడపక్కన నిలబడ్డ సాంబయ్యను చూసి –

''ఎవరా మనిషి?'' అన్నాడు.

''నేనే, సాంబయ్యనండీ!''

''సాంబయ్యవా? ఎందు కట్టా పెడగా నిలబడ్డావ్...రా! వచ్చి కూర్చో!'' బలరామయ్య ఎట్లా మాట్లాడినా సాంబయ్యకు తనను చిన్నతనంచేసి మాట్లాడినట్లే అనిపిస్తుంది.

''మా వెంకటపతి కన్పించలేదు. ఇట్టా ఏమన్నా వచ్చాడేమోనని వచ్చా!''

''ఏమిటి? మీవాడుకూడా వెళ్ళాడా ఏమిటి ? అంతటోడు అయ్యాడంటయ్యా నీ కొడుకు?'' సాగదీస్తూ అన్నాడు బలరామయ్య.

సాంబయ్యకు అసలు విషయం అర్థం కాకపోయినా తనను ఎద్దేవ చేస్తున్నాడన్నది మాత్రం స్పష్టంగా తెలిసిపోయింది.

''ఎక్కడికి పాయా డింతకీ?" పళ్ళు బిగించి అక్కసును అణచుకుంటూ అడిగాడు.

''సినిమా చూట్టానికి మా పిల్లలు బండి కట్టించుకొని బస్తీకి వెళ్ళారు. మధ్యాహ్నం మీవాడు మా సవారిబండిదగ్గిర తారట్లాడటం చూశాను. వాళ్ళతో వెళ్ళి వుంటాడు."

''వాడిదగ్గిర డబ్బుల్లేవు. సినిమా కెట్టా ఎళ్తాడు?" సాలోచనగా అన్నాడు సాంబయ్య.

''మీ తండ్రి ఈ ఊరు వచ్చినప్పుడు చేతిలో చిల్లికానీ లేదు. కట్టుపంచలతో వచ్చాడు. కాని మనవడు నాలుగెకరాల గరువ్వూ, పదెకరాల మాగాణికీ, డెబ్బైఎకరాల రాయీ రప్ప బీటికీ వారసుడవలా? ఎట్లా అయాడంటావ్?" ఆనాడు చెరువు గట్టుమీద సాంబయ్య అన్న మాటలు బలరామయ్య ఇప్పుడు సాంబయ్యకే తిరిగి అప్పగించాడు. బలరామయ్య తన అక్కసు వెళ్ళగక్కి సాంబయ్య ముఖంలోకి చూశాడు. కాని అప్పటికే సాంబయ్య తలవంచుకొని బలరామయ్య ఇంటిముందునుంచి సాగిపోయాడు.

ఇంట్లోకయినా వెళ్ళకుండా సాంబయ్య ఇంటిముందు బండమీద కూర్చున్నాడు. అవమానంతో అతని గుండెలు దహించుకుపోతున్నాయ్, ఆకలీ, కసీ పెనవేసుకుపోయిన పాముల్లా తిరుగుతున్నాయ్! తొలికోడి కూసేదాకా అలాగే కూర్చున్నాడు.

ఇంట్లోకి పిల్లిలా, అడుగుల్లో అడుగులు వేసుకుంటూ వచ్చిన వెంకటపతి రెక్కపుచ్చుకొని చావబాదాడు. మొదటి రెండుదెబ్బలూ కిక్కురుమనకుండా తిన్న వెంకటపతి, మూడోదెబ్బకు స్పృహతప్పి పడిపోయాడు. తన చేతుల్లోంచి జావలా కిందకు జారిపోతున్న కొడుకు స్థితిని గ్రహించిన సాంబయ్యకు గుండెలు ఆగినంత పనయింది. చెమటలు పట్టాయి. ఇంట్లోకి మోసుకెళ్ళి మంచంమీద పడుకోబెట్టి, కుండలోని నీళ్ళు తెచ్చి మొహంమీద చల్లాడు.

''ఒరే అబ్బాయ్! వెంకటపతీ!" కుర్రాడ్ని మృదువుగా కుదిపి పిలిచాడు. కుర్రాడు కదల్లేదు. పలకలేదు.

''ఒరే నాయనా!" తండ్రి హృదయం బద్దలయింది. సాంబయ్యకు పుట్టిబుద్ధెరిగింతర్వాత కళ్ళవెంట నీరు రాలేదు. కాని – కాని, ఈసారి అతని కళ్ళలోని రక్తనాళాలు చిట్లేట్టు ఉన్నాయ్. కొడుకుని భుజాన వేసుకొని వీధిలోకి వచ్చాడు. ఆచార్లు ఇంటికేసి పరుగు తీశాడు. తెలతెలవారుతోంది. చల్లటిగాలి రివ్వున వీస్తోంది. దాదాపు ఆచార్లు ఇంటిదగ్గిర్లోకి వస్తూండగా, తండ్రి భుజానవున్న వెంకటపతి కదిలాడు.

''నాన్నా! ఎక్కడి కెళుతున్నాం?" అన్నాడు కళ్ళు తెరిచి. సాంబయ్య కొడుకు తలను నిమిరి తన చెంపలకు హత్తుకొన్నాడు.

''నాన్నా, నేను సినిమా చూడను. ఇంకెప్పుడూ వెళ్ళను. నన్ను ఇంటికి తీసుకెళ్ళవా?''

''అట్లాగే బాబూ!'' వెంకటపతిని గుండెలకు హత్తుకొని వెనక్కు తిరిగాడు సాంబయ్య.

ఇంటికి రాగానే పెరుగన్నం కలిపి కొడుక్కు ముద్దలు తినిపించాడు. తిని వెంకటపతి నిద్రకు పడ్డాడు. మర్నాడు కొడుకుని వదలి పొలం పోలేకపోయాడు సాంబయ్య. కొడుకుని కనిపెట్టుకొని మంచం పక్కనే వున్నాడు. నిద్రలోవున్న వెంకటపతిని ఎన్నో సార్లు నిమిరి ఆప్యాయంగా చూసుకొన్నాడు. చావిట్లో గేదె లేగదూడని నాకుతూ అరవడం వినిపించింది.

సాయంకాలానికి వెంకటపతి తేరుకున్నాడు. వాడికి జరిగిందంతా ఓ కలలా వుంది. సాంబయ్యకు అదో పీడకలలా అనిపించింది.

ఇక వాణ్ణి వదిలేసి వుండడం మంచిదికాదు. బలరామయ్య పిల్లలతో కలిసి చెడిపోతాడు. తనకు దూరమౌతాడు. ఆ బలరామయ్య తన మీదా, తన కొడుకు మీదా కసిపట్టి వున్నాడు. ఓ క్షణం ఏమారినా తన సర్వస్వమూ అయిన తన కొడుకును తననుంచి దూరంచేస్తారు వాళ్ళు. కొడుకుపక్కలోనే పడుకొని రాత్రంతా ఆలోచించి ఓ నిర్ణయానికి వచ్చాడు సాంబయ్య.

ఉదయం పలకా పుస్తకాలు తీసుకొని బడికి వెళుతున్న వెంకటపతిని పిల్చాడు సాంబయ్య. కొడుకు చేతిలోనుంచి పలకా పుస్తకాలు తీసుకొని చిట్టు బస్తాలమీదకు విసిరేశాడు.

''వెధవ చదువు. పాడు సావాసాలు బలిసి చెడిపోతావు. మనకొచ్చే దేమీలేదు'' అన్నాడు సాంబయ్య.

వెంకటపతి బిత్తరపోయాడు. తండ్రి తనచుట్టూ కట్టిన తాళ్ళను విప్పేసి బాధావిముక్తుడ్ని చేసిన అనుభూతి పొందాడు వెంకటపతి.

ఆనందం, ఆశ్చర్యం ముప్పిరికొనగా ''ఇంకెప్పుడూ వెళ్ళొద్దా?'' అని అడిగాడు తండ్రిని వెంకటపతి.

''ఆc - అంతే!''

''చదువుకోకపోతే చెడిపోతావురా అని చెప్పేవాడివిగా?''

''అది తప్పు. చదువుకొంటేనే చెడిపోతారు.''

కళ్ళు పెద్దవిచేసి ఆనందంగా విన్నాడు వెంకటపతి.

''ఆ చదువు మనకు పనికిరాదు. మీ తాతా, నేనూ చదువుకోలేదు. అయినా మేము బాగుపడ్డాం. నువ్వు చదువుకొని చెడిపోవటం నాకిష్టం లేదు.''

''నాన్నా! నేను ఇక బడికేసే పోను! నా పుస్తకాలు చింపేస్తా; పలక పగలకడ్తా.'' ఉత్సాహంతో గెంతులువేస్తూ అన్నాడు వెంకటపతి.

''ఒరే నాయనా ! మనం భూమిని నమ్మకొని బతికేవాళ్ళం. నువ్వూ భూమిని

నమ్ముకొనే బతకాలి. తెలిసిందా?" అని సాంబయ్య అన్నంమూట భుజాన వేసుకొన్నాడు. వెంకటపతి గేదెదూడ పలుపు విప్పి చావిట్లోనుంచి బయటకు తోలుకొచ్చాడు. తండ్రి అరక కట్టి ముందు బయలుదేరాడు. కొడుకు గేదెదూడ పలుపు పుచ్చుకొని తండ్రి వెనకే నడిచాడు.

తండ్రీకొడుకులు డొంకదాటి బీడుగడ్డ గరువుపొలం చేరారు.

"ఒరే వెంకటపతీ! ఇదంతా మన పొలమేరా!" సాంబయ్య చేతిలో కర్ర పైకెత్తి, రాయి రప్పా, దుబ్బులూ వున్న పొలంకేసి చూపించాడు.

"అదంతా మందేనా?" చెయ్యి ముందుకు చూపిస్తూ అడిగాడు వెంకటపతి.

"ఓ! అక్కడ పోత్తాడి చెట్టుంది చూడూ! అందాకా మందే!" తన్మయత్వంతో చెప్పాడు తండ్రి. 'తనదీ' అన్న మమకారం పసిహృదయాన్ని కూడా తాకి, కదిలించి, గిలిగింతలు పెట్టింది. గర్వంగా ముఖంపెట్టి భుజాలు ఎగరేసుకొంటూ, పొలానికి అడ్డంపడి తాటిచెట్టుదాకా పరుగుతీశాడు. సాంబయ్య నాగలికట్టి, కుడివైపు దిబ్బపక్కగా ఎద్దుల్ని నిలబెట్టి కొడుకుని కేకవేశాడు. పోతుతాటిచెట్టు ప్రాకటానికి ప్రయత్నిస్తున్న వెంకటపతి రివ్వున దిగి పరుగు లంకిం చుకున్నాడు.

వగరుస్తూ వచ్చిన కొడుకుని చూసి "ఒరేయ్! అబ్బాయ్! ఈ పొలం ఎవరికీ పనికిరాందని వదిలేశారు! దీన్ని మనం బాగుచెయ్యాలి. దున్ని - రాయీ, రప్పా తీసేయాలి. చెక్క చదును చెయ్యాలి. కంపా, కట్టే కొట్టి మంటపెట్టాలి. రోజూ ఓ సెంటు చేసినా చాలు, మూణ్ణెల్లకు ఒక ఎకరం బాగు చెయ్యొచ్చు. తెలిసిందా?"

"రోజూ మూడుసెంట్లు బాగు చేస్తాను." వెంకటపతి అమాయకత్వంలో ఆశలు పొడచూపటం తండ్రి గ్రహించాడు. సాంబయ్యకు వళ్ళు పొంగిపోయింది.

"రా! నాగలి పట్టు!"

పదేళ్ళవయసులో కొడుకుచేత నాగలి పట్టించాడు సాంబయ్య. వెంకటపతి నాగలిపట్టగా తండ్రి ఎద్దుల్ని అదిలించాడు. నాగలిపట్టి దున్నుతున్న వెంకటపతి వీపూ, ముఖమూ చెమటతో తడిసిపోయాయి. అది చూస్తున్న సాంబయ్య హృదయంలో అమృతం చిలకరించింది.

మునిమాపువేళ కొత్తపొలంనుంచి తిరిగొస్తున్న తండ్రీకొడుకులకు చెరువు గట్టుమీదకు రాగానే దూరంనుంచి కేక విన్పించింది. సాంబయ్య తిరిగి చూశాడు.

తను కనబడితే ముఖం చాటేసే కనకయ్య, తనకేసి చూస్తూ వడివడిగా పరుగెత్తుకు రావటం సాంబయ్యకు ఆశ్చర్యంతోపాటు కోపాన్నికూడా కలిగించింది.

"సాంబయ్యా! ఆగు! నిన్నే! ఆగమంటుంటే?" కనకయ్య పైపంచ విసురుతూ కేకపెట్టాడు.

"ముండాకొడుకు చేసినమోసం చాలక ఇంకా ఎట్టా పిలుస్తున్నాడో చూడు!" అనుకొన్నాడు సాంబయ్య.

కనకయ్య దగ్గిరౌతూ వుంటే "మళ్ళీ ఏం పన్నాగం పన్నుతున్నాడో! రానియ్!

గాడ్దికొడుకును! పళ్ళు రాలగొడ్తాను." అనుకొంటూ సాంబయ్య ఒకరి ముందు కొచ్చి ఎడ్లుర్ని ఆపుచేశాడు.

వగర్చుకుంటూ వచ్చిన కనకయ్య ``ఆగమంటూంటే ఏంటయ్యా అట్టా గుడ్డెద్దు చేలో పడ్డట్టు పోతావ్?" అన్నాడు.

కనకయ్య తనకు ఎదురుపడటమే కాకుండా, అంత ధైర్యంగా మాట్లాడటం చూసిన సాంబయ్య అయోమయంలో పడిపోయాడు.

``ఎందుకంటా ఆగడం? ఏంటి సంగతి?" చిరాగ్గా అన్నాడు సాంబయ్య.

``కనకయ్య మోసం చేసాడూ - కనకయ్య మోసం చేశాడూ - కనకయ్య నా కొంప కూల్చాడూ - అంటూ ఊరూ వాడా చెప్పావు గదయ్యా? ఇప్పుడేమంటావ్?" గొంతు పెద్దదిచేసి నిలదీసి అడిగాడు కనకయ్య.

సాంబయ్య క్షణకాలం ఆలోచనలో పడ్డాడు. వీడి సిగ తరగ! తను పొలం బాగుచేయటం సంగతి అప్పుడే వీడిదాకా వచ్చిందన్నమాట! రాయీరప్పా తీసి తనూ తన కొడుకూ రెక్కలు ముక్కలు చేసుకొని వస్తుంటే, అప్పుడే తనేదో బంగారం తవ్వి తలకెత్తుకున్నట్టు మాట్లాడుతున్నాడు వీడు.

``అయితే ఇప్పుడేమయిందంటా?" పేడపురుగును చూసినట్టుగా కనకయ్యను చూస్తూ అడిగాడు సాంబయ్య.

``ఏమయిందా! కాలవ! కాలవయ్యా! కాలవ వస్తోంది. ఆనాడు నే చెప్పలా?"

సాంబయ్య క్షణకాలం స్తంభించిపోయాడు. బుద్ధి పనిచేయలేదు. ఆనందానుభూతిని కూడా పొందలేకపోయాడు.

``ఏంటి సాంబయ్యా? గుడ్లు తేలేసి చూస్తావ్? కాలవ తవ్వుతున్నారు. నీ చేను బంగారం కాబోతోంది." సాంబయ్య భుజం తట్టి మరీ అన్నాడు, కనకయ్య.

``కాలవా? నీ మాట.....?" సాంబయ్య గొంతునుండి మిగతా మాటలు పెగిలి రాలేదు. మళ్ళీ వీడు తనను మరో పల్టీ కొట్టించబోతున్నాడేమోననే అనుమానం కలిగింది.

సాంబయ్య పక్కనే నిలబడ్డ వెంకటపతిని చూసి కనకయ్య ``నీ కొడుకు అదృష్టజాతకుడు. వాడిదే అదృష్టం!" అన్నాడు.

``కనకయ్యా! సరిగా చెప్పు! నీ మాట నిజమేనా?" ప్రాధేయపూర్వకంగా అడిగాడు సాంబయ్య.

కనకయ్య మాటలు నమ్మాలని సాంబయ్య హృదయం ఆరాటపడింది. కాని బుద్ధి మాత్రం అందుకు సహకరించలేదు.

``ఓరి నీ అనుమానం దొంగల్దోలా! కాలవ తవ్వటం మొదలు కూడాపెట్టారు గదయ్యా? కావాలంటే రేపు నాతో రా చూపిస్తా. మన ఊరికి ఇరవైమైళ్ళ ఎగవన తోటపల్లి దగ్గిర అప్పుడే ఓ పర్లాంగు కాలవపనికూడా పూర్తి అవబోతుంటేను?" అన్నాడు కనకయ్య. పైపంచతో ముఖానపట్టిన చెమట తుడుచుకొని ఊపిరి పీల్చుకున్నాడు.

సాంబయ్య కొడుకు భుజం మీద చెయ్యివేసి ''నా కొడుకు నాగలి పట్టి భూమి బద్దలు కొట్టాడు. ఈరోజే కాలువ తవ్వుతున్నారని శుభవార్త! కాలువ వస్తూంది. నీరు పారుతుంది. నా కొడుకు భూమి దున్నుతాడు. రత్నాలు పండిస్తాడు. కనకయ్యా! నా బిడ్డ నాగలీ, భూమినీ నమ్మినవాడయ్యా! అహోయ్! ఏహేయ్! చో!'' అంటూ ఎద్దుల్ని అదిలించాడు సాంబయ్య. మోరలుచాచి ఎద్దులు ముందుకు సాగాయి. మువ్వలు మోగాయి.

నాగలి మొన నేలమీద జారుతూ సాంబయ్య అదృష్టాన్ని గానం చేసింది.

''కనకయ్యా! మళ్ళీ కలుస్తావుగా?'' అంటూ సాంబయ్య తనువెల్లా పులకించగా కొడుకుని వెంటబెట్టుకొని, నాగలికట్టిన ఎద్దుల్ని తోలుకొని ఇంటికి వెళ్ళాడు.

అన్నంతిని ఆరుబయట మంచంమీద చుట్ట కాల్చుకుంటూ కూర్చున్న సాంబయ్య ఆలోచనలు కాలువ - నీరు - పొలంమీద అల్లుకుపోసాగాయి. ఈ సంవత్సరమే ఊడ్పులనాటికి కాలవ తవ్వకం పూర్తి అవుతుంది. అవగానే నీరు వదుల్తారు. తను కొంత పొలమన్నా దున్ని పైరు వెయ్యగలడా? ఈ పట్టున తనూ, కొడుకూ చేస్తే ఎన్నాళ్ళకు ఆ పొలం పాటుకు వస్తుంది? ఇహ కూలీలను పెట్టి చేయించక తప్పదు. ఓ వందమందిని పెట్టి బాగు చేయిస్తే మాత్రం నష్టం ఏమిటి? ఆ వారంతా ఈ ఏడే పండించుకోవచ్చు. సాంబయ్య తనకు తెలియకుండానే లేచి నిలబడ్డాడు. పైపంచ భుజాన వేసుకొని కర్ర తీసుకొని కనకయ్య ఇంటికేసి బయలుదేరాడు.

ఇంటి ముందుకు వచ్చిన సాంబయ్యను చూసి కనకయ్య పెద్దకూతురు గాబరాగా ఇంట్లోకి పరుగెత్తి అన్నం తింటున్న తండ్రితో అన్నది - ''అయ్యోయ్! మళ్ళీ వచ్చాడాయన, ఇంత లావుకర్ర తీసుకొని. నువ్వు బయటకు రామాక!''

కనకయ్య ముద్ద మింగి నోరు తెరిచేలోపున పెద్దకూతురు బయటకు పరుగెత్తుకొచ్చి సాంబయ్యతో -

''మా అయ్య ఇంట్లో లేడు.'' తొట్రుపాటుపడుతూ చెప్పింది.

''ఇంట్లో లేకపోతే వచ్చిందాకా వుంటాలే! వచ్చినపని కావాలిగా మరి!'' అంటూ సాంబయ్య అరుగుమీద చతికిలబడ్డాడు. సాంబయ్య మీసాలు లీలగా పైకీ కిందకీ కదిలాయి. అంటే, సాంబయ్య చాలా కాలానికి మళ్ళీ నవ్వాడు. కాని కనకయ్య పెద్దకూతురు గుండెలు కడబడ్డాయి. ఇంట్లోకి దౌడుతీసి పెరుగ్గిన్నె తెస్తున్న తల్లికి 'ఢీ' ఇచ్చింది.

''అమ్మోయ్! ఇంటిముందే కూర్చున్నాడేవ్! ఇవ్వాళ ఇంకేమయినా వుందా?'' అన్నది తల్లితో.

చీరమీద ఒలికిన పెరుగు తుడుచుకుంటూ ''ఎవరే! ఏమిటే నీ గొడవ?'' అన్నది తల్లి.

''ఆయనేనే! అప్పుడు నాన్నని - మరప్పుడు కర్ర తీసుకొని -'' కూతురి మాట పూర్తి కాకుండానే కనకయ్య గ్రహించాడు.

''ఏవిటే పిచ్చి మొద్దా! ఎందుకలా కంగారు పడ్తావ్? మన సాంబయ్యేగా వచ్చింది!'' అని తల ముందుకు చాచి కనకయ్య కేక వేశాడు.

''ఎవరూ? సాంబయ్యా! నువ్వేనా?''

''ఆఁ - నేనే కనకయ్యా! భోంచేస్తున్నావా? తొందరేం లేదులే. మెల్లగానే కానియ్!'' అతి సౌమ్యంగా సాంబయ్య కంఠం వసారా అరుగుమీదనుంచి పలికింది.

సాంబయ్య కొడుకు వెంకటపతికి పద్దెనిమిది నిండి పంథొమ్మిది ఏళ్ళు వచ్చాయి. నూనూగు మీసాలు దువ్వుకుంటూ, బండి తొట్టిలో కూర్చొని గిత్తల్ని అదిలిస్తూ పరుగులు తీయిస్తోన్న వెంకటపతిని చూసి, ఊళ్ళోకి వచ్చిన బంధువులు ''ఆ కుర్రాడు ఎవరు?'' అని ప్రశ్నిస్తే, ''ఊరుపోయిన వెంకయ్య మనవడు'' అని ఊళ్ళోవాళ్ళు చెప్పారు.

''ఆస్తిపాస్తులేమాత్రం?'' బలరామయ్య కొడుకు పెళ్ళికొచ్చిన బంధువుల్లో ఓ పెద్దమనిషి బలరామయ్యను అడిగాడు..

''ఎనభై ఎకరాల సుక్షేత్రమయిన మాగాణి. దొడ్లా దోవలూ, కొత్తగా కట్టిన డాబాయిల్లు! ఒక్కడే కొడుకు.'' ఈ మాటలు చెప్పింది బలరామయ్య కాదు - అతని పక్కనే కూర్చొని వున్న పరంధామయ్య.

''ఆడపిల్లలున్నారా?''

''అబ్బే! ఒక్కడే కొడుకని చెప్పటంలా?''

''అయితే మంచి సంబంధమే. మా రెండోదానికి మాట్లాడకూడదూ?'' దూరపు బంధువైన అంజయ్య బలరామయ్యను హెచ్చరించాడు. బలరామయ్య కాలిమీద జెర్రిపాకుతున్నట్టు మొహంపెట్టి అన్నాడు.

''ఏంటి అంజయ్యన్నా? నీకేమయినా మతిపోయిందా?''

''ఇందులో పొరపాటేముందీ? మీ ఊళ్ళో ఉన్నవాళ్ళందర్లో ఆ కుర్రాడే మోతుబరి ఆసామి బిడ్డకదయ్యా?''

''ఆస్తిపాస్తులుండగానే అయిందటయ్యా? వంశం, మంచీ చెడ్డా ఏం అక్కర్లేదా?'' అన్నాడు బలరామయ్య.

''మీ ఊళ్ళో సంగతులన్నీ మా కెట్టా తెలుస్తాయి? ఆ మంచి చెడ్డలేమిటో మీరు చెప్పాలి మరి!''

''ఆ వెంకటపతి తాత మా యింట్లో పాలేరుపని చేశాడు.''

అంజయ్య దవడలు ఎవరో నొక్కి నట్టయింది.

చుట్టూ వున్నవాళ్ళ మొహాలు పెళ్ళికి ఇచ్చిన తాటాకు విసనకర్రలంతా అయాయి. సగం ఆనందంతో సగం ఆశ్చర్యంతో -

''ఏమో బలరామయ్యా! నేను నమ్మలేకుండా వున్నా. అట్లా అయితే ఇంత ఆస్తి ఎట్లా సంపాదించారంటావ్?'' ఆస్తి గలవాడూ, ఒక్కడే కొడుకూ, తన

అల్లుడైతే తన పిల్ల అదృష్టవంతురాలు అవుతుందని ఆశలు పెంచుకొన్న ఆడపిల్లల తండ్రి అంజయ్య ఓపట్టాన ఆశలు చంపుకోలేక అడిగాడు.

''చెడిబతికిన రకం. పెంటకుప్పమీద కానీవేస్తే కళ్ళకద్దుకొని తీసుకొంటారు.''

''ఇదుగో బలరామయ్యా! అందరూ నీలాగే వెర్రిబాగులవాళ్ళలా ఉంటారా ఏం? మీ తండ్రి పోయేనాటికి రెండొందల ఎకరాల మొనగాడి భూమి నీకిచ్చి వెళ్ళాడు. ఇప్పుడు ఎంత వుందో చెప్పు. తగు జాగ్రత్తలు చేసుకొంటేనే అది నిల్చేది. అందులో తప్పేమీ నాకు కన్పించడంలా.'' అంజయ్య తన ఆశలకు నీళ్ళు పోసుకుంటూ అన్నాడు.

''తెలియకుండా మాట్లాడకు. ఆ సాంబయ్య ఎట్టాంటివాడో మాకు తెలుసు. పెళ్ళాన్ని విషం ఇచ్చి చంపాడు. వాళ్ళు ఇంట్లో ఏం తింటారో తెలుసా? పాచిపోయిన అన్నం! మన ఇళ్ళలో జీతగాళ్ళు కూడా తినరు. వంశమర్యాదలూ, గౌరవప్రతిష్టలూ వున్నవాడెవడూ ఆ ఇంట్లో పిల్ల నివ్వడు. వాడి ఆస్తి తగలబడ! ఎవడిక్కావాలి?'' బలరామయ్య విసిరిన మాటలు అంజయ్య గుండెల్లో తుమ్మముళ్ళలా గుచ్చుకున్నాయి.

''ఛీ!ఛీ! అట్లాంటివాళ్ళతో నేను వియ్యమందుతానా? మాట వరసకన్నాగాని! మా ఇంటా వంటా లేదు. మా వంశాన్ని గురించీ, మాకు ఏ ఫాయివాళ్ళతో సంబంధాలు వున్నాయో నీకు తెలియదా బలరామయ్యా! మా పెద్దమ్మాయిని ఇచ్చింది జమీందార్ల వంశంలోనేకదా!'' అని అంజయ్య చుట్టూ వున్నవాళ్లకేసి చూస్తూ తాటాకు విసనకర్రతో విసురుకోబోయి మొహానికి కొట్టుకొన్నాడు.

అందరూ తనను మెచ్చుకున్నట్టూ అతని వంశాన్ని గురించి గొప్పగా ఒప్పుకొన్నట్టు భావించిన అంజయ్య, తన రెండో పిల్ల దురదృష్టానికి అంతరాంతరాల్లో ఎక్కడో బాధపడ్డాడు. అలా బలవంతాన అంజయ్య జారవిడిచిన తాళ్ళను నలుగురు ముగ్గురు దొరకపుచ్చుకున్నారు. అయితే అందరిలో మళ్ళీ ఎవరికీ సాంబయ్య కొడుకు వెంకటపతిని గురించి ఆరా అడిగేందుకు ధైర్యం చాలకపోయింది.

పెళ్ళి అయిపోయి తమ ఊళ్ళకు వెళ్ళబోయేముందు లోపాయికారిగా కూపీలు తీసి, మనసు కుదుటపర్చుకొనివెళ్ళారు.

అందులో చితికిపోయిన ఆసామి ఒకడు ''సంబంధానికేం బంగారంలాంటిది – వాళ్లు ఒప్పుకుంటే!'' అని తన అసలు అనుమానాన్ని బయటవేశాడు కనకయ్య దగ్గిర.

''మెల్లగా అంటావేమయ్యా! ఇంతకంటే మంచి సంబంధం ఈ ప్రాంతంలోనే దొరకదనుకో! కొత్తవంతెన పక్కన – ఏదీ – ఆ రోడ్డు వార పొలం అంతా సాంబయ్యదే! ఈ రోజుకూ తండ్రీ కొడుకులిద్దరూ పొలంలో వంచిన నడుం ఎత్తకుండా పనిచేస్తారు. అయ్యా కొడుకులు ఊళ్ళో ఒకరి జోలీ–శొంఠీ పట్టించుకోరు. తెలుసా?''

''కుర్రాడుకూడా చూపరే అనుకుంటాను.''

"చూపరా? రత్నంలాంటివాడు కదయ్యా! వీధిలో నడుస్తూ తల పక్కకు తిప్పడంటే నమ్ము! అంత బుద్ధిమంతుడు ఈ ఊళ్ళో లేనేలేడు. ఏ పిల్లదానికి రాసి పెట్టివుందో - అదృష్టవంతురాలవుతుంది."

"మరయితే ఆ బలరామయ్య అట్టా వాగుతాడేం?"

"వాగుతాడు, వాగుతాడు. ఎందుకు వాగడూ? ఆయన చేసిన నిర్వాకం ఏందంట? మూతవేసివుంది కాబట్టి నిండుగా కనిపిస్తుంది. నలుగురు కొడుకులు పంచుకొంటే తలా పాతికెకరాలుకూడా రాదు. ఇంకా ఆఖరుదానికి పెళ్ళికూడా చెయ్యాలి." కనకయ్య గొంతు తగ్గించి అటూ ఇటూ చూసి, "ఇదిగో నలభైవేల అప్పుంది ఆయనకు. ఎక్కడా అనబాక. నామీదపడి ఏడుస్తాడు. అంటే - ఆ లెఖ్ఖన మిగిలేది ఏంటో నువ్వే చూడు. అప్పులు తీరిస్తే ముష్టి పదిహేను ఎకరాలు. మనిషి అది చూసుకోడు. మాటకుముందు 'ఆ వెంకయ్య మా ఇంట్లో పాలేరు. యీ సాంబయ్య పాసన్నం తింటాడు. మా వంశం, మా అంతస్తూ' అంటాడు. ఈయన రెండో కూతురి సంగతి ఏమిటో తెలిస్తే - ?" ఇంతలో బయటనుంచి "కనకయ్యా" అనే కేక విన్పించి అదిరిపడ్డాడు! ఆ పెద్దమనిషిని ఆదరాబాదరాగా సాగనంపటానికి ప్రయత్నించాడు.

"అయితే! ఈ సంబంధం మాట్లాడండి."

"ముందు నువ్వేం ఇవ్వగలవో తేల్చుకొని వచ్చి చెప్పు. ఆ తర్వాత వ్యవహారం నేను చూసుకుంటా."

"సరే, వచ్చే లక్ష్మివారంనాడు మళ్ళీ వస్తా. మీరు ఊళ్ళో ఉంటారుగా?" అన్నాడు ఆ పెద్దమనిషి.

"ఎందుకూ మీరు రావటం? నాకు ఎటుదిరిగీ బస్తీకి వెళ్లే పనుంది. వెళ్తూ వెళ్తూ మీ ఊరొస్తా. తోవేగదా?" అని కనకయ్య ఆయన్ను సాగనంపాడు.

## 9

"రా! కనకయ్యా రా! ఎప్పుడొచ్చావ్ ఊళ్ళోకి?" సాదరంగా ఆహ్వానించాడు సాంబయ్య.

కనకయ్య సాంబయ్య డాబా వరండాలో మొకరం పక్కన బల్లమీద కూర్చొని అలసట తీర్చుకోసాగాడు. ఎదురుగా సాంబయ్య నవారు మంచంమీద కూర్చొని రెండు చుట్టలు చుట్టి, ఒకటి కనకయ్యకు అందించాడు. కనకయ్యచేతిలో వున్న లెదర్‌బ్యాగ్ పక్కనపెట్టి చుట్ట వెలిగించుకొన్నాడు.

సాంబయ్య మెరుస్తోన్న కొత్తబ్యాగ్‌కేసి కన్నార్పకుండా చూస్తూ "కొత్తది కొన్నట్టున్నావ్? ఎంతయిందేమిటి?" అని అడిగాడు.

"ఏడున్నర!" కనకయ్య నొసలు ఎగరేస్తూ గర్వంగా చెప్పాడు. "నీక్కూడా ఒకటి తెస్తాలే ఈసారి బస్తీకి వెళ్ళినప్పుడు" అంటూ సాంబయ్య మొహంలోకి చూశాడు.

''నాకెందుకయ్యా అంత ఖరీదుపెట్టి ఆ తోలుసంచులూ అవీనూ? నీ కంటే లావాదేవీలూ, కాగితాలూ, పత్రాలూ, గట్రా వుంటాయి పెట్టుకోవటానికి. నాదగ్గరేముంటుంది అందులో దాయటానికి?'' సంచి తీసుకొని తిప్పి తిప్పి చూస్తూ అన్నాడు సాంబయ్య.

కనకయ్య ఓ సారి సకిలించి ''అవున్లే'' అన్నట్టు తల ఎగరేశాడు.

సాంబయ్య కనకయ్యను తేరిపార చూశాడు.

ఇరవై ఏళ్ళనాడు అంగవస్త్రంలో కాగితాలు చుట్టుకొని తిరిగిన కనకయ్య, పదేళ్ళకితం గోనెపట్టా సంచితో తిరిగిన కనకయ్య, ఈనాడు ఏడున్నర రూపాయలు పెట్టి తోలుసంచి కొని తిరుగుతున్నాడు. పలచగా, బక్కగా, తిండిలేక ఆవురావురుమంటూ తిరిగే కనకయ్య ఆకారంలో, అంతస్తులో కూడా చాలామార్పు వచ్చింది. కాలవకింద పదెకరాల పొలం కొన్నాడు. ఇల్లు ఊడదీసి మరో నాలుగు వేలుపెట్టి పెంచి కట్టాడు. శేషావతారం మిల్లులో పావలావాటా సంపాదించాడు. ఆడపిల్లలందరికీ పెళ్ళిళ్ళు చేసి అత్తగారి ఇళ్ళకు తోలేశాడు. మిగిలింది ఒక్కడే కొడుకు. వాడు పట్నంలో బి.ఏ. ప్యాసయి ''లా'' చదువుతున్నాడు. బక్కగా వుండే కనకయ్య వళ్ళు చేసాడు. పేటు అంచు పంచలు కడుతున్నాడు. కాని అతని వృత్తీ, పద్ధతీ, ధోరణీ మారలేదు.

సాంబయ్యలో బాహ్యంగా వచ్చిన మార్పులు అట్టే లేవు. ఆ నీరుకావి బట్టలే కడుతున్నాడు. అతని చుట్టూ చాలా మార్పులు వచ్చాయి. కాని సాంబయ్య మారలేదు. సాంబయ్యా, కనకయ్యా సంబంధాలూ మారలేదు. వాళ్ళ మనస్తత్వాలు ఇనుము కరిగించి మూసపోసిన అచ్చుల్లా అలాగే వుండిపోయాయి ఈనాటికీ. కనకయ్య చుట్ట అవతలికి విసిరి ''సాంబయ్యా! ఓ మంచి సంబంధం తెచ్చానయ్యా!'' అన్నాడు.

సాంబయ్య వినీ విననట్టుగా కాసేపు ఆగి ''అంత తొందరేమొచ్చిందీ?'' అన్నాడు.

''బలేవాడివయ్యా! నువ్వే! అదును తప్పితే విత్తనం మొలుస్తుందా?''

''అప్పుడే వాడికేం వయసు మీరిందయ్యా? ఇంకా ఇరవై అన్నా దాటలేదు.''

''మీ అబ్బాయికి కాదు సాంబయ్యా సంబంధం! నీకు!నీకు!''

''నాకా? పెళ్ళా?'' సాంబయ్య నోరు తెరచి అలాగే కనకయ్య కళ్ళలోకి చూశాడు.

''నీకేం తక్కువయ్యా?''

''అహ! అదికాదు. ఇప్పుడేం పెళ్ళని?''

''ఇప్పుడు కాకపోతే షష్టిపూర్తయిం తర్వాత చేసుకుంటావేమిటి?''

''అయితే ఇప్పుడు నా వయస్సెంత అనుకుంటున్నావ్?''

''వయస్సెంతయితే మాత్రం ఏం? వొసిగ్గరలా వున్నావ్! డెబ్బై ఎనభై ఎకరాల ఆసామివి. రాయిలాటి మనిషివి.''

కనకయ్య మాటలు సాంబయ్య మెదడులో ప్రవేశించి ఎక్కడ నాటుకోవాలో అక్కడే నాటుకున్నవి.

ఆలోచనలో పడ్డాడు.

దుర్గమ్మ గుర్తొచ్చింది. ముసలమ్మ ఆసరాతో తను కొడుకును పెంచినరోజులు కళ్ళలో కదిలినై. ముసలమ్మ కూతురు సుబ్బమ్మ మనసులో మెదిలింది దానిచూపూ - మనిషి బిగువూ - లగువూ..! కాని దాని తాడుతెగ ఎట్టా తిట్టిపోసింది?

"ఏమిటి సాంబయ్యా ఆలోచనా?"

"నాకు-ఏభై కూడా లేనట్టున్నయ్." వేళ్ళు మడిచీ తిరిచీ లెఖ్ఖ కట్టి అన్నాడు సాంబయ్య.

"ఛీ!ఛీ! ఎవడయ్యా ఆ మాట అంటాడు? నిన్ను చూస్తే నలభై, నలభై అయిదుకంటే వుండవని నిర్ధారణ చేసుకోవచ్చు."

"అదేనయ్యా! ఏభైలోపు అంటినిగా?"

"అంతే! అంతే! అంతకు లోపుమాటే!"

"దాందేముందిగాని కనకయ్యా! పెళ్ళీడు కొచ్చిన కొడుకుని పెట్టుకొని నేను మళ్ళీ పెళ్ళి చేసుకోవటం బాగుంటుందీ?" సాంబయ్య మెత్తబడ్డాడు.

"అదే నేను మొత్తుకొనేది. వెంకటపతికి పెళ్ళిచేసేముందే నీ పెళ్ళి అయిపోవాలి."

"ఏమోలే కనకయ్యా! ఇప్పుడెందు కొచ్చిన పెళ్లి?" సాంబయ్య నీళ్ళు నమలసాగాడు.

"ఎంతకాలమయ్యా ఈ ఒంటరితనం? భార్యపోయిన రోజుల్లో డబ్బు చిక్కుల్లోపడి సతమతమైపోతూ సాచాత చేశావు. గుర్తుందా? ఏడెనిమిదేళ్ల నాడు ఒకసారి హెచ్చరిస్తే వెంకటపతి ఏమయిపోతాడన్నావ్? వాడికి ఆస్తిపాస్తుల్లో ఎక్కడ తక్కువ అయిపోతుందో అన్న బెంగతో పెళ్ళిమాట తలపెట్టలేదు. ఇప్పుడు నీకేమయ్యా? నలుగురు పంచుకొన్నా లోపం లేదు. తక్కువ కాదు."

"ఈ వయసులోకూడా పిల్లలు పుడతారంటావా?" వుండీవుండీ సాంబయ్య కనకయ్యమీదకు బ్రహ్మాస్త్రం విసిరాడు.

కనకయ్యకి పచ్చివెలక్కాయ గుజ్జు గొంతుకు అడ్డం పడ్డట్టు అయింది. సాంబయ్య ఆ ప్రశ్న ఎంతో ఆలోచించి అడిగిందే. ఆ ప్రశ్నకు తను ఇచ్చే సమాధానం మీద, సాంబయ్య పెళ్ళిచేసుకోవటం, మానుకోవటం ఆధారపడినట్టు పసిగట్టాడు కనకయ్య.

భార్యపోయిన మొదట్లో, ఆస్తి పెంచుకొనే తాపత్రయంలో వున్న రోజుల్లో, పెళ్ళి పందర్భం వస్తే రెండోపెళ్ళానికి కూడా పిల్లలు పుడ్తే ఆస్తిపంపకం అవుతుందనే ఉద్దేశ్యంతో "నాకెందుకయ్యా మారుమనువు?" అనేవాడు. తన స్వార్జితమైన భూమి చెక్కు చెదరకుండా వుండాలి. దానికి వెంకటపతి ఒక్కడే వారసుడు కావాలి. ఊళ్ళో అందరికన్నా, ఆ భద్రయ్యగారి మనుమళ్ళకన్నా తన కొడుకు

స్థితిపరుడు కావాలి. ఆ కోరిక సాంబయ్య నరనరాన్నీ పట్టి పీడిస్తూ వచ్చిన సంగతి కనకయ్యకు తెలుసు.

సాంబయ్య ప్రశ్నకు సమాధానం దొరగ్గానే కనకయ్య చిటికవేసి వెకిలిగా నవ్వాడు.

''కతాచితు. నూటికో కోటికోగాని జరగదు.''

''అంటే, ఏభై ఏళ్ళవాడికి పిల్లలు అసలు పుట్టే అవకాశమే లేదంటావా?'' అడిగాడు సాంబయ్య.

''రెండో పెళ్ళాన్ని కట్టడి చేసుకోలేనివాళ్ళ సంగతి మనకెందుకు సాంబయ్యా! నా మాటవిను! మంచిపిల్ల! పని పాటలు బాగాచేస్తుంది. నీకు ఖర్చు కూడా అంత వుండదు. ఊ అంటే రేపే ముహూర్తం పెట్టిస్తాను.''

''నాలుగు రోజులు ఆగలేవా?'' సాలోచనగా అన్నాడు సాంబయ్య.

''నేనాగుతానయ్యా! అవతలవాళ్ళు ఆగొద్దూ? ఎదిగొచ్చిన పిల్ల. ఏదో స్థితిగతులు బాగాలేక రెండో పెళ్ళివాడికన్నా యిచ్చి బరువు దించుకోవాలని చూస్తున్నారు వాళ్ళు. ఇప్పుడే తేల్చి చెప్పు. రేపు ఏ మాటా వాళ్ళకు చెప్పాలి. లేకపోతే మరో సంబంధం చూసుకొంటారు.''

''ముహూర్తాలు పెట్టుకొనేదాకా నీ కడుపులోనే పెట్టుకోవాలి. మన ఊళ్ళో రెండోవాడికి తెలియకూడదు. ఇంతకీ పిల్లదేవూరన్నావ్?''

''గంగుపాలెం. ఐదుగురు ఆడపిల్లలు. ఈ పిల్ల మూడోది. తండ్రి మర్యాదస్తుడు.''

''సరే! ఏ గుళ్ళోనో పెళ్ళి జరుపుకుంటే సరిపోతుందనుకుంటా.''

''నీ యిష్టం. వాళ్ళకేం అభ్యంతరం లేదు. మరి నే వస్తా!'' అని లెదర్ బ్యాగ్ తీసుకొని రెండు మెట్లు దిగి మళ్ళీ వెనక్కు వచ్చాడు కనకయ్య.

''మర్చేపోయా! పెద్ద ఎత్తున ధాన్యం కొనుగోలు చేస్తున్నాం. ఓ రెండు సర్దగలవా? వారమే గడువు. ఒక్కరోజన్నా ఆలస్యం కాకుండా తిరిగి ఇచ్చేస్తా.''

''రెండు...రెండువేలా?'' సాంబయ్యముఖం వెలవెలబోయింది.

''లేక రెండొంద లనుకున్నావా? ఇంకా కనకయ్య వందల వ్యాపారాలే చేస్తున్నాడనుకుంటున్నావా? ఈ సంవత్సరం మా మిల్లు తరఫున అరలక్ష కిమ్మత్తు కొనుబడి చేయబోతున్నాం. తెలుసా? నాకు బస్ టైం అవుతూంది. త్వరగా తేల్చు. ఊరికే వద్దులే. కావాలంటే వడ్డీ తీసుకో!''

సాంబయ్య మారు మాట్లాడకుండా ఇంట్లోకివెళ్ళి రెండు వేలు తెచ్చి కనకయ్యకు ఇచ్చి అన్నాడు - వడ్డీ పాడూ ఏం వద్దు. నాలుగురోజుల్లో తిరిగి ఇయ్యి. వారందాకా గడువు పెట్టొద్దు!''

తోలుసంచిలో నోట్ల కట్టను కుక్కుకొని గబగబా మెట్లు దిగిపోతున్న కనకయ్యను ఉద్దేశించి సాంబయ్య అన్నాడు:

''ఇదిగో! ఈ సంగతి ఎక్కడా బయటికి పొక్కకూడదు.''

‘‘డబ్బు సంగతేనా?”

‘‘కాదు. అదే - ఆ సంగతి!”

‘‘ఆ - అట్లాగే! అట్లాగే! పిట్టకు తెలియనిస్తానా?” అని బిగ్గరగా జవాబు చెపుతూ వీధినపడి బస్‌స్టాండ్‌కేసి పరుగు తీశాడు కనకయ్య.

తెల్లవారే వస్తానన్న కనకయ్య మూడురోజులయినా రాలేదు. సాంబయ్యకు ఆదుర్దా ఎక్కువయిది. కనకయ్య వచ్చి వెళ్ళిన దగ్గిరనుంచి సాంబయ్యకు మనసు వశం తప్పిపోయింది. కాబోయే పెళ్ళాం రూపురేఖలు స్పష్టంగా వూహించలేకపోయినా వయసులోవున్న ఆడదాని రూపం కల్పించసాగింది అతని కళ్ళకు. పొలం పోయినా అదే యావగా వుంది. ఆడకూలీలకేసి కళ్ళప్పగించి చూడసాగాడు. ఇన్నాళ్ళూ కూలీలు చేస్తున్న పనిని మాత్రమే చూడగలిగిన సాంబయ్య కళ్ళకు ఆడకూలీల మెరిసే కళ్ళూ, గట్టి నడుమూ, నడకల్లోని హొయలూ వంపులూ కనిపించసాగాయి.

రాత్రిళ్ళు అన్నం తినగానే నిద్రపోయే సాంబయ్యకు కన్ను మూతపడటం లేదు. దుర్గమ్మ – సుబ్బమ్మ – రెండో పెళ్ళాం. అతన్ని వొరచుకొని తోస్తున్నట్లు అనిపించసాగింది. పొలం పోబోతూ సాంబయ్య ‘‘ముండాకొడుకు. మనిషి అంతులేడు” అనుకొంటుండగా కనకయ్య రావటం కనిపించింది. సాంబయ్య గుండెలు గుబగుబలాడాయి. నరాలు జివ్వుమన్నాయి.

‘‘మొన్నే వస్తానన్నావ్? ఇవ్వాళా వచ్చేది?” మంచంమీద కాళ్ళు మడిచిపెట్టుకొని కూర్చుంటూ అన్నాడు సాంబయ్య.

‘‘నీ పనే! నాకు రెండురోజులు వేస్ట్!” ఎదురుగా బల్లమీద కూర్చుంటూ చెప్పాడు కనకయ్య.

‘‘వేస్టా? ఏందయ్యా అదీ?”

‘‘అదేలే! వృధా అని అర్థం.”

‘‘ఎట్టెట్టా! బస్తీలో తిరగవంరిగి ఇంగిలీసుముక్కలు కూడా నేర్చుకున్నావన్నమాట?”

‘‘ఇంగ్లీషు ముక్కలకేంగానీ, రేపు అమావాస్య వెళ్ళగానే వచ్చే మంగళవారం నాడు ముహూర్తం. పెళ్ళి గోపాలస్వామి గుళ్ళో. అంతా సెటిల్ చేసేశా. ఇక నీదే ఆలస్యం.” అన్నాడు కనకయ్య.

సాంబయ్య కళ్ళు వెలిగాయి. ఉద్రేకాన్ని తొక్కిపెట్టి ‘‘అంతా నీమీదే పెట్టానుగా! బరువో సులువో నువ్వే మోయాలి. నువ్వు చెప్పావని ఒప్పుకున్నా, అంతేమరి! ఆఁ! అన్నాడు.”

‘‘రేపే పొలం రిజిష్టరుచేసి నువ్వట్టా కూర్చో! మిగతా పెళ్లి ఏర్పాట్లన్నీ నేను చూసుకుంటా.”

‘‘ఏం పొలం, ఏం రిజిష్టరీ?” సాంబయ్య అదిరిపడ్డాడు.

‘‘ఏం పొలం ఏంటయ్యా? పిల్ల పేర ఐదెకరాల పొలం రాస్తామని ఒప్పుకొన్నాంగా?”

''ఏమిటి కనకయ్యా, నువ్వు మాట్లాడేది? నేను పొలం రాస్తానని ఎప్పుడన్నాను?''

''ఆరోజు చెప్పానుగా? అయినా ఐదెకరాల పొలం రాయందే నీకు వాళ్ళు పిల్ల నెట్టా యిస్తారనుకున్నావయ్యా?''

''ఇదిగో కనకయ్యా, ఇట్టాంటి తప్పుడు కూతలు కూస్తేనే నాకు వళ్ళు మండేది! నువ్వా మాట అసలు నాతో అనందే?''

''చెప్పాననుకొన్నానే? ఆ మిల్లు హడావిడిలో వచ్చానా? మర్చిపోయి వుంటాను.''

''అట్టారా దారికి, నాతో అనని మాట అన్నానంటే ఎట్టా వుంటదయ్యా నువ్వే చెప్పు?'' సాంబయ్య కొంచెం తగ్గి అన్నాడు.

''అయితే ఇప్పుడు చెప్తున్నా వినవయ్యా! పెళ్ళికూతురిపేర ఐదెకరాల మాగాణి రాయాలి. పెళ్ళి ఖర్చులు నువ్వే పెట్టుకోవాలి.''

''మనకు కట్నాలూ కానుకలూ రావాల్సిందిపోయి ఎదురివ్వాలా? ఏం సంబంధం తెచ్చావయ్యా సంబంధం?''

''ఆc!- కట్నాలు ఇస్తారు. కట్నాలు! కట్నాలు ఇవ్వగలిగిన వాళ్ళయితే రెండో పెళ్ళి ముసలాడికి ఎందుకిస్తారయ్యా? పెళ్ళి జరగాలంటే అయిదెకరాల మాగాణి ఐనా సరే రాయాల్సిందే.''

''పెళ్ళి ఖర్చుల వరకు పెట్టుకుంటా! కాని పొలం సెంటు భూమి కూడా రాయను.'' నిక్కచ్చిగా చెప్పాడు సాంబయ్య.

''రేపు నువ్వు హరీ అంటే ఆ పిల్ల గతేంకాను? ఆ మాట చెప్పు! ఇంత కర్కోటకం పనికిరాదు సాంబయ్యా! బాగా ఆలోచించుకో.''

''ఇందులో ఆలోచించేదేమీలేదు. చావు బతుకులంటావా - అది ఎవడు చూశాడు? అదే నాకంటే ముందు పోవచ్చు. మా దుర్గి పోలా? ఎవరు చూశారు?''

''అయితే నేను చెప్పేదేమి లేదు. వాళ్ళను మరో సంబంధం చూసుకోమని చెప్తా మరి'' అంటూ కనకయ్య లేచాడు.

''పిల్ల తండ్రికి చెప్పి ఒప్పించలేవా? ఉత్తరోత్రాల దాని భృతికి లోటులేకుండా చూస్తాను. పెళ్ళయిన తెల్లారినుంచి ఆ పిల్ల బాధ్యతలు నావే కదయ్యా? నా భార్య బాగోగులు నేను చూసుకోనూ? దుర్గమ్మను పువ్వుల్లో పెట్టి పూజించాను. దానికేం తక్కువ చేశాను?''

''ఏం తక్కువ చేశావ్? ఇంత విషం మింగించావ్. నిన్ను నమ్మి ఎవడయ్యా పిల్లనిస్తాడు? ఇస్తే దాని గొంతు కోసినట్టే. ముందుగా నువ్వు పొలం రాయందే ఏ దౌర్భాగ్యుడూ చూస్తూ చూస్తూ నీకు పిల్లనివ్వడు.''

మెట్లు దిగి పోతూ పోతూ అన్నాడు కనకయ్య ఈ మాటలు. అందుకే బతికిపోయాడు.

ఓ రోజు పొలాన్నుంచొస్తున్న వెంకటపతిని బలరామయ్య పనిగట్టుకొని పలకరించాడు:

"ఏం వెంకటపతీ! పెళ్ళీడుకొచ్చిన నిన్ను అట్టాపెట్టుకొని మీ నాయన మళ్ళీపెళ్లి చేసుకోబోతున్నాడంటగా?"

వెంకటపతి తలెత్తి బలరామయ్యకేసి అయోమయంగా చూశాడు. తన తండ్రి పెళ్ళిచేసుకోవటం ఏమిటి?

"ముసలాడి కొచ్చిందేమ్మిటా తొందర?"

"అదేంలేదే? ఎవరన్నారు?" వెంకటపతి నిలబడి అడిగాడు.

"నువ్వొట్టి అమాయకుడివిరా! మీ నాయన నీకు అన్యాయం చేస్తున్నాడా!"

"మా నాయన అట్టాంటివాడుకాడు. గిట్టనివాళ్ళెవరో మీతో అని వుంటారు."

"సరే! అట్టా అయితే మంచిదేగా! అబ్బా కొడుకుల మధ్యన మా కెందుకొచ్చినట్టు? ముసలాడు - వయసు మళ్ళాక ఇలాంటివి తలపెట్టాడని తెలిసి....." అని బలరామయ్య గొడుగు తిప్పుకుంటూ వెళ్ళిపోయాడు.

వెంకటపతి ఇంటికివచ్చి సావిట్లో గొడ్లకు మేతవేస్తున్న తండ్రిని చూశాడు. ఏదో అడగాలని మథనపడ్డాడు. నోరు పెగల్లేదు. తనే ఏదో తప్పుచేసినవాడిలా గొడ్లచావిట్లోనుంచి ఇంట్లోకి వచ్చాడు.

సాంబయ్య కొడుకువెంటే ఇంట్లోకివచ్చి "ఏ!ఒరెటా! అట్లా వున్నావ్?" అని అడిగాడు.

"ఏమీ లేదు."

"మరెందుకట్టా వున్నావూ?"

"ఎట్టా వున్నానూ?"

సాంబయ్యకు కొడుకు ధోరణి అర్థంకాలేదు. సంభాషణ మార్చి "జనపకట్టె గూడు ఏయించావా?" అన్నాడు.

"ఆఁ! ఇంకా అవలేదు. కురదలా పడింది. రేపు ఒక్కపూట వేస్తే అవుతుంది."

"ఎంతమంది కూలీలను పెట్టావేంటీ?"

"నలుగురు. ఇద్దర్నేమో పిల్లి పెసరచేనుదగ్గరకు పంపించా, అందుకని ఇవ్వాళ గూడు పడలా."

"వ్వాఁ! నీళ్ళు పోసుకొని అన్నం తిను. గడ్డం అదీమాసింది. రేపు మంగల్ని పిల్చి తలంటి పోయించుకో" అని సాంబయ్య పంచె పైన వేసుకొని బయటకెళ్లాడు.

వెంకటపతికి ఏడుపొచ్చినంత పనయింది. తనంటే అంత ప్రేమగా వుండే తండ్రిని గురించి అలా మాట్లాడిన బలరామయ్యమీద అసహ్యం వేసింది.

ఓ నెలరోజులు గడిచాక కనకయ్య సాంబయ్య దగ్గరకు వచ్చాడు. రెండు వేల రూపాయలు చేతిలో పెట్టి అన్నాడు - "ఆలస్యం అయిపోయింది."

''వారం అన్న పెద్దమనిషివి నెలరోజుల తర్వాతా తెచ్చేది?'' ముఖం అంతా చిట్లించుకొని అడిగాడు సాంబయ్య.

''ఇదిగో వడ్డీ! వూరికినే అట్టే పెట్టుకోలేదులే'' అని కనకయ్య లెఖ్ఖకట్టి ఇరవై రూపాయలు ఇచ్చాడు.

మామూలు పరిస్థితుల్లో అయితే కనకయ్య వడ్డీ ఇచ్చేవాడు కాదు. వాళ్లిద్దరిమధ్యా పెళ్ళి వ్యవహారంలో సంబంధాలు బెడిసివుండటాన సాంబయ్యను జోకొట్టే ఉద్దేశ్యంతో వడ్డీ డబ్బుకూడా ముట్టజెప్పాడు.

''ఎందుకు కనకయ్యా, ఈ వడ్డీలూ గిడ్డీలూ?'' అంటూనే సాంబయ్య డబ్బు, లెక్కపెట్టుకొని, లోపలికెళ్లి ఇనప్పెట్టెలో భద్రం చేసి వచ్చాడు.

''ఆ గంగుపాలెం పిల్ల పెళ్ళయిపోయింది విన్నావా?'' అన్నాడు కనకయ్య. సాంబయ్య ఎలా తీసుకుంటాడో చూడాలని మాట వదిలాడు.

''పెళ్లీ పెటాకులూను. ఈ వయసులో నాకు పెళ్లేంటయ్యా? నువ్వే పురెక్కించి ఎక్కగొట్టావ్! ఏదో మాట జారాను. అది జరక్కపోవటమే మంచిదయింది! నా భార్య పోయి ఇరవై ఏళ్ళయింది. మళ్ళీ చేసుకోవాలనే ఉద్దేశం ఇన్నాళ్ళుగా నాకు ఏ కోశానా రాలేదు. ఇప్పుడెందుకయ్యా నాకు పెళ్ళి? చావు తర్వాత మాలావు దుఃఖం అన్నట్టు!''

''సాంబయ్యా! నిజం చెబుతున్నా విను'' అని దగ్గరకు జరిగి గొంతు చిన్నది చేసి ''ఆ పెళ్ళి తప్పిపోవడం మంచిదయింది. సుందరరామయ్య రెండో పెళ్ళాం సంగతి విన్నావా?'' అన్నాడు.

సాంబయ్య కుతూహలంగా ముందుకు వంగి ''అప్పయ్యగారి సుంద్రామయ్యేనా? ఏమయింది?'' అన్నాడు.

''మొదటి సంబందం కొడుకు పాతికేళ్ళవాడున్నాడా? వాడికీ, సవితితల్లికి సంబంధం వుందట. వాడికి పుట్టినవాడేనట సుంద్రామయ్య రెండో పెళ్ళాం కొడుకు.''

''ఘోరకలిగా వుందే? ఛీ! ఛీ!'' అంటూ సాంబయ్య తీవ్రమైన ఆలోచనలో పడ్డాడు. తన ఊహల్లో అతను విన్నదానికంటే ఘోరమైంది చిత్రించుకుని చూసి నిట్టూర్చాడు.

''మరి నే వస్తా!'' కనకయ్య బాగ్ తీసుకొని లేచాడు. వడ్డీ డబ్బులు రుచి చూసిన సాంబయ్య ''పైకం అవసరమయితే వెనకాడద్దు. పట్టుకెళ్లు'' అన్నాడు.

సాంబయ్య దగ్గిర పోయిందనుకొన్న పరపతిని మళ్ళీ సంపాదించుకోగలిగినందుకు కనకయ్య సంతోషించాడు.

వెళుతున్న కనకయ్యను ఆపి తనమనసులో తన్నుకులాడుతున్న విషయాన్ని బయటపెట్టాడు:

''మా వెంకటపతికి ఈ యేడు పెళ్ళి చేద్దామనుకుంటున్నాను.''

''శుభస్య శీఘ్రం! సంబంధం చూడమంటావా?''

''మరి నీకు చెప్పిన దెందుకు?''

కనకయ్య చంకలెగ రేసుకుంటూ వెళ్ళిపోయాడు.

## 10

వెంకటపతికి ఇరువై ఐదు ఏళ్ళు వెళ్ళాయి. మనిషి కండలు తేలి బుసలు కొడ్తున్నాడు. మనిషి పక్కగా వెళ్తే చిత్రమయిన ఏదువాసన క్షణకాలం వచ్చేది! అతని పక్కన ఎక్కువసేపు నిలబడితే తల తిరిగిపోయేట్టు ఉంటుంది. ఎప్పుడూ ఏదో పనిలోనే మునిగి వుంటాడు. వ్యవసాయంలో తండ్రిని మించినవాడయాడు. నలుగురు పెట్టు ఒక్కడే చేస్తాడు. నిండు వడ్లబస్తా అవలీలగా ఎత్తుకొని బండిమీదకు విసిరేస్తాడు. ముఖం వళ్ళూ ఎప్పుడూ జిడ్డుఓడుతూ వుంటుంది. సాంబయ్య లక్షణాలు కొడుకు వెంకటపతి చాలావరకు పుణికి పుచ్చుకొన్నాడు. పోతే, వచ్చేదీ పోయేదీ అంతగా పట్టించుకొనేవాడు కాదు. తండ్రి వెయ్యి కళ్ళతో చూస్తుండటంచేత అతనికి ఆర్జన సంగతి అంతగా పట్టేదికాదు.

సాంబయ్య దొడ్లో మొన్నటిదాకా కోడెదూడ అని పిలిచేదాన్ని ఇప్పుడు గిత్త అంటున్నారు. ఆవుదూడ, కాలం జరుగుతుంటే, కోడెదూడ అయి, తర్వాత తనుకు తెలియకుండానే గిత్త అయిపోయింది.

వెంకటపతి అదే వయసులో వున్నాడు. నిగనిగలాడే కోడెదూడ పోట్లగిత్తగా మారిపోయినట్టున్నాడు.

వెంకటపతి వీధిన వెళ్తుంటే రచ్చబండమీదున్న ఊళ్ళో పెద్దలు తలోమాట మాట్లాడేవారు.

''సాంబయ్య ఇహ కొడుక్కు పెళ్ళి చెయ్యడనుకొంటా.''

''ఎందుకు చెయ్యడూ చూస్తూండు. లచ్చలు కొట్టాలని చూస్తున్నాడు.''

''ఇరవైవేలు రొఖ్ఖం ఇస్తామని వస్తే అరవైవేలు అడిగాడట సాంబయ్య.''

''ఆఁ- ఇస్తారు. ఇంకా రెండేళ్ళు వాడి నెత్తిమీద కొస్తే ఎదురివ్వాల్సి వుంటుంది.''

''బెండకాయ ముదిరినా బ్రహ్మచారి ముదిరినా లాభం లేదు.''

''ఆ మధ్య మా అత్తారి ఊళ్ళోనే ఓ మంచి సంబంధం కుదిరింది. ఏడెకరాల పొలం, నగా నట్రా బాగా ఇచ్చేవాళ్ళే! సాంబయ్య పదెకరాలన్నా ఇవ్వకపోతే లాభంలేదని దాదాపు కుదిరిన సంబంధం వదులుకొన్నాడు.''

''అసలా సాంబయ్యేం మనిషయ్యా! కొడుకుని అచ్చోసిన ఆంబోతులా ఊరిమీద వదిలి, రూపాయలూ, అణాలూ లెఖ్ఖపెట్టుకొంటూ కూర్చుంటాడు.''

''వెంకటపతి మంచోడేనయ్యా! మేదకుడు.''

''అందుకే తండ్రి ఆటలు సాగనిస్తున్నాడు. మరోహడయితే సాంబయ్యను నోరెత్తనిస్తాడా?''

''వాడికి పాతికేళ్ళు నెత్తిమీద కొచ్చాయ్! అయినా బాబుముందు పిల్లిలా నిలబడతాడు.''

''అదేమన్న మాటలే. కొడుకు తండ్రికి అణకువగా వుండటం మంచిదేగా? అసలా సాంబయ్యకుండాలి బుద్ధి! కొడుకు మంచి చెడ్డలు చూడాల్సింది ఆయన. ఏ తరుణంలో జరగాల్సింది ఆ తరుణంలో జరగాలి. వచ్చిన మంచిసంబంధాలన్నీ దురాశకుపోయి వదులుకున్నాడు. ముప్పై ఏళ్ళు వచ్చేదాకా సాంబయ్య కొడుక్కు పెళ్ళి చెయ్యడు. ఆ తర్వాత చెయ్యాలనుకున్నా పిల్లనిచ్చే వాళ్ళుండరు.''

''ఎందు కివ్వర్లేవయ్యా? వాణ్ణి చూశా ఇస్తారు - వాడి ఆస్తి చూసిగాని! డెబ్బై, ఎనభై ఎకరాల ఆసామి, లక్షాధికారి. డబ్బు ముందు, తర్వాత మంచి చెడ్డలు.''

రచ్చబండమీద జరుగుతోన్న లోకాభిరామాయణం హఠాత్తుగా ఆగిపోయింది!

వెంకటపతి బీడీదమ్ములాగుతూ రావడంచూసి, పెద్దలు ఈ కొత్తసంవత్సరం సంకురుమయ్య దేనిమీదగా పోతాడా అన్న చర్చలో పడ్డారు. వెంకటపతి వచ్చి పెడగా కూర్చున్నాడు. అందరితో కలిసి మెలిసి మాట్లాడాలని వెంకటపతికి వుంటుంది. కాని కలవలేడు. తను మాటల్లో కల్పించుకొని మాట్లాడటానికి ఏమీ వున్నట్లు అనిపించదు. అలాంటి సందర్భాల్లో ఎక్కడో అక్కడ, ఎవరో ఒకరు తన తండ్రి మీదగానీ, తనమీదగానీ పుల్లవిరుపుగా మాట్లాడినట్టు తెలుస్తుంది. ఆ మాటలు సూటిగా లేకపోవటంతో, తను ఎదురుతిరిగి సమాధానం చెప్పటానికి ఉండదు. డొంకతిరుగుడుగా మాట్లాడి, మళ్ళీ నాలుగు అనటానికి తనకున్న అనుభవమూ, తెలివీ, మాటలూ చాలవు.

''వెంకటపతీ? పప్పన్నం ఎప్పుడు పెడతావురా?'' అందర్లోకీ వృద్ధుడయిన పరమయ్య అడిగాడు.

అసలే మాటలు దొరకని వెంకటపతి, పెళ్లిమాట వచ్చేసరికి బిగుసుకుపోయాడు. దానికితోడు మనిషికి చచ్చేంత బిడియం.

''ఏంరా? మాట్లాడవేం? వయసు దగ్గరపడినవాడ్ని నీ పప్పన్నం తినకుండానే పోతానేమో?''

వాళ్ళు కూర్చున్న రచ్చబండకంటే కఠినంగా నవ్వులు వినిపించినై.

''వుండవయ్యా నువ్వు? అసలు వాడికి...వాడికి పెళ్ళంటే ఇది లేదేమో?'' కామయ్య అన్నాడు. ఈ సారి అంత కఠినంగా పైకి నవ్వలేక లోలోపలే నవ్వుకొన్నారు.

''ఛ! అదేం మాట? వాడి తండ్రికే ఇష్టం లేదయ్యా!'' లౌక్యంగా అన్నాడు కాంతయ్య.

వెంకటపతి చరున లేచాడు. అంతదూరంలో మునగదీసుకొని పడుకొని వున్న కుక్కను కర్రతో ఓ బాదు బాది చరచరా వెళ్ళిపోయాడు.

''అంట్లవెధవ! దాన్ని కొడతాడెందుకు? ఆ కొట్టేదేదో వాడి బాబును జబిర్తే పోలా?" ముసలాయన అన్నాడు.

''చూస్తా వుండు. అదీ ఎప్పుడో చేస్తాడు" జోస్యం చెప్పాడు కాంతయ్య.

వెంకటపతి నేరుగా మాలపల్లి వెళ్ళి చింతడి ఇంటిముందు ఆగి కేకేశాడు:

''ఒరే చింతాయ్? చింతాయ్?"

చింతడి పెళ్ళాం గబగబా బయటకొచ్చి ''అయ్యో! దొరగారా?" అంది.

''ఏమేవ్? నీ మొగుడెక్కడికి పోయాడే?" చింతడి పెళ్ళాం కళ్ళలోకి ఆకలిగా చూస్తూ అడిగాడు. అది ముడుచుకుపోయింది. పైట సర్దుకొని ''ఇంట్లోనే వున్నాడు" అంది.

''మరి పిలుస్తుంటే బయటకు రాడేం?"

''తాగి వల్లు తెలవకుండా పడుండాడు."

''గాడ్డికొడుకు! తెల్లవారుజామున రమ్మను. తూరుప్పొలానికి ఎరువు తోలాలి."

''అట్టాగే వత్తాడు దొరా!"

''వస్తాడా?" ఏం మాట్లాట్టానికీ తోచక, దాంతో ఇంకాసేపు మాట్లాడాలనీ, దాన్ని చూస్తూ నిలబడాలనీ అన్నాడు.

''తప్పకుండా వొత్తాడు దొరా! నేను తెల్లారగట్టేలేపి పంపుతాగా?" అంటూ వెనక్కు వెనక్కు గుడిసెకేసి నడిచింది.

''ఏం వస్తాడే? తాగుబోతు గాడ్డికొడుకు" అంటూ, ఎవడో తోసినట్టు అక్కడనుండీ కదిలివెళ్లిపోయాడు.

ఇంటికొచ్చి మంచంమీద పడుకోబోతున్న వెంకటపతిని చూసి తండ్రి అడిగాడు: ''ఏరా? ఇంత పొద్దుపోయిందాకా ఎక్కడున్నావ్?"

''రచ్చబండ దగ్గర కూర్చున్నాలే." విసుక్కున్నట్లు చెప్పాడు వెంకటపతి.

''అక్కడేడవున్నావురా? నేనింటికొస్తూ చూస్తే అక్కడలేవే?" సాంబయ్య కటువుగా అన్నాడు.

వెంకటపతి తగ్గిపోయాడు. ''అక్కడ కాసేపు కూర్చుని పల్లె కెళ్ళాలే."

''ఎందుకురా పల్లెకు ఎల్లింది?" తండ్రి గద్దించి అడిగాడు.

''చింతడ్ని నైపోగు తోలటానికి తెల్లారగట్ట రమ్మన్నా" ధైర్యాన్ని పుంజుకొని చెప్పాడు కొడుకు

''చింతడెందుకురా మళ్ళీ? ఏసోబు కొడుకుని రమ్మని చెప్పాంగా?"

''నాకేం తెలుసూ?"

''నీముందే గదరా చెప్పాను?"

''మర్చిపోయాను."

''పోతావ్‌రా, పోతావ్!" మొలతాటికి కట్టుకొన్న తాళంచెవుల గుత్తిని సర్దుకొని-పడుకున్నాడు సాంబయ్య.

ఉగాది వెళ్ళింది. మాగాటి భూమి నెర్రెలుకొట్టి నోళ్ళు తెరచి రోహిణీ

ఎండలు మేశాయి. వెంకటపతి భూమికి ఎరువులు తోలాడు.

తొలకరి వానలు పడ్డాయి. ఏరువాకొచ్చింది. కొత్త కాలవ వరదనీటితో పొంగి పొరుతోంది. వెంకటపతి భూమి దున్ని నీరు పెట్టాడు. నాటు వేశాడు.

వినాయకచవితి వచ్చింది. వెంకటపతి కలుపు తీసి ఎరువులు చల్లి నీరు పెట్టాడు.

దసరా పండగ వచ్చింది. పైరు ఏపుగా పెరిగింది. వెంకటపతి పాలకంకులకు మందుకొట్టి పురుగును చంపాడు.

దీపావళి పండగ కోటి దీపాల వెలుగుల్లో కొత్త ఆశల్ని మోసుకొని వస్తూండగా వెంకటపతి వరికోతలు ఆరంభించాడు. ఓదెలు ఆరగానే కుప్పలు వేయించసాగాడు. తూరుప్పొలం కుప్పవెయ్యటం అవగానే, కొత్తకాలవకింద పొలం కుప్ప వేస్తుండగా వెంకటపతికి మూడు తక్కువగా మూడు పదులు నిండాయి.

పొద్దువాలకముందే కుప్పవెయ్యటం పూర్తయింది. కూలీలు జట్టుగా కలిసి వెళ్లిపోయారు. గుంటలో కాళ్లూ చేతులూ కడుక్కొని, తలగుడ్డతీసి విదిలించుకొంటున్న వెంకటపతికి, చేలో పరిగేరుకొంటున్న చింతడి పెళ్ళాం మాణిక్యం ఒంటరిగా కన్పించింది. ఓరచూపులు చూస్తూ కుప్ప వెనక్కు చేరింది. వెంకటపతిలో అణిగివున్న భౌతిక వాంఛలు మేలుకొన్నాయి. ఉడుకు రక్తం మెదడులోకి చిమ్మింది. వరికుప్పకేసి దూకుడుగా వచ్చాడు. కుప్పకానుకొని నిల్చున్న మాణిక్యం - తనను చూసి పారిపోతుందనుకొన్న మాణిక్యం - వెంకటపతి కళ్ళలోకి సూటిగా చూసి కిసుక్కున నవ్వింది. వెంకటపతి మాణిక్యం ముందుకు వచ్చాడు. లేడిపిల్లను నోటికి కరచుకోబోయేముందు అటూ ఇటూ చూసే పెద్దపులిలా వెంకటపతి తలతిప్పి పక్కకు చూశాడు. బాణాకర్ర తీసుకొని గనెం మీద నడిచివస్తోన్న సాంబయ్య కన్పించాడు! కుప్ప సర్దుతున్నట్టు చేతులాడిస్తూ కుప్పచుట్టూ తిరగసాగాడు. అల్లంత దూరంలో సాంబయ్యను చూసిన మాణిక్యం పరిగబుట్ట నెత్తిన పెట్టుకొని, మాగాటికి అడ్డంపడి పోసాగింది. తూర్పు గనెంమీద వస్తున్న సాంబయ్య అడ్డంతిరిగి దక్షిణపు గట్టు ఎక్కాడు. సాంబయ్యను తప్పించుకొన్నాననుకొని తలవంచుకొని ఉరకలు తీస్తున్న మాణిక్యం నెత్తిమీదబుట్ట వెనకనుంచి గుంజగా, వెనక్కు ఒరిగిపోయి ఆగిపోయింది.

"లమ్డిముండా! దించు గంప!" సాంబయ్య కంఠం గర్జించింది. మాణిక్యం తత్తరపోయింది. బుట్టకింద పెట్టి "దొరగారూ! పరిగ! పరిగేరుకున్నా!" అంది.

సాంబయ్య బుట్టలోవున్న రాలిపోయిన వరికంకుల్ని కర్రతో కలియతిప్పాడు. బుట్ట అడుగుదాకా కర్రగుచ్చి చూసిన సాంబయ్యకు అనుమానానికి ఆస్కారం దొరికింది.

"ఎత్తవే? ఆ పై పరిగంతా యెత్తి అడుగునేముందో చూపించు!"

"అయ్యగారూ! అంతా పరిగే అయ్యగారూ! అంతా పరిగే...." మాణిక్యం మాట పూర్తికాకముందే సాంబయ్య కర్రతో మాణిక్యం మెడవంచి "తియ్

ముందు, తప్పుడు ముండా! ఆ బుట్ట అడుగున ఏముంది? వడ్లుకాదూ?" అన్నాడు.

మాణిక్యానికి గుండెలు జారిపోయినయ్.

''ఎన్నోలేవు దొరా!"

''చత్! ఇంకా మాట్లాడతావ్. ఓదెలు నుసిమి బుట్టలో పోసుకున్నావ్. పద ఊళ్ళోకి. ఇవ్వాళ నీ చమడా వలిపిస్తా." సాంబయ్య మాణిక్యాన్ని కర్రతో గనెం మీదనుంచి నెట్టాడు.

కిందపడ్డ మాణిక్యం లేచి, జారిపోయిన కుచ్చెళ్ళు దోపుకుంటూ ''నేనేం దొంగతనం చేశానా దొరా?" అంది. దాని గొంతులో తిరుగుబాటు ధ్వని వినిపించింది సాంబయ్యకు.

''కాకపోతే ఎవరిచ్చారే నీకీధాన్యం?" సాంబయ్య కొంచెం వెనక్కు తగ్గి అన్నాడు.

''చిన్న దొరగారే!"

సాంబయ్య నిశ్చేష్టుడైపోయాడు.

మాణిక్యం బుట్టలోనుంచి జారిన పరిగ ఎత్తి బుట్టలో వేసుకొంది. బుట్ట నెత్తిన పెట్టుకొని, సాంబయ్యకేసి నిర్లక్ష్యంగా చూసి, దూరంగా కనిపిస్తోన్న కుప్పకేసి తిరిగి, పై పళ్ళతో పెదవిని నొక్కిపట్టి, అలవోకగా చూసి అదే పోత పోయింది.

సాంబయ్య కుప్పకేసి చూశాడు. వెంకటపతి కుప్ప సర్దుతూ తల పక్కకు తిప్పలేదు. దూరంగా తండ్రి నిలబడి వున్నంతసేపూ వెంకటపతి, అదీ ఇదీ సర్దుతూన్న మిషమీద అక్కడే ఉండిపోయాడు. సాంబయ్యకు ముందుకు వెళ్ళటానికి కాలాడలేదు. గిర్రున వెనక్కు తిరిగాడు. అక్కడ వంచిన తల ఇంటికి వచ్చిగాని ఎత్తలేదు సాంబయ్య.

వెంకటపతిని అని ఏం లాభంలేదు. తప్పు తనదే. ముప్పై ఏళ్ళు వస్తున్నాయ్. అయినా వాడికి తను పెళ్ళి చేయలేదు. ఉప్పూ, కారం తినే శరీరం! వాడి తప్పేముంది? వాడు కట్టడి తప్పుతున్నాడు. ఇంక సాచాత చేసి లాభంలేదు. తను ఇంకా చూస్తూ కూర్చుంటే వెంకటపతి తన వశం తప్పుతాడు. పొలంలో పండిన ధాన్యం సరిగా ఇంటికి చేరదు. అట్టా ఆడదానికి అలుసు ఇస్తే వాడెందుకు పనికొస్తాడు? ఎవతిబడితే అదే అందినంతవరకు పట్టుకుపోతే? ఇవ్వాళ వోదెలు నలిచింది. రేపు కల్లంలో వడ్లే తట్టతో తీసుకెళ్ళచ్చు. దాన్ని చూసి మరొకతి ఎగబడుతుంది. మినుమూ, పెసరా అయితే ఇంటికి సగమే చేరుతుంది. ఇంతకాలంగా వెంకటపతికి ఎందుకు పెళ్ళిచేయలేదూ? సాంబయ్య అంతరాంతరాల్లో అనంతకాలంగా నిద్రిస్తున్న కోరిక మేలుకోకుండానే అణగారిపోక తప్పదనే బాధలో పడిపోయాడు.

వారం రోజులుగా మనిషిమీద మనిషిని కనకయ్య ఇంటికి పంపిస్తున్నాడు సాంబయ్య. కనకయ్య ఊళ్లో లేడు - ''ఇదిగో! రేపేవస్తా"నని ఇంట్లో చెప్పి వెళ్లిన మనిషి.

వెంకటపతి తండ్రి ఎదురైతే ముఖం చాటేసి తిరుగుతున్నాడు. సాంబయ్యకు కొడుకుని తలెత్తి చూసేందుకు కూడా మనస్కరించటంలేదు. ఊరికి వెళ్ళిన కనకయ్య ఎప్పుడొస్తాడా అని అదేపనిగా ఎదురుతెన్నులు చూస్తున్న సాంబయ్యకు ఓ రోజు మునిమాపువేళ గొంది మలుపు తిరిగి తన ఇంటివైపే వస్తూన్న కనకయ్యను చూసేసరికి ప్రాణం లేచివచ్చింది.

''ఏమిటంటా అంత అర్జంటు పని? కబురుమీద కబురు పెట్టావంట?'' వరండాలోకి వస్తూనే అడిగాడు కనకయ్య.

''అవునయ్యా! రేపే వస్తానని వెళ్ళావటగా? ఎప్పుడొచ్చావ్ ఊళ్ళోకి?'' సాంబయ్య అప్యాయంగా అడిగాడు.

''ఎప్పుడో రావడమా! ఇంట్లోకి అడుగు పెడ్తుండగానే మా ఆవిడ చెప్పింది. ఇంట్లో కన్నా వెళ్ళకుండా తిన్నగా నీ దగ్గరకే వస్తున్నా! ఏమిటి విశేషం? ధాన్యం నూర్చారా? ఎప్పుడూ ఎనక చిక్కున అమ్మేవాడివి. ఏం, ఈ యేడు తొందరపడుతున్నావ్?''

''ధాన్యం రేటు ఎట్టుందేం?'' మాటవరసకన్నట్టు అడిగాడు సాంబయ్య.

''రోజుకు అణా, అర్ధనా పెరుగుతూనే వుంది. పై ముఖమే తప్ప తిరుగు ముఖం ఉన్నట్టులేదు. ఇప్పటికే ఐదు లక్షల దాకా కొనుగోలు చేశాం. అందుకే తెల్లారే వద్దామనుకొని వెళితే వారంరోజులు పట్టింది. అంతా గందరగోళంగా వుందనుకో. ఈ వారం దాటితే రేపెట్టా వుంటదో చెప్పలేం'' ఊపిరి సలపకుండా మాట్టాడసాగాడు కనకయ్య.

''ఇంకా నూర్పిళ్ళన్నా కాలేదు మాకు. మొన్ననేగా కుప్పవేతలు పూర్తయింది?''

''అయితే నీ పైకం సంగతేనా? మళ్ళీ అమ్మకాలు సాగితేనేగాని డబ్బు తిరగదు. ఒక నెలాగితే సర్దుతా'' ఆ మాట చెప్పి కనకయ్య లేవబోయాడు.

''ఆగవయ్యా స్వామీ, ఇప్పుడు డబ్బు సంగతి నిన్నెవడడిగాడూ?''

కనకయ్య తేరుకున్నాడు. మరెందుకు పిల్చినట్టు? ఆలోచనలో పడ్డాడు.

''కనకయ్యా!'' సాంబయ్య కంఠంలో ఆర్ద్రత తొణికింది.

''ఏవిటి సంగతి సాంబయ్యా? తేల్చు మరి'' సర్దుకొని కూర్చొని కుతూహలంగా అడిగాడు కనకయ్య.

''ఆ బుర్రిపాలెం సంబంధం ఏమయింది?''

వెంకటపతికి అనేక సంబంధాలు తెచ్చీ, సాంబయ్యచేత తిరస్కరించబడింతర్వాత కనకయ్య వెంకటపతి పెళ్ళి గురించిన ఆలోచనల్నే బుర్రలోనుంచి పూర్తిగా తోసేశాడు. ఇది అయ్యేదీ పెట్టేదీ కాదు అనే నమ్మకంలో వున్న కనకయ్య ''ఆ – నీతో కుదర్దు లేవయ్యా!'' అన్నాడు.

సాంబయ్య ముఖంలోకి నవ్వు తెచ్చుకొని ''నేరం నామీదే పెడుతున్నావ్? నేను కోరిన సంబంధం నువ్వు తెస్తే నేను కాదన్నదెప్పుడు?'' అన్నాడు.

''అయితే ఆ బ్బురిపాలెం అమ్మాయి పెళ్ళి ఇంకా కుదిరినట్టులే. సంబంధం ఖాయం చేయించమంటావా?''

''మళ్ళీ అదే పాటా? నీ వరస నీదేగాని నా మాట చెవున పడనీయవేం?'' అన్నాడు సాంబయ్య.

ఈపారి కనకయ్య చిత్తయిపోయాడు.

''ఏవిటి సాంబయ్యా? నాన్చక నీ మనసులో వుందేమిటో తేల్చి చెప్పు.''

''బలరామయ్యగారి ఆఖరి అమ్మాయి లేదూ?'' ఆ మాట వింటూనే కనకయ్య బిల్లంగోడులా లేచిపడ్డాడు!

''మూడేళ్ళనాడు రెండోపిల్ల సంబంధం అడిగితే బలరామయ్య ఏమన్నాడో తెలుసా?''

''ఏమన్నా డేమిటి?'' సాంబయ్య గుబురు కనుబొమలు కదిలాయి.

''ఊరుబోయిన వెంకయ్య మనవడికి నా కూతుర్ని అడగటానికి వచ్చావా? మళ్ళీ ఆ ఊసు ఎత్తితే చెప్పు తీసుకు కొడ్తా అన్నాడు బలరామయ్య.''

''కొట్తానన్నాడు కాని కొట్టాడా?'' సాంబయ్య చలించకుండా అన్నాడు.

''ఈసారి కొడతాడు. వీధిలో పడేసి మరీ కొడ్తాడు! సాంబయ్యా! నువ్వు ఆలోచించే మాట్లాడుతున్నావా?'' అన్నాడు కనకయ్య.

''నువ్వు చెప్పింది మూడేళ్ళనాటి బలరామయ్య సంగతి! ఇవాల్టి బలరామయ్య సంగతికాదు. వెంకటపతి ఊరుబోయిన వెంకయ్య మనవడేకాదు, షావుకారు సాంబయ్య కొడుకు!'' మీసం దువ్వుతూ, గంభీరంగా ముఖంపెట్టి, నిండుగా అన్నాడు సాంబయ్య.

కనకయ్య బ్బుర నిప్పుశెగకు మంచు కరిగినట్టు కరగసాగింది.

'అమ్మ సాంబయ్యా? ఏమోననుకున్నాను! ఎంతవాడివయ్యావ్?' అనుకొన్నాడు మనసులోనే.

అవును, సాంబయ్య చెప్పిందే వాస్తవం. ఈనాడు పరగణాలో వున్న పెద్ద మోతుబరి ఆసాముల్లో ఒకడు సాంబయ్య. సాంబయ్య కేం తక్కువ. ఒక్కడే కొడుకు. ఇంట్లోకి వచ్చేదేకాని బయటకు పోయేది ఏమీలేదు. నిజం చెప్పాలంటే ఈరోజున బలరామయ్య కేముంది ? నలుగురు కొడుకులూ నాలుగు దార్లయారు. ముగ్గురు కూతుళ్ళు పెళ్ళిళ్ళయి కాపరాలకు వెళ్ళారు. ఇహ వున్నది ఆఖరు పిల్లే. వెనకటిస్థితిలో వుంటే ఆ పిల్ల పెళ్ళి ఏనాడో చేసేవాడే. ఇప్పుడు బలరామయ్య దగ్గిరేముంది ? పిల్లకు కట్నం ఇవ్వటానికి - ఉన్నదేదో అప్పులకే సరిపోదే !

''ఏమిటి కనకయ్యా ఆలోచిస్తున్నావ్? నేను ఆస్తిపరుణ్ణన్నది నిజంగాదా? ఈనాడు బలరామయ్య ఏమీ లేనివాడనేది అబద్ధమా?'' సాంబయ్య మాటలు సూటిగా వచ్చి కనకయ్య గుండెలమీద తన్నాయి. కనకయ్య కాసేపు తటపటాయించి గుటకలు మింగుతూ అన్నాడు.

''ఓడలు బళ్ళయినా బళ్ళు ఓడలయినా బలరామయ్య నీతో వియ్యమందుతాడన్నమాట కల్ల!''

నిండైన సాంబయ్య గుండెలు ఉప్పెననాటి సముద్రపు అలలలా లేచి విరిగి పడి కొట్టుకొన్నాయి.

''నువ్వు ఏది కల్లా, ఏది కలా అనుకుటున్నావో, అదే నా యీ కళ్ళ ముందు జరగాలని ఇరవై రెండేళ్ళగా గుండెల్లో పెట్టుకొని మగ్గిపోయాను-తెలుసా?''

కనకయ్య బిగిసిపోయి సాంబయ్య ముఖంలోకి చూశాడు. సాంబయ్య ముఖం జేవురించి వుంది. అతని కళ్ళు నివురూదిన నిప్పు కణికల్లా వున్నాయి. ఎంతటి మనో నిశ్చయం? ఏం పట్టుదల? అంతకుమించి అర్థంచేసుకోలేక పోయాడు కనకయ్య.

''కనకయ్యా! ఇవ్వాళ మంచి రోజు, మాట్లాడొస్తావా?'' ఆత్మవిశ్వాసం ప్రతిమాటలోనూ ధ్వనించింది.

''నేనా!'' జావకారిపోయాడు కనకయ్య.

సాంబయ్య తనను ఇంత చిక్కుల్లో పెడ్తాడనీ, తన తెలివితేటల్నీ, లౌక్యాన్నీ, కార్యదక్షతనూ తృటికాలంలో కొట్టేయగలడని ఎన్నడూ ఊహించలేదు. తనను పరీక్షకు పెట్టి, తన అసమర్థతను తన ముఖాన్నే అంటించి, వీధిలో పడేయగల సామర్థ్యం, తెలివి, పట్టుదల సాంబయ్యకున్నయ్యనేది తను ముప్పైఏళ్ళగా గుర్తించలేకపోయాడు.

''నీవల్ల కాకపోతే చెప్పు, ఆ రవణమ్మనే మాట్లాడమంటాను.''

''ఏ రవణమ్మా! బలరామయ్య పెత్తల్లి కూతురు రవణమ్మే?''

''ఆ, ఆ రవణమ్మే? అడపా దడపా వందా రెండూ అంటూ అప్పు పట్టుకు పోతుందిలే! ఆమే ఆమధ్య ఈ విషయం కదిలించిందిలే!''

''ఎట్టెట్టా? ఏమంది రమణమ్మా?''

''సాంబయ్యన్నా! ఈ ఏడన్నా అబ్బాయికి పెళ్ళి చేస్తారా అంది!''

కనకయ్యకు అందులో ప్రత్యేకమైన అర్థం ఏదీ గోచరించలేదు. ''ఆ- అడిగింది. అడిగితే?'' అన్నాడు బుర్ర గోక్కుంటూ.

''అడిగట్లో సంబంధం పెట్టుకొని ఎక్కడెక్కడో వెతుకుతా వెందుకు? ఊళ్ళో సంబంధం. బలరామయ్యను కదిలించి చూడరాదా అంది.'' సాంబయ్య చుట్ట వెలిగించి గుప్పుగుప్పున పొగ వదుల్తూ ''అదీ సంగతి!'' అన్నాడు.

''మరి ఆ రవణమ్మనే అడిగి చూడమనలేకపోయావా?'' ఆలోచనలో పడి అన్నాడు కనకయ్య.

''ఆ మాత్రం తెలియక కాదు నిన్ను పిల్చింది. రవణమ్మ, ఏమాత్రమో బలరామయ్య అభిప్రాయాన్ని పసికట్టకపోతే ఆ మాట వచ్చి నాతో అనదు. ఆమె ఉద్దేశం ఇక నన్ను రంగంలోకి దిగమని!'' గుప్పుగుప్పున చుట్టపొగ వదుల్తూ అన్నాడు సాంబయ్య.

సాంబయ్య చెప్పిందంతా సబబుగానే కన్పించింది కనకయ్యకు. అయితే మనసులో ఓ అనుమానం కదిలింది. రవణమ్మ సాంబయ్య దగ్గిర తన పబ్బం గడుపుకోటానికి అలా చెప్పలేదుగదా? నిజంగా బలరామయ్య అభిప్రాయాన్ని తెలుసుకొనే దారం వదిలిందా?

''కనకయ్యా! నీచేత కాకపోతే చెప్పు, మరొకళ్ళని----''

సాంబయ్య మాట పూర్తి కాకుండానే ''ఇక నాకొదులు! నే చూసుకుంటా!'' అన్నాడు కనకయ్య.

''ఇవ్వాళే మంచి రోజు.'' సాంబయ్య తిరిగి గుర్తు చేశాడు.

కనకయ్య ఈ విషయంలో తనేమీ తొందరపడలేదని మనస్సుకు సర్దిచెప్పుకొని లేచాడు.

కనకయ్య ఇంటికి వెళ్ళి, ఆదరాబాదరా రెండు మెతుకులు గొంతులో వేసుకొని, బలరామయ్య ఇంటికి బయులుదేరాడు. బలరామయ్య తండ్రి తాతలనాటి స్థితిగతులూ, ఈనాటి బలరామయ్య పరిస్థితీ, కనకయ్య తన స్మృతిపథం లోంచి తవ్వి తోడి మననం చేసుకోసాగాడు.

బలరామయ్య తండ్రి వీరభద్రయ్యగారు జిల్లా మొత్తం మీద పేరుమోసిన ధనిక స్వాముల్లో ఒకడు. వెనకటి రోజుల్లో ఇంగ్లీషుదొర జిల్లా కలెక్టరుగా వున్నప్పుడు ఆ ప్రాంతం వచ్చి వీరభద్రయ్య గారింట్లోనే మకాం చేశారు. ఊళ్ళో ఉన్న ముప్పాతిక కుటుంబాల వాళ్లు వీరభద్రయ్యగారి ఉప్పూపులుసూ తిన్నవాళ్ళే. అంతా జమీందారీ పద్ధతుల్లోనే నడిపించుకొన్నాడు ఆయన బ్రతికున్న రోజులన్నీ. ఆయనకు బలరామయ్య ఒక్కడే కొడుకు. కూతుర్ని చింతపల్లి జమీందారీ వంశంలో ఇచ్చారు. బలరామయ్య తండ్రి ఆస్తితోపాటు ఆస్తిపరులకుండే అహంకారాన్నీ, అభిజాత్యాన్నీ వారసత్వంగా పొందాడు. అయితే తండ్రిలోవున్న వితరణబుద్ధీ, మర్యాదా, మన్ననా కొడుక్కి రాలేదు. ఉన్నదానికంటే హెచ్చులు చెప్పకోవటం, గొప్పలకుపోయి తలకుమించిన పనులు చేయడం బలరామయ్యకు స్వతహా వచ్చిన గుణం. నలుగురు కొడుకుల్ని ఒకళ్ళ తర్వాత ఒకళ్ళని బస్తీకి పంపించి చదివించాడు. పెద్ద వాళ్ళిద్దర్నీ థర్డుఫారం చదువుకు మదనపల్లి, ఋషీవాలి పంపించాడు. అక్కడ తిండి సరిగాలేదని కూనూరుకు మార్పించాడు. వాళ్ళ చదువులకు వేనకువేలు తగలేశాడు. వాళ్ళు మొత్తం నాలుగేళ్ళకంటే ఎక్కువ చదవలేదు. చదివిన క్లాసే రెండేసిసార్లు చదివి ఫిఫ్త్‌ఫారంఅన్నా పాసవకుండానే ఇంటికి చేరారు. ఇంటి కొచ్చిం దగ్గర్నుంచీ సీమదొరల్లా ప్రవర్తించసాగారు. అందినంత వరకు డబ్బు జేబులో వేసుకొని, బెంగుళూరు, మద్రాసు, నెలలకొద్దీ తిరిగి, అప్పులు చేసి డబ్బుకోసం ఇంటికొచ్చే వాళ్ళు.

మూడోవాడు శ్రీనివాసరావుకు మాత్రం నాలుగు అక్షరం ముక్కలు అబ్బినై. స్కూలుఫైనల్ పాసయి తండ్రి కోర్కెను నెరవేర్చాడు. పెద్దవాళ్ళిద్దరూ భాగాలు పంచమని తగాదా పడుతున్న రోజుల్లో, వాళ్ళిద్దరకూ పెళ్ళిళ్లు చేసాడు తండ్రి.

పెళ్ళి చేస్తే పిచ్చి కుదుర్తుందేమోనని ఆశించిన బలరామయ్యకు అసలుకే మోసం వచ్చిందన్న సంగతి గ్రహించడానికి ఎక్కువకాలం పట్టలేదు. కట్నంగా వచ్చిన డబ్బు వాళ్ళ చేతులో పడేదాకా తండ్రిని నిలవనివ్వలేదు. ఆడపిల్లల పెళ్ళిళ్ళయేదాకా, ఆస్తిపంపకాలు చేయడానికి వీల్లేదనీ, అందుకు ఒప్పుకున్న కొడుకులకు వాళ్ళ కట్నంతాలూకు డబ్బు ఇచ్చేశాడు. పెద్దవాడు భార్యనూ, పిల్లల్నీ తీసుకెళ్ళి పట్నంలోనే కాపురం పెట్టాడు. రెండోవాడు పెళ్ళాం పిల్లల్ని ఊళ్ళోనే తండ్రి మీద వదిలేసి అంతులేకుండా పోయాడు. తన పని తడిసిన అడుసులా అవడం గ్రహించిన బలరామయ్య - మూడో కొడుకు, పెద్దకూతురు పెళ్ళిళ్ళు చేశాడు. మూడో వాడికి బాగానేవున్న సంబంధమే వచ్చింది. అవతల ఒక్కతే కూతురు. వాడి పని దాదాపు ఇల్లరికంలాంటి దయింది. వాడు పూర్తిగా అత్తవారింట్లోనే మకాం వేశాడు. మామగారి ప్రోద్బలంతో 'నా ఆస్తి నాకు పంచండి' అని మూడు నెలలకు ఒకసారి కబురు చేయడం మొదలుపెట్టాడు. ఓ రోజు మూడోవాడి మామగారే స్వయంగా వచ్చి, నలుగురు పెద్దల్ని చేర్చి గొడవ చేశాడు.

"ఈ ఇంట్లో ఎవరి కందినంతవరకు వాళు తినేస్తున్నారు. పెద్ద వాళ్ళిద్దరికీ ఇప్పటికి ఇచ్చింది వాళ్ళ ఆస్తి వాటాలో సగానికి పైగానే వుంటుంది. ఇంకా పెళ్ళికావాల్సినవాళ్ళు ఇద్దరు కూతుళ్ళున్నారు. ఇట్లా ఎవడి పంటికింద పడింది వాడు నమిలేస్తుంటే, చివరకు నా అల్లుడుకి మిగిలేదేమిటి? ఐదేళ్ళుగా వాడు నీదగ్గర ఎర్రని ఏగానీ ముట్టలేదు. వాడి వాటా తాలూకు, పంటా వగైరా ఎంతవుతుందో చూడు. కావాలంటే నీ కొడుకులూ, నువ్వూ కలిసే వుండండి. నా అల్లుడికి రావాల్సింది మాత్రం గీటుపెట్టించు." కుండ పగలేసినట్లు మాట్లాడాడు శ్రీ నివాసరావు మామ.

వియ్యంకుడి సంగతి తెలిసిన బలరామయ్య కలవరపడ్డాడు. తనను కోర్టుకయినా ఈడ్చగల మనిషి. అతనితో తగాదాపడి తను నెగ్గలేడు. తన కొడుకు మామ చేతిలో కీలుబొమ్మ అయాడు. తను చేయగలిగిందేమీలేదు. వేసవి కాలం వెళ్ళాక అలాగే పంచుతానని వియ్యంకుడికి వాగ్దానం చేశాడు.

ఆ సంవత్సరం వేసవిలో నాలుగో వాడికి, రెండో అమ్మాయికీ పెళ్ళిళ్ళు పెద్ద ఎత్తున చేశాడు. అందుకు బలరామయ్య తలకు మించిన అప్పులు చేశాడు. అప్పుల సంగతి మూసిపెట్టి పెళ్ళిళ్ళు ఆర్భాటంగానే జరిపించాడు. అప్పుడు తగిలిన దెబ్బ ఆయువు పట్టుమీద తగిలింది.

మూడోకొడుకుమామతో "ఇదిగో పంచుతా!" అంటూనే మూడేళ్ళు దాటేశాడు. ఆ వియ్యంకుడు పెద్ద కొడుకునీ, రెండో వాడ్ని పురిగొల్పి తండ్రి మీదకు పంపాడు, ఇంకా పెళ్ళి పందిళ్ళు విప్పకముందే!

"ఇంతవరకూ నిండుగా వున్న సంసారం మనది. పంపిళ్ళు చేసుకొనే ముందే మూడోదాని పెళ్ళి చెయ్యండి. దాని పెళ్ళయిన మర్నాడు ఎవరిది వాళ్ళు విడగొట్టుకోండి" అన్నాడు బలరామయ్య.

కొడుకు లిద్దరికి అది సబబుగానే తోచింది. పెద్దవాడు వెంక్రటావు ఎప్పుడూ మైకంలోనే వుంటాడు. మత్తులోనుంచి బయటపడి ''చివరోళ్ళ ఇద్దరి మాటేమిటి?'' అని అడిగాడు.

''నోర్ముయ్! ఇంటి బాధ్యతలూ, తమ్ముళ్ళ, చెల్లెళ్ళ బరువు భారం నువ్వేదో మోస్తున్నట్లు మాట్లాడతావ్! పెళ్ళాం ఇంత నల్లమందు నలిపి చేతిలో వేస్తే మింగే వెధవ్వి! నీది నువ్వు తీసుకొని నోరుమూసుకో పో!'' అన్నాడు బలరామయ్య.

బలరామయ్య రెండో పిల్లకు సంబంధాలు వెతికే సందర్భంగా కనకయ్య సహాయం కోరాడు. ఆ అదను చూసుకొనే కనకయ్య సాంబయ్య సంబంధం గురించి కదిలించి చెప్పుదెబ్బలు తినేంతవరకూ తెచ్చుకున్నాడు.

రెండో పిల్ల పెళ్ళయిన మూడు నెలలకే బలరామయ్య ఆస్తి పంపకాలు చేశాడు. కొడుకులకు పంచగా పద్దెనిమిదెకరాల మాగాణి బలరామయ్య వాటాకు వచ్చింది. దొడ్డిదోవలు పంచుకున్నారు. మేడ మాత్రం ఉమ్మడిగానే వుంది. బలరామయ్య తదనంతరం మాత్రమే ఇల్లు వుంచుకోవటంగానీ, అమ్మటంగానీ జరుగుతుంది. దానికి కొడుకు లందరూ ఒప్పుకున్నారు. ఇహ అప్పులు బయటబెట్టి అందరూ సమంగా పంచుకోవాలన్నాడు బలరామయ్య. మూడోవాడిమామ ససేమిరా ఒప్పుకోలేదు.

''ఉమ్మడి కుటుంబం మీద చేసిన అప్పు! ఆస్తికి హక్కుదారులైన వాళ్ళందరూ భరించడం న్యాయం'' అన్నారు పెద్దమనుషులు.

''నా అల్లుడిమీద దమ్మిడీఖర్చు పెట్టలా! పైగా ఆదాయం కూడా వాళ్ళే తిన్నారు. ఇప్పుడు అప్పు మా నెత్తిన రుద్దుతారా? వీరభద్రయ్య మనవడు ఎబై ఏకరాలవాటా పంచుకొంటాడని నా బిడ్డ నిచ్చాను. ముష్టి పద్దెనిమిదెకరాలు! పైగా పదివేల అప్పుతెచ్చుకుంటాడని తెలిస్తే నా పిల్లనిచ్చేవాణ్ణా?''

బలరామయ్య గుండెలు చివుక్కుమన్నాయి.

''నేను చేసిన అప్పు నేనే మోస్తాను. పొలాలు కొలతలు వేసి దస్తావేజులు రాయించు కనకయ్యా!'' అన్నాడు.

''తొందరపడుతున్నారు. ముందూ వెనకా చూసి మాట్లాడండి.'' బలరామయ్య ఋణభారం ఏ పరిమాణంలో వుందో తెలిసిన కనకయ్య అన్నాడు.

''కొడుకులకు అప్పులు పంచి ఇచ్చాననే అపవాదు నాకొద్దు.'' కళ్ళు తుడుచుకొన్నాడు బలరామయ్య. కనకయ్య, బలరామయ్య ముగ్గురు కొడుకులతో సంప్రదించి ఏర్పాటు చేశాడు, అప్పులకింద మేడ బలరామయ్య వాటాలోకి వచ్చేట్టు. దానికి వియ్యంకుడు కూడా తలఊపాడు.

బలరామయ్య కొడుకులకు భాగాలు పంచి ఇచ్చి మూడేళ్ళయింది. పెద్దవాళ్ళిద్దరూ ఆస్తులు అమ్ముకొని పోయారు. మూడోవాడి మామ ఇక్కడి పొలం అమ్మి తమ ఊళ్ళో కొన్నాడు. రెండోవాడి భార్య పోయింది. పిల్లల్ని అత్తవారింట్లో వదిలి దేశాలు పట్టుకు తిరుగుతున్నాడు. బలరామయ్య పెద్దకొడుకు

ఏడాది క్రితమే గుండెజబ్బుతో పోయాడు. నాలుగోవాడు ప్రసాద్ తన వాటాకు వచ్చిన పొలం, దొడ్లూ దోవలూ అమ్ముకొని మద్రాసులో వుంటున్నాడు. వాడు డ్రామా యాక్ట్రెస్‌ను ఒకదాన్ని ఉంచుకొని సినిమాతీసే ప్రయత్నంలో వున్నాడని కనకయ్యకు తెలిసింది. బలరామయ్యగారి మూడో అమ్మాయి భాగాలు పంచుకొనే నాటికి లంగాఓణీలు వేసుకొని తిరిగే పిల్ల, ఇప్పుడు చీరలు కడ్తూంది.

అప్పట్లో "ఇంకా చిన్నపిల్ల. ఇప్పట్లో దీనికి తొందరలేదు" అనుకొని సంతృప్తిపడ్డ బలరామయ్యకు కూతురు పెరిగి పెద్దదై ఇప్పుడు గుండెల మీద కుంపటయింది! రెండేళ్ళగా పెళ్ళి సంబంధాలు గాలిస్తున్నాడు. ఎక్కడా అనువైన సంబంధం కుదర్లేదు. తన అంతస్తుకు తగ్గవాళ్ళతో వాళ్ళు కోరిన కట్నాలు ఇచ్చి తను తూగేస్థితిలో లేడు. ఇద్దరు ఆడపిల్లల పెళ్ళిళ్ళు లోగడ చేశాడు. సంబంధాలమీద సంబంధాలు వచ్చాయి ఆ రోజుల్లో. తాను కోరిన వియ్యం అందగలిగాడు. పరిస్థితులు తారుమారయాయి.

బలరామయ్యగారి మేడ ప్రహరీగేటు ముందుకొచ్చిన కనకయ్య ఓ నిమిషం తటపటాయించాడు. "కాగలకార్యం గంధర్వులే తీరుస్తారు" అన్న ధైర్యంతో లోపలకు అడుగుపెట్టాడు.

భోజనం చేసి అరుబయట పడక కుర్చీలో పడుకొని చుట్ట కాల్చుకొంటున్న బలరామయ్య సర్దుకొని 'రా! కనకయ్యా, రా! ఏమిటి విశేషం? పొద్దుపోయి వచ్చావే!' అన్నాడు. జీతగాడ్ని కేకవేసి పెద్ద చేతుల కుర్చీ తెప్పించివేశాడు. కనకయ్య కుర్చీలో కూర్చుంటూ తను ఆ ఇంట్లో చేతులు కట్టుకొని నిలబడే మాట్లాడి వెళ్ళిన రోజులు గుర్తు చేసుకొన్నాడు.

"పొద్దున్న వచ్చిన వానా, పొద్దుగూకి వచ్చిన చుట్టం ఊరకే పోరంటారు" అన్నాడు కనకయ్య.

"అయితే గాలివాన తేలేదంటావ్?"

"చుట్టరికాలు కలపడానికే వచ్చాను."

"ఎవరితో?" ఆనందంగా నవ్వుతూ అన్నాడు బలరామయ్య.

"మీ తండ్రిగారు మీ కిచ్చినంత ఆస్తికి మీ మనవడు వారసుడవుతాడు."

"అది నీ పిచ్చి! అంతటి అదృష్టంవుంటే నా కొడుకు లెందుకు ఇట్లా అవుతారు? మా తాత ముత్తాతల ఆస్తి ఇట్లా ఎందుకు హరించుకు పోతుంది?" బాధగా అన్నాడు బలరామయ్య.

"మీ ఆఖరు అమ్మాయి పేరేమిటి? బుల్లి అమ్మాయిగారని తప్ప పేరు గుర్తులేదు."

"వరూథిని. అందరికీ బాగానే జరిగిపోయింది. కడగొట్టు బిడ్డ దగ్గిర కొచ్చేసరికి బండి బోల్తాకొట్టింది. ఎంత గారాబంతో పెంచామో నీకు తెలుసుగా కనకయ్యా!"

''అయ్యో, తెలియకేం? అమ్మాయి వరూథిని అదృష్టజాతకురాలు! ఎవరి అదృష్టం ఎవరు కాదనగలరు?"

''ఏమిటి కనకయ్యా! నువ్వంటున్నది నిజమేనా? సంబంధం ఏ ఊరు? వాళ్ళ ఇంటిపేరేమిటి?" ఆశ్చర్యం, ఆనందం ఒరుసుకున్నాయి బలరామయ్య గొంతులో.

కనకయ్య ఉంగిడితిన్న గొడ్డు అయిపోయాడు. చెప్పాలని లోలోన కొట్టుకులాడుతున్న మాటలు పెదవులు దాటలేకపోయాయి.

''ఎనభై ఎకరాల మాగాణీ. కవిల పాతికవేలదాకా వుంటుంది. ఒక్కడే కొడుకు." కనకయ్య ఎత్తుగడ మార్చాడు. ఒక్క అడుగు వెనక్కు తగ్గి కొత్త బలం, ఊపుతో మళ్ళీ ముందుకు సాగాడు.

''ఆహా! అట్లాగా?" బలరామయ్య కళ్ళు మెరిశాయి.

''అత్త ఆడబిడ్డల పోరు లేదు. అమ్మాయికి రాణీవాసం అంటే నమ్మండి?"

''భగవంతుడు చల్లగా చూస్తే ---- అంతకంటే నాకు కావాల్సిందేముంది? ఏ ఊరు?"

''దూరాభార సంబంధం కాదు. దగ్గర్లోనే."

''నా బిడ్డ అదృష్టం అది."

''నే చెప్పేదీ అదేగదా?"

''కనకయ్యా!" తన కృతజ్ఞతను ఎలా తెలియజేయాలో తెలియక, పడక కుర్చీలోనుంచి ముందుకు వంగి, కనకయ్య చెయ్యి పట్టుకొన్నాడు.

''మీ ఉప్పు తిన్నవాడిని, మీమంచి లాభం పొందినవాడ్ని, ఉన్నమాట చెబుతున్నాను. నేను మీకు ఋణపడి ఉన్నాను. అది ఈ విధంగా తీర్చుకోగలిగితే అంతకంటే కావాల్సిందేమీ లేదు." కనకయ్య తడిపొడిగా గొంతు మార్చి అన్నాడు.

''సంబంధం ఖాయం చెయ్! వెనకా ముందు చూడొద్దు. ఆ! చెప్పలేదు. వియ్యాలవారిది ఏ ఊరు?"

''మన ఊరే!"

''మన ఊరా? అంతటివాళ్లు మన వూళ్ళో ఎవరువ్వారయ్యా నాకు తెలియకుండా?"

''ఇంటి ముందున్న రత్నాలు కన్పించవ్. దూరంగావున్న రాళ్ళ కుప్పలు కెలుకుతారు మనుషులు."

''ఎవరయ్యా ఆ రత్నాలు రాసులు పోసుక్కూర్చున్నవాళ్ళు?" ఉద్రేకాన్ని అణచుకోలేకపోయాడు బలరామయ్య.

''సాంబయ్య కొడుకు వెంకటపతి!"

కనకయ్యకు ఆ తర్వాత మాట పెగల్లేదు. బలరామయ్య మీద పిడుగు పడింది! మనిషి స్తంభించిపోయాడు. కనకయ్యకు ముచ్చెమటలు పోస్తున్నాయి. గేటుకేసి చూశాడు. తెరిచే వుంది. కనకయ్య గాలి కుంభించి, బలరామయ్య

ఉచ్ఛ్వాసనిశ్వాసలు వింటున్నాడు. బలరామయ్య నిట్టూర్పు విడిచి కదిలాడు. పడక కుర్చీ కిరకిర మంది. కనకయ్య చెవులు రిక్కించుకొని గుండెల్ని గుప్పెట్లో పెట్టుకొని విన్నాడు.

''కనకయ్యా! ఆ మాట అనటానికి నీకు నోరెట్లా వచ్చిందయ్యా?''

''అది మీ మంచికే అనుకొని అన్నాను. తప్పయితే మన్నించండి.'' కనకయ్య తనమాటల్లో నిజాయితీని ప్రకటించటానికి, చాతనయినంత చేశాడు. లోలోపల కనకయ్య సంతోషపడ్డాడు.

ఎలాటి బలరామయ్య ఎలా అయిపోయాడు? ఒకప్పుడు చెప్పు ఎత్తిన బలరామయ్య ఎలా జావకారి మాట్లాడాడు? ఈనాడు బలరామయ్య చెట్టుమీదలేడు. విరిగిన కొమ్మను పట్టుకొని వేలాడుతున్నాడు! అది స్పష్టంగా చూడగలిగాడు కనకయ్య.

''మరో సంబంధం చూడు. నాకున్నదంతా దానికిస్తాను. నేనేమయినా దానికి అన్యాయం చెయ్యను.''

''బిడ్డకు న్యాయం చేస్తున్నాననుకొంటూ అన్యాయం చేస్తున్నారేమో ఆలోచించండి బలరామయ్యగారూ!'' కనకయ్య మాట విని బలరామయ్య తెల్లముఖం వేశాడు.

''సరే! కట్నం అంటున్నారు. ఏమాత్రం ఇస్తారేం?'' విషయాన్ని పక్క దారి పట్టిస్తూ అన్నాడు కనకయ్య.

''ఉన్నదంతా! నా మేడా, పద్దెనిమిదెకరాల మాగాణి! అంతా దానికేఇస్తా!''

''అరవై వేల అప్పు? అదేం చేస్తారు?''

''అప్పు అరవై వేలయిందా?''

''నలభైవేలు నాలుగేళ్ళ కిందట. వడ్డీతిరగ్గడితే అరవై దాటుతుంది. అందులో ఆరేళ్ళ కిందటిది ఆరెకరాలు తాకట్టు. వడ్డీతో డబ్బు చెల్లించేకంటే పొలం వదులుకోవటమే మీకు లాభం! అందుకు వాళ్ళని నే ఒప్పిస్తా. ఎనిమిదెకరాలు అమ్మితేగాని ఆదిశేషయ్యగారి బాకీ తీరదు. పోతే మేమిచ్చిందే అసలు ముప్పైవేలు. వడ్డీలతో అర్ధ 'ల' కారం అవుతుంది. మా భాగస్తుడు శేషావతారం సంగతి నేను మీకు చెప్పాల్సిందేమీ లేదు.''

''ఈ మేడ కట్టుకోమను! ఇదమ్మితే నా అప్పు తీరదా ఏం?'' మనసును కుదుటపర్చుకుంటూ అన్నాడు బలరామయ్య.

''ఈ మేడ లక్ష రూపాయల విలువ చేసేదే. నేను కాదనను. అది ఏ విజయవాడలోనో, గుంటూరులోనో వుంటే! ఈరోజు ఈ పల్లెటూర్లో అమ్మితే ఇరవై వేలకు కూడా కొనరు. ఉన్న సంగతి అది!'' కనకయ్య నిష్కర్షగా చెప్పాడు.

బలరామయ్య కూర్చున్న కుర్చీ కాళ్ళు విరిగినట్టయింది. పాదాల కింద భూమి ఆనడంలేదు.

''ఇదిగో బలరామయ్యగారూ! దీపం వుండగానే ఇల్లు చక్కదిద్దుకోవటం

మంచిది. మీ పరువూ, మర్యాదా, వంశ ప్రతిష్ఠా రేపు అప్పులవాళ్ళు కోర్టు కెక్కితే ఏమవుతాయ్? డిక్రీ పొంది వేలంపాట పెట్టాక వూళ్ళో తలెత్తుకు తిరగ్గలరా? అప్పుడు అమ్మాయి పెళ్ళి ఏవిధంగా చేస్తారు? అందాకా ఎందుకు? ఏ కూతురింటికెళ్ళి మీరు తల దాచుకుంటారు? ఏ కొడుకు మిమ్మల్ని గౌరవించి ఆదరిస్తాడు? మీరే ఆలోచించండి!" బలరామయ్య కళ్ళల్లో నీరు తిరగటం చూసి కనకయ్య ఆపాడు.

"వెంకటపతికి ముప్పై ఏళ్ళుదాకా లేవూ?" అనుకోకుండానే అన్నాడు బలరామయ్య.

"ఛ! ఎవడండీ ఆమాట అంది? ఇరవై ఏడేళ్ళకు పైన ఒకటో అరో అంతకంటే ఉండవు. వెంకటపతి మన కళ్ళముందు పుట్టి పెరిగినవాడే కదండీ?"

"నువ్వెన్నన్నా చెప్పు కనకయ్యా! చూస్తూ చూస్తూ నా బిడ్డను సాంబయ్య కొడుక్కు ఇవ్వలేనయ్యా!" బలరామయ్య మాటల్లో గట్టితనంగానీ, నిర్ణయంగానీ ధ్వనించలేదు.

"వెంకటపతికేం? ఆ మాటకొస్తే అట్లాంటి కుర్రాడు ఈ వూళ్ళోనే లేడు. కష్టజీవి. ఒకళ్ళ జోలికి పోయేవాడుకాడు. బస్తీలు పట్టుకు జులాయిగా తిరిగేవాళ్ళపాటి చెయ్యడా వెంకటపతి!"

కనకయ్య మాటలు బలరామయ్య గుండెల్లో సూటిగా నాటాయి. తన కొడుకులు ఎలాంటి వాళ్ళు? వాళ్ళ బ్రతుకు కేమయింది? ఏ మాట కామాటే తన కొడుకులకూ వెంకటపతికి సామ్యం ఏమిటి? తన బిడ్డల్లో ఒక్కడు వెంకటపతిలాంటి వాడువున్నా తన ఆస్తంతా ఇలా పరుల పాలయేదా? బలరామయ్య మనసు తనకు తెలియకుండానే సమాధానపడ సాగింది.

"ఇదిగో బలరామయ్యగారూ? ఒక్కమాట చెప్తా వినండి. వెంకటపతి మీకు అల్లుడయితే, మీ మిగిలివున్న ఆస్తి, మేడా, మీ వంశంలో వాళ్ళలోనే వుంటుంది. అప్పులు తీర్చగల సత్తా, పట్టుదలా సాంబయ్య కుంది. సాంబయ్య ఎంత కష్టకాలంలో అప్పులు తీర్చి నిలబడ్డాడో మీకు తెలిసిందేగా?" కనకయ్య ఆగి బలరామయ్య ముఖంలోకి చూశాడు. తను చెప్పేది శ్రద్ధగా వింటున్నాడు బలరామయ్య. అతని ముఖంలో కన్పించిన మార్పును చూసి, పండకాలిన ఇనుముమీద మరో దెబ్బతీశాడు కనకయ్య.

"మీ తాతలనాటి ఈ మేడా, దొడ్డీదోవా, మరొకళ్ళ స్వాధీనం కాకుండా ఉండాలంటే, మీరు బతికుండగానే ఈ ఇంట్లో గబ్బిలాలు తిరక్కుండా వుండాలంటే, నేను చెప్పిన సలహా వినండి. వీరభద్రయ్యగారి మేడా, వీరభద్రయ్యగారి పొలం, కూతురి బిడ్డకైనా శాశ్వతంగా వుంటాయి. మీ వంశం గుర్తులు ఈ ఊళ్ళో చెరక్కుండా వుండాలంటే ఈ సంబంధం ఒప్పుకోండి. నా మాట వినండి."

"కనకయ్యా! కనకయ్యా!" బలరామయ్య భుజంమీది తువ్వాలు నోట్లో కుక్కుకొని, మొహం మోకాళ్ళమీదకు వంచి, చేతుల్తో తల పట్టుకొన్నాడు.

''బలరామయ్యగారూ! ఊరుకోండి! అంతా దైవ సంకల్పం! కరుణామయుడు ఆ పరమాత్ముడే, సాంబయ్యకు మీతో వియ్యమందాలనే బుద్ధి కల్పించాడు. కాకపోతే లక్షలకట్నం కావాలని ఎన్నో సంబంధాలు తిప్పికొట్టిన సాంబయ్య, మీ సంబంధాన్ని ఏరి కోరుకోవటం ఏమిటి? అంతా భగవత్ సంకల్పం! మరొస్తా! మాఘమాసం వెళితే మళ్ళీ మూఢం వస్తుంది. ఈ నెల్లోనే ముహూర్తం పెట్టించాలి'' అని కనకయ్య బలరామయ్య ముఖంలోకి చూడలేక గేటు బార్లాగా తెరుచుకొని వెళ్ళిపోయాడు.

అసాధ్యమూ, దుర్లభమూ అనుకొన్న పని, ఇంత సులువుగా నెరవేర్చగలగడంతో, కనకయ్యకు తన వ్యవహారజ్ఞానంమీద, వివేకంమీద, తెలివితేటలమీద అపారమైన నమ్మకమూ, ఆత్మవిశ్వాసమూ ఏర్పడ్డాయి. మనిషి ఉక్కిరి బిక్కిరి అయిపోయాడు. ఆ సంతోషవార్తను తిన్నగా వెళ్ళి సాంబయ్య చెవుల వెయ్యటానికి అతని ఇంటిముందుకొచ్చి ఆగాడు. అప్పటికే చాలాపొద్దు పోయిందన్న విషయం, రెండుకేకలు వేసినా నిద్రపోతున్న సాంబయ్య పలక్కపోవటంతో గుర్తొచ్చింది. ఇంటిముఖం పట్టాడు.

అంత అర్జంటుగా సాంబయ్యకీ విషయం చెప్పటంకూడా అంత మంచిది కాదేమో? గంటలమీద బలరామయ్య సాంబయ్యతో వియ్యమందటం ఒప్పుకున్నాడన్నా అంత మంచిదికాదు. అందులోని తన ప్రయోజకత్వాన్ని గుర్తించలేడు. కొంత నాన్చి, తను అతికష్టంమీద బలరామయ్యను ఒప్పించినట్లు సాంబయ్య దగ్గిర నిరూపించాలి. అప్పుడు గాని సాంబయ్యకు తనమీద గురి ఏర్పడదు. ఆలోచిస్తూ నడుస్తోన్న కనకయ్య బుర్రకు చల్లగాలి తగిలి హాయిగా అనిపించింది.

కనకయ్యకు వచ్చిన చిక్కు ఏమిటంటే అతనిబుర్ర ఎటుతిప్పినా సమానంగానే పనిచేస్తోంది. ''అవును! కాదు!'' అన్న రెంటికీ ఒకేసమయంలో తగిన కారణాలు, ప్రయోజనాలు వెతగ్గలడు. ఎటు తిప్పినా నష్టం అవతలివాడిదేనన్న ఆత్మవిశ్వాసం అతన్ని పుట్టించిన బ్రహ్మ ఇచ్చిన వరం అనే నమ్మకం కనకయ్యకు ఉంది.

''ఎవరా మనిషి?''

కనకయ్య కాళ్ళవేగం తగ్గించి తలెత్తి చూశాడు.

రామమందిరం దగ్గిర పురాణకాలక్షేపం చేసి తిరిగి వెళ్తున్నవాళ్ళు కనకయ్యకు ఎదురైనారు.

''ఎవరూ? నువ్వేనా కనకయ్యా! ఇంత పొద్దుపోయి ఇటునుంచి వస్తున్నావ్?'' అన్నాడు ఓ పెద్దమనిషి.

''పురాణ కాలక్షేపానికేమో మరి. ఇప్పుడే అయిపోయింది. ఇవ్వాళ రావణాబ్రహ్మ సీతమ్మ వారిని ఎత్తుకొని పోయే ఘట్టం! ఎంత బాగా నడిచిందనుకున్నావ్ కనకయ్యా?'' తనువిన్న పురాణాన్ని ఇంక మనసులోనుంచి దూరం చేసుకోలేని ఒకాయన అన్నాడు.

''ఆయన కెందుకయ్యా పుణ్యాలూ-పురాణాలూ? రెండుచేతుల్తో ఎడాపెడా సంపాదిస్తున్నాడు'' అన్నాడు మొదటి పెద్దమనిషి.

''అవున్లే, మన కనకయ్యకు పురాణంవినే ఓపికా, తీరికా ఎక్కడిది?'' అన్నాడు రెండో ఆయన.

గుడ్డివెన్నెల్లో వాళ్ళ నవ్వుల్ని కనకయ్య పసికట్టాడు.

''మీరంతా పురాణం విని కట్టుకొన్న పుణ్యంకంటే ఎక్కువే సంపాదించాను ఇవ్వాళ.'' ఉండబట్టలేక ఉక్రోషపడుతూ అన్నాడు కనకయ్య.

''అదేదో మా చెవినికూడా వేస్తే విని ఆనందిస్తాంగా?'' అన్నాడో ముసలాయన.

''బలరామయ్యగారికీ సాంబయ్యగారికీ బంధుత్వం కలిపా!''

అందరూ నోళ్ళు తెరుచుకొని క్షణకాలం అలాగే వుండిపోయారు!

''ఏంటి అట్లా చూస్తారు? బలరామయ్యగా రమ్మాయిని సాంబయ్య కొడుకు వెంకటపతికి మాట్లాడాను.''

''ఇది, అసలు నమ్మాల్సినమాటే కాదు!''

''ఈ నెల్లోనే పెళ్ళి. మీరే చూస్తారుగా?'' అంటూ ధీమాగా నడిచి వెళ్ళిపోయాడు కనకయ్య.

''అయితే కనకయ్య కట్టుకొన్నది పుణ్యమా పాపమా?'' ఏదీ తేలక వృద్ధుడు నోరు వెళ్ళబెట్టాడు.

''నూరు అబద్ధాలాడయినా ఒక పెళ్ళి చేయమన్నారు'' అన్నాడు రాంభద్రయ్య.

''వెయ్యి అబద్ధాలాడయినా ఈ పెళ్ళి కుదర్చడం కష్టం! ''అన్నాడు రాంకోటయ్య.

''ఇదేగనక నిజమైతే రావణాసురుడు సీత నెత్తికెళ్ళిందానికంటే ఘోరమైందే!'' అన్నాడు వృద్ధుడు.

''వీరభద్రయ్యగారి మనవరాల్ని సాంబయ్య కొడుక్కు ఇస్తున్నారా?'' బలరామయ్యకు దూరపుబంధువైన వీరయ్య నమ్మలేక అన్నాడు.

కనకయ్య వదిలినవార్త, చలికాలం పిడకలగూటి పొగలా తెల్లవారేటప్పటికి ఊరంతా వ్యాపించిపోయింది.

కనకయ్య ఉదయాన్నే సాంబయ్యదగ్గిర కెళ్ళాలని తయారైనా మళ్ళీ ఆగాడు.

పోనీ కొంచెం ఆగితే? అప్పుడు సాంబయ్యే కబురు పంపుతాడు? అప్పుడు వెళ్తే బెట్టుగా, నిండుగా వుంటుంది. అలా అనుకుంటూ ఇంటి ముందు కూర్చున్నాడు కనకయ్య.

అన్నం వేళదాకా ఎదురుచూసినా సాంబయ్యమనిషి రాలేదు. ఇక ఉండబట్టలేక సాంబయ్యగారింటికి బయలుదేరాడు.

త్రోవమధ్యలో సాంబయ్యగారి చినజీతగాడు ఎదురై ''అయ్యగారూ మీ కోసమే వస్తున్నారు'' అన్నాడు.

పల్చబడిన రక్తం చిక్కబడినట్టై కనకయ్య అంగలు పంగలు వేసుకొంటూ సాంబయ్య ఇంట్లో వాలిపోయాడు.

''కాయా, పండా?'' సాంబయ్య అడిగాడు.

''ఈ కనకయ్య చేతిలోపడితే కాయ అయినా పండుగా మారుతుంది.'' కనకయ్య కంఠంలో గర్వం తొణికింది.

''పళ్ళు రాల్తయ్ అన్నావే మరి? '' సాంబయ్య గుర్రుగా చూస్తూ అన్నాడు.

''ఊరుకోవయ్యా! నీ వరస పోనిచ్చావ్‌కావు? చచ్చీ, చెడీ పని సాధించుకొచ్చాను మరొకడు వెళ్తే నువ్వన్నంతపనీ చేసేవాడే బలరామయ్య!'' అప్పటికీ సగం చచ్చి అన్నాడు కనకయ్య.

ఈ సాంబయ్యకు పోసిన ఉగ్గుపాల్లోనే వుంది చేదంతా అనుకున్నాడు కనకయ్య.

సాంబయ్య కళ్ళలో వెలిగిన కాంతిని పసిగట్టడం కొంచెం ఆలస్యమే అయింది అతనికి.

''మరి కట్నం ఏమిస్తారంట?'' కనకయ్య కణతలకు వసిగొయ్య తగిలినట్లు ముఖం పెట్టాడు.

''ఇంకా కట్నం కానుకలుకూడానా? ఏంటి సాంబయ్యా, నువ్వు మాట్లాడేది? బలరామయ్య నీతో వియ్యమందటమంటేనే కోటి రూపాయల ఎత్తు! కళ్ళ కద్దుకొని మరీ నువ్వు ఒప్పుకోవాలి.'' అన్నాడు కనకయ్య చిరుకోపంతో.

''ఏం? నేనంత తీసివేసినవాణ్ణా? నా కొడుక్కేం తక్కువ? కట్నాలూ, కానుకలూ ఇస్తామని నా కాళ్ళావేళ్ళా ఎంతమంది పడ్డారో నీకు తెలియందా ఏం?'' అన్నాడు సాంబయ్య.

ఓరి సాంబయ్యా? ఎంత పొగరుగా మాట్లాడుతున్నావ్! అందేదాకా నా కాళ్ళమీద పాకులాడి ప్రాధేయపడ్డాడు. తీరా చేతికి చిక్కాక ఒంటికాలుమీద దూకుతున్నాడు. నిజంగా సాంబయ్య ధోరణి కనకయ్యకు కంపరం ఎత్తించింది.

''ఇదుగో సాంబయ్యా! సంబంధం మాట్లాడమన్నావ్, మాట్లాడాను. కట్నం సంగతి ఇప్పుడు లేవనెత్తడం మనకు మర్యాదకాదు. అతనికున్నదేదో పిల్లకిచ్చుకుంటాడు బ్రాహ్మణ్ణి పిలిపించి, లగ్నం పెట్టించి, నిశ్చితార్థాలు చేసుకోవడం మంచిది.''

''ముందు కట్నం సంగతి తేల్చుకురా! మా కాడిగట్టు పద్దెనిమిదెకరాలుందిగా? అది కట్నంగా ఇస్తామంటే రేపే నిశ్చితార్థం చేసుకోవచ్చు. ఏమంటావ్?''

''నా శార్థం పెట్టుకోవచ్చు.'' నోటిదాకా వచ్చింది. కాని గుటక మింగేశాడు కనకయ్య. కనకయ్యకు కళ్ళుతిరిగి వళ్ళు చెమటలు పట్టినంత పనైంది.

''అంతే నంటావా?'' లేచి నిలబడి బెదిరింపుగా అన్నాడు కనకయ్య.

''ఆహా! అక్షరాల అంతే!'' సాంబయ్య, ఇంకా కనకయ్య అక్కడ నిలబడివుండగానే ఇంట్లోకి వెళ్ళిపోయాడు.

కనకయ్య వీధిలోకి వచ్చిపడ్డాడు. వెళ్తూ నోటికొచ్చిన తిట్లన్నీ, బయటకు కొన్నీ, లోపలకు కొన్నీ తిట్టుకొంటూ, బలరామయ్య ఇంటిముందు కొచ్చాడు.

ఇప్పుడు బలరామయ్యకు ఏమని చెబుతాడు? ఆయన ముఖం తను ఎలా చూస్తాడు? కాడిగట్టు పొలంమీద కన్నేసి ఇంత నాటకం ఆడాడు సాంబయ్య. అది తనకు తాకట్టులో వున్న సంగతి సాంబయ్యకు తెలియదు. ఆ మాటకొస్తే తనకూ,

బలరామయ్యకూ తప్ప మూడో కంటివాడికి తెలియదు. ఈ సంగతి తెలిస్తే సాంబయ్య అసలు సంబంధం వదులుకుంటాడు. జరిగిందేదో జరిగింది. అన్నిటికీ ఆ భగవంతుడే వున్నాడు. నాలుగు రోజులు తను మొహం దాటేస్తే అటు సాంబయ్యా, ఇటు బలరామయ్యా అసలు సంగతే మర్చిపోతారు. వెంకటపతికి బలరామయ్య కూతుర్నిస్తే తనకేం? దొమ్మరోడి కూతుర్నిస్తే తనకేం?

తన్ను తాను తిట్టుకొనేస్థితిలోపడ్డ కనకయ్యకు అడ్డరోడ్డుమీద దుమ్మురేపుకుంటూ వస్తోన్న బస్సు కనిపించింది. పైపంచ విసురుతూ అతడు రోడ్డుకేసి పరుగెత్తాడు.

అలా పోయిన కనకయ్య వారం రోజుల తర్వాత ఊళ్ళోకి వచ్చాడు. కనకయ్య మెదడులో పెళ్ళిని గురించిన విషయం దాదాపు అడుగున పడింది. ఈ వారం అంతా ధాన్యం అమ్మే పనిలో నిమగ్నమై వున్నాడు. హఠాత్తుగా రేటు పెరిగింది. మిల్లులో కొనిపోసిన ధాన్యం అంతా పెరిగిన రేటుమీద అమ్మేశారు. కనకయ్య వాటాకు ఇరవైవేల దాకా లాభం వచ్చింది. మనిషి సంతోషంతో రెట్టింపయిపోయాడు. ఇలా నాలుగేళ్ళు కలిసివస్తే ఇంకేం కావాలి? తన్ను పట్టడానికి వీలుంటుందా? సాంబయ్యతప్ప తనతో సరితూగ గలవాళ్ళు ఎవరుంటారు. ఈ ఏటితో కొడుకు 'లా' పూర్తిచేస్తాడు. వచ్చే ఏడునుంచి వాడు వకీలయి సంపాదన మొదలుపెడ్తాడు. కొడుకు వకీలు - ఆర్జనపరుడైన తండ్రి. మిల్లులో వాటా. తాకట్టుకింద పెట్టుకొన్న భూమి పుట్రా అంతాకలిపిచూస్తే తనకేం తక్కువ? ఎవరికీ తీసిపోడు కనీసం లక్ష కట్నం అయినావస్తుంది తనకొడుక్కు. బస్సుదిగి ఆలోచిస్తూ తన్మయత్వంలో పడి నడిచి ఇంటికి వచ్చిన కనకయ్యమీద గడపలో ఎదురైన పెళ్ళాం విరుచుకుపడింది.

''ఏంటీ అల్లరి? ఊరంతా ఒకటేగోలగా వుంది?''

కనకయ్య నెత్తికి ద్వారబంధం తగిలినట్టు దిమ్మెరపోయాడు.

''ఏమిటే నీ వాగుడు? ఏమైం దిప్పుడూ?''

''ఇంకేం కావాలి? మనిషిమీద మనిషిని తోల్తున్నాడా బలరామయ్య. మనిషిని ఊళ్ళోకి రానీయ్ అంతుతేలుస్తానంటున్నాడట బలరామయ్యగారి బంధువు వీరయ్య'' అని కనకయ్యభార్య చివాలున ఇంట్లోకి నడిచింది. భార్యవెనకే పిల్లిలా అడుగులు వేస్తూ ''నువ్వేం ఖంగారుపడుకు! అంతా నే సరిచేస్తానుగా.'' ఖంగారుగా అన్నాడు కనకయ్య.

చొక్కావిడిచి భార్యచేతికి అందిస్తూ ''నే వెళ్ళాక బలరామయ్య కూతురు పెళ్ళిసంగతి ఊళ్ళో పెద్ద గొడవయిందన్నమాట?'' అన్నాడు సాలోచనగా. కనకయ్య బుర్రలో దారంబంతి ఊడిపోతూ చిక్కుపడసాగింది. మళ్ళీ చిక్కుతీసి చుట్టాలనే ప్రయత్నంలో భార్యను గుచ్చిగుచ్చి అడగసాగాడు.

కనకయ్యకు తను వేసిన తప్పటడుగు స్పష్టంగా కన్పించసాగింది. ఆ రాత్రి పురాణంనుంచి వస్తూ తన కెదురైనవాళ్ళకు పెళ్ళి కుదిరిందని తను తొందరపడి చెప్పాడు. అక్కడే వచ్చింది చిక్కు!

కనకయ్య రగిలించిన రవ్వ తాటాకుమంటలా అయి ఊరంతా వ్యాపించింది. వీరయ్య వెళ్ళి బలరామయ్యను అడిగాడు. బలరామయ్య నిజమనేసరికి వీరయ్య విరుచుకుపడ్డాడు. ఆ సాంబయ్యతో వియ్యమందితే బలరామయ్య గుమ్మం ఎక్కనని వీరయ్య శపథం చేశాడు. బలరామయ్య కుదురులోవాళ్ళందర్నీ పోగుచేసి వీరయ్య మీటింగులాటింది పెట్టాడు. ఇంత పరువుతక్కువపని చేయడానికి, ఇవ్వాళ తాము ఒప్పుకొంటే రేపు తమ ఆడపిల్లలు ఏమౌతారని ప్రశ్నించాడు వీరయ్య. మన ఫాయీ కుదురూ, ఇంటిపేరును బట్టి ఇన్నాళ్ళు తమకుదక్కిన గౌరవం ఇహ మట్టిలో కలిసిపోతుందన్న భయాన్నీ, ఆందోళననీ వ్యక్తం చేశారు బలరామయ్య బంధుకోటిలోని ముఖ్యులు. బలరామయ్య పెత్తాత కొడుకైన రామభద్రయ్యను బలరామయ్య దగ్గరకు ఆఖరి ప్రయత్నంగా పంపించడానికి నిశ్చయించారు.

సాంబయ్యతో వియ్యమందటం ఏ కోశానా మంచిదికాదనీ, అది జరిగాక తాము తలెత్తుకు తిరిగే పనిలేదనీ రాంభద్రయ్య బలరామయ్యకు సలహా ఇచ్చాడు. బలరామయ్య సాంబయ్యతో వియ్యమందబోతున్నాడనేది వూరంతా తెలిసిపోయాక, నిండామునిగినవాడికి చలేమిటన్న మనస్తత్వంలో పడిపోయాడు బలరామయ్య. పైగా వాళ్ళను వెనకేసుకొచ్చి మాట్లాడటం మొదలుపెట్టాడు. సాంబయ్య తనకు కాబోయే వియ్యంకుడు. వెంకటపతి తనకు కాబోయే అల్లుడు. వాళ్ళను కించపరిచే మాటలంటుంటే బలరామయ్య తననే అంటున్నట్టు బాధపడ్డాడు.

''గురిగింజ తన నలుపు ఎరగదట! మీది మీరు చూసుకోండి! మీ సలహా సహాయం మాకేం వద్దు'' అని కుండబద్దలుకొట్టినట్టు చెప్పాడు బలరామయ్య. లోలోపల కుళ్ళిపోతూనే పైకి బింకంగా వుంటూ, తను కానిపని ఏదీ చెయ్యటం లేదన్నట్లు ప్రవర్తించసాగాడు. ఒకరో ఇద్దరో మాత్రం ''పాపం, బలరామయ్య బతికిపోయాడు. అంతకంటే మంచి సంబంధాలు ఎక్కడ తెస్తాళ్ళే!'' అని సానుభూతి చూపించకపోయినా సర్దిచెప్పుకొన్నారూ బలరామయ్యపని ముళ్ళమీద నడుస్తున్నట్లుంది. ఈ పెళ్ళి ఎంత త్వరగా జరిగితే అంత మంచిది అనుకొన్నాడు. కనకయ్యకోసం మనిషిమీద మనిషిని పంపాడు. కాని కనకయ్య అంతులేడు. ఊళ్ళో తనకు అనుకూలంగా ఉండే ఒకళ్ళిద్దర్ని కదిలించి చూడమన్నాడు. బలరామయ్య తనతో వియ్యమందటానికి తహతహలాడుతున్నాడనే సంగతి సాంబయ్యకు సవివరంగానే తెలిసింది. మనిషి ఎక్కడా తొణక్కుండా బెట్టుగా వున్నాడు.

''ఏం సాంబయ్యా? కొడుకు పెళ్ళి చేస్తున్నావటగా?'' అని అడిగిన వాళ్ళకు ''అవును! ఈ ఏడు చెయ్యాలనే వుంది'' అని సాగదీసి సమాధానాలు ఇస్తున్నాడు సాంబయ్య.

బలరామయ్య తాలూకు పెద్దమనిషి ఒకరు పొలం వెళ్తూన్న సాంబయ్యకు ఎదురై అన్నాడు:

''సాంబయ్యా, మేం విన్నమాట నిజమేగా? ఇంకా ఆలస్యం ఎందుకు, మంచిరోజు చూసి లగ్నాలు పెట్టుకోవచ్చుగా?''

సాంబయ్య ఆ మనిషిని ఎగాదిగా చూచి బలరామయ్య తరఫునుంచే మాట్లాడుతున్నాడనీ అర్థం చేసుకొన్నాడు.

"మంచీ చెడ్డా చూడాలిగా? అన్నీ కలిసిరావాలిగా?" అన్నాడు.

అవతల పెద్దమనిషి ఇరుకునపడిపోయాడు. సాంబయ్య ధోరణి అంటీఅంటనట్టుగా తోచింది. ఇక ముసుగులో గుద్దులాట లాభంలేదని, అభిమానాన్ని చంపుకొని బయటపడ్డాడు:

"బలరామయ్యగారి అమ్మాయిని మీవాడి కిస్తామంటే కళ్ళకద్దుకొని చేసుకోవచ్చు. ఇంకా ఆలోచన కూడానా?" అన్నాడా పెద్దమనిషి.

"కాళ్ళు కడిగి కన్యాదానం చెయ్యాల్సింది బలరామయ్య. కళ్ళకద్దుకోవాల్సిన ఖర్మ నాకేం పట్టింది? కో అంటే కోటి సంబంధాలు వస్తాయి మా వెంకటపతికి" అని మీసాలు దువ్వుకుంటూ చివాల్న కదిలి కిర్రుచెప్పుల మోత చేస్తూ వెళ్ళిపోయాడు సాంబయ్య.

సాంబయ్య ధోరణి చూసిన పెద్దమనిషికి నడ్డిమీద కొట్టినట్టయింది. ఇది అయ్యేదీకాదు పెట్టేదీ కాదు అనుకొన్నాడు. అతని అనుమానం రూఢీఅయిన వార్తగా ఊళ్లో వ్యాపించింది. ఇంత బతుకూ బతికి ఇంటి వెనకాల చచ్చినట్లయింది బలరామయ్య పని. తనతో వియ్యమందటానికి కూడా సాంబయ్య సంశయిస్తున్నాడనేది బలరామయ్య భరించలేనిదే అయింది. సాంబయ్యతో వియ్యమందటానికే సగంచచ్చిన బలరామయ్య, ప్రవర్తనతో పూర్తిగా చచ్చినట్టు అయిపోయాడు.

ఇదంతా ఆ కనకయ్యగాడు ఆడిన నాటకమేనా? ఉన్న పరువు తీశాడు. పరువు చెడ్డా ఫలితమూ దక్కలేదు. కనకయ్యగా డెందుకు ఇలా చేశాడు? వాడికేమొస్తుంది? సంబంధం మాట్లాడిన మరుసటిరోజే ఈ ఊళ్లోనుంచి మాయమయ్యాడు. వారంరోజు లయింది. ఎందుకు ముఖం తప్పిస్తున్నాడు? ఇది తన పరువు తీయటానికి సాంబయ్య కనకయ్య కలిసి ఆడిన నాటకమా? ఈ పెళ్ళి జరక్కపోతే తన కూతురు బతుకేం కాను? సాంబయ్య కొడుకు వెంకటపతికే చేసుకోనిదాన్ని ఎవరు చేసుకొంటారు? ఇహ ఎలాంటి సంబంధాలు వస్తాయి? నలుగుర్లో చులకనయ్యాడు. వంశం, హోదా బుగ్గిపాలయింది. అయినవాళ్ళలో అలుసయిపోయాడు.

బలరామయ్య గుండెలు కుతకుతలాడిపోతున్నాయ్. రోజూ కనకయ్యకోసం ఎదురు చూస్తున్నాడు. జీతగాడ్ని కనకయ్య ఇంటిముందే కాపలా పెట్టాడు.

కనకయ్య ఊళ్ళోకి వచ్చాడని జీతగాడు చెప్పడం ఆలస్యంగా బలరామయ్య కనకయ్య యింటికి బయలుదేరాడు.

స్నానం చేసి మొలపంచ కట్టుకున్నాక కనకయ్యకు బలరామయ్య పిలుపు వినిపించింది.

"అయ్యో! తమరే వచ్చారా? మీ ఇంటికే బయలుదేరబోతున్నా!" ఒక్క దూకులో కనకయ్య బలరామయ్య ముందుకొచ్చి అన్నాడు. చింతనిప్పులా మెరుస్తోన్న

బలరామయ్య కళ్లు, కనకయ్యను తేరిపార చూశాయి. ఓపక్కన కనకయ్య గుండెల్లో గుబులు చుట్టలు చుట్టుకొంటున్నా ధైర్యంగానే పరిస్థితిని ఎదుర్కొన్నాడు.

''రండి! ఇలా కూర్చోండి'' అంటూ బలరామయ్యకు కుర్చీ చూపించి తను నిలబడే మాట్లాడాడు. బలరామయ్య కనకయ్య యింటికి రావడం ఇదే మొదటిసారి. కాకితో కబురు పంపితే వచ్చి వాలిపోయే కనకయ్య ఇంటికే తను రావాల్సివచ్చినందుకు ఖిన్నుడైపోయాడు. అతనిలో అంతవరకూ ఉన్న ఉద్రేకం, కోపం చల్లారినయ్. మనిషి నీళ్ళుకారిపోతున్నాడు. ఏం మాట్లాడటానికి మనస్కరించక అలాగే కనకయ్యకేసి దిగులుగా చూస్తూ కూర్చున్నాడు.

కనకయ్యకు కవచమైన లౌక్యపు పొరలు విచ్చిపోసాగినయ్. బలరామయ్యను చూస్తుంటే కనకయ్య మనసు నిజంగానే ద్రవించిపోయింది. కళ్ళు చెమ్మగిల్లినట్లనిపించింది! ఇంకా కొద్దిసేపువుంటే కంటనీరు పెడతాడేమోననిపించింది. వెంటనే సంభాషణ ప్రారంభించాడు:

''ఆ సాంబయ్య కట్నం అడుగుతున్నాడు కట్నం!''

''కట్నమా? కట్నాలూ, కానుకలూ ఇచ్చే పరిస్థితిలో వుంటే వాడికొడుక్కు నా బిడ్డనిస్తానా?'' బలరామయ్య ఆక్రోశించాడు.

''పైగా ఏం అడిగాడో తెలుసా? మీ కాడిగట్టు పొలం పద్దెనిమిదెకరాలు ఇవ్వాలట! చేలో చేను కలిసిపోతుందట!'' కనకయ్య బుర్ర చురుకుగా పనిచెయ్యసాగింది. బలరామయ్య గతుక్కుమన్నాడు.

''అది తాకట్టుకింద వుందనికూడా చెప్పావా?''

''రామ రామ! ఏమిటలా మాట్లాడుతారు? నే చెప్తానా? అది మనిద్దరిలోనే వుంచా ఈనాటివరకు.''

''అయితే ఏం చెప్పావ్?''

''ఆ పొలం బలరామయ్యగారి బొందిలో ప్రాణం వుండగా మరొకరికి ఇవ్వడం జరగదు. వంశ పారంపర్యంగా వస్తున్న భూమిలో ఆయనకు మిగిలిందదే. ఆయన తదనంతరం చిన్నమ్మాయికే ఇస్తారు, అని చెప్పాను.''

కనకయ్య మాటల్ని శ్రద్ధగా విన్న బలరామయ్య ''నా తదనంతరం పొలం ఇస్తానంటే సాంబయ్య ఒప్పుకొంటాడా?'' అని అడిగాడు.

''ఒప్పుకుంటే ఈ తిప్పలంతా ఎందుకు? అట్టా పొలం ఇవ్వని పక్షంలో ముప్పైవేలు రొఖ్ఖం ఇవ్వమన్నాడు.''

''ముప్పైవేలా! నే నెక్కడ తెచ్చేదీ?''

''మీ సంగతి నాకు తెలియం దేముందీ? అందుకేగామరి నేను వారంరోజులుగా ఇంత హైరాన పడుతూంది? ఇరవైవేలు పుట్టించడానికి నా తాతలు దిగొచ్చారు'' అని ఊపిరి పీల్చుకున్నాడు కనకయ్య.

బలరామయ్య అప్పుడే చీకట్లోనుంచి వెలుగులోకి వచ్చినవాడిలా కళ్ళుచిట్లించి చూశాడు.

''సాంబయ్యను కిందా మీదా పెట్టి ముప్పైనుంచి పాతికవేలకు దించా! డబ్బు కోసం వెళ్ళి సంతనచేసుకొని ఇంతకుముందే వచ్చాను. మనం అనుకున్నపని అనుకున్నట్టు జరక్కపోతే నాకు నిద్రపట్టదు. మీరు ఊ అంటే ముహూర్తం పెట్టుకోవచ్చు." నొసటి చిరుచెమటలు తుడుచుకొని ఊపిరి పీల్చుకొన్నాడు కనకయ్య.

బలరామయ్య హృదయంలో కనకయ్య మంచిచోటే ఏర్పరచుకున్నాడు. ఎంత అభిమానం కనకయ్యకు? అయినవాళ్ళల్లో ఒక్కడైనా ఈమాత్రం ముందుకొచ్చాడా?

''కనకయ్యా! పాతికవేల కట్నం ఇచ్చి ఆ వెంకటపతికే మన అమ్మాయిని ఇవ్వడం ఎందుకు? ఆ మాత్రం...."

బలరామయ్య మాటను తుంచి అన్నాడు కనకయ్య--- ''బలరామయ్యగారూ, ఇంకా వెనకా ముందు చూడొద్దు. డబ్బెక్కడకు పోతుంది? నలుగురు పంచుకొనే సంసారమా ఏమన్నానా? అదంతా మన అమ్మాయిది కాదూ? వెంకటపతి మీ అల్లుడుకాడా?"

బలరామయ్య కనకయ్య చెప్పిందంతా ఒప్పుకొన్నాడు. అంతకంటే తను వేరే చెయ్యగలిగిందేమీ లేదనే వాస్తవంకూడా బలరామయ్య నిర్ణయానికి దోహదాన్ని ఇచ్చింది.

''మిగతా కొరవా, పెళ్ళిఖర్చులూ కలిపితే ఇంకా ఎంతలేదన్నా -- కావాలిగా?" సందేహాన్ని తెలియజేశాడు బలరామయ్య.

''అదీ ఏర్పాటు చేస్తాగా?" ధీమాగా అన్నాడు కనకయ్య.

బలరామయ్య మనసు కుదుటపడింది. లేచి నిలబడ్డాడు. ఆప్తుడైన కనకయ్యను మాటల్లో ఎలా అభినందించాలో తెలియక కృతజ్ఞతాభావంతో చూశాడు.

కనకయ్య బలరామయ్యను ఇంటిదాకా సాగనంపాడు. సాంబయ్య ఇంటికి వెళ్ళాడు. వరండాలో నిలబడే సాంబయ్యను కేకవేశాడు. ఆ కేకలో ''ఈసారి నిన్ను వదల్ను, నీ అంతు తేల్చుకోకుండా ఇవ్వాళ వెళ్ళేది లేదు!" అన్న భావం స్ఫురించింది.

* * *

పెళ్ళి యింకా వారంరోజులే వుంది. కనకయ్య ఇరవైవేల రూపాయలు తెచ్చి బలరామయ్య ముందు పెట్టి చెప్పాడు - ''ఈ డబ్బు మా అబ్బాయి మామగార్ది! ఆయన మనిషిని నమ్మేరకం గాదు. ఇంత డబ్బు ఏ హామీ లేకుండా ఇవ్వటానికి గుణుస్తున్నాడు."

''కావాలంటే మనపొలం హామీ పెడ్దాం" అన్నాడు బలరామయ్య.

''తాకట్టుకింద వున్న పొలాన్ని ఎవరు హామీగా ఒప్పుకుంటారు?" అన్నాడు కనకయ్య.

''మరేం చేద్దాం?" బలరామయ్య ఆలోచనలోపడి అన్నాడు.

''అమ్మాయికి మూడుముళ్ళు పడ్డాక ఆ పొలం అమ్మి అప్పులు తీర్చి

ఒడ్డున పడటం మంచిది - నన్నడిగితే!'' కనకయ్య బలరామయ్య ముఖంలోకి చూశాడు.

''అదే మంచిదేమో! లేకపోతే యీ వడ్డీలూ, అప్పూ - పైగా ఈ ముప్పై వేలూ ఎలా తీర్చటం?'' బలరామయ్య మూలిగాడు.

''మెల్లగా అంటారేం? ఎకరం అయిదువేలు పడ్తుంది. తొంభయ్ వేలుదాకా వస్తుంది. అప్పులు తీరగా పదో, ఇరవయ్యో మీ చేతిలో వుంటుంది. అమ్మాయి పెళ్ళయి కాపరానికి వెళ్తే మీకేం బాదరబందీ ఉండదు. మీ భార్యాభర్తలు కృష్ణా రామా అంటూ నిశ్చింతగా కాలం గడపొచ్చు.''

''అంతే కనకయ్యా, అంతే!'' భవిష్యత్తులో ప్రశాంత జీవితాన్ని వూహించుకొంటూ అన్నాడు బలరామయ్య.

''మరి మీ వియ్యంకుడి కేం చెబుదాం? అంతవరకూ ఏదో ఒకటి చూపించాలిగా - ఆయన సంతృప్తి కోసమయినా?''

బలరామయ్యకు ఏమీ తోచక ఒట్టి చేతులాడిస్తూ ''ఇంకా ఏముందయ్యా వా దగ్గిర హామీ పెట్టటానికి?'' అన్నాడు.

''ప్చ్! ఉన్నదేదయినా పెట్టాల్సిందేగా?'' మేడ దూలాల కేసి తలతిప్పి కిటికీ రంగు అద్దాలలోనుంచి బయటకు చూశాడు కనకయ్య.

''కనకయ్యా! ఈ మేడ తాకట్టు పెట్టమంటావా - మీ వియ్యంకుడికి?''

''బలరామయ్యగారూ! మీ బాధ నాకు తెలుసు. హామీ పేరుకే! అంతగా ఆయనకు తాకట్టు పెట్టటం మీ కిష్టం లేకపోతే నా పేరుమీద చేయండి. మనలోనే ఉండిపోతుంది! మా వియ్యంకుడికి చెప్పి ఒప్పిస్తాను. సరేనా? శుభకార్యం తలపెట్టాక తప్పేదేముంది?''

''సరే! నోటు రాయించు. అంతా పోయాక ఇది వుండి నన్ను ఉద్ధరిస్తుందా?'' బలరామయ్య వరండా స్తంభాల కేసి చూస్తూ నిండార్గాయి అన్నాడు.

## 11

సాంబయ్య పెళ్ళిపనులు జోరుగా చేయించసాగాడు. శుభలేఖలు అచ్చు వేయించటానికి కనకయ్యతో బస్తీకి వెళ్ళాడు. చౌకరకం కార్డులు వదిలేసి, ఒక్కొక్కటి అర్ధరూపాయిపైగా ఉన్నవాటిని సాంబయ్య ఎన్నుకోవటం చూసిన కనకయ్య తనకళ్ళను తనే నమ్మలేకపోయాడు. ఐదువేలకు పైగా పెళ్ళిసంభారాలు కొన్నాడు సాంబయ్య. గడ్డిపరక పోనీయని సాంబయ్య - ఎంగిలి చేత్తో కాకిని తోలని సాంబయ్య చేస్తున్న ఖర్చు కళ్ళారచూస్తున్న కనకయ్య ''ఈ సాంబయ్య ఆ సాంబయ్య కాదు''అనుకొన్నాడు.

సాంబయ్య శుభలేఖలు వూరంతా పంచాడు. శుభలేఖలు అందుకొన్న వాళ్ళు దిమ్మెరపోయారు. వాళ్ళు కనీ వినినంతవరకు అంత పెద్ద ఎత్తున శుభలేఖలు వేయించటం ఎరగరు. ఒక్కొక్కటి చిన్నసైజు చాటంత ఉంది. పైన రంగులూ, కవరుమీద కూడా లతలూ వగైరా నగిషీ పనితో శుభలేఖలు బ్రహ్మాండంగా ఉన్నాయి.

ఏ జమీందార్ల ఇళ్ళల్లోనో పెళ్ళిళ్ళయినప్పుడు మాత్రమే అలాంటివి వేయిస్తారని పెద్దలు చెప్పారు.

సాంబయ్య ఇంటి ముందునుంచి మెరకవీధిదాకా ఒకే పందిరి వేయించాడు. పందిరికి కాగితంపూలూ, చెమికీలూ కుట్టించటానికి బస్తీ నుంచి మనుషుల్ని పిలిపించాడు. నలభై మోతలైట్లూ, బ్యాండుమేళమూ ముందే మాట్లాడి పెట్టాడు. పెళ్ళి మూడురోజులు ఉందనగా వంటవాళ్ళను పిలిపించి లడ్లూ, అరిశలూ చేయించాడు.

చుట్టుపక్కల పది వూళ్ళదాకా సాంబయ్య ఇంట్లో పెళ్ళి గురించి చెప్పుకోసాగారు. బలరామయ్య పెళ్ళి ఆయన తండ్రి వీరభద్రయ్యగారు చేయించిన తీరు ఆ వూళ్ళో జ్ఞాపకం వున్నవాళ్ళు ఈనాటికీ చెప్పుకొంటారు. వాళ్ళు యీనాడు సాంబయ్య చేయిస్తున్న ఏర్పాట్లుచూసి విస్తుపోయారు. కనకయ్యకు మొలమీద బట్ట నిలవడంలేదు. పెళ్ళి హడావిడిలో తలమునకలై తిరుగుతున్నాడు. ఉత్తరాది నుంచి వచ్చిన సాంబయ్య బంధువులకు సాంబయ్య ఇంద్రలోకం సృష్టించినట్టనిపించింది.

సాంబయ్య వెంకటపతిని పెళ్ళికొడుకును చేయించాడు. అడిగట్లో వున్న ఇల్లయినా పెళ్ళికొడుకు కార్లోనే తరలివెళ్ళాలని సాంబయ్య పట్టుపట్టాడు. గంటల మీద కనకయ్య బస్తీ నుంచి కారు తెప్పించాడు. రెండు గుర్రాలుకూడా తెప్పించాడు సాంబయ్య. జమీందార్ల ఇళ్ళలో జరిగేలాంటి ఆర్భాటంతో పెళ్ళికొడుకుని తీసుకొని తరలివచ్చాడు బలరామయ్య ఇంటికి సాంబయ్య.

పెళ్ళిపందిరి జనంతో కిటకిటలాడిపోతూంది. ముందు 'రాము' అని భీష్మించుకొన్నవాళ్ళంతా ఒకళ్ళ తర్వాత ఒకళ్ళు పెళ్ళిపందిట్లోకి వస్తున్నారు. ఆ రోజు వూరంతా పెళ్ళి సంబరంలో మునిగిపోయింది.

సూత్రధారణ సమయం దగ్గిర పడుతుండగా పౌరోహితులు అక్షింతలు పంచారు. వెంకటపతి మంగళసూత్రం పట్టుకొని లేచాడు.

ఖద్దరుసిల్కు లాల్చీ, పొందూరుధోవతి కట్టి వంకెకర్ర చేతపట్టుకొని పెళ్ళి మండపానికి అంతదూరంలో నిలబడివున్న సాంబయ్యకు వళ్ళు పులకరించిపోయింది...

''వూరుబోయిన వెంకయ్య మనవడా—షావుకారు వీరభద్రయ్యగారి మనుమరాలి
పుస్తె కట్టు. అలగావాళ్ళ కుర్రాడా - భూస్వామి బలరామయ్య కూతురు
మాంగల్యం కట్టు! పాలేరు సాంబయ్య కొడుకా - షావుకారు బలరామయ్య
కూతురు మెళ్ళో తాళి కట్టరా!'' - సాంబయ్య హృదయంలో గూడుకట్టుకొన్న కసీ, అవమానం కట్టలు తెంచుకొంది. సాంబయ్య రక్తం ఉద్వేగంతో కట్టలు తెంచుకొంది.

''వాయించండ్రా భజంత్రీలు!'' సాంబయ్య కంఠమే నగారాలా మోగింది.

భజంత్రీలు ఒక్క వూపున అందుకున్నారు. చెవులు చిల్లులుపడేంతగా మేళాలు వినిపిస్తుండగా, తారస్థాయిన పౌరోహితుడు మంత్రాలు చదువుతుండగా వెంకటపతి వరూథిని మెడలో తాళి కట్టాడు.

సాంబయ్య కళ్ళలో ఆనందబాష్పాలు తిరిగాయి! తనూ, తన తండ్రీ ఆ వూళ్ళో, ఆ భూస్వాముల మధ్య పొందిన గాయాలూ, మచ్చలూ ఆ కన్నీళ్ళలో కరిగిపోయినై.

పెళ్ళి మండపానికి ఆనుకొని సాంబయ్యకు కుడిపక్కగా కూర్చున్న బలరామయ్య కళ్ళు చెమ్మగిల్లినై. పైపంచతో కళ్ళు తుడుచుకొన్నాడు. కూతురు బరువు తీర్చుకొన్న బలరామయ్య కార్చిన కన్నీరు ఆనందంతో కాదు. తరతరాలుగా వస్తున్న అంతస్తునుంచి జారి కిందకు పడ్డాడు. అందులోనూ మురికిగుంటలో బోర్లాపడ్డాడు. ఒకనాడు కట్టుబట్టల్తో పొట్ట చేత్తోపట్టుకొని తన ఇంటి ముందుకు వచ్చి నిలబడ్డ వెంకయ్య మనవడు ఆ ఇంటికి అల్లుడైనాడు. తనతండ్రి కాళ్ళు పట్టినవాడు-తన గొడ్లసావిట్లో కాపురమున్నవాడు-వాడి మనవడికాళ్ళు తను కడిగి కన్యాదానం చేశాడు!

కుమిలి కుమిలి బాధపడిపోతూ బలరామయ్య పంచె ముఖానికి అడ్డం పెట్టుకొని కన్నీళ్ళు తుడుచుకున్నాడు. అది కళ్ళారాచూసిన సాంబయ్య - సర్వస్వతంత్రుడైన మృగరాజు అడవిలో వేటాడేముందు కొండరాతిమీద నిలబడి పరిసరాల్ని పరికించినట్లు - పెళ్ళిపందిరి కలియచూశాడు. మీసాలు దువ్వుకుంటూ, చేతికర్ర వూపుతూ "భజంత్రీలు!" అన్నాడు.

దోసిలితో తలంబ్రాలు వెంకటపతి నెత్తిన పోయబోతూ, పెళ్ళికొడుకు ముఖంలోకి ఓరగా చూసిన పెళ్ళికూతురికి, తను చిన్నప్పుడు మాయాబజారు సినిమాలో చూసిన ఘటోత్కచుడి ముఖం కన్పించింది. వరూధిని చేతులు బిగిసిపోయినై. దోసిలి విడలేదు. వెంకటపతి తలమీద తలంబ్రాలు పడలేదు. వెంకటపతికి పెళ్ళికూతురు వాన రాబోయేముందు, ఆకాశంలో మెరిసిన మెరుపులా కన్పించింది. వాన వెలిశాక నిర్మలమైన ఆకాశంలో ఇంద్రధనుస్సును చూసి, ఓ రోజు పొలాన పొందిన అనుభూతిని పొందాడు వెంకటపతి - పసుపుబట్టలతో వున్న వరూధిన్ని చూసి.

పెళ్ళికూతురి చేతులు పట్టుకొని పెళ్ళికొడుకు నెత్తిన తలంబ్రాలు పోయిస్తున్న దాసి వరూధిని చేతులు గట్టిగా విడదీసింది. వరూధిని దోసిలిలో నుంచి తలంబ్రాలు వెంకటపతి నెత్తిన పడ్డాయి. దోసిళ్ళకొద్దీ తలంబ్రాలు వరూధిని నెత్తిన ఎగిరెగిరి పోశాడు వెంకటపతి. చివర్లో వరూధిని తాంబాళం ఎత్తి వెంకటపతి నెత్తిన గుమ్మరించింది.

"మేమే గెలిచాం!" అన్నారు ఆడపిల్లవారు.

బిందెలో వేసిన ఉంగరం వరూధిని కనురెప్పపాటులో తీసింది. వెంకటపతి ఇంకా బిందె అడుగున చెయ్యి ఆడించటం చూసిన బలరామయ్య పెత్తండ్రికొడుకు "ఏమిటోయ్ అల్లుడూ! ఇంకా బిందెతో కుస్తీలు పడుతున్నావ్? మా అమ్మాయి ఎప్పుడో తీసింది ఉంగరం" అన్నాడు.

జనం గొల్లున నవ్వారు. అందరితోపాటు వెంకటపతికూడా ఆనందంగా

నవ్వాడు. అతని నవ్వు చూసిన వరూథిని పెదవి నొక్కిపెట్టి కిసుక్కున నవ్వింది.

సాంబయ్య కనకయ్యను పెళ్ళికి ముందే హెచ్చరించాడు కట్నం తాలూకు డబ్బును.

"ఏమిటా తొందర? పెద్దమనుష్యుల్తో వ్యవహారం!" అన్నాడు కనకయ్య.

భోజనాలయ్యాక కనకయ్య సాంబయ్యను వెతికి పట్టుకొన్నాడు.

"ఇంద! అణాపైసలతో అనుకొన్న కాడికి ముట్టజెప్పారు బలరామయ్యగారు" అంటూ కనకయ్య తన లెదర్‌బ్యాగ్ సాంబయ్యచేతికి అందించాడు.

సాంబయ్య ఆనందంతో లావుగావున్న సంచిని రెండుచేతుల్తో నిమిరి చూసుకొన్నాడు.

"భద్రం! పెళ్ళి హడావిడిలో ఎక్కడ పెడ్తావో ఏమో?" హెచ్చరించాడు కనకయ్య.

"ఆ మాటా నిజమే. పద, ఇంట్లో పెట్టివద్దాం!" సాంబయ్య కనకయ్యను వెంట తీసుకొని వెళ్ళాడు.

"సంచికి తొందర్లేదు. తర్వాత ఇద్దువుగాని. ముందా సంచి ఇనప్పెట్టెలో పెట్టి బయల్దేరు. రాత్రికి వూరేగింపు ఏర్పాట్లు చూడాలి. బయలుదేరండి" అని తొందర చేశాడు కనకయ్య.

"ఊరేగింపుకు భోగం మేళం తెప్పిస్తున్నారా లేదా?" అడిగాడు సాంబయ్య.

"ఇంకా యేం తెప్పిస్తాడయ్యా బలరామయ్య! ఇప్పటికే నిండా మునిగిపోతేను?" అన్నాడు కనకయ్య.

"అయితే నే తెప్పిస్తా! వూరేగింపుకు పూలపల్లకి, మేజువాణి ఉండాలి. వందలైట్లు ఉండాలి. బ్యాండూ, సన్నాయీ అన్నీ వుండాలి" అంటూ సాంబయ్య లెదర్ బ్యాగ్‌ను ఇనప్పెట్టెలోపెట్టి, మూసి తాళం వేసి గదిలోనుంచి బయటకి వచ్చాడు. అప్పటికప్పుడు మనుషుల్ని బస్తీకి పంపి చెమ్కీవాళ్ళనూ, భోగంవాళ్ళనూ పిలిపించాడు.

వూరేగింపు ముందు వంకెక్కర పట్టుకొని సాంబయ్య బయలుదేరాడు. వూరంతా కదలి వచ్చింది. ఊరేగింపు మేళతాళాలతో, పెట్రమాక్స్ లైట్ల కాంతిలో దేదీప్యమానంగా వెలిగిపోయింది. వెంకటపతి పక్కన వరూథిన్ని చూసి 'కాకి ముక్కుకు దొండపండు!' అన్నారు.

వూరేగింపు తెల్లవారుఝామువరకా నడిచింది. తెల్లవారగట్ల అప్పగింతలు జరిగాయి. సాంబయ్య కొడుకూ, కోడల్నీ ఇంటికి తెచ్చుకున్నాడు. అప్పటికే తెల్లవారిపోయింది. పెళ్ళివారు కాఫీ ఉప్మాలు సేవించి కునుకులు తీశారు. మళ్ళీ మెలుకువ వచ్చేసరికి సాంబయ్య ఇంటిముందున్న విశాలమైన పందిట్లో భోజనాలు ఏర్పాటు చేయించాడు. చుట్టుపట్ల పదివూళ్ళ దాకా భోజనాలకు పిలిపించాడు. ఆరుబంతులు లేచాయి. విస్తళ్ళలో వేసిన లడ్లూ, అరిశెల సైజును గురించి చెప్పుకోనివాళ్ళులేరు. దీంతో పోలిస్తే బలరామయ్య పెట్టిన పప్పన్నం ఒక

లెక్కలోనిదికాదు. ఏది చేసినా సాంబయ్యే చెయ్యాలన్నారు. మధ్యాహ్నం మూడు గంటలదాకా తినేవాళ్ళు తింటూనే ఉన్నారు. లేచేవాళ్ళు లేస్తూనే వున్నారు. సాయంకాలం నాలుగు గంటలకు పాటక జనానికి అన్నం పెట్టించాడు. పాటకజనానికి కూడా లడ్లూ అరిశెలూ పెట్టినవాళ్ళు ఆ ప్రాంతంలోనే లేరు. సాంబయ్య కీర్తి నలువైపులా వ్యాపించింది. సాంబయ్య చేతికి ఎముకలేదన్నారు పెద్దలు. షావుకారు సాంబయ్య కొడుకు పెళ్ళి గురించి ప్రతి పందిట్లోనూ మూడేళ్ళదాకా చెప్పుకొన్నారు. షావుకారు సాంబయ్య వీధిలో నడిస్తే మనుషులు వదిగి నిలబడుతున్నారు. అంతవరకు 'సాంబయ్యా' అని పిలిచినవాళ్ళే ''సాంబయ్యగారూ!'' అని పిలుస్తున్నారు.

సాంబయ్యగారి కోడలు మామగారింట్లోవున్న మూడురోజులూ మునగదీసుకొని పడుకొంది. వెంకటపతి ఆకలిగొన్న పులిలా ఇంట్లో తిరిగాడు. సాంబయ్య ఆచూకీ తియ్యగా రవణమ్మ చెప్పింది. ''అమ్మాయి కడగా ఉందిలే!'' అని.

మూడు నిద్రలు అయ్యాక బలరామయ్య కూతుర్నీ అల్లుడ్నీ ఇంటికి తీసుకొచ్చాడు. సాంబయ్య పందిళ్ళు వూడదీయించాడు. ఎవరికివ్వాల్సింది వాళ్ళకి ఇచ్చేశాడు. రెండోరోజున మధ్యాహ్నానికి ఒడ్డునపడ్డాడు. పదిరోజులుగా దాదాపు నిద్రాహారాలు లేకుండా తిరిగిన సాంబయ్య తిని మంచానికి అడ్డంపడ్డాడు. కునుకుపట్టింది. సంధ్యవేళ జీతగాడు వచ్చి లేపేదాకా సాంబయ్యకు మెలుకువ రాలేదు. బద్ధకంగా వళ్ళు విరుచుకొని లేచి కూర్చున్నాడు. ఇల్లంతా కలయజూచాడు. బోసిగావుంది. వెంకటపతి ఇంట్లోలేడు. వెంకటపతి భూమ్మీదపడ్డ దగ్గర్నుంచీ ఒక్కరోజు కూడా తనను విడిచిలేడు. మూడు నిద్దర్లయాక వెంకటపతి భార్యతో ఇంటికి వస్తాడు. షావుకారు వీరభద్రయ్యగారి మనుమరాలు తన ఇంటికోడలు. ఆ పిల్ల ఈ ఇంట్లో తిరుగుతుంది. తను ఎదురైతే గబుక్కున చాటుకుపోతుంది. కూతుర్ని పండగలకూ, పబ్బాలకూ పంపమని బలరామయ్య వచ్చి తనను ప్రాధేయపడతాడు.

''దొరగారూ! పెళ్ళి హడావుడి తగ్గాక తుమ్మకర్ర కొట్టమన్నారు గందా? రేపు కొట్టించమంటారా?'' అన్నాడు జీతగాడు. సాంబయ్య ఊహాచిత్రం చెరిగింది. తల ఎగరేసి నవ్వుకొన్నాడు.

''ఆఁ- ఎంతమందిని పెడ్తావ్?''

''ఏడుగురన్నా లేకపోతే పనవదు!''

''ఏడ్చావ్! ఏడుగురెందుకురా? ముగ్గుర్ని చెట్లు కొట్టమను. ఇద్దరు కంపగొడితే సరిపోతుంది! పనికురదలావుందో కూలిడబ్బులివ్వను. రేపే పూర్తి కావాలి!'' అన్నాడు సాంబయ్య.

జీతగాడు బిర్రగీరుకున్నాడు. సాంబయ్య సాంబయ్యే! వాడు పదేళ్ళగా చూసిన సాంబయ్యే మళ్ళీ కళ్ళముందుకు వచ్చాడు. గత పదిరోజులుగా తను చూసిన సాంబయ్యకాదు!

''వీళ్ళ కాగు బయటపెట్టరా!'' జీతగాడితో అన్నాడు.

స్నానం చేసి ఒళ్ళు తుడుచుకుంటున్న సాంబయ్యకు కనకయ్య గొంతు వినిపించింది.

''ఆఁఅయిపోయింది! వస్తున్నా! కూర్చో కనకయ్యా!'' అని గబగబా ఉతికిన కొత్తపంచను లాగిలాగి కట్టుకోవటం మొదలుపెట్టాడు. సాంబయ్యకు కనకయ్య కంఠం వినగానే కనకయ్య లెదర్ బ్యాగే గుర్తుకొచ్చింది.

అవును! తను మర్చేపోయాడు. అందులో వున్న డబ్బు తీసి పంచి ఇవ్వాలి. ముప్పైవేలు. తనదగ్గర మిగిలిన రొఖ్ఖం అదే! నిలవ డబ్బు ఇరవైవేలకు పైచిలుకు పెళ్ళికి ఖర్చు పెట్టాడు. దాదాపు కట్నంగా వచ్చిన డబ్బంతా పెళ్ళికి ఖర్చుపెట్టినట్లే! బలరామయ్య డబ్బుకోసం తనెప్పుడూ ఆశించలేదు. కష్టార్జితమే తనకు కావాల్సింది. కట్నం డబ్బు పెళ్ళికి ఖర్చు చేసి, బలరామయ్య డబ్బుతో తన హోదా పరపతి పెంచుకున్నాడు. బలరామయ్య కూతుర్ని కోడలుగా తెచ్చుకొని తన అంతస్తును పెంచుకొన్నాడు. తన వంశం పరువూ ప్రతిష్టను సంపాదించుకొంది. అదే తను కోరింది. దాన్ని సాధించాడు. అంతకంటే కావాల్సిందేమీలేదు. ఈరోజు ఊరుపోయిన వెంకయ్య కొడుక్కు సాటి యెవరు ఈ ఊళ్ళో? ఎవరు తన మాటను తోసివేయగలరు? ఎవడు తనను వేలెత్తి చూపగలడు?

సాంబయ్య ఇనప్పెట్టె తెరిచి తోలుసంచి తీసుకొని వరండాలో కూర్చున్న కనకయ్య దగ్గర కొచ్చాడు. సంచి తెరవటానికి ప్రయత్నించి ''ఇదేదో బిగిసినట్టుంది. నాకు రావటంలా! నువ్వే తియ్!'' అంటూ కనకయ్య చేతికిచ్చాడు.

కనకయ్య నవ్వుకుంటూ లెదర్ బ్యాగ్ జిప్‌లాగి సాంబయ్య కిచ్చాడు.

సాంబయ్య పైపంచ మంచం మీదపరచి లెదర్ బ్యాగ్ తల్లకిందులుగా దులిపాడు. రూపాయి బిళ్ళలూ, నోట్ల కట్టలూ, ఒక పత్రమూ కిందకు జారాయి.

సాంబయ్య సగానికి పైగా లెక్కపెట్టి ఆగిపోయాడు. కనకయ్య ముఖంలోకి తీవ్రంగా చూస్తూ ''ఎంతయ్యా ఇది?'' అని అడిగాడు.

''ఎంతేమిటి? ముప్పైలేదూ?'' అన్నాడు కనకయ్య, ఏ రకమయిన భావాన్నీ ముఖంలో కనపడనియ్యకుండా.

''అయితే నువ్వే లెక్క పెట్టు!'' పంచలోవున్న డబ్బు కనకయ్య ముందు పెట్టాడు. రొఖ్ఖం లెక్కపెట్టిన కనకయ్య ''పదివేలూ'' అని, అందులో వున్న కాగితం మడతవిప్పి ''ఆన పందొమ్మిది వందల... వూ!వూఁ! వూరుపోయిన వెంకయ్య కుమార్డు సాంబయ్యకు, యా...వీరభద్రయ్య గారి కుమార్డు బలరామయ్య వ్రాయించి ఇచ్చిన ప్రోనోట్లు... వూ!వూఁ!'' అని రాగం తీస్తో కనకయ్య సాంబయ్య కళ్ళల్లోకి చూసి ఆగిపోయాడు.

''ఎంత మోసం? ఎంత మోసం?'' సాంబయ్య గొంతు నూతిలోనుంచి వచ్చినట్టుయింది.

''ఇందులో మోసం ఏముంది? రొఖ్ఖం పదివేలూ ఇచ్చారు. మిగతా ఇరవైవేలకు నోటురాసి ఇచ్చాడు. రూపాయి వడ్డీ ఉదహరించి వుంది. మీ కొచ్చిన

నష్టం ఏముంది? ఎవరికైనా వడ్డీకి ఇచ్చేదేగా? అయిన వారికే ఇచ్చామనుకోండి!'' కనకయ్య మళ్ళీ అవకాశం దొరుకుతుందో లేదో అన్నట్లు చెప్పదలచుకున్నదంతా ఒక్క గుక్కలో చెప్పేశాడు.

''ఎందుకానోటు? నాలుగ్గీసుకోనా? ఇహ తప్పుడు కూతలు మానేసి బలరామయ్య దగ్గిరకెళ్ళి మిగతా ఇరవైవేలు పట్టుకురా!'' అంటూ లెదర్ బ్యాగ్‌ను విసిరి కనకయ్య ముఖాన కొట్టాడు. కనకయ్య లెదర్‌బ్యాగ్ వడిసి పట్టుకొని నిలబడ్డాడు.

''ఇదుగో సాంబయ్యా! ఇందులో నా ప్రమేయమేమీలేదు. నేను మాత్రం సంచి తెరిచి చూశానా ఏం? ఆయన పెద్దమనిషి! ఇచ్చాడు. అది తెచ్చి నీ కిచ్చాను. అంతవరకే నా పూచీ!''

''అయితే పద, ఆ బలరామయ్య దగ్గరకి?''

''నాకేం పని? మీరు మీరు వియ్యంకులు. కిందా మీదా పడ్తారు. ఇవ్వాళ రెండనుకుంటారు. రేపు ఒకటే అవుతారు. ఇచ్చి పుచ్చుకున్నవాళ్ళు! మధ్యలో నా కెందుకూ?'' కనకయ్య మెట్లు దిగి తిరిగి చూడకుండా అదే పోతపోయాడు.

సాంబయ్యకు రక్తం ఉడికిపోయింది! ''పెద్దమనిషి! పరువూ ప్రతిష్ట! ఇంత నీచమైన పన్లు చేసేవాళ్ళు కూడా పెద్దమనుషులు, షావుకార్లలా చలామణీ అవుతున్నారా? కానియ్! ఈ బలరామయ్య అంతు తేల్చి, తరవాత ఆ కనకయ్యగాడి పని పడ్తా'' అనుకొంటూ పళ్ళు పటపట కొరికాడు.

పదివేలు ఇనప్పెట్టెలో భద్రంచేసి, నోటు తీసుకొని వియ్యంకుడి ఇంటికి బయలుదేరాడు సాంబయ్య.

మునిమాపువేళ మామగారి మేడపైన చల్లగాల్లో తిరుగుతూ వరూధిని కోసం ఎదురు చూస్తున్న వెంకటపతికి వీధిలో వస్తోన్న తండ్రి కన్పించాడు. తండ్రిరాకకు కారణం వెదకటానికి ప్రయత్నించిన వెంకటపతికి, ఎంతసేపయినా భార్య రాకపోవటానికి గల కారణం కూడా తోచలేదు. పెళ్ళయిన తర్వాత మొదటి మూడు రోజులూ వరూధిని తనకు దూరంగా వుంది. ఈరోజు తెల్లవారగట్ల మామగారి ఇంటికొచ్చినా ఇంతవరకు పెళ్ళాం తన కళ్ళముందు పడలేదు. తన గది చాయలకే రాలేదు. రోజంతా మామగారూ, అత్తగారూ కూతుర్ని ఓదార్చటమూ, ఏదో నచ్చచెప్పటం చూచాయగా పసిగట్టాడు. సాయంత్రం తను వున్న గది కడిగి శుభ్రం చేయటమూ, గదిలో జరుగుతున్న అలంకరణా, ఇంట్లో జరుగుతున్న హడావుడీ వెంకటపతి మనస్సులో ఆశల్ని రేపాయి. తనను మేడమీదకు పంపిన అత్తగారు వరూధిన్ని మేడ మీదకు పొమ్మని తను వింటుండగానే చెప్పింది. వరూధిని సిగ్గుపడి పైకి రాలేదేమో! కొత్తలో అందరికీ అలాగే వుంటుందేమో? నిజానికి తనకూ కొత్తగానే వుందిగా? ఈవేళప్పుడు తండ్రి ఎందుకు వచ్చినట్టు? పొలాన మిగిలిపోయిన పనులేమైనా వున్నాయేమో? వెంకటపతి ఆలోచనలో పడ్డాడు.

గడపలోకి వచ్చిన సాంబయ్యను చూసి బలరామయ్య కొంచెం ఖంగారుపడ్డాడు. లేచి మర్యాదగా ఆహ్వానించాడు. సాంబయ్య కూర్చోకుండా నిలబడి వుండటం చూసి ''ఇలా కూర్చో సాంబయ్యా! అబ్బాయి మేడమీద వున్నాడు.'' అన్నాడు బలరామయ్య.

''కూర్చోటానికి రాలేదు. ఇదుగో, ఈ ప్రోనోటేమిటి? ఈ పన్లేమిటి?'' సాంబయ్య చేతిలో ప్రోనోటు ఆడిస్తూ అడిగాడు.

''అదా! కనకయ్య ముందే మీతో చెప్పానన్నాడే? అందుకు నువ్వు ఒప్పుకున్నా వంటేనే.''

''పచ్చి అబద్ధం! కనకయ్య తనకేం తెలియదంటున్నాడు నాతో!''

''కనకయ్య అట్లా అన్నాడా?'' ఆశ్చర్యంగా అన్నాడు బలరామయ్య.

''ఇది మీ రిద్దరూ కలిసి ఆడిన నాటకం!''

''సాంబయ్యా, దైవసాక్షి!......నువ్వు పొరబడుతున్నావ్?''

''అవును! నేను పొరబడ్డాను. పెద్దమనిషివని నమ్మాను. ఇంతమోసం చేస్తావని తెలిస్తే ముప్పైవేలూ చేతిలో పడ్డాకే ఆ మూడుముళ్ళు పడేవి.''

''సాంబయ్యా! తొందరపడమాక. ఇందులో నేను చేసిన మోసం ఏమీలేదు. నీ డబ్బు నీకు పువ్వుల్లో పెట్టిఇస్తా.''

''ఇచ్చేవాడివైతే ఈ రాత కోతలు ఎందుకూ?'' సాంబయ్య ప్రోనోటు బలరామయ్య ముందు పడేశాడు. బలరామయ్య.

''మూడునెల్లాగండి, డబ్బు వడ్డీతో సహా ముట్టచెప్పుతా!'' ప్రోనోటు సాంబయ్యకు తిరిగి అందించబోతూ అన్నాడు బలరామయ్య.

''నీ నోటూ వద్దు నీ అసలూ వద్దు! పరువు మర్యాద వున్నవాడెవడయినా చెయ్యాల్సిన పనేనా ఇది? ఒరేయ్ వెంకటపతీ! ఒరేయ్ అబ్బాయ్'' అంటూ కేకలు పెట్టాడు సాంబయ్య.

వెంకటపతి మామకూ, తండ్రికీ మధ్యన వచ్చి నిలబడ్డాడు.

''ఎందుకురా ఇంకా నిలబడ్డావ్? పద?!'' సాంబయ్య కొడుకు చెయ్యి పట్టుకొని బయటకు గుంజాడు.

బలరామయ్య ఒక్కసారిగా తండ్రి కొడుకుల ముందుకొచ్చి ''రెండునెల్లు గడువు చాలు! మీ డబ్బు మీ కివ్వకపోతే అప్పుడడగండి!'' అన్నాడు.

''ఇంకా ఏమిటయ్యా అడిగేది? మా డబ్బు మాకు అందినప్పుడే వెంకటపతి ఈ గడప తొక్కేది!'' సాంబయ్య కొడుకును గుంజుతూ చరచర మెట్లుదిగాడు.

''సాంబయ్యా! నలుగుర్లో తలెత్తుకు తిరగాల్సినవాళ్ళం! ఇదేం బాగా లేదు.'' రోషంతో అరిచాడు బలరామయ్య.

''తలవంపుల పని చేసింది నువ్వే. మేం కాదు. బుద్ధితక్కువపని చేసిందిచాలక మాకే నీతులు చెబుతున్నావా?'' మాటకు మాట విసిరాడు సాంబయ్య.

''బుద్ధితక్కువవాణ్ణి కాకపోతే నా ఇంటి జీతగాడి మనవడికి నా కూతుర్ని

ఇస్తానా? నీలాంటి లేకిమనుషులతో వియ్యమందటమే నా పొరపాటు. అందుకే ఆడపిల్ల నిచ్చేవముందు, వంశమూ, మర్యాదా, మన్ననా చూడమన్నారు. చెడిబతికినవాడితో....'' బలరామయ్య గొంతు పూడిపోయింది. తనేం మాట్లాడుతున్నాడో తనకే తెలియటం లేదు. ఇన్నాళ్ళుగా మనస్సులో తొక్కిపట్టిన బాధంతా ఆ రూపంలో బయటపడింది.

దున్నపోతులా వెనక్కి నిగడదన్ని నిలబడ్డ వెంకటపతి చెయ్యి వదిలి వీధిలోకివచ్చి అరిచాడు సాంబయ్య.

''ఒరేయ్! నువ్వొస్తావా, రావా?'' వీధిమలుపు తిరిగి రొప్పుతూ వెనక్కితిరిగి చూశాడు. వెంకటపతి పిల్లిలా అడుగులో అడుగు వేసుకొంటూ నడిచి రావటం చూశాడు. సాంబయ్య గుండెల్లో మంటలు చల్లారాయి.

''వెంకటపతి---నా కొడుకు---నా మాట జవదాటడు!'' అనుకొంటూ ముందుకు సాగిపోయాడు.

పితృవాక్య పరిపాలనకోసం రాజ్యకాంక్షను చంపుకొని అడవుల కెళ్ళిన శ్రీ రామచంద్రుడిలా వెంకటపతి తండ్రిమాట జవదాటలేక పెళ్ళాంమీది మోజును చంపుకొని సాంబయ్య వెంటే నడిచి ఇంటికి చేరాడు.

వెంకటపతికి ముప్పై మూడు దాటినై. పెళ్ళయి మూడేళ్ళయింది. మళ్ళీ భార్యముఖం చూసే అవకాశం దొరకలేదు. బలరామయ్య, కూతురు పెళ్ళయిన ఆరునెలలకే పద్దెనిమిదెకరాల మాగాణినీ, తాకట్టు పెట్టుకొన్న కనకయ్యకూ, శేషావతారానికీ విక్రయించాడు. భూమిమీద తీసుకొన్న అసలూ వడ్డీ పోను బలరామయ్య చేతికి వచ్చింది పదివేలు మాత్రమే. వాపోతున్న బలరామయ్యను మరో నాలుగేళ్ళుపోతే అదికూడా వచ్చేది కాదని సమాధానపరిచాడు కనకయ్య. పదివేలు ఇచ్చి వరూధిన్ని కాపరానికి పంపటానికి ప్రయత్నించాడు. అందుకు సాంబయ్య ససేమిరా ఒప్పుకోలేదు. పెళ్ళినాటికే బలరామయ్య పొలం తాకట్టులోవున్న సంగతి పొలం అమ్మినాకగాని తెలియలేదు సాంబయ్యకు. బలరామయ్య తనను దగా చేశాడని నమ్మాడు. ఆ కసిలోవున్న సాంబయ్య ఇరవైవేలకు ఒక్క దమ్మిడీ తగ్గినా కోడలు కాపరానికి రావటానికి వీలులేదని పట్టుపట్టాడు. అప్పటికి అతని మనస్సులో బలరామయ్య మేడ మెదులుతూ వుంది. అది దఖలు రాసయినా, అమ్మి అయినా తన బాకీ చెల్లించుకోవచ్చు గదా బలరామయ్య, అనుకున్నాడు సాంబయ్య. కూతురి కాపరం కోసమైనా ఆ పని చేస్తాడని ఎదురుచూసిన సాంబయ్యకు నిరాశే ఎదురైంది. పొలం అమ్మిన సంవత్సరానికే బలరామయ్య గుండెజబ్బుతో మంచాన పడ్డాడు. ఇక్కడవుంటే బతికే అవకాశం లేదని నాలుగోకొడుకు వచ్చి బస్తీకి తీసుకెళ్ళాడు. తండ్రికి చేసిన సహాయాన్ని పురస్కరించుకొని తండ్రి దగ్గరున్న డబ్బులో మూడువేలు పుచ్చుకొని మద్రాసు బండెక్కాడు చిన్నకొడుకు. బలరామయ్య భార్య పక్షవాతం వచ్చి మంచాన పడ్డది. ఆస్పత్రిలో గది తీసికొని వుండి తండ్రికీ, తల్లికీ కాచిపోస్తున్నది వరూధిని. బస్తీకి వచ్చిన బలరామయ్య బంధువులు ఆయన్ని

వచ్చి చూసిపోతున్నారు. ఆయనకు మరీ ఎక్కువగా వుందని తెలిసినప్పుడు కూతుళ్ళూ, కొడుకులూ, కోడళ్ళూ, అల్లుళ్ళూ వచ్చి, కాస్త నెమ్మదించిందాకా వుండి పోతున్నారు. వరూధిని తండ్రికీ, తల్లికీ పరామర్శకు వచ్చేపోయేవాళ్ళకు ఊడిగం చెయ్యలేక సతమతమౌతూంది.

బలరామయ్య కూతుర్నిచూసి జాలిపడేవాడు. అంతమంది సంతానంలో తన అవసానకాలంలో అక్కరకువచ్చింది వరూధినేనని ఆలోచన వచ్చినప్పుడు మరీ కుంగిపోయేవాడు. హాయిగా భర్తతో కాపరం చెయ్యాల్సిన పిల్ల - దానికి ఎంత అన్యాయం జరిగింది అనుకొనేవాడు.

అయితే వరూధినికి భర్తను గురించిన బెంగ ఏ కోశానా వున్నట్టు కన్పించేది కాదు. తండ్రి యోగక్షేమాలతోపాటు అన్నీ తనే చూసుకొనేది. తండ్రిదగ్గిరవున్న డబ్బంతా వరూధిని అజమాయిషీలో వుండేది. అన్నలూ, అక్కలూ చూట్టానికి వచ్చినప్పుడు తల్లిదండ్రుల బాధ్యత తనమీద వేసినందుకు దెప్పిపాడిచేది. వాళ్ళు తమకుతోచిన డబ్బు వరూధిని చేతిలో పెట్టి, అంతకంటే తాము ఏమీ చెయ్యలేమన్నట్లు మాట్లాడేవారు.

వరూధినికి ఇరవై ఒకటో ఏడు. వయసుకు తగ్గ కోరికలు ప్రజ్వరిల్లుతున్నాయ్. పైగా సర్వస్వతంత్ర అయింది. మంచానపడ్డ తండ్రికి వేళకు ఇంత తిండీ, మందూ దొరికితే చాలు. తల్లి మంచప్పుడే ఏమీ పట్టించుకోలేదు. పాతకాలపు అమాయకురాలు. మంచంలోపడి ఇప్పుడో కాసేపో అన్నట్లుండేది.

బలరామయ్య వరూధిని మాటకు ఎదురు చెప్పేవాడు కాడు. వరూధిని కాలక్షేపానికి ఆసుపత్రి పనిమీద వచ్చిన ఇరుగుపొరుగుతో కలిసి సినిమాలకు వెళ్ళేది. అడపాదడపా చిన్నన్నయ్య రకరకాల స్నేహితుల్ని వెంటేసుకొస్తుండేవాడు. వాళ్ళలో అందగాళ్ళను చూసినప్పుడు వరూధిని మతిపోయినట్టు వుండేది. ఏదో పోగొట్టుకొన్నదానిలా నిట్టూర్పులు విడిచేది. వాళ్ళు వెళ్ళాక వారంరోజులదాకా వాళ్ళను గురించి రకరకాలుగా ఆలోచించేది.

సాంబయ్య పెళ్ళికి ఖర్చుపెట్టినదానికి మూడింతలు కూడపెట్టాడు. మరో పద్దెనిమిది ఎకరాల పొలం కొన్నాడు. సాంబయ్యలో వెనకటి జవం లేదు. మనిషి జారిపోతున్నాడు. వెంకటపతి యంత్రంలాగ పొలంపనులు చేసుకుపోతున్నాడు. మనిషిలో మందగొండితనం ఎక్కువయింది. దేనిమీదా శ్రద్ధలేదు. సాంబయ్యకు వెంకటపతిని చూస్తుంటే ఒకోసారి అన్పించేది. ''వాడ్ని ఇలా వదిలితే లాభంలేదు. ఏదో మార్గం చూడాలి. మళ్ళీ పెళ్ళి చేస్తేనో?''

ఓరోజున సాంబయ్య బస్తీలో ధాన్యం అమ్మిన తాలూకు పైకం తీసుకొస్తుండగా బస్‌స్టాండ్‌లో కనకయ్య కలిశాడు. ఈ మూడేళ్ళుగా ఎక్కువగా కనకయ్య బస్తీలోనే వుంటున్నాడు. సాంబయ్యకు చాలా అరుదుగా కన్పిస్తున్నాడు. ఇప్పటికీ బలరామయ్య చేసిన దగాలో కనకయ్య పాలెంతో తేల్చుకోలేకుండా వున్నాడు సాంబయ్య. కనకయ్యను

చూడగానే సాంబయ్యకు ప్రాణం లేచివచ్చింది. నిజం మాట్లాడితే కనకయ్య తనకు చేసిన అన్యాయం ఏమీలేదు. తన మేలు కోరే చేశాడు.

సాంబయ్యను కనకయ్య అంత తేలిగ్గా వదులుకోలేదు. సాంబయ్యను చూడగానే కనకయ్య ఆప్యాయంగా పలకరించాడు.

''ఊళ్ళోకేగా?''

''ఆ! నువ్వా వస్తున్నావా?''

''అవును! రావాల్సిన పనేవుంది. రెండుమూడురోజుల్లో వస్తా. నిన్ను చూసి ఇటు వచ్చా. వెంకటపతి కులాసాగా వున్నాడా?'' అడిగాడు కనకయ్య.

సాంబయ్య జవాబు చెప్పలేదు. బయలుదేరబోయిన బస్ చెడిపోయింది. అదే ఆఖరి బస్. ఎలా యింటికి చేరాలా అన్న ఆలోచనలోవున్న సాంబయ్యను కనకయ్య వెంటబెట్టుకొని యింటికి తీసుకొచ్చాడు. కనకయ్య కొడుకు 'లా' ప్రాక్టీసు చేస్తూ బస్తీలోనే వుంటున్నాడు.

కనకయ్య కొడుకు హోదా, ఇంటి హంగులూ, వచ్చేపోయే జనాన్ని చూసి మెచ్చుకొన్నాడు సాంబయ్య.

రాత్రి భోజనాలు చేశాక యింటిముందు కుర్చీలు వేయించాడు కనకయ్య. ఇద్దరూ ఎదురెదురుగా కూర్చొని లోకాభిరామాయణం మొదలుపెట్టారు.

కనకయ్య మనవణ్ణి ఒళ్ళోపెట్టుకొని కూర్చున్నాడు. కోడలు మంచినీళ్ళు తెచ్చి యిచ్చింది.

''కనకయ్యా! మొత్తంమీద కొడుకుని ప్రయోజకుణ్ణే చేశావయ్యా! బస్తీలో పెద్ద పేరున్న వకీలయాడు'' అన్నాడు సాంబయ్య.

''వెంకటపతికి మాత్రం ఏం తక్కువ? వంద ఎకరాల భూస్వామి, బుద్ధిమంతుడు.'' అన్నాడు కనకయ్య సాంబయ్యను ఓదారుస్తూ.

''ఎన్నుండి ఏం లాభంలేవయ్యా!'' సాలోచనగా అన్నాడు సాంబయ్య.

''నీకు కోపం రాకపోతే ఒకమాట చెప్తా. ఈమధ్య బలరామయ్యగార్ని చూట్టానికి వెళ్ళినప్పుడు మీ కోడలు కన్పించింది. పాపం, అమ్మాయిని చూస్తే జాలి వేసింది. ఆ అమ్మాయిచేత తండ్రి నానా చాకిరీ చేయించుకొంటున్నాడు. తల్లి తీసుకొని తీసుకొని పోయిన నెల్లోనే పోయింది. ఎప్పుడూ ఇద్దరో ముగ్గురో అయిన్ను చూట్టానికి వచ్చినవాళ్ళు వుంటూనే వుంటారు. ఆ చాకిరంతా ఆ అమ్మాయే చేస్తుంది.'' ఆగి కనకయ్య సాంబయ్య కళ్ళలోకి చూశాడు. సాంబయ్య ఆలోచనలోపడి రెప్పవేయకుండా కనకయ్య ముఖంలోకి చూస్తున్నాడు.

''చెప్పొద్దూ, నాకు చాలా బాధ కలిగింది. లక్షాధికారి సాంబయ్య కోడలికి ఏంగతి పట్టిందాఅని'' అన్నాడు కనకయ్య.

''దానికి కారణం కన్నతండ్రేకదా?'' అన్నాడు సాంబయ్య.

''ఆ మాట కాదని ఎవరంటారు? బలరామయ్య చేసిన మోసం ఎవరికి తెలియందీ? సాంబయ్యగారిదే తప్పన్నవాళ్ళెవరూ నాకింతవరకూ కన్పించలా.

పోతే, ఆడపిల్లకు పెళ్ళయాక పుట్టింటితో సంబంధం ఏపాటిది? సాంబయ్యగారి కోడలంటున్నారుగాని బలరామయ్యగారి కూతురంటున్నారా?"

"ఆమాట నిజమే అనుకో. అయినా మనం చేయగలిగిందేమీలేదు - వెంకటపతికి రెండోపెళ్ళి చేయడం మినహా."సాంబయ్య ఆలోచనకు కనకయ్య హడలిపోయాడు.

"ఈ రోజుల్లో మళ్ళీ పెళ్ళి మాటలనుకున్నారా? మొదటి భార్యతో విడాకులు పొందాలి. ఆమెకు మనవర్తి అదీ ముట్టజెప్పాలి. అవతలివాళ్ళు ఒప్పుకోకపోతే ఏడేళ్ళు ఒకళ్ళనొకళ్ళు సంబంధాలు లేకుండా వున్నారని కోర్టులో రుజువుచెయ్యాలి. అప్పుడే విడాకులు దొరుకుతాయ్ - తెలుసా? మళ్ళీ పెళ్ళంటే మాటలనుకున్నావా? నాలుగేళ్ళ తర్వాత వెంకటపతికి రెండోపెళ్ళికి పిల్ల దొరకటం అంత తేలికైనపనికాదు-" కనకయ్య సాంబయ్య ముఖంలోకి చూసి మళ్ళీ అందుకొన్నాడు.

"ఇదుగో సాంబయ్యా, నీదొక చాదస్తం! కోడల్ని కాపరానికి తీసుకురాకపోవటంలో నష్టపోయిందెవరయ్యా? నువ్వే! బలరామయ్యకేం, హాయిగా కాలుమీద కాలు వేసుకొని కూతురిచేత ఊడిగం చేయించుకొంటున్నాడు. నువ్వేమో జీతగాడికి డబ్బులిచ్చి ఇంత ఉడకేయించుకు తింటున్నావ్. ఎంతకాలం ఇలా అవస్థ పడతావయ్యా? నువ్వు బలరామయ్యను సాధిద్దామనుకొని నువ్వే నష్టపోతున్నావ్. ఇంట్లో ఆడదిక్కున్నదారివేరు."

కనకయ్య చెప్పినదాంట్లో చాలా నిజం ఉన్నట్లు అనిపించింది. అవును, తన కోడలుచేత బలరామయ్య ఊడిగం చేయించుకొంటున్నాడు. అసలీ మూడు సంవత్సరాలూ, తాను చాల పొరపాటు చేశాడు. కోడల్ని కాపరానికి రానిచ్చి బలరామయ్యమీద ఒత్తిడితెస్తే తనకు రావాల్సిన కట్నంబాపతు కొంతవరకైనా వసూలయేదేమో! కనకయ్య ఈ సలహా ఇంతకుముందే ఇస్తే ఎంత బావుండేది?

"అయితే చూడు కనకయ్యా! మా కోడలు బలరామయ్య దగ్గిర ఇంకొక్క రోజు వుండటానికి వీల్లేదు. రేపే తీసికెళ్తా! ఆ ఏర్పాటు చేయగలవా?" అన్నాడు సాంబయ్య.

"శుభం! రేపు మంచిరోజుకూడా. ఉదయం వెళ్లి బలరామయ్యగారితో మాట్లాడదాం?"

"నేను రాను. బలరామయ్య ముఖం నేను చూడను. నువ్వేవెళ్ళి మాట్లాడు."

"అట్లాగే!"

తెల్లవారి సాంబయ్యను తన ఇంట్లో వుండమని కనకయ్య బలరామయ్యదగ్గిర కెళ్ళాడు. సాంబయ్య కోడల్ని కాపరానికి తీసుకెళ్ళడానికి ఇష్టపడ్డాడని తెలిపి బలరామయ్య ఆనందపరవశుడయాడు. ఉన్నపాటున వెళ్తే నాన్నను ఎవరు చూస్తారని బాధపడింది వరూథిని.

"అదంతా నేను చూసుకుంటా. ఏ పనిపిల్లనో పెట్టి వారి మంచిచెడ్డలు చూస్తా. అమ్మాయ్, త్వరగా ప్రయాణం కా!" అన్నాడు కనకయ్య.

బలరామయ్య కళ్ళవెంట నీరు కారిపోతూంది. అది చూసి కనకయ్య కూతుర్ని వదిలి వుండలేక బాధపడుతున్నాడనుకొని ''మీ రిట్లా సాచాతచేస్తే ఆ సాంబయ్య మళ్ళీ మనసు మార్చుకుంటాడు. భగవంతుడి దయ. రాత్రంతా కూర్చోపెట్టి నచ్చచెప్పితే ఒప్పుకొన్నాడు. వివాహం వెయ్యేళ్ళపంట. సాంబయ్య ఈ రోజున కట్నంకోసం వత్తిడి చేయకుండా అమ్మాయిని తీసుకెళ్తానికి ఒప్పుకున్నాడంటే అంతా నీ అదృష్టం అనుకో బలరామయ్యా!'' అన్నాడు.

''కనకయ్యా! నీ ఋణం తీర్చుకోలేను. ఇంతకంటే ఈ జన్మలో నాకు కావాల్సిందేమీలేదు. ఈ మంచిరోజుకోసమే నేనూ బ్రతికివున్నా! నేనే స్వయంగా వచ్చి అమ్మాయిని అత్తారింటి దగ్గర దిగబెట్టి వస్తా.'' ఆనందబాష్పాలు రాల్చాడు బలరామయ్య.

''బలరామయ్యగారూ! మీరు కదలటం మంచిదికాదు. నేనూ తండ్రిలాంటివాడ్నే. నేనే వెళ్ళి అమ్మాయిని అత్తారింటి దగ్గర దించుతా. పైగా, సాంబయ్యే స్వయంగా తీసుకెళ్ళాలని వున్నాడు. మళ్ళీ మీరు రావటం మంచిదికాదు. నా మాట వినండి.''

''అమ్మాయిని ఒట్టి చేతుల్తో అత్తారింటికి ఎట్లా పంపిస్తాం కనకయ్యా? సారె పెట్టి పంపొద్దా?''

''మీరు అలా వుండండి బలరామయ్యగారూ! అంతా నేను చూసుకుంటానన్నానుగా?'' అని కనకయ్య లేచాడు.

కనకయ్య బలరామయ్యకు మరో ఐదువేలు ఇంటిమీద అప్పుగా ఇచ్చి, వరూథిన్ని కాపరానికి పంపించే ఏర్పాట్లన్నీ చేయించాడు. సాంబయ్యను మరోరోజు ఆపి తమ ఇంట్లోనే వుంచుకొన్నాడు.

మూడోరోజు ఉదయం కనకయ్య చిన్నకారు మాట్లాడి వరూథిన్ని ఎక్కించాడు. చీరెలూ, సారెలూ కార్లోనింపి బలరామయ్య దగ్గిర శెలవు తీసుకొని ఇంటికొచ్చి సాంబయ్యను ఎక్కించుకొని బయలుదేరాడు.

కార్లో కూర్చున్న వరూథినికి అంతా కొత్తకొత్తగా వుంది. ఏదో తెలియని భయమూ, దిగులూ మనసును పిండేస్తున్నాయి. ముందు సీట్లో కూర్చున్న మామగారు ఒక్కసారైనా తిరిగి చూడలేదు.

అన్నపు వేళకు కారు ఊరుచేరింది. సాంబయ్య ఇంటిముందు కారాపించిన కనకయ్య భార్యకు కబురు పెట్టాడు. పదినిముషాల్లో కనకయ్య భార్యతోపాటు నలుగురు ముత్తయిదువులు పోగయారు. తతంగం పూర్తిచేసి అమ్మలక్కలు వరూథిన్ని ఇంట్లోకి తీసుకువచ్చారు. సాంబయ్య సావిట్లో బిగదీసుకొని కూర్చున్నాడు.

వెంకటపతి పొలాన్నుంచి ఇంకా రాలేదు. కనకయ్య మళ్ళీ తిరిగి అదేకారులో బస్తీకి వెళ్ళిపోయాడు.

వరూథిని ఇల్లంతా తిరిగి చూసింది. అంతా మురికికూపంలా వుంది. ఆడదిక్కులేని సంసారం. విడిచిన బట్టలేవో, ఉతికిన బట్టలేవో తెలియకుండా

పడివున్నాయి. నట్టింట్లో చిట్టుబస్తాలూ, వడ్లబస్తాలూ వున్నాయి. వంటింట్లో అన్నీ మసిపట్టిన ప్రాతలూ, కిలుంపట్టిన ఇత్తడి గ్లాసులూ వున్నాయి. దణ్ణాలు బూజుపట్టి వున్నాయి. ఉట్లు మసిపట్టి తెగి వరిగి వేలాడుతున్నాయి. ఎలుకలు ఎక్కడపడితే అక్కడే స్వైరవిహారం చేస్తున్నాయి. చీకటి మూలల్లో మనిషి వెళితే ''బయ్'' మని దోమలు లేస్తున్నాయి. ఆ కొంపలో అడుగువేసి అడుగు తియ్యాలంటే అసహ్యంగా వుంది. వరూథినికి వంట గదిలో కాలుపెడితే డోకు వచ్చేంత పర్యంతం అయింది. అన్నం మెతుకులు కాలికి అతుక్కుంటున్నాయి. పీటలమీద ఎంగిలి అలానేవుంది. పడమటగదిలో అన్నిరకాల సామానులతోపాటు ట్రంకుపెట్టెలూ, కొయ్యపెట్టెలూ అడ్డదిడ్డంగా పెట్టివున్నాయి. సర్దటానికి ప్రయత్నించిన వరూథినికి అది తనవల్ల అయ్యేట్టు కన్పించలేదు. చిరాకుపడి పడకగదిలోనుంచి బయటకు వచ్చింది.

పొలం వెళ్ళబోతున్న జీతగాడ్ని చూసి ''నువ్విట్లారా.'' అని పిల్చింది.

''ఏందమ్మగోరూ?'' తలవంచుకొనే అన్నాడు.

''ఇది మనుషులుండే కొంపేనా?''

జీతగాడు బిత్తరపోయి వరూథినికేసి చూశాడు.

''ఏంట్రా, అట్లా చూస్తావ్? మీరు తినేది అన్నమేనా?''

జీతగాడు నోరెళ్ళబెట్టాడు.

''మీరు మనుషులేనా?''

జీతగాడు తల అడ్డంగా ఊపాడు.

''ఒరేయ్ పశువా, మాట్లాడవేంరా?''

జీతగాడికి చెమటలు పట్టాయి. వరూథిని ఆ వూరి షావుకారిగారి కూతురన్నది గుర్తొచ్చింది. బలరామయ్యగారి బిడ్డ!

''అమ్మాయిగారూ, ఏంటయిందమ్మా!'' భుజానవున్న మూటను సర్దుకుంటూ అన్నాడు.

''ఒరేయ్, ఆ భుజానవున్న దేమిట్రా?''

''చిన్న దొరగోరికి వణ్ణం తీసుకెల్తున్నా!''

వరూథిని వాంతి వస్తున్నట్లు ముఖం పెట్టింది.

''ఇంటికి వచ్చి భోజనం చెయ్యరా?''

''కొత్తకాలవపొలం నాటేత్తున్నారు. పొద్దుననంగా ఎప్పుడో సద్దెన్నం తినెల్లారు దొరగోరు. ఆలశం అయిపోతుంది. నేపోవాలి.''అంటూ జీతగాడు కదిలాడు.

''సద్దెణ్ణమా?'' వరూథినికి వళ్ళు కంపరం పుట్టింది.

''ఒరేయ్! ముందా మూట అక్కడ పెట్టు!''

జీతగాడు తెల్లబోయి చూశాడు.

''నీకేరా చెప్పేది?''

జీతగాడు అన్నంమూట బల్లమీదపెట్టి చేతులు నులుపుకుంటూ నిల్చున్నాడు.

''నువ్వేనా వంట చేసేది?''

''మా అమ్మ పొద్దున్నా, సాయంకాలం వచ్చి వణ్ణం వండుద్ది. మిగతా పనులన్నీ నేను చేసుకుంటా.''

''ఊ! ఏడ్వాన్‌గానీ, ముందు నువ్వెళ్ళి మా దాసి బుచ్చమ్మనూ, సుబ్బడి పెళ్ళాం లక్ష్మినీ పిల్చుకురా. ఇక్కడున్నట్టు రావాలి.''

''అట్టానే అమ్మగోరూ!''

''ఒరేయ్ రావుడూ, ఇంకా అక్కడేం చేస్తున్నావురా – అబ్బాయికి అన్నం పట్టుకెళ్ళకుండా?'' బయటకి పోబోతున్న జీతగాడ్ని చూసి కేకపెట్టాడు సాంబయ్య. యజమానిమాట చెవినిబడ్డా వాడి బుర్రకెక్కలేదు. తలగుడ్డ బిగించుకొని బయటకి దౌడు తీశాడు. అలా వట్టి చేతుల్తో బయటకి వెళ్ళిన రాముడ్ని చూసి సాంబయ్యలేచి నట్టింట్లోకి వచ్చాడు. బల్లమీదున్న అన్నంమూట చూసి సాంబయ్య చిరాకుపడ్డాడు.

''అన్నం ఇక్కడ పారేసి వాడెక్కడికి వెళ్ళాడూ?'' దీర్ఘంతీస్తూ పడమటి గదికేసి తిరిగి అన్నాడు.

వరూథిని తలుపుచాటుననిలబడి ఏమో చెప్పాలని ప్రయత్నించింది. కాని మాట పెగల్లేదు. మళ్ళీ మామగారు అడిగితే చెప్పాలన్న ప్రయత్నంలో మాటలు కూడబలుక్కుంది. రెండు క్షణాలు అక్కడే నిలబడి అన్నంమూట తీసుకొని వీధిలోకి వెళ్తూన్న మామగార్ని తలుపుచాటునుంచి బయటకు వచ్చి చూసింది వరూథిని---

''మురికి మనుషులు!'' అనుకుంది.

ఆకలి వేసి వంట గదిలోకి వెళ్ళింది. మామ తిన్న ఎంగిలి పళ్ళెం వంటగది మధ్యలో వుంది. ఈగలు అన్నపు కుండమీదా, ఎంగిలి పళ్ళెం మీదా మూగి వున్నాయి. మునికాళ్ళ మీద నడిచి వంగి కూరగిన్నెమీద మూతతీసి చూసింది. సొరకాయ పులుసులా వుంది. నల్లగా అడుగు అంటిపోయివుంది. మరో గిన్నె మూతతీసి చూసింది. పచ్చిమిరపకాయల పచ్చడి. తొక్కలుతొక్కలుగా కన్పించింది. పెరుగుమీద మూతలేదు. పెరుగు బురబురలాడుతోంది. ముంత ఎత్తి ముక్కు దగ్గర పెట్టుకొని వాసన చూసింది. ముక్కూమూతి బిగించుకొని పెరుగుముంత దభీమని కింద పెట్టింది. అడుగువూడి పెరుగు చింది వరూథిని కాళ్ళమీద పడింది. అన్నం తినాలన్న ఆలోచన ఎగిరిపోయింది. ఈ కొంపలో ఈ తిండి తింటూ వుండే వీళ్ళు – మనుషులేనా?

తను తెచ్చినవాటిల్లో ఇంత జిలేబీ, ఓ మైసూర్‌పాక్ తిని నీళ్ళు తాగింది. రాముడికోసం ఎదురు చూస్తూ వాకిట్లో తలుపు పక్కగా నిలబడింది వరూథిని.

సాంబయ్య పొలంనుంచి వచ్చేసరికి దీపాలు పెట్టారు. మెట్ల మీద లాంతరు పెట్టివుంది. నడవా అంతా వెలుతురు పడుతోంది. అరవై ఏళ్ళుగా చీకటిలో నడవటం అలవాటుపడ్డ సాంబయ్యకు వెలుగుబాటలో నడవటం కొత్తగా అనిపించింది. ఉన్న లాంతరు నడవలో పెడ్తే ఇంట్లో ఎట్టా? తలయెత్తి చూసిన సాంబయ్యకు ఇల్లంతా వెలుగు కనిపించింది. గదికొక దీపం పెట్టివుంది. గొడ్ల చావిట్లో కూడా

దీపాలు వెలుగుతున్నాయి. వరండాలోకొచ్చిన సాంబయ్య తన ఇంటిని తనే గుర్తుపట్టలేనట్టయిపోయాడు. అక్కడ చెయ్యి విరిగిన కుర్చీగాని, నైరెలు విచ్చిన బల్లగానీ లేవు. గోడలకు తగిలించినవి ఏమీ కన్పించలేదు. నేలంతా మెరుస్తూవుంది. పైపంచెతీసి పెట్టడానికి వరండాలో ఏమీ కన్పించలేదు. కూర్చోడానికి కూడా ఏమీ కన్పించలేదు. చొక్కావిడిచి చేతులో పట్టుకొని తన ఇంట్లో తనే కొత్తవాడిలా తిరుగుతున్నాడు సాంబయ్య.

''ఒరేయ్ రావుడూ!'' అంటూ కేకపెట్టాడు. దాసి బుచ్చమ్మవచ్చి ''బాబుగారూ! అవి ఇట్టా ఇవ్వండి'' అంటూ పైపంచా, చొక్కా అందుకొంది.

''ఎవరూ?'' సాంబయ్య నొసలు పైకెత్తి చూశాడు.

''నేనే బాబుగారూ, బుచ్చమ్మని!''

బలరామయ్య ఇంట్లో వుండే దాసీదని గుర్తుపట్టాడు సాంబయ్య.

''నువ్వా! బుచ్చమ్మా? బాగున్నావా?'' అన్నాడు సాంబయ్య.

''స్నానానికి లేవండయ్యగారూ! నీళ్ళు తోడించాను'' అంది బుచ్చమ్మ.

''అరె! అప్పుడే నీళ్ళు పెట్టేశారా?'' అప్రయత్నంగానే అనేశాడు సాంబయ్య.

మామూలుగా అయితే తను పొలాన్నుంచి వచ్చాక రాముడ్ని నాలుగు కేకలు వేశాక కాని నీళ్ళు పెట్టటం జరగదు. స్నానానికి వెళ్ళబోతూ తుండుగుడ్డా, కట్టుపంచెలకోసం వెతకసాగాడు. కాని వాటి అయివూ, అజా ఎక్కడా లేదు.

వరూథిని మామగారి తడవుళ్ళాట చూసి ''బుచ్చమ్మా!'' అంటూ కూనిరాగం తీసింది.

''అన్నీ అక్కడే వుంచాం. తమరు స్నానం చెయ్యండి?'' అంది బుచ్చమ్మ.

అలవాటుగా గాబుదగ్గిరకు వెళ్ళాడు సాంబయ్య.

''అయ్యగారూ, ఇక్కడ!'' అంటూ గోడవారగా ఎత్తుపీట వున్నచోటు చూపించింది బుచ్చమ్మ.

సాంబయ్య స్నానం పూర్తికాగానే ముందు తుండు, ఆ తర్వాత కట్టుపంచె అందించింది బుచ్చమ్మ. సాంబయ్యకు ఆ రోజు తన కెవరో స్నానం చేయించినట్టుగా వుంది. అదీ చాలా తేలిగ్గా, సుఖంగా, తొందరగా అయిపోయినట్టుంది. ప్రతీరోజూ స్నానానికిముందు బట్టలు వెతుక్కోవటానికి ఐదు నిమిషాలు పట్టేది. రాముడు మసిలే నీళ్ళకాగు అక్కడపెట్టి, రెండు కడవల చన్నీళ్ళు దించి వెళ్ళిపోయేవాడు. ఒకోసారి తపాళే కన్పించేదికాదు. కాని ఇవ్వాళ నీళ్ళు సమానంగా కలిపివున్నాయి. స్నానానికి పెట్టిన గుండెగా, తప్పేళా మెరిసిపోతున్నాయి. సాంబయ్య వాటిని వెంటనే గుర్తుపట్టలేకపోయాడు కూడా!

సాంబయ్య స్నానం చేసి నట్టింట్లోకి వచ్చాడు. ఇల్లంతా మారిపోయింది. తవుడుబస్తాలూ, వడ్లబస్తాలూ ఏమీ లేవు. ఎద్దుల పట్టెళ్ళు, చిక్కాలూ, పగ్గాలు, భోషాణం కావిడి పెట్టె అక్కడ లేవు. గోడవారగా నవారుమంచంమీద పరుపు వేసివుంది. దానిమీద తెల్లటిదుప్పటి పరచివుంది. దిండ్లకు గలీబులు తొడిగి శుభ్రంగా

వున్నాయి. మంచం పక్కగా సాంబయ్యకూర్చొనే కుర్చీ వుంది. సాంబయ్య కుర్చీలో కూర్చొని ఇల్లంతా పరికించి చూశాడు. అంతా మారిపోయింది. వడ్లబస్తాలూ, మినుముల బస్తాలూ ఎక్కడా కన్పించలేదు.

''ఒరేయ్ రాముడూ! ఈ బస్తాలన్నీ ఎక్కడ పెట్టించార్రా?'' అని కేకవేశాడు సాంబయ్య.

''బుచ్చమ్మా! మామయ్యగార్ని భోజనానికి లెమ్మని చెప్పవే!'' వరూథిని కంఠం మధురంగా విన్పించింది సాంబయ్యకు. పక్కగా వచ్చి నిలబడ్డ బుచ్చమ్మను చూసి ''అబ్బాయిని కూడా రానియ్, ఇద్దరం కలిసి భోంచేస్తాం!'' అన్నాడు సాంబయ్య.

బుచ్చమ్మ ఓ క్షణం ఆగింది. ''అమ్మాయిగారూ, అబ్బాయిగారూ కలిసి భోంచేస్తారు - ముందు మీరు లేవండి'' అంది.

ఎక్కడో ఎవరో సన్నగా హాయిగా నవ్వినట్లయింది సాంబయ్యకు. లేచి వంటగదివేపు నడిచాడు.

వరూథిని వడ్డనంతా పూర్తిచేసి రాబోతూ మామగారినిచూసి గోడవైపుకు తిరిగింది. సాంబయ్య రెండడుగులు వెనక్కువేసి నిలబడ్డాడు. కోడలు వంటగదిలోనుంచి బయటకు వెళ్ళగానే బుచ్చమ్మ ''అయ్యగారూ, రండి!'' అంది.

సాంబయ్య పీటమీద కూర్చొని పళ్ళెంచుట్టూ ప్లేట్లల్లో, గిన్నెల్లో వున్న పదార్థాలను చూసి విస్తుబోయాడు. మూడుకూరలు, రెండుపచ్చళ్ళు, పప్పూ, పప్పుచారూ, అప్పడాలూ, జిలేబీ, మైసూర్‌పాక్, పాయసం, తోడుపెట్టిన పెరుగూ--ఓస్! సాంబయ్య తింటూంటే చెమటలు పోస్తున్నాయి. బుచ్చమ్మ వెనకాల నిలబడి విసనకర్రతో విసరసాగింది. చెమట ఆరి, వళ్ళు చల్లబడుతూ దివ్యానుభూతి కలిగింది సాంబయ్యకు. కోడలుచెయ్యి అమృత హస్తం. దివ్యంగా వున్నాయి వంటకాలు! ఎంత శుభ్రంగా వుంది వంటగది? కోడలే స్వయంగా వండి వడ్డించింది. మూడేళ్ళు ఈ అదృష్టాన్ని చేజేతులా జారవిడుచుకున్నాడు తను.

సుష్టుగా భోజనం చేసి సాంబయ్య పొగాకుపట్టాకోసం వెతికాడు. ఎంత వెతికినా దొరకలేదు. బుచ్చమ్మా, రాముడూకూడ వెతికారు. సాంబయ్య భోజనం చెయ్యగానే చుట్టముక్క కాలిస్తేగాని బుర్ర పనిచెయ్యదు. చిరాకుపడ్డాడు. వరూథిని బుచ్చమ్మను పిల్చి చిట్టుబస్తాల మీద వుందేమో వెతకమంది. బుచ్చమ్మ పొగాకు పట్టా వెతికి సాంబయ్య కిచ్చింది. చుట్టచుట్టుకొని ఊళ్ళోకి బయలుదేరాడు. సాంబయ్య కోడల్ని కాపరానికి తీసుకొచ్చిన సంగతే రచ్చబండమీద కూర్చొని మాట్లాడుకుంటున్నవాళ్ళు, సాంబయ్య రావటంచూసి విషయాన్ని మార్చారు.

పొద్దుపోయి పొలాన్నుంచి వచ్చిన వెంకటపతి నేరుగా పడక గదిలో కాలుబెట్టి ఆశ్చర్యపోయాడు. వరూథిని నైలాన్ చీరకట్టుకొని, తల్లో మల్లెపూలు పెట్టుకొని అప్సరసలా కన్పించింది. తను పెళ్ళినాడు చూసిన పిల్లకూ ఈమెకూ సంబంధం లేదు. దివినుండి దిగివచ్చిన దేవతలా కళ్ళు మెరిపిస్తూ వెంకటపతికేసి చూసింది.

వెంకటపతి ఉదిక్తుడైపోయాడు. భార్యతో ఏం మాట్లాడాలో తెలియలేదు. గాలి ఆడని రావిచెట్టులా నిలబడిపోయాడు.

''బుచ్చమ్మా? వా రొచ్చారే!'' వరూథిని మాటల్లోని మాధుర్యం వెంకటపతి వళ్ళంతా పాకింది.

''బాబుగారూ, స్నానానికి రండి!'' అంది బుచ్చమ్మ వచ్చి.

స్నానంచేసేచోట పెట్టిన సబ్బుతో తోముకోకుండా, వళ్ళంతా గోళ్ళతో గీకి స్నానం చేశాడు. కొత్త గ్లాస్కోపంచా, చొక్కా తెచ్చి ఇచ్చింది బుచ్చమ్మ.

''ఇప్పుడెందుకివీ?'' అంటూనే కట్టుకొన్నాడు.

వెంకటపతి అన్నానికి లేచాడు. రెండుపీటలు వేసి, రెండు కంచాల్లో వడ్డించివుండటం చూసి---

''నాయనేడీ?'' అన్నాడు వెంకటపతి.

వరూథిని ఫక్కున నవ్వింది. వెంకటపతికి వళ్ళంతా చక్కలిగింతలు పెట్టినట్టయింది. కొంచెం సిగ్గుపడి తలవంచుకొని పీటమీద కూర్చున్నాడు. వరూథిని వెంకటపతి పక్కనవచ్చి కూర్చుంది. ఆకలిగొన్న ఎద్దు పెసరచేలో పడ్డట్టు తినసాగాడు. వరూథిని సగం కొరికిన జిలేబీలూ, గారెముక్కలూ వెంకటపతి పళ్ళెంలోకి విసరటం మొదలుపెట్టింది. వెంకటపతి అయోమయంలో పడిపోయాడు. వరూథిని కొరికి పడేస్తుందన్న సంగతి చాలాసేపటికిగాని అర్థం కాలేదు. వెంకటపతి అటూ ఇటూ చూసి ఎంగిలిచేత్తో జిలిబీ ముక్క వరూథిని నోట్లో కుక్కాడు.

''ఛీ! పొండి!'' వరూథిని ఉక్కిరిబిక్కిరి అయిపోయింది. ''అబ్బా! ఏం చేతులు! బండచేతులు!'' ముక్కూ చెంపలూ జిలేబీరసంతో మెరిశాయి.

తలుపు చాటునుంచి చూస్తున్న బుచ్చమ్మ 'అమ్మాయిగారి సంసారం తోవలో పడ్డది' అనుకొంటూ నిట్టూర్చింది.

భోజనం పూర్తయిన దగ్గర్నుంచీ వెంకటపతి మనసు మనసులో లేదు! నాళాల్లో రక్తం చిమ్ముతూంది. నరాలు లాగుతున్నాయి. బ్బుర ఆసలేం పనిచెయ్యటంలేదు. వరూథిని వంటరిగా ఎక్కడ దొరుకుతుందా అని ఎదురు చూస్తున్నాడు. బుచ్చమ్మ సింగారించే మిషతోనో, ఏవేవో సంగతులు చెబుతూనో వరూథిని వెంటవెంటనే మసులుతూంది.

వెంకటపతి తండ్రికోసం వేసిన పక్కమీదపడి దొర్లుతున్నాడు.

''బాబుగారూ, ఇది నాన్నగారి పక్క. మీ పక్క అక్కడవేశాం!'' అంటూ పడకగది చూపించింది బుచ్చమ్మ.

బుచ్చమ్మ ఇంట్లోనుంచి బయటకు వెళ్ళకముందే వెంకటపతిలేచి పడగ్గదిలో జొరబడ్డాడు. తలుపులు బిగించి వరూథిన్ని చూశాడు.

వరూథిని వయ్యారంగా పడుకొని విసనకర్రతో విసురుకొంటున్నది. వెంకటపతిని ఓరగాచూసి తల తిప్పుకొని, గోడవేపుకు తిరిగి పడుకొంది.......

''ఛీ! వాసన ....డోకొస్తుంది! వదులు!''

''వదలమంటుంటే? ఏమిటా మోటుసరసం?'' అంటూ వరూథిని పక్కమీద నుంచి దూకి తలుపులు తెరచుకొని బయటకొచ్చింది. వరూథిని వెనకే పరుగెత్తుకొచ్చిన వెంకటపతి, తండ్రి వచ్చి చొక్కా విడిచి మంచంమీద కూర్చోవడం చూశాడు.

వెంకటపతి స్వర్గలోకంలోనుంచి కిందకు త్రోసినట్లు బాధపడ్డాడు. జిలుగు వెలుగుల్లో మసకచీకట్లు కన్పించాయి. వరూథిని అందగత్తె! చదువుకొంది కూడా! బస్తీలో తిరిగిన పిల్ల. సుకుమారంగా పెరిగింది. షావుకారు బలరామయ్యగారి ముద్దుబిడ్డ! దాసీలూ, పరిచారికల్తో సేవలు చేయించుకొన్నది. తనకు భార్య అయింది. అంత ఇదిగా, అంత ప్రేమగా చేసింది ఎందుకిలా చేసింది? ఏందో తన కంతా అయోమయంగా వుంది. తనేమన్నా తప్పుచేశాడా? ఏం చేశాడూ? తనదగ్గర వాసనంది. ఏంటా వాసన? నీళ్ళుగూడా పోసుకున్నాడుగా? మరి వాసనేంటి? వరూథిని! ఎంత అందమైన పేరు!ఎంత అందం!

వెంకటపతి మనసు వరూథినికోసం ఆరాటపడింది. గుండెలు కోతపెట్టాయి. బయట మంచంమీద పడుకున్న వెంకటపతి, పడగ్గదిలో తలుపులు బిడాయించుకొని పడుకొన్న వరూథిన్ని గురించిన ఊహల్తో, ఆశల్తో రాత్రంతా జాగారం చేశాడు.

తెల్లవారకముందే నిద్రలేచాడు సాంబయ్య. తండ్రి గొడ్లపావిట్లో గేదెపాలు తీస్తుండగా లేచాడు వెంకటపతి. కాని కోడలు ఇంకా పడుకొనేవుంది. బుచ్చమ్మ సాంబయ్యకు ముఖంపుల్లా, నీళ్ళూ అందించింది. సాంబయ్య పుక్కిలించి వుమిసి, బుచ్చమ్మ అందించిన కాఫీ గ్లాసువైపన్నా చూడకుండా ''అన్నం వడ్డించండి!'' అన్నాడు. బుచ్చమ్మ తెల్లముఖంవేసి ''ఇంకా వంటకాలేదు బాబుగారూ!'' అంది.

వెంకటపతి పొలంవెళ్ళటానికి సిద్ధమయి, వరూథిని లేచేదాకా ఇంట్లోనే తారట్లాడటం మొదలు పెట్టాడు.

బారెడు పొద్దెక్కాక నిద్రలేచి, చెదిరిన ముంగురులూ, నలిగిన చీరతో బయటకొచ్చిన వరూథిని వెంకటపతి కళ్ళకు రాత్రికంటే అందంగా గన్పించింది. వెంకటపతి ఆశగా చూశాడు. రెప్పలాడించి, కళ్ళు మెరిపించింది వరూథిని. వచ్చే నవ్వును ఆపుకొటానికి ప్రయత్నించింది. చెక్కిళ్ళు ఎరబడ్డాయి. వెంకటపతి గబగబా వరూథిన్ని సమీపించాడు.

''బుచ్చమ్మా! అయ్యగారికి కాఫీ ఇచ్చావా?'' అంది. వెంకటపతికేసి లజ్జగా చూసి ''వుండండి ఇప్పుడే వస్తా!'' అంటూ తాటాకుల చాటుకు వెళ్ళింది వరూథిని.

వెంకటపతి పడగ్గదిలో వరూథిని తల్లోనించి రాత్రి రాలి నలిగిన మల్లెపూలు వాసనచూసి, మంచంమీద బొటనవేలు గోరు కొరుక్కుంటూ కూర్చున్నాడు. వరూథినివచ్చి భర్తముందే చీరా, రవికా మార్చుకుంది. వెంకటపతికి పిచ్చెక్కిపోయింది. బుచ్చమ్మ గదిబయట నిలబడి ''అమ్మాయి గారూ, కాఫీ!'' అంది.

వరూథిని వెళ్ళి రెండుగ్లాసులు పట్టుకొచ్చి వెంకటపతి పక్కన కూర్చుంది. ఓ గ్లాసు భర్తకు అందించింది. గ్లాసుచుట్టూ వున్న ఆమె వేళ్ళను నొక్కిపట్టుకున్నాడు వెంకటపతి.

''కాఫీ ఒలుకుతుంది.'' అంటూ వరూథిని చేతిని వెనక్కు తీసుకొంది.

''ఊఁ తాగండి మరి!'' గారంగా అని తను కాఫీ తాగసాగింది. వెంకటపతి కాఫీ రెండుగుక్కలువేసి ముఖం అదోలా పెట్టాడు.

''ఏం? కాఫీ బాగాలేదా?''

''చేదుగా ఉంది.''

వరూథిని విరగబడి నవ్వింది.

''బుచ్చమ్మా! పంచదారడబ్బా తీసుకురా! అయ్యగారు పానకం తాగుతారట!''

''నాక్కాఫీ అలవాటులేదు మరి!''

''చద్దన్నం అలవాటా?'' వరూథిని పొట్టచెక్కలయ్యేట్టు నవ్వింది.

''ఏం? కాఫీకంటే చద్దన్నమే మంచిది తెలుసా?'' నంగినంగిగా అన్నాడు వెంకటపతి.

''చద్దన్నంతింటే బుఱ్ఱ పనిచేయదు తెలుసా?'' వరూథిని పలువరుస నక్షత్రాల్లా మెరిశాయి.

''రెక్కలకష్టంమీద బతికేవాళ్ళకు బుఱ్ఱెందుకు?'' అన్నాడు వెంకటపతి.

వరూథిని ముఖంలో నవ్వు మాయమయింది. కాఫీగ్లాసు అందుకొని పక్కన పెట్టి వెంకటపతి దుబ్బుతల్లోకి వేళ్ళుపోనిచ్చి ఆడించింది. వెంకటపతి వరూథిని నడుంచుట్టూ చేతులువేసి నొక్కి పట్టుకొని అడిగాడు.

''నేనంటే నీ కిష్టం లేదా?''

''తలంతా మాసింది.'' మాటమార్చి అంది వరూథిని.

''రాత్రెందుకలా చేశావ్?''

''బుచ్చమ్మా! రాముడ్ని పంపించి మంగల్ని పిలిపించూ!'' వెంకటపతినుంచి దూరంగా జరుగుతూ కేకపెట్టింది వరూథిని.

వెంకటపతికి నలుగుపెట్టి తలంటిపోశాడు మంగలి. మధ్యమధ్య వరూథిని వచ్చి బుచ్చమ్మనూ, మంగల్నీ పురమాయించి తను దగ్గిరుండి భర్తకు సబ్బు రుద్దించింది.

తలంట్లు కాగానే టిఫిన్నూ, కాఫీ తెచ్చి వెంకటపతిముందుపెట్టి ఎదురుగా కూర్చున్నది వరూథిని.

''ఎన్నిసార్లు కాఫీ తాగుతారూ?'' అన్నాడు వెంకటపతి.

''ఎన్నిసార్లయినా తాగొచ్చు!'' చిలిపిగా నవ్వింది వరూథిని. వెంకటపతికి నెత్తిమీది నుంచి బరువు దిగిపోయినట్టయింది. హాయిగావుంది. అలా కూర్చొని ఎంతసేపయినా వరూథిన్ని చూస్తూ మాట్లాడాలనిపించింది. బయట జీతగాడు గొడ్లను విప్పుతూ అరవటం వినిపించింది. వెంకటపతి చివాల్నలేచి నిలబడ్డాడు. వరూథిని చెయ్యిపట్టుకొని లాగింది.

''ఇయ్యాల తూరుప్పొలం నాటేస్తున్నారు. ఎప్పుడో ఎల్లాల్సింది'' అన్నాడు వెంకటపతి ఆదుర్దాగా.

''మామగారు వెళ్ళారుగా? ఇంకా మీరెందుకూ?'' సాగదీసింది వరూథిని.

వెంకటపతికి భార్యకంఠంలోని మాధుర్యం తప్ప, మాటల్లోని అర్థం బోధపడలేదు.

''పొలం నాటేస్తుంటే వెళ్ళకుండా ఎట్టావుంటారూ?'' అమాయకంగా అన్నాడు వెంకటపతి.

''ఎలాగా? ఇలా!'' అంటూ వరూథిని వెంకటపతి చెయ్యిపట్టుకొని ముందుకు లాక్కుంది.

మధ్యాహ్నం స్టెయిన్‌లెస్ స్టీల్ క్యారియర్‌తో సాంబయ్యకు అన్నం తీసుకొని పొలం వచ్చాడు జీతగాడు.

గనెంమీద కూర్చొనివున్న సాంబయ్య జీతగాడ్ని ''అదెక్కడ్దిరా?'' అన్నాడు.

''వెండిదానికిమల్లె మెరిసిపోతాంది. అమ్మగారు తవరికి వణ్ణం ఈ అరల్లో పెట్టి పంపించారు'' అన్నాడు జీతగాడు ఉబ్బితబ్బిబ్బైపోతూ.

''చిన్నదొరేడిరా? ఇంతవరకూ రాలేదు.'' సాంబయ్య కొడుకుని గురించి అడిగాడు.

''చిన్నయ్యగోరా? ఇంటిదగ్గరే వున్నారు దొరా!''

''పొలాన నాట్లువేస్తుంటే ఇంటిదగ్గిరేం చేస్తున్నాడా వాడు?''

గట్టుమీద కూర్చొని భోజనం చేస్తున్నంతసేపూ సాంబయ్య ఆలోచనలు కొడుకుమీదే సాగాయి.

తొమ్మిదోఏటనే కొడుకును వ్యవసాయంలోకి దించాడు. వెంకటపతి పదో ఏటనే కాడీ మేడీ పట్టుకొన్నాడు. వాడు లేకుండా పొలాన ఒక్క పనీ జరగదు. వాడు లేకుండా పొలం దున్నలేదు. నాటు పడలేదు. కుప్పలు వేయలేదు. ఈరోజు తూరుప్పొలం నాటువేస్తుంటే వెంకటపతి రాలేదు. పొలంలో నాట్లు వేస్తుంటే వెంకటపతి ఇంటిదగ్గర కూర్చోగలడని తను కలలోకూడా అనుకోలేదు.

ఎండకు మెరుస్తున్న క్యారియర్ గిన్నెలు సాంబయ్య దృష్టిని ఆకర్షించాయి. తన కొడుకు వెంకటపతిని ఈ మెరుగులు జిలుగులు ఆకర్షించాయా? కోడలొచ్చి నిండా మూడురోజులన్నా కాలేదు - వాడు ఎంత దూరమైనాడు? చేలో దిగి నాటువేస్తున్న కూలీలను హెచ్చరించే వెంకటపతి ఏడీ? చేలో తిరుగుతున్నా సాంబయ్య గుండెలో గుబులు ముసురుకొంది.

ఇంటికివచ్చిన సాంబయ్య కాళ్ళన్నా కడుక్కోకుండా కొడుకుకోసం వెతికాడు.

వారగావేసివున్న పడమటి గది తలుపుతోసి లోపల కొచ్చిన సాంబయ్య స్తంభించిపోయాడు. గిరున వెనక్కు తిరిగి గొడ్ల సావిట్లోకి వెళ్ళి తల పట్టుకొని కూర్చున్నాడు.

''అసలు సంధ్యవేళ! అసుర సంధ్యంటారు! ఏమిటిది? వీడు-'' ఇంక సాంబయ్య ఆలోచించలేకపోయాడు.

''ఆ ముసలాయన కేమన్నా బుద్ధి వుందా?'' వెంకటపతిని తోసివేస్తూ అంది

వరూథిని. వెంకటపతికి కూడా అలాగే అనిపించినట్లుంది. చిరాగ్గాలేచి గదిలోనుంచి బయట కొచ్చాడు.

## (12)

వరూథిని కాపురానికొచ్చి నెలరోజు లయింది. పుట్టింట్లో జరిగే పద్ధతులూ, సంప్రదాయాలూ, అన్నీ అత్తవారింటికి దిగుమతి చేసింది వరూథిని. సాంబయ్యకు మొదటి వారంరోజులూ కొత్తగానూ, వింతగానూ తోచినై. మరో వారం గడిచేసరికి కోడలి రాకతో తన అంతస్తూ, హోదా పెరిగినట్లు తోచింది. తిండి సుఖమూ పెరిగింది. ఏ నిముషానికి ఏది కావాలో కాళ్ళముందుకు వచ్చి వాలిపోతోంది. ఎటొచ్చీ వచ్చిన చిక్కల్లా వెంకటపతికి పనిమీద ధ్యాస తగ్గటమే. భార్య కాపరానికి వచ్చిన కొత్తలో ఇలాగే వుంటుందనీ, తర్వాత కొత్త బులుపుతీరి మామూలుగా అయిపోతాడనీ, సాంబయ్య తనకు తానే సర్దిచెప్పుకున్నాడు. మరొక విషయం సాంబయ్య మనసునుపట్టి పీకసాగింది. ఇంటి ఖర్చు బాగా పెరిగినట్టు కనిపిస్తూంది. కాని తన కొడుకుగానీ, కోడలుగానీ డబ్బు అడగలేదు. బహుశా కోడలు తన తండ్రి దగ్గర తెచ్చుకున్న డబ్బు వాడుతుందేమోనని తృప్తిపడ్డాడు. కాని ఆ రోజు బుచ్చమ్మ వచ్చి చేతులు నలుపుకుంటూ తన ముందు నిలబడేసరికి తృళ్ళిపడ్డాడు.

''బాబుగారూ!''

''ఊఁ''- సాంబయ్య ముఖం చిట్లించుకొన్నాడు.

''నా నెల జీతం!''

''ఎంతా? ఏమిటీ కథా?''

''ఎంతెక్కడిది బాబూ! ముప్పై''

''నెలకు ముప్పైరూపాయలా? అదీ అన్నం పెట్టి?''

''మిమ్మల్ని ఎక్కువేం అడగలేదు బాబుగారూ! బలరామయ్యగారిచ్చిందే మిమ్మల్ని అడుగుతున్నాను.''అంది బుచ్చమ్మ.

''అయితే ఆ బలరామయ్యే ఇస్తాళ్ళే, తీసుకో!''అన్నాడు సాంబయ్య.

బుచ్చమ్మ బిత్తరపోయింది. సాంబయ్య హాస్యమాడుతున్నట్లు కూడా కన్పించలేదు.

''అదేంటి బాబుగారూ! తమరింట్లో పనిచేసి అరివెట్టా అడిగేది?''అంది బుచ్చమ్మ.

''మాకు అచ్చమ్మలూ బుచ్చమ్మలూ అక్కర్లేదు''అని సాంబయ్య బనీను జేబులోనుండి రెండు పదిరూపాయల నోట్లు తీసి బుచ్చమ్మ ముందుకు విసిరాడు.

''ఇంద! ఈ ఇరవయ్ తీసుకొని పో! ఈ రోజునుంచి నువ్వు మాకు అవసరంలేదు''అన్నాడు సాంబయ్య.

బుచ్చమ్మ కుక్కిన పేనులా డబ్బు తీసుకొని వరూథిని దగ్గిరకెళ్ళి భోరున ఏడ్చింది.

''ఎందుకు బుచ్చమ్మా ఏడుస్తావ్? ఊరుకో. నేను మీ దొరగారితో మాట్లాడతాలే''అంది వరూథిని.

''ఆ రాత్రి మునగతీసుకొని పడుకొన్న వరూథిన్ని సాగదీసేసరికి వెంకటపతికి తల ప్రాణం తోకకు వచ్చినట్లు అయింది. అలక వహించిన వరూథిన్ని చూస్తుంటే వెంకటపతి గుండెలు తహతహలాడిపోయినై.''

''చెప్పవా? ఎందుకూ కోపం?'' అనునయిస్తూ అడిగాడు వెంకటపతి.

''బుచ్చమ్మ వెళ్ళిపోతానంటుంది.''

''ఓసి! దానికే ఇదయిపోవాలా?''

''మరి బుచ్చమ్మ వెళ్తే ఎట్లా? నా చిన్నప్పటినుంచి మా ఇంట్లోనే వుంది. నన్ను కనిపెట్టుకొని వుంది. మా అమ్మ ఎప్పుడూ జబ్బుతోనే పడుంటే, బుచ్చమ్మే నన్ను సాకింది.'' ముక్కు చీదేస్తూ అంది వరూథిని. ఎర్రబడిన ముక్కూ, ఉబ్బిన కళ్ళతో ఇంకా అందంగా కన్పించింది వరూథిని వెంకటపతి కళ్ళకు.

''బుచ్చమ్మతో నేను మాట్లాడతాగా! ఎట్టా అయినా అది ఉండేటట్టు చూసే పూచీ నాది. ఊరుకో మరి''అన్నాడు వెంకటపతి భార్య తల నిమురుతూ.

మూటా ముల్లేకట్టుకుంటున్న బుచ్చమ్మదగ్గిరకొచ్చి ''బుచ్చమ్మా! మీ అమ్మగారు ఎట్లా ఇదయిపోతుందో చూశావా? నా మాట విను, ఉండిపో!'' అన్నాడు వెంకటపతి.

బుచ్చమ్మ మూట కిందపెట్టి వెంకటపతికేసి ప్రశ్నార్థకంగా చూసింది.

''బుచ్చమ్మా! అయ్యగారు అంతగా చెప్తుంటే ఇకా ఆలోచిస్తావెందుకు? ఉండు, నీకే లోపం లేకుండా చూసుకుంటారు అయ్యగారు.'' భర్త వెనగ్గా నిలబడి, పాటపాడే ప్రుతిలో అన్నది వరూథిని.

''చిన్నబాబుగారి మాట నే నెట్టా కాదనగలను అమ్మాయిగారూ?'' అని ఓ క్షణం ఆగి ''అయ్యగారిష్టం! మీ ఇష్టం!'' అని వంటగదికేసి నడిచింది.

పొలాన్నుంచి వచ్చిన సాంబయ్యకు గడపలో కూర్చుని లాంతరు తుడుస్తూ బుచ్చమ్మ కన్పించింది. ఆవిడను చూసీచూడనట్టు ఇంట్లోకి వెళ్ళాడు సాంబయ్య. రెండు మూడురోజులుంటే అదేపోతుందిలే అనుకొన్న సాంబయ్య ఆలోచనలో పడ్డాడు. ఈ ముండ ఇంకా ఎందుకున్నట్లు? ఇరవై రూపాయలకు ఒప్పకొని వుందా? ఇరవై రూపాయలైనా అదెందుకు ఇంట్లో? ఇద్దరి మనుషులకు చేసిపెట్టటానికి?... కోడలు ఆమ్మాత్రం చేసి పెట్టలేకపోతుందా? ఇంత వండి వార్చలేనిది ఇంట్లో వుండి ఏం ప్రయోజనం? అసలు కోడల్ని కాపరానికి తెచ్చుకొన్నది ఎందుకు? ఇంత కాసి పోసి ఇల్లు కనిపెట్టుకొని వుంటుందనే గదా? అది చేసేదేమీ లేకపోగా దానికొక దాసీముండా? బలరామయ్య కూతురు కోడరికానికి వచ్చిందా లేక కోట ఏలటానికి వచ్చిందా? అయ్యో పాపం అని దాన్ని ఈ ఇంట్లో కాలుపెట్టనిచ్చాడు.

ఏంది అది చేసే బరువుపనులు? తన భార్య దుర్గమ్మ ఎంత పని చేసేది?

అది కాపరానికి వచ్చిన కొత్తలో అత్త తన కోడలిచేత పొలంపనులు చేయించలా? వంచిన నడుం ఎత్తకుండా చాకిరి చేసేది బతికినంత కాలం. ఆడకూతురంటే అలా వుండాలి. ఆ మాటకొస్తే తన తల్లీ పొలం పని చేసేది. ఏవో ఆ రోజులు వేరు. వెంకటపతి పెళ్ళాన్ని పొలంపని చెయ్యమనలేదే? ఇంటిపని చూసుకోవడానికేం? గాడా? మొగుడికి వండి పెట్టడానికికూడా వళ్ళు బరువేనా? అయినా అదేం ఆడది? ఎప్పుడూ పడగ్గది వదిలిరాదు! ఆ షోకు లేమిటి? ఆ కులుకు లేమిటి? దీన్ని అదుపులో పెట్టకపోతే లాభంలేదు. అదుపులో పెట్టాల్సినవాడు దాని మొగుడు. వాడే దాని మోజులోపడి తన్నుకుంటున్నాడు. ఏదో కొత్త కాపరం మోజులో వున్నాడని ఇన్నాళ్ళూ వూరుకున్నాడు. చూస్తూ కూర్చుంటే వెంకటపతి యెందుకూ పనికిరాకుండా పోయేలా వున్నాడు.

బుచ్చమ్మ లాంతరు వెలిగించి చూరుకొక్కేనికి తగిలించి వెళ్ళబోతుండగా ‘‘బుచ్చమ్మా? ఇంకా వున్నావేం? మొన్ననే వెళ్ళమని చెప్పాగా?'' అన్నాడు సాంబయ్య.

‘‘ఈ రోజే వెళ్దామని బయలుదేరా. కాని చినబాబుగారు నువ్వెళ్ళడానికి వీల్లేదంటే ఉండిపోయా!'' సాంబయ్యకేసి సరిగా చూడకుండానే సమాధానంచెప్పి, సాంబయ్య మళ్ళీ మాట్లాడేలోపునే తిరిగి ఇంట్లోకి వెళ్ళిపోయింది బుచ్చమ్మ.

సాంబయ్యకు బుర్ర తిరిగిపోయింది! తనుకాక ఆ ఇంట్లో మరో అధికారి వున్నాడనేది చాలా కొత్తగా, కటువుగా తోచింది. తన మాటకు ఇంతకాలంగా ఎదురులేదు. తనలోని భాగమే తన కొడుకు అనుకున్నాడు. ఆ ముండ...ఆ...ఎంత పొగరుగా మాట్లాడింది?

సాంబయ్య బుచ్చమ్మను పిల్చి ‘‘వాడ్ని పిలువ్, మాట్లాడాలి!'' అని చెప్పాడు. అరగంట గడిచిపోయింది. గంట గడిచిపోయింది. సాంబయ్యకు వెర్రులెత్తిపోయాయి. ఎంతకీ వెంకటపతి రాడు!

‘‘ఏమేవ్ బుచ్చమ్మా! ఏడే వాడూ?'' బుచ్చమ్మను గదమాయించాడు.

‘‘నన్ను కసురుకొంటారెందుకు బాబుగారూ?'' అంటూ మూతి విరుచుకుందది.

‘‘అంటవెధవ!'' అనుకొని సాంబయ్య రామాలయం దగ్గిర కెళ్ళాడు. పురాణం వింటున్న సాంబయ్యకు ఆ మంధరే బుచ్చమ్మగా పుట్టిందేమో ననిపించింది! ఇంతకీ ఈ బుచ్చిముండ వెంకటపతికి తను పిలుస్తోన్నట్టు చెప్పిందా? అంత పెద్ద అనుమానం పీడిస్తూంటే సాంబయ్యకు పురాణం వంటబట్టలేదు. ఇంటికి వస్తూ... ‘‘తెల్లారనీయ్. వాడిసంగతేదో తేల్చుకుంటాగా?'' అనుకొన్నాడు సాంబయ్య.

తెల్లవారి చావిట్లోకి వెళ్ళిన సాంబయ్యకు గాట్లో ఎద్దులు కన్పించలేదు. చేతిలోవున్న గడ్డిపన పడేసి చావిడంతా కలియజూశాడు. ఈరోజు నాగలి కట్టే పనిలేదే అనుకొంటుండగా నాగలి కన్పించింది. అయితే ఎద్దు లేమయినట్టు? చావిడి పెణ్ణెంకూడా తీసివుంది. ఆదుర్దాగా దొడ్డి వెనకదోవలోకి వచ్చాడు. అక్కడ జీతగాడు సవారిబండికి ఎద్దులుకట్టి పగ్గాలు పట్టుకొని నిలబడి వున్నాడు.

''ఒరేయ్! సవారి కట్టావెందుకురా?'' అన్నాడు సాంబయ్య అయోమయంలో పడి.

''చిన్న దొరగోరూ దొరసానిగోరూ ఊరికిపోతున్నారు గదయ్యా?''

''ఊరికి పోతున్నారా? ఏ ఊరు?''

''బస్తీకి! వంతెనకాడ బస్సు ఆగుద్ది చూడండి. ఆడదాకానే! దొరసానమ్మ గోరు వంతెనదాకా బండిలో ఎల్లి ఆడ బస్సెక్కుతారంట!'' అంటూ జీతగాడు అటు చూస్తూ, క్షణం ఆగి తల గోక్కుంటూ అన్నాడు-

''దొరసానమ్మగోరు వత్తుండారు. మీరు తప్పుకోండయ్యా!''

సాంబయ్య కోడలు చావిడిగేటు వెనక్కు వెళ్ళింది.

సాంబయ్య తలవంచుకొని వస్తుండగా వెంకటపతి ఎదురైనాడు.

''ఎక్కడికిరా ప్రయాణం?'' కొడుకు ముఖంలోకి చూస్తూ అన్నాడు,

వెంకటపతి తల పక్కకు తిప్పుకొని ''బస్తీకి'' అన్నాడు.

''ఎందుకురా ఇప్పుడు?''

''మామయ్యను చూసొద్దామని.''

''ఏం? ఎట్టా వుంది? పోతాడా ఏం? ''

''అంతా పోతారు ఆ రోజు వస్తే!''

సాంబయ్య వీపు మీద కొరడా వచ్చి తగిలింది! తాచుపాము పడగమీద కర్రదెబ్బ తగిలింది. వరూధిని సవారి బండి ఎక్కి 'ఎక్కవేం' అన్నట్టు భర్తకేసి చూసింది. వెంటనే వెంకటపతి వెళ్ళి ఎగిరి బండెక్కాడు.

ఎంత నోటి దురుసు? ఎంతమాటంది? అది బలరామయ్య కూతురుగాదా మరి? ఎంత అహంకారం? తను మామ అన్నమాటే మర్చిపోయిందే! వాడు - వాడి పెళ్ళాం తండ్రిని అంత మాటంటే నోరు మూసుకొని పెళ్ళాం వెనకే బండెక్కుతాడా? రానియ్ వాడ్ని ఇంటికి చెప్తా!

సాంబయ్య ఉడికిపోతూ ఇంట్లోకొచ్చి వాలుకుర్చీలో కూలబడ్డాడు. వరూధిని మాటలు సాంబయ్య తల్లో సుడులు తిరుగుతున్నాయి. పెళ్ళాం వెనకే గొర్రెలా వెళ్ళిన వెంకటపతిని కళ్ళలో తారట్లాడసాగాడు.

''బాబుగారూ, వడ్డించమంటారా?'' వెనకనుంచి బుచ్చమ్మ గొంతు.

''ఛ! అవతలికి ఫో!'' బుచ్చమ్మమీద విరుచుకుపడ్డాడు సాంబయ్య.

కొడుకు, కోడలు తిరిగివచ్చేదాక వాళ్ళ ఊసే ఎత్తగూడదనుకున్న సాంబయ్య రెండోరోజు జీతగాడ్ని అడిగాడు.

''ఎప్పుడొస్తానన్నాడా వాడు?''

''చిన్దొరగోరా? మూడోరోజు కొస్తామన్నారయ్యా! మొన్నగదా ఎల్లారు? అంటే రేపొచ్చేయొచ్చు.'' జీతగాడు సమాధానం చెప్పాడు.

''ఎప్పుడో ఒకప్పుడు చస్తాడ్లే!'' అని మనసులో అనుకొని ''ఒరేయ్, కాలవకింద పొలం కలుపు తీయొద్దంటరా?'' అని అడిగాడు.

''ఆఁ రేపో మాపో తియ్యాలి. చిన్దొరగోరు వత్తారుగా రేపు. ఆ రొచ్చాక తీయించుతార్లే!'' అన్నాడు జీతగాడు.

''ఏఁరా వాడు తీయించేది? రేపు నేనే వస్తా! కూలీలను మాట్లాడు!''

''తమఁరికి ఒంట్లో వుసుల్లేదుగా! మీరేమొస్తార్లే అయ్యా చిన్దొరగోరు రేపేపొటి కొత్తారుగా!'' అన్నాడు జీతగాడు.

సాంబయ్యకు వళ్ళు మండిపోయింది. ఏం మాట్లాడకుండా కళ్ళు మూసుకొని పడుకున్నాడు. రెండు రోజులనుంచి ఆకలి చచ్చిపోయింది. వళ్ళుకూడా ఏ మ్యాత్రమో కాక తగిలినట్టయింది. పుట్టి బుద్దెరిగింతర్వాత రెండురోజులు తను మంచంమీద పడుకొన్నది లేదు. ముప్పూటలా తినంది తను ఉండగలిగేవాడు కాదు! అటువంటిది రెండు రోజులుగా అన్నం మెతుకు చూస్తే మొహం కొట్టినట్టవుతూంది. వళ్ళేకాదు, మనసుకూడా బాగాలేదు. కలుపుతీసే రోజులు దగ్గిర కొచ్చాయి. తను చూస్తే, లేస్తే కళ్ళు తిరిగేట్టున్నాయి. వాడ్ని చూస్తే, వాడిపాటికి వాడు పెళ్లాన్ని వెంటేసుకెళ్ళి, బస్తీలో కూర్చున్నాడు. అసలు తను పొరపాటు చేసేడేమో ననిపిస్తుంది. కోడల్ని కాపురానికి రానియ్యడంతో మొదలైంది ఇది. అందరి పెళ్ళాలూ కాపురాలు చెయ్యడంలా? మొగుళ్ళంతా పెళ్ళాల కొంగు పట్టుకు తిరుగుతున్నారా? తను వెంకటపతితో గట్టిగా మాట్లాడితే ఇట్టా చేసివుండేవాడు కాదేమో? వాడు తనమాట కాదనడు. తను గీచిన గీటు దాటడు. వాడు వఠ్ఠి అమాయకుడు. కొత్త పెళ్ళాం బులపాటంలో పడ్డాడు. అంతే! నా కొడుకు వెంకటపతి నా వాడే—ఆలోచన అలా ఓ కొలిక్కిరావటంతో సాంబయ్య నెత్తిమీదనుంచి బరువు దించినట్టయింది. వళ్ళు చమటలు పోసి, కాసేపటికి కునుకు పట్టింది సాంబయ్యకు.

సాంబయ్య వేళ్ళమీద రోజుల్లెక్కపెడ్తున్నాడు. వారం రోజులు గడిచినా వెంకటపతి తిరిగి రాలేదు. సాంబయ్యకు వెంకటపతిమీద ఓ వైపున కోపమూ, మరో వైపున ఆందోళనా రోజురోజుకూ పెరగసాగినై.

మాగాటి చేలల్లో కలుపు బీడుగా పెరిగిపోతోంది. తను లేచి నడిచే స్థితిలో లేడు. వెంకటపతి తన్ను విడిచి ఇన్ని రోజులు ఎప్పుడూ వుండలేదు. తనకు వాణ్ణి చూడకపోతే ఆ రోజంతా ఏదో మనసు పీకుతున్నట్లుగా వుంటుంది. అట్లాంటిది వాడు, ఇన్ని రోజులుగా ఇల్లు వదిలి, ఊరు వదిలి, పొలాలు వదిలి, తండ్రిని వదిలి ఎలా వున్నాడో! ఇంతకీ వాడెలా వున్నాడో! ఆ ఆలోచన రావటంతో సాంబయ్య గుండెలు కదబడిపోయినై. తొమ్మిదోరోజు కూడా వెంకటపతి తిరిగిరాకపోయేసరికి సాంబయ్య నిజంగానే దిగులుపడ్డాడు. బస్తీలోవున్న కనకయ్య దగ్గరకు మనిషిని పంపే ఏర్పాటు చేసి, తను ఓపిక తెచ్చుకొని, లేచి చెప్పులు తొడిగి, కఱ్ఱచేతబట్టి, చేలో కలుపు తీయించడానికి బయలుదేరాడు సాంబయ్య. చేతికఱ్ఱను భూమికి తాటిస్తూ వరండా మెట్లు దిగుతోన్న సాంబయ్య, ఇంటిముందుకొచ్చి ఆగిన చిన్నకారును చూసి నిలబడిపోయాడు. గ్లాస్కోపంచె; తెల్లని నిండు చొక్కాతో, బూట్లు నేలమీద బాదుకుంటూ, కారుదిగి ఇంట్లోకి వస్తున్న వెంకటపతిని సాంబయ్య

వెంటనే గుర్తుపట్టలేకపోయాడు. తలకూడా మారిపోయినట్టుంది. క్రాపుకూడా కొత్త తరహాగా వుంది. కొత్త బూట్లు కాళ్ళనునొక్కి మంటపెడ్తూంటే వెంకటపతి కాళ్ళు ఎత్తి ఎత్తి వేస్తూ మెట్లెక్కాడు. అతని వెనకే వరూథిని కారు దిగి వచ్చింది. సాంబయ్య పక్కకు తప్పుకుంటాడని ఓ క్షణం ఆగి, మామగారు అలాగే నిలబడి వుండిపోవడం చూసి, ఎదురుగా నేరుగానే వచ్చింది వరూథిని. కోడలు కట్టుకున్న చీరలోంచి లంగా, రవికలోనుంచి ఏదో గుడ్డపీలికలా బాడీ కన్పించాయి సాంబయ్యకు. తన పక్కగా కోడలు వెళ్ళినప్పుడు అత్తరు వాసనలు గుప్పుమన్నాయి. వెంకటపతికూడా సెంటు రాసుకున్నాడేమోమరి - సాంబయ్య బుర్ర గుర్తు చేసుకోలేకపోయింది.

అలా ఇంట్లోకి వెళ్ళిన మనుషులు తనకు సంబంధించినవాళ్ళుగా అనిపించలేదు సాంబయ్యకు. ఏం మాట్లాడాలో, ఏం చెయ్యాలో తోచక మెట్లమీద అలాగే నిలబడిపోయాడు సాంబయ్య. బలహీనంగా వున్న అతని కాళ్ళు గుంజాయి. వెళ్ళి పడకకుర్చీలో జారగిలపడ్డాడు. కారులోనుంచి అట్టపెట్టెలూ, కాగితంపొట్లాలూ లోపలకు పట్టుకొచ్చాడు కారు డ్రైవరు. సాంబయ్యకు కళ్ళు బైర్లుకమ్మాయి.

కారు డ్రైవరుకు డబ్బిచ్చి పంపి, లోపలికొస్తున్న వెంకటపతికి తండ్రిగొంతుక కర్కశంగా విన్పించి ఠక్కున ఆగిపోయాడు.

''ఏమిటా నీ వేషాలు నువ్వు?''

కొడుకు తల వంచుకుని నిలబడ్డాడు. వెంకటపతి గుండెల్లో గూడు కట్టుకున్న భయం కరిగిపోసాగింది. తండ్రి ఎదుటపడటానికే జంకుతున్న వెంకటపతికి, మేడ్లాలో అట్టపెట్టెలూ, పొట్లాలూ విప్పి చీరెలు సర్దుతోన్న వరూథిని కన్పించగా అడుగులు ముందుకు వేశాడు.

''ఎక్కడికిరా అటుపోతావ్? నిన్నేరా అడిగేది? అసలు నీకేమైనా బుద్ధి వుందంటరా?'' తర్వాత సాంబయ్యకు ఏమనాలో తోచలాదు.

''ఇప్పుడేమయిందేంటీ?''

తనకొడుకేనా ఆ మాట అన్నది? సాంబయ్య నొసలు చిట్లించి కొడుకు ముఖంలోకి చూశాడు. వాడు తన కొడుకు వెంకటపతికాడు. వరూథిని మొగుడు వెంకటపతి! బలరామయ్య అల్లుడు వెంకటపతి!

''కలుపుతీసేరోజుల్లో వెళ్ళి వారంరోజులు బస్తీలో కూర్చుంటావ్రటా? నీకేమన్నా జ్ఞానముందా?'' తోచినంతవరకూ అన్నాడు సాంబయ్య. అందులో తన బలహీనత తనకే వేలెత్తిచూపినట్టుంది. కొడుకు బుర్ర బద్దలుకొట్టాలనీ, వరూథిన్ని బయటకు నెట్టాలనీ ఆక్రోశించిన సాంబయ్య అంతకంటే ఏమీ అనలేకపోయాడు.

''ఊఁ వెళ్తాలే పొలం!'' అంటూ వెంకటపతి మేడ్లాలోకి వెళ్ళాడు.

''ఇంకానయం, నేనెందుకూ అన్నాడుకాదు! అమ్మాతమైనా అన్నాడు'' అనుకొన్నాడు సాంబయ్య.

బూట్లు విడిచి కాళ్ళు చూసుకొన్నాడు వెంకటపతి. పాదాలు బొబ్బలెక్కి వున్నాయి.

''ఇటుచూడు, వద్దంటే కొన్నావ్! కాళ్ళంతా పుండ్లుపడ్డాయి. వెధవ బూట్లు!" పెళ్ళానికి కాలిబొబ్బలు చూపిస్తూ అన్నాడు వెంకటపతి.

''కొత్తబూట్లు కదండీ! అలాగే వుంటుంది అలవాటయ్యేదాక." మందహాసం చేస్తూ అంది వరూథిని.

పొలం వెళ్ళబోతూ చెప్పులు తొడుక్కుని నడవలేక, చెప్పులు విడిచి కర్ర తీసుకొని బయలుదేరాడు వెంకటపతి.

భర్తకు అడ్డం నిలబడి మొహంలోకి చూస్తూ అన్నది వరూథిని:

''ఇంత ఎండలో ఎలా వెళ్తారు?"

''ఎండాగిండా! కలుపుతీస్తున్నారు, తర్వగా వెళ్ళాలి!"

''అయ్యోరాత! ఇలా వెళతారా? ఉండండి!" అని వరూథిని వెంకటపతి చేతిలోని కర్రలాగి అవతలపడేసి గొడుగు అందించింది. విడిచినబూట్లు తుడిచి భర్తకాళ్ళకు తొడిగింది.

''ఇప్పుడు చూడండి ఎలా వున్నారో!" ఊడిన చొక్కాగుండీలను పెడుతూ అంది వరూథిని.

మంత్రించిన బొమ్మలా వెంకటపతి బూటుకాళ్ళతో కుంటుకుంటూ, గొడుగు తీసుకొని పొలం బయలుదేరాడు.

అలా వెళ్తున్న కొడుకుని చూసి ''వీడు నా కొడుకు వెంకటపతా!" అనుకొన్నాడు సాంబయ్య.

ధోవతి కాళ్ళమీదకు ఎగగట్టి, ముతకచేతులబనీనుతో, తలకు పైపంచ బిగించి, కిర్రుచెప్పులు తొడుక్కుని, ముల్లుకర్ర చేత్తో పట్టుకొని పొలం వెళ్ళే ఆ వెంకటపతి....తన వారసుడు....వెంకటపతి-తన కొడుకు వెంకటపతి ఏడీ?....వాడేమయ్యాడు? వాడెక్కడికి పోయాడు? సాంబయ్య పెదవులు వణికాయి. కనుగుంటల్లో ఎర్రటి జీరలు ఉబికాయి.

మానసిక సంక్షోభంలోపడిన సాంబయ్య ఆరోగ్యమూ అంతంత మాత్రంగానే వుంది. ఇంట్లో వుండటమంటే ముళ్ళమీద ఉన్నట్లుగా ఉంది. కొడుకూ కోడలూ విడిచిన గాలి సోకినా కంపరం ఎత్తిపోతూంది. వాళ్ళు కళ్ళకు కనిపిస్తే ఖాండ్రించి వాళ్ళమీద ఉయ్యాలన్నంత అసహ్యపడేవాడు. ఆ పని అప్పుడప్పుడూ గోడమీద కానిచ్చేవాడు. వాళ్ళకుతోడు బుచ్చమ్మ ఒకతి. దాన్నయితే మొహం మీదే ఊసినంతపని చేసేవాడు. ఒంట్లో బాగా లేకపోయినా ఇంట్లో ఒక్కక్షణం వుండేవాడుకాదు. పొలానికో, రామాలయందగ్గరకో వెళ్ళి కూర్చొనేవాడు.

ఓ రోజు రచ్చబండమీద కూర్చున్న సాంబయ్యను లక్ష్మీపతి పలకరించాడు.

''సాంబయ్యా! మొన్న మీ ఇంటిముందు చిన్నకారు ఆగివుండటం చూశాను. అది కనకయ్యదేనా ఏమిటి?"

''కనకయ్యా? కనకయ్య కారుకొన్నాడా ఏమిటి?" సాంబయ్య ఆశ్చర్యానికి అవధులు లేవు.

''నీకు తెలియదా ఏంటి? వారంరోజులయిందని విన్నాలే. బస్తీనుండి ఊళ్ళకు బాడిగలకు తిప్పుతున్నాడటగా?"

''ఏమోనయ్యా! నాకు తెలియదే!''

''అయితే మొన్న మీ ఇంటికొచ్చింది కనకయ్య కాదన్నమాట?''

''మా కోడలూ అబ్బాయీ వచ్చారయ్యా! మా వియ్యంకుడికి సుస్తీగావుంటే వెళ్ళి చూసివచ్చారు'' సాంబయ్య కంఠంలో గర్వం దోబూచులాడింది. 'బోడి కనకయ్య కారు కొనటమేమిటి? వాడు నా ఇంటికి కార్లోరావటం ఏమిటి? నా కొడుకూ కోడలే ఆ వచ్చినవాళ్ళూ, రాగలిగినవాళ్ళూ ' అన్న ధోరణిలో అహంకారంగా మాట్లాడాడు సాంబయ్య.

ఇంటికి తిరిగొస్తున్న సాంబయ్యకు అలా కొడుకూ కోడలూ కార్లో రావడం గొప్పగానే అనిపించింది. ఊరంతా ఆ విషయాన్నే చెప్పుకొంటున్నారన్న ఆలోచన సాంబయ్యకు ఆనందాన్నే కలిగించింది. వెంకటపతి బూట్లు తొడుక్కొని గొడుగు వేసుకొని వీధుల్లో నడుస్తుంటే ఊళ్ళోవాళ్ళు ఎట్లా చూసి వుంటారు? షావుకారు సాంబయ్య కొడుకు వెంకటపతి అంటున్నారా? షావుకారు బలరామయ్య అల్లుడు వెంకటపతి అంటున్నారా? సాంబయ్యకు ఏదీ తేలలేదు.

కోతలు మొదలు పెట్టారు. వెంకటపతి గొడుగు వేసుకొనిగట్టుమీద కూర్చొని తూరుప్పొలం కోతలు అజమాయిషీ చేస్తున్నాడు. అప్పుడే పొలం వచ్చిన సాంబయ్య, కొడుకును ఓరగా చూసి పొలంలో దిగాడు. కూలీలమధ్య నిలబడి పనివాళ్ళను హెచ్చరించి వోదెలు మట్టసంగా వేయిస్తున్నాడు. అడ్డం దిడ్డంగా పడ్డ పైరుకంకుల్ని ఏరి వోదెల మీదకు విసురుతున్నాడు. లేని ఓపిక తెచ్చుకొని వరిచేలో తిరగసాగాడు. వెంకటపతి తండ్రి ఎండలో నిలబడటంచూసి జీతగాడికి గొడుగు ఇచ్చి పంపించాడు.

జీతగాడు సాంబయ్య పక్కన నిలబడి గొడుగు పట్టుకున్నాడు.

''ఏమ్షిటా అదీ?'' విసురుగా అడిగాడు సాంబయ్య.

''చిన్నారగారు చెప్పారయ్యా!''

సాంబయ్యకు వళ్ళుమండిపోయింది. జీతగాడి చేతిలోనుంచి గొడుగులాగి విసిరి బురదలో పారేశాడు.

''వాడికే షటా గొడుగు! నా కెందుకూ?'' అని సాంబయ్య గట్టుకేసిచూశాడు. వెంకటపతి అప్పటికే గనందాటి కాలవ గట్టెక్కి ఇంటి తోవ పట్టాడు.

''ఏంరా? అబ్బాయికి అన్నం తీసుకురాలేదా?'' జీతగాడ్ని చూసి అడిగాడు.

''దొరసానమ్మగోరు చిన్నారగార్ని భోజనానికి ఇంటికే రమ్మన్నారు'' అన్నాడు రాముడు, కిందపడ్డ గొడుగుఎత్తి బురద దులుపుతూ.

''గాడ్దికొడకా, నీకు సుతారాలెక్కువైనట్టున్నాయ్‌రా! అదవతల పెట్టి వోదెలెయ్యరా!'' సాంబయ్య జీతగాడ్ని గద్దించాడు. వాడు బెదిరిపోయి చకాచకా కోసిన వరి వాటాలు వాటాలుగా పట్టి వోదెలు వెయ్యడం మొదలుపెట్టాడు. వాడికీ అర్థం అయింది తిట్టింది తనుకాదని కొంతసేపటికి.

కుప్పలు వేయించటం పూర్తయింది. ఆరోజే సాంబయ్యకు తీరిక చిక్కింది. మనిషి పనివత్తిడిలో సగం అయిపోయాడు. పళ్ళబిగువుమీద ఎలాగో కుప్పలు

వెయ్యటం పూర్తి అయిందాకా తిరిగాడు. పనిలో వున్నంతవరకూ సాంబయ్యకు నీరసం అంతగా అన్పించలేదు. కాని ఆ రోజు స్నానంచేసి భోజనానికి లేవబోయిన సాంబయ్య తూలి పడబోయాడు. ఎలాగో నాలుగు మెతుకులు తిని, మంచంమీద మేను వాల్చాడు. అంతవరకు ఎవరో లాగి సంధించివుంచిన నరాలు, సడలి విడిపోయినట్టుగా వుంది సాంబయ్య పని. ''తిన్న అన్నం ఏమయిందో మరి, ఇంత నీరసంగా వుందేం?'' అనుకుంటూ మాగన్ను వేశాడు సాంబయ్య. ఎంతసేపు పడుకున్నాడో, అసలు నిద్రపోయాడో లేదో తెలియకముందే కనకయ్య మాటలు విన్పించాయి.

లోపలకు వచ్చిన కనకయ్య ''సాంబయ్యగారూ? నిద్రపోయారా ఏమిటి? పడుకోండి! పడుకోండి! మళ్ళీ వస్తాలే!'' అంటూ మంచం పక్కనే నిలబడ్డాడు.

'ఎవరూ? కనకయ్యా! నిద్రా లేదు. పాడూ లేదు. రావయ్యా రా! కూర్చో!'' అంటూ లేచి కూర్చున్నాడు సాంబయ్య.

సాంబయ్యను చూస్తూనే కనకయ్య నోరంతా తెరచి క్షణకాలం చూస్తూ వుండిపోయాడు.

''ఏమిటి సాంబయ్యా? అలా ఉన్నావేం? ఏమయింది? వంట్లో బాగుండటం లేదా?'' అన్నాడు కనకయ్య.

''అఁ బాగుండక పోవటం ఏమిటిలే? మూణ్ణెల్ల క్రితం ఓ వారంరోజులు పడక పెట్టాను. అప్పట్నుంచీ ఏదో నలతగానే వుందయ్యా!''

''మెల్లగా అంటావేమిటి? ఏనుగులాంటి మనిషివి ఎట్టా అయిపోయావో తెలుసా? నాతో రండి! బస్తీలో మా అబ్బాయికి తెలిసిన ఒక పెద్ద డాక్టరు ఉన్నాడు. ఆయనకు చూపించుదాం!'' కనకయ్య తన ఆదుర్దానూ, ఆపేక్షనూ, పెద్ద మోతాదులోనే చూపించాడు.

''ఈ మాత్రం దానికి బస్తీలూ, డాక్టర్లూ దేనికయ్యా? ఆచారి చెయ్యి చూసి అతి ఊష్ణం అన్నాడు. నాలుగు వారాలు పోతే మళ్ళీ మామూలు మనిషి అవనూ?'' బింకంగా అన్నాడు సాంబయ్య.

సాంబయ్య గుండె నిబ్బరం, మొండితనం కనకయ్యకు కొత్తేం కాదు. సాంబయ్యను పరిశీలనగా చూసి ''సాంబయ్యా? నీ వయస్సెంత ఇప్పుడు?'' అని అడిగాడు. అలా ఎందుకడిగాడో కనకయ్యకు సరిగా తెలియదు.

''నా వయస్సా?'' సాలోచనగా అంటూ సాంబయ్య కనుబొమలు ముడివేశాడు.

''అరవై దాటలా?''

''ఎందుకు దాటలా? దాటేవుంటాయ్!''

''అట్లా చెప్పు! వయస్సు బాబూ వయస్సు! వయసు మళ్ళాక వెనుకటి ఓపిక ఇంకా ఎందుకుంటుందిలే?'' ఇహ నీపని అంతే అని స్ఫురించేట్టు అన్నాడు కనకయ్య.

సాంబయ్య పైకి తేలిగ్గా నవ్వేశాడు. కాని అతని గుండెల్లో వృద్ధుడి గుండెపోటు చప్పుళ్ళు విన్పించాయి.

''పైకం తెచ్చావా? ఏం, ఇంతాలస్యమైందేం?" అడిగాడు సాంబయ్య.

''ఇదిగో వద్దాం, అదుగోవద్దాం అనుకొంటూనే వున్నా కాని తీరికెక్కడిది? ఒకటి వదిలించుకుంటే మరొకటి తగులుకుంటుంది."

''అవునూ! నువ్వు చిన్నకారు కొన్నావా?"

''నేనా! చిన్నకారా?" ఆశ్చర్యపోయినట్టు కన్పించాడు కనకయ్య.

''మరేంటి ఊళ్లో అట్టా చెప్పుకుంటున్నారేం?"

''ఓహో! అదా? మీ కొడుకూ, కోడలూ రావటానికి కారు కావాలంటే మాట్లాడాను. ఆ రోజు మనూరి రాంసుబ్బయ్య నేను బస్సులకాడ నిల్చోటం చూసి అడిగాడు. కొన్నాలేవయ్యా! నాదే కారు! అన్నా ఆ మాట అప్పుడే పాకిందన్న మాట ఊరంతా? తప్పాదియ్యా! ఏం ఊరు? ఏం కత?"

సాంబయ్య ఆ తర్వాత కనకయ్య చెప్పింది విన్పించుకోలేదు. ఈ కనకయ్య గాడేనన్నమాట వాళ్ళకు కారు మాట్లాడి ఊళ్ళోకి పంపించింది? అసలు వాడే ఇచ్చి వుంటాడు ఈ సలహా...సాంబయ్యగారి కోడలనీ-బలరామయ్యగారి కూతురనీ బస్సులో వెళ్ళటం ఏమిటనీ-

ఇంకా సాంబయ్య ఆలోచనలు అలా సాగుతుండగానే, కనకయ్య సంచిలో నుంచి తీసి ముందు పెట్టిన నోట్ల కట్టలమీద సాంబయ్య దృష్టి పడింది.

డబ్బు లెక్క పెట్టిన సాంబయ్య కనకయ్యను చిరాగ్గాచూసి ''సగమే తెచ్చావేంటి? మిగతాది ఎప్పుడిస్తావ్?" అన్నాడు.

''సగమేమిటి సాంబయ్యా? ఇది ఐదువేలు. మూడు నెలల క్రితం ఇచ్చింది ఐదూ-మొత్తం పదవలా? ఆ నూటముప్పైఏడూ వడ్డీ! సరిపోలే లెఖ్ఖా?" అన్నాడు కనకయ్య.

సాంబయ్యకు కనకయ్యను గుండెలమీద తన్నాలన్నంత కోపం వచ్చింది. వెనకటి ఓపిక వుంటే అంత పనీ చేసేవాడే.

''ఎవడికిచ్చావు? ఎప్పుడిచ్చావయ్యా ఐదువేలూ?" ఓపికకొద్దీ అరిచాడు సాంబయ్య.

''అదేమిటి సాంబయ్యా? మీ అబ్బాయి చెప్పలా? మీ కోడలూ కొడుకూ వారం రోజులపాటు బస్తీలో ఉన్నారు చూడండి. అప్పుడు వెంకటపతే స్వయంగా వచ్చి చాలా అవసరం అని అడిగితే ఇచ్చాను. ఆ సంగతి మీవాడు చెప్పనేలేదా? ఇంట్లోనే వున్నాడుగా, పిల్చి అడగండి." కనకయ్య కూడా గొంతు పెద్దది చేసుకొనే చెప్పాడు. సాంబయ్య నిర్ఘాంతపోయాడు. ఆయన కొడుకుని పిల్చేలోగా కనకయ్యే వెంకటపతిని కేక వేశాడు.

వెంకటపతి చలవచేసిన తెల్లటి బట్టలు వేసుకొని, బూట్లు ధ్వనిచేస్తూ, తండ్రి ముందు కొచ్చాడు.

''డబ్బు తీసుకొన్న సంగతి మీ నాన్నకు చెప్పలేదా?" నిలదీసి అడిగాడు కనకయ్య. వెంకటపతి మూగపశువులా నిలబడ్డాడు.

''ఏం చేశావురా ఆ డబ్బూ?'' సాంబయ్య గద్దించి అడిగాడు.

''ఖర్చయిపోయిందిలే!'' మంచినీళ్ళు తాగినంత తేలిగ్గా చెప్పాడు వెంకటపతి.

''ఐదువేలు! ఏం ఖర్చు పెట్టావురా? పెళ్ళాని కిచ్చావా? మామ కిచ్చావా?''

ఇంట్లో ఏ గిన్నో పళ్ళెమో ఎత్తికొట్టిన శబ్దమై ఉలిక్కిపడ్డాడు కనకయ్య. సాంబయ్య కళ్ళు చింతనిప్పుల్లా మెరిశాయి.

ఇంతలో 'పఁయ్!' 'డుక్క్!' 'డుక్క్!' అని ధ్వని చేసుకుంటూ చిన్నకారు వీధి మలుపు తిరిగి సాంబయ్యగారి వాకిలి ముందు కొచ్చింది. దాని వెనకే పిల్లలు కేరింతలుకొడ్తూ రొదచేస్తూ పరుగెత్తుకొచ్చారు. డ్రైవర్ పిల్లల్ని గదమాయిస్తున్నాడు. సాంబయ్యగారి ఇంటిముందు కొచ్చి కొంచెంసేపు పెద్దగా ధ్వనిచేసి ఆగిందాకారు.

''ఏమిటి మేళాం?'' సాంబయ్య కనకయ్యను గుర్రుగా చూస్తూ అడిగాడు.

''అబ్బే! నాకేం తెలుసూ? నేనూ అదే చూస్తున్నా!'' అంటూ కనకయ్య లేచి డ్రైవర్ను కేకవేసి పిలిచి అడిగాడు.

''ఒరేయ్? పాపారాయుడూ? ఎవరు తెమ్మన్నారా కారూ?''

''వెంకటపతిగారే కబురంపారు'' అన్నాడు డ్రైవరు.

సాంబయ్యా, కనకయ్యా వెంకటపతికేసి చూశారు.

''ఆఁ నేనే తెప్పించా! అదే! అదే! డాక్టరుకు చూపించాలని!'' వెంకటపతి మాట అతికీ అతక్కుండా అన్నాడు.

''నా కెందుకురా డాక్టరూ?'' సాంబయ్య కొడుకు ముఖంలోకి ఆశ్చర్యంగా చూస్తూ అన్నాడు.

సాంబయ్యకు లోలోపల ఆనందం కలక్కపోలేదు. కొడుకు తనకు మాట మాత్రమైనా చెప్పకుండా తనను బస్తీకి తీసుకెళ్ళి డాక్టరుకు చూపించే ప్రయత్నంలో వున్నాడు. తనంటే వాడికి మనసులో ఎంత ప్రేమ లేకపోతే ఈ పని చేస్తాడు? అంటే ఇన్ని రోజులనుంచి తన ఆరోగ్యం బాగా లేదని వాడూ బాధ పడుతున్నాడన్నమాట? వాడు వట్టి అమాయకుడు. నోరులేనివాడు. అంతే! ప్రేమలూ అపేక్షలూ ఎక్కడకు పోతాయి? తనకు ముందే చెబితే పడనీయడని వాడికీ తెలుసు. అందుకే ఉట్టుడియంగా ఇంత పని చేశాడు. అయినా వాడి పిచ్చి కాకపోతే తనకు బస్తీ డాక్టర్లెందుకూ? ఈ కారెందుకూ? అంతగా బస్తీకి వెళ్ళాలంటే తమ సవారి బండి లేదూ? అంతగా అయితే బస్ లేదా? వాడికి ఉండేదీ పోయేదీ తెలియదు. అది చూసుకొనే కోడలు వాడిచేత డబ్బు తగలేయిస్తూంది. సాంబయ్యకు చటుక్కున వెంకటపతి కనకయ్య దగ్గిర ఐదువేలు తీసుకొన్న సంగతి గుర్తొచ్చింది. అప్పటికి కొడుకులమీద ఏర్పడ్డ సదభిప్రాయంతో కొడుకును కనకయ్యముందు దులపడానికి వెనకాడాడు.

''ఇంకా ఆలోచనెందుకయ్యా? లే! బయలుదేరు. కొడుకు చిన్నకారు తెప్పించి ఇంటిముందు వుంచితేను!'' సాంబయ్యను కనకయ్య ఉషారెక్కిస్తుండగా, బుచ్చమ్మ పెట్టెలుతెచ్చి క్లీనర్కు అందించింది.

''ఏమిటీ కోడలుగారుకూడా ప్రయాణమయారా? ఇంకేం కొడుకూ, కోడలూ దగ్గిరుండి జబ్బు నయం చేయిస్తార్లే!'' అన్నాడు కనకయ్య గుక్కతిప్పుకోకుండా.

''ఎవడికయ్యా రోగం? నీదొక పిచ్చి! బస్తీలెక్కటం మరిగి ఇంట్లో కాలు నిలవక కళ్ళు పొగర్లకమ్మి వాళ్ళు చస్తుంటేను?''

సాంబయ్య వాస్తవాన్ని తృటికాలంలోనే అర్థంచేసుకొన్నాడు. కొడుకుని గురించి కొద్దిక్షణాల క్రితమే తను కల్పించుకొన్న ఆశలూ, ఊహలూ పటాపంచలైనయ్. తనగురించీ, తన ఆరోగ్యం గురించీ కొడుకు శ్రద్ధతీసుకొన్నాడనుకొని ఆనందశిఖరాలను అందుకొన్న సాంబయ్య, బిళ్ళబీటుగా నేలమీదపడ్డాడు. అతడ్ని ముసురుకొన్న భ్రమా–మమకారం–అదృశ్యమైనాయి. మనిషి నీరుకారిపోయాడు. అసలు కొడుకుమీద అన్ని ఆశలు అల్లుకోకపోతే సాంబయ్యకు అంత బాధ కలిగివుండేదికాదేమో!

''డబ్బు! డబ్బు కా–వా–లి!''

సాంబయ్య తలవిరుచుకొని కొడుకని చూశాడు.

''రెండువేలు కావాలి!'' అన్నాడు కొడుకు.

''ఎందుకూ?'' సాంబయ్య కళ్ళు ప్రశ్నించాయి.

''రెండువారాలన్నా పడ్తుంది.'' ఏమిటోగా అన్నాడు వెంకటపతి.

తండ్రి పెదవులు వణకాయి. నోట్లకట్టలను పట్టుకొనివున్న అతని వేళ్ళు కొంకర్లు పోయినై.

''అవునవు! బాబుగారూ! లేడీడాక్టరమ్మగారితో అన్ని పరీక్షలూ చేయించుకోవాలంట, పదిరోజులకు పైగానే పడ్తుందట. అమ్మాయిగారు వట్టిమనిషికాదు!'' వెంకటపతి చెప్పలేనిది బుచ్చమ్మ చెప్పింది.

సాంబయ్య కళ్ళు పెద్దవిచేసి చూశాడు. కనకయ్య ఎగిరి గంతేసినట్టు అన్నాడు!

''శుభం సాంబయ్యా! తాతయ్యావు అవుతున్నావయ్యా, తాతయ్యవి! మనవడే పుడ్తాడు. నీ వంశాన్ని ఉద్ధరిస్తాడు. చూస్తావేం? ఇవ్వూ!'' అంటూ కనకయ్య రెండు వెయ్యిరూపాయల కట్టలుతీసి వెంకటపతి చేతికిచ్చాడు.

''పనిలోపని! ఎటుదిరిగీ పట్నంలోనే వుంటున్నారుగా? మీ నాన్ననుకూడా తీసుకెళ్ళి డాక్టరుకు చూపించకూడదూ?'' సలహాగా అన్నాడు కనకయ్య. అక్కడకు తనే సాంబయ్యకు ఏదో మేలుచేస్తున్నట్టు ముఖంపెట్టాడు. కనకయ్య సాంబయ్య ముఖంలోని భావాలను కనిపెట్టటానికి చూస్తుండగానే, కాన్పూరు ఆకు జోళ్ళు చటచట లాడించుకుంటూ మామముందునుంచే నడిచివెళ్ళి కారు ఎక్కింది వరూథిని. అంత ధైర్యంగా మామగారి ముందునుంచి వెళ్ళిన వరూథిన్ని చూసి కనకయ్య నోరు బిగిసిపోయింది. ముక్కుమీద పడబోతున్న వేలును బలవంతంగా ఆపుచేసి ఇంటికప్పుకేసి చూడసాగాడు.

''నువ్వుకూడా వస్తే డాక్టరుకు చూపించుకోవచ్చు.'' ఆరుసార్లు మననం చేసుకున్న తర్వాత ఆ మాట పైకి అనగలిగాడు వెంకటపతి. వాళ్ళముందుగా

వెళ్తున్నప్పుడు కోడలుపెట్టిన ముఖం సాంబయ్యకేకాదు కనకయ్యకు కూడా గుర్తుంది.

"మామ తమతో వస్తాడంటేనే అట్టా అయిపోయిందే? నిజంగా వస్తే?" బుచ్చమ్మ అనుకొంది.

వెంకటపతి తండ్రికోసం నిలబడ్డాడు. వరూధిని కారెక్కి డ్రైవర్‌చేత హారన్ కొట్టించింది.

"ఎందుకురా ఇంకా నిలబడ్డావ్? ఫో! ముందు నా కళ్ళముందునుంచి ఫో!" కసిగా అరిచాడు సాంబయ్య. ఆయన ముఖంలో కలిగిన మార్పుల్ని చూసిన కనకయ్యకు అక్కడ కూర్చునే ధైర్యం లేకపోయింది.

"వస్తా!సాంబయ్యా!" అంటూ లేచాడు.

"మళ్ళీ ఈ గడపతొక్కొద్దు!" పురుగును చూసినట్టు కనకయ్యను చూస్తూ అన్నాడు సాంబయ్య. కనకయ్య గుండెల్లో బల్లెంగుచ్చుకున్నట్టు బాధపడ్డాడు.

ఇందులో తన తప్పేముంది? అసలు తను చేసిందేముంది? కొడుకుమీది కోపం, కోడలిమీది అక్కసూ తనమీద చూపిస్తాడేం?

అంత కఠినంగా సాంబయ్య లోగడ చాలాసార్లు మాట్లాడాడు. కాని తనెప్పుడూ ఇంత బాధపడలేదు. దానికి కారణాలున్నాయ్. అకారణంగా, ఒట్టి పుణ్యానికి తనను అంత నీచంగా చూస్తాడా? తను ఈరోజు సాంబయ్య మేలుకోరి, అతనిమీద అభిమానంతోనే చెప్పాడు. ఏమనుకొంటున్నాడు సాంబయ్య? తను ఇంకా అతని మోచేతినీళ్ళు తాగి బతికే కనకయ్యే అనుకుంటున్నాడేం? తన అల్లుడు ఒహడు ప్లీడరు, మరొకడు రెవిన్యూ ఇన్‌స్పెక్టరు. తను మిల్లులో వాటాదారు. ధాన్యం వ్యాపారి. తనకొడుకు పెద్దవకీలు. అటు బస్తీలో, ఇటు ఊళ్ళో పెద్దపరపతివున్నవాడు. తన సలహా సంప్రదింపులకోసం మహా మహావాళ్లే తనచుట్టూ తిరుగుతున్నారు. ఈ సాంబయ్యదేం లెక్క? ఆస్తివుండగానే పరా? అతని పలుకుబడి ఎంత? అతని పరువెంత?

"ఇదుగో సాంబయ్యా!"

--కనకయ్య తారాజువ్వలా లేచాడు సాంబయ్య మీదకు. "మళ్ళీ నీ గడపలో కాలుపెడితే చెప్పుచ్చుక్కొట్టు!" అని ధుమధుమలాడుతూ వెళ్ళిపోయాడు.

"నా కొంప కూల్చావుగదరా కనకయ్యా!" అనుకున్నాడు సాంబయ్య.

చెరువుగట్టుమీద కారాపి డ్రైవర్ ఇంజన్‌లో తలదూర్చాడు. వైర్లూ, ప్లగ్గులూ లాగి వూది మళ్ళీ పెట్టాడు. కారుచుట్టూ చేరిన జనాన్ని క్లీనర్ తిట్టేస్తున్నాడు.

"ఏమిటీ కారు మాటిమాటికి ఆగిపోతుంది?" చిరాకుపడింది వరూధిని. వచ్చే పోయేవాళ్ళు, వెంకటపతికేసీ, వరూధినికేసీ వ్యంగ్యంగా చూస్తూ పోతున్నారు. బస్సుకోసం పరుగెత్తుకొస్తున్న కనకయ్య కారు ఇంకా ఊళ్ళోనే వుండటం చూసి ఆనందపడిపోయాడు.

"ఏంవిటి రాయుడూ? పెట్రోలు అయిపోయిందా ఏం?" అంటూ కనకయ్య కారుదగ్గిరకు వచ్చాడు.

‘‘చిన్నటుబుల్ వచ్చింది'' అని డ్రైవర్ తలెత్తి క్లీనర్‌తో ‘‘హాండిల్ వెయ్యి'' అన్నాడు.

ఇంజన్ స్టార్టయింది. కనకయ్య ఎగిరి డ్రైవర్ పక్కన కూర్చున్నాడు. కారు వెనక్కూ ముందుకూ వూగి ఒక్కసారిగా కదిలింది.

‘‘హమ్మయ్య!'' అనుకొంది వరూథిని. వెంకటపతి ముఖం చాటంత అయింది. కారు వేగాన్ని అందుకొంది.

‘‘వెంకటపతీ! మీ అయ్యకు చాదస్తం ఎక్కువయిందయ్యా! ఏం కట్టుకుపోతాడు? కొడుక్కు ఇవ్వటానికికూడా ఏడుస్తాడు?'' అని మొదలుపెట్టాడు కనకయ్య.

వెంకటపతి బెల్లంకొట్టినరాయిలా మాట్లాడకుండా కూర్చున్నాడు. వరూథినికి కనకయ్యమాటలు ఇంకా వినాలనిపించింది.

మిట్టమధ్యాహ్నం చిన్నకారు కొత్తపేటలో బలరామయ్య అద్దెకుంటున్న ఇంటిముందుకొచ్చి ఆగింది. వరూథిని వెంకటపతితో కారు దిగి లోపలకు నడిచింది. కనకయ్య కారుదిగి, సామాన్లు లోపలపెట్టించి, బలరామయ్యను పరామర్శించి వెళ్ళిపోయాడు.

వెంకటపతిని మామగార్ని ‘‘ఎట్లావుంది?'' అని పలకరించాడు.

‘‘ఇక నాపని అయిపోయింది. ఎక్కువరోజులు బతకను.'' హీనస్వరంతో చెప్పాడు బలరామయ్య. మామను చూస్తుంటే ఆయన చెప్పిన మాట నిజమేననిపించి, వెంకటపతి దిగులుపడిపోయాడు. ఏం మాట్లాట్టానికీ తోచక దిక్కులు చూడసాగాడు.

‘‘మీరు విశ్రాంతి తీసుకోండి నాన్నా! కమలమ్మా! బాబుగారికి పళ్ళరసం ఇచ్చావా?'' అంటూ భర్తకేసి చూసింది. వెంకటపతి లేచి పక్కగదిలోకి వెళ్ళిపోయాడు.

సాయంకాలం ఆరుగంటలకల్లా వరూథిని చక్కగా ముస్తాబయి బయలుదేరింది. పనిపిల్ల కమల మల్లెపూలదండతెచ్చి వరూథిని తలలో తురిమింది.

‘‘కమలా! ఓ జట్కా పిలవ్వే!'' అద్దంముందు నిలబడి పూలు సర్దుకొంటూ అంది వరూథిని. గుర్రంబండివచ్చి గుమ్మంముందు ఆగింది. వరూథిని మెరుపులా జట్కా ఎక్కి కూర్చుంది. వెంకటపతి వెనక, కాళ్ళు వేలాడేసుకొని అంచుకు కూర్చున్నాడు.

జట్కావాడు పట్టెనొక్కి ‘‘ముందుకు రండమ్మా!'' అన్నాడు.

‘జరిగి కూర్చోండి' అంది వరూథిని చిరునవ్వులు ఒలకబోస్తూ. వెంకటపతి అమాంతం ఎగిరి దగ్గిరకు జరిగాడు. గుర్రం నడకలోనుంచి గేలప్‌లో పడింది. సిమెంటురోడ్డుమీద గుర్రపుడెక్కలశబ్దం లయయుక్తంగా వినబడుతోంది. బండి వెనక్కూ ముందుకూ తూగుటుయ్యాల్లాగ వూగిసలాడుతోంది. బండి వూపులకు వెంకటపతి వరూథినిమీద కొరిగిపోతూ, లేస్తూ వున్నాడు. సాయంకాలపు ఎండకు వరూథిని ముఖం ఎర్ర మతాబాలాగ వెలిగిపోతోంది. వెంకటపతికి తనేదో కొత్త లోకంలోకి వెళ్ళిపోతున్నట్టుగా వుంది.

జట్కావచ్చి పిక్చెరుప్యాలెస్ ముందు ఆగింది. వరూథిని భర్తకేసి దిగమన్నట్టు చూసింది. బండిదిగబోతూ ''ఇక్కడా డాక్టరమ్మ వుండేది?'' అన్నాడు వెంకటపతి ఆశ్చర్యపోతూ. భర్త అమాయకత్వానికి వరూథినికి కోపం వచ్చిందో, జాలివేసిందో చెప్పడం కష్టం. ముఖంలోవచ్చిన మార్పును వెంటనే అణచివేసుకొని అన్నది:

''అబ్బ! ముందు దిగండీ!''

వెంకటపతి ఎగిరి రోడ్డుమీదకు దూకాడు. ఎడంకాలి హాఫ్ షూ జారి జట్కాకింద పడింది. వంగి జట్కాకిందదూరి షూ అందుకుంటున్న భర్తను చూసిన వరూథిని ముఖం మాడిపోయింది. జట్కావాడికి డబ్బులిచ్చి వయ్యారంగా బుకింగ్ ఆఫీసు పక్కకొచ్చి నిలబడింది. సినిమాహాలుమీద కట్టివున్న పెద్దబేనరు చూస్తూ భార్యపక్కన నిలబడ్డాడు భర్త. వెంకటపతి పోస్టర్ మీదవున్న రంగురంగుల, స్త్రీల ఆకారాలను చూసి విస్తుబోయాడు. అక్షరాలు కలబలుక్కుని చదివాడు.

''జగదేకసుందరి.''

''ఇదేం సినీమా! తెలుగేనా?'' అడిగాడు వెంకటపతి, ఇంకా వరూథిని తన పక్కనే వుందనుకొంటూ.

ఆకుపచ్చ టిక్కెట్లు రెండు చేత్తోపట్టుకొని అంతదూరంనుంచే భర్తకు సైగచేసింది వరూథిని.

స్పెషల్ క్లాసులో వరూథిని పక్కన కూర్చొని వెంకటపతి తల తిప్పుతూ హాలంతా కలియచూడసాగాడు.

''అట్లా వెనక్కి తిరిగీ, పక్కలకు తిరిగీ చూడకూడదు.'' వరూథిని సన్నగా నొక్కి నొక్కి అంది.

''నాకూ తెలుసులే! ముందేగా బొమ్మపడేది!'' అన్నాడు వెంకటపతి.

''సరేలెండి! ముందు సరిగా కూర్చోండి.'' చిరాకుగా కప్పిపుచ్చుకుంటూ అంది వరూథిని.

ఇంటర్వెల్‌లో వెంకటపతి లేచి బయటకు వెళ్ళాడు. కాసేపు బయటతిరిగి, లైట్స్ ఆఫ్ అవబోతుండగా వచ్చి భార్యపక్కన కూర్చున్నాడు.

తెరమీద 'సబ్బులూ-ఇంకా-ఇది చూడండి-అది తినండి-ఇదే వాడండీ' అనే ప్రకటనలు కన్పిస్తుండగానే, ఓ కుర్రాడు రెండు కూల్ డ్రింక్స్ తెచ్చి, అతివినయంగా వంగి వరూథినికీ, వెంకటపతికీ ఇచ్చాడు. వరూథిని భర్తకేసి ఆనందంగా చూసింది. పరవాలేదే! కూల్ డ్రింక్స్ ఆర్డరిచ్చి వచ్చాడు. మనిషి త్రోవలో పడుతున్నాడు. చల్లటి ద్రాక్షరసం గొంతులోపడి హాయినిస్తుంటే, వరూథిని బుర్రకు హాయిగొలిపే ఆలోచనలు వస్తున్నాయి.

''నాకెందుకూ ఇది? ఇది కూడా నువ్వే తాగు!'' గ్లాసు వరూథిని చేతికి అందించబోయాడు వెంకటపతి. గ్లాసు తొణికి రంగునీళ్ళు అతని బట్టలమీదా, వరూథిని చీరమీదా పడ్డాయి.

''ఛీ! ఛీ! ఏమిటా పట్టుకోవటం? తాగండి!''

''దీని ఖరీదెంతా? ఇంత చల్లగా వుంటే ఎట్టా తాగడం!''

''మరయితే ఎందుకు తెప్పించారు?''

''నాకేం తెలుసు? నువ్వే తెప్పించావనుకొన్నానే?''

అంతలో కుర్రాడు వచ్చి గ్లాసులకోసం వంగి నిలబడ్డాడు. వెంకటపతి మంచి నీళ్ళు తాగినట్లు గ్లాసెడురసమూ ఒక్కసారి గుటకేశాడు. వరూథిని భర్త చేతిలో గ్లాసు తీసుకొని కుర్రాడి కిచ్చి వ్యానిటీబ్యాగ్ తెరిచి ఐదురూపాయల నోటు తీసింది.

''వద్దండీ అమ్మగారూ?'' డబ్బు తీసుకోకుండా అన్నాడు కుర్రాడు.

''అదేమిటీ?'' కలవరపడింది వరూథిని.

''అయ్యగారు పంపించారమ్మా!''

''ఎవరూ?''

''బాబుగారు.''

''ఏ బాబూ?''

''ఆడ నిలబడ్డారు చూడండీ, ఆరే! రామనాధబాబుగారు! ఓనరుగారు!''

కుర్రాడు గ్లాసులు తీసుకొని వెళ్ళిపోయాడు.

వరూథిని తలపక్కకు తిప్పిచూసింది. రిజర్వ్డుక్లాసుగేటులో థియేటరు ఓనర్ రామనాథ్‌బాబు నిలబడివున్నాడు. వరూథిన్ని చూడనట్టే చూశాడు. లైట్లు ఆఫ్ అయినై. ఇంటర్వెల్ తర్వాత కథ మొదలైంది.

''డబ్బులు తీసుకోలేదేం?'' అడిగాడు వెంకటపతి.

వరూథిని వినిపించుకోట్లు సినిమా చూడసాగింది.

వెంకటపతి మళ్ళీ అన్నాడు - ''ఊరికే ఎందుకిస్తారూ?''

''అందరికీ ఇస్తారేం?'' అన్నది వరూథిని.

''మన కెందుకిచ్చారూ?''

''మాకు దూరపుచుట్టాల్లే వాళ్ళు!'' వరూథిని ఠపీమని సమాధానం చెప్పింది. వెంకటపతి సందేహంతీరి సినిమా చూడసాగాడు.

సినిమాహాల్లోనుంచి వరూథిని భర్తతో బయటికి వచ్చేసరికి కూల్‌డ్రింక్స్ ఇచ్చిన కుర్రాడు ఎదురొచ్చాడు.

''అమ్మగారూ! అదిగో, ఆ బండెక్కండి!'' ఆగివున్న కొత్త జట్కాబండి చూపించాడు.

వరూథిని బండిఎక్కి కూర్చుంది. వెంకటపతి తలవంచుకొని బండి ఎక్కుతుంటే, వరూథిని అతని తలమీదగా చూసింది. రామనాథ్‌బాబు మెట్లమీద రాజసంగా నిలబడి బండివైపు చూడనట్లే చూస్తున్నాడు. వరూథిని కళ్ళు మెరిసాయి. చెంపలు కంది ఎరబడ్డాయి. రామనాథ్‌బాబు తొణకలేదు. గంభీరంగా ముఖంపెట్టి కదిలివెళ్తున్న జట్కాకేసి చూస్తూ నిలబడ్డాడు.

## 13

కొడుకూ, కోడలూ బస్తీకి వెళ్ళి వారంరోజులు పైగా అయింది. సాంబయ్యకు వాళ్ళు లేకపోవడం ఒకరకంగా హాయిగానే వుంది. ఇంట్లో తిరుగుతున్న బుచ్చమ్మను చూస్తుంటే కంపరం ఎత్తిపోతూంది. దీన్నికూడా వదిలించుకుంటేగాని తనకు మనశ్శాంతి ఉండదు. ఓరోజు సాయంత్రం వంటగదికి తాళం వేసి తాళం చెవులగుత్తిని తలకింద పెట్టుకొని పడుకున్నాడు. పొద్దున్నే లేచిన బుచ్చమ్మ వంటగదిముందే కూర్చుంది. అది చూసి సాంబయ్య పొలం వెళ్ళాడు. సాయంకాలం తిరిగొచ్చేసరికి సాంబయ్య ఆశించినట్లే బుచ్చమ్మ ఇంట్లో లేదు. వంటగది తలుపుతీసి, జీతగాడ్ని కేకవేసి అన్నం వండమన్నాడు.

''అదేంటి దొరగారూ! బుచ్చమ్మేమయింది?'' అన్నాడు జీతగాడు.

''అది మళ్ళీ ఇంట్లోకొస్తే కాళ్ళు విరగ్గొట్టు. తెలిసిందా?'' అన్నాడు సాంబయ్య. పొద్దుటినుంచి ఉపవాసం వున్న సాంబయ్యకు ఆకలి దహించుకుపోతూంది. జీతగాడు ఉడకేసిన అన్నంలో ఉప్పగోంగూర తొక్కు వేసుకొని, గిన్నెడు నెయ్యి బోర్లించుకొని తిన్నాడు. బ్రహ్మానందంగా వుంది.

''బుచ్చిముండా! దానిబొంద వంటకాలూ! ఈ రుచికంటే మించిందేమీలేదు!'' – పుల్ల పెరుగు వేసుకొని, అందులో పండుకారపు పచ్చడి నంజుకొంటూ, జుర్రుకుంటూ తిన్నాడు. భోంచేసి మెల్లాలో మంచం వేసుకొని పడుకొన్నాడు. పుల్లటి తేపులు వస్తున్నా అందులోనే ఆనందం పొందగలిగాడు సాంబయ్య. అరవైఏళ్ళుగా, పచ్చి పులుసూ, పచ్చడి మెతుకులూ, పుల్ల పెరుగూ తినడానికి అలవాటు పడ్డ సాంబయ్యకు అదే ఆనందంగా వుంది. అసలు తన ఆరోగ్యం దెబ్బతినటానిక్కూడా ఆ బుచ్చమ్మ వంటలూ, కోడలు పోకిళ్ళే కారణం అనుకున్నాడు.

వారంరోజుల్లో తిరిగొస్తాడనుకొన్న కొడుకు ఇరవైరోజులయినా రాకపోయేసరికి బాధపడసాగాడు. కుప్పలు నూర్చే తరుణం కూడా వెళ్ళబోతూంది. పక్క చేలల్లో అప్పుడే నూర్పిళ్ళు పూర్తి అవుతున్నాయి. ఏటా అందరికంటే ముందే మాసూళ్ళు చేయించే సాంబయ్య పొలాన కుప్పలు అలాగే వుండటం మంచిది కాదని ఆదుర్దాపడసాగాడు. వెంకటపతికి కబురు పెడ్దామనుకొంటున్న సాంబయ్యకు బస్ దిగి వస్తున్న కొడుకు కన్పించాడు.

''ఏంరా? కొంపా గోడూ పట్టించుకోకుండా తిరుగుతున్నావ్?'' అన్నాడు సాంబయ్య.

''వేరే ఇల్లదీ చూసేసరికి ఆలస్యం అయింది'' అన్నాడు కొడుకు.

''బస్తీలో ఇల్లెందుకురా? నీ పెళ్ళాం పల్లెటూళ్ళో వుండనందా?''

''డాక్టరమ్మ కాన్పయేదాకా అక్కడే వుండమందట!'' అన్నాడు వెంకటపతి తలగోక్కుంటూ.

''అయితే మీ మామ ఉన్నచోటే వుండొచ్చుగా?''

''అది చాలా చిన్న ఇల్లు. రైలుపేటలోనే ఇల్లు తీసుకున్నాం.''

''అయితే మీ మామ ఉన్నచోటే వుండొచ్చుగా?''

''అది చాలా చిన్న ఇల్లు. రైలుపేటలోనే ఇల్లు తీసుకున్నాం.''

''ఊఁ! అద్దెంతా?''

''నూట ఏభై రూపాయలు.'' బెదురుతూనే చెప్పాడు వెంకటపతి.

''సంవత్సరానికా?''

''కాదు, నెలకే!''

''నువ్వు బాగుపడతావంటూరా? నెలకు నూటయాభై రూపాయలా? ఇంకా మందులూ - మాకులూ - డాక్టర్ల ఖర్చు ఎంతవుతుందో ఆలోచించావా?''

''ఎంతయిన సరే, కాన్పయేదాకా అక్కడే వుండాలి!'' వెంకటపతి మాటలోని కరుకుతనం పసికట్టాడు సాంబయ్య.

ప్రసవవేదనలో వున్న దుర్గమ్మ... ఆనాడు గరళం పోసినప్పుడు దుర్గమ్మ చూసిన చూపులూ - మరణవేదనను అనుభవిస్తున్న దుర్గమ్మ - సాంబయ్యకు గుర్తొచ్చింది. మనస్సు మెత్తపడింది.

మాసూలు పూర్తయ్యాక వెంకటపతి బయలుదేరాడు. బియ్యం, పప్పులు మూట గట్టించి, పేరుకున్న నెయ్యి తపేళాలో పోయించి ఉగ్గంకట్టి బయలుదేరాడు వెంకటపతి. జీతగాడికి సామాను ఇచ్చి తను తండ్రి దగ్గరకొచ్చి నిలబడ్డాడు.

''మొన్నటి రెండువేలూ అయిపోయినయ్యా?'' అన్నాడు సాంబయ్య.

''కొద్దిగా వుందిలే! ఇంకా రెండువేలుకావాలి.'' అన్నాడు కొడుకు.

సాంబయ్య ఇనప్పెట్టె తెరిచి వెయ్యి రూపాయలు విసిరి కింద కొట్టాడు.

డబ్బు తీసుకొని వెళ్ళబోతూ ''మాసూలు అయిపోయిందిగా, నువ్వు కూడా అక్కడకొచ్చి వుండొచ్చుగా?'' అన్నాడు వెంకటపతి.

వాడు పెళ్ళాం చెప్పిన మాటలు వల్లిస్తున్నాడు అనుకున్నాడు సాంబయ్య.

''వస్తాలే! ఇక పద, బస్సుకు సమయం అయింది.'' సాంబయ్య పలుకుల్లోని వ్యంగ్యం వెంకటపతికి అర్థంకాలేదు.

వెంకటపతి సాయంకాలానికి బస్తీ చేరుకున్నాడు. రైలుపేటలో మేడకింద భాగమంతా అద్దెకు తీసుకున్నారు. మామ బలరామయ్యకూడా అక్కడే వుంటున్నాడు.

వరూథిని చేతిలో వెంకటపతి నోట్లకట్ట పెట్టాడు.

లెఖ్ఖ చూసుకొని ''ఇదేమూలకు వస్తుందండీ?'' అని పకాలున నవ్వింది.

''డైనింగ్ టేబులూ, సోఫాసెట్టూ, స్ప్రింగ్‌కాట్టూ ఆర్డరిచ్చింది మర్చిపోయారా ఏం? పదిరోజుల్లో వస్తాయి. వాటికే మూడువేలు అవుతుంది. ఎప్పుడు తెస్తారూ?'' భర్త కళ్ళలోకి గుచ్చి చూస్తూ అడిగింది.

తెల్లవారి వెంకటపతి కనకయ్య దగ్గిరకెళ్ళి డబ్బు అడిగాడు.

''ఓసారి దెబ్బతిన్నా! మీ బాబును అడక్కుండా ఒక్క కానీ ఇవ్వను'' అని తిప్పి పంపించాడు వెంకటపతిని. ఆ మాటే తిరిగొచ్చిన వెంకటపతి భార్యకు చెప్పాడు.

వరూథిని భర్తకు తెలియకుండా కనకయ్యకు కబురుపెట్టింది. కనకయ్య వచ్చాడు.

''ఏమిటి కనకయ్యగారూ? మీరిప్పుడు ధాన్యం కొనడంలేదా? మీ మిల్లు మూసేశారా ఏం?" అడిగింది వరూథిని.

కనకయ్య బిత్తరపోయాడు. ''అదేంకాదే? కొంటూనే వున్నాం" అన్నాడు కనకయ్య.

''అయితే మా ధాన్యం అమ్మతాం. అర్జంటుగా నాలుగువేలు కావాలి. ధాన్యం ఇచ్చేదాకా కావాలంటే వడ్డీ తీసుకోండి."

''మాసూళ్ళు అయిపైగా, వారం పదిరోజులకు వడ్డీ ఎందుకమ్మా? అలాగే తీసుకోండమ్మా పైకం." కనకయ్య అంటుండగానే వెంకటపతి వచ్చాడు.

''విన్నారా? కనకయ్య డబ్బు ఇస్తానంటున్నాడు." తెలివిగా అంది వరూథిని మొగుడితో.

''అదేంటయ్యా పెద్దమనిషీ? మా నాన్నను అడగందే ఒక్క కానీ కూడా ఇవ్వనన్నావుగా?" అడిగాడు వెంకటపతి కనకయ్యను.

''నువ్వు ధాన్యం ఇస్తాననలేదే? అమ్మాయి ఇస్తానంటూంది."

''నాన్నను అడక్కుండా వడ్లెట్టా అమ్ముద్దీ?" గాబరాపడ్డాడు వెంకటపతి.

''మన వడ్లు మనం అమ్ముకోవడానికి ఒకర్ని అడగటం ఎందుకూ?"

''అదీ, అలా వుండాలి! లక్షల విలువచేసే మాటన్నావమ్మా! మొత్తం మీద షావుకారి బిడ్డవనిపించావు తల్లీ!" అన్నాడు కనకయ్య.

''ఇంకా కూర్చున్నారెందుకూ? కనకయ్యతో వెళ్ళి డబ్బు పట్టుకురండి!" దిగాలుపడి కూర్చున్న వెంకటపతిని హెచ్చరించింది వరూథిని.

## 14

వరూథినికి మూడోనెల. డాక్టరు కనకమ్మే వచ్చి చూసిపోతోంది. ఓ రోజు టానిక్కుకొని ఇంటికి వచ్చిన వెంకటపతికి ఎదురెళ్ళి ''ఈరోజు మన ఇల్లు చూడండి, ఎట్లా వుందో?" అంది వరూథిని.

వెంకటపతి నోరు తెరుచుకొని చూశాడు. హాల్లో సోఫాసెట్టూ, డైనింగ్ రూంలో డైనింగ్ టేబులూ - ఆరు కుర్చీలూ, పడకగదిలో స్ప్రింగ్ కాట్టూ, డ్రెసింగ్ టేబులూ, దానిముందు పెద్ద నిలువుటద్దమూ, దానిపక్కనే ఖరీదైన బీరువా అమర్చివున్నాయి.

''చెప్పండి. ఇప్పుడు మన ఇల్లు ఎట్లా వుంది?" టానిక్ సీసా అందుకొంటూ మురిపెంగా అడిగింది వరూథిని.

''సినిమాల్లో చూసినట్టుగా వుంది!" అన్నాడు వెంకటపతి ఉక్కిరిబిక్కిరి అయిపోయి.

''అన్నీ అబద్ధాలు!" రాగం తీసింది వరూథిని.

''నిజంగా! చాలా బాగుంది మన ఇల్లు!''

''మర్చిపోయాను. ప్యాలెస్‌లో కొత్త సినిమా వచ్చింది. బట్టలు మార్చుకోండి, వెళ్దాం!'' వరూధిని భర్త చొక్కా గుండీలు విప్పింది.

జట్కా దిగుతుండగానే హాలుముందు నిలబడ్డ రామనాథబాబు వచ్చి చిరునవ్వుతో ఆహ్వానించాడు వరూధిన్నీ, వెంకటపతినీ. స్వయంగా తనే హాల్లోకి తీసుకెళ్ళి వాళ్ళను రిజర్వుడు సీట్లలో కూర్చోపెట్టాడు. సినిమా అయిపోగానే జట్కా మాట్లాడబోతున్న వెంకటపతిని ఆపి, కారు డ్రైవర్ని పిల్చాడు రామనాథబాబు.

''షరీఫ్! అయ్యగార్నీ అమ్మగార్నీ దించిరా!'' అని డ్రైవరుకు చెప్పి, డోర్ తెరిచి. వరూధినికేసి చూశాడు. సందేహిస్తున్న వరూధిన్ని చూసి ''ఫర్వాలేదండీ! ఎక్కండీ!'' అన్నాడు రామనాథబాబు.

కారు సాగుతుండగా ''ఓసారి మా ఇంటికి రాకూడదూ?'' అన్నట్టు రామనాథబాబు కళ్ళలోకి చూసింది వరూధిని.

ఆరోజు మధ్యాహ్నం డైనింగ్ టేబుల్‌ముందు, వరూధినికి ఎదురుగా కూర్చొని నేతిలో వేడివేడి గారెలు ముంచుకుతింటున్న వెంకటపతి, కనకయ్య పిలుపు విని హాల్లోకి వచ్చాడు.

''మీ బాబు ధాన్యం పరమేశ్వరీ రైస్‌మిల్లుకు ఖాయం చేశాడని తెలిసింది. రేపో మాపో వాళ్ళు ధాన్యం మిల్లుకు తోలుకుపోతున్నారట. ధాన్యం ఇస్తానని నెల క్రితం డబ్బు తెచ్చుకున్నావ్. ఇట్లా అయితే మా వాటాదారుల్తో నాకు మాట వస్తుంది'' కనకయ్య గొంతు పెద్దది చేసి మాట్లాడాడు.

''కనకయ్యా! ఎందుకలా గగ్గోలు పెడతావ్? ఇవ్వాళ్ళే లారీ తీసుకెళ్ళి ధాన్యం తోలుకో వరూధిని కంఠంలోని తీవ్రతకు కనకయ్య గొంతు తడారిపోయింది. మంచినీళ్ళు అడిగాడు. నీళ్ళు తాగి ''అది కాదమ్మా! ఉన్నసంగతి చెప్పా. వెంకటపతి ధాన్యం ఇస్తే తీసుకోవటానికి నాకేం? కళ్ళకద్దుకొని మరీ తీసుకుంటా'' అన్నాడు.

''ఎందుకివ్వరూ? డబ్బు తెచ్చుకున్నవాళ్ళకు ధాన్యం ఇవ్వటం తెలియదా?'' అంది మొగుడివంక చురచురా చూస్తూ.

''అయితే రేపే లారీలు మాట్లాడతా వెంకటపతీ! నువ్వుకూడా నాతో పాటు లారీలోనే వచ్చేయ్'' అంటూ కనకయ్య వెళ్ళిపోయాడు.

వెంకటపతి లేచి డైనింగ్ టేబుల్ దగ్గరకువెళ్ళి మిగిలిన గారెలు పట్టించసాగాడు. అప్పటికే గిన్నెలోని నెయ్యి పేరుకుపోయింది.

## 15

దుమ్ము లేపుకుంటూ లారీ వూళ్ళోకి వచ్చింది. కనకయ్య రామాలయం దగ్గిరదిగి వెంకటపతిని హెచ్చరించాడు. లారీవచ్చి సాంబయ్య ఇంటిముందు ఆగింది. కూలీలు కాటా, గోనెసంచులూ పట్టుకొని బిలబిలా దిగారు. ఇంటిముందు

పురులుకట్టి పోసివున్నాయి వడ్లు. లారీ వచ్చిన రొదకూ, కూలీల అరుపులకూ అప్పుడే కునుకుపట్టిన సాంబయ్య లేచాడు.

వడ్లపురి పక్కన కాటా నిలబెడ్తున్న కూలీలను చూసి ''రెండు రోజుల తర్వాత వస్తానన్నారుగా, ఇవ్వాళ్ళే వచ్చారేం?'' అన్నాడు.

వెంకటపతి పక్కన నిలబడి పురి పగలగొట్టించాడు. కూలీలు వడ్లు కాటా వేసి బస్తాలు నింపుతున్నారు. ఎప్పుడు పట్టిన బస్తాలను అప్పుడే లారీలోకి ఎక్కిస్తున్నారు. వెంకటపతిని చూసి ''వీడెప్పుడొచ్చాడూ?'' అనుకున్నాడు సాంబయ్య. బస్తీలో వుంటున్నాడుగా? ధాన్యం అమ్మింది తెలుసుకొని, మళ్ళీ డబ్బు గుంజుకు పోవటానికి వచ్చి వుంటాడు. డబ్బు అవసరం అయినప్పుడే వీడికి ఇల్లూ, వూరూ, తండ్రీ గుర్తొస్తారు. ఏమైనా వీడికి ఈసారి చిల్లిగవ్వ ఇచ్చేదిలేదు. దృఢనిశ్చయం చేసుకొన్నాడు సాంబయ్య.

ఇంట్లోకి వెళ్ళి మంచినీళ్ళు తాగి తిరిగొస్తున్న వెంకటపతితో ''ఏంరా? రేటు ఏమన్నా పెరిగిందేమో విచారించావా? లేకపోతే నాలుగు రోజులు ఆగి తోలుకెళ్తామన్నవాళ్ళు ఈ రోజే ఎందుకొస్తారు?'' అన్నాడు సాంబయ్య.

''రేటేడ పెరిగింది? రోజుకు రోజు తగ్గిపోతుంటే!'' తనలో తనే అనుకుంటున్నట్లు అని లారీల దగ్గిరకెళ్ళి బస్తాలు లెక్కపెట్టడం మొదలుపెట్టాడు.

''నీ కొకటి పట్టిందీ ఇది పట్టటానికి? ధర పడిపోతుంటే మిల్లువాళ్ళు తొందర పడతారా ఏం?'' అంటూ కాటా దగ్గర్నుంచి లారీ ముందుకెళ్ళాడు సాంబయ్య.

లారీ నిండుగా ధాన్యం బస్తాలు వేసి వున్నాయి. కూలీలు తలగుడ్డలు దులుపుకున్నారు. కాటా వాసాలూ, బల్లలూ మడిచి, రెండో పురిపక్కన గోడవారగా మళ్ళీ కాటా నిలబెట్టారు. కాటామేస్త్రీ మొత్తం 'డెబ్బై నాలుగు' బస్తాలని లెక్క చెప్పాడు గుమాస్తాకు.

గుమాస్తా లార్డ్రైవర్‌తో అన్నాడు - ''ఒక లారీ చాలదు. నాలుగు ట్రిప్పులు వేసినా ఇవ్వాళ ధాన్యం అంతా చేరేట్టులేదు. ఇంకా మూడు పురులు వున్నాయి. కనకయ్యగారితో చెప్పు - ఇంకొక లారీ మాట్లాడి పంపమని. రెండూ కలిసి మూడు ట్రిప్పులేస్తే సరిపోతుంది''.

''ఆగు!'' లారీ స్టార్టు చేస్తున్న డ్రైవర్ని చూసి కేకవేశాడు సాంబయ్య.

వెంకటపతికి గుండెలు చల్లబడ్డాయి!

''ఏ మిల్లుకయ్యా ధాన్యం తోలేది?'' గుమాస్తాను అడిగాడు.

''మన కనకయ్యగారి మిల్లుకే!''

''ఛత్! ఆపండి. కనకయ్య మిల్లుకైతే గింజకదలటానికి వీల్లేదు. పరమేశ్వరీ మిల్లు తాలూకు రామావతారానికి నేను మాట ఇచ్చింది, కనకయ్యకు కాదు.'' సాంబయ్య ఉద్రేకపడుతూ అన్నాడు. కనకయ్య గుమాస్తా ఖంగారుపడ్డాడు.

''ఇదేమిటండీ వెంకటపతిగారూ?'' వెంకటపతిని చూసి అన్నాడు గుమాస్తా.

''నేను కనకయ్యకు నెలకిందే మాట ఇచ్చాను. కొంత పైకం కూడా తీసుకున్నా" తండ్రికేసి చూడకుండానే తండ్రితో చెప్పాడు వెంకటపతి.

కోపంతో సాంబయ్య నిలువెల్లా వణికిపోయాడు.

''ఎవడ్నడిగిచ్చావురా?'' అంటూ సాంబయ్య కూలీలను సమీపించి ''దించండి! ఊఁ అట్లా చూస్తారేం? చెప్పేది మీక్కాదూ?'' అన్నాడు.

''లారీ పోనీయండి గుమాస్తాగారూ!'' అన్నాడు వెంకటపతి. అంతధైర్యం వెంకటపతికి ఎక్కడనుంచి వచ్చిందో! సాంబయ్య కొడుకుని గుడ్లురజేసి చూశాడు.

''లారీ కదలటానికి వీల్లేదు. ఎట్లా పోతుందో నేను చూస్తాను.'' సాంబయ్య లారీకి అడ్డంగా వెళ్ళి నిలబడ్డాడు.

లారీడ్రైవర్‌కు ఎటూతోచక ఇంజన్ ఆపుచేశాడు.

''ఏమిటండీ ఇది వెంకటపతిగారూ? నాకెందుకీ గొడవంతా? ఆ కనకయ్యనే పిల్చుకొస్తా!''

''నువ్వాగవయ్యా!'' గుమాస్తాను విదిలించేసి వెంకటపతి లారీ ముందు నిలబడ్డ తండ్రి దగ్గిరకొచ్చాడు.

''నువ్వు తప్పుకో! లారీ పోనియ్!''

కొడుకుమీదకు తండ్రి కర్ర ఎత్తాడు. ''గాడ్డికొడకా, నువ్వు పెళ్ళాం మాటలు విని....''సాంబయ్య మాట పూర్తికాలేదు. వెనక్కు విరుచుకుపడిపోయాడు.

తనయుడు తండ్రిని లారీముందునుంచి తోసేశాడు!

సాంబయ్య కిందపడ్డాడు! కొడుక్కేసి చూశాడు–

వెంకటపతికి అప్పటికికాని తెలియలేదు–ఆ పడింది తన తండ్రి కాదు–నేననీ ఆ పతనం తనదేననీ!

లారీ రొదచేస్తూ వెళ్ళిపోయింది. డ్రైవర్ పక్కన కూర్చున్న వెంకటపతికి లారీ తన గుండెల మీదనుంచే వెళుతున్నట్లుగా అనిపించింది. తనేం చేశాడు?

కూలీలంతా ఎక్కడివాళ్ళు అక్కడ బిగిసిపోయి నిలబడ్డారు. కనకయ్య గుమాస్తా వచ్చి కిందపడ్డ సాంబయ్యను లేవదీయబోయాడు. సాంబయ్య గుమాస్తా చేతుల్లోనుంచి తన రెక్క విదిలించుకొని పౌరుషంగా చూశాడు. తనే లేవడానికి ప్రయత్నించి లేవలేక మళ్ళీ కూలిపోయాడు. అంపశయ్యమీద ఉన్న భీష్ముడిలా కనిపించాడు గుమాస్తాకు సాంబయ్య!

ఎరువుతోలి తిరిగి వచ్చిన జీతగాడు రాముడు – బండితొట్లోనుంచి కిందకు దూకాడు. సాంబయ్యను లేవదీసి ఇంట్లోకి తీసుకెళ్ళాడు.

సాంబయ్య మళ్ళీ ఇంట్లో నుంచి బయటకు రాలేదు. చీకటి పడేసరికి రెండు లారీలమీద ధాన్యం అంతా బస్తీకి చేరింది. వెంకటపతి తిరిగిరాలేదు. కనకయ్య గుమాస్తాయే ధాన్యం అంతా కాటా వేయించి మిల్లుకు తోలాడు. మొదటిలారీలో మిల్లుకు చేరిన వెంకటపతి; ధాన్యం అంతా మిల్లుకు చేరిందాకా మిల్లులోనే కూర్చున్నాడు. ఆ రోజంతా తలెత్తి మాట్లాడలేదు. కనకయ్య డబ్బు లెఖ్ఖకట్టి, ఐదువేలు మినహాయించి, మిగతాది ఇచ్చాడు. వెంకటపతి డబ్బు లెఖ్ఖ

పెట్టుకోకుండా, వెళ్తానని అయినా చెప్పకుండా ఇంటికి వచ్చాడు.

పొద్దుపోయి, దిగాలుపడి వచ్చిన భర్తను చూసి వరూథిని అనుకొన్నది, అతను వెళ్ళిన పని అయివుండదు. ముసలాడు అయిన్నూ గెలవనిస్తాడా? తండ్రికి చాలని వాజమ్మ. చెవులు ఆడించుకుంటూ వచ్చాడు. ఆ ముఖం చూస్తేనే తెలియడంలా?

''చాతకానివాడివి ఎందుకు వెళ్ళాలి? నెత్తిన గుడ్డేసుకొని నా దగ్గిర ఏడవటానికి ఎందుకు వచ్చావ్? అదేదో మీ అయ్యముందే కానివ్వకపోయావ్వా?''

''నోర్మూయ్!''

''తండ్రి నోరు మూయించటం చాతకానివాడివి పెళ్ళాం నోరు మూయిస్తావా?''

నోట్ల కట్టలు వచ్చి వరూథిని ముఖానికి ఫెడీల్మని తగిలాయి! వెంకటపతి ముఖంలోకి చూసిన వరూథినికి వళ్ళంతా చెమటలు పట్టింది! గదిలోకి వెళ్ళి ముడుచుకొని పడుకుంది.

ఒక గంట గడిచాక వెంకటపతి నీళ్ళు పోసుకొని డైనింగ్ టేబుల్ ముందు కూర్చున్నాడు. పనిపిల్ల ప్లేట్లో అన్నం పెట్టి - ఒక గిన్నెలో కోడి పులుసూ, మరో ప్లేటులో కోడివేపుడూ తెచ్చి పెట్టింది. కోడికాలు మాంసం ముందుపళ్ళతో పీకుతుంటే వరూథిని గుర్తొచ్చింది. వరూథినికి ఆ మాంసం అంటే తగని ఇష్టం.

పనిపిల్లను పిల్చి ''అమ్మగారు అన్నం తిన్నదా?'' అని అడిగాడు వెంకటపతి.

''లేదు, బాబూ! అమ్మగారు ఎందుకో ఏడుస్తూ పడుకొన్నారు.''

వెంకటపతి కోడికాలు పళ్ళెంలో వదిలి, ఎంగిలి చేత్తోనే భార్య గదిలోకి వెళ్ళాడు. భర్తచేత ఓ పావుగంట బతిమాలించుకొని వరూథిని అలకపాన్పు వదలి అన్నం ముందు కూర్చుంది.

## 16

వీధిలో సాంబయ్య తలెత్తుకు తిరగడంలేదు. సాంబయ్య రామాలయం దగ్గరకు గానీ, రచ్చబండ దగ్గిరకు గానీ వెళ్ళి మూడునెలలు అయింది. తప్పనిసరిగా పొలం వెళ్ళాల్సివస్తే పోలేరమ్మ గుడిమీదగా చుట్టు తిరిగి వెళ్తున్నాడు. పొలాన అంతగా చేసే పనులు కూడా ఏమీలేవు. జీతగాడు రాముడే అంతా చూసుకొంటున్నాడు. ఇంట్లోనే మంచం మీద కాసేపూ, విసుగుపుడితే పడకకుర్చీలో కాసేపూ కూర్చొని కాలాన్ని వెళ్ళబుచ్చుతున్నాడు. గొడ్లచావిడీ ఇల్లూ తప్ప వేరే లోకమేలేదు. రోజూ కనిపెట్టుకొనివుండే జీతగాడూ, అడపాదడపా వచ్చిపోయే చింతడూ, బిచ్చాలూ తప్ప మనుష్యులు కనబట్టంలేదు.

చూడి ఆవు ఈని వారంరోజులయింది. సాంబయ్యకు మంచి కాలక్షేపం దొరికింది. చావిట్లోనే మంచం వేసుకొని ఆవుదూడను మంచం కోటికి కట్టుకొని అస్తమానం దాంతోనే ఆడుకొన్నంతపని చేయసాగాడు. నిగనిగలాడుతున్న ఆవుదూడ

ముట్టెను పొదువుకొన్నప్పుడు, దూడ గుండెల్లో కుమ్ముతుంటే సాంబయ్యకు పరమానందంగా ఉండేది.

ఇదే ఆరునెలలు పోతే తనకు అలవికాదు. మరో సంవత్సరం గడిస్తే మిసమిసలాడుతూ, కోడెవయసులో చావిడంతా కదంతొక్కుతుంది. మరో ఏడాది గడిస్తే పోట్లగిత్త అవుతుంది. అందర్నీ కుమ్మేస్తుంది.

సాంబయ్య చేతుల్ని నాకుతున్న ఆవుదూడ, చావిట్లోకి తల్లి రావటం చూసి పలుపు గుంజింది. సాంబయ్య మంచం కదిలింది. ఆవువచ్చి దూడను నాకసాగింది. సాంబయ్య లేచి బలవంతంగా ఆవును దూడనుంచి విడదీసి గాట్లో కట్టేశాడు. లేగదూడ పలుపు గుంజుకుంటూ 'అంబా!' అంది.

అణిచిపెట్టుకొన్న మమకారం, వాత్సల్యం సాంబయ్య గుండెల్ని చీల్చుకొని పొంగాయి.

వెంకటపతి! తన బిడ్డ వెంకటపతి! ముప్పై ఏళ్ళు తన గుండెలమీద పెరిగిన వెంకటపతి! తను వాడ్ని కనురెప్పలచాటున పెంచుకున్నాడు. వాడే సర్వస్వం అనుకున్నాడు. వాడికోసం తన వయసూ-ఆనందం ధారపోశాడు. జన్మంతా వాడికోసమే వెచ్చించాడు. తినీ, తినకా, ఎండనకా, వాననకా రెక్కలు ముక్కలు చేసుకొన్నాడు. నిందా, అవమానం భరించాడు. సిరిసంపదలు పోగుచేశాడు. అంతస్తును అందించాడు. గౌరవాన్ని కొనిపెట్టాడు. దానికి ప్రతిఫలంగా తనకు తన కొడుకు ఏం ఇచ్చాడు? కొడుకునుంచి తను ఆశించిందేమిటి? తనకు బ్రతుకులో కావాల్సిందేమిటి?

సాంబయ్యకు గుండెలు బరువెక్కాయి. కళ్ళు చెమ్మగిల్లాయి.

ఆ రోజు ఉగాది. రాముడు పెందలాడే ఇంత ఉడకేసి వెళ్ళిపోయాడు. పండగనాడు కొడుకూ, కోడలితో కళకళలాడాల్సిన ఇల్లు బావురుమంటూ వుంది. ముప్పైఏళ్ళ క్రితం పండగపూట-దుర్గమ్మ తలస్నానం చేసి, కొత్త చీరకట్టుకొని పళ్ళెంలో గారెలూ, బూరెలూ పెట్టి, తను తింటూ వున్నప్పుడు - ఏం చెప్పింది? కొడుకు పుట్టబోతున్నాడని విని పరవశించిపోయాడు. వాడిమీద ఎన్ని ఆశలు పెంచుకున్నాడు? ఎన్ని కలలు కన్నాడు? ఏడి? తన వెంకటపతి ఈనాడు ఏడీ?

మునిమాపు వేళదాకా వెంకటపతిని గురించిన ఆలోచనలతోనే గడిపాడు సాంబయ్య. ఏ ముహూర్తాన కొడుకు పెళ్ళయిందోకాని అప్పటినుంచి ఒక్క రోజు మనశ్శాంతిలేదు. మరీ.. పోయిన ఏడాదంతా ఎగుడు దిగుడుగానే గడిచిపోయింది. ఈ కొత్త సంవత్సరం ఎలా వుంటుందో? తన వెంకటపతి దోవన పడ్తాడా?

సాంబయ్య లేచి, నెత్తిమీదగా పైపంచ కప్పుకొని రామాలయం దగ్గిరకు బయలుదేరాడు. అప్పటికే జనం బాగా పోగయివున్నారు. రామాలయం అరుగులమీదా, గడపలమీదా ఊళ్ళో పెద్దలంతా కూర్చున్నారు. బీదవాళ్ళూ తక్కువస్థాయివాళ్ళూ నేలమీద పక్కగా కూర్చున్నారు!

శాస్త్రులు పంచాంగం చదవడం పూర్తి కావస్తున్నది. సాంబయ్య మెల్లగా

అడుగులో అడుగు వేసుకుంటూ వచ్చి, రామాలయం గోడ కానుకొని పెడగా కూర్చున్నాడు. పంచాంగ శ్రవణంలో మునిగిపోయిన వూళ్ళో పెద్దలెవరూ సాంబయ్య రావటాన్ని గమనించలేదు.

పంచాంగం చదవడం పూర్తయాక శాస్త్రులుగారు సంకురుమయ్య వరాహం ఎక్కి ఏ యే దిశగా వెళ్ళిందీ, ఏ యే ప్రాణులకు వినాశమో లాభమో చిలువలూ, పలవలూ చేసి చెప్పాడు. పంచాంగశ్రవణంలో ఆఖరిఘట్టం పేరుఫలాలు వచ్చేసరికి అందరూ సర్దుకొని కూర్చున్నారు. అంజయ్య, రాంసుబ్బయ్య, లక్ష్మీపతీ, కోటయ్యా, వీరయ్యా ఒకరి పేరును మరొకరు అందిస్తూ శాస్త్రిని అడిగారు. పేరుఫలాలు వింటూ ఒకర్నొకరు అభినందించుకోవడం, వేళాకోళం చేసుకోవడం మొదలుపెట్టారు. పేరుఫలాల్లో అక్షర క్రమం పూర్తి అవుతుండగా జనంలో ఎక్కువ భాగం తమకు చెప్పిన లాభనష్టాలను నెమరువేసుకుంటూ వెళ్ళిపోయారు. పదిమందిదాకా ఊళ్ళో పెద్దలు మిగిలిపోయారు. వారు శాస్త్రికి దగ్గరగా కూర్చొని కొత్త సంవత్సరపు విశేషాలను గురించి మాట్లాడుకుంటున్నారు.

శాస్త్రి పంచాంగం మడిచి లేవబోతూ ఏదోస్ఫురణకు వచ్చినట్లు ఆగిపోయాడు.

"రాంసుబ్బయ్యగారూ! ఏరీ, మన సాంబయ్యగారు ఎక్కడ?" ప్రతి సంవత్సరం ముందెత్తునే కూర్చొని పురాణ శ్రవణం చేసే సాంబయ్య కన్పించకపోయేసరికి అడిగాడు శాస్త్రి.

"సాంబయ్యదే ఓ పెద్ద పంచాంగం అయింది. ఇంకా ఇదికూడా ఏం వింటాడు?" అన్న రాంసుబ్బయ్య మాటలకు అందరూ ముసిముసిగా నవ్వుకున్నారు.

"ఏమిటండీ మీరనేది? సాంబయ్యగారికి ఏమయింది?" ఆదుర్దాగా అడిగాడు శాస్త్రి.

"ఆఁ చాలా వుందిలే గ్రంథం!" అన్నాడు అంజయ్య.

"మీకు తెలియదా శాస్త్రిగారూ? కొడుకు చావచితకబాదాడు." అన్నాడు వీరయ్య.

"హరి హరీ! సాంబయ్యగారి కొడుకు వెంకటపతి చాలా బుద్ధిమంతుడు గదండీ! ఇంతపని యెలా చేశాడూ?" అన్నాడు శాస్త్రి.

"కొడుకు బుద్ధిమంతుడే. మరి తండ్రో?" అన్నాడు రామచంద్రయ్య.

"అంతపనీ చేస్తాడని నేనెప్పుడో అనుకున్నానయ్యా!" అన్నాడు వీరయ్య.

"రామ రామ! ఇంతకీ తండ్రీకొడుకుల మధ్య మనస్పర్ధలు ఎందుకొచ్చినట్టు? ఒక్కడే కొడుకు కదండీ? కోడలు కాపరానికి కూడా వచ్చిందని విన్నాను."

"అదే మొదలనుకోండి శాస్త్రిగారూ! కొడుకునీ, కోడల్నీ కాపరం చెయ్యనిస్తేనా?" అన్నాడు రాంసుబ్బయ్య.

"శివ శివా! సాంబయ్యగారి గురించి మీరు ఆ మాటంటే నమ్మలేకుండా వున్నాను. ఆ కొడుకంటే ఆయనకు పంచప్రాణాలు గదండీ? సాంబయ్యగారు ప్రతి ఏడాదీ ఉగాది పండక్కు, ఒకటో రెండో సంభావనలు ఇచ్చేవారు.మరి ఈ యేడు

పంచాంగం శ్రవణానికి కూడా రాలేదు. ఇంటికెళ్ళి కలుస్తా!'' అంటూ శాస్త్రి పంచాంగం చంకన పెట్టుకొని రామాలయం గడపలు దిగాడు.

అప్పటికి బాగా చీకటి పడింది. శాస్త్రికి తనమీద వున్న అభిమానానికి సాంబయ్యకు కొంత ఊరట కలిగింది. సాంబయ్య గోడ కానుకొని నీడల్లో ఇంకా ముడుచుకొని కూర్చున్నాడు.

''ఏమిటీ? ఈ శాస్త్రులు సాంబయ్యను తెగ పొగిడేస్తున్నాడు?'' మిగతా వాళ్ళను చూసి అన్నాడు వీరయ్య.

''పావలా అర్ధా చేతిలో రాలేదాకా అట్లాగే మాట్లాడుతాడు లేవయ్యా ఆ శాస్త్రులు! తెలియందేముందీ?'' అన్నాడు అంజయ్య.

''కొడుకూ కోడలూ పండక్కుకూడా రాలేదటగా?''

''అంతావిని రాముడికి సీత ఏమవుతుందని అడిగినట్లుంది నువ్వు అనేది?''

''సాంబయ్య బతికివుండగా కోడల్ని ఇంట్లో కాలుపెట్ట నిస్తాడంటావా?''

''ఆఁ కట్టుకుపోతాడు గడ్డితిని సంపాదించాడు. కొడుకుని కూడా తిననివ్వకుండా గాట్లో కుక్కలా కూర్చున్నాడయ్యా!''

''ఈ వయస్సులో సాంబయ్యకెందుకయ్యా ఆ తాపత్రయం? కొడుక్కు కొడుకులు పుట్టే వయస్సులో కొడుకుమీద కత్తికట్టడం ఏమిటి?''

''ఎంతకాలం వుంటాడయ్యా? శిలావిగ్రహంగా వుంటాడా ఏం? రేపు తండ్రి చచ్చాక వెంకటపతికి ఆస్తి ఇష్టానుసారమేగా?''

''అవునంతే! బతికున్నంతకాలం తను సుఖపడకా, వాళ్ళను సుఖపడనీయకా ఏం బావుకుంటాడయ్యా ఆ సాంబయ్య?''

''కొడుకుచేత గుండెలమీద తన్నించుకొని ఇంకా ఆ సాంబయ్యకనక తిరుగుతున్నాడు. ఇంకొకడయితే పెదకాలవలో పడి చచ్చేవాడనుకో!'' అంటూ రాంసుబ్బయ్య నడుంకు చుట్టుకున్న పంచెతీసి భుజాన వేసుకొని లేచాడు. ఆయనతో పాటు అందరూ లేచారు.

చీకట్లో దూరంగా కూర్చొని వాళ్ళ మాటలు వింటున్న సాంబయ్య ఉడికిపోయాడు. ఎవరన్నా గుర్తుపడ్తారన్న భయంతో ఇంకా ముడుచుకు కూర్చున్నాడు. రామాలయం నుంచి అందరూ వెళ్ళిపోయారు. సాంబయ్య లేచి ఇంటికి బయలుదేరాడు.

తనను ఎన్నెన్ని మాటలంటున్నారు వీళ్ళు! వీళ్ళందరికీ తనను చూస్తే అసూయ, ద్వేషం తప్ప మరొకటికాదు. అందులో సగం మంది ఆరిపోతున్నవాళ్ళు. మందిని ముంచి బాగుపడాలని చూసేవాళ్ళు మిగతా సగం మంది. తను ఎవరికేం అపకారం చేశాడు? ఒకళ్ళ సొమ్ము తను ఆశించలేదు. కష్టపడి సంపాదించాడు. కడుపు మాడ్చుకొని ఆదా చేస్తున్నాడు. కూలీలకు గింజలు పిచ్చమానికలతో కొలవలేదుగా? అప్పులు ఎగగొట్టలేదే? మోసాలు చేసి కోర్టులకెక్కి దాయాదుల ఆస్తులు కలుపుకోలేదే? తన కొడుకు తనకు ఎదురు తిరగటమే వీళ్ళకు కావాల్సింది! వాడు తను సంపాదించిన ఆస్తి తగలేస్తుంటే వీళ్ళ కళ్ళు చల్లబడతాయి కాబోలు?

మంచీ చెడ్డా వాళ్ళకు అవసరంలేదు. ఇది ఊరా? వీళ్ళు మనుషులా? పైగా పెద్దమనుషులు కూడానా?

ఇంతకాలం ఊళ్ళో పెద్దమనుషుల సానుభూతి తనమీద వుందనుకొంటూ వచ్చాడు. అంతా తన కొడుకునీ, కోడల్నీ దుయ్యబడుతున్నారనుకొన్నాడు. కాని ఈరోజు తన చెవుల్తోనే విన్నాడు. ఛీ! ఛీ! తన బతుకిలా అయిపోయిందేం? అటు అయినవాళ్ళకూ, ఇటు కానివాళ్ళకూ కూడా కాకుండాపోయాడు. అవును! వాళ్ళన్నదీ నిజమే! రేపు తను పోయాక వెంకటపతిని ఎవరు అదుపు చేస్తారు? వాడు పెళ్ళాం చెప్పినట్టు ఆడడా? మంచోచెడ్డో వాళ్ళపాటికి వాళ్ళను వదిలేయటమే మేలు. తనకెందుకీ చిత్తక్షోభ. ఈ ఆస్తి వాడి కోసమేగదా తను సంపాదించాడు? వాడికికాక మరొహడికి తను ఇవ్వడు గదా? ఏ రామాలయానికో రాస్తే?

లీలామాత్రంగా వచ్చిన ఈ ఆలోచనకు తనే ఉలిక్కిపడ్డాడు సాంబయ్య. తను రామాలయానికి ఆస్తి రాసివ్వట మేమిటి? తనేం దిక్కులేనివాడా? బిడ్డా పాపా లేనివాడా? తనకొడుకు తనంతటి వాడయ్యాడు. ఇక తప్పుకోవడం మంచిది. తనకు కావాల్సిందేమిటి? ఇంత ప్రసాదం- అంతే!.

ఇంట్లోకొచ్చిన సాంబయ్య తలుపు తెరిచి వుండటం చూసి గతుక్కుమన్నాడు. పురోహితుడు శాస్త్రుల్లు గారేమో? ఆయనయితే వరండాలోనే కూర్చుంటాడే? మెల్లాలో ఏం చేస్తుంటాడూ?

వరండా దాటి గబగబా మెల్లా ఇంట్లోకి వచ్చాడు సాంబయ్య. ఇల్లంతా చీకటిగా వుంది. లాంతరుకూడా వెలిగించాడు. అగ్గిపుల్ల వెలుగులో తన మంచంమీద ఎవరో అటు తిరిగి పడుకున్నట్టుగా కన్పించింది.

''ఎవరదీ?'' అన్నాడు సాంబయ్య ఆదుర్దాగా.

వెంకటపతి లేచి తండ్రి ముందు తల వంచుకొని నిలబడ్డాడు. అగ్గిపుల్ల వెలుగులో కొడుకు ముఖం దీనంగా కన్పించింది.

''చీకట్లో పడుకున్నావేంరా? దీపం అన్నా వెలిగించలేదు. రాముడి తల్లి రాలేదా?'' సాంబయ్య హృదయంలో వాత్సల్యం పొంగులువారింది.

ఆ నిముషంలో కొడుకుమీద వున్న కోపం అంతా మంచులా కరిగిపోయింది. అగ్గిపుల్ల వేడికి సాంబయ్యవేళ్ళు చురుమన్నాయి. పుల్ల అవతలపడేసి, మరొకటి వెలిగించి లాంతరుకోసం వెతికాడు. లాంతరు వెలిగించి ముక్కాలుపీటమీదపెట్టి వరండాలోకి వచ్చి కూర్చున్నాడు. సాంబయ్య. కొడుకు రాకలోని అంతర్యం ఏమిటా అని ఆలోచనలో పడిపోయాడు.

వెంకటపతి తను తెచ్చిన లడ్డూ, జిలేబీ, బూందీ పొట్లాలు విప్పి ఒక పళ్ళెంలో పోసి తండ్రి ముందు పెట్టాడు. సాంబయ్య తన కళ్ళను తనే నమ్మలేకపోయాడు. ఇది వీడి స్వంతఆలోచనకాదు. పెళ్ళాం చెప్పి వుంటుంది. ఏదో ఎత్తు వేసి పంపించింది.

''నా కెందుకురా ఈ లడ్డూ బొడ్డూ?'' అన్నాడు సాంబయ్య.

''తిను, నీ కోసమే తెచ్చా!'' నంగినంగిగా అన్నాడు వెంకటపతి.

''తిన్నది చాల్లే, ఎందుకొచ్చావ్?''

''ఊరికే వచ్చా, పండగని!'' వెంకటపతి గొంతు పూడిపోయింది.

కొడుకు కంఠంలో ధ్వనించిన నిజాయితీ, ఆర్ద్రతా, ఆపేక్షా సాంబయ్య హృదయంలో చోటు చేసుకున్నాయి. వాడొట్టి అమాయకుడు. తనంటే వాడికి ప్రేమ లేకపోలేదు. జిలేబీ నోట్లో పెట్టుకొని చప్పరిస్తూ అనుకున్నాడు సాంబయ్య.

వాడంతట వాడే వచ్చి వుంటాడు. తను పండగపూట ఒంటరిగా వుంటాడని తెలిసి వచ్చాడు. వాడు పుట్టి బుద్ధి ఎరిగింతర్వాత ప్రతి పండక్కూ తనతోనే వున్నాడు. వాడికి పదహారేళ్ళు వచ్చేదాకా ప్రతి పండక్కూ తలంటిపోసి కొత్తబట్టలు తొడిగేవాడు. అది వాడికి మాత్రం గుర్తుండదా ఏం? తను చేసిన తొందరపాటుకు వాడెంత బాధపడుతున్నాడో, వాడి ముఖం చూస్తేనే తెలుస్తుంది. ఏనాడూ వాడు దేన్నిగురించీ బాధపడలేదు. వాడి తప్పేముంది? పెళ్ళాం విషం పోసింది. వాడు మింగాడు. ఇప్పుడు బాధపడుతున్నాడు. ఇక తెలుసుకున్నట్లే, వాడు బాగుపడతాడు. తన కొడుకు వెంకటపతి బాగుపడతాడు.

పళ్ళెంలోని మిఠాయి పూర్తి అయేంతవరకు సాంబయ్య నోరుతోపాటు మెదడు కూడా పనిచేసింది.

మరునాడు వెంకటపతి ప్రయాణమై వరండాలో చుట్ట కాల్చుకుంటూన్న తండ్రిముందుకొచ్చి నిలబడ్డాడు. సాంబయ్య చుట్ట విసిరి అవల పారేసి, మొలతాడ్లో కట్టుకున్న తాళంచెవుల గుత్తి తీసి వెంకటపతి ముందు పారేసి ''నీ ఇష్టం! ఏం చేసుకుంటావో చేసుకో? నా కెందుకొచ్చినట్టు ఈ బాదర బందీ?'' అన్నాడు. వెంకటపతి బిత్తరపోయాడు.

''డబ్బుకోసం రాలేదు. ఊరికే వచ్చాను.'' అన్నాడు.

''డబ్బుకోసమే వచ్చావో ఊరికే వచ్చావో నా కెందుకురా చెప్తావ్? గొడ్డూ గోదా, భూమీ పుట్రా, ఇల్లూ వాకిలీ వదలిపెట్టి నువ్వు బస్తీలో కూర్చుంటే ఎవడా ఇక్కడ చేస్తాడూ?'' అని సాంబయ్య లోలోపల సంతోషపడ్డాడు.

కొడుకు లొంగి వస్తున్నాడు. ఇప్పుడు తను మెత్తపడకూడదు. అంతా వాడి నెత్తినే వేస్తేసరి. దోవకు రాక ఏం చేస్తాడు?

''అది ప్రసవించాక అంతాకలసి ఒక్కసారే వస్తాం, ఇంకా నాలుగు నెల్లాగి.''

''అంతా కలిసి గంగలో దూకుతారో, ఇల్లూ వాకిలే చూసుకుంటారో - మీ ఇష్టం! నాలుగు నెల్లుకాదు-నాలుగేళ్ళ తర్వాత రండి, నాదేం పోయింది? ముక్కోటి ఏకాదశి వెళ్ళగానే నేను తూర్పుకు వెళ్ళి నాలుగు నెలలు వుండి వద్దామనుకుంటున్నా'' అని, కొడుకు జవాబుకు ఎదురుచూడకుండా లేచి గొడ్లచావిట్లోకి వెళ్ళిపోయాడు సాంబయ్య.

వెంకటపతి నేలమీద పడివున్న తాళంచెవులు తీసుకొన్నాడు. తండ్రి ధోరణి మారిపోయింది. మనిషి పూర్తిగా మారిపోయాడు. ఆ క్షణంలో వెంకటపతికి తన

తలమీద తండ్రి పెద్ద బరువు పెట్టి వెళ్ళినట్టు అనిపించింది. ఎన్నో ఏళ్ళుగా తండ్రి అవలీలగా మోసిన తాళంచెవులు, తండ్రి శరీరంలో ఒక భాగంగా వున్న తాళంచెవులు, వెంకటపతి చేతుల్లో చాలా బరువుగా వున్నట్లు తోచాయి.

వెంకటపతి ప్రయాణం మానుకొని ఇంటిదగ్గరే వుండిపోయాడు. పొలాన ఏమీలేకపోయినా, ప్రొద్దుటా, సాయంకాలం పొలం వెళ్ళి గనెం, గట్టూ చూసి వస్తున్నాడు. తాటితోపూ తుమ్మలబీడూ కూడా వెళ్ళి చూసొచ్చాడు. జీతగాడితో తూర్పు పొలాన కోసుకుపోయిన గట్లను గురించీ, కొత్త పొలాన మెరకలుపడ్డ చెక్కల గురించీ, వాటి మరమ్మతుల గురించీ వెంకటపతి మాట్లాడుతుంటే విన్న సాంబయ్యకు వళ్ళు పులకరించిపోయింది. గుండెల్లో అమృతం చిలికినట్టయింది. అయినా అదేమీ పట్టనట్టు బింకంగా వున్నాడు.

నాలుగు రోజులకల్లా వరూథిని నుంచి కబురు రానే వచ్చింది. ఊళ్ళోకి వచ్చిన కనకయ్య రహస్యంగా వెంకటపతికి కబురు పెట్టాడు. కనకయ్యను కలిసి తిరిగి ఇంటికొచ్చిన వెంకటపతి గంటలమీద ప్రయాణం అయ్యాడు. చావిట్లో ఆవు పాలు పితుకుతున్న సాంబయ్య దగ్గిరకొచ్చి, తాళంచెవుల గుత్తిని, దూడను కట్టేస్తున్న చావిడిగుంజకు తగిలిస్తూ ''నే వెళ్తున్నా!'' అన్నాడు.

సాంబయ్య పలకలేదు. చెబుతున్నది తనకు కానట్లే వంగి పాలచెంబు తీసుకున్నాడు? సాంబయ్య తలెత్తి చూసేసరికి వెంకటపతి అక్కడనుంచి వెళ్ళిపోయాడు. సాంబయ్య మనస్సు చివుక్కుమంది. తప్పుచేసినవాడిలా బాధపడ్డాడు. వెళ్తానని చెబితే తను ''ఊఁ'' అని అయినా అనలేదు. కన్నెత్తయినా చూడలేదు. ఇంత హఠాత్తుగా వెళ్ళిపోయాడు వెంకటపతి. అక్కడేం జరిగిందో! ప్రసవించే రోజులు కూడా కాదే! ఎలా వుందో ఏమిటో? మాట వరసకైనా తను అడగలేదే? అది మనసులో పెట్టుకొని విసురుగా వెళ్ళినట్టున్నాడు. వాడు మాత్రం అదేమిటి? అది తనతో ఆ మాత్రం చెప్పకూడదూ? పెళ్ళానికి ఏమన్నా అయితే తనతో చెప్పకుండా వుంటాడా? లేక బలరామయ్యకు ఏద్దైనా రోగం ఎక్కువయిందా? ఇటో అటో అయితే చెప్పకుండా ఉంటాడా?

సాంబయ్య మనస్సు పరిపరి విధాలుగా ఆలోచించింది. కొడుకు వదిలి వెళ్ళిన తాళం చెవులూ, పాలచెంబూ తీసుకొని ఇంట్లోకి వెళ్లాడు సాంబయ్య. పాల చెంబు రాముడి తల్లికి ఇచ్చి, పడమటిగదిలోకి వెళ్ళి ఇనప్పెట్టె తెరిచి చూశాడు.

ఇనప్పెట్టె ఖాళీగా వుంది! సాంబయ్య గుండెలు బిగిసిపోయినై.

## 17

వెంకటపతి చేతికి సంచీ, డబ్బూ ఇస్తూ ''రాత్రికి రామనాథబాబుగారు వస్తున్నారు'' అన్నది వరూథిని.

డబ్బు లెక్క పెట్టుకొంటున్న వెంకటపతి తలెత్తి భార్యముఖంలోకి చూశాడు.

''ఏవిటలా నోరు వెళ్ళబెట్టి చూస్తారూ? రాత్రికి రామనాథబాబుగారు మనింటికి

డిన్నర్‌కు వస్తున్నారు. మొన్న స్థలం రిజిష్టరు అయిన రోజున పిల్చాగా? గుర్తులేదూ?"

వెంకటపతికి గుర్తొచ్చి "మర్చిపోయా!" అన్నాడు.

"ఇంకా నయం, నేనుకూడా మర్చిపోతే పరువు పోయేది. త్వరగావెళ్ళి పట్టుకురండి" అన్నది వరూథిని.

"ఆయనకు మనిల్లు తెలుసుగా! అయినా అప్పుడే ఎందుకూ? రాత్రికిగా భోజనాలు?" తెలివిగా అన్నాడు వెంకటపతి.

"అయ్యో తెలివి? బజారుకెళ్ళి సరుకులు తెమ్మని సంచీ డబ్బూ ఇస్తే, ఆయన్ను పట్టుకొస్తా నంటారేం?" వచ్చేనవ్వును ఆపుకోకుండానే అనేసింది వరూథిని.

"ఏమేమేం తెమ్మంటావ్ మరి?"

"ఒక కోడిపెట్ట. ఒకటి సరిపోతుందిలే! ముదుర్ది పట్టుకురాకండి! చేపలు బొచ్చలుంటే అవీ-లేకపోతే కొరమీన్లు తీసుకోండి. కిస్‌మిస్ – ఆ ఒక అర్ధశేరు హల్వా- ఇంకా... ముందు అవి పట్టుకురండి!"

గడపదాటుతున్న భర్తను వెనక్కు పిల్చి "ఆంధ్రరత్న కిళ్లీ షాపులో రెండు స్పెషల్ కిళ్లీలు... దగ్గిరుండి కట్టించుకురండి. ఎన్ని చెప్పాను? రెండా? మూడు కిళ్లీలు తీసుకోండి. అక్కడే కూర్చోకండి. ఇక్కడున్నట్టు రావాలి!" చెప్పింది వరూథిని.

ఇంకా ఏమన్నా చెబుతుందేమోనని మరోనిముషం నిలబడి, తర్వాత చెప్పినవి గుర్తు చేసుకొంటూ సంచి ఊపుకుంటూ రోడ్డుమీద కొచ్చాడు వెంకటపతి.

వెంకటపతి బజారునుంచి వచ్చేసరికి వరూథిని డ్రాయింగ్ రూమూ, డైనింగ్ రూమూ దులిపి శుభ్రంగా కడిగించింది. కుర్చీలమీదున్న దిండ్లకు కొత్త గలీబులు వేసింది. ఇంటిముందున్న మొక్కల పూలూ, ఆకులూ కోసి ఫ్లవర్ వాజుల్లో పెట్టింది. పనిపిల్ల కమలమ్మ చేత గిన్నెలన్నీ శుభ్రంగా తోమించి పెట్టింది. వెంకటపతి సామానులు తీసుకొని ఇంటికి రాగానే, తర్వాత గుర్తొచ్చినవి అన్నీ ఏకరువుపెట్టి మళ్ళీ బజారుకు పంపించింది. వెంకటపతి మళ్ళీ వెళ్ళటానికి బద్ధకించి విసుక్కుంటూ వెళ్ళాడు.

రాత్రి ఎనిమిది అయింది. వరూథిని డిన్నర్ ఏర్పాట్లన్నీ పూర్తిచేసి, పన్నీరు చల్లుకుని స్నానం చేసి, పట్టుచీర కట్టుకొని, తల్లో పూలు పెట్టుకొని, సెంటు ఘుమఘుమల్ని వెదజల్లుతూ, డ్రాయింగ్ రూంలో వెంకటపతికి ఎదురుగా కూర్చొని, ఎదురు చూడసాగింది.

ఇంటిముందు కారాగి, తలుపు తెరచి, మళ్ళీ మూసిన ధ్వని వినిపించగా వరూథినికి వళ్ళు ఝల్లుమంది.

"రామనాథబాబుగారు వస్తున్నట్టున్నారు!" భర్తను హెచ్చరిస్తూ అన్నది వరూథిని. వెంకటపతి లేచి, కారు దిగి వస్తున్న రామనాథబాబుకు ఎదురు వెళ్ళాడు. ఆయన వెనకే లోపలకు వచ్చాడు.

సోఫాలో కూర్చున్న రామనాథబాబును చూసి వరూథిని కళ్ళు మిలమిల మెరిశాయి. మనసులో రంగులు విరిశాయి.

"కమలా! కమలా!" మృదువుగా పనిపిల్లను పిలుస్తూ డైనింగ్ రూంలోకి వెళ్తున్న వరూథిన్ని వారిస్తూ అన్నాడు రామనాథబాబు-

"భోజనానికి తొందరేంలేదు. ఇలా వచ్చి కూర్చోవచ్చుగా కాసేపు?" వాచీ చూసుకొన్నాడు.

"మీకు ఆలస్యం అవుతుందేమోనని?" హంసలా తిరిగి నడిచివచ్చి సోఫాకు ఎదురుగావున్న కుర్చీలో కూర్చుంది వరూథిని.

"అబ్బే, అదేంలేదు. రోజూ నా భోజనం అయేసరికి పదిగంటలు దాటుతుంది" అన్నాడు రామనాథబాబు.

"అబ్బా! అంత ఆలస్యంగా భోజనం చేస్తారా?" తెచ్చి పెట్టుకున్న ఆశ్చర్యాన్నంతా కళ్ళలో తిప్పుతూ అన్నది వరూథిని.

"సెకండు షో బుకింగ్ అయేదాకా హాలు దగ్గిరే" అంటూ త్రీ ఫైవ్ టిన్నులో నుంచి సిగరెట్ తీసి వెలిగించుకొన్నాడు. ఎదురుగావున్న వెంకటపతిని చూసి 'సారీ' అంటూ టిన్ను మూత తీసి అందించాడు. వెంకటపతి సందేహిస్తూ "సిగరెట్ అలవాటు లేదు; చుట్టా - తప్పితే బీడీ!" అన్నాడు.

వరూథిని ముఖం కందిపోయింది. రానినవ్వు తెచ్చుకుంటూ రామనాథబాబు కేసి చూసింది.

"ఫర్వాలేదు. తీసుకోండి!" అంటూ తనే టిన్నులోనుంచి తీసి వెంకటపతి కిచ్చి, లైటర్ వెలిగించి సిగరెట్ ముట్టించాడు. రామనాథబాబు కబుర్లు చెపుతుంటే వరూథిని తన్మయత్వంలో పడి వినసాగింది. వెంకటపతి సిగరెట్ దమ్ము లాగుతూ కూర్చున్నాడు. మాటల సందర్భంలో తాలూకాఫీసు పక్కన వరూథిని పేర వెంకటపతికొన్న స్థలం ప్రసక్తి తెచ్చాడు రామనాథబాబు.

"ఆ స్థలంలో ఏం చెయ్యబోతున్నారు?"

"ఇల్లు కట్టుకుందాం అనుకుంటున్నాం" అన్నది వరూథిని.

"ఎకరం పైగా వుంది. మెయిన్‌రోడ్డు మీది స్థలం. ఎంత ఇల్లు కట్టినా ఇంకా బోలెడు చోటు మిగిలిపోతుంది" అన్నాడు రామనాథబాబు.

"రోడ్డుదరిని కొట్లూ, లోపలవైపు గదులూ కట్టిస్తే బాగా అద్దెలు వస్తాయని చెప్పాడు కవకయ్య" అన్నాడు వెంకటపతి చివరిదాకా సిగరెట్ దమ్ములాగి.

"ఆమాట నిజమేననుకోండి! కాని ఆ స్థలానికి ఇప్పుడు చాలా డిమాండ్ వచ్చింది. అమ్ముకుంటే లాభం వస్తుంది" అన్నాడు రామనాథబాబు.

"ఏమ్మాత్రం లాభం ఉంటుందంటారు?" అడిగాడు వెంకటపతి.

"భోజనాలకు లేవండి, లాభం సంగతులు తర్వాత చూసుకొందురుగాని" అంటూ వరూథిని డైనింగ్ టేబుల్ దగ్గరకు దారి తీసింది.

ఆమె స్వయంగా వడ్డించి పక్కన నిలబడింది.

"మీరు కూడా కలిసే భోంచేయొచ్చుగా?" అన్నాడు రామనాథబాబు.

నువ్వు కూర్చోకపోతే ముద్ద కలపను అన్నట్లు మాట్లాడి రామనాథబాబు వరూథిన్ని భోజనానికి కూర్చోపెట్టాడు.

చేప ముల్లు తీస్తూ వెంకటపతి అడిగాడు ''అమ్మితే ఎంత వస్తుందంటారు?''

''డెబ్భై యనభై వేలదాకా రావచ్చు. మీరు కొన్నది ఏభైకి కదూ? ఇరవై వేలు లాభం వస్తోంది.''

వెంకటపతి ఉక్కిరిబిక్కిరి అయిపోయాడు. భర్త గొంతులో చేపముల్లు గుచ్చుకుందేమోనని భార్య గాబరాపడింది.

ఇరవై వేలు లాభమా?

పెళ్ళాం బలవంతం మీద, తండ్రి ఇనప్పెట్టెలో వున్న ఇరవైవేల పైచిలుకు డబ్బు తెచ్చి, కనకయ్య దగ్గిర వడ్డీకి ముప్పైవేలు తీసుకొని రామనాథబాబు ప్రోత్సాహంతో, ఏభైవేలుపోసి స్థలంకొన్న వెంకటపతి, స్థలం రిజిష్టరయిన మర్నాటినుంచీ, ఘోరమైన తప్పుచేసినవాడిలా బాధపడసాగాడు. దాంతో తండ్రితో తెగతెంపులు చేసుకొన్నట్టే భావిస్తూ లోలోపల కుమిలిపోతూ దిగులు దిగులుగా తిరుగుతూన్న వెంకటపతి మనసులో కొత్త ఆశలు మోసులెత్తాయి. తను చేసింది లాభసాటి బేరమా? వారం పదిరోజుల్లో ఇరవైవేలు సంపాదించాడు. డెబ్భై ఎకరాల వ్యవసాయం-అదీ స్వంతంగా చేసుకొంటే ఎంత వస్తుంది? ఖర్చులు పోను మిగిలేదెంత? రెండేళ్ళ వరుంబడి కలిపినా ఇరవైవేలు కాదు. అమ్మేసి-కనకయ్య అప్పు తీర్చేసి-నలభైవేలు తీసుకెళ్ళి తండ్రి చేతిలో పోస్తే ఎంత ఆనందిస్తాడు? తన ప్రయోజకత్వానికి ఎంత మురిసిపోతాడు? ఇక తనేం చేసినా అడ్డం చెప్పడు. తన తెలివితేటలమీదా, వ్యవహారదక్షతమీదా తండ్రికి గురి ఏర్పడుతుంది.

రామనాథబాబు ఏదో జోక్ వేశాడు. వరూథిని పకాలున నవ్వింది.

వెంకటపతి ఆలోచనలు చెదిరిపోయినై. భార్యకేసి చూశాడు. ఆమె ముఖం ఆనందంతో వెలిగిపోతోంది. అంతా దాని బుర్రే ఇది! వరూథిని తెలివైంది. పదిరోజుల్లో ఇరవైవేలు లాభం వచ్చే పని చేయించింది తనచేత. రామనాథబాబులాంటి వాళ్ళతో పరిచయం లేకపోతే స్థలం కొనడం జరిగేదా? వరూథినికి పెద్దవాళ్ళతో మాట్లాట్టం తెలుసు. తెలివిగలది. ఏ పనైనా సాధించే పట్టుదలా, నేర్పూ దానికుంది! తెలివితేటలున్న వరూథిని తనకు భార్య కావటం తన అదృష్టం! వరూథిని తండ్రి ఎగగొట్టిన కట్నం తాలూకు ఇరవైవేలూ వారం రోజుల్లో సంపాదించింది. అది దాని డబ్బే! ఆ మాట చెప్పి తండ్రి ముఖాన కొడ్తేసరి - ఆయన కోడల్ని ఇకనుంచి గౌరవంగా చూస్తాడు.

వెంకటపతికి రామనాథబాబూ, వరూథినీ మాట్లాడుకుంటున్నదేమీ బుర్రకు ఎక్కడం లేదు. అతని ఆలోచనలన్నీ లాభంగా రాబోతున్న ఇరవైవేల రూపాయల చుట్టూనే తిరుగుతున్నాయి.

మాంసం పీకి కోడి ఎముక కింద పెడ్తూ ''అమ్ముతామండీ, ఇరవైవేలు లాభం వస్తే!'' అన్నాడు వెంకటపతి.

''అమ్మడాని కేమిటి కొన్నది?'' కోడిమాంసం రుచికంటే వరూథిని గొంతే ఎక్కువ రుచిగా తోచింది వెంకటపతికి.

వెంకటపతి గిన్నెలో నుంచి కోడి పులుసు వేసుకొని మళ్ళీ ఒక వాయి కలిపాడు. అప్పటికే రామనాథబాబు, వరూథిని పెరుగన్నం తింటున్నారు. వెంకటపతికోసం అన్నట్లు నంజుతూ సుతారంగా తింటున్నారు.

''ఇరవై వేలు లాభం ఎందుకు వదులుకోవాలి?'' అని వెంకటపతి ''ఇదేంటీ ఇంత తెలివితక్కువలో పడిందీ!'' అన్నట్టు చూశాడు భార్యకేసి.

''ఎవరండీ ఆ కొనేవాళ్ళూ!'' రామనాథబాబు కళ్ళల్లోకి చూసి అడిగింది వరూథిని.

''ఎవరైతేనేం? అమ్ముతారా, చెప్పండి!'' ముసిముసిగా నవ్వుతూ అన్నాడు రామనాథబాబు.

''పోనీ, ఆ స్థలం అంతధరపెట్టి ఎందుకు కొంటున్నారో తెలుసుకోవచ్చా?'' కనురెప్ప లాడిస్తూ దెప్పుతున్నట్టు అడిగింది.

''సినిమాహాలు కట్టడానికి, అది చాలా మంచి సెంటర్!'' వరూథిని కళ్ళల్లో కళ్ళు కలిపి చెప్పాడు రామనాథబాబు.

''ఇప్పుడొకటుంది కదండీ? రెండవది కూడా కట్టాలా ఏం?'' రబీమని అన్నది వరూథిని. రామనాథబాబు కలవరపడ్డాడు.

''అమ్మో! ఏమో ననుకున్నాను, ఆవులిస్తే పేగులు లెక్కపెట్టావే?''

వరూథిని చెంపలు ఎరుపెక్కాయి.

వెంకటపతి ''పెరుగు, పెరుగు'' అన్నాడు. వరూథిని గిన్నెవంచి మొగుడి కంచంలో పెరుగు గుమ్మరించింది.

''నిజం చెప్పవూ? నేను సినిమాహాలు కట్టున్నానని ఎవరు చెప్పారు?'' ముద్దు ముద్దుగా మురిపెంగా అడిగాడు వరూథిన్ని కన్నార్పకుండా చూస్తూ రామనాథబాబు.

''ఒకరు చెప్పాలా ఏం? ఆ మాత్రం తెలుసుకోలేని పిచ్చిదాన్నా ఏం?'' వంపులు తిరిగిపోతూ అన్నది వరూథిని.

''నాకయితే స్థలం అమ్మరా ఏమిటి?'' హాయిగా, తేలిగ్గా నవ్వుతూ అడిగాడు రామనాథబాబు.

''ఎవరిచ్చింది వాళ్ళే తీసుకుంటారా ఎక్కడన్నా?''

''అయితే ఆ స్థలంలో ఇల్లేకడతారా?''

''సినిమాహాలే కడ్తాం!''

వెంకటపతి పెరుగుముద్ద గుటుక్కున మింగి వరూథినికేసి నోరు తెరచుకొని గుడ్లప్పగించి చూశాడు.

''పోనీ, మరో సగభాగమన్నా ఇస్తారా నాకు?'' అడిగాడు రామనాథబాబు.

''సగమేం ఖర్మ! మీరు అడిగితే పూర్తిగానే ఇస్తాం.'' ఉషారుగా అంది వరూథిని.

''ఛీఛీ! ఛీఛీ! చెరిసగం! హాలు రెండున్నర లక్షలవుతుంది, స్థలం కాక. ఈ నెల చివరకు ప్లాన్ శాంక్షన్ చేయిస్తాను. మీ వంతు కాష్ లక్షా ఇరవైఐదువేలు స్థలం

ఖరీదులో సగం పాతికవేలు నేను యివ్వాలిగా? పోతే, మీ వంతు పెట్టుబడి లక్షరూపాయలు. మన హాలుకు అన్నీ మోడరన్ ఫిట్టింగ్స్! అలాంటి థియేటర్ యీ టవున్లోనే కాదు జిల్లాలోనే ఉండదు. మన హాలు పేరేమిటో తెలుసా?" రామనాథబాబు ఠీవిగా అందంగా చెప్పాడు.

వరూథిని తను కూర్చున్నచోటే మర్చిపోయింది. హృదయం పొంగింది. వళ్ళు పులకరించింది.

''ఊఁ, మన హాలు పేరు?" మత్తుగా మెత్తగా అడిగింది వరూథిని.

''వరూథినీ పిక్చర్ ప్యాలెస్!"

వరూథిని మనస్సు రంగుల బెలూన్‌లా గాలిలోకి లేచింది.

''మనకు సినిమా హాలెందుకూ?" అనడానికి అవకాశమే దొరక్క, తెరిచిన నోరు మూసుకొని చెయ్యి కడుక్కున్నాడు వెంకటపతి.

వరూథిని రామనాథబాబుకు కిల్లీ అందించింది. భర్తకొకటిచ్చి, తను లావుపాటి కిల్లీ నోరు పట్టనట్టు కొంచెం కొంచెం కొరుకుతూ, రామనాథబాబు సుతారంగా వదులుతున్న సిగరెట్టు పొగ గదిలో 'సున్నాలు' చుట్టుకొని పైకి లేవడాన్ని మైమరచి చూస్తూండగా బచ్చమ్మ ఆదుర్దాగా లోపలకు వచ్చింది.

''నాన్నగారు! నాన్నగారు పోయారమ్మా!" అంది.

వరూథిని చేతిలోనుంచి సగం కొరికిన కిల్లీ కిందపడింది. పండిన నోటి రంగు కళ్ళలోకి పాకింది.

''ఎప్పుడూ?" వెంకటపతి లేచి అడిగాడు.

''అరగంటకూడా కాలేదు."

''పొద్దున బాగానే వున్నారే!" ఏమీతోచక అన్నాడు వెంకటపతి.

''నాలుగ్గంటలకు డాక్టరుగారు చూసి, ఇంకేం పర్వాలేదన్నారు బాబూ! అంతా కన్నుమూసి తెరిచేలోపల అయిపోయింది. పాలల్లో హార్లిక్స్ కలుపుతున్నా పంచదార తక్కువేయమని కూడా చెప్పాడు నాయనా! పంచదారవేసి, డబ్బా మూతపెట్టి, పంచదార కలిపి, గ్లాసు ఇద్దామనేసరికి - ఏం చెప్పను బాబూ!" బుచ్చమ్మ భోరున ఏడ్చింది.

అందరికంటే ముందు తేరుకున్నాడు రామనాథబాబు. కారుడ్రైవర్ని కేకేసి, బుచ్చమ్మను ''వెళ్ళి కారెక్కు" అన్నాడు. బుచ్చమ్మ కారు దగ్గిరకెళ్ళి నిలబడింది. వరూథిని ముఖాన చేతులు కప్పుకొని కుమిలి ఏడుస్తుంటే వెంకటపతి కోసం వెతికాడు. వెంకటపతి అప్పటికే బయటకు వెళ్ళి కార్లో కూర్చున్నాడు. ఓ క్షణం సందేహించి రామనాథబాబు వరూథిన్ని సమీపించాడు. రెండు చేతుల్తో ఆమెను పట్టుకొని ''ఊరుకో!" అని ఊరడిస్తూ లేవదీశాడు. వీధివాకిట్లోకి వస్తుండగా వరూథిని రామనాథబాబు చేతుల్ని మృదువుగా తోసేసి, కారుదగ్గిర కొచ్చి, భర్త ప్రక్కనే కార్లో కూర్చుంది.

## 18

సాంబయ్య బస్ దిగి రైలుపేటకు రిక్షా మాట్లాడాడు. రిక్షావాడు సాంబయ్యను ఎగాదిగా చూసి అర్ధరూపాయి అడిగాడు. సాంబయ్య రెండడుగులు ముందుకు వేసి ''పావలా ఇస్తా, వస్తేరా!'' అన్నాడు. రిక్షావాడు సాంబయ్య ముందుకు రిక్షా తోసుకొచ్చి ''ఎక్కండి!'' అన్నాడు. సాంబయ్య ఓ కాలు రిక్షాలో పెట్టి రెండోకాలు భూమ్మీద నుంచి లేపుతుండగా ''అరణా లివ్వండి!'' అన్నాడు రిక్షావాడు. సాంబయ్య రిక్షాదిగి ''గాడ్డికొడకా!'' అనుకున్నాడు. ఊళ్ళో ఎవరన్నా అయితే చేతికర్ర తిరగేసేవాడే! ఇది బస్తీ! అంతా ఇదే బాపతు అనుకున్నాడు.

వీడితో బేరమాడినంతసేపు పట్టదు నడిచి వెళ్తే. ఎక్కాదిగా ఇదో శ్రమ! సాంబయ్య కాలు ఝాడించి నడవసాగాడు. బస్సుస్టాండుకు వాళ్ళున్న ఇల్లు అంతదూరం కాదని చెప్పాడు కొడుకు. తూరుప్పాలం అంతదూరం కూడా ఉండదట. చల్లటి వేళ. నడిస్తే ఎంతసేపు పడుతుంది? రోడ్డుమీద కొంతదూరం నడిచాక హాస్పిటల్ ఎడంగా కన్పించింది.

కొడుకు చెప్పిన ఆనవాళ్ళు గుర్తు చేసుకోసాగాడు. హాస్పిటల్ దాటాక దగ్గర్లేనే వుందట ఇల్లు. వేపచెట్టు దగ్గిర సందులోకి వెళ్తే మళ్ళీ అడ్డరోడ్డు వస్తుంది. ఆ వీధిలో కుడివైపుకు తిరిగితే రెండో ఇల్లు. మధ్య మధ్య తలపక్కకు తిప్పి చూస్తూ నడుస్తున్నాడు సాంబయ్య.

సాంబయ్యకు వేపచెట్టు కనిపించేసరికి ఇల్లు దొరికినంత సంతోషమైంది. ఐతే సరిగ్గా వేపచెట్టు దగ్గర సందేదీలేదు! వేపచెట్టుకు ఇవతలా అవతలా సందులువ్నాయి! సాంబయ్య సందేహంలో పడ్డాడు. మళ్ళీ వెనక్కు వెళ్ళటం ఎందుకని వేపచెట్టు దాటాక సందులోకి తిరిగాడు. ఐదు నిముషాలు ఆ సందులో నడిచాక, అడ్డంగా వచ్చిన రోడ్డు మీదకు వచ్చి కుడివైపుకు తిరగటానికి చూశాడు. అసలు వీధేలేదు. ఆ వరసన రోడ్డు అక్కడకొచ్చి కాంపౌండు గోడదగ్గిర ఆగిపోయింది. బహుశా ఎడంవైపుకే తిరగాలేమో? తను పొరపాటుగా విని వుంటాడు. లేకపోతే తిక్కిరి బిక్కిరిగా చెప్పాడా? అసలు బజారే లేదు కనుక ఎడంవైపుకే తిరగాలని నిశ్చయించుకొని సాంబయ్య ఆ వీధికి తిరిగి కొంతదూరం నడిచాడు. రెండో ఇల్లు కట్టెల అడితీ. మూడో ఇల్లు బొగ్గుల అంగడీ. ఇంకా కొంతదూరం నడిచి సందులోకి తిరిగాడు. అంతే! సాంబయ్య అరగంటదాకా అక్కడక్కడే తిరిగాడు. మళ్ళీ వేపచెట్టున్న వీధిలోకి రావాలని ప్రయత్నించి మరో వీధిలోకి వచ్చాడు. సాంబయ్యకు అంతా అయోమయం అయింది. చిరాకు వేసింది.

దీన్ని తగలెయ్యా? ఏం బస్తీ? అన్నీ సందులూ, గొందులూ? సాలెగూడులా వుంది. అందుకే ఈ సాలెగూటిలో పడ్డవాడు మళ్ళీ తిరిగిరాలేడు. ఆలోచించినకొద్దీ తనే సాలెగూటిలో ఇరుక్కున్న ఈగలా అయిపోయాడు సాంబయ్య.

నిస్పృహలో పడ్డ సాంబయ్య ఆ త్రోవనే పోతున్న ఒక మనిషిని చూసి...

''ఇదుగో చూడండీ! మా వెంకటపతి వుండే ఇల్లెక్కడండీ?'' అడిగాడు. ఆ పని అర్ధగంటముందే చేస్తే ఈ తిప్పట తప్పివుండేదిగా అనుకున్నాడు.

''ఏ వెంకపటపతీ?'' ఆ పెద్దమనిషి ఆగి, సాంబయ్య దగ్గరకు వచ్చి అడిగాడు.

''ఊరుబోయిన వెంకటపతి. మా అసలు ఇంటిపేరు చెప్తే మా ఊళ్ళో వాళ్ళకే తెలియదు. ఊరుబోయిన వారంటేనే తెలుస్తుంది.'' వివరించసాగాడు సాంబయ్య.

''ఏం చేస్తుంటాడూ?''

''వ్యవసాయమే!'' అనాలోచితంగా చెప్పాడు సాంబయ్య.

''ఇక్కడ వ్యవసాయం చేసే వెంకటపతి ఎవరండీ?'' దీర్ఘం తీస్తూ అన్నాడు ఆ పెద్దమనిషి

''నా కుమారుడే!''

''నీ కుమారుడే లేవయ్యా! అసలు అలాంటి మనిషి ఈ వీధిలో ఎవరున్నారా అని ఆలోచిస్తున్నాను.''

ఈ లోపల మరో ఇద్దరు ఆగి విచారించారు.

''ఇక్కడేం పని చేస్తుంటాడన్నారు మీ అబ్బాయి?'' మళ్ళీ మొదటి పెద్దమనిషే అడిగాడు.

''ఇక్కడ ఏం చేస్తుంటాడూ? భార్య కాన్పుకోసం వచ్చి వున్నాడు.'' సాంబయ్యకు మాటలు అతికష్టంమీద వచ్చాయి.

ఆ పెద్దమనిషి పెదవి విరిచి ''నాకు తెలియదండీ!'' అన్నాడు.

అక్కడ చేరిన వాళ్ళలో ఒక యువకుడు ముందుకువచ్చి ''ఇల్లు అడ్రసు వుందా?'' అని అడిగాడు.

''గుర్తులు తెలుసు'' అన్నాడు సాంబయ్య.

''ఎక్కడని చెప్పారూ?''

సాంబయ్య గుర్తులు చెప్పాడు.

''మీరు చెప్పిన గుర్తుల ప్రకారం అయితే, అదుగో – ఆ బజారు అవతల బజారు వుంది చూడండి! ఆ వీధిలో వుండొచ్చు. మేముండేది ఆ వీధిలోనే. పేరేమన్నారూ?''

''వెంకటపతి!''

''వెంకటపతా? ఆ పేరున్న వారెవరూ మా వీధిలో లేరే!''

సాంబయ్య దిగాలుపడిపోయి చూశాడు. ముందుకు వెళ్ళబోతున్న ఆ కుర్రాడు క్షణం ఆగి ''మీరు చెప్పిన ఇంట్లో వరూథిని అనే ఆమె ఉంటుంది మరి!'' అన్నాడు.

''ఆc! ఆ అమ్మాయి మా కోడలే!'' సాంబయ్య సంతోషంగా అన్నాడు.

''అలా చెప్పావు కాదేమయ్యా? వరూథినమ్మ ఇల్లంటే ఈ పేటలో ఎవరైనా చెప్తారు. వెంకటపతి– చలపతి– అంటే ఎవరికి తెలుస్తుందయ్యా?'' అన్నాడు

మొదటి పెద్దమనిషి, సాంబయ్యమీద నిందారోపణ చేస్తున్న ధోరణిలో. మిగతా ఇద్దరు తమాషాగా నవ్వుకున్నారు.

సాంబయ్యకు తల కొట్టేసినట్టయింది. మొగుడిపేరు చెబితే ఇంటిపక్కవాళ్ళకు కూడా తెలియదా? పెళ్ళాం పేరు చెబితే పేటంతా తెలుసా? ఏం బతుకు? వాడి బతుకు తగలెయ్య! తన తలకోసి మురుక్కాలవలో పడేసినా ఇంత అవమానంగా ఉండేదికాదు. 'వ-రూ-థి-ని' ఆ క్షురవాడి వెంట వెళ్ళుతూ అనుకున్నాడు సాంబయ్య కసిగా!

''ఇదేఇల్లు!'' క్షురాడు సాంబయ్యను ఓ ఇంటిముందు వదిలేసి వెళ్ళిపోయాడు.

సాంబయ్య తలెత్తి చూశాడు. ఎత్తయిన వీధి గుమ్మాలు. వెనక పెద్దమేడ. ఇంటి ముందుకు వచ్చిన రిక్షాలు వచ్చినట్టే వున్నాయి. ఉన్న కుటుంబాల్లోని మనుషుల్లాగే వున్నారు. ఓ కారు వచ్చి ఆగింది. అందులో నుంచి దిగినాయన మల్లెపూవులాంటి తెల్లటి బట్టలు వేసుకొని విలాసంగా లోపలకు వెళ్ళాడు. సాంబయ్య ఎత్తుగా వున్న వీధిగుమ్మం మెట్లెక్కి లోపలికి చూసి నివ్వెరపోయాడు. ఇదేదో పెళ్ళి ఇల్లులా వుంది. ఇల్లంతా అలంకరించబడి వుంది. జనం కిటకిటలాడి పోతున్నారు. పట్టుచీరెలూ, సిల్కు పంచెలూ, గజిబిజిగా సాంబయ్య కళ్ళముందు తిరిగిపోతున్నాయి. తను పొరపాటు పడ్డాడు. ఇదేదో గొప్పవాళ్ళింట్లో జరిగే పెళ్ళిలా వుంది. ఇది వెంకటపతి వుండే చోటుకాదు. వరూథిని ఇల్లే కావచ్చు కాని వెంకటపతి పెళ్ళాం వరూథిని ఉండే ఇల్లు కాదు.

సాంబయ్యకు తల తిరిగిపోతోంది. కళ్ళు మసకలు కమ్మినయ్. గుమ్మం పట్టుకొని, లోపలకు వెళ్ళలేకా, కిందకు దిగలేకా నిలబడిపోయాడు.

''మామయ్యా! లోపలకు రండి!''

మసక చీకట్లోనుంచి వెలుగులోనికి వచ్చినట్టయి సాంబయ్య తలెత్తి చూశాడు.

''లోపలకు రండి మామయ్యా! ఇదే మన ఇల్లు!''

ఈ అమ్మాయి తన కోడలా? ఎంత మారిపోయింది? దేవలోకంలో నుంచి దిగివచ్చిన దేవకన్యగానో, నాగలోకంనుంచి యెక్కివచ్చిన నాగకన్యగానో కన్పించింది వరూథిని సాంబయ్యకు.

''నీ కోసమే చూస్తున్నాం. తాతయ్య లేకుండా మనవడు బారసాల చేసుకోనంటున్నాడయ్యా!'' సాంబయ్యను చూసి లేచి గబగబా వచ్చాడు కనకయ్య. ఇంటికి వచ్చిన తండ్రిని చూసి వెంకటపతి ఉప్పొంగిపోయాడు.

కాళ్ళు కడుక్కొని సాంబయ్య ఇంట్లో ప్రవేశించాడు. కనకయ్యతప్ప తనకు తెలిసిన ముఖమే కన్పించలేదు సాంబయ్యకు. కనకయ్యమీద ఎంత అయిష్టం ఉన్నా ఆ రోజు కనకయ్యే అప్పుడుగా కన్పించాడు సాంబయ్యకు.

కొడుకూ, కోడలూ తనవాళ్ళు కావట్టే, కొత్తవాళ్ళలా అనిపించారు సాంబయ్యకు. సాంబయ్యకు జరుగుతున్న ప్రత్యేక మర్యాదలకు చూసినవాళ్ళ కళ్ళన్నీ అతనిమీదే ఉండిపోయినై.

''వీరు పిల్లవాడి తాతగారు'' దగ్గిర వున్నవాళ్ళకు పరిచయం చేసి చెప్పాడు కనకయ్య.

రామనాథబాబు తనంతట తానే వచ్చి సాంబయ్య పక్కన కూర్చొని పలకరించాడు. యోగక్షేమాలు విచారించి చాలా గౌరవంగా మాట్లాడాడు.

బారసాల తంతుమొదలైంది. ఆహూతులు కుఱ్ఱాడికి తెచ్చిన బహుమతులు వరూథిని కందించి, కుఱ్ఱాడ్ని ముద్దాడి, భోజనాల దగ్గిర కూర్చున్నారు.

జనం పల్చబడ్డాక సాంబయ్య ఉయ్యాలతొట్టి దగ్గరకొచ్చి, ఉయ్యాలతాళ్ళు పట్టుకొని వొంగి చూశాడు.

సాంబయ్య గుండెల్లో రక్తం వేగంగా ప్రవహించింది. మనిషిలో తరతరాలుగా జీర్ణించుకొన్న మమకారం ఉప్పెనలా పొంగివచ్చింది. పసివాడు కాళ్ళూ చేతులూ గాల్లోకి విసురుతూ సాంబయ్య ముఖంలోకి చూశాడు. సాంబయ్యకు వళ్ళు పులకరించింది. తొట్లోకి బాగా వంగి చూపుడు వేలు వాడికి అందించాడు. పసిపాపడు సాంబయ్య వేలు గట్టిగా పట్టుకొన్నాడు. ఆ స్పర్శలో సాంబయ్య ఈ ప్రపంచాన్నే మరిచాడు. ఇది తరతరాల బంధం. ఆ బంధం అవిచ్ఛిన్నంగా అనంతంగా సాగిపోతూనే ఉంటుంది. పసివాడు లేత చేత్తో సాంబయ్య కవచాన్ని బద్దలు కొట్టాడు. పాషాణం కరిగి నీరయిపోయింది.

''అన్నీ తాతయ్య పోలికలే!'' వరూథిని ఉయ్యాలకు అంత ఎడంలో నిలబడి అన్నది.

''అవును సాంబయ్యా! నీ పోలికే!'' అన్నాడు కనకయ్య సాంబయ్యను భుజంపట్టి కుదుపుతూ. సాంబయ్య ఆనందంతో ఊగిపోయాడు.

''వీడప్పుడే నా చెయ్యి వదలడంలేదు!'' పసివాడిలా అయిపోయి అన్నాడు సాంబయ్య.

''ఓహో! అప్పుడే మనవడు తాతయ్యను బుట్టలో వేసుకొన్నాడన్నమాట!'' కనకయ్య అన్నాడు. వరూథిని ఎర్రటి పెదవులమీద తెల్లటి పలువరుసల్లోనించి వెలుగు జారి నిలిచింది. వెంకటపతి తండ్రినీ, కొడుకునీ నిండారా చూసుకొని ''నా కొడుకు నన్ను తండ్రి దగ్గిరకు చేరుస్తాడు!'' అనుకున్నాడు.

''మరి బుద్ధులు ఎవరివి వచ్చాయో?'' సాంబయ్య మాటవింటూనే కొడుకూ కోడలూ ముఖముఖాలు చూసుకొన్నారు.

''అవి కూడా మీవే వస్తే-'' సాంబయ్య ముఖం చూసిన కనకయ్య నాలుక కరచుకున్నాడు. తెప్పరిల్లుకొని మాట మార్చాడు.

''ఇంతకీ మనవడికేం తెచ్చావయ్యా?'' అన్నాడు కనకయ్య.

సాంబయ్య గుండెలు జారినై. డొల్లయిపోయాడు. అది తనకు తెలియలేదు. అసలు తను రావాలనే అనుకోలేదు. కొడుకు కాళ్ళావేళ్ళాపడి బిక్కముఖం వేస్తే వచ్చాడు. అంతవరకూ మనవడ్ని చూడాలన్న కోర్కె కూడా తనలో లేకపోయింది. అయిష్టంగానే వచ్చాడు. కాని మనవడు తనను కట్టిపడేసుకున్నాడు. తను వట్టి

చేతుల్తో వచ్చాడు. అయినా తను ఇచ్చేదేమిటి? వాడు తన మనుమడు. తన వాడికి తను ఇచ్చేదేమిటి?

''నేనిచ్చే దేమిటి? అంతా వాడిదే! నా సర్వస్వం వాడిదేగా? నేనే వాడివాడ్ని అయిపోయాను. వాడు పెరిగి పెద్దవాడయి నాకేమిస్తాడో చూడాలి.'' సాంబయ్య కంఠం వణికింది. సాంబయ్య ఇంత ఇదిగా తీసుకుంటాడని కనకయ్య అనుకోలేదు. వరూథిని, వెంకటపతి మౌనంగా వుండిపోయారు.

''నీ ఆస్తిని మూడింతలు చేస్తాడు. కలెక్టర్రో, గవర్నర్రో అవుతాడయ్యా నీ మనవడు. కుర్రాడి జాతకం బ్రహ్మాండంగా వుంది. నీ పేరు నిలబెడ్తాడు.'' కనకయ్య అన్నాడు.

సాంబయ్య కనుపాపల్లో పసివాడి నీడలు ప్రతిఫలించాయి.

''భోజనాలకు లేవండి. ఆలస్యం అయిపోతుంది.'' మామగార్నీ కనకయ్యనూ చూసి అన్నది వరూథిని.

సాంబయ్య వెంకటపతికేసి తిరిగి ''ఏరా ఎప్పుడూ ప్రయాణం?'' అని అడిగాడు.

వెంకటపతి భార్యకేసి చూశాడు. వరూథిని అదేమీ వినిపించుకోనట్టే ముఖం పెట్టింది. ''బారసాల కూడా మన వూళ్ళోనే చేసుకుంటే బాగుండేది. సరే, అయిందేదో అయిపోయింది. రేపు వర్జ్యం చూసుకొని బయలుదేరితే బాగుంటుంది.''

''డాక్టరమ్మగారు బాబుకు మూడోనెల వచ్చేదాకా ఇక్కడే వుంటే మంచిదన్నారు. పైకి ఇట్లా కనబడుతున్నానేగాని నాకు వంట్లో అంత బాగుండడం లేదు. ఏమీలేదు. ఇన్నాళ్ళున్నాం. ఇంకా రెండునెలలు, బాబు కొంచెం వళ్ళు చేసిందాకా వుంటే ఏం పోతుంది? అంత తొందరేమొచ్చింది?'' అన్నది వరూథిని.

సాంబయ్య కొడుకు అభిప్రాయం కోసం చూశాడు. వెంకటపతి నిస్సహాయంగా తండ్రి ముఖంలోకి ఓ క్షణం చూసి అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

''సాంబయ్యగారూ! అవన్నీ తర్వాత మాట్లాడుకోవచ్చు. ముందు భోజనానికి పదండి!'' అన్నాడు కనకయ్య, భోజనాలు వడ్డిస్తున్న గదిలోకి దారితీస్తూ. సాంబయ్య భోజనాల గది దాటి వరండాలోకి వచ్చాడు. కనకయ్య ''ఇటు! ఇటు! అటెక్కడికీ?''

అంటూ హడావిడి చేస్తూ సాంబయ్య వెనకపడ్డాడు.

''బస్సుందదు. నే వెళ్తాలే!'' అన్నాడు సాంబయ్య.

''ఏమయ్యోయ్ వెంకటపతీ! అమ్మాయ్ వరూథినమ్మా! నీ మామగారు భోజనం చెయ్యకుండా వెళ్తున్నారమ్మా!'' అని కేక పెట్టాడు కనకయ్య.

''పోయేవాళ్ళను పట్టుకొంటే ఆగుతారా ఏం?'' ఉక్రోషపడుతూ అన్నది వరూథిని.

వెంకటపతి గబగబా పరుగెత్తుకొచ్చాడు. అప్పటికే సాంబయ్య గుమ్మందాటి వీధిలోకి వచ్చాడు.

''మీరెక్కడికి? ఇంకా ఇంతమంది భోజనాలకు వున్నారు? ఆయనవెంట పోతారేం?'' గుమ్మం దిగబోతున్న వెంకటపతి వరూధిని గొంతు విని ఆగిపోయాడు. తిరిగి ఇంట్లోకి వచ్చాడు.

కనకయ్య భోజనం చేసి, వరూధినికి చెప్పి బయలుదేరాడు. బస్సుస్టాండ్‌లో పిట్టగోడమీద కూర్చొని బస్సుకోసం వేచివున్న సాంబయ్య కన్పించాడు.

''ఏం సాంబయ్యా, అట్టా చేశావ్? నీ కొడుకూ కోడలూ ఎంత బాధపడ్డారో తెలుసా?''

''ఏమోనయ్యా! ఆ కొంపలో పచ్చిగంగ ముట్టబుద్ధి కాలేదు.'' తగ్గిపోయి అన్నాడు సాంబయ్య.

''మీ కోడలు తిండికూడా తినకుండా బాధపడుతున్నదయ్యా!''

''ఈ కల్లబొల్లి కబుర్లకేం గాని - వాళ్ళు బస్తీలో కాపురం ఎత్తేసేదాకా వాళ్ళ ముఖం చూడదలచుకోలేదు. ఈ బస్తీలో కాపురం పెట్టి నా కొంప ఆరుస్తున్నారు!''

''ఏమిటయ్యా, నీ కొంప ఆర్పింది? ఏభైవేలకు స్థలం కొన్నారా? ఇప్పుడు దాన్ని ఎనభై వేలకు అడుగుతున్నారు. చిటికెలమీద ముప్పైవేల లాభంకొట్టారు. ఎన్నేళ్ళు పొలంలో రాత్రింబగళ్ళు రెక్కలు ముక్కలు చేసుకొంటే ముప్పైవేలు వస్తాయయ్యా?'' సాంబయ్యను దులిపేస్తూ అన్నాడు కనకయ్య. సాంబయ్య ఆలోచనలో పడ్డాడు.

''ఎక్కడంటా వాళ్ళు కొన్నది?'' సాగదీస్తూ ఇష్టం లేనట్టే అడిగాడు.

''రా, చూపిస్తా!''

''బస్సు వస్తదేమో!''

''వస్తే రానియ్. నిన్ను చిన్నకార్లో ఊళ్ళో దింపుతాగా? రా.'' కనకయ్య అన్నాడు.

సాంబయ్య కనకయ్యవెంట మంత్రించినవాడిలా నడిచాడు.

''ఇదే స్థలం!''

''ఆ రాయిదాకా వుందా?'' సాంబయ్య కన్నార్పకుండా చూసి అడిగాడు.

''అదే హద్దు. ఎకరం ముప్పైసెంట్లు.'' చెప్పాడు కనకయ్య.

''రోడ్డు కానుకొనే వుంది.'' అన్నాడు సాంబయ్య.

''ఇది పెద్ద సెంటరయ్యా! ఈ బస్తీ మొత్తం మీద ఇట్లాంటి సెంటరు లేదు.'' అన్నాడు కనకయ్య.

సాంబయ్య సంతోషపడ్డాడు. కాని, పైకి కన్పించకుండా ''ఇప్పుడిది ఎనభై వేలకు కొంటారంటావా?'' అని అడిగాడు.

''అమ్ముతారా! రేపే నేను కొంటాను. మీ కోడల్ని ఒప్పించండి!''

''కోడల్నా? పెళ్ళాం పేర కొన్నాడా వాడు?'' కనకయ్యకేసి సూటిగా చూస్తూ అడిగాడు సాంబయ్య.

కనకయ్య ఇరుకున పడ్డాడు. పొరపాటుగా నోరు జారాననుకొన్నాడు.

''బస్తీల్లో ఆడవాళ్ళ పేర్లనే వుంటాయి స్థలాలూ, ఇళ్ళూ, ఆస్తులూ."

''పల్లెటూరు విడిచి బస్తీకెక్కిన ఆడది మొగవాడై పోతుందా ఏం?" సాంబయ్య ప్రశ్నకు కనకయ్యకు సమాధానం దొరకలేదు.

''మగాడు ఆడదాని కొంగుపట్టుకు తిరుగుతాడా ఏం ఇక్కడ?"

''ఊరుకోవయ్యా నువ్వు మరీను! ఆడదాని కొంగుపట్టుకు తిరిగేవాడు పల్లెలో వున్నా, బస్తీలో వున్నా అదేపని చేస్తాడు. తెలివితేటలున్న మగాడు ఎక్కడున్నా రాజసంగానే వుంటాడు. పద! పద! మళ్ళీ కారెక్కడికన్నా బాడుగకు పోతుందేమో!" అని కనకయ్య దూరంగా, రోడ్డుకు అవతలవున్న షెడ్డుకేసి నడిచాడు.

''ఆమధ్య అడిగితే కారు నీదికాదని చెప్పావుగా?"

''అవును! అప్పుడు ఆ మాట నిజమే!"

''అయితే ఇప్పుడు?"

''ఈ మాట నిజం!"

''వీడిది నాలుకా, తాటిపట్టా?" అనుకున్నాడు సాంబయ్య.

కనకయ్య అంగలు పంగలేస్తూ సాంబయ్యను వెంటపెట్టుకొని షెడ్డుదగ్గిరకొచ్చాడు.

## 19

కలుపుతీసేరోజుల్లో వెంకటపతి ఉగ్గం కట్టిన వెన్నపూస తపేలా పట్టుకొని రైలుపేటలో మేడముందు దిగాడు. రిక్షావాడు బియ్యం బస్తా ఎత్తుకొచ్చి మెట్లమీద దించాడు. రిక్షావాడికి డబ్బులిచ్చి వీధి తలుపు తట్టాడు. మళ్ళీ తలుపు తట్టబోతున్న వెంకటపతికి తలుపుకు వేసి వున్న తాళం కన్పించింది. ఈవేళప్పుడు ఎక్కడికి వెళ్ళారా అనుకుంటూ, వెన్నపూస తపేలా కింద దించి, బియ్యం బస్తా పక్కగా, మెట్లమీద గొంతుక్కూర్చున్నాడు.

పొద్దుపోయి ఆఖరు బస్ దిగొచ్చిన వెంకటపతికి ఆకలి వేస్తూంది. ఇంట్లో పనిపిల్ల కూడా లేకుండా ఎక్కడికి వెళ్ళినట్టు? వెంకటపతి వీధిలో వచ్చే పోయేవాళ్ళను చూస్తూ కూర్చున్నాడు. రాత్రి పదిగంటలు అయింది. సినిమాకు వెళ్ళిన జనంకూడా తిరిగి వస్తున్నారు. ఇంతవరకూ రాలేదు. వీళ్ళంతా ఏమైనారు? ఇంత పొద్దుపోయిందాకా ఏం చేస్తున్నట్టు?

కారులైట్లు వెంకటపతి ముఖంమీద పడ్డాయి. కళ్ళు చిట్లించి చెయ్యి అడ్డం పెట్టుకొని చూశాడు. మరుక్షణంలో కారు వచ్చి ఇంటిముందు ఆగింది. పనిపిల్ల, నిద్ర పోతున్న కుర్రాడ్ని ఎత్తుకొని ముందు సీట్లోనుంచి దిగింది.

వరూథిని వెనకసీట్లోనుంచి దిగింది. వెనక సీట్లో కూర్చొని వున్న రామనాథబాబు దిగటానికి సందేహించాడు.

''అదేమిటి? ఇంట్లోకన్నా రాకుండా పోతారా ఏం?" అన్నది వరూథిని డోరుమీదగా కార్లోకి వొంగిచూస్తూ.

''టైం లేదు. సర్కిల్‌గారింట్లో డిన్నర్‌కు వెళ్ళాలి. ఇప్పటికే ఆలస్యం అయింది. మొహం అన్నా చూపించకపోతే బాగుండదు. మీ ఆయన పాపం, వెయిట్ చేస్తున్నాడు. నేను వస్తా వరూ!'' అన్నాడు రామనాథబాబు.

కారు సాగి వెళ్ళిపోయింది. పనిపిల్ల కుర్రాడ్ని వరూథినికి అందించింది. తాళం తీసే ప్రయత్నంలో పడింది.

''ఎంతసేపయిందీ వచ్చి?'' వరూథిని వెంకటపతికేసి అప్పుడే చూసినట్టుగా చూసి అడిగింది.

వెంకటపతి మాట్లాడలేదు. బియ్యం మూట, మూతి దగ్గిర పట్టుకొని బరబరా ఇంట్లోకి లాక్కొచ్చి వేశాడు. పనిపిల్ల ఉగ్గం తపేళా పట్టుకొని లోపలికి వెళ్ళింది.

''ఏమన్నాడు ముసలాయన?'' కొడుకుని వెంకటపతికి అందిస్తూ అడిగింది వరూథిని.

వెంకటపతి మాట్లాడలేదు. నిద్రపోతున్న కొడుకు జుట్టు నిమురుతూ గదిలో అటూ ఇటూ తిరిగాడు. కుర్రవాడికి పక్కవేసి, ఫాన్ పెట్టి, వెంకటపతి చేతుల్లోనుంచి కొడుకుని అందుకొని పడుకోబెట్టింది.

చీరమార్చుకొని హాల్లో కూర్చొన్న వెంకటపతి దగ్గిరకొచ్చి ''ఏం మునిగిపోయింది? ఇంత పొద్దుపోయి రాకపోతేనేం? తెల్లారి రాకపోయారా?'' అన్నది.

అప్పటికే వెంకటపతి అలాంటి మాటలకు అలవాటు పడ్డాడు. నోరెత్తకుండా కూర్చున్నాడు.

''ఒసే! కమలా! ముందయ్యగారికి వడ్డించవే!'' అని కేకవేసింది.

పనిపిల్ల వచ్చింది. ''ఇప్పుడే బియ్యం కడిగి పెట్టానమ్మా!'' అన్నది.

పనిపిల్ల వంట కాగానే ఇద్దరకూ వడ్డించింది.

డైనింగ్ టేబుల్ దగ్గర కూర్చొని వెంకటపతి భోంచేస్తున్నాడు. వరూథిని ఎదురుగా కూర్చొని పెరుగువడ్డిస్తూ మళ్ళీ రెట్టించి అడిగింది:

''ఇంతకీ మామయ్య ఏమన్నారూ?''

''చస్తే పొలం అమ్మడానికి ఒప్పుకోనన్నాడు.''

''చస్తే పీడా విరగడయిపోతుంది. మనమే అమ్ముకోవచ్చు!'' గరిటె పెరుగు గిన్నెలో ఎత్తి పడేస్తూ అంది వరూథిని.

వెంకటపతి నోట్లో వున్న ముద్దను గుటుక్కున మింగేశాడు.

''చాతకానివాడివి ముందే చెప్పకపోయావా?'' రుసరుసలాడుతూ అన్నది వరూథిని.

''ఇప్పు డేమయిపోయింది? ఇవ్వాళ కాకపోతే రేపు ఒప్పుకుంటాళ్ళే!'' అన్నాడు వెంకటపతి పెళ్ళాంకోపం తగ్గించే ప్రయత్నంలో.

''బిల్డింగ్ శాంక్షన్‌కూడా వచ్చింది. ఈ నెల్లోనే రామనాథబాబుగారు మొదలు పెట్టాలంటున్నారు. స్థలం నా పేరుమీదే వుంది. లేకపోతే మరొకళ్ళని భాగం

కలుపుకుంటాం అంటున్నారు" అంటూ తినేతినే పళ్ళెంలో నీళ్ళుపోసి చివాల్న లేచింది వరూథిని.

అన్నం తింటున్న భర్తను కవ్వించింది వరూథిని.

"సినిమాహాలు ప్లాన్లన్నీ తయారయ్యినై. మనవల్లనే ఆరునెల్లుగా ఆలస్యం అయింది. ఈపాటికి హాలుకూడా పూర్తయేది. రామనాథబాబు మంచివారు కాబట్టి సరిపోయింది. మనమీద వున్న అభిమానంతో ఇంతవరకూ ఆగారు."

"ఆగకపోతే ఆయన్నే కట్టుకోమను! మనకు సినిమాహాలూ వద్దు పాడూ వద్దు." అన్నాడు వెంకటపతి పెళ్ళాంవైపు చూడకుండానే.

వరూథినికి వళ్ళు మండిపోయింది.

"ఆ ఏడుపు ముందే ఏడిస్తే పోయేదిగా?"

ముద్ద నోట్లో పెట్టుకోబోతూ వెంకటపతి తలెత్తి పెళ్ళాం ముఖంలోకి చూశాడు. భర్తముఖం చూసిన వరూథినికి నిజంగానే భయం వేసింది. కాని, తను తగ్గిపోతే తన ప్రయత్నమంతా వ్యర్థం అయిపోతుందని భావించింది.

"మీ ఆస్తిని మీరు అమ్ముకొనే హక్కులేదా? ముసలాడు చెబితే నెత్తిన గుద్దేసుకొని వచ్చిందిగాక ఎందుకలా చూస్తారు?"

"ఇక్కడ ఇల్లూవద్దు, సినిమాహాలూ వద్దు! ఇక్కడ బస్తీకాపురం వెలగబెట్టింది చాలు. ఇక మన ఊరికి వెళ్తేనే మంచిది." వెంకటపతి చాలా లోతుగా ఆలోచించి అన్నమాటలేనని అర్థం చేసుకొని వరూథిని గాబరాపడింది.

"నేనెక్కడకూ రాను. కావాలంటే మీరు వెళ్ళి మీ అయ్యదగ్గిర వుండండి. నా బిడ్డను పెట్టుకొని నేనిక్కడే వుంటాను."

"ఆహా! అంతవరకూ తెగించావన్నమాట?"

"తండ్రి ముందు పిల్లి! పెళ్ళాం ముందు పులి! బాగానే వుంది సంబడం!" మూతి తిప్పుకొంది వరూథిని.

"ఊరికే వాగావంటే...?"

"ఏం చేస్తావేంటి?"

ముందున్న గ్లాసును ఎత్తి పెళ్ళాం మీద విసిరాడు వెంకటపతి. వరూథిని తలమీదుగా వెళ్ళి గోడకు తగిలి కిందపడింది. వరూథిని దెబ్బతిన్న ఆడపులిలా లేచింది. తనముందున్న ఎంగిలి పళ్ళెం ఎత్తి వెంకటపతి ముఖంమీద కొట్టాలనిపించింది. ధైర్యం చాలక అతను తింటున్న పళ్ళెం మీదకు విసిరింది. వెంకటపతి రౌద్రంగా లేచాడు. వరూథిని జుట్టు పట్టుకొని వంగదీశాడు.

కొడుకు ఏడుపు వినిపించింది. కంచాల మోతకు పసివాడు నిద్ర లేచాడు. గుక్కపెట్టి ఏడవసాగాడు. వరూథిని పడక గదిలోకి వెళ్ళి తలుపులు ధడేల్న వేసింది.

వెంకటపతి తెల్లవారి నిద్రలేచి వరూథిని ఇంకా గదిలోనే వుందనే ఉద్దేశ్యంతో, అటుకేసయినా చూడకుండా వరండాలో కూర్చున్నాడు. అప్పుడే రిక్షా దిగి లోపలకు వస్తున్న వరూథిన్ని చూసి ఆశ్చర్యపోయాడు.

ఇది ఎక్కడ్నుంచి వస్తున్నది? అసలెప్పుడు వెళ్ళింది? తను నిద్రలేచే సరికి ఇంట్లో లేదన్నమాట?

వరూథిని కళ్ళు తేలవేస్తూ, కాళ్ళు భారంగా ఈడుస్తూ, వచ్చి మండిగం దాటబోతూ, తూలి దర్వాజా పట్టుకొంది. వెంకటపతి బుర్రలో కందిరీగలు తిరిగినట్లయి చూశాడు.

''నువ్వు మనిషివా? పశువ్వా?''

ఏదయినా తేడా ఏముందన్నట్లుంది వెంకటపతి చూపు.

''రాత్రిపోతే ఈపాటికి శవదహనంకూడా జరుగుతూ వుండేది.''

''ఏమయిందీ?'' వెంకటపతి వానపాములా అయిపోతూ అడిగాడు.

''ఇంకా అడుగుతున్నారా? గుండెల్లో నొప్పి వచ్చింది. గిలగిల్లాడిపోయాను. మనిషి చచ్చినా బతికినా మీకు పట్టదు.'' వరూథిని హీనస్వరంతో అన్నది.

మెల్లగా దర్వాజా పట్టుకొని జారి గడపల్లో కూలబడింది. వెంకటపతి గాబరా పడ్డాడు.

''ఎట్లా వుందిప్పుడు?'' అన్నాడు లేచి భార్య దగ్గరకొచ్చి.

వరూథిని కళ్ళు మూతలుపడిపోతున్నాయి. వెంకటపతికి ఏమీ తోచక వరూథిన్ని పట్టుకొని లేవదీయబోయాడు. ఆగమని సౌంజ్ఞ చేసింది వరూథిని. రెండు నిముషాలయాక తెప్పరిల్లి భర్తకళ్ళలోకి చూసింది. నీరసంగా పెదవులు కదిలాయి.

''డాక్టరమ్మను తీసుకురానా?'' అన్నాడు వెంకటపతి.

''అక్కణ్నుంచే వస్తున్నాను. హార్టుస్పెషలిస్ట్ భుజంగరావుగారికి చూపించమన్నది. ఫోటో తీయాలంట.''

''ఏంటీ? గుండెజబ్బని చెప్పిందా?'' వెంకటపతి బెంబేలుపడిపోయాడు.

''నా బిడ్డ అదృష్టం! అసలు రాత్రే పోవాల్సింది.''

''ఛ! అయ్యేం మాటలు? ఊరుకో!'' వెంకటపతి గొంతు పూడిపోయింది. రాత్రి తన తొందరపాటువల్లే వరూథిని ఇలా అయిపోయింది. ఇంకా నయం! ఆ కోపంలో దాన్ని వంగదీసి బాదలేదు. అలా జరిగుంటే తన చేతుల్లోనే పోయేది.

వెంకటపతి భార్యను లేవదీసి మెల్లగా మంచం దగ్గరకు తీసుకెళ్ళిపడుకోబెట్టాడు. కొడుకు నెత్తుకొని గుండెలకు హత్తుకుని కళ్ళనీళ్ళ పర్యంతం అయాడు.

''ఛ! అదేమిటండీ? ఇప్పుడు నాకేమయిందని అలా అయిపోతారూ? ఏదీ, బాబును ఒక్కసారి ఇవ్వండి!'' అన్నది వరూథిని భర్తకు ధైర్యం చెబుతూ.

సాయంకాలం రామనాథబాబు వచ్చాడు. భుజాలమీద కొడుకుని ఆడిస్తోన్న వెంకటపతిని చూసి ''ఏదీ, ఎక్కడా?'' అని అడిగాడు.

'వంట్లో బాగాలేదు. రాత్రి గుండెల్లో నొప్పి వచ్చింది. పెద్ద డాక్టరుగారికి చూపించమన్నది డాక్టరమ్మ. ఆ పెద్దడాక్టరుగారి దగ్గరకు వెళ్దామంటే కదలటం లేదు. రేపు వెళ్ళొచ్చులే అంటుంది.'' అంటూ చెప్పుకుపోతున్నాడు వెంకటపతి.

రామనాథబాబు కంగారుపడిపోయాడు. ''నువ్వు మనిషివేనా? అసలు

మగాడివేనా?" అని అనలేదుకాని అన్నట్టే చూశాడు రామనాథబాబు వెంకటపతి వైపు.

"వరూథిని వద్దంటేమాత్రం మీరెలా ఊరుకున్నారు? గుండెల్లో నొప్పి అంటే అశ్రద్ధ చేయకూడదు. హార్టు స్పెషలిస్ట్ భుజంగరావు నాకు చాలా దగ్గిర స్నేహితుడు. ఆమెగార్ని బయలుదేరమనండి. ఇప్పుడే కార్లో తీసుకెళ్ళి చూపించి వద్దాం." రామనాథబాబుకు కృతజ్ఞతలు ఎలా చెప్పుకోవాలో వెంకటపతికి తెలియలేదు. అతనికి గుండెలమీదనుంచి ఏదో పెద్ద బరువు దించినట్లయింది.

"రండి! లోపల పడుకొని వుంది. మీరు చెప్తేనన్నా వింటుందేమో!" రామనాథబాబును పడకగదిలోకి తీసుకెళ్ళాడు వెంకటపతి.

రామనాథబాబును చూసి గభాల్ను లేవబోయి నీరసంగా చూసింది వరూథిని.

"మీరు లేవకండి. భుజంగరావు అయిదు దాటితే వుండడు. విజిట్స్‌కు వెళ్తాడు. త్వరగా వెళ్తే దొరుకుతాడు"అన్నాడు రామనాథబాబు.

వెంకటపతి బలవంతంమీద వరూథిని చీర మార్చుకొని తయారయింది.

"కమల ఎక్కడా? ఇంకా రాలేదా?" అన్నది భర్తతో. వెంకటపతి కొడుకుని ఎత్తుకొని తాళం వెతుకుతుండగా మళ్ళీ అన్నది - "బాబెందుకూ ఆస్పత్రికి? వాడికి ఇంకా పాలు పట్టలేదు."

ఒక్క క్షణం ఆగి రామనాథబాబుతో "ఏమండీ? ఓ అరగంట ఆగితే పనిపిల్ల వస్తుంది. అది వచ్చాక బాబును దానికిచ్చి వెళ్ళొచ్చుగా?" అన్నది.

రామనాథబాబు గడియారం చూసుకొన్నాడు. "అప్పటిదాకా ఉంటాడో లేదో?" అన్నాడు.

"ఎందుకూ ఆలస్యం? మళ్ళీ డాక్టరుగారు వెళ్ళిపోతే ఇబ్బంది కదా? బాబును పెట్టుకొని నేను ఇంట్లో వుంటా. మీరెళ్ళిరండి" అన్నాడు వెంకటపతి.

వరూథిని వెళ్ళి కార్లో కూర్చుంది. రామనాథబాబు కారు స్టార్టు చేశాడు. ఇంటిముందు నుంచి కారు కదిలిపోతుంటే వరూథిని భర్తతో "బాబుకు పాలలో పంచదార తక్కువ వెయ్యండి." అని లేని ఓపిక తెచ్చుకొని పురమాయించింది.

రాత్రి తొమ్మిదయినా వరూథిని తిరిగి రాలేదు. వెంకటపతికి మతిపోయినట్టయింది. ఇంట్లోకీ వీధిలోకీ అదుర్దాగా తిరిగాడు. వరూథినికి ఎలావుందో? మరో జబ్బు మరో జబ్బు కాదాయె? గుండెజబ్బు! డాక్టరేమన్నాడో? తనూ వెళ్తే బాగుండేదేమో? తను వెళ్ళి మాత్రం చేసేదేముందిలే! రామనాథబాబు అన్నీ చూసుకుంటాడు. ఆ డాక్టరు ఆయన స్నేహితుడుకూడానాయె! ఏదన్నా అయితే ఆయన తనకు కబురు పెట్టడా?

గుండె జబ్బు వున్న వాళ్ళు మాట్లాడుతూ మాట్లాడుతూనే పోతారన్న సంగతి గుర్తొచ్చి, వెంకటపతి గాబరాపడిపోయాడు. భుజానవున్న రవికిరణ్ నిదకుపడి జోగుతున్నాడు. కొడుకుని పడుకోబెట్టి వెంకటపతి వీధిగుమ్మంలోకి వచ్చి నిలబడ్డాడు. డాక్టర్ భుజంగంగారి ఆసుపత్రి ఎక్కడో? గాంధీపార్కు దగ్గర్లోనా? అక్కడున్న

డాక్టరుపేరు అది కాదనుకుంటావేం? పోనీ, సినిమాహాలు దగ్గరకెళ్ళి అడిగితే మరి అక్కడ రామనాథబాబు ఉండడుగా?

వెంకటపతి వీధిగుమ్మం మెట్లుదిగి వీధిలోకి వస్తుండగా కారు హారన్ విన్పించింది. కారు హెడ్‌లైట్స్ కాంతికి కళ్ళు చిడతలారాయి. మరుక్షణంలో కారొచ్చి వాకిట్లో ఆగింది. వరూథిని మందులూ, టానిక్కు బాటిల్స్ పట్టుకొని ముందు సీట్లోనుంచి కారు దిగింది. రామనాథబాబు ఇంజన్ ఆపి కారు దిగాడు, వెనక డోర్ తెరచి పళ్ళబుట్ట పట్టుకొని వరూథిని వెనకే నడిచాడు.

''అలా చూస్తూ నిలబడితారేం?'' గుమ్మం ఎక్కుతూ భర్తను ఉద్దేశించి అన్నది.

''డాక్టరుగారు ఏమన్నారు?'' ఆదుర్దాగా అడిగాడు భర్త.

''ముందా బుట్ట తీసుకోండి. మీ రొకరూ?'' చిరుకోపంతో అన్నది వరూథిని.

వెంకటపతి రామనాథబాబు చేతిలో వున్న బుట్టను అందుకోబోయాడు.

''ఫర్వాలేదు. ఎవరు తెస్తేనేం?'' అంటూనే పళ్ళబుట్టను అందించాడు వెంకటపతికి.

వరూథిని మందులూ, టానిక్కులూ టీపాయ్ మీదవుంచి సోఫాలో జారగిలబడింది. రామనాథబాబు టానిక్కుల సీసాల మూతలు తీసి పెట్టాడు.

''ఇదిగో, ఇది అన్నం తినకముందు రోజూ రెండుసార్లు. ఇదేమో ఉదయం లేవగానే, రాత్రి పడుకోబోయేప్పుడు రెండు చెంచాలు తేనెతో కలిపి తీసుకోవాలి. యీ ఎర్రబిళ్ళలు రోజుకు ఆరు. రెండేసి- మూడుసార్లు. వారం గడిచాక ఇదిగో యీ బాటిల్‌లోది వాడాలి. తర్వాత పోతే...'' రామనాథబాబుకు అడ్డొచ్చి ''మీ రుణం ఎలా తీర్చుకోవాలో అర్థం కావడంలేదు'' అన్నది వరూథిని అతని కళ్ళల్లోకి చూస్తూ.

''అవేం మాటలు, పరాయివాళ్ళతో అన్నట్టు?'' అన్నాడు రామనాథబాబు.

వెంకటపతికి కూడా వరూథిని ధోరణి నచ్చలేదు. అయితే ఏమనాలో బుర్రకు తట్టలేదు.

''ఈ రోజుల్లో సొంతవాళ్ళే చూడంలేదు. మీరు...'' ఏదో అనబోయి ఆగి ''మా అదృష్టం'' అన్నది వరూథిని.

## 20

రెండేళ్ళ క్రితం భర్తతో బస్తీకి వచ్చిన వరూథిని బస్తీలోనే స్థిరపడిపోయింది.

ఈ రెండేళ్ళల్లో తండ్రి చనిపోయినప్పుడు మాత్రం తన ఊరికి వెళ్ళి దినం అయిందాకా వుండి వచ్చింది. మళ్ళీ ఆమె ఆ ఊళ్ళో కాలు పెట్టలేదు. వెంకటపతి మాత్రం నెల రెండు నెలలకు వచ్చి పోతున్నాడు. వ్యవసాయ తరుణంలో వారం పదిరోజులపాటు ఉండి వెళ్ళేవాడు. వెంకటపతికి బస్తీనీళ్ళు వంటబట్టినై. కొన్న స్థలంలో సినిమాహాలు కట్టే ఆలోచన వెంకటపతి నరనరానికీ ఎక్కించింది వరూథిని. ఆరునెలల క్రితం తండ్రితో చెప్పాడు.

'కట్టుకో! నన్నడుగుతావెందుకు?' అన్నాడు సాంబయ్య.

అప్పట్లో అంతకంటే ఏమీ మాట్లాడలేకపోయాడు వెంకటపతి. ఆ యేడు, నీళ్ళు పెట్టి పొలాలకు దమ్ముచేసి నాట్లు వెయ్యవలసిన తరుణంలో వెంకటపతిని వెళ్ళకుండా బస్తీలోనే ఆపుచేసింది భార్య. కొడుకుకోసం ఎదురు చూసిన సాంబయ్య నిరాశ చెందాడు. మనిషిచేత కబురుపెట్టాడు. అయినా వెంకటపతి రాలేదు. కొడుకు మీది కోపంతో పొలం దమ్ము చేయించకుండా నాలుగు రోజులు ఇంట్లోనే వుండిపోయాడు. ఊళ్ళో పొలాలన్నీ నాట్లు పడ్డాయి. సాంబయ్య పొలం బీడుపడివుంది. ఇంకా నాలుగు రోజులుపోతే నారు దొరకదు. చింతడూ, రాముడూ, బిచ్చాలూ ఒకటే గోల పెడ్తున్నారు. సాంబయ్య బింకంగా కూర్చున్నాడు. పొలం నాటు పడలేదనీ, ఆ ఏడు వచ్చే ఆదాయం కూడా రాదనీ తెలిస్తేనయినా కొడుకు వస్తాడని ఆశించాడు. అయినా వెంకటపతి రాలేదు. వాడి పెళ్ళాం వాణ్ని రానివ్వదు. వాడు రాడు! ఈ ఏడు డెబ్బై ఎకరాల సుక్షేత్రం వంటి మాగాణి బీడుపడుతుంది. సాంబయ్య గుండెలు విచ్చిపోయాయి.

ఒకరోజు మునిమాపువేళ వెంకటయ్యా, రెడ్డెమ్మా వచ్చి సాంబయ్యను కలిసి చెప్పారు:

"వెంకటపతిగారు పొలం ఈ ఏడు కౌలుకు చేసుకోమన్నారు. మీతో చెప్పి చేలో దిగుదాం అని వచ్చాం!"

సాంబయ్య పడగవిప్పిన పాములా బుసకొట్టాడు.

"వాడెవడూ పొలం మగతాకు ఇవ్వటానికి? నా పొలంలో ఎవరు కాలు పెట్టినా నేను ఊరుకొనేది లేదు."

"మీరూ చెయ్యకా మమ్మల్నీ చెయ్యనియ్యకా పొలం బీడు పెడ్తే ఏమొస్తుందండీ? ఎకరానికి పదమూడు కాటాబస్తాలు ఇస్తాంగా?"

"బీడు పెట్టుకుంటానో మురగబెట్టుకుంటానో అది నా యిష్టం. ఇక మీరు వెళ్ళండి."

"మరి మీ అబ్బాయి మాకిచ్చాడు. ఖర్చులు కోసం పైకం కూడా సంతన చేసుకొన్నాక మీరిట్లా మాట్లాడితే ఎట్లా సాంబయ్యగారూ?"

"ఇవ్వడానికి వాడెవడూ? తీసుకోవడానికి మీరెవళ్ళూ?"

"మీరెంత హక్కుదారులో మీ కుమారుడూ అంత హక్కుదారుడేగా?" అన్నాడు రెడ్డెమ్మ పట్టుదల చూపిస్తూ.

"ఓహో! అంతదాకా వచ్చిందా వ్యవహారం? బుద్ధిలేని మాటలు మాట్లాడక వెళ్ళండి." విసురుగా అన్నాడు సాంబయ్య.

"సాంబయ్యగారూ, ఇందులో మా తప్పు ఏముందండీ? కనకయ్యగారు చెబితే మొన్న బస్తీకి వెళ్ళి వెంకటపతిని కలిశాం. ఆరిముందే మీ కోడలుగారు చెప్పారు." వెంకటయ్య తగ్గి మెత్తగా మాట్లాడటం మొదలుపెట్టాడు.

"ఏం చెప్పిందేమిటి?"

''వెంకటపతిగారికి బస్తీలో చాలా పనులున్నాయనీ, ఇంక ఊళ్ళోకి వచ్చి వ్యవసాయం చేసే తీరిక ఉండదనీ, మీకేమో పొలం చేసే ఓపిక లేదనీ అమ్మాయిగారు చెప్పారు. పెద్దవారు మీతో ఓ మాట చెప్పి చేలో దిగుదామని వచ్చాం.''

''బోడిముండ! దాని పెత్తనం ఏందయ్యా?'' ఖాండ్రించి ఊసి అన్నాడు సాంబయ్య.

''మీ కుమార్డు వెంకటపతిగారే ఒప్పుకున్నారు. ఆయనకు ఆ హక్కు లేదా?'' మొండిగా అన్నాడు రెడ్డెమ్మ.

''మళ్ళీ ఆ కూత కూశావంటే పళ్ళు రాలగొడ్తా! పొలం అంతా నా సొంతం. యీ ఆస్తంతా నా స్వార్జితం. కొడుకూ కోడలూ ఎవరికీ చిల్లికాని హక్కులేదు!'' రౌద్రమూర్తిగా మారిన సాంబయ్య అన్నాడు.

రెడ్డెమ్మ తెల్లమొహంవేసి వెంకటయ్యకేసి చూశాడు.

''తమకిష్టం లేకపోతే మే మెందుకు తమ పొలంలో దిగుతాం సాంబయ్య గారూ! ఏదో! పొలం బీడుపడిపోతుంటే చూడలేక వచ్చాం!'' అంటూ వెంకటయ్య పంచ దులుపుకొని రెడ్డెమ్మను చూసి అన్నాడు ''పదవయ్యా పోదాం! తండ్రీ కొడుకుల మధ్య మనకెందుకూ?''

వెంకటయ్యా, రెడ్డెమ్మా వెళ్ళాక సాంబయ్య ఆలోచనలో పడ్డాడు -

''అది ఎంతకు తెగించిందీ? వీడు - వీడసలు మొగాడేనా?'' వెంకటపతిని గురించిన ఆలోచనలు, సాంబయ్య మనసును తొలిచివేశాయి.

రాత్రంతా సాంబయ్యకు ఎండి నెర్రెలు కొట్టిన నేల కళ్ళల్లో తిరిగింది. గంపెడు చీకటి వుండగానే సాంబయ్య మాలపల్లి వెళ్ళి కూలీలను లేవగొట్టాడు. మొత్తం డెబ్భై ఎకరాల మాగాణి మూడు రోజుల్లో నాట్లువేయించాడు.

రేగడి భూమిలోనుంచి, వరద నీటి మీదగా లేచి నిలబడటానికి ప్రయత్నిస్తున్న ముదురాకు పచ్చ వరిచేనును, కనుచూపు మేరగా వున్న పొలం గట్లమీద నిలబడి చూసుకొన్నాక సాంబయ్య గుండెల్లోని ఆవేదన చల్లారింది.

కలుపు తీసే రోజుల్లో వెంకటపతి కనకయ్య పంపిన ఓ వ్యక్తిని వెంటబెట్టుకొని వచ్చాడు. కనకయ్య కొడుకు బావమర్దికి తగు సలహాలు ఇచ్చి వెంకటపతితో పంపించాడు. సాంబయ్య ఆ వచ్చిన వ్యక్తి ఎవరా అన్నట్టు పరిశీలించి చూశాడు.

''గాంధీ చౌకులో లక్ష్మీకాంత్ ఎంపోరియమ్ వుంది చూడండి. అది మాదే!'' అన్నాడు సుబ్బారావు.

''ఆహా!'' అయితే ఏమంటావన్నట్టు చూశాడు సాంబయ్య.

''మాకు హోల్‌సేల్ బట్టల వర్తకం కూడా వుంది.''

''అట్టగా! మంచిదే!'' ఖాండ్రించి పక్కకు ఊసి చుట్టకొసలు మునిపళ్ళతో కొరుకుతూ అన్నాడు, సాంబయ్య.

వెంకటపతి ఏదో పని వున్నట్లు లేచి గొడ్ల సావిట్లోకి వెళ్ళాడు.

''మావాడేమన్నా బట్టల తాలూకు బాకీ వున్నాడా?'' సూటిగా అడిగాడు సాంబయ్య.

''అంత చిన్న బాకీ అయితే ఇంత దూరం వస్తావా?'' నవ్వుతూ అన్నాడు సుబ్బారావు.

సాంబయ్య మళ్ళీ అడుగుతాడని ఎదురుచూశాడు. కాని మాట్లాడకుండా చుట్ట ముట్టించుకోసాగాడు. కంచెమీద కూర్చున్నట్లు కదిలాడు సుబ్బారావు.

''చుట్ట అలవాటుందా?''

''చుట్టా, బీడీలాంటి అలవాట్లు ఏమీలేవు నాకు. కాఫీ అలవాటు కూడా లేదు.''

''ఎట్లా! చెడ్డ అలవాట్లు ఏమీ లేవన్నమాట?'' నువ్వు చాలా బుద్ధిమంతుడిలా వున్నావే అన్నట్టు చూశాడు సాంబయ్య. సుబ్బారావు కితకిత లాడిపోయాడు. అట్లా చూస్తుండగానే సాంబయ్య లేచి పొలం వెళ్ళిపోతాడేమోనని భయం పట్టుకుంది సుబ్బారావుకు. గొంతులో కొట్టుకాడుతున్నదాన్ని వెళ్ళగక్కాడు.

''నోటు చెల్లు వేస్తారేమోనని వచ్చాను.''

''ఏ నోటూ?'' సాంబయ్య ముఖం చిట్లించుకొంటూ అన్నాడు.

''మన వెంకటపతిగారిదే. సంవత్సరం దాటింది. ఆరునెలలకే ఇస్తానని తీసుకొన్నారు. ఇప్పుడు డబ్బు చాలా అవసరంగా వుంది.''

సాంబయ్య ఊకొట్టనుకూడా లేదు. అయినా సుబ్బారావే చెప్పుకుపోసాగాడు.

''అసలు ముప్పైవేలు. రూపాయి పావలా వడ్డీ. నాలుగు వేల ఐదువందలదాకా వడ్డీ అయింది. వడ్డీతో కలిపి మొత్తం ముప్పై ఐదువేలకి నోటు తిరగరాస్తానంటున్నారు. కాని మాకు డబ్బు అవసరం. ఏభైవేల కిమ్మత్తు సరుకు తెప్పిస్తున్నాం.''

''అయితే నన్నేం చేయమంటావ్?'' తీవ్రంగా చూస్తూ అడిగాడు సాంబయ్య.

''మీరలా మాట్లాట్టం ఏం బాగుంది? దావా తేవటం ఇష్టంలేకనే ఇంతగా చెప్పటం''.

''ఎవర్ని బెదిరిస్తావ్? దావా వేసుకోవయ్యా! సినిమాహాలు కట్టడంకోసమేగా అప్పు తెచ్చాడు. దావా వేసి, ఆ స్థలం వేలం వేయించి మీకు రావాల్సింది రాబట్టుకోండి.''

''ఆ స్థలం వెంకటపతిగారి భార్యది. మా డబ్బెట్లా వసూలవుతుంది?''

''మొగుడ్ని జైలుకే పంపుతుందో, స్థలం అమ్మి బాకీయే తీరుస్తుందో ఆవిడ్నే అడగండి. మధ్య నా దగ్గర కొస్తారెందుకూ?''

''వెంకటపతిగారి ఆస్తిపాస్తులు ఇక్కడున్నాయి, అందుకని.''

''వాడిదేం లేదిక్కడ. అంతా నా స్వార్జితం. నాకు మా తండ్రి ఇచ్చింది - పిత్రార్జితం రెండెకరాలే వచ్చింది. ఇదంతా నా కష్టార్జితం. భాగం పంచుకొంటే వాడికొచ్చేది తాత ఆస్తిలో సగమే. ఎకరం పొలం, వాములదొడ్డి వున్న స్థలంలో సగం - ఐదు సెంట్ల నేల - అంతే! దావావేసి కట్టుకో. నాకేమీ అభ్యంతరం లేదు.''

''అయితే మీ కన్నకొడుకుని జైలుకు పంపుతారా?''

''ఒకళ్ళు పంపేదేమిటి? పోయే రోజు వస్తే వాడే పోతాడు. ఒకళ్ళు ఆపితే

మాత్రం ఆగుతాడా?" సాంబయ్యకు గుండెలు అవిసిపోయినై. మాటకు మాట అంటున్నాడేగాని కడుపులో రంపం పెట్టి కోసినట్టుగా వుంది.

"అంతా ఆయనే సంపాదించినట్టు మాట్టాడతాడేమిటి? నా ఊహ తెలిసిందగ్గరనుంచీ నేనూ కష్టపడ్డాను. అందులో సగం నాకూ వుంది!" వెంకటపతి తండ్రిని ఉద్దేశించి సుబ్బారావుతో అన్నాడు.

కొడుకు తనవెనకే వచ్చి నిలబడింది అంతవరకూ సాంబయ్య గమనించలేదు.

"వాడి సంపాదన వాడికి ఇదివరకే ముట్టింది. పెళ్ళికి పదిహేను వేలదాకా ఖర్చు పెట్టాను. ఈ రెండేళ్ళలో ఎప్పుడన్నా కానియ్ - ఇరవై వేలకు పైగా తీసుకెళ్ళాడు. దానికి అది సరిపోయింది. మళ్ళీ మాట్లాడితే నాకే ఋణపడి వున్నాడు. రెండేళ్ళ పంటా వాడే తీసుకున్నాడు. నాకూ వాడికీ ఈ నాటితో రుణం తీరింది. వాడు నా కొడుకేకాదు. నువ్వేం చేసుకుంటావో చేసుకో!" సాంబయ్య విసురుగా లేచాడు. కర్ర తీసుకుని పొలం వెళ్ళిపోయాడు.

సుబ్బారావు ఏడుపుముఖంవేసి వెంకటపతికేసి చూశాడు.

"కనకయ్యను తొందరపడొద్దని చెప్పు. రెండు రోజుల్లోనే వస్తాను. ఆయన బాకీ పరిష్కారం చేస్తాను. నాలుగు రోజులు ఆగమనండి." సుబ్బారావు సమాధానం కోసమైనా చూడకుండా వెంకటపతి లోపలకెళ్ళాడు.

సుబ్బారావు కాళ్ళీడ్చుకుంటూ కనకయ్యదగ్గరకు బయలుదేరాడు - జరిగిందంతా ఎలా చెప్పాలో మననం చేసుకొంటూ.

## 21

"తొందరగా కానియ్, కారొచ్చింది!" ఇంటి ముందుకొచ్చి ఆగిన కారును చూసి వెంకటపతి అన్నాడు.

"ఆఁ! అయిపోయింది, వచ్చేస్తున్నా!" నిలువుటద్దం ముందు నిలబడి, అజంతా స్టయిల్లో చుట్టుకున్న ముడిలో మల్లెలమాల తురుముకుంటూ అన్నది వరూథిని. ఆ తర్వాత చీర మార్చుకుని కుచ్చిళ్ళు సర్దుకుని, తిరిగి తిరిగి చూసుకొంది. పెదవి విరిచి, కట్టుకున్న చీరవిప్పి, మరో చీర కట్టుకుంది. అద్దంలో ఎగాదిగా చూసుకొని "ఈ చీరకు ఈ బ్లౌజ్ మాచ్ అయిందా?" అంటూ భర్త వున్న గదిలోకి వచ్చింది. ఎదురు తెన్నులు చూస్తున్న వెంకటపతిని చూసి "అయ్యో రాత! నీకామాత్రం తెలిస్తే ఇంకేం కావాలి?" అని మనసులోనే అనుకొని మళ్ళీ గిరున వెనక్కుతిరిగి గదిలోకి నడిచింది. బీరువాలో వున్న బ్లౌజులన్నీ వరుసగా ఏరి వెతికి లేత గులాబి వన్నె బ్లౌజు బయటికి తీసింది.

బ్లౌజు వేసుకుని మరోసారి పవిట సర్దుకొని అద్దం ముందు నిలబడి ప్రతిరూపాన్ని మనసారా చూసుకుంది. జగదేకసుందరి - ఇంకా ఎలాగో కన్పించింది తన ప్రతిబింబం వరూథినికి. ఆమె పెదవులపై హాసరేఖలు వాన వెలసిన నాటి సాయంకాలం నీరెండలో మబ్బుల అంచుల్లా మెరిశాయి. విశాలమైన ఆమె కనురెప్పలు మెరుపుల్లా

క్షణకాలం లేచి తృళ్ళిపడ్డాయి. ఆమె హృదయం రాగరంజితమైంది. వళ్ళు పులకరించిపోయింది. బయట వరండాలో నిలబడ్డ భర్త పిలుపు ''ఏమిటి ఇంకా ఆలస్యం?'' ఉరుములా - కఠినంగా ధ్వనించింది.

''ఇదిగో వచ్చేశా!'' వరూథిని గదిలోనుంచి బయటకు వచ్చింది. వెంకటపతికి వరూథిని తన భార్యలా అనిపించలేదు. ఏ సినిమాలోనో చూసిన దేవకన్యగానో, నాగకన్యగానో అనిపించింది.

''ఆలస్యం అయిపోయింది గదూ రసూల్? మీ అయ్యగారికి కోపం రాదుకదా?'' కారు స్టార్టు చేస్తున్న డ్రైవర్ను ఉద్దేశించి అన్నది వరూథిని.

అయ్యగారి సంగతేమోగాని వాడికి మాత్రం కోపం వచ్చినట్టే ముఖంపెట్టి, కారు అదిరిపాటుగా తోలడం మొదలుపెట్టాడు. జనరల్ బజారూ, బస్‌స్టాండూ దాటి సినిమాహాలు ముందుకొచ్చి కారాగింది. రెండో ఆటకు టికెట్స్ దొరకని జనం గోడలమీద పోస్టర్లు చూస్తూ నిలబడ్డారు. హాలుముందు నిలబడ్డ రామనాథబాబు వచ్చి ముందు డ్రైవర్ ప్రక్కన కూర్చున్నాడు. కారు సాగింది.

''ఆలస్యం అయిపోయింది కదూ?'' మృదుమధురంగా సాగదీస్తూ అన్నది వరూథిని.

''రోజూ ఇదే టైంగా? రెండో ఆట మొదలు పెట్టాకనే నేను వెళ్ళేది. ఆ తర్వాతే భోజనం చేసేది. మీకే ఆలస్యం అయిందనుకుంటాను'' అన్నాడు రామనాథబాబు.

''నా సంగతెలావున్నా, మా వారికి మాత్రం ఆలస్యమైనట్టే! ఎనిమిదయ్యేసరికి భోంచెయ్యాల్సిందే వారు!''

''చేసిన ఆలస్యం అంతా నువ్వేచేసి ఆయనగార్నంటావేం?'' ఆకలితో నకనకలాడిపోతున్న వెంకటపతి అన్నాడు.

''అయ్యో, నేను కాదన్నానా! ఆలస్యం అంతా నాదేనని చెప్తున్నాకదండీ!'' అంది వరూథిని రాని నవ్వును తెచ్చుకొంటూ.

''ఏమిటీ? వెంకటపతిగారికి ఎనిమిదింటికే భోజనం చేసే అలవాటా? ఆ సంగతి తెలిస్తే ముందే ఏర్పాటు చేయించేవాడ్నికదా?'' అన్నాడు రామనాథబాబు. కారు హెడ్‌లైట్ వెలుగు ముందుపోతున్న జట్కాలో ఉన్నవాళ్ళ మీదపడుతుంటే - అందులోవున్న వాళ్ళకేసి కన్నార్పకుండా చూస్తూ.

''ఇంకా నయంగదూ? పల్లెటూళ్ళో వున్నప్పుడు ఊరు పొద్దుకూకకుండానే తినేవారు. ఈపాటికి ఒక నిద్దరకూడా తీసేవారు.'' ఈసారి వరూథిని వస్తోన్న నవ్వు ఆపుకొంటూ అన్నది. ముందున్న జట్కాను కారు దాటేసింతర్వాత రామనాథబాబు కూడా వరూథిని మాటలకు నవ్వాడు.

రామనాథబాబు ఇంటిముందు కారాగింది.

చుట్టూ ప్రహరీ. అందమైన గేటు, గేటు ప్రక్కన ప్రహరీ గోడ మీద అతికివున్న చలవరాతి ఫలకమీద 'శ్రీ నిలయం' అనీ, రెండో పక్కన 'రామనాథబాబు' అనీ రాసి వుంది. మాలి వచ్చి గేటు తెరిచాడు. కారు పూలచెట్ల మధ్యనున్న బాటమీదగా

వచ్చి, విశాలమైన మెట్లముందు ఆగింది. రామనాథబాబు దిగి కారు డోరు తెరిచాడు. పున్నమి వెన్నెల. ఇంటిముందు 'నైట్‌క్వీన్' మత్తును వెదజల్లుతోంది. సువిశాలంగా వున్న ఆవరణలో గున్నమామిడి, నందివర్ధనం, మందారం, సన్నజాజి పందిరీ, పుచ్చపువ్వులాంటి వెన్నెలా, చల్లని గాలీ వరూథిన్ని ఆహ్వానించాయి. వెంకటపతికి వరికంకులు పాలు పోసుకొనే తరుణంలో, పొలాన గనెంనరికి చేనుకు నీళ్ళు పెట్టేనాటి రాత్రి అనుభూతులు గుర్తొచ్చాయి.

రామనాథబాబు వరూథిన్నీ, వెంకటపతినీ తీసుకొొచ్చి డ్రాయింగ్ రూంలో కూర్చోబెట్టాడు. సోఫాలో కూర్చున్న వెంకటపతికి తమ ఇంట్లో వున్నవాటికంటే ఇవే బాగున్నట్లు అనిపించింది.

రామనాథబాబు 'నాయర్' అంటూ కేకవేశాడు. నాయర్ వచ్చి చేతులు కట్టుకుని నిలబడ్డాడు.

''వాళ్ళింకా రాలేదా?''

''డి.యస్.పి. అర్జంటుగా క్యాంప్‌కెళ్ళాల్సి వచ్చిందట. వాళ్ళ కానిస్టేబుల్ వచ్చి చెప్పి వెళ్ళాడు.''

''ఏం, అంత కొంపలంటుకుపోయే కేసా! భోజనం చేసి వెళ్ళి ఉండొచ్చుగా?'' రామనాథబాబు చిరాగ్గా అన్నాడు.

''ఎస్పీగారు వచ్చారట. ఇద్దరూ కలిసి వెంటనే వెళ్ళాల్సి వచ్చిందట!'' నాయర్ నీళ్ళు నములుతున్నట్టుగా అన్నాడు.

''ఓహో! హోం మినిస్టర్ మన జిల్లాలో టూర్ చేస్తున్నాడుగా?'' నొసలు విరిచి సాలోచనగా అన్నాడు రామనాథబాబు.

వరూథిని కళ్ళు మెరిశాయి. వెంకటపతి బుర్ర గోక్కుంటూ చూశాడు.

''మంత్రిగారు మన జిల్లాలో మకాం వేశారంటే మన డి.యస్.పి. గారంటే మంత్రిగారికి చాలా ఇష్టం. ఆయనే ప్రొమోషన్ కూడా ఇప్పించారు. సర్కిల్ ఇన్‌స్పెక్టర్నుంచి ప్రమోషన్ ఇచ్చి కూడా మన ఏరియాలోనే వుంచారంటే మంత్రిగారు కావాలని పట్టుబట్టి చేయించారు. అందుకు నేనే కారణం అనుకోండి.''

''మంత్రిగారు మీకు చుట్టమా?'' అమాయకంగా అడిగాడు వెంకటపతి.

''చుట్టంకంటే ఎక్కువే!'' అని తనలో తనే నవ్వుకొన్నాడు రామనాథబాబు.

''మీకు ఆయన బాగా స్నేహితుడన్నమాట! మాటమాత్రం అన్నా చెప్పలేదేమండీ?'' అన్నది వరూథిని రాగం తీస్తూ.

''అసలు ఆయన మంత్రి కావటానికి కారణం ఎవరంటారూ?'' ముసి ముసి నవ్వులు నవ్వుతూ ముఖం అంతా ఓ పెద్ద ప్రశ్నార్థకంగా పెట్టాడు రామనాథబాబు.

వరూథినికి ఆశ్చర్యంతోపాటు ఆనందం, గర్వం కూడా కలిగాయి. వెంకటపతి అయోమయంలో పడిపోయాడు. అంత పెద్ద మంత్రి పదవిని సినిమా హాలు రామనాథబాబు ఎలా ఇప్పించగలిగాడా అనే సందేహం పట్టుకుంది వెంకటపతికి.

''జిల్లాలో వున్న యం.ఎల్.ఏ.లలో ఏడుగురు మనవాళ్ళే. రిజర్వుడ్ సీట్లల్లో

గెలిచిన ముగ్గుర్లో ఇద్దరికి సీట్లు నేనే ఇప్పించాను. ఏ బాపతన్నా గానీ, వాళ్ళందరికీ లక్షన్నరపైగా ఎలక్షన్ ఫండ్ ఇచ్చాను."

"ఎట్టెట్టా? లక్షన్నరా! అంత డబ్బే?" వెంకటపతి నోరు వెళ్ళబెట్టాడు.

"వెంకటపతిగారూ, వీళ్ళంతా ప్రయోజకులు అనుకుంటున్నారా? వెనక మనలాటి వాళ్ళ అండదండలుంటేనే అంతవాళ్ళవుతున్నారు, తెలుసా?"

"అవును మరి!" అంది వరూథిని.

అంతే అయివుంటుందన్నట్టు తల ఆడించాడు వెంకటపతి.

కారు డ్రైవర్ ఒక కేసులో సోడాలు పట్టుకొని లోపలకు వెళ్ళాడు. ఎండాకాలం మధ్యాహ్నం తాగే సోడాలు ఈ చల్లటి రాత్రి ఎందుకో అర్ధంకాక వెంకటపతి ఆలోచనలో పడ్డాడు.

"అంతా రెడీ అయింది, వడ్డించమంటారా?" అడిగాడు నాయర్.

"ఇంకా డాక్టరుగారు రాలేదుగా?" అంది వరూథిని.

"ఆయనగారు ఊర్నించే రాలేదట. మొన్న ఈ ఉదయానికల్లా వస్తానని చెప్పాడు. అలా అంటేనే ఈ డిన్నర్ పెట్టుకొన్నాను. అసలు ఈ పార్టీ మన డి.యస్.పి. ప్రమోషన్ సందర్భంగా కదా ఇస్తుంది? ఆయనా రాలేదు! ఇప్పుడు వెంకటపతిగారే ముఖ్య అతిథి!" అంటూ వరూథినికేసి చూశాడు రామనాథబాబు. వెంకటపతికి ఆ జోక్ అర్థంకాలేదు.

"ఇదీ మంచిదేలెండి. అంతా ఓ ఫామిలీ మెంబర్సులా - మన పార్టీ...లేవండి వెంకటపతిగారూ!" అంటూ రామనాథబాబు డైనింగ్ రూంలోకి దారి తీశాడు. వరూథినీ్నీ, వెంకటపతినీ టేబుల్‌ముందు కూర్చోబెట్టి రామనాథబాబు పడక గదిలోకి వెళ్ళాడు.

నాయర్ ప్లేట్లు పెట్టి, అన్నం కూరలూ తెచ్చి టేబుల్‌మీద ఉంచాడు.

"ఈయన భార్యాపిల్లలూ కనబడరేం?" భార్యను అడిగాడు వెంకటపతి.

"ఆవిడా! ఎప్పుడూ పుట్టింట్లోనే వుంటుంది. కొడుకూ, కూతురూ తల్లి దగ్గరే వుంటారు." వరూథిని ఓ క్షణం ఆగి గొంతు చిన్నది చేసి, భర్త మీదకు వంగి "ఆయన భార్య బుద్ధికూడా మంచిది కాదట! వీళ్ళిద్దరికీ అంత మంచి సంబంధాలు కూడా లేవు. వీళ్ళ వ్యవహారం ఆమధ్య తెగతెంపులు చేసుకునేవరకూ వచ్చింది." అని చెప్పింది.

భార్య చెప్పింది బుర్రలో దూరి అర్ధం అయేసరికి వెంకటపతికి కొద్ది క్షణాలు పట్టింది. చిత్రహింస ఏదో తన కళ్ళముందు జరుగుతున్నట్టయిపోయాడు.

"ఏంటి అట్లా చూస్తారు? రామనాథబాబు భార్య మా పెద్దన్నయ్యను పెంచుకొన్నాయన మేనకోడలేగా? ఇది ఈనాటిదికాదు. మన పెళ్ళినాటికే దాని వ్యవహారం వీధిన పడింది! ఈయన పెద్ద మనిషి, పరువుగలవాడు కాబట్టి దాని ఆటలు సాగుతున్నాయి. మరోవాడైతేనా?" రామనాథబాబును చూసి ఆపేసింది వరూథిని.

మూడు పలకల సీసా ఒకటి చేత్తో పట్టుకొని రామనాథబాబు వచ్చి సీట్లో కూర్చున్నాడు.

"నాయర్! ఏమిటి? అప్పుడే వడ్డనా? ఆ సోడాలూ ఐసూ పట్టుకురా!" అన్నాడు రామనాథబాబు.

"ఆ సీసా చాలా అందంగా వుందే?" అన్నది సీసా కేసి కళ్ళార్పకుండా చూస్తూ వరూథిని.

"ఇందులోది ఇంకా బాగుంటుంది. ఫారెన్‌ది మరి!"

"ఛీ! పాడూ!" అంది వరూథిని వాంతి చేసుకోబోతున్నదానిలా ముఖంపెట్టి.

"అవునండీ! ఇది ఆరోగ్యానికి కూడా మంచిది. దేశవాళీ సరుకు కాదు. విదేశాల్నుంచి వచ్చింది. అక్కడయితే ఆడవాళ్ళుకూడా ఇదే పుచ్చుకుంటారు."

"ఎంతవుతుందీ సీసా?" అడిగాడు వెంకటపతి.

"నూటయాభై."

"నూటయాభై రూపాయలా?" నోరెళ్ళబెట్టాడు వెంకటపతి. "ఆ కాస్త సీసా నూటయాభయ్యా?" దిమ్మరపోయి మళ్ళీ సీసాకేసి చూస్తూ అన్నాడు వెంకటపతి.

రామనాథబాబు రెండు గ్లాసుల్లో పోసి, సోడా అయిసూ కలిపి ఓ గ్లాసు వెంకటపతి ముందు పెట్టాడు.

"నాకు అలవాటు లేదే!" ఇష్టమో అయిష్టమో వెంకటపతి ముఖం చూసి చెప్పడం కష్టమే!

"ఫరవాలేదు. ఏమీ చెయ్యదు. ఫారెన్‌ది కదా?"

"మీరు భలేవారండోయ్! మీరు చెడిపోయిందికాక మావార్ని కూడా-?" అంటూ రామనాథబాబు ముఖంలోకి ముద్దుగానో, మురిపెంగానో చూస్తూ ఆగిపోయింది.

"అంటే నేను చెడిపోయినవాడ్ని అన్నమాటేనా?" వరూథిని కళ్ళలోకి చూస్తూ అడిగాడు రామనాథబాబు. ఆయన మాటల్లో చేదుకంటే తీపే ఎక్కువ విన్పించింది.

"ఛ! ఛ! నేను అలా అన్లేదు. అలవాటు లేనిది ఆయనగారికి ఎందుకని?" అన్నది వరూథిని.

"కానీయండి వెంకటపతిగారూ! వరూథిని మాటలకేం? ఆడవాళ్ళు అలాగే అంటారు. మొగవాళ్ళు తాగి చెడిపోయారంటారు. తాగకుండా చెడిపోయిన ఆడవాళ్ళు లేరా?" అన్నాడు రామనాథబాబు వెంకటపతి గ్లాసు అందిస్తూ.

వెంకటపతి రామనాథబాబు ఆ మాటలు ఆయన భార్యను ఉద్దేశించే అన్నాడనుకొన్నాడు. 'అవును పాపం, రామనాథబాబు కేం తక్కువ? అట్లాంటి భర్తతో కాపురం చేయడానికి ఇష్టంలేని ఆడది ఎంత ఛండాలురాలై వుండాలి?'

"ఏమిటాలోచిస్తున్నారూ? ఊఁ!" రామనాథబాబు వెంకటపతి చేతిలోవున్న గ్లాసుకు గ్లాసు ఆనించి "టు యువర్ హెల్త్" అని గ్లాసు పెదవుల కందించాడు.

''అది మీ ఆరోగ్యం కోసమేనట!'' విరగబడి నవ్వుతూ అంది వరూధిని.

వెంకటపతికి రామనాథబాబు టోస్ట్ ప్రొపోజ్ చేయడంలోని ఆనందంగానీ, భార్య నవ్వుకు అర్థంగానీ బోధపడలేదు. రామనాథబాబు రెండు గుటకలేసి గ్లాసు కిందపెట్టి వెంకటపతికేసి చూశాడు. వెంకటపతి నోటిదగ్గిర పెట్టాల్సిన గ్లాసు బల్లమీద పెట్టాడు.

''ఒకసారి తాగితే అలవాటు అవుతుందంటారు. ఎందుకంటా నాకిది? మీలాంటివాళ్ళు – '' వెంకటపతి మాటకు అడ్డొచ్చి రామనాథబాబు ''గ్లాసు కలిపి, టోస్టు చెప్పాక అది ఖాళీ చెయ్యకుండా వుండకూడదు. ఈరోజు ముఖ్య అతిథి మీరే. మీరు తీసుకోకపోతే నాకు మనసు బాగుండదు. నేనూ మానెయ్యాల్సి వుంటుంది. ఈ సీసాలోది పారేయమంటారా? నాయర్! ఇలారా'' అన్నాడు. గ్లాసు ఎత్తి పారబోయటానికి సిద్ధం అయ్యాడు.

''పారబోస్తారా? సీసా మూటయూభైకి కొని? అంత ఖరీదయింది?'' వెంకటపతి గాబరా పడిపోతూ అన్నాడు.

''ఎంతయితేనేమండీ వెంకటపతిగారూ! మీరు వద్దంటే విసిరిపుచ్చుకొని సైడ్ కాలవలో పారబోస్తాను'' రెండు గుటకలకే రామనాథబాబు ఉద్రేకంలో పడినట్లు మాట్లాడసాగాడు.

''పోనియ్! పాపం వారంతగా అంటున్నారుగా, ఆ గ్లాసన్నా తీసుకోండి.'' రాజీ మార్గంగా భర్తను ప్రాధేయపడుతూ అన్నది వరూధిని.

గ్లాసు ఎత్తి పెదవుల దగ్గర పెడుతుంటే వెంకటపతికి చేతులు వణికాయి. ముక్కుకు వాసన ఘాటుగా తగిలింది. శ్వాస బిగించి గ్లాసు సగం ఖాళీచేసి కింద పెట్టాడు. గొంతు తిమ్మిరి తిమ్మిరి అయిపోయింది. చేదు విషం. అయినా, అమృతం కూడా ఇవ్వలేని ఏదో ఆనందం కలిగింది వెంకటపతికి. రామనాథబాబు ఉషారుగా బల్లమీద చిటికలు వేశాడు.

కోడి వేపుడు ప్లేటు వెంకటపతి ముందుకు తోసి ''ఈ ముక్క తినండి!'' అన్నాడు రామనాథబాబు. తను ఓ జాయింట్ తీసుకుని పళ్ళ కింద పెట్టికొరకటం మొదలుపెట్టాడు.

మరో పది నిమిషాల్లో వెంకటపతి కోడివేపుడు ప్లేటూ, గ్లాసూ ఖాళీ చేశాడు. రామనాథబాబు గ్లాసు సగంమాత్రమే ఖాళీ అయింది.

''అబ్బే ఏం లేదు. మా మా–మ్మూలుగానే ఉంది. మీ–మ్మీరు ఇంకా అట్లాగే వుంచారేం?'' అన్నాడు.

రామనాథబాబు తన గ్లాసు బలవంతాన ఖాళీ చేశాడు. సీసా మూత తీసి రెండు గ్లాసులూ ముందు పెట్టుకొని మళ్ళీ పోశాడు. రామనాథబాబు చేతిలో నుంచి గ్లాసు తీసుకొని సగం తాగేసి, గ్లాసు టేబిల్‌మీద పెట్టాడు వెంకటపతి.

భార్యవంక చూసి ''నువ్వెందుకే ఇక్కడ!'' అన్నాడు వెంకటపతి.

వరూధిని లేచి బయటకు వెళ్ళింది. తోటలోకి వెళ్ళి వెన్నెల్లో కాసేపు తిరిగింది.

ఓ గులాబిపువ్వు కోసి తల్లో తురుముకుంది. సన్నజాజి పందిరికిందా, నైట్ క్వీన్ గుబురుదగ్గర పచార్లు చేసింది. అర్ధగంట గడిచాక లోపలకు వచ్చింది.

"ఇంకా అవలా? ఇంకా ఎంత తాగుతారేంటి?" అంటూ వరూథిని డైనింగ్ రూంలోకి వచ్చింది.

అప్పటికే వెంకటపతి ముఖం నిగనిగలాడి పోతూంది. కళ్ళు ఎరుపులు తిరిగాయి. టేబిల్‌మీద ఖాళీసీసా వుంది. ఎదురుగా నిలబడ్డ వరూథిని వెంకటపతికి క్రొత్తగానూ వింతగానూ కన్పించింది. ఆమె అన్నమాటలేవో అస్పష్టంగా వినబడ్డాయి. రామనాథబాబు లేచి పడకగదిలోకి వెళ్ళి మరోసీసాతెచ్చి మూత తీశాడు.

"ఆ సీసా ఈ సీసా మాది - సీసా మాదిరిగా-సీసాలేదే?" అన్నాడు వెంకటపతి,

"సీసా మారిందిలే. లోపల్ది ఇంకా మంచిది. నిఖార్సయిందే!" అంటూ రామనాథబాబు వెంకటపతి గ్లాసు నింపుతూ వొలక పోశాడు.

వరూథిని సీసా రామనాథబాబు చేతుల్లో తీసుకొని భర్త గ్లాసు సగానికి పైగా నింపింది.

"అంత స్ట్రాంగా! పడిపోతాడు, పడిపోతాడు" అన్నాడు రామనాథబాబు.

"ఏం! ఏంపడ్ను! చూ-చూడు" అంటూ వెంకటపతి సోడా కలపకుండానే అమాతం గ్లాసు ఎత్తి తాగేశాడు. ఖాళీగ్లాసు టేబిల్‌మీద పెట్టబోతూ కింద వదిలేశాడు. కింద పడ్డ గ్లాసును వంగి తీయబోతూ, కుర్చీమీదనుంచి తూలి, డైనింగ్ టేబిల్ కింద పడ్డాడు వెంకటపతి. రామనాథబాబు నాయర్నుకేక వేశాడు. నాయరు వచ్చాడు. నాయరూ రామనాథబాబూ ఇద్దరూ కలిసి వెంకటపతిని లేవదీసి మళ్ళీ కుర్చీలో కూర్చోపెడుతుండగా బొళుక్కున నాయర్‌మీదా, రామనాథబాబు చొక్కా, చేతులమీదా కక్కేశాడు.

నాయర్ బకెట్‌తో నీళ్ళు తెస్తానని వంటగదిలోకి వెళ్ళాడు.

"ఛీ! ఛీ! ఏం మనిషి?" అన్నది వరూథిని ముక్కుకి పవిఁట అడ్డం పెట్టుకొని. కుర్చీలోనుంచి వెంకటపతి మళ్ళీ జారి కిందకు తూలాడు.

"ఇహ లాభంలేదు. మనిషి ఈ ప్రపంచంలో లేడు ఆ గదిలో పడుకో పెడ్తే సరి! రా! వరూథినీ!" అంటూ రామనాథబాబు వరూథిని చెయ్యిపట్టుకున్నాడు.

"ఇక్కడెందుకూ న్యూసెన్సు?" అంది వరూథిని, రామనాథబాబు మీదగా వంగి, కిందపడ్డ భర్త ముఖంలోకి చూస్తూ.

"అయితే ఏం చేద్దాం?" అడిగాడు రామనాథబాబు.

"కార్లోవేసి ఇంట్లో పారేసిరండి!" అంది ముక్తసరిగా వరూథిని.

నాయరూ, డ్రైవరూ వచ్చి వెంకటపతిని భుజాలమీద వేసుకొని కార్లోకి చేర్చారు. వెనక సీట్లో పడుకోబెట్టి నాయర్ వెళ్ళి డ్రైవర్ పక్కన కూర్చున్నాడు. డ్రైవర్ కారు స్టార్టు చేశాడు.

"నాయర్! అమ్మగారొచ్చేదాకా అక్కడే వుండు. వాళ్ళను దించి నువ్వొచ్చేయ్!"

డ్రైవర్‌ను చూసి అన్నాడు రామనాథబాబు. త్రాగిన మైకంలో వళ్ళు తెలియక పడివున్న వెంకటపతిని సాగనంపి రామనాథబాబు తిరిగి ఇంట్లోకి వచ్చాడు.

''ముందా బట్టలు మార్చి స్నానం చేసిరండి!'' రామనాథబాబు పడక గదిలో మంచం మీద కూర్చొని, బీరువా నిలువుటద్దంలో ప్రతిబింబాన్ని చూసుకొంటున్న వరూథిని అన్నది.

రామనాథబాబు స్నానం చేసి, బట్టలు మార్చుకొనేలోపున, వరూథిని పడకగదిలోనే టీపాయ్ తెచ్చి పెట్టింది. రెండు గ్లాసులు శుభ్రంగా కడిగి స్కాచ్ విస్కీ బాటిల్ మూత తెరిచి గ్లాసుల పక్కనే పెట్టింది. రెండు ప్లేట్లలో నాయర్ చేసిన వంటకాలన్నింటినీ పెట్టి, టీపాయ్‌మీద విస్కీబాటిల్ పక్కగా పెట్టింది. రామనాథబాబు స్నానం చేసి, సిల్కు లుంగీ కట్టుకొని, మెడమీదా, ఛాతీమీదా ఉరుకులాం రుద్దుకుంటూ గదిలోకి వచ్చాడు.

వరూథిని సోడా కలిపి విస్కీగ్లాసు రామనాథబాబు పెదవులకు అందించింది. అతను సిప్‌చేసి వరూథిని పెదవులకు గ్లాసు అందించాడు.

''భలేదానివి వరూథినీ! ఒక్కసారిగా అంతపోశావ్? మనిషి తల్లకిందులుగా పడిపోయాడు పాపం!''

''మీలా మెత్తగా మెల్లమెల్లగా గొయ్యి తవ్వటం నాచేతనవుతుందేమిటి?''

''ఆఁ!హా! మాటల్నేర్చావ్! నువ్వు పోసిన సీసాలోది ఏమిటో తెలుసా?''

''ఇంకా తెలిసేదేమిటి? కళ్ళారా దాని ఫలితంకూడా చూస్తే! అది మా ఆయనకోసమే తెచ్చి పెట్టి ఉంచారుకదూ? మీరెంత... అబ్బ.... వదలండీ!'' వరూథిని ముఖం పక్కకు తిప్పుకొని రామనాథబాబు చేతుల్లోంచి తప్పుకోవటానికి ప్రయత్నించింది.

''అదేమిటి? మావారిలాగే గ్లాసుగ్లాసే ఎత్తి నీటిగా గూటే - ఏ - గూటేస్తున్నారూ?'' వరూథిని ఎక్కిళ్ళు మొదలయి మాటలు తడబడసాగినై.

''మొగుడి చేత్తా-తా-గించిన దానివి-న-నన్ను మ్మాత్రం.''

''ఛ! ఛ! ఏం-ఏం-మాటలవి?'' వరూథిని రామనాథబాబు మెడచుట్టూ చేతులువేసి అతన్ని మళ్ళీ మాట్లాడనివ్వలేదు.

* * *

సినిమాహాలు నిర్మాణానికి ప్లాన్లు అన్నీ రడీ అయినై. ఓ మంచి రోజు చూసి హాలుకు పునాదులు వెయ్యాలనే ఆలోచనలో వున్న వరూథిని గోతిలో పడిపోయింది! వరూథిని కొన్న స్థలం లిటిగేషన్‌లో వున్న దత్తుడి ఆస్తి. రాజబాబు దత్తు చెల్లనేరదని హరిప్రసాద్ దావా తెచ్చాడు.

హరిప్రసాదు తాతకు ఇద్దరు కొడుకులు. పెద్దవాడి కొడుకు హరిప్రసాదు. చిన్నవాడికి పిల్లలు లేరు. భార్య బలవంతంమీద మరదలు కొడుకుని తెచ్చుకొని పెంచుకొన్నారు. అసలుపేరు రాజబాబు అయినా అప్పట్నుంచి దత్తుడిపేరే స్థిరపడిపోయింది. హరిప్రసాదు తండ్రి బ్రతికున్నంతకాలం పినతండ్రి ఆస్తిమీదకు

పోలేదు. ఆయన హరీ అనగానే పినతండ్రి దత్తపుత్రుడిమీద దావా తెచ్చాడు. దత్తుడు తన దత్తతను కోర్టులో రుజువు చేసుకోలేకపోయాడు. హరి దావాగెలిచి ముత్తాత ఆస్తికి యేకైక వారసుడయాడు. దత్తుడు పాపరయి వీధిలో పడ్డాడు. వరూథినికి గుండెదడ ప్రారంభం అయింది.

మనోవ్యాధితో మంచమెక్కే స్థితిలోవున్న వరూథిన్ని గుండెలకు హత్తుకొనీ, చేతిలో చెయ్యివేసీ, వరూథినిమీద వొట్టేసి చెప్పాడు రామనాథబాబు.

''అందులోనే థియేటర్ కట్టాం. మళ్ళీ ఆ స్థలం హరిప్రసాదు నుంచి కొంటాను. ఎంతయినా సరే, థియేటర్ నిర్మాణం అనుకొన్నట్టు సాగిపోవాల్సిందే. ఆగటానికి వీల్లేదు. ఆరు నూరయినా నూరు ఆరయినా నువ్వనుకున్న రోజున పునాదులు తీయిస్తాను. ఊరుకో, పిచ్చిదానా! ఇంతమాత్రందానికే తల్లకిందులైపోతే ఇంక మనమేం చేస్తాం?''

''నా కేమిటో భయంగా వుంది'' అన్నది వరూథిని.

''దిగులుపడకు. ఊఁ- చెప్పు! ఎప్పుడు పునాదులు తవ్వించమంటావ్? ఆ లోపల స్థలం కొనకపోతే నన్ను పేరుపెట్టి పిలవద్దు.''

''ఇప్పుడు పేరుపెట్టి పిలుస్తున్నానా ఏం?'' వరూథిని నవ్వింది.

''ఈ నవ్వు చూట్టానికే నేను వంద జన్మలైనా ఎత్తుతాను.'' రామనాథబాబు వరూథిన్ని దగ్గిరకు లాక్కుంటూ అన్నాడు. ఆమె కళ్ళల్లోకి చూశాడు. ఆమె కళ్ళు మెరిసిపోతున్నాయి.

''నీ చూపుల్లోని వెలుగును చూడటానికే వెయ్యి జన్మలెత్తుతాను'' అన్నాడు రామనాథబాబు వరూథిన్ని గాఢంగా గుండెలకు హత్తుకొంటూ.

## 22

సాంబయ్య కొత్తకాలవ కింద పొలంలో, వరికోత కోయించి పొద్దుగూకి ఇంటికి బయలుదేరాడు. ఆ ఏడు కొత్త కాలవకింద సాంబయ్య పొలం కంకికి గిద్దెడు గింజలు రాల్తాయా అన్నట్టుగా విరగపడింది.

ఎట్లా లేదన్నా ఈ ఏడు కొత్త కాలవ పొలంలోనే పదిపుట్లధాన్యం అదనంగా రాలుబడి అవుతుంది. ఉత్తరప్పొలమూ ఫర్వాలేదు. నాలుగైదు పుట్లదాకా ఎక్కువ పండినట్టే! మెరకపొలం కూడా ఈ ఏటితో అక్కరకొచ్చినట్టే. వేరుశనగ బాగానే అయింది. మిరప ఖర్చులు కూడా గిట్టవేమోనని తను భయపడ్డాడు. కాని ఖర్చులు పోను వందో, యాభయ్యో మిగిలేట్టేవున్నాయి. మనిషి అండలేక మిరపచేను అట్టా అయిపోయింది. పురుగు పట్టిన తరుణంలో మందుకొట్టి వుంటే, ఐదుపుట్లకు తక్కువ కాకుండా పండివుండేది.

తూరుప్పొలం మాత్రం అట్లా అయేదా? కొత్త కాలవ పొలంకంటే నిజానికి గనిగడ్డ. మొనగాడైన గడ్డకదూ అది? చేసేవాడు లేక అట్లా అయిపోయింది. తను ఒక్కడూ ఎంతని చూస్తాడు? ఎంతకాలమని చూస్తాడు? తనకూ వెనకటిలా

ఓపిక లేదు. వయసు పులిలా మీదపడి నమిలేస్తోంది. తనకు పోషణమాత్రం యేం జరుగుతుంది? తన రెక్కల కష్టం మీద ఇంత ఆస్తి సంపాదించాడు. కాని ఇప్పుడు తను అనుభవిస్తుందేమిటి? కొడుక్కు వ్యవసాయం అప్పగించి, కాలుమీద కాలు వేసుకుని పిల్లజమీందారులా అనుభవించాల్సిన రోజులివి! ఏ పొలాన యేమవుతుందో, యే పంట ఎలా వుందో అన్న యావతో రాత్రింబవళ్ళు ఒకటే దిగులైపోయింది. సరిగా కునుకుకూడా పట్టటంలేదు.

గాడ్డికొడుకు! పట్నవాసం మరిగి, పెళ్లాం కొంగు పట్టుకుని, కొంపాగోడూ, పొలం పుట్టాకూడా మరిచిపోయాడు. అట్టాంటి కొడుకు తనకే పుట్టాలా? తన కొడుకే అలాంటివాడు కావాలా? అది చచ్చి సుఖంగానే వుంది. ఇట్టాంటి కొడుకుని కని, తన యదాన కొట్టి నిశ్చింతగా తన దారిని తను పోయింది!

యేనాడో పోయిన భార్య దుర్గమ్మా - ఉండీలేనివాడైపోయిన కొడుకు వెంకటపతీ - గుర్తొచ్చి సాంబయ్యా కలవరపాటు చెందాడు. తలచుకున్నకొద్దీ గుండెలు నీరయిపోతున్నాయి.

తన కడుపుకోత... రంపపుకోత... ఆ వెంకటపతిగాడికేం అర్థం అవుతుంది? ఇంతకీ ఒకళ్ళననేం ప్రయోజనం? బుద్ధితక్కువ తనదే! ఆ షావుకారు భద్రయ్యగారి బలరామయ్యతో వియ్యమందాలనే ఉబలాటమే తన కొంప నిలువునా తీసింది. బలరామయ్య కూతురు మెళ్ళో తాళి కట్టిన క్షణమే తన కొడుకు తనకు కాకుండా పోయాడు. ఆ క్షణం నుంచి వాడు సాంబయ్య కొడుకు కాదు. బలరామయ్య అల్లుడు. దుర్గమ్మ కొడుకుకాదు. వరూధిని మొగుడు. ఆ బ్బురిపాలెం పిల్లను చేసినా బాగుండేదేమో! ఎన్ని మంచి సంబంధాలు రాలేదు? కాని, తన మోజు ఆ బలరామయ్యతో వియ్యమందాలనీ, ఊళ్ళో షావుకారుచేత తన కొడుకు కాళ్ళు కడిగించాలనీ, అందరి తలలమీదగా నడవాలనీ, తను ఆశించటం వల్లనే ఇలా జరిగింది. భగవంతుడు తనకు తగిన శాస్తి చేశాడు.

దేముడ్ని అనేం ప్రయోజనం? దేముడు తనను చల్లగానే చూశాడు. గాలిలో దీపం పెట్టి "దేముడా, నీ మహిమ" అని తను ఎప్పుడూ అనలేదు. చమటోడ్చి భూమిని తడిపాడు. కండలు కరిగించి భూమిని పండించాడు. తను భూమిని నమ్మాడు. భూమాత తనను ఆదరించింది. బీళ్ళు మాగాణి చేశాడు. భూమాత తన కడుపు పండించి, ఇల్లు బంగారం చేసింది.

ఈ భూమీ, ఈ పంటలూ, యీ సిరి సంపదలూ - తన తర్వాత ఎవరు చూస్తారు? కంటిపాపను రెప్పలు కాపాడకపోతే వెలుగారిపోతుంది. భూమీ అంతే! భూమిని నమ్మినవాడూ, భూమిని కాపాడేవాడూ, తన వారసుడూ, వంశోద్ధారకుడూ అవాల్సిన తన కొడుకు వెంకటపతి వట్టి వెంగళాయీ, బడుద్ధాయీ అయాడు గాడ్డికొడుకు. యీ జన్మలో వాడి ముఖం చూడకూడదు! పుండాకోర్! వాడు తనకు అసలు కొడుకే కాడు. వాడిముఖం చూసినవాడికి పంచమహాపాపాలు

చుట్టుకుంటాయి. ఈసారి వాడ్ని రానియ్, వాడి పని చెప్తాను! అట్లాటి కొడుకు వుంటేనేం చస్తేనేం?

సాంబయ్య నాగేంద్రుని దిబ్బదాటి, విసురుగా గనెం మీద అడుగులు వేస్తూ తూలిపడ్డాడు. మాగాటి బురదలోనుంచి కాళ్ళు పెకలించుకొని మళ్ళీ గట్టుమీదకు రావటానికి ప్రయత్నించాడు. కుడికాలి పాదం పోటు పెట్టింది. పాదం మడతపడి చీలమడం దగ్గిర బెణికినట్టుంది. గట్టుమీద నాలుగడుగులువేసి, నడవలేక గట్టుమీదే చతికిలబడ్డాడు. మునివేళ్ళతో చీలమండదగ్గిర తడిమి చూసుకొన్నాడు. అప్పటికప్పుడే వాచినట్టుంది.

తలగుడ్డతీసి, పాదం చుట్టూ మెలిచుట్టి కట్టి, సాంబయ్య మళ్ళీ గట్టుమీద లేచి నిలబడ్డాడు. కట్టుబిగువుకు కాలు భూమికి అంటీ అంటనట్టు వేస్తూ, కుంటుకుంటూ సాంబయ్య ఊళ్ళోకి వచ్చాడు.

రచ్చలవీధి దాటి తన ఇంటిముందు కొచ్చిన సాంబయ్య ఇంటి ముందాగిన కారును చూసి, కాలునొప్పి మర్చిపోయి నిలబడిపోయాడు!

వచ్చాడు! మళ్ళీ వచ్చాడు! వీడి బతుక్కు వీడికి మాట్లాడితే చిన్నకారు! వీడిబాబుగాడి సొమ్ముందిక్కడ - వేసుకుపోవటానికి? ఈ రోజు వీడి అంతు తేల్చుకుంటా! సాంబయ్య గుండెలు పొగలు శెగలు చిమ్మాయి.

కాళ్ళీడుచుకుంటూ కారు దగ్గిరకొచ్చిన సాంబయ్యకు డ్రైవరూ, వాడి పక్కన మరో కుర్రాడూ కన్పించారు.

"ఏడా వాడు?"

వాళ్ళు మాట్లాడలేదు.

"మా వాడు రాలేదా? ఎక్కడ వాడు?"

"ఆసుపత్రిలో వున్నారయ్యా!" కుర్రాడి గొంతు విచారంగా ధ్వనించింది.

"ఆసుపత్రేమిటి?"

"అవునండీ, వెంకటపతిగారికి జబ్బుగా వుంది." డ్రైవర్ అందుకుని చెప్పాడు.

లోయలో నిలబడ్డ మనిషిమీద కొండమీదనుంచి గుండురాయి దొర్లినట్టయిపోయింది సాంబయ్యకు. కొన్నిక్షణాలు నోటమాట రాలేదు.

"ఏమిటా మీరు చెప్పేది? మా అబ్బాయి వెంకటపతి గురించేనా?" అన్నాడు సాంబయ్య.

"అవునండీ! వెంకటపతిగారికి బాగా జబ్బుగా వుంది. మూడు రోజుల్నాడు ఆసుపత్రిలో చేర్పించారు. డాక్టర్లు నమ్మకం చెప్పలేకపోతున్నారు. ఈ రోజు మధ్యాహ్నంనుంచి మన స్పృహలోనే లేరు. అమ్మగారు కార్లో మిమ్మల్ని తీసుకు రమ్మన్నారు. త్వరగా బయలుదేరితే మంచిది."

సాంబయ్య గుండెలు విచ్చిపోయినై. తల వెయ్యివక్కలైపోతున్నట్టు పోటు పెట్టసాగింది. ఇంట్లోకన్నా వెళ్ళకుండా సాంబయ్య కాళ్ళీడ్చుకుంటూ వచ్చి కార్లో కూర్చున్నాడు. కారు స్టార్టయింది.

కారు వూరు పొలిమేరదాటి కంకర రోడ్డెక్కింది. సాంబయ్య మనసు పరిపరి విధాలుగా పోయింది.

వశీకరలా ఉండే వెంకటపతికి జబ్బేమిటి? వాడు పుట్టి బుద్దెరిగాక పడక వేసి ఎరగడు. వాడు తలనొప్పి అన్నట్టు కూడా గుర్తులేదు. రాయిలాంటి మనిషి, వాడికేమయింది ఇంత వుట్టిపుడియుంగా?

ఆలోచనలు ముందుకు సాగలేదు. సాంబయ్య గుండెలు కలుక్కుమన్నాయి.

''మా వెంకటపతి కేమయిందయ్యా? ఇప్పుడెలా వున్నాడు?'' సాంబయ్య కంఠం పూడిపోయింది.

''మాట్లాడరేం! వాడింకా...?'' ఇహమాట పెగల్లేదు.

''అధైర్యపడకండి సాంబయ్యగారూ? వెంకటపతిగారికి ఈపాటికి స్పృహ వచ్చి వుంటుంది. పెద్ద పెద్ద డాక్టర్లు చూస్తున్నారు.'' సాంబయ్యకు ధైర్యం చెప్పటానికన్నట్టుగా చెప్పాడు డ్రైవర్.

కాని, అతని మాటలు సాంబయ్య అనుమానాల్నీ, భయాల్నీ రెండింతలు చేశాయి.

హారి భగవంతుడా! వెంకటపతికి చివరికి ఏం గతి పట్టింది? తల్లిలేని బిడ్డను పసిగుడ్డును తన గుండెలమీదే పెంచాడు. కంటికి రెప్పలా కాపాడుకొచ్చాడు. నెత్తురుగుడ్డును పెంచి పెద్దచేసి ఇంతవాడ్ని చేశాడు. మొక్క మానైంది. ఆ చెట్టు నీడన కూర్చొని విశాంతి తీసుకొనేవేళకు చెట్టే నరకబడుతోందా?

సాంబయ్య హృదయం ఆక్రోశించింది. కొడుకు–ఒక్కగాను ఒక్క కొడుకు–తన రక్తంలోని రక్తం - తన సర్వస్వం అయిన వెంకటపతిని తను ప్రాణాలతో చూడగలడా? తను వెళ్ళేసరికి ఆసుపత్రినుంచి వెంకటపతి శవాన్ని తెల్లగుడ్డలో చుట్టి - సాంబయ్య గుండెలు కొట్టుకులాడాయి. కృష్ణ వరదకు పెద్దచెరువు గట్టుతెగి వూరిమీద పడిన గాలివాన రాత్రిలా అయింది సాంబయ్య మనసు.

సాంబయ్య మనసు వశం తప్పిపోతోంది. కాళ్ళూ చేతులూ వణికిపోతున్నాయి.

వెంకటపతి లేని తన బ్రతుక్కు అర్థం ఏమిటి? ఎవరికోసం బతకాలి? ఎవర్ని చూసుకొని వూరట చెందాలి?

తండ్రి వెంకయ్య పొలాన గడ్డిగూటిలో బిగిసిపోవడం తను చూశాడు. తల్లి మరణ వేదన చూశాడు. భార్య దుర్గమ్మకు విషం పోసినవాటిరాత్రి ఆమె పొందిన బాధను తను చూశాడు. పిడకల గూటి దగ్గర ముసలమ్మ పక్షవాతంతో కాలూ చెయ్యీ పడి కూలిపోవడం తను చూశాడు. కాని, ఇలా అనిపించలేదు. తల్లీ, తండ్రీ, భార్యా అంతా తనవాళ్ళే. కాని, వెంకటపతి వేరు. వాడు తనలోని భాగం. తన వెంకటపతి ఇహ తనకు లేడా?

సాంబయ్య ఎర్రటి కనిగుంటల్లో నీళ్ళు తిరిగాయి. కన్నీరంటే ఏమిటో తెలియని సాంబయ్య కళ్ళమీద నీటిపొరలు గమ్మాయి.

''తొందరగా పోనియ్ నాయనా! చూపైనా...'' సాంబయ్య నోట్లో పైపంచ

కుక్కుకొని కుమిలిపోయాడు. కారు పట్నం చేరేసరికి బాగా పొద్దుపోయింది. మరో పావుగంటకు పెద్దబజారు దాటి, రెండు సందులు తిరిగి గుడిశెలువున్న ప్రాంతంకూడాదాటి, జనం రద్దీ అంతగాలేని కంకరరోడ్డుమీద కారు పోసాగింది. సాంబయ్య ఆతృతగా కార్లోనుంచి బయటకు చూస్తూ ''ఏమిటయ్యా, ఇంకా పోతున్నావ్? ఆసుపత్రి రాలేదా?'' అని డ్రైవర్ని అడిగాడు.

''వచ్చేశాం. ఇది అడ్డదారి. త్వరగా వద్దామని ఇటు వస్తున్నా, అంతే!'' అంటూ డ్రైవర్, మధ్య మధ్య విరిగి పడివున్న ఎత్తైన ప్రహరీగోడ ప్రక్కగా కారాపి, లోపలకు తోవ ఎటా అన్నట్లు పరిశీలనగా చూశాడు.

డ్రైవర్ రసూల్ కారు రివర్స్ చేసి, ఎడం పక్కకు కోసి కొంత దూరం వచ్చాక ప్రహరీగేటులోపలకు వేగంగా కారు నడిపాడు.

ఓ పాడుపడ్డ ఇంటిముందుకొచ్చి కారు ఆగింది.

కారు ఆగీ ఆగటంతోటే, మెట్లమీద నిలబడివున్న ఇద్దరు వ్యక్తులు కారు దగ్గిరకొచ్చి డోర్ పక్కని నిలబడ్డారు.

''దిగండయ్యా! ఇక్కడే'' అన్నాడు రసూల్, చీకట్లో సాంబయ్య ముఖం చూట్టానికి ప్రయత్నిస్తూ.

''ఇదా ఆసుపత్రి? ఇదెందుకయింది?''

''ఇది ప్రయివేటుది. ఇక్కడే మీ అబ్బాయి గారుంది!''

''ఇక్కడా మా వెంకటపతిని పెట్టింది? దెయ్యాల కొంపల్లే వుందిగదయ్యా! ఈ పాడుపడ్డ కొంపలో మా వెంకటపతి నుంచారా?'' సాంబయ్య ఆవేశంతో అన్నాడు.

''అంటే... వాడూ...'' ఆపైన మాట పెగల్లేదు. కార్లోనుంచి దిగలేకా అందులో వుండలేకా వుండిపోయాడు.

రసూల్ డోర్ తీసి పట్టుకోగా, అంతవరకూ కారుపక్కన నిలబడ్డ ఇద్దరూ సాంబయ్యను చెరో రెక్కా పట్టుకుని కిందకు దించారు. వెనక్కు గుంజుకుంటున్న సాంబయ్యను భుజాలమీద వేసుకుని ఆ వస్తాదులిద్దరూ నాలుగు అంగల్లో ఇంట్లో చేరవేశారు.

''ఇటు! ఇటు! యీ గదిలోకి తీసుకురండి!'' ఆ కంఠం ఎక్కడో విన్నట్టే అనిపించింది సాంబయ్యకు. లాంతరు వెలుగులో అతనికేసి గుచ్చిగుచ్చి చూశాడు. ఆయన్ను ఎక్కడో చూసినట్లే వుంది!

అతని పేరూ?... ఏదో... బాబో! ప్రసాదో!

సాంబయ్య గుర్తు చేసుకునేలోపునే కండపుష్టిగల వాళ్ళిద్దరూ సాంబయ్యను ఓ గదిలోకి మోసుకొచ్చి పాతర్లో విసిరిన వడ్ల బస్తాలా మంచంమీదకు విసిరారు.

''ఒరేయ్ పశువుల్లారా? ఏప్పిటా ఆ పెద్దాయన్ను అలా పడేశారు? మెల్లగా దించలేరూ? ఊం చాల్లే! ఇకపోయి బయట నిలబడండి!'' రామనాథబాబు వాళ్ళిద్దర్నీ కసిరి, గదిలోనుంచి బయటకు పంపించాడు.

''ఏమిటిది? ఎందుకిక్కడకు తీసుకొచ్చారు? మా వాడేడీ? వాడికెలా వుంది?" సాంబయ్య వూపిరిపీల్చుకోటానికికూడా వీలులేనంతగా ఉక్కిరిబిక్కిరి అయిపోతూ, మంచంమీదనుంచి లేవడానికి ప్రయత్నం చేశాడు.

''మీరేం గాబరా పడొద్దు! మీ అబ్బాయి కొచ్చిన జబ్బేమీలేదు. కులాసాగానే ఉన్నాడు." రామనాథబాబు తన గాబరాను అణచుకుంటూ అన్నాడు.

''మామయ్యగారు భోజనం చేసినట్టులేదు. ముందువార్ని భోజనం చేయనీయండి. తర్వాత మాట్లాడుకోవచ్చు!"

సాంబయ్య తలెత్తి వాకిలికేసి చూశాడు. వరూథిని ఓ చేత్తో క్యారియర్, మరోచేత్తో మంచినీళ్ళ గ్లాసూ పట్టుకుని వుంది.

''ఏం? విషం పెట్టి చంపుదామనుకున్నావా?" సాంబయ్య ఆలోచించకుండానే అనేశాడు.

''మధ్యలో ఆ పాపం నాకెందుకూ? అదేదో అయ్యా కొడుకులే తేల్చుకోండి!" అని క్యారియరూ, గ్లాసూ కిందపెట్టి రివ్వున వెనక్కు తిరిగింది వరూథిని.

''విన్నారా? ముసలాడు నన్నెలా మాట్లాడుతున్నాడో?" వరూథిని గొంతు సాంబయ్యకు వినిపించింది.

ఆ మాటలు ఎవర్ని ఉద్దేశించి అన్నదో అర్థం అయింది సాంబయ్యకు.

అంటే? వెంకటపతి ఇక్కడే వున్నాడన్నమాట? వాడికే జబ్బూలేదు. వీళ్ళంతా కుట్రపన్ని తనను ఇక్కడకు తీసుకొచ్చారన్నమాట! వెంకటపతికూడా ఈ కుట్రలో భాగస్తుడే!

''సాంబయ్యగారూ! మీ వెంకటపతి ఒక ప్రమాదంలో పడ్డాడు. రేపోమాపో పోలీసులు పట్టుకుంటారు. ఈలోపల మీవాడ్ని రక్షించుకోవాలి. లేకపోతే జైలుకెళ్ళడం ఖాయం!" అని సౌమ్యంగా చెప్పాడు రామనాథబాబు.

''అంతా మోసం! మీ మాట ఒక్కటి నమ్మడానికి వీల్లేదు." సాంబయ్య దూకుడుగా అన్నాడు.

''అవును. మీరు నమ్మరనే ఈ పని చేయాల్సి వచ్చింది. ఇందులో బయటివాళ్ళు చేసిందేమీలేదు. ఏమన్నావుంటే మీ కొడుకును ఈ ఆపదలోనుంచి బయటపడేయడానికే! వెంకటపతి తనకు జబ్బుగా వుందని మీకు కబురుపెట్టి కారు పంపించి తెప్పించాడు. నలభై వేలకు ఒకటీ, ముప్పైయిదువేలకు ఇంకొకటీ నోట్లు రాశాడు. అవి వడ్డీతో చేరి తొంభయ్‌కి పైగా అయింది. ఇంతకాలంగా అప్పులాళ్ళకు ఏదో సర్దిచెప్పి వుంచాము. ఇహ వాళ్ళు ఆగం అంటున్నారు. రేపే దావా పడేస్తామంటూ..." సాంబయ్యలేచి గదిలోనుంచి బయటికి వెళ్ళిపోతూండటం చూసిన రామనాథబాబు ధోరణి ఆగిపోయింది. సాంబయ్యను దాటుకొని రామనాథబాబు ముందుగా గదిలోనుంచి బయటకు వచ్చాడు. కసిగా వుసిగా ముందు కొస్తూ గది ముందు ద్వారానికి అడ్డంగా నిలబడి వున్న వెంకటపతిని

చూసిన సాంబయ్యకు కాలు ముందుకు పడలేదు.

వెంకటపతి కళ్ళు జ్యోతుల్లా మండుతున్నాయి. ఏదో మత్తు వాసన వుండి వుండీ, గుప్పుమని వస్తోంది.

సశరీరంగా, సజీవుడుగా తన ముందు నిలబడ్డ కొడుకుని చూసుకొన్న ఆనందం సాంబయ్య మనసులో ఎంతోకాలం నిలవలేదు. కొద్ది నిముషాల క్రితం వెంకటపతిని తనివితీరా చూసుకొని, తన బాహువుల్లో పొదువుకోవాలనీ, తనయుడి శరీరాన్ని మమకారంతో స్పృశించాలనీ సాంబయ్య నరనరాన పెల్లుబికిన వాంఛలూ - కాంక్షలూ - అదృశ్యమై, కొడుకుమీద ద్వేషం, కసీ, తృణీకారభావం సాంబయ్యలో ముప్పేటగా పేరుకుపోసాగినై.

"అది ఆడదా? వాడు నా కొడుకా? నువ్వు పెద్దమనిషివా? మీరంతా కుట్ర చేసి, నా ప్రాణాలు తీసి, నా ఆస్తి కాజేయాలని చూస్తున్నారు. మీరు మనుషులు కాదు. రాక్షసులు. దొంగలు" అంటూ సాంబయ్య బెణికిన పాదం పట్టిపట్టివేస్తూ, తలుపు రెక్కపట్టుకొని నిలబడ్డ వెంకటపతిని నెట్టుకొని బయటికి రావటానికి ప్రయత్నం చేశాడు.

"లేరా అడ్డం! తాగుబోతు వెధవా! మైకం తలకెక్కి - పెద్దా చిన్నా, మంచీ చెడూ తెలియక చస్తున్నావ్! ఇదిరా నాకు నువ్వు చేసేది? ఛండాలుడా!" సాంబయ్య రక్తం ఉడికిపోతూంది. ఉద్రేకంతో మనిషి నిలువెల్లా వణికిపోసాగాడు.

తనను తోసేసుకొస్తున్న తండ్రిని వెంకటపతి రెక్కపట్టుకొని లాక్కెళ్ళి మంచం మీదకు విసిరాడు.

"పోతాడంట పోతాడు? ఎక్కడికి పోతాడో చూస్తా?" అంటూ వెంకటపతి ధడేల్న తలుపులు మూసి బయట గడిపెట్టాడు. భయం తెలియని సాంబయ్య గుండెలు చెదిరిపోయినై!

వళ్ళు తడిసి ముద్దయింది. మంచం మీద కుప్పగా కూలిపోయిన సాంబయ్య చాప చుట్టలా ముడుచుకుపోసాగాడు.

జీవితంలో ఎన్నో కష్టాలు చవిచూశాడు. ఎన్నో అవమానాలూ, తిరస్కారాలూ భరించాడు. అయినా ఏనాడూ తను ధైర్యాన్ని కోల్పోలేదు. తను నీరు కారిపోలేదు. ప్రతీకారం తీర్చుకోవటానికి ఏళ్ళ తరబడి ఎదురు చూశాడు. ఓపికా పట్టుదలతో, తలవంచి, పొంచి వున్నాడు. అవకాశం వచ్చినప్పుడు తిరిగి దెబ్బ తీశాడు. తనను అవమానించినవాళ్ళను తన కాళ్ళదగ్గర తిప్పుకున్నాడు. మహా సముద్రాలను యీదిన తను చివరకు పిల్లకాలవలో పడి చావాల్సి వుందా?

"ఓరీ భగవంతుడా! నా నొసటి రాత ఇలా రాసి పెట్టావా? నా కొడుకు... నా రక్తంలోని రక్తం... నాకు బద్ధశత్రువైనాడా?"

సాంబయ్య మెదడూ, మనసూ పెళ పెళ కాగే నూనె కళాయిలో వేసినట్టు అయిపోయింది.

ఆ గదిలో తనెంతకాలం వున్నాడో కూడా తెలియని స్థితిలో పడిపోయాడు.

గది బయట హాల్లో మాటలు అస్పష్టంగా వినబడసాగినై. సాంబయ్య మెల్లగా లేచి తలుపు వారగా వెళ్ళి నిలబడ్డాడు. చెవులు తలుపు కానించి వినడానికి ప్రయత్నించాడు.

''ఏమిటండీ? ఇంకా రిజిష్ట్రారు రాలేదూ?'' వరూధిని గొంతు ఆదుర్దాగా పలికింది.

''వస్తాడు! రావాలి మరి! ఈపాటికి రావాల్సిందే!'' గడియారం చూసుకొంటూ అన్నాడు రామనాథబాబు.

''ఆయన సరే! వీళ్ళేమయినట్టూ?'' మళ్ళీ వరూధిని వత్తి వత్తి అన్నది.

రామనాథబాబు వెంకటపతి కేసి చూశాడు.

''కనకయ్యే వాళ్ళనుకూడా తీసుకొని వస్తానంటే, నే వచ్చేశాను. వెళ్ళి చూసొస్తా ఏమయినారో?'' అని వెంకటపతి తూలిపోతూ బయటికి వెళ్ళటానికి ఉద్యుక్తుడయ్యాడు.

''మీరెక్కడికండీ వెళ్ళేది? మీకెందుకు, మీరెళ్ళి గదిలో కూర్చోండి! అంతా మేం చూసుకొంటాంగా?'' అన్నది వరూధిని. భర్త చెయ్యిపట్టుకొని హాల్లోనుంచి మరోగదిలోకి తీసుకెళ్ళింది.

''అంతా అయిపోయినట్టుంది, ఇంకా ఎందుకూ?'' అన్నాడు భార్యముఖంలోకి చూస్తూ వెంకటపతి.

''ఏమిటయిపోయింది అంతా? మీ మాటలూ మీరూను!'' విసుక్కొంది వరూధిని.

''ఇంకా వుందా?'' కళ్ళెగరేస్తూ అన్నాడు భర్త.

''ఏమిటి నా తలకాయా?'' అంది భార్య.

''కాదు సీసాకాయ!'' అన్నాడు భర్త.

వరూధినికి వల్లమాలిన నవ్వు వచ్చింది. ''సీసా అంతా ఖాళీ చేశారుగా! ఇంకా ఎందుకూ?''

''అసలుందా? మా నాయన...''

''ఏమిటీ? మీ నాయనక్కూడా ఇస్తారా ఏమిటి?''

''కాదు. ఆయన తాగడు. నేను తాగినా చంపేస్తాడు.''

''సరేలే! మీరు నోరు మూసుకొని కాసేపు కూర్చోండి.'' అన్నది భార్య.

''మరి మా నాయన భోజనం చెయ్యలేదు. ఆయనకు వడ్డించు.''

''అన్నం తినడట! అందులో నేను విషం పెట్టానట!''

''నిజంగా పెట్టావా?''

''ఏమిటి?''

''విషం... కాదు... అన్నం.'' వెంకటపతికి నాలుక ముడతపడిపోతున్నట్టు గ్రహించింది వరూధిని.

తండ్రి ఎదటపడటానికి ధైర్యం చాలక, గదిలోపెట్టి బాధించటానికి గుండెలు లేక వెంకటపతి బ్రాందీ సీసా అమాంతం ఎత్తి తాగేశాడు. ఆ ఊపున వెళ్ళి

సాంబయ్యను గదిలోనుంచి బయటికి పోనీయకుండా, మంచం మీదకు తోసి తలుపు గడియపెట్టి వచ్చాడు. అమాంతంగా, ఒక్కసారిగా లోపలకు పోయిన బ్రాందీ, ఇప్పుడు వెంకటపతి రక్తంలోకి ఎక్కి తల్లోకి చిమ్ముతూంది. మనిషి తబ్బిబ్బయిపోసాగాడు.

''ఇంకో సీసా వుంది లెండి!'' భర్తను కుర్చీలో కూర్చోపెడుతూ అన్నది వరూథిని.

''అయితే తే మరి! ఈరోజు ఆ ముసలాడి పని తేల్చకపోతే నా పేరు వెంకటపతికాదు. నేను ఆయన కొడుకునేకాదు! సాంబయ్యకు కొడుకులేడు.'' పెద్దగా అరవటం మొదలుపెట్టాడు వెంకటపతి. ఆ మాటలు గదిలో బంధించబడ్డ సాంబయ్యా గుండెల్లో బరిసె పోటుల్లా నాటాయి.

బయట కారాగిన చప్పుడయింది. వెంకటపతికి నచ్చచెప్పి వరూథిని హాల్లోకి వచ్చింది.

కనకయ్య మరో ఇద్దర్ని వెంటబెట్టుకొని లోపలకు వచ్చాడు. రామనాథబాబు ముగ్గుర్నీ ఆప్యాయంగా ఆహ్వానించాడు.

''ఏమిటి కనకయ్యగారూ, మీరుకూడా ఇంత ఆలస్యంగా వస్తే ఎలాగండీ?'' రాగం తీస్తూ అన్నది వరూథిని.

''నాది ఆలస్యం ఎక్కడా! అనుకున్న టైంకే వచ్చాగా? మీ ఆదుర్దాకొద్దీ మీకు అలా అనిపిస్తుంది మరి! ఆc ఏమంటున్నారు మీ మామగారు? సాంబయ్య గారు? తోవకు లొచ్చారా? ఎక్కడా?'' అంటూ కనకయ్య లేవబోయాడు.

''మీరు కూర్చోండి! ఆ పనేదో వెంకటపతీ, ఆమెగారూ చూసుకుంటారు. మధ్యలో మనం కల్పించుకోవడం మంచిదికాదు'' అన్నాడు రామనాథబాబు.

తన పక్కనవున్న మిగతా ఇద్దర్నీ చూసి, కనకయ్య తన తెలివితక్కువకు నాలుక కరచుకుని, మాట్లాడకుండా కూర్చున్నాడు.

''రాత కోతలు పూర్తిచేశారా?'' అడిగాడు రామనాథబాబు కనకయ్యను.

''ఆహాc! దస్తావేజులు పూర్తిగా రాయించాను. ఎవరిది వారికి వివరంగా రాయించి సాక్షి సంతకాలతో సహా సిద్ధంగా వున్నాయి'' అంటూ కనకయ్య తోలుసంచిలోనుంచి, స్టాంపుకాగితాలమీద రాసిన పత్రాలను బయటికి తీశాడు.

దస్తావేజులను చూసిన వరూథిని కళ్ళు మెరిశాయి.

''ఇదిగో డబ్బు! శేషావతారమూ, రామచంద్రయ్యగారుకూడా అణాపైసలతో సహా, అనుకున్న ప్రకారం సిద్ధంగా వున్నారు. మా పని అయిపోయింది. ఇహ మిగిలింది మీరు చెయ్యవలసిందే!'' డబ్బు మూట ఆడిస్తూ అన్నాడు కనకయ్య.

రామచంద్రయ్య, శేషావతారం డబ్బు సంచులమీద వేళ్ళు ఆడిస్తూ ''అవునవును!'' అంటూ తలలూపారు.

డబ్బు సంచుల్ని చూసిన వరూథిని ముఖం వెలిగిపోయింది. అంతలోనే చీకటి తెరలు కమ్మాయి.

వెంకటపతి గదిలో రెండో బ్రాందీ బాటిల్‌కోసం వెతుకుతున్నాడు.

సాంబయ్య చీకట్లో, తలుపుపక్కన చేరబడి గుండెలు చిక్కపట్టుకుని, అస్పష్టంగా సగం సగం వినబడుతున్న మాటలు వింటూ, ఆ గొంతుల్ని పోల్చుకోటానికి ప్రయత్నిస్తూ, వశం తప్పిపోతున్న మనస్సును కూడదీసుకోలేక యాతన పడుతున్నాడు.

''పత్రాలమీద తండ్రీ కొడుకుల సంతకాలు, నిశాని పద్దులు తీసుకొని రిజిష్టరు చేయించి దస్తావేజులు మా ముందు పారేయండి. ఇంతే ఇక జరగాల్సింది.'' కనకయ్య గొంతు సకిలించుకొని, మూడు ముక్కల్లో విషయాన్ని తేల్చి చెప్పానన్నట్టు పక్కనున్న ఇద్దరి ముఖాల్లోకి తెలివిగా చూశాడు.

అంతలోనే హఠాత్తుగా ఏదో గుర్తొచ్చినవాడిలా ముఖంపెట్టి కనకయ్య రామనాథబాబు కేసి తిరిగి అన్నాడు-

''ఇంతకీ రిజిస్ట్రారుగారు ఏరండీ?''

''వస్తారు, వచ్చే టైం అయింది. కాస్త ఓపిక పట్టండి కనకయ్యగారూ!'' కనకయ్యతో చెప్పి వరూథిని ముఖంకేసి చూసి, గతుక్కుమన్నాడు రామనాథబాబు.

వరూథిని ఖంగారు పడసాగింది. ఇంతకీ ఆ రిజిస్ట్రారు ఎప్పుడొస్తాడో ఏమిటో? ఆయన వచ్చేసరికి ఈయన ఏ స్థితిలో వుంటాడో? ఇప్పటికే మనిషి నోటికొచ్చినట్లు మాట్లాడుతున్నాడు. తండ్రిని అదిరించి, బెదిరించి సంతకం చేయించే స్థితిలో అప్పటికి భర్త వుంటాడా? మెదడు కుమ్మరిపురుగు తొలుస్తున్నట్లు అయిపోయింది వరూథినికి.

రామనాథబాబు వరూథినికి ధైర్యం చెబుతూ అన్నాడు, ''ముందు నువ్వు వెంకటపతి సంగతి చూడు. రిజిస్ట్రారు రాక ఎక్కడికిపోతాడు?''

''ఎందుకైనా మంచిది, మీరువెళ్ళి తీసుకొస్తేనో?'' అన్నది వరూథిని.

''మనకోసం వస్తాడా ఏం? ముందే రెండువేలు పుచ్చుకొన్నాడు. రిజిస్ట్రేషన్ పూర్తికాగానే మిగతా మూడువేలూ ఇస్తానన్నాను. డబ్బు చేదా ఏం? ఎందుకు రాడు? పదీ, ఐదూ పుచ్చుకొనేవాడు ఐదువేలు వదులుకుంటాడా?''

''పనికాకముందే రెండువే లిచ్చారా? చేతిలో పడిందేచాలని ఎగనాం పెడ్తే ఏం చేస్తారూ? ఆ రిజిస్ట్రారు అంతటివాడు. నాకు తెలుసు?'' తన అనుమానాన్ని చల్లగా జారవిడిచాడు కనకయ్య.

రామనాథబాబు తేలిగ్గా నవ్వేశాడు. ''ఆ నోట్లనంబర్లూ, వాటిమీద గుర్తులూ పెట్టే ఇచ్చాను. అంత నమ్మకద్రోహం చేస్తే వాడే జైలుకుపోతాడు!'' అన్నాడు.

కనకయ్య గుడ్లు తేలేశాడు. రామనాథబాబు ఎత్తుకు కనకయ్య చిత్తైపోయాడు. మనిషి అఖండుడు! తనకు మించిన వెయ్యి. తన బుర్ర అంత దూరం పోదు. అంత సమర్థతా, ధైర్యమూకూడాలేదు.

కనకయ్యతోపాటు వచ్చిన పెద్దమనుషులు ఖంగారుపడ్డారు. శేషావతారం వంట్లో వణుకు పుట్టినట్టయి ''ఆ రిజిస్ట్రారుగారు కూడా ఇదే ఆలోచనలో వుండి తిరుగుదెబ్బ తీస్తేనో?'' అన్నాడు.

''ఏం చేస్తాడంటావ్?'' విసురుగా, చిరాగ్గా అన్నాడు రామనాథబాబు.

''పోలీసుల్ని తీసుకొచ్చి మనందర్నీ ఇక్కడికిక్కడే మూయిస్తే!'' ఆ తర్వాత మాట అతని గొంతునుంచి పెగల్లేదు.

వరూథినికి గుండెలు చిక్కపట్టినై. కనకయ్యకు కాళ్ళు వణికాయి. చేతులోవి కాగితాలూ, డబ్బూ బల్లమీదపెట్టి చేతులకు పట్టిన చెమట తుడుచుకున్నాడు. అతని కళ్ళు అప్రయత్నంగానే ఆ యింట్లోనుండి బయటపడే మార్గాలు ఎన్ని వున్నాయోనని వెతకసాగాయి.

''ఏమిటయ్యా, మీ మాటలూ మీరూ? ఇష్టంలేకపోతే వెళ్ళండి. మీ తాతల్లాంటి వాళ్ళున్నారు కొనటానికి. ఎకరం ఐదువేలు చేసేది, మూడున్నర వేలకు, ఏ ఇబ్బందీ లేకుండా ఎలా వస్తుందేమిటి?'' అంటూ రామనాథబాబు కనకయ్య పక్కగా పెట్టివున్న డబ్బు సంచిని తీసుకుని వరూథినికి ఇచ్చాడు.

అది చూసి కనకయ్య జావకారిపోయాడు. తన పక్కనే వున్నవాళ్ళను మందలిస్తూ ''రామచంద్రయ్యా, నువ్వూరుకోవయ్యా బాబూ! రామనాథబాబుగారికి మనం చెప్పేటంతటి వాళ్ళమా? బరువూ, భారమూ ఆయనమీద వదిలేయ్! అంతా వారు చూసుకుంటారు. ఏదీ? నీ డబ్బు కూడా లెఖ్ఖపెట్టి వారికిచ్చేయ్! మళ్ళీ ఆలస్యం ఎందుకు? ఈపాటికి సబ్ రిజిస్ట్రారుగారు వస్తూ వుండాలి.'' అన్నాడు.

కనకయ్య తెలివికి రామనాథబాబు తనలో తనే నవ్వుకొని ''అలా రా దారికి'' అనుకొన్నాడు.

వరూథిని డబ్బు సంచి దాచి తిరిగి హాల్లోకి వచ్చి ''కనకయ్యగారూ, ఎంతా?'' అని అడిగింది.

''లక్షా ఇరవై. ఇంకా లెక్కపెట్టలా?'' కొంచెం గాబరాగా అన్నాడు.

''లేదు. మీ డబ్బు సంచి అలాగే వుంచా. ఊరికే అడుగుతున్నా!'' అన్నది.

''పోలీసులు మన చేతిలోవాళ్ళని మీకూ తెలుసుగా కనకయ్యగారూ?'' సాలోచనగా అన్నాడు రామనాథబాబు.

''తెలియకేమండీ? డియస్పీగారు మీ చేతిలో మనిషి. ఆ సంగతి ఈ టౌనంతా తెలుసు'' అంటూ కనకయ్య తన పక్కన ముఖం బిగించుకొని కూర్చొని వున్న రామచంద్రయ్యకేసి చూశాడు.

బయట కారాగిన చప్పుడయింది.

హాల్లో వున్న రామచంద్రయ్యా, శేషావతారమూ, కనకయ్యా, రామనాథబాబూ లేచి నిలబడ్డారు.

వరూథిని భర్త వున్న గదిలోకి వేగంగా వెళ్ళిపోయింది.

గదిలో తలుపు ప్రక్కగా గోడకు జారగిలపడి వున్న సాంబయ్యకు కొన్ని క్షణాలు ఏమీ వినిపించలేదు. ఊపిరి బిగబట్టి, తలుపుసందులోనుంచి హాల్లోకి కళ్ళు చించుకొని చూడసాగాడు.

## 23

వరూథినీ పిక్చర్ ప్యాలెస్ ప్రారంభోత్సవం అమాత్యుల చేతుల మీదుగా జరిగింది. టౌన్లోవున్న ప్రముఖులూ, సినిమా పరిశ్రమలోని డిస్ట్రిబ్యూటర్లూ, థియేటర్స్ యజమానులూ, ప్రసిద్ధ నిర్మాతలూ, కళాకారులూ పిక్చర్ ప్యాలెస్ ప్రారంభోత్సవానికి హాజరయారు. మంత్రిగారి మెడలో రామనాథబాబు పూలమాల వేయగా, మంత్రిగారి సతీమణి మెడలో వరూథిని హారాన్ని వేసింది. మంత్రిగారు ప్రధాన ద్వారానికి కట్టిన ఎర్ర రిబ్బను వెండి కత్తెరతో కత్తిరించి, అందరికంటే ముందు ఆయనే చప్పట్లు కొట్టాడు.

చుట్టూ మూగిన జనం చేసిన కరతాళ ధ్వనులతో పిక్చర్ ప్యాలెస్ ఆవరణంతా నిండగా, వరూథిని మనస్సు గాలిలోకి తేలిపోయింది. ఆ సమయంలో ఆనందం పట్టలేక వరూథిని ముఖం కార్బన్ ఆర్క్లా వెలిగిపోయింది. ఆమె కళ్ళు రామనాథబాబు కోసం వెతికాయి. కాని వెంకటపతి కన్పించాడు. మంత్రిగారిని చుట్టుకొంటున్న జనాన్ని వెనక్కు నెడుతున్నాడు వెంకటపతి. రామనాథబాబు మంత్రిగారిని ముందుకు తీసుకెళుతున్నాడు.

గత ఐదేళ్ళుగా తారాపథంలో వెలిగిపోతున్న 'హీరోయిన్' స్విచ్ ఆన్ చేసి ప్రొజెక్టరు స్టార్టు చేసింది. ఆమె పక్కనే నిలబడ్డ వరూథిని దృష్టి ప్రొజెక్టరుమీదకాక సినీతారమీదే లగ్నమయింది. ఇంత పొట్టిగా, గుమ్మటంలా, బుగ్గలు వెళ్ళపిసికినట్టున్న ఈమె అంత పెద్ద తార ఎలా అయిందా అన్న అనుమానంలో పడిపోయింది వరూథిని.

తెరమీద సరికొత్త మహత్తర 'జానపద-సాంఘిక' చిత్రం బొమ్మలు పడుతున్నాయి. అందులో హీరోయిన్ హీరోతో ప్రణయ కలహ ఘట్టంలో అద్భుతంగా నటిస్తోంది.

''ఇది ముందు పౌరాణిక జానపదగాథగా తీయాలనుకొన్నారు ప్రొడ్యూసరు. నేనే కథమార్పించి జానపద సాంఘికం చేయించాను'' అన్నది అందాలతార వరూథిన్ని చూసి.

వరూథినికి ఆవిడభాష అర్థంకాలేదు. మీరు కాబట్టి ఇంత గొప్ప పని చెయ్యగలిగారన్నట్టు ముఖంపెట్టి నవ్వింది.

''అంతేగదండీ! ఈ రోజుల్లో పాత చింతకాయ పచ్చడి పురాణాలు ఎవరుచూస్తున్నారండీ, మరి!'' అన్నది, అనన్య సామాన్యమయిన అభిమానాన్ని అంతులేని ప్రేక్షకులనుంచి ఐదేళ్ళగా పొందుతూ, ఇంకో ఐదేళ్ళు పొందుతానన్న ఆశాభావంతో వున్న నటీమణి విజయవాణి.

''నీ బొంద! నా బొంద! నువ్వు పార్వతీ సీతా వేషాలు వేస్తే ఎవరు చూస్తారు?'' అనుకుంది వరూథిని.

''మీరు యాక్ట్ చేసిన ప్రతి సినిమా చూస్తానండీ!'' ఏదో అనాలి అన్నట్టు అన్నది వరూథిని.

''అవునండీ! ఈమె మీ ఫానే!'' మంత్రిగారి సతీమణిని వెంటబెట్టుకొని అప్పుడే అక్కడకొచ్చిన రామనాథబాబు అన్నాడు.

''రండి! థియేటర్‌లో కొంచెంసేపు కూర్చుందాం!'' అన్నాడు రామనాథబాబు.

''అబ్బా! బోర్! పిక్చర్ చూస్తూ ఎక్కడ కూర్చోనూ?'' తలమీద మునివేళ్ళు - కాదు - వేళ్ళకంటే పొడుగ్గావున్న రంగుగోళ్ళు పెట్టుకొని అన్నది నటీమణి.

''అయితే మీ సినిమాలు మీకే బోరుకొడతాయన్నమాట?'' టపీమని అన్నది వరూథిని.

తార ముఖానవున్న మేకప్ ఆరిపోయింది.

రామనాథబాబు ముఖం చిన్నబోయింది.

మంత్రిగారి భార్య అది నవ్వాల్సిన సమయమో, గంభీరంగా వుండాల్సిన సమయమో తెలియక భర్తకోసం వెతికింది. ఆయనగారు అప్పటికే ప్రొజెక్షన్ గదిలోంచి బాల్కనీలోకి వెళ్ళి థియేటర్‌లో కూర్చున్నాడు.

''రండమ్మా!'' వరూథిని రిజర్వుడు క్లాసులోకి దారి తీసింది.

సదస్యులూ, ప్రముఖులూ, ఇతర ఆహ్వానితుల చూపులు తెరమీది 'కథానాయిక కథ' వదిలేసి హాలూ, హాల్లో కూర్చున్నవాళ్ళ మీద తిరగసాగాయి. తెరముందు కూర్చున్న వాళ్ళలో సగంమంది పూర్తిగా వెనక్కే తిరిగి చూడసాగారు. సినీతార విజయవాణి గర్వంగా ముఖం పెట్టింది. ఆమె పక్కనే వున్న మంత్రిగారి భార్య పవిట సర్దుకుంది. వరూథిని రెప్పలు టపటపలాడిస్తూ పక్కచూపులు చూడసాగింది.

విజయవాణిని చూస్తున్నవాళ్ళంతా తననూ చూస్తున్నట్లే అనుభూతిని పొందింది వరూథిని. పావుగంటలో, హీరో హీరోయిన్ ప్రేమకలాపం దృశ్యాలూ, పబ్లిక్ గార్డెన్స్‌లో పాటలూ అయిపోయాక, పాతికేళ్ళగా హీరో వేషం వేస్తున్న కథానాయడుకు కత్తీ, తుపాకీ రెండూ పట్టుకొని, కొత్తగా పైకి వచ్చిన విలన్ మీద పడ్డాడు.

విజయవాణి లేచి నిలబడింది. ఆమెతోపాటు వరూథిని లేచింది.

''ఊపిరి ఆడటంలేదు, బయటకు వెళ్దాం పదండి'' అంది సినీతార విజయవాణి. హీరో ఒక్కడే తెరమీద కన్పించే దృశ్యాలు వచ్చేటప్పటికి, విజయవాణికి ఇంటరెస్టు పోయినట్లు వరూథిని గ్రహించింది.

''డిన్నర్ ఎనిమిది గంటలకు, ఇంకా గంట టైం వుంది మరి!'' టైం చూసుకుంటూ అన్నది వరూథిని.

''అయితే నేను డ్రసప్ అవాలి!'' అంటూ తొందరపడింది, వున్న గంటటైం చాలదన్నట్లు విజయవాణి.

హీరో చేస్తున్న అద్భుత సాహస కృత్యాలనుంచి దృష్టి మరల్చలేని మంత్రిగారి భార్య లేవలేదు. అటు తారతో వెళ్ళడమా, ఇటు మంత్రిగారి భార్యతో వుండిపోవడమా అన్నది తేల్చుకోలేకపోయింది వరూథిని. ఆమె అవస్థ కనిపెట్టి రామనాథబాబు వచ్చాడు.

''నువ్వు విజయవాణితో వెళ్ళు. ఆమెకు మన ఇంట్లోనే మకాం ఏర్పాటు చేశాం. గెస్టుహౌస్‌లో ఖాళీలేదు. మంత్రిగారిని నేను చూసుకుంటాను." వరూథిని మీదకు వంగి చెవులో నోరుపెట్టి చెప్పాడు రామనాథబాబు.

వరూథిని విజయవాణిని వెంటబెట్టుకొని థియేటర్ నుంచి బయటకు వచ్చింది. మెయిన్‌గేటు దగ్గర్లోవున్న కారు దగ్గిరకు వెళ్తుండగా, ఇనపగేటుకు తన్ని పట్టివున్న జనం గేట్లు పడదోసి ఆవరణలోకి వచ్చారు. వరూథినితోసహా విజయవాణిని చుట్టుముట్టారు.

విజయవాణి కెవ్వుమంది! వరూథిన్ని ఎవడో వెనకనుండి అందినచోట గిచ్చాడు. జనం మీదమీదకు వస్తున్నారు. అన్నిచేతులూ - ఆకలిగొన్న బెబ్బులికోరల్లా వున్నాయి. మరో క్షణం ఆగితే వాళ్ళ చేతుల్లో నలిగి చావటం తథ్యం.

వెనక నుంచి 'ధన్-ధన్-టప్-టప్' మోతలు వినబడినై! మరుక్షణంలో జనం పల్చబడిపోయారు. వెంకటపతి ఆధ్వర్యంలో హాలు వర్కర్లూ, పోలీసులూ జనాన్ని బాదుకొంటూ ముందుకొచ్చారు. సినీతార అభిమానులూ, ప్రేక్షక మహాశయులూ, తలలూ, వీపులూ చితికి కిందపడ్డవాళ్ళు కిందపడగా మిగతావాళ్ళు గేటు దూకి పారిపోయారు. వెంకటపతి హాలు వర్కర్లతో, వరూథినికీ, విజయవాణికీ చుట్టూ వలయాకారంలో నిలబడి దడి కట్టాడు. మళ్ళీ వాళ్ళచుట్టూ పోలీసులు నిలబడ్డారు. వరూథినీ, వియజవాణీ వెళ్ళి కార్లో కూర్చున్నారు. విజయవాణి వెంటవచ్చిన ఆమె పర్సనల్ అసిస్టెంట్ కార్లో ముందు సీట్లో కూర్చున్నాడు. వెంకటపతికి వాళ్ళతో వెళ్ళాలనిపించింది. కారు దగ్గర తారట్లాడసాగాడు. వరూథిని అదేమీ గమనించనట్లే డ్రైవర్ని చూచి ''పోనీయ్ రసూల్!" అన్నది.

కారు గేటు దాటి రోడ్డు మీదకు వచ్చింది. మళ్ళీ జనం కేకలూ, పరుగులూ మొదలైనాయి. రసూల్ కారు వేగంగా నడపడం మొదలు పెట్టాడు. వరూథిని, విజయవాణి మీద ప్రేక్షకులు కురిపించిన ప్రశంసలు ఎప్పుడూ వినలేదు. సిగ్గుతో ఆమె ముఖం కందిపోయింది. లజ్జతో తలవంచుకొని విజయవాణి పక్కనే కూర్చుంది.

''ఇది మాకు అలవాటే!" కొద్ది క్షణాల మౌనం తర్వాత అన్నది విజయవాణి.

''మరీ మోటుజనం!" అన్నది వరూథిని.

''అదంతా వాళ్ళ అభిమానం ఆపుకోలేక చేస్తారు!"

''వాళ్ళ అభిమానం ఏమోకాని మన మానం పోతుంది."

''అలా అనుకొంటే సినిమాతారగా ఎవరూ రాణించరు" అన్నది విజయవాణి.

వరూథిని ఆమెకేసి తలెత్తి చూసింది. నిజాన్ని ఎంత నిర్భయంగా చెప్తుంది? తనైతే అలా మాట్లాడగలదా? ఛీ! ఛీ! తనెక్కడ? అదెక్కడ? దాంతో నాకు పోలికేమిటి? తను పరువుగల కుటుంబంలోనుంచి వచ్చింది. పేరు ప్రతిష్ఠగల వంశం తనది. తను-రామనాథబాబు వరూథిని ఆలోచనల మధ్యలో వచ్చి అంతరాయం కలిగించాడు. వరూథిని ఇంకా తరచి తరచి ఆలోచించలేకపోయింది.

''ఇంకా ఇక్కడ నయం. కొన్ని టౌన్సులో అయితే ఇంకా గొడవ పెట్టేస్తారు.

పోయిన నెల్లో నా పిక్చర్ శత దినోత్సవాలు పదిహేడు సెంటర్సులో జరిగాయి. ప్రతి థియేటరులోనూ సన్మాన పత్రాలూ-థియేటరు ముందు బూతులూ-దుమ్మూ-రాళ్ళూ-పోలీసులూ-లాఠీ ఛార్జీలూ-ఓ చోటయితే ప్రాణాలుకూడా పోయినంత పని అయింది."

ఇంటిముందు కారాగిన తర్వాత విజయవాణి నోరు మూతపడింది.

## 24

వరూధినీ పిక్చర్ ప్యాలెస్ ఓపెన్‌చేసి మూడు నెలలయింది. థియేటర్ కలక్షన్స్ బాగానే వున్నాయి. టౌను మొత్తంలో అంత మంచి థియేటర్ లేదన్న పేరు వచ్చింది. స్థలమూ, హాలూ, ఫర్నిచరు, ఎక్విప్‌మెంటూ అన్నీ కలిసి ఏడు లక్షల దాకా అయింది. సినిమాహాలు నిర్మాణంతో వరూధిని అంతస్తుకూడా పెరిగిపోయింది. ఆమె పేరు, ఆమె హోదా టౌన్లో చాలామందికి తెలిసిపోయింది. ముఖ్యంగా ధనిక వర్గంలోనూ, వ్యాపారస్తులూ, బ్యాంకర్లు, బ్రోకర్లు, ఆఫీసర్లలోనూ వరూధిని పేరు తరచు వినబడడం, అందులో కొంతమందికి స్వయంగా పరిచయం కూడా ఉండటం చేత, ఆమె పరపతి కూడా పెరిగిపోయింది. రైలుపేటలో వున్న ఇల్లు ఖాళీచేసి, కొత్తపేటలో కొత్తగా కట్టిన డాక్టరుగారింట్లో చేరాలనే నిర్ణయానికొచ్చింది వరూధిని.

"నెలకు రెండు వందల పాతిక రూపాయలా? అంత అద్దె పెట్టి మనకెందుకు ఇల్లు?" అన్నాడు వెంకటపతి.

"మన హోదాకు తగినట్టు మనం ఉండాలి! ఈ మురికి పేటలో ఒక వాటాలో ఇంకా ఎన్ని రోజులుండమంటారు? మొన్న సబ్ కలెక్టరుగారి భార్య మనింటికొచ్చి ఏమందో తెలుసా?" అన్నది వరూధిని.

"ఏమన్నదంటా?" అన్నట్టుగా భార్యకేసి చూశాడు వెంకటపతి.

"చెప్తే మాత్రం మీ బుర్రకు ఎక్కుతుందా?" అన్నట్టు భర్తకేసి చూసింది వరూధిని.

కారుదిగి రామనాథబాబు లోపల కొచ్చాడు. నిలబడి మాట్లాడటం మొదలుపెట్టాడు.

"ఏమిటా తొందర? కూర్చోకూడదా ఏం?" అన్నది వరూధిని మూతి తిప్పుతూ.

"నీకేం మహారాణివి? కూర్చొనే చక్రం తిప్పుతున్నావ్! టాక్స్ వాళ్ళు వచ్చారు. వచ్చేవారం పిక్చర్ మార్చాలి. ఇది లాగటంలేదు. డిస్ట్రిబ్యూటర్స్‌తో ట్రంక్‌లో మాట్లాడాలి. నంబర్‌కాల్ బుక్‌చేసి వచ్చాను" రామనాథబాబు గుక్క తిప్పుకోకుండా మాట్లాడసాగాడు. లోగడ తనతో తూచితూచి మాట్లాడే రామనాథబాబు ఎంత జోరుగా మాట్లాడుతున్నాడూ? అనుకొన్నది వరూధిని. "ఇంతకీ డాక్టరుగారి ఇంటి సంగతేం చేశారు?" అన్నది.

''అదా? అది మాట్లాడేశాగా? మూడు నెలల అద్దెకూడా అడ్వాన్సు ఇచ్చాను" అని జేబులోనుంచి తాళం చెవి తీసి ''ఇదిగో కీ! నీ ఇష్టం వచ్చినప్పుడు చేరవచ్చు" అన్నాడు.

వరూథిని వంగి తాళంచెవి తీసుకుని రామనాథబాబుకేసి ఆపేక్షగా చూసింది.

రామనాథబాబు ఓ కవరు తీసి వరూథిని చేతికి అందిస్తూ ''రెండువేలు! నేవస్తా మరి. కొత్త ఇంట్లో చేరగానే పార్టీ. మర్చిపోయేవ్? వస్తానండి వెంకటపతిగారూ!" అంటూ గబగబా బయటికి వెళ్ళిపోయాడు. అతని వెనకే వెళ్ళిన వెంకటపతి, కారెక్కి కూర్చున్న రామనాథబాబు వంకచూసి ఏదో చెప్పాలని ప్రయత్నించి, మళ్ళీ చెప్పలేక వూరుకున్నాడు. రామనాథబాబు వెంకటపతి అవసరాన్ని త్రుటిలో గ్రహించాడు.

''అదేగా? నిన్న మర్చిపోయా! రాత్రికి తప్పకుండా పంపిస్తా!" అన్నాడు. కారు సాగి వెళ్ళిపోయింది.

ఇంట్లోకి తిరిగి వచ్చిన వెంకటపతిమీద వరూథిని విసుగుకొంది.

''ఏమిటలా లేకిగా ఆయనెమ్మట పడ్డారు?"

''ఏం లేదులే!" అన్నాడు వెంకటపతి నసుగుతున్న ధోరణిలో.

వారం తిరక్కముందే వరూథిని ఇల్లు ఖాళీచేసి కొత్త ఇంట్లో ప్రవేశించింది. గదులన్నీ విశాలంగా వున్నాయి. ఎటాచ్‌డ్ బాత్‌తోవున్న రెండు బెడ్‌రూమ్సూ వరూథినికి చాలా నచ్చాయి. నాలుగు రోజులు శ్రమపడి ఇల్లంతా తనకు నచ్చిన విధంగా అలంకరించుకొంది.

వరూథిని కొత్త ఇంట్లో ప్రవేశించిన ఐదోరోజున రామనాథబాబు వచ్చాడు.

''ఐదు రోజులుగ్గాని తీరకలేదన్నమాట!" దెప్పినట్టుగా అన్నది వరూథిని.

''రెండు హోల్సు మేనేజ్ చెయ్యాలంటే తల ప్రాణం తోక్కొస్తూంది. మాటలు కాదు" అన్నాడు రామనాథబాబు సోఫాలో కూలబడుతూ.

''ఇష్టమై బరువెత్తుకొన్నారు! ఇప్పుడు దించాలంటే వూరుకుంటారా ఏమిటి?" అని వయ్యారంగా నడుం తిప్పుకుంటూ లోపలకు వెళ్ళబోయింది వరూథిని. రామనాథబాబు వరూథిని చెయ్యి చటుక్కున పట్టుకుని సోఫాలోకి లాగాడు.

''నాకిప్పుడేం అక్కర్లేదు."

''అక్కర్లేదంటూనే ఇదేమిటి?" చెయ్యి లాక్కుంటూ అన్నది వరూథిని.

''కాఫీ అక్కర్లేదన్నా..." అన్నాడు రామనాథబాబు వరూథిని కళ్ళల్లోకి చూస్తూ. మళ్ళీ చెయ్యి పుచ్చుకుని గుంజసాగాడు.

''ఆయన ఇంట్లో వున్న సంగతికూడా మర్చిపోయారా ఏమిటి?" గొంతు నొక్కి అన్నది వరూథిని.

''ఎవరూ?"

''ఎవరా? ఇంకా ఎవరన్నా ఉంటారా ఏం?" వరూథిని మాటల్లోని వ్యంగ్యం రామనాథబాబుకు అర్థమై ఉడుక్కున్నాడు.

''ఏమో నాకేం తెలుసూ?"

''చాల్లేండి! ఎవరన్నా వింటే నవ్వుతారు'' వరూథిని రామనాథబాబు మెడ వెనక నుంచి చేతులు వేసి, జుట్టంతా చెరిపి బుగ్గమీద గిల్లింది. రామనాథబాబు చేతులు వెనక్కు చాచి వరూథిన్ని తనమీదకు లాక్కోటానికి ప్రయత్నం చేశాడు.

వరూథిని అతని చేతుల్లోనుంచి తప్పించుకొని దూరంగా వెళ్ళి నిలబడింది.

''అబ్బ! మీక్కాదూ చెప్పేది? ఆయన ఉన్నారంటే!''

''ఎవరండీ?''

''ఎవరా? మావారే!''

''థియేటరు దగ్గర కెళ్ళలా?'' అనుమానంలోపడి అన్నాడు రామనాథబాబు.

''ఊహూ!, వెళ్ళలా! ఇంట్లోనే పడుకున్నారు!''

''ఏమొచ్చిందంటా?'' రామనాథబాబు కొంచెం గాబరా పడ్డాడు, మేట్నీ టైంకు థియేటర్ దగ్గర ఉండాల్సినవాడు ఇంట్లోనే ఉన్నాడన్న సంగతి తెలిసి.

''వంట్లో బాగా లేదట!''

''వంట్లో బాగా లేకపోవటం కాదు. గొంతులో చుక్క పడలేదేమో?''

''ఆయనకు ఇరవై నాలుగ్గంటలూ అదే పని అయిపోయింది. ఒక్కరోజు దొరక్కపోతే మంచంమీదనుంచి లేవడు. ఇదంతా మీ చలవే.'' వరూథిని మాట విసిరింది.

''నీ కవసరమైనప్పుడు నేర్పావు! ఇప్పుడేమో నామీద పడి ఏడుస్తావూ?'' రామనాథబాబు రపీమని అంటించాడు.

''అబ్బ! ఇంతలోనే అంత కోపమా? ఏదో తమాషాగా అన్నా. దానికే మీరు ముక్కులు ఎర్రజేసుకోవాలా ఏం?'' మృదువుగా లాలనగా అన్నది వరూథిని.

''నీకేం తెలుసూ? నీకేం? ఇంట్లో కూర్చున్నా వారానికి వెయ్యి రూపాయలు వస్తున్నాయ్. ఎలా వస్తున్నాయనుకున్నావ్?''

''ఓహో! అయితే, నేనే వచ్చి హాలు మానేజ్ చేసుకుంటాన్లే.''

''ఏమిటీ?''

''ఏం? నాకా మాత్రం చాతకాదంటారా?''

''చాతకాదన్నానా? నువ్వు చెయ్యలేనిదేమిటా అని ఆలోచిస్తున్నాను - అంతే!''

''చాల్లే! సంతోషం!'' వరూథిని లోపలి కెళ్ళింది. వంటగదిలో నుంచి కాఫీ తీసుకొస్తూ, భర్త గదిలోకి తొంగి చూసింది.

''ఏమిటండీ, ఇంకా నిద్ర? నాలుగవుతుంటేను? రామనాథబాబుగారొచ్చి కూర్చొని ఎంతసేపయిందీ?''

''నిద్రాలేదు. పాడూలేదు. ఊరికే పడుకొన్నా. ఆయనొచ్చాడా? ఎంతసేపయిందీ?'' అంటూ లేచాడు వెంకటపతి.

వరూథిని మాట్లాడకుండా హాల్లోకి వచ్చి రామనాథబాబుకు కాఫీ కప్పు అందించి ఎదురుగా కూర్చొంది.

కాఫీ సిప్ చేస్తూ ఇల్లంతా కలియజూస్తూ ''బ్రహ్మాండంగా వుంది'' అన్నాడు
''నా గొప్పేంకాదు. నెస్‌కేఫ్ కలిపా?'' అన్నది వరూథిని.
''కాదు - డెకరేషన్.''
వరూథిని కింద పెదవి నొక్కింది, పవిట సర్దుకుంటూ.
''కొత్త ఇంట్లోకి వచ్చాక పార్టీ అన్నా ఇవ్వలేదేం?''
తనను గురించి కాదు. ఇంటి సంగతా ఈయన మాట్లాడుతుంది?
''ఆ సంగతి మాట్లాడాలనే రెండు రోజులనుంచీ మీకోసం చూస్తున్నా!''
''ఓహో! పార్టీ ఇచ్చే ప్రయత్నంలోనే వున్నావన్నమాట!''
వరూథిని లేచి టేబుల్ మీద నుంచి కాగితం తెచ్చి మడత విప్పి రామనాథబాబుకిస్తూ ''ఇదీ లిస్టు! ఇంకా ఎవరెవర్ని పిలవాలో మరి, చూడండి!'' అన్నది.
రామనాథబాబు లిస్టు పక్కనపెట్టి ''అదంతా చూసే ఓపిక నాకు లేదుగాని చెప్పు, ఎవరెవర్ని పిలుస్తున్నారో?'' అన్నాడు.
''చదవటానికి ఓపిక లేనివాళ్ళకు వినే ఓపిక మాత్రం ఉంటుందేమిటి?'' పెదవి విరుస్తూ అన్నది వరూథిని.
''నువ్వు మాట్లాడుతుంటే వినాలనే ఉంటుంది మరి!''
''చాల్లెండి!'' అంటూ వరూథిని భర్త రావడం చూసి ఆగిపోయింది.
వెంకటపతి రామనాథబాబుకు ఎదురుగా కూర్చుంటూ ''ఎంత సేపయింది వచ్చి?'' అన్నాడు.
''ఏమిటి, ఒంట్లో బాగాలేదా?'' పరామర్శించాడు రామనాథబాబు.
''బాగాలేకపోవడం ఏం లేదు. కాని నరాలు గుంజుతున్నట్టుగా వుంది.'' అదోలా నవ్వుతూ అన్నాడు వెంకటపతి.
''రసూల్‌కు మూడు రోజుల క్రితం చెప్పా. వాడికీ ఎక్కడా దొరికినట్టు లేదు మరి!''
''ఇంకెవర్నన్నా అడిగితేనో?'' ఆశగా అన్నాడు వెంకటపతి.
''అదే ఆలోచిస్తున్నా! ప్రొహిబిషన్ యస్సైకు చెప్తే అతనే తంటాలు పడ్తాడు.'' సాలోచనగా అన్నాడు రామనాథబాబు.
వెంకటపతి తికమకపడ్డాడు. రామనాథబాబు అసాధ్యుడు! ఏమైనా చెయ్యగలడు! అనుకున్న వెంకటపతికి, నరాల్లోకి బలం వచ్చినట్టయింది.
''ఇంతకీ డిన్నర్ ఎప్పుడూ? నేను వెళ్ళేముందే ఇస్తారా? వెళ్ళాకా?''
''ఎప్పుడిస్తే మీకేం లెండి. ఎవర్ని పిలుస్తున్నానో కూడా వినటానికి ఇష్టంలేని మీకు...'' వరూథిని అలిగింది.
''అదే! చెప్పందే ఎలా వింటాను?'' అన్నాడు రామనాథబాబు సర్దుకు కూర్చుంటూ.
''సబ్‌కలెక్టరుగారూ, ఆయన ఫామిలీ, డియస్పీగారూ - ఆయన పెళ్ళాం

రాదనుకుంటాను, సీతారామారావుగారూ, రామచంద్రయ్యగారూ, చంద్రమతీ ఆమె మొగుడూ, వేదవతి - ఆమె భర్తను తీసుకురాదుగా - మిసెస్ వైకుంఠం... ఇంకా-'' వరూథిని ఆలోచించసాగింది.

''మిస్టర్ వైకుంఠమో?'' అన్నాడు రామనాథబాబు.

''ఆయన కైలాసంలో వున్నాడేమో! మీరే పిలవండి.'' పకపకా నవ్వింది వరూథిని.

''లిస్టు అయిందా? ఇంకా వున్నారా?'' గుర్రుగా అడిగాడు రామనాథబాబు.

''ఆ! - మర్చిపోయాను. టౌనుహాల్ సెక్రెటరీ, ప్రెసిడెంటూ, మహిళా సంఘం ప్రెసిడెంటూ- ఇంకా....''

''ఎందుకంటా వీళ్ళంతా?'' రామనాథబాబు ముఖంలో అయిష్టత స్పష్టంగా గోచరించింది.

''వాళ్ళంతా మీ మనుషులేగా? మీ ఫ్రెండ్సేగా!ఇందులో మా ఆయనగ్గానీ, నాక్కానీ కావల్సినవా ళ్ళెవరూ లేరే?'' పెళుసుగా అన్నది వరూథిని.

రామనాథబాబు తగ్గిపోయి ''ఆహా! నేనంది అదికాదు. చాలా పెద్ద పెద్ద వాళ్ళను పిలుస్తున్నావ్! డిన్నర్‌కు గొప్పగా ఏర్పాట్లు చెయ్యాల్సి వుంటుందని'' అన్నాడు.

''అందుకు మీ మందీ, మార్బలమూ వుందిగా?'' అన్నది వరూథిని.

''ఇంతకీ డిన్నర్ ఎప్పుడివ్వాలనుకొంటున్నావ్?''

''నేనిచ్చేదేమిటి? అంతా మీదేగా? మీ వీలునుబట్టి చెప్పండి. ఎప్పుడూ అందరి ఇళ్ళల్లో తినేసిరావటంతప్ప తెలియందానికి, పార్టీలిచ్చే సంగతి నాకేం తెలుస్తుంది?''

''నిన్ను ఒద్దని ఆయన అన్నాడా ఏంటి? ఎందుకట్లా మాట్లాడతావ్?'' అన్నాడు వెంకటపతి.

''మన ఇంట్లో ఒక్కరోజు కూడా విస్తరేయకుండా పిల్చీ పిలవడంతోనే తిని రావడానికి సిగ్గేసి చస్తున్నాను.''వరూథిని పెదవులు బిగించి నేల చూపులు చూసింది.

''ఇది ఇంకా బాగుంది? నిన్ను పార్టీ ఇవ్వొద్దని నేనన్నట్టు మాట్లాడతావేం! ఎల్లుండే ఏర్పాటు చేయిస్తా. సరా? వెట్టా? డ్రైయ్యా?'' అడిగాడు రామనాథబాబు.

''అది మళ్ళీ నన్నడగాలేమిటి?'' దీర్ఘం తీస్తూ అన్నది వరూథిని.

ఆమె కళ్ళల్లోని వెలుగు రామనాథబాబు గుండెల్లో గిలిగింతలు పెట్టింది.

''మరి నే వస్తా!'' అంటూ రామనాథబాబు లేచి నిలబడ్డాడు.

''నా సంగతి మర్చిపోయేరు? రాత్రికి ఎట్టా అయినా ఒక అరసీసా అయినా పంపించాలి'' అన్నాడు వెంకటపతి.

## 25

''నువ్వెందుకంటా? ఆయన వెళ్తే సరిపోదూ?'' అన్నాడు వెంకటపతి, పూర్తిగా ముస్తాబయి నైలాన్ చీరలో మెరిసిపోతున్న వరూథిన్ని చూసి.

''బాగానే వుంది. మన బిజినెస్ మనం చూసుకోలేకపోతే ఎంతకాలం పై వాళ్ళమీద ఆధారపడ్తామూ?'' ప్రమాదాన్ని పసికట్టి అప్పుడే పడగ విప్పబోతూన్న తాచుపాములా లేచింది మొగుడిమీదకు వరూథిని.

''ఆహా - అదికాదు. హైదరాబాదులో సినిమా హాలెందుకు మనకీ అని! ఇక్కడుంది చూసుకొంటే చాల్దా?'' వెంకటపతి మెత్తబడిపోతూ అన్నాడు.

''మీకేం తెలియదు. అంతా అడివిగోడు! పది లక్షలు పెట్టి హాలుకడ్తే, అందులో ఫైనాన్సు కార్పొరేషన్‌వాళ్ళు ఎనిమిది లక్షలదాకా ఇస్తారు. ఇహ మనం పెట్టేది ముష్టి రెండు లక్షలు. అందులో మన వాటా లక్షే కదా?''

''ఉన్నదంతా అమ్మించి ఈ హాలుకింద పెట్టించావ్. ఇంకా లక్ష ఎక్కడ తెస్తావ్?''

''ఆ లక్ష రూపాయలు మనం తేనవసరం లేదని చెప్పటం లేదూ? మన థియేటర్ ఐదేళ్ళకు లీజ్‌కిస్తే లక్షన్నర అడ్వాన్సు ఇస్తామంటున్నారు. ఇహపోతే ఏభై వేలు. అందులో నా వాటా పాతిక వేలు. అది రామనాథబాబే హుండీలో ఇప్పిస్తానన్నారు.''

''ఏంటీ? ఉండీలా, గుండీలా! నీ గొడవేంటో నాకర్థం కావడంలేదు.''

''అందుక్కాదూ నిన్ను నోరుమూసుకు కూర్చోమంటుంది?''

పెళ్ళాం అన్నమాటకు వెంకటపతి తలెత్తి చూశాడు.

''అన్నిటికీ అపశకునాలు. అనుమానాలూ? పాతికవేలు పెడ్తే ఐదులక్షల ఆస్తి మనకవుతుంటే మధ్యలో నీ నసుగుడేమిటి?''

''ఆఁ! అవుద్ది పాతికేలు ఐదు లక్షలు!''

''హైదరాబాద్‌లో థియేటర్ల కలెక్షన్లు ఎలా వుంటాయో మీకేం తెలుసు? గోపాలరావు నాలుగేళ్ళల్లో హాలుమీద పెట్టిన పెట్టుబడి సంపాదించాడు. లీజు కిచ్చినా వారానికి ఐదు వేలకు తక్కువ కాకుండా ఇస్తారు.''

''ఇస్తారిస్తారు!'' బొటనవేలు నోట్లోనుంచి తీసి అన్నాడు వెంకటపతి.

''నిన్ను చూస్తే నాకు వళ్ళు మండుతుంది! వారానికి ఐదువేలు కాదు, ఏడువేలదాకా ఇస్తారు. ఆ మాటకొస్తే ఖర్చులూ వడ్డీ పోనూ నెలకు పదివేలు మిగుల్తాయి. సంవత్సరానికి లక్షా ఇరవై వేలు. అంటే చూడు...''

''ఏంది చూసేది? చూడాల్సిందే!'' అంటూ వెంకటపతి పెళ్ళాంకేసి చూశాడు.

''నా కెదురుగా నిల్చుని అట్లా గుడ్లు మిటకరించుకొని చూడకపోతే, అట్లా వీధిలోకి వెళ్ళి రామనాథబాబు కారొస్తుందేమో చూడరాదూ? ట్రైన్ టైం అవుతోంది!'' చేతివాచి చూసుకుంటూ చిరాగ్గా అంది వరూథిని.

వెంకటపతి టవల్ దులుపుకొని భుజాన వేసుకొని వీధిలో కెళ్ళాడు.

వరూథిని పనిపిల్లమా, వంటమనిషినీ పిలిచి, తను ఊరునుంచి తిరిగి వచ్చేంత వరకూ చెయ్యాల్సిన పనులన్నీ ఏకరువు పెట్టింది.

''బాబు ఇంకా స్కూలునుంచి రాలేదుకదమ్మా?'' అన్నది పనిపిల్ల.

''బాబు వచ్చేదాకా ఉండే టైం లేదే మరి?''

''చిన్నబాబుగార్ని మీతో తీసుకెళ్ళడం లేదామ్మా?'' అన్నది వంటమనిషి బుచ్చమ్మ.

''నీ తెలివి తెల్లారినట్టే వుంది. వాణ్ణెత్తుకొని నేనెక్కడ తిరిగేది హైదరాబాదులో? వారం పదిరోజులు పట్టొచ్చు. ఈలోపల వాడి చదువు ఆగమైపోదూ? కమలా! వాడు రోజూ స్కూలుకెళ్ళేట్టు చూడు. వాళ్ళ నాన్నగారికి వదిలేశావంటే బుజాన వేసుకొని హాలుచుట్టూ తిప్పుతారు. తెలిసిందా?''

''అట్లాగేనమ్మా!''

''బాబుకు చెప్పు - హైదరాబాదు నుంచి విమానం, రైలూ, మంచి బట్టలూ తెస్తానని. పొద్దున నేను వెళ్తానంటే వస్తానని వాడు చాలా మారాం చేశాడు'' అన్నది వరూధిని.

గేటు ముందు కారాగాటం చూసి ''కమలా, ఆ సూట్‌కేసు పట్టుకురా!'' అని చెప్పి బయలుదేరింది.

కార్లోనుంచి వెంకటపతీ, డ్రైవరూ దిగారు. డ్రైవర్ కమల చేతిలోనుంచి సూట్‌కేసు తీసుకొని డిక్కీలో పెట్టాడు.

''అయ్యగారేరీ?'' అడిగింది వరూధిని డ్రైవర్నిచూసి.

''ముందు మిమ్మల్ని ఎక్కించుకు రమ్మన్నారు'' అని చెప్పి రసూల్ కారు స్టార్టు చేశాడు.

మళ్ళీ కారులో ఎక్కబోతున్న భర్తను చూసి ''మళ్ళీ మీరెందుకండీ?'' అన్నది.

''హాలు దగ్గర దిగుతా!'' డోరు తెరచిపట్టుకొని లోపలపెట్టిన కాలు అలాగే ఉంచి అన్నాడు భర్త.

''ఎందుకూ ఇప్పుడు హాలు దగ్గరకు? బాబు స్కూలునుంచి వచ్చేవేళకూడా అయితేను? వాడొచ్చేసరికి ఇద్దరం లేకపోతే మారాం చేస్తాడు. ఉండండి'' అన్నది భార్య.

వెంకటపతి కారు తలుపు మూసి వెనక్కొచ్చాడు.

కారు సాగిపోతుండగా భర్తను చూసి చెప్పింది వరూధిని:

''బాబును జాగ్రత్తగా చూసుకోండి! ఇల్లు జాగ్రత్తగా చూసుకోండి. అది.... కొంచెం తగ్గించుకోండి. తర్వాత..''

కారు సాగి వెళ్ళిపోయింది. దుమ్ము లేపుకుంటూ వెళ్ళిపోయిన కారును చూపు కందినంత వరకూ చూస్తూ నిలబడ్డాడు వెంకటపతి.

## 26

వారంరోజుల్లో వస్తానన్న వరూధిని పది రోజులకైనా రాలేదు. వరూధిని వెళ్ళేప్పుడు ఏమీ చెయ్యలేకపోయిన వెంకటపతి తీరా భార్య వెళ్ళాక, ఆమెను వెళ్ళకుండా ఆపితే బాగుండేదేమో ననిపించింది. అది తను ఆపితే ఆగుతుందా?

అనే అనుమానం వచ్చి, ఆ ప్రశ్నకు సమాధానం తెలియక అంతటితో ఆ ప్రశ్నే వదిలేసుకున్నాడు.

ఒకప్పుడు తనను చూస్తేనే హడలిపోయే వరూథినికి ఇప్పుడు తనన్నా, తన మాటన్నా బొత్తిగా ఖాతరులేదు. దానికి పెత్తనం ఇచ్చి, అది చెప్పినట్లు ఆడటంవల్లనే అది ఇంత నెత్తికెక్కి కూర్చుందేమో? ఆ రామనాథబాబుగాడ్ని వేసుకొని అది హైదరాబాదు వెళ్ళటం ఏమిటి? రానియ్! ఈసారి దానంతేదో తేల్చుకుంటాను -

అనుకొన్నాడు వెంకటపతి. ఖాళీ అయిన సీసా అవతలకు విసిరేసి పెళ్ళాం మీదొచ్చిన కోపంతో, పనిపిల్లనూ, వంటమనిషినీ కసిరి హాలు దగ్గిర కెళ్ళాడు. బుకింగ్‌క్లర్క్యులూ, గేటుకీపర్లూ వెంకటపతికి రామనాథబాబు వెళ్ళిన దగ్గర్నుంచీ చాలా మర్యాద ఇచ్చి అణకువ చూపసాగారు.

ఆ రోజు మొదటాట బుకింగ్ జరుగుతుంటే, వెంకటపతి రామనాథబాబు నిలబడే చోట నిలబడి, వచ్చే పోయే జనాన్నీ హాల్లో పనిచేసేవాళ్ళనూ చూడసాగాడు. హాలు ప్రొప్రయిటరు హోదాలో తిరుగుతూ వుంటే వెంకటపతి మనసు ఏదో లోకాల్లోకి విసిరేసినట్టయింది. మొదటి ఆట మొదలు పెట్టగానే వెంకటపతి హాల్లో ప్రవేశించి రిజర్వుడు సీట్లోకెళ్ళి కూర్చున్నాడు. ఆ క్లాసులో ఐదారుగురు కంటే ఎక్కువలేరు. న్యూస్‌రీల్ అయిపోయి సినిమా మొదలైంది.

రాజ్యం పిక్చర్స్ ''హరిశ్చంద్ర'' టైటిల్స్ తెరమీద కన్పించాయి. సీట్లో వెనక్కు జారగిలబడి కూర్చున్న వెంకటపతికి తను చిన్నప్పుడు చూసిన సినిమా గుర్తుకొచ్చింది. తను మొదటిసారిగా చూసిన సినిమా ఏమిటి? అవును, అదీ ''హరిశ్చంద్రే!''

ఆ రోజు తను స్కూలునుంచి నేరుగా భద్రయ్యగారింటికెళ్ళాడు. బలరామయ్యగారి పిల్లలు సినిమాకని బస్తీకి బయలుదేరారు. వాళ్ళు కొత్త బట్టలు వేసుకొని సవారి బండి ఎక్కుతుంటే తను ఎంతో ఆశగా బండి చుట్టూ తిరిగాడు. తను సినిమా చూడాలన్న కోరిక అణచుకోలేక జీతగాడితో చెప్పాడు. జీతగాడు తన్ను కసురుతుంటే బలరామయ్య విని, పోనీలేరా, పిల్లల్తో వుంటాడు. పాపం, తీసుకెళ్ళు అన్నాడు.

అప్పుడు బలరామయ్యను తను ఎంత మెచ్చుకున్నాడు మనసులో? తను గుళ్ళో చూసిన దేవుడికంటే బలరామయ్యే మంచివాడుగా కన్పించాడు. జీతగాడు డబ్బులు సంగతి తెచ్చేంతవరకూ సినిమా చూడాలంటే డబ్బులు కావాలన్న ఆలోచన తనకు తట్టలేదు.

తను బిక్కముఖంవేసి నిలబడితే మళ్ళీ బలరామయ్యగారే ''వాళ్ళ బాబు ఆ సాంబయ్య ఒక్క కానీ ఇవ్వడు. ఒరే పెద్దోడా! జీతగాడితోపాటు వీడిక్కూడా ఓ టికెట్ కొని ఇయ్యరా!'' అన్నాడు.

అప్పుడు బలరామయ్యకు తన మనసులో వెయ్యి దణ్ణాలు పెట్టుకొన్నాడు. జీతగాడు సుబ్బడు తన సొమ్మేదో పోయినట్టు ముఖం పెట్టాడు. వాడి ముఖం ఇప్పటికీ తనకు గుర్తే!

''ఒరేయ్ సుబ్బడూ! మీ అయ్య మాకు పాలేరుగా రాకముందు, వాళ్ళతాత వెంకయ్యేరా మా పెద్ద పాలేరు. ఆ వెంకయ్య నన్ను ఎత్తుకొని మోశాడ్రా! ఆ వెంకయ్య మనవడే వీడు. ఎవరనుకున్నావ్?'' అలా చెప్తున్నప్పుడు. తనకు బలరామయ్య అంత మంచివాడుగా అనిపించలేదు. ఎందుకు అట్లా అనిపించిందో అప్పుడు తనకు అర్థం కాలేదు.

బండి ఊరి బయటకొచ్చేదాకా సుబ్బడు ముందుపగ్గాలు పట్టుకొని నడిచాడు. ఊరు దాటిందాకా తనను బండెక్క నియ్యలేదు వాడు. బండి వెనకే తను పరుగులు తీశాడు. తనను ఎక్కించకుండానే బండి తోల్తాడేమోనని తనకు భయం వేసి ఏడుపొచ్చేసింది.

''ఓయ్! వెంకటపతీ! ఎక్కెక్కు. తొందరగా. గిత్తలాగేట్టులేవ్!'' అని తొట్లోనుంచి అరిచాడు సుబ్బడు.

తను వెనక పరంపట్టే పట్టుకొని బండిఎక్కుతుండగా బండి కదిలింది. ఓ చేత్తో పరంపట్టీ, మరో చేత్తో జల్లా పట్టుకొని వేలాడాడు. అలా ఎంతసేపు వేలాడాడో సరిగా గుర్తు రావడం లేదు. కాని బలరామయ్యగారి పిల్లలు అదో తమాషాగా అనిపించి గగ్గోలుగా నవ్వడం మాత్రం గుర్తుంది. తను చచ్చీ చెడీ ఎట్లాగో బండిమీదకు పాకాడు. గొంతెండిపోయింది. వళ్ళంతా చెటలు పట్టింది. జల్ల చివర ముడుచుకొని బిక్కుబిక్కుమంటూ, బస్తీకి చేరేదాకా అలాగే కూర్చున్నాడు. బలరామయ్యగారి పిల్లలు వాళ్ళదివరకు చూసిన సినిమాల గురించి చెప్పుకొంటుంటే తను శ్రద్ధగా ఆశగా విన్నాడు. బండి బస్తీ చేరుకొంది. అప్పుడు ఇన్ని ఇళ్ళూ, దుకాణాలూ, రోడ్లూ, సినిమా హాళ్ళూ, హోటళ్ళూ లేవు. బండి సరాసరి సినిమా హాలు గోడ పక్కకువచ్చి ఆగింది. సుబ్బడు బండిదించి ఎద్దుల్ని బండికి కట్టేశాడు. జల్లలో వున్న ఎండుగడ్డి తీసి, ఎద్దులకేసి, మళ్ళీ చాప జల్లలో పరిచి బండి పక్కన హాలు ముందు నిలబడ్డ బలరామయ్యగారి పిల్లల దగ్గర కొచ్చాడు.

అప్పటికే బలరామయ్యగారి పెద్దకొడుకు ఐదు కుర్చీ టిక్కట్లు కొన్నాడు. వాళ్ళంతా హాల్లోకి వెళ్ళటానికి సిద్ధంగా వున్నారు. పెద్దమ్మాయి తన భుజాన నిద్రపోతున్న పిల్లను సుబ్బడికిచ్చి ''ఇదప్పుడే నిద్రకుపడింది. నువ్వెత్తుకోరా! దీన్ని నేను మోయలేను'' అన్నది. పెద్దబ్బాయి జీతగాడి చేతిలో అర్ధరూపాయి పెట్టి, తమ్ముళ్ళనూ, చెల్లినీ వెంటబెట్టుకొని హాల్లోకి వెళ్ళాడు.

నేలటిక్కెట్టు కంతదగ్గర ఇంకా జనం తోసుకుంటూనే వున్నారు. జీతగాడు భుజాన వున్న పిల్లను తనకిస్తూ ''అమ్మాయిగారి నెత్తుకో. నే వెళ్ళి టికెట్టు తెస్తా. జాగ్రత్త, పడేసేవ్!'' అన్నాడు.

ఆ పిల్ల తన భుజం మీద అటూ ఇటూ కదలడం మొదలుపెట్టింది. ముందు చాలా తేలిగ్గా వుంది. తను మోయగలిగాడు. కాని, వున్నకొద్దీ బరువుగా అయింది. పైగా ఇటూ అటూ కదులుతూంది. జీతగాడు ఎంతసేపటికీ రాలేదు. ఆ పిల్ల తన చేతుల్లోంచి కిందకు జారేట్టుంది. ఓసారి పైకి గుంజుకున్నాడు. మళ్ళీ

పట్టు జారిపోయింది. ఆ పిల్లను మోయలేక అవస్థపడుతూంటే తన చొక్కా లాగూమీద ఎవరో నీళ్ళు పోసినట్టయింది. అటూ ఇటూ చూశాడు. పక్కన ఎవరూ లేరు. ఆ పిల్ల గౌను కూడా తడిసింది. అప్పటికి అర్థమైంది - ఆ పిల్ల తన చొక్కా లాగూ మీద ఒకటికి పోసిందని! దాన్ని రోడ్డుమీద విసిరి పారేయాలన్నంత కోపం వచ్చింది.

ఇంతకీ ఆ పిల్ల ఎవరూ? బలరామయ్యగారి కూతురేగా? ఎన్నోదీ? దాంతర్వాత లేరుగా? అంటే అది ఆఖరుదేగా? అదే! అదే! అదే ''వరూథినా?'' బిగ్గరగా అనేశాడు.

వెంకటపతి కుర్చీలో ఎగిరిపడ్డాడు. చుట్టూ కలయ చూసుకున్నాడు. ఎవరూ దగ్గర్లో లేరు. తనన్నది ఎవరూ వినలేదు. అవును! ఆ పిల్లే వరూథిని. ఆ తర్వాత ఏం జరిగిందీ? వెంకటపతి గుర్తుచేసుకోసాగాడు. ఆ తర్వాత ఏమయిందీ?

సుబ్బడు కాసేపటికి రెండు నేల టిక్కెట్లు తీసికొచ్చాడు. వాడి బనీను చిరిగి పోయివుంది. వాడి గుప్పెట్లో టిక్కెట్లు నలిగి తడిసిపోయి వున్నాయి. ఆ పిల్లను... అదే వరూథిన్ని... వాడెత్తుకొని టిక్కెట్లు తన చేతికిచ్చాడు. ఇద్దరూ పరుగులు తీసుకుంటూ నేల గేటు దగ్గర కొచ్చారు. అక్కడ మళ్ళీ ఆలస్యం. సినిమా హాల్లోనుంచి మాటలు వినపడుతున్నాయి. తను తొంగి చూశాడు. పెద్ద పెద్ద బొమ్మలు మనుషుల్లాంటివి - పెదవులు కదిలిస్తూ మాట్లాడుతున్నాయి. గేటులోవాడు తనను వెనక్కు నెట్టాడు.

''టిక్కెట్లియ్యి! హా!'' జీతగాడు అనేదాకా తన చేతిలో టిక్కెట్లు ఉన్నట్లే గుర్తులేదు. హాల్లోకి వెళ్ళి జీతగాడి పక్కనే బాసింబట్ల వేసుకూర్చున్నాడు నేలమీద. తన బట్టలు చల్లగా వున్నాయి. కింద గచ్చు చల్లగా వుంది. తెరమీద బొమ్మలు మెరిసిపోతున్నాయి. మెదడంతా వెచ్చ వెచ్చగా అయిపోయింది. గడ్డాలమీసాలవాడు విశ్వామిత్రుడు. కిరీటం పెట్టుకున్న రాజు - హరిశ్చంద్రుడు మాతంగకన్యలను వద్దంటున్నాడు - హరిశ్చంద్రుడు భార్యను అమ్మేశాడు. లోహితాస్యుడ్ని పాము కరిచింది - హరిశ్చంద్రుడు కాటికాపరివేషంలో వచ్చాడు.

హాల్లో ఆడవాళ్ళు ముక్కులు చీదేస్తున్నారు.

''దళమౌపయ్యెదలో.... అది మాంగల్యంబు కాబోలు!'' ఘంటసాల వెంకటేశ్వరరావు కంఠం హాలంతా మోగిపోతోంది. ప్రాజెక్టర్ ఆపరేటర్ సౌండు పెంచాడు. చంద్రమతి, 'హా! నాథా వీడు మన లోహితుడు!' వెంకటపతి తన స్మృతిపథంలో తిరుగుతున్న సినిమాలోంచి, తెరమీద కళ్ళకు కనిపిస్తోన్న ''హరిశ్చంద్ర''లోపడి లీనమయిపోయాడు.

''ఆ తర్వాత ఏమైంది?'' వెంకటపతి మళ్ళీ మనస్సును వెనక్కు తోయటానికి ప్రయత్నం చేశాడు. కాని, అది తిరిగి తిరిగి హాల్లోకే వచ్చింది.

ఇంత పెద్ద సినిమా హాలుకు ఈనాడు తను యజమాని! ఓనరు! ఇంకో ఆరునెలలో, సంవత్సరమో పోతే ఇంతకంటే పెద్ద సినిమా హాలుకు, అందులోనూ హైదరాబాదు పట్టణంలో, భాగస్తుడు కాబోతున్నాడు.

ఇంత అదృష్టం, హోదా తనకు ఎలా వచ్చాయి? దానికి కారకు లెవరు? ఆనాడు తన చొక్కాలాగూ తడిపిన బలరామయ్య కూతురు! తనను మొదటిసారిగా దయతలచి సినిమాకు పంపిన షావుకారు బలరామయ్య కూతురు, తన భార్య వరూథినే! ఇదంతా దాని తెలివీ, సామర్థ్యం, ప్రయోజకత్వమే! అది లేకపోతే తను ఎక్కడుండేవాడు? టౌన్లో తనకిప్పుడు ఎంత హోదా, పరపతీ వుంది? పెద్ద పెద్ద అధికారులూ, ధనవంతులూ, రాజకీయ నాయకులూ, మంత్రులు కూడా తనకు తెలియడానికి కారణం వరూథినే మరి!

హరిశ్చంద్ర సినిమా పూర్తయేసరికి వెంకటపతి ఆలోచనలూ, తర్కమూ ఓ కొలిక్కి వచ్చాయి. సాయంత్రం తాగిన సారా నిషాకూడా దిగిపోయింది. హాల్లోనుంచి బయటకొస్తుంటే కాళ్ళు పీకాయి. నరాలు గుంజాయి. మెట్లమీద నిలబడి హాల్లోనుంచి కళ్ళు తుడుచుకుంటూపోయే జనాన్ని చూస్తూ వున్నాడు.

రెండో ఆటకు బుకింగ్ మొదలైంది.

శివరాం నలుగుర్ని వెంటబెట్టుకొని వెంకటపతి ముందుకొచ్చి నమ్రతగా నిలబడి అన్నాడు:

''వీళ్ళు ఏ.సి.టి.వో. గారి తాలూకు. పంపించమంటారా?''

వాళ్ళవైపు చూడకుండానే వెంకటపతి తలెగరేశాడు. అందులో ఎంతో ఆనందం, తృప్తి పొందాడు! వెనక్కుతిరిగివెళ్తున్న శివరాంను పిల్చి ''ఈరోజు కలెక్షన్ ఎంతయింది?'' అని అడిగాడు.

''ఇంకా బుకింగ్ క్లోజ్ చెయ్యలేదు. చెయ్యగానే చెప్తాను'' అన్నాడతను.

వెంకటపతి, బుకింగ్ క్లోజ్ చేసేంతవరకూ వుండే ఓపికలేక ''అయినంతవరకు చెప్పు. మొత్తం లెఖ్ఖచూసి పట్టుకురా! నేను వెళ్తాను'' అన్నాడు.

''అలాగే'' అంటూ శివరాం బుకింగ్ ఆఫీసుకేసి పోబోతుండగా ''నేను చెప్పింది ఏం చేశావ్?'' అన్నాడు.

''ఇంతకు ముందే తెప్పించి పెట్టాను. కుర్రాడిచేత పంపించమంటారా ఇంటికి?'' అన్నాడు శివరాం.

''మళ్ళీ కుర్రాడెందుకూ? నేనే తీసుకెళ్తాలే'' అన్నాడు వెంకటపతి.

వెంకటపతి రిక్షాలో వచ్చి ఇంటిముందు దిగాడు. అప్పటికే కారు ఆగివుంది. వెంకటపతి ఇంట్లో కాలు పెడ్తుండగా, లోపలనుంచి వస్తూ రామనాథబాబు ఎదురయ్యాడు. అతని ముఖం వెలవెల పోయింది.

''అప్పుడే బుకింగ్ క్లోజ్ చేశారా? హౌస్‌ఫుల్‌గా వుందా? హరిశ్చంద్రలాంటి పౌరాణికాలు ఎన్నిసార్లు తీసినా జనం చూస్తారు.'' అన్నాడు రామనాథబాబు.

''హాలు నిండలేదు. ఇంకా బుకింగ్ క్లోజ్ చెయ్యలా!'' అన్నాడు వెంకటపతి తనేదో తప్పుచేసిన వాడిలా అయిపోయి.

''అయితే కొంపేం మునిగిపోయిందని? బుకింగ్ క్లోజ్ కాకముందే పరుగెత్తుకొచ్చారు?'' వెంకటపతిని నిలదీసి అడిగింది వరూథిని.

''వస్తే ఇప్పుడేమయిందేమిటి? శివరాం నమ్మకస్తుడే!'' అన్నాడు రామనాథబాబు వెంకటపతిని సమర్థిస్తూ.

''అయినే నయం దానికంటే!'' అనుకున్నాడు వెంకటపతి.

''ఏమిటూ సంచీ?'' తీవ్రంగా చూస్తూ భర్తను అడిగింది వరూథిని.

''ఏం లేదులే! ఏం లేదులే!'' అంటూ డ్రాయింగ్ రూంనుంచి వెళ్ళిపోయాడు వెంకటపతి.

రామనాథబాబు నవ్వుతూ వరూథినికేసి చూశాడు.

''మీకేం మీరు నవ్వుతారు. ఎందుకు నవ్వరూ?'' అంటూ వరూథిని వచ్చే నవ్వును ఆపుకోలేక ముఖం పక్కకు తిప్పుకొంది.

రామనాథబాబు బయటకొచ్చాడు. అతనివెనకే వరూథిని వచ్చింది. కారెక్కుతున్న రామనాథబాబుతో ''రేపొస్తారుగదూ?'' అన్నది.

''తప్పుతుందా? రాణీగారి ఆజ్ఞ!'' అంటూ కారుస్టార్టు చేశాడు రామనాథబాబు.

వరూథిని హృదయంలో అమృతం చిలికినట్లయింది. నీటిమబ్బులో దాక్కుంటున్న చందమామను చూస్తూ గేటు పట్టుకొని నిలబడిపోయింది. అలా ఎంతసేపయినా నిలబడాలనే అనిపించింది.

ఇంట్లోకి వస్తూనే వరూథిని వెంకటపతి కూర్చొని వున్న గదిలోకి వెళ్ళింది. అప్పటికే వెంకటపతి బుడ్డిలో సగం ఖాళీ చేశాడు.

''రాను రాను మీ కసలు బుద్ధిలేకుండా పోతోంది!'' విసురుగా అంటూ వెంకటపతి ముందున్న బాటిల్ లాక్కుంది.

''ఉంటేగా పోటానికి?'' వెంకటపతి సమాధానానికి వరూథిని బిత్తరపోయింది.

ఇతడు పాంబయ్య కొడుకేనా అన్నట్టు చూసింది. తాగిన నిషాలో పుట్టిన తెలివితేటలేమో అనుకొంది.

''ఎంతవర కయిందీ?'' అడిగాడు వెంకటపతి.

''ఏమిటయింది?'' అన్నది వరూథిని.

''కొంతవరకన్నా అయిందా అని?''

''సగానికి పైగా అయింది. ఇదే పనా?'' బాటిల్ చూపుస్తూ వరూథిని.

''మరింకేం పని?''

''చాల్లే ఊరుకోండి.''

''మరింకేం పనిమీద హైదరాబాదు వెళ్ళావ్?''

అప్పటికిగాని అర్థంకాలేదు వరూథినికి భర్త దేన్నిగురించి అడుగుతుంది.

''ఏం తీసుకొచ్చావ్?'' అని ''ఏం జేసుకచ్చావ్'' అన్నానని అనుకొన్నాడు వెంకటపతి.

వరూథిని పుల్లారెడ్డి స్వీట్సు ప్యాకెట్ తెచ్చి భర్తముందు ఉంచింది.

''బాబుకు పెట్టావా?'' అడిగాడు వెంకటపతి.

''అయ్యో ప్రేమ!'' అనుకొంది వరూథిని.

''నువ్వు - నువ్వు... తి ... తిన్నావా?'' అన్నాడు భర్త.
''అయ్యో రాత!'' అనుకొంది భార్య.

# 27

వరూథిని కొడుకు రవికి ఆరేళ్లు నిండాయి. వాడి పుట్టినరోజు పండగ ఘనంగా జరిపించింది. రవి తన పుట్టిన రోజు వచ్చిన బొమ్మలు, ప్యాకేట్ను విప్పి తండ్రికి చూపిస్తున్నాడు. కారూ, విమానం, డ్యాన్సింగ్ గరల్-కీ ఇచ్చి నేలమీద వదులుతూ వరూథిని ఆనందిస్తూంది. వెంకటపతి తన కొడుకు అదృష్టాన్ని తలుచుకుంటూ వాడికేసి, బొమ్మలకేసి మార్చి మార్చి చూస్తున్నాడు.

రవికి జమీందారు బిడ్డలా జరిగిపోతుంది. వాడికేం తక్కువ? వాడు పెరిగి పెద్దయేసరికి పది లక్షలకు వారసుడవుతాడు. మరి వాడెంత గొప్పవాడౌతాడో? తనే ఇలా అయిపోయాడు? తనకు మాత్రం ఏం తక్కువయిందీ? ఈ తాగుడొకటి అలవాటయి మధ్య మధ్య ఇబ్బంది పడుతున్నాడుగాని తకు మాత్రం కొరతేముంది?

వెంకటపతి కొడుకుని తనతో పోల్చుకొని, తనకంటే రవి ఎన్ని అంతస్తులు పైన ఉంటాడో లెక్కలు కట్టుకోసాగాడు.

ఇంట్లోకి వస్తున్న రామనాథబాబును అంత దూరంలో చూడగానే వరూథిని ''ఒరే బాబూ! బాబాయి వచ్చాడా! బాబాయికి నీ ప్రజెంటేషన్లు చూపించు మరి!''అన్నది.

''ఆ డ్రస్సు వాడికి తొడిగి చూశావా?'' కూర్చుంటూ, రవివంక ఆప్యాయంగా చూస్తూ అడిగాడు రామనాథబాబు.

''సరిపోయింది. ఆ డ్రస్సులో మీరు వాణ్ని చూళ్లేదుగా! ఎలా వున్నాడనుకొన్నారు? అచ్చం ఎలా వున్నాడో తెలుసా?'' రామనాథబాబు కళ్లలోకి చూస్తూ అన్నది.

''ఎలా ఉన్నాడేమిటి?'' అన్నాడు రామనాథబాబు.

''దొరబిడ్డలా వున్నాడు.''

''దొరసాని బిడ్డలా లేడూ?'' రామనాథబాబు నవ్వుతూ అన్నాడు.

వరూథిని నవ్వాపుకోలేకపోయింది. చెంపలు ఎరుపెక్కాయి. వెంకటపతికి కూడా నవ్వొచ్చినట్లయింది.

''అంతే! అంతే!'' అన్నాడు. రవిని దగ్గరకు తీసుకొని తల నిమిరాడు వెంకటపతి.

''బాబు సీటు సంగతేం చేశారు?''

''మంత్రిగారి ప్రైవేటు సెక్రెటరీతో రాత్రి ట్రంక్‌లో మాట్లాడాను. మంత్రిగారు పబ్లిక్‌స్కూలు ప్రిన్సిపాల్‌తో చెప్పారట. తప్పకుండా సీటు ఇస్తానన్నాడట.''

వరూథిని హృదయంలో జ్యోతులు వెలిగాయి. కళ్ళు సంతోషంతో వెలిగిపోయాయి. ఆ వెలుగులో వెంకటపతి కళ్ళు చిట్లించాడు.

''బాబు చదువుకు మంత్రిగారెందుకంటాప్?'' ముఖం అంతా పెద్ద ప్రశ్నార్థకంగా వేసి అడిగాడు వెంకటపతి.

''మీది మరీ అక్కుపక్షిగోడు! హైదరాబాద్ జాగీర్‌దార్ స్కూల్లో బాబును చేర్పించబోతున్నాంగా!'' అన్నది వరూథిని.

''జాగీర్దార్ రాణాలో చదువు చెప్తారా?'' అన్నాడు అమాయకంగా వెంకటపతి.

''ఆహా! గొడ్లకాడ పేడ ఎత్తేయిస్తారు!'' రపీమని ముఖంమీద గుద్దినట్లు అంది వరూథిని.

వెంకటపతి చిన్నబుచ్చుకున్నాడు. అతనిమీద రామనాథబాబుకే జాలివేసింది.

''అదేమిటి? తెలియకపోతే చెప్పాలి. ఏమిటా మాటలు?'' వరూథిన్ని కసిరినట్టు అన్నాడు రామనాథబాబు.

దీనికంటే రామనాథబాబే ఎంతో నయం! ఇది తనే విష్ణుచక్రం తిప్పుతున్నట్లు మాట్లాడుతుంది. ఆయన లేకపోతే అసలు దీనివల్ల ఏమవుతుంది?

పెళ్ళాంమీద కోపం అలా ఆలోచించుకొని తీర్చుకున్నాడు వెంకటపతి.

''చెబితే అర్థం చేసుకొనే మనుషులకయితే చెప్పొచ్చు!'' తన వాదాన్ని బలపరచుకొంటూ మొండిగా అన్నది వరూథిని.

''చెప్పే పద్ధతుల్లో చెప్తే అందరికీ అర్థం అవుతుంది.'' కొంచెం కరుగ్గా వుంది రామనాథబాబు గొంతు.

వాళ్ళిద్దరి సంభాషణ తనకేం పట్టనట్టు కూర్చున్నాడు వెంకటపతి. కొడుకు చేతిలోవున్న 'డ్రంబాయ్' బొమ్మను తీసుకుని అటూ ఇటూ తిప్పాడు. 'డ్రంబాయ్' దడదడా మ్రోగించాడు. వెంకటపతి నోరు తెరచి చూడసాగాడు. రవి తండ్రి చేతుల్లోంచి బొమ్మ తీసుకొని 'కీ' ఇచ్చి మళ్ళీ తండ్రి చేతుల్లో పెట్టాడు.

''ఆ చెప్పేదేదో ఆయనకే చెప్పకూడదూ? మధ్య నాకెందుకీ ఉపన్యాసం?'' రామనాథబాబుకేసి చురుగ్గా చూస్తూ అన్నది వరూథిని.

''పట్టుకుంటే వదలవే!''

''ఇప్పుడెవర్ని పట్టుకొన్నాననంటారూ?'' సాగతీసింది.

రామనాథబాబుకు నోటమాట రాలేదు. వరూథినికేసి నొసలు చిట్లించి చూశాడు.

''ఒహాళ్ళను తిట్టుకోవాల్సిన అవసరం నాకేమిటి?'' మళ్ళీ రెట్టించి అన్నది వరూథిని.

''నీతోమాట్లాడే ఓపిక నాకు లేదు''

''పోనియ్! పోట్లాడే ఓపికన్నా వుందా?''

ఈసారి రామనాథబాబుకు నవ్వొచ్చింది.

వరూథిని మాటకారి. ఆమెను మాటల్లో జయించటం తనచేతకాదు. తన ఓటమిని అంగీకరించాడు. చిరునవ్వుతోనే తెలియజేశాడు. వరూథిని ప్రసన్న వదనంతో లేచి లోపలకు వెళ్ళింది. రవి బొమ్మలన్నీ ఎత్తుకొని వరండాలోకి వెళ్ళాడు.

అక్కడ చేరిన నౌకర్ల పిల్లలకు అవి ఎలా తిరుగుతాయో, మోగుతాయో ఒక్కొక్కటే చూపించసాగాడు.

"నీవేమిటనేది? జాగీరు బడేమిటి?" వెంకటపతి రామనాథబాబును అడిగాడు.

"జాగీర్దారు స్కూలంటారు. అక్కడంతా బాగా ఉన్నవాళ్ళ పిల్లలు చదువుకొంటారు."

"అదెక్కడా మన వూళ్ళో లేదే? నేనెప్పుడూ వినలేదు"

రామనాథబాబు పెదవుల మీద చిరునవ్వు తొణికింది.

"స్కూలు ఇక్కడలేదు, హైదరాబాదులో వుంది."

"అట్టా చెప్పండి. చాలా ఖర్చవుతుందనుకొంటా. ఎంతవుతుందేమిటి?" అడిగాడు వెంకటపతి, మెదడులోని చీకటి మబ్బులు తొలగిపోయినట్టయి.

"రెండొందలు పైగా అవుతుంది!" రామనాథబాబు చెప్పాడు.

వెంకటపతి ఆలోచించి అన్నాడు - "ఏడాదికి రెండొందలు అయితే ఫర్వాలేదనుకొంటాను. జమీందార్ల బడికదా! ఆమాత్రం కాకుండా వుంటుందా మరి!"

"ఏడాదిక్కాదు. నెలకు రెండొందలు!" వెంకటపతిమీద రామనాథబాబుకు జాలీ, కోపం రెండూ కలిగాయి.

"నెలకే రెండొందలా?" వెంకటపతికి గవదలు నొక్కుకుపోయాయి. కాఫీ ట్రే పట్టుకొని వచ్చింది వరూథిని. ఆమెకేసి మూగపశువులా చూశాడు వెంకటపతి.

రామనాథబాబు కాఫీతాగి సిగరెట్ వెలిగించాడు. యథాలాపంగా వెంకటపతి త్రీఫైవ్ సిగరెట్ టిన్నులోనుంచి ఒకటి తీసి ఇచ్చాడు.

"ఇది నాకేం అనుద్దీ?" అంటూనే వెంకటపతి సిగరెట్ అందుకున్నాడు.

"ఇహ అదే తక్కువ మన బతుక్కి? నేర్పండి?" భర్తకేసి నిరసనగా చూస్తూ, రామనాథబాబును కవ్విస్తూ అన్నది వరూథిని.

వెంకటపతి సిగరెట్ దమ్ము గట్టిగా లాగి పొగ వదిలాడు.

"అయితే..." అంటూ భార్యకేసి చూసి "ఏమీలేదులే" అన్నాడు వెంకటపతి.

రామనాథబాబు లేచి నిలబడ్డాడు.

"ఇవ్వాళ ఐదో తారీఖు - గుర్తుందా?" రామనాథబాబును సూదితో గుచ్చినట్టుగా చూస్తూ అన్నది వరూథిని.

"ఎందుకులేదూ?" అన్నట్టు రామనాథబాబు తలెగరేశాడు.

"బాబు స్కూలు ఫీజు - బట్టలూ... ప్రయాణం ఖర్చులు... ఈ నెల అదనంగా...." వరూథిని మాట పూర్తికాకుండానే "అంటే నీ ఉద్దేశ్యం ఆ మాత్రం బుర్ర నాకు లేదనేనా?" అన్నాడు రామనాథబాబు.

"అట్లా అడుగు! దాన్ని అట్టాగే అడుగు! ప్రతీదీ దానికే తెలిసినట్టూ ఎవరికీ తెలియనట్టూ అనుకొంటుంది" అనుకొని వెంకటపతి మనసులోనే రామనాథబాబును అభినందించుకొన్నాడు.

కారెక్కబోతున్న రామనాథబాబుతో ''మళ్ళీ దర్శనం ఎప్పుడూ?'' అన్నది వరూథిని.

''రాణీగారి అనుజ్ఞ అయినప్పుడు'' పక్కనే వున్న వెంకటపతిని చూస్తూ ఆ మాటలు పైకి అనలేకపోయాడు రామనాథబాబు.

వారంరోజుల తర్వాత రామనాథబాబు జాగిర్దార్ స్కూలు అప్లికేషన్ ఫారం తీసుకొని వచ్చాడు.

''బాబుకు సీటు వచ్చిందా?'' వరూథిని పట్టరాని సంతోషంతో అడిగింది.

''రాక ఎక్కడికి పోతుందిలే. ముందు ఈ ఫారం పూర్తిచేసి పంపాలి. 'మే' నెల్లో టెస్ట్ వుంటుందట. జూన్లో చేర్చుకుంటారు'' కవరులోనుంచి ఫారమూ, ప్రాస్పెక్టస్ తీస్తూ అన్నాడు రామనాథబాబు.

''మళ్ళీ టెస్టేమిటి? మినిస్టరుగారితో చెప్పించేంలాభం?''

''ఎవరు చెప్పినా పద్ధతి మాత్రం అదేనట. నీకెందుకా గొడవంతా! ఫారం పూర్తి చేసి రిజిస్ట్రేషన్ ఫీ పంపించు!'' అన్నాడు రామనాథబాబు.

ట్యూషన్ మాష్టర్ని పెట్టించి ఆ నెలంతా ఇంగ్లీషూ, లెక్కలూ చెప్పించింది వరూథిని. మే నెల మొదటి వారంలో కుర్రాణ్ణి తీసుకొని రామనాథబాబుతో హైదరాబాదు వెళ్ళింది.

వరూథిని తిరిగొచ్చేసరికి వారంరోజులు పట్టింది. వెంకటపతి కొడుకుని వదిలి ఇన్ని రోజులు ఎప్పుడూ లేడు. వాడ్ని చూడకపోతే బెంగపడిపోయినట్టయిపోయాడు. రవి వచ్చినరోజు వాడ్ని వదలకుండా తన దగ్గిరే పెట్టుకొన్నాడు. వాడు హైదరాబాదులో తను చూసినవీ, తను చదవబోయే స్కూలు ఎంత గొప్పదో చెప్తూంటే తన్మయుడైపోయి విన్నాడు వెంకటపతి.

''అక్కడి పిల్లలకు ఏం డ్రస్సో చెప్పావురా బాబూ మీ నాన్నగారికి?'' అన్నది వరూథిని.

''అవును నాన్నా! అంతా యూనిఫారం. ఖాకీడ్రస్సు. అంతా మిలటరీ వాళ్ళల్లే వుంటారు నాన్నా!'' చెప్పాడు రవి చేతులు తిప్పుతూ.

వెంకటపతి కొడుక్కేసి గర్వంగా చూసుకొన్నాడు.

''నేను మిలటరీలో చేరిపోతా నాన్నా!'' అన్నాడు రవి.

''ఏమిషిటా రవీ! నువ్వు మిలటరీలో చేరిపోతావా?'' డైనింగ్ టేబుల్మీద పళ్ళేలు సర్దుతూ మురిపెంగా అడిగింది వరూథిని.

''అవునమ్మా!''

''నువ్వు ఐ.ఏ.యస్. పాసయి కలెక్టరు కావాలని నేననుకొంటుంటే నువ్వు సైన్యంలో చేర్తానంటావేంరా?'' భర్తకూ, కొడుక్కూ అన్నం వడ్డిస్తూ అన్నది వరూథిని.

''ఛీ! పిచ్చి కలెక్టరేంటమ్మా! చీఫ్ ఆఫ్ స్టాఫ్ అవుతాను'' అంటూ రవి విసురుగా తల్లికేసి తిరిగాడు.

వాడి చెయ్యి తగిలి టేబుల్‌మీద నుంచి నీళ్ళగ్లాసు కిందపడింది. వరూథిని చీరమీద నీళ్ళు తొణికాయి.

"ఛ! ఏమిటా ఇది? మిలటరీ ఆఫీసరయేవాడు ఇట్లా చేస్తాడా ఏం? ఇట్లా చేస్తే మిలటరీలోనుంచి తీసేస్తారు తెలుసా? సరిగా కూర్చో!" అంది తల్లి.

రవి నిజంగా తనను మిలటరీలోనుంచి తీసేస్తారేమోనన్నట్టు బుద్ధిగా కుర్చీలో కూర్చున్నాడు.

"నాన్నా! నువ్వు చెప్పు - కలెక్టరెక్కువా? చీఫ్ ఆఫ్ స్టాఫ్ ఎక్కువా?" రవి తండ్రిని అడిగాడు.

"ఇద్దరూ ఎక్కువే!" అన్నాడు వెంకటపతి.

"ఇద్దర్లో ఎవరు ఇంకెక్కువా?"

"సర్లే! అన్నం కలుపుకో!" అన్నది వరూథిని.

"నే చెప్పనా?" అన్నాడు కొడుకు.

"ఊఁ! చెప్పు!" అన్నాడు తండ్రి.

"చీఫ్ ఆఫ్ స్టాఫ్! ఎందుకో తెలుసా? సైన్యం అంతా నాకిందే వుంటుంది."

"ఎవరు చెప్పారా నీ కివన్నీ?" వరూథిని మురిపెంగా అడిగింది.

"మా ట్యూషన్ మాస్టారు చెప్పాడు!" అన్నాడు రవి, తన ట్యూషన్ మాస్టారు చెప్పిందానికి తిరుగులేదన్నట్టు.

"అసలు చదువు మానేసి ఇవి చెప్పాడా ఏమిటి?" అంది వరూథిని నవ్వుతూ.

రవి అలిగినట్టు ముఖంపెట్టి అన్నం తినడం మానేశాడు.

"మీ మాస్టారు చెప్పిందే కరెక్ట్! త్వరగా అన్నం తినేయ్ బాబూ!" కొడుకుని బుజ్జగించింది వరూథిని.

భోజనాలయాక వెంకటపతి కొడుకుని తన పక్కలో పడుకోబెట్టుకొని నిద్ర పుచ్చాడు. వాడు నిద్రపోయాక లేచి వరండాలోకి వచ్చాడు. చుట్ట వెలిగించుకొని గుంజ కానుకొని తాపీగా కూర్చున్నాడు.

"హాలు దగ్గర కెళ్తున్నారా?" వరండాలోకి వస్తూనే ప్రశ్నించింది వరూథిని భర్త నుద్దేశించి.

"టైం ఎంతయిందీ?" అడిగాడు వెంకటపతి చుట్టకొడి దులుపుతూ.

"రెండో ఆట బుకింగ్ ఇంకా తెరిచివుండదు. మీరు వెళ్ళొచ్చు"

"ఇవ్వాళ పోలేన్లే. బద్ధకంగా వుంది" అన్నాడు వెంకటపతి పాలుమాలి.

"ఇంట్లో ఉన్నయ్‌గా పీసాలు? ఇంకా బయటేంపని మీకూ?" అన్నది వరూథిని.

"బాబును స్కూల్లో చేర్పించే దెప్పుడూ?"

"ఇంకా ఎన్నిరోజులున్నదీ! ఇవాళ మూడో తారీఖుగదూ? ఇంకో పదిరోజుల్లో బయలుదేరిపోవాలి. పదిహేనుకల్లా బాబు స్కూల్లో వుండాలి."

"అయితే హైదరాబాదులో ఇల్లు చూశారా? అద్దెంతా?"

''ఇల్లెందుకూ?''

వెంకటపతి తలెత్తి చూశాడు. ''పట్నంలో ముందుగా చూసుకోకపోతే ఎప్పుడంటే అప్పుడు దొరుకుతయ్యా?'' అన్నాడు.

''ఏమిటి? నీ సొదా నువ్వూను? అసలు ఇల్లెందుకు అక్కడా? బాబు స్కూలు హాస్టల్లోనే వుంటాడు'' అన్నది విదిలించినట్టుగా వరూథిని.

''వాడికి ఏడేళ్ళు లేవు. ఒంటరిగా అంత దూరాభారాన మనల్ని విడిచి ఎట్టా వుంటాడూ?''

''అక్కడ ఏర్పాట్లన్నీ ఉంటాయనేగా జాగీర్దార్ స్కూల్లో చేర్పిస్తోంది? అలా వుంటేనే వాడికి చదువు అబ్బి పైకొస్తాడు. లేకపోతే నీలా నాలాగానే తయారవుతాడు!''

''హైదరాబాద్‌లో సినిమాహాలు కట్టబోతున్నాం కదా? మనంకూడా అక్కడే ఉంటాం. అందుకనే బాబును హైదరాబాదులో చేర్పిస్తున్నారేమో ననుకొన్నాను!''

''మనం హైదరాబాదులో కాపురం ఉన్నా బాబును మాత్రం స్కూల్లో ఉంచాలి. అక్కడ వుండే పెద్ద పెద్ద స్థితిమంతులుకూడా పిల్లల్ని బోర్డర్సుగా పెడ్తారు. అక్కడి చదువులు మన చదువుల్లాంటివి కావు.''

''అయితే నువ్వుకూడా వెళ్ళి చదువుకో బాబు స్కూల్లో, బిల్లు కలెక్టరన్నా అవుదువుగాని.''

వెంకటపతి నవ్వటానికి ప్రయత్నించాడు. అయినా నవ్వు రాలేదు.

''హైదరాబాదు చుట్టూ ఆరునెళ్ళనుంచీ తిరుగుతున్నారు. ఇంతకీ హాలు కట్టే సంగతి ఎంతవరకు వచ్చినట్టూ?''

''మనం చూసిన స్థలం చాలా మంచిదే. కాని ఏదో లిటిగేషన్‌లో వుందట. అక్కడ సాయిబుల ఆస్తులన్నీ ఏవో గొడవలుగానే వుంటాయట! ఇంకా నయం! మనకు ముందే తెలిసింది. ఒకసారి మోసపోయింది చాలక... మళ్ళీ....''

''వేరే స్థలం చూడొచ్చుగా?'' మధ్యలోనే అందుకొని అన్నాడు వెంకటపతి కొడుకుని వదిలి వుండలేక మనసులో మథనపడసాగాడు. అంతకుముందు హైదరాబాదు వెళ్ళడం అంటేనే ఇష్టపడనివాడు కొడుకు కోసం ఏదైనా వదిలి వెళ్ళడానికి మనస్సు దృఢపరచుకొన్నాడు. ఎలాగయినా సినిమాహాలు ప్లాను కుదిరి హైదరాబాద్‌లో కట్టడం జరగాలని మనసారా కోరుకొన్నాడు వెంకటపతి.

''స్థలాలెందుకు లేవూ? కట్టుకుపోయినన్ని వున్నాయ్. ఈ స్థలం అయితే చాలా మంచి సెంటర్లో వుంది. చవుగ్గా కూడా దొరుకుతుంది. మనం నాలుగైదు వేలు ఖర్చు పెట్టి ఐ.జి.పి. వాళ్ళను పట్టుకొంటే ఆ స్థలం లిటిగేషన్‌లోనుంచి బయటపడుతుంది. రామనాథబాబుగారు పెద్ద పెద్దవాళ్ళను పట్టుకొని మొత్తంమీద పని సాధిస్తారులెండి. రెండు మూడు నెలల్లో స్థలం మనం రిజిష్టరు చేయించుకోవచ్చు. ఈ లోపల ప్లాన్లూ, పర్మిషన్లూ, లోన్లూ చూసుకోవాల్సినవి చాలా వున్నాయి. అవి పూర్తి అయేసరికి ఆ స్థలం లిటిగేషన్‌లో నుంచి బయటపడుతుంది.'' తను చెప్పేది భర్త వినడం లేదని గుర్తించి ఆపేసింది వరూథిని.

అయినా ఈ మనిషికి తను ఇంత చెప్పటం ఏమిటి? తనూ ఒకోసారి తెలివి తక్కువ పడుతుంది. పిచ్చి మొహంలా చెప్పింది. రామనాథబాబు చెప్పిందంతా మనసులో మననం చేసుకుంటూ, ఎవరికైనా అయినవాళ్ళకు చెప్పాలనే కుతూహలం అణచుకోలేకపోయింది. ఈ మనిషికి చెప్పినా ఒకటే, చెప్పకపోయినా ఒకటే! బస్తీ కొచ్చి ఎన్నేళ్ళయింది? ఈ మనిషిలో ఆవగింజంత అభివృద్ధిలేదు. ఏదో అనుకొంటాడు. ఏదో మాట్లాడతాడు. అదీ ఒకందుకు మంచిదేనేమోలే!

చుట్ట పారేసి వెనక్కు తిరిగి చూశాడు వెంకటపతి. వరూధిని లేదు. ఆమె ఎప్పుడు లేచి వెళ్ళిందో కూడా వెంకటపతికి గుర్తులేదు. గుర్తు చేసుకోవటానిక్కూడా ప్రయత్నించలేదు.

## 28

వరూధినీ పిక్చర్ ప్యాలెస్ మరో పేరును సంతరించుకొంది. వరూ ఫ్యాలెస్ అంటేనే జనానికి అర్థమౌతుంది. మిగతా హాలువాళ్ళకూ, బస్సుడ్రైవర్లకూ, రిక్షావాళ్ళకూ అమ్మగారి హాలు అంటేనే అర్థం అయిపోతుంది. జనంలో కూడా చాలావరకు అమ్మగారి హాలంటేనే తెలిసిపోతుందిప్పుడు. అందుక్కారణం తరచు ఆమె హాలు దగ్గర కన్పించటమే! మొదటి ఆట ఇంటర్వెల్ సమయంలో వరూధిని వారానికి నాలుగు సార్లన్నా హాల్లో కన్పించడం జరుగుతుంది. హాలు వర్కర్లూ, రిప్రెజెంటేటివ్‌లూ, మేనేజరు శివరాం ఆమెకు అడుగులకు మడుగులొత్తుతూ చుట్టూ చేరడం సినిమా కొచ్చిన జనం కూడా చూస్తున్నారు. ఆ రోజు కలెక్షన్ గురించీ, సినిమా మంచి చెడ్డల గురించీ మొదటి రోజుల్లో అడిగితేగాని చెప్పనివాళ్ళు ఇప్పుడామె మేనేజరు గదిలో కాలు పెట్టగానే రోజువారి రిపోర్టు ఇవ్వటం మొదలుపెట్టారు. ఎలాంటి సినిమాలయితే బస్తీవాళ్ళు చూస్తారో, ఆడవాళ్ళకు ఎలాంటి సినిమాలు నచ్చుతాయో, యువకులకు ఎలాంటి సినిమాలు కావాలో వరూధిని తేల్చిచెప్పే దశకు పెరిగింది. అందరూ ఆమె అభిప్రాయాలకు విలువ నిస్తున్నారు. అమ్మగారొస్తున్నారంటే వర్కర్స్‌కు హడల్‌గా వుంటుంది ఇప్పుడు. ప్రతిదీ ఆరా తీసుకోవడంవల్ల, ఆమెకు తెలియని విషయం అంటూ ఎక్జిబిషన్ లైనులో లేదు.

రామనాథబాబు వరూధినీ పిక్చర్ ప్యాలెస్‌మీద లోగడంత శ్రద్ధ చూపించడంలేదు. తన సొంత హాలు మరమ్మత్తులూ, కొత్త ఫర్నిచరూ, ప్రొజెక్టర్ రిపేర్ చేయించే పనుల్లో పడి ఎక్కువకాలం తన హాలు దగ్గరే ఉండిపోతున్నాడు. ఒకోసారి రెండు మూడు రోజులు వరసగా రాకుండా వుండిపోతున్నాడు. అయితే శివరాం రోజూ వెళ్ళి రామనాథబాబు ఎక్కడున్నా మంతనాలాడి వస్తూనే వున్నాడు.

రామనాథబాబు తనకు తీరిక చిక్కినప్పుడల్లా వరూధిని ఇంటికి వెళ్ళేవాడు. అతను వెళ్ళేసరికి ఆమె ఇంట్లో లేకపోతే చిరాకు పడేవాడు. ఎన్నోసార్లు అలా జరిగింది. వంట మనిషో, పనిపిల్లో, అమ్మగారు హాలు దగ్గరకు వెళ్ళారని చెప్పినప్పుడు అతనికి వంటికి కారం పూసినట్టయేది. నాలుగైదుసార్లు వరూధిని హాలు దగ్గరుందంటే

అక్కడికి వెళ్ళాడు. అయినా అక్కడ వరూథినితో మాట్లాట్టం అంత ఇష్టంగా ఉండేదికాదు. కొన్నాళ్ళు గడిచేసరికి వరూథిని హాలు దగ్గరుందంటే ఆ ఛాయలకే వెళ్ళడం మానేసేవాడు. అక్కడ అంతమంది మగాళ్ళమధ్య వరూథిని నిలబడి మాట్లాడుతుండటం చూస్తే రామనాథబాబుకు తల కొట్టేసినట్టయేది. ఒకసారి నేరుగా హాలు దగ్గర కొచ్చిన రామనాథబాబు తనను చూసి గిరున వెనక్కు తిరిగి వెళ్ళడం వరూథిని గమనించింది. అతనికి తను తరచు హాలు దగ్గరకు రావడం ఇష్టంలేదని గట్టిగానే పసికట్టింది. రామనాథబాబు తనకు తెలియకుండానే దూరం అవుతున్నాడని బాధపడసాగింది. సన్నగా మొదలైనబాధ భయం భయంగా మారసాగింది. ఈ సమయంలో రామనాథబాబును దూరం చేసుకొంటే చాలా నష్టాలున్నాయన్న అభిప్రాయం ఆమెలో వేళ్ళు తన్నింది.

ఇంకా హైదరాబాదు థియేటర్ ప్రారంభ దశలోనే వుంది. ఈ థియేటర్ లీజు వ్యవహారాలు తుది రూపం దాల్చలేదు. ప్రస్తుతం జరగాల్సిన పనులెన్నో వున్నాయి. ఉత్తరోత్తరా జరగాల్సినవి చాలా వున్నాయి. అందుకు రామనాథబాబు సహకారం, అండా తనక్కావాలి. అంతేనా రామనాథబాబు గురించి తను కోరేది! అసలు రామనాథబాబు తనకేమీ కాడా? రామనాథబాబు అవసరం తనకు లేదా? తన సర్వస్వం రామనాథబాబుకే అర్పించింది. ఇప్పుడతను దూరమౌతుంటే తను సహించగలదా?

వరూథినికి దుఃఖం పొర్లుకొచ్చింది. దీనంతటికి తనే కారణం. రామనాథబాబు తప్పేమీలేదు. తను అతిగా ప్రవర్తించటం మంచిది కాదేమో!

హాలు దగ్గర కెళ్ళటానికి సిద్ధమయి వాకిట్లోకి వచ్చిన వరూథిని గిరున వెనక్కు తిరిగింది. ఇంట్లోకెళ్ళి పట్టుచీర మార్చి నేతచీర కట్టుకుంది. ముడిలో పువ్వులుకూడా భారంగానే తోచాయి. తీసి డ్రెసింగ్‌టేబుల్ మీదకు విసిరింది. ముడివిప్పి జడ వేసుకొంది.

వంటమనిషి ‘‘అదేమిటమ్మా! హాలు దగ్గిర కెళ్తానన్నారుగా? వాకిట్లో జట్కావాడు ఎదురు చూస్తున్నాడు.'' అన్నది.

‘‘నే వెళ్ళడం లేదు. జట్కాను పంపించేయ్!''

‘‘ఏమ్మా? వంట్లో బాగా లేదా?'' ఆదుర్దాగా అడిగింది వంటమనిషి.

వరూథిని మాట్లాడలేదు. పక్కమీద పడి దిండులో తలదూర్చి పడుకొంది. బుచ్చమ్మ మాట్లాడకుండా గదిమంచి బయటకు వెళ్ళింది.

ఓ వారం రోజులు వరూథిని థియేటర్ వైపు కన్నెత్తయినా చూడలేదు. ఇల్లు వదిలి బయటికేపోలేదు. ఏమీ తోచడంలేదు. ఊరికే ఇంట్లో ఉంటే పిచ్చెత్తినట్లుగా వుంది. అక్కడికీ వెంకటపతిని గుచ్చి గుచ్చి ప్రశ్నించేది.

‘‘ఆఁ- వస్తానే వున్నాడు!'' అంతకుమించి చెప్పేవాడుకాదు వెంకటపతి వరూథిని రామనాథబాబును గురించి అడిగితే. హాలుకు సంబంధించిన వ్యవహారాలు అడిగితే ‘‘అంతా బాగానే ఉంది'' అనేవాడు.

అతని వాలకం, సమాధానాలు చెప్పే ధోరణికి వరూథినికి కంపరం పుట్టిపోయేది. అయినదానికీ కానిదానికీ వెంకటపతిని పొడిచి కవ్వించేది వరూథిని. వీలైనంతవరకూ పెళ్ళాం కళ్ళముందునుంచి తప్పుకోనేందుకు ప్రయత్నిస్తున్నాడు వెంకటపతి. ఎప్పుడూ హాలు దగ్గరే వుండిపోతున్నాడు. అక్కడే స్టోర్సు గదిలో కూర్చొని తాగేవాడు. తను పొందే ఆనందమేదో ఆ సామాన్ల గదిలోనే అనుభవించేవాడు. నిద్రొస్తే అక్కడే నిద్రపోయేవాడు.

ఆ రోజు ఆదివారం. వెంకటపతి ఏడు గంటలకల్లా తయారయి బయలుదేరాడు.

''ఇంత పొద్దున్నే ఎక్కడికి?'' భర్తకు ఎదురుగావచ్చి అడిగింది వరూథిని.

''హాల్ దగ్గరకే! ఆదివారంగా? మార్నింగ్ ఆటుందిగా?''

''మార్నింగ్ షో వుంటే నువ్వేం చేస్తావూ?''

వెంకటపతి మాట్లాడలేదు.

''అసలు నీకేం పనక్కడ?'' ప్రాథమిక ప్రశ్న వేసింది వరూథిని.

''ఏం చేస్తానా? రోజూ చేసేదే!'' అన్నాడు వెంకటపతి.

''హాలు ఊడుస్తావా?''

వెంకటపతి తలెత్తి భార్యకేసి కోపంగా చూడబోయాడు. భార్య ముఖంలోకి చూసేసరికి కోపం అంతా ఆవిరైపోయింది. గాబరాపడ్డాడు. చూపులు గోడకేసి తిప్పుకున్నాడు.

''హాలు ఊడ్చేవాళ్ళున్నారు.''

వెంకటపతికి భార్యముందు నిలబడడం ముళ్ళమీదున్నట్టుంది.

''టిక్కెట్లమ్ముతావా?''

''వెంకటపతి మాట్లాడలేదు.

''అందుకూ మనుషులున్నారు.''

వెంకటపతి చూపులు గోడమీదనుంచి భార్య మీదకు తిరిగాయి. ఏమిటి ఇవ్వాళ ఇది ఇంత ఇదిగా ఉంది?

''గేటులో నిలబడతావా?''

''ఏంటి నీ గొడవ పొద్దున్నే?'' అనగలిగాడు వెంకటపతి. అప్పటికే నరాలు గుంజపొగాయి. తెల్లారాక కొంచెమయినా గొంతులో పడలేదు.

''దానికీ మనుషుల్ని పెట్టాం జీతం యిచ్చి!''

కాళ్ళు లాగుతున్నాయి. పెళ్ళాంకేం సమాధానం చెప్తాడు?

''ప్రొజెక్టరు నడుపుతావా?''

ఏమిటిది? దీని కివ్వాళేదో పిచ్చెక్కినట్టుంది, అనుకొన్నాడు వెంకటపతి.

''అది నీకు చాతకాదు. ఆపరేటరున్నాడు.''

వెంకటపతి భుజంమీద టవల్‌తీసి మళ్ళీ వేసుకొన్నాడు - అంతకంటే చేయడానికీ, చెప్పడానిగ్గానీ ఏమీతోచక.

''కలెక్షన్ చార్జూ, కమ్మీషనూ - బిజినెస్ చూస్తావా?''

అంతవరకూ కళ్ళే వెళ్ళబెట్టి ఉన్న వెంకటపతి ఈసారి నోరువెళ్ళబెట్టేడు.

''మరి ఇక నువ్వు చేసేదేమిటి?''

''ఫిలిం డబ్బాల గదిలో కూర్చుని తాగడం!'' అంతవరకూ బాగానే గుర్తొచ్చింది వెంకటపతికి. ఇంకా నయం, ఆ మాట పైకి అనలేదు.

వెంకటపతి నిజంగానే ఆలోచించాడు. అసలు తను చేస్తుందేమిటి? తను హాలు దగ్గర లేకపోతే తెరమీద బొమ్మకూడా పడదేమో నన్నట్టుండేది ఇనడు. కాని ఇప్పుడది అడుగుతుంటే అనిపిస్తోంది - నిజంగానే తను అక్కడ చేస్తుందేమిటి?

''మాట్లాడరేం?'' ఆగ్నేయాస్త్రం సంధించి విడవబోయేముందు మహారథి శత్రు సైన్యాన్ని చూసినట్టు భర్తకేసి చూసింది వరూథిని.

''అదే! నేనేం చూస్తున్నాను?'' ఆ మాట భార్యనే తిరిగి అడుగుతున్నట్టుగా ఉంది వెంకటపతి ముఖం.

''సిగ్గు లేకపోతేసరి?''

తనకు ఇంకా సిగ్గు ఉన్నట్టే తలవంచుకొని నేలచూపులు చూశాడు వెంకటపతి.

''పదండి లోపలకు. హాలు దగ్గర కెళ్ళొద్దు. మీ అలుసు చూసుకొనే ఆ రామనాథబాబు అట్లా ఆడుతున్నాడు.'' వరూథిని గిర్రున వెనక్కు తిరిగి బాత్‌రూంలోకి వెళ్ళింది.

వెంకటపతి పైటవల్ కుర్చీమీదవేసి, అందులో కాళ్ళు జారేసి కూలబడ్డాడు. వీరిద్దరికీ చెడినట్టుంది. ఎందుకు చెడదూ? దీని నోరు మంచిదికాదు! దీని బుద్ధో? –ఆ ప్రశ్నకు సమాధానం వెతకడం వెంకటపతికి మనస్కరించలేదు. అలా వెతికితే తను ఏదో దిగుడుబావిలోకి దిగిపోతున్నట్టుంది.

వాళ్ళిద్దరిమధ్యా ఏం జరిగిందో మరి? తన పని ఇరుకులో పడింది. తన కాళ్ళకూ చేతులకూ ఉచ్చులు బిగిసినట్టయిపోయింది! ఇదివరకటిలా రామనాథబాబు రావడంలేదు. వాళ్ళిద్దరూ సరిగా మాట్లాడుకుంటున్నట్లులేదు. అప్పటినుంచే వరూథిని పిచ్చికుక్కలా తనవెంట పడుతోంది. దీనికంతా కారణం రామనాథబాబు వరూథినితో సరిగా ఉండక పోవటమే. తన కష్టాలకూ, ఇబ్బందులకూ కారణం వాళ్ళిద్దరిమధ్యా వచ్చిన తగాదాయే.

వెంకటపతి ఆలోచించగా ఆలోచించగా తట్టిన విషయం అది.

రామనాథబాబు వస్తూపోతూ వుంటేనే తన పని బాగుంది. తనేం చేస్తుందీ వరూథిని పట్టించుకునేదికాదు. ఇప్పుడు అన్నీ ఆరాలూ అజలూ. అసలు హాలువైపుకే వెళ్ళొద్దంటుంది. వెళ్ళకుండా తను ఎలా వుండగలడు? దానికి ఎదురుగా తను ఇంట్లో వుంటే చచ్చినట్టే! ఒక్క నిముషం ఉండలేడు.

హాలు దగ్గర సామాన్ల గదిలో క్రితం రోజున వదిలొచ్చిన బాటిల్లో మిగిలిన సగం సారా గుర్తొచ్చి వెంకటపతి దిగులుపడిపోయాడు.

వరూథిని స్నానం చేసి గద్వాల్ చీర కట్టుకొంది. అజంతా స్టయిల్లో ముడిచుట్టుకొని పూర్తిగా ముస్తాబయింది. హైహీల్స్ చెప్పులు తొడుక్కొని

వ్యానిటీబ్యాగ్‌ను వయ్యారంగా తిప్పుకుంటూ వరండాలో కొచ్చిన వరుథిన్ని చూసి వెంకటపతి తెల్లమొఖం వేశాడు. వరూథిని హాలు దగ్గరకే ప్రయాణం అయిందని అర్థం చేసుకున్నాడు. తనను వెళ్లొద్దని ఇప్పుడు అదే ఎందుకు వెళుతున్నట్టు? తనను వద్దనడానికి కారణం?

వెంకటపతి బుర గోక్కున్నాడు. ఏదో వంకచెప్పి మరో గంటలోనో, అరగంటలోనో బయటికెళ్ళి ఆ సీసాలోది పూర్తిచేసివద్దామనుకొన్న వెంకటపతికి ఆశాభంగమైంది. అది హాలు దగ్గరేవుంటే తను ఎలా వెళ్ళడం?

గేటుదాకా వెళ్ళిన వరూథిని తిరిగి మందగొడిగా ఇంట్లోకి వచ్చింది. వెంకటపతికి ఏమీ అర్థం కాలేదు.

మళ్ళీ వెనక్కు వచ్చిందేం? దీనికి మతి సరిగ్గా వున్నట్టులేదు. వరండాలో కూర్చుని భార్యకేసి తలతిప్పకుండానే చూస్తున్న వెంకటపతి అనుకొన్నాడు.

వెంకటపతి అనుకొన్నట్టు వరూథినికి మతిలో మతిలేదు. వ్యానిటీ బ్యాగ్ అవతలకు విసిరేసి పడగ్గదిలోకి వచ్చి కూర్చుంది. ముడి వూడదీయాలా, చీర మార్చుకోవాలా అన్నదికూడా తేల్చుకోలేక అలాగే కూర్చున్నది.

ఆమె మెదడులోని ప్రతి సెల్లూ, శరీరంలోని ప్రతి అణువూ 'రామనాథబాబు' అంటున్నట్టున్నాయి! రామనాథబాబు హాలు దగ్గిర వుంటాడని ఆమెకు తెలుసు. మార్నింగ్ షో ఇంగ్లీషు పిక్చర్ ఆడతారు. దానికి చాలామంది ఆఫీసర్లు వస్తారు. అందులో కొంతమంది ఊరికినే వచ్చేవాళ్ళు. వాళ్ళందరికీ మర్యాదలు చేస్తూ, పరిచయాలు పెంచుకుంటూ రామనాథబాబు తప్పకుండా అక్కడే వుంటాడు. ఆ ఉద్దేశ్యంతోనే వరూథిని బయలుదేరింది. తీరా బయలుదేరాక వరూథినికి అనుమానం వచ్చింది, తన్ను చూసి అతను సరిగా మాట్లాడకపోతే? లేక, తను రావటం చూసి మెల్లగా హాలునుంచి వెళ్ళిపోయి ముఖం తప్పిస్తే తన పనేంగాను? పైగా అతనికోసం తను వెతుక్కుంటూ వెళ్ళినట్టు రామనాథబాబు అనుకుంటే? అంతకంటే తనకు జరిగే అవమానం మరొకటి వుండదు. తను అలుసయిపోదూ? వరూథిని కాంక్షకూ, ఆవేశానికీ, ఉద్రేకానికీ, ఆత్మాభిమానం అడ్డొచ్చింది. ఆమె కళ్ళవెంట నీళ్ళు తిరిగాయి. దుర్మార్గుడు రామనాథబాబు ఎందుకిలా హింస పెడుతున్నాడు?

బయట కూర్చున్న వెంకటపతి వరూథిని తిరిగిరావడం మంచిదే ననుకొన్నాడు. ఏ వంకతో బయటికి వెళ్ళాలా అనే ఆలోచనలో పడ్డాడు. మగాడికి బయట ఎన్నైనా పన్లుంటాయిగా? అవేమిటి? వెంకటపతికి ఆలోచన తెగలేదు.

''ఇంటిదగ్గిరే వున్నారు. హాలు దగ్గిర కెళ్ళలేదేం?''

మెల్లగా వరండాలోకివచ్చి నిలబడ్డ రామనాథబాబును గమనించలేదు వెంకటపతి.

''వెంకటపతిగారూ! మిమ్మల్నే! అలా వున్నారేం?''

వెంకటపతి తలెత్తి చూశాడు.

''లావొక్కింతయులేదు, ధైర్యము విలోలంబయ్యె!'' అన్న గజరాజు పగిది కూర్చున్న వెంకటపతికి రామనాథబాబు సాక్షాత్తు ఆ విష్ణుమూర్తిలాగే అన్పించాడు.

అనిపించటమేమిటి? కన్పించాడు కూడా!

''ఒక కేస్ స్కాచ్ శ్రీ రామా మెడికల్ షాపువాళ్ళు తెప్పించారు. ఓ నాలుగు బాటిల్స్ మన కిచ్చారు. హాలుదగ్గిర పెట్టా. శివరాంను అడగండి'' అన్నాడు రామనాథబాబు.

వెంకటపతి పైటవల్‌కూడా వదిలేసి బయులుదేరాడు.

మకరిని చంపి గజరాజును కైవల్యానికి పంపిన విష్ణుమూర్తి రామనాథబాబుకంటే ఏం గొప్పపని చేశాడూ?

గేటుదాకా వెళ్ళిన వెంకటపతిని పిల్చి ''కార్లో వెళ్ళండి. మీరు దిగి తిరిగి పంపించండి'' అన్నాడు రామనాథబాబు.

కార్లో కూర్చున్న వెంకటపతి రామనాథబాబుమీద కలిగిన కృతజ్ఞతాభారం మోయలేక సీటులో కుంగిపోయాడు.

రామనాథబాబు వరూథిని గదిలోకి వెళ్ళాడు. వరూథిని హంసతూలికా తల్పంమీద అలిగి బిగిసి కాళ్ళు తన్ని పట్టి పడుకొన్న సత్యభామ ఆలనాడు శ్రీ కృష్ణుని చూసినట్టుగా రామనాథబాబును చూసింది.

రామనాథబాబు పారిజాతపుష్పమే తెచ్చాడో, అంతకు మించిందే తెచ్చాడో తెలుసుకోవడానికి నిరాకరించి 'నాతో నీకేం పని?' అన్నట్టు గోడవైపుకు తిరిగి పడుకొన్నది వరూథిని.

## 29

రవి హైదరాబాద్‌లో జాగీర్దార్ స్కూల్లో చేరి ఆరునెలలు దాటిపోయింది. మొదటి మూడు నెలలూ, వాడు అక్కడి వాతావరణంలో ఇమడలేకా, తల్లిదండ్రులకు దూరంగా వుండలేకా బెంగపడ్డాడు. దసరా శెలవలకు కొడుకుని తీసుకొచ్చి, శెలవలు కాగానే స్కూల్లో వదిలేసి వచ్చింది వరూథిని. నవంబర్లో రామనాథబాబుతో హైదరాబాదు వెళ్ళింది. అతను బిజినెస్‌కు సంబంధించిన విషయాలు చూసుకొంటుంటే, వరూథిని రోజూ స్కూలుకువెళ్లి రవితో కొంతకాలం గడిపి వస్తూండేది. మొదట్లోకంటే ఇప్పుడు వాడు బాగానే వున్నాడు. ఇంగ్లీషు మాటలు దంచేస్తున్నాడు. హైదరాబాద్ వదిలి ఊరికి వెళ్తున్నప్పుడూ ఈసారి వాడు వినీవిననట్టే ఊరుకొన్నాడు. మారాం చెయ్యలేదు. వరూథిని కొడుకు భవిష్యత్తు సరైన పునాదులమీదే నిర్మించబడుతోందన్న భావంతో ఉప్పొంగిపోయింది. రవి యోగక్షేమాలు కనుక్కుంటూ ఉత్తరాలు రాస్తూ వుండేది. హైదరాబాద్‌లో స్థలానికి సంబంధించిన లిటిగేషన్‌కూడా వదిలిపోయింది. స్థలానికి అడ్వాన్సు ఇచ్చి ఎగ్రిమెంటు కూడా రాయించుకున్నాడు రామనాథబాబు.

వరూథిని జీవితం మూడుపువ్వులూ ఆరుకాయలుగా వుంది! వెంకటపతి బతుకు మూడు సీసాకాయలూ-ముప్పైఆరు పెగ్గులుగా వుంది. రామనాథబాబు ఎగ్జిబిషన్ బిజినెస్‌లో లోతుగా వేళ్ళు పాతుకొన్నాడు. అతనితో భాగస్వాములుగా చేరి థియేటర్లు కట్టటానికి ప్రతిజిల్లా ముఖ్యపట్టణంలోనూ ధనికులు ముందు కొస్తున్నారు.

అతను చేసే వ్యాపార పరిధికంటే అతని సమర్ధతను గురించిన ప్రచారం నాలుగింతలు పెరిగిపోయింది.

డిసెంబరు శెలవలకు వచ్చిన రవిని సంక్రాంతి పండగ వెళ్ళిందాకా ఇంటిదగ్గరే ఉంచింది వరూథిని. పండగ వెళ్ళిన మరునాడు ప్రయాణం అయి, రామనాథబాబుకు కబురు పెట్టింది. రామనాథబాబు ఆడిట్ గొడవలేమో ఉన్నాయనీ, తను ఈసారి రావటం పడదేమో అన్నట్టుగా చెప్పాడు.

"ఇప్పటికే వారంరోజులు బాబుకు స్కూలు పోయింది. రేపు కాకపోతే ఎల్లుండయినా వెళ్ళాలి." ఖచ్చితంగా చెప్పింది వరూథిని.

"ప్రయత్నిస్తా. రేపు ఎల్లుండిలో పనయిపోతే వెళ్దాం!" అన్నాడు రామనాథబాబు.

ఆ మూడురోజులూ వరూథినికి ముళ్ళమీద ఉన్నట్టుంది. కొడుకు చదువు ఎక్కడ వెనక పడిపోతుందోనన్న ఆరాటంలో పడిపోయింది. వెంకటపతికి కొడుకు చదువుమాట ఎలావున్నా, ఇంకా నాలుగోజులు ఇంటిదగ్గర వున్నాడన్న సంతృప్తి కలిగింది. వీలు చిక్కినప్పుడల్లా రవిని కూర్చోబెట్టుకొని, కబుర్లు చెప్పించుకుంటూ మధురానుభూతిని పొందే వెంకటపతిని చూస్తుంటే వరూథినికి వెగటు కలిగేది. ఏదో వంకతో రవిని పిలిచేది ముఖం అదోలాపెట్టి.

నాలుగోరోజున కుర్రాడిబట్టలు సర్ది, ప్రయాణమై రామనాథబాబు కోసం ఎదురుచూస్తూ కూర్చుంది. ఉదయం ఎనిమిది గంటలకల్లా కారు తీసుకొస్తానన్న రామనాథబాబు పన్నెండయినా రాలేదు. వెంకటపతిని రామనాథబాబుకోసం తోలింది. ఒంటిగంటకు తిరిగొచ్చిన వెంకటపతి, రామనాథబాబు హోలు దగ్గిరా, ఇంటిదగ్గిరా కూడా లేడని చెప్పాడు. వరూథినికి వళ్ళు మండిపోయింది.

సాయంత్రం మూడు గంటలకు ఇంటిముందుకు కారొచ్చి ఆగింది. రామనాథబాబు అంతు తేల్చటానికి రిహార్సల్సుకూడా వేసుకొన్న వరూథిని గబగబా బయటికొచ్చింది.

"బాబుగారు ఊరెళ్ళిపోయారు. అర్జెంటుగా పనొచ్చిందట. కారు పంపించారు. మిమ్మల్ని వెళ్ళమన్నారు" అని చెప్పాడు డ్రైవర్ రసూల్.

"ఈ ముష్టికారు కోసమే ఆగాననుకున్నారా మీ అయ్యగారు? పి.టి. చేయించుకొని వెళ్ళేదాన్ని, నాలుగు రోజులు వేస్టయింది. ఇష్టంలేనివాడు ముందే చెప్తేపోయేదిగా?" వరూథిని రుసరుసలాడుతూ అన్నది.

"అది కాదమ్మగారూ! చాలా గొడవల్లో ఉన్నానని చెప్పమన్నారు అయ్యగారు." తల గోక్కుంటూ పణిగాడు రసూల్.

"ఏ ఊరెళ్ళారూ?"

"చెప్పలేదమ్మా! కనకయ్యగారి అల్లుడి కార్లో వెళ్ళారు."

"ఊహూ! కనకయ్యగారి అల్లుడితో పోయాడా? ఇప్పుడు బయలుదేరితే ఎన్ని గంటలకు వెళ్తాం హైదరాబాద్?"

"తొమ్మిదీ తొమ్మిదిన్నర కెళ్ళొచ్చమ్మగారూ!"

''పదిగంటల కెళ్ళి అక్కడేం చేస్తాం?'' తప్పంతా డ్రైవర్‌దే అన్నట్టు విదిలించి కొట్టింది వరూధిని.

''తెల్లవారుఝామున బయలుదేరితే?''

''ఉదయం ఎనిమిది గంటల లోపల వెళ్తే బాబు స్కూలుకు అందుకోగలుగుతాడు. తెల్లవారకట్ల బయలుదేరితే, మనం వెళ్ళేసరికి పది దాటదూ?''

''దాటుతుందమ్మగారూ!'' తల తొందరగా ఆడించాడు రసూల్.

''ఏం చేస్తాం? ఎటూగాకుండాచేసి చచ్చారుగదా?'' అని వరూధిని ఆలోచనలో పడింది. రాత్రికి హైదరాబాద్ చేరడమే మంచిది. తెల్లవారి బాబును స్కూల్లో వదలొచ్చు. వాడికీ బడలికలేకుండా వుంటుంది. ఒకరోజన్నా స్కూలు కలిసి వస్తుంది.

''పెట్రోలు కొట్టించారా? అదీ ఖాళీగానే వుందా?''

''టాంక్‌ఫుల్‌గా కొట్టించారమ్మా అయ్యగారు.'' రామనాథబాబు ఎప్పుడూ అలాంటి లోపాలేమీ చెయ్యడన్నట్టు చెప్పాడు రసూల్.

రామనాథబాబు వెళ్ళడంలేదుకాబట్టి, భార్యకు తోడుగా వెళ్తే బాగుంటుందనే ఆలోచన వచ్చింది వెంకటపతికి.

బాబు స్కూలుకూడా చూడొచ్చు. జాగీర్దార్ల పిల్లలు చదివే ఆ స్కూలు ఎంత గొప్పగా వుంటుందో చూడాలి. బాబుకి పడకా భోజనం కూడా అక్కడే. అదికూడా తనకు చూడాలని వుంది. తను హైదరాబాదు పట్నంకూడా చూడలేదు. కారు ఎటుదిరిగీ వెళ్తుందాయె! కార్లో చోటుకూడా మస్తుగా వుంది.

రసూల్ సామాను డిక్కీలో పెడ్తుండగా వెంకటపతి ఓ జత పంచలూ, చొక్కాలూ, చుట్టచుట్టి తెచ్చుకొన్నాడు.

''అదేమిటి?'' భర్తను చూసి అడిగింది వరూధిని.

''నేకూడా వద్దామని!'' నసిగాడు వెంకటపతి.

''ఎక్కడికీ?'' తీవ్రంగా అన్నా, వరూధిని ముఖం ప్రశాంతంగానే వుంది. వెంకటపతి మాట్లాడకుండా కారు పక్కనే నిలబడ్డాడు.

''ఎందుకూ?'' భర్తముఖంలోకి చూస్తూ అన్నది వరూధిని.

''బాబు స్కూలు చూడాలి. పట్నంకూడా చూడలేదుగా?'' అన్నాడు వెంకటపతి.

రసూల్ నవ్వాపుకోటానికి ప్రయత్నిస్తూ ముఖం పక్కకు తిప్పుకొన్నాడు.

''నాన్ననుకూడా రానియ్యమ్మా!'' రవి తల్లిని బతిమాలుతున్నట్టు అన్నాడు.

వరూధిని కొడుక్కేసి వింతగా చూసింది. వీడప్పుడే తండ్రిని చూసి జాలిపడుతున్నట్టు మాట్లాడుతున్నాడు. అధికారం అంతా అమ్మదే అన్నది వాడు ఈ వయస్సులోనే పసిగట్టాడు. తన కొడుకు చాలా తెలివికలవాడు. వాడు పెరిగి పెద్దయితే ఎంతటివాడవుతాడో? రామనాథబాబులాంటివాళ్ళు వాడి కాలిగోరుకు సరిపోరు. ఎడగా పెడగా పోతున్న ఊహల్ని అదుపులో పెట్టుకొని అన్నది వరూధిని.

''మీరుకూడా వస్తే ఇల్లెవరు చూస్తారండీ? పైగా రామనాథబాబుగారు కూడా ఊళ్ళో లేరుగా? హోలేం చేస్తారూ?''

వరూథిని భర్తను, 'మీరు' అని ఎప్పుడు సంబోధిస్తుందో, 'నువ్వు' అని ఎప్పుడు అంటూoదో ఆమెకే సరిగా తెలియదు. చెప్పే విషయాన్నిబట్టీ, విధానాన్ని బట్టీ, సందర్భాన్నిబట్టీ, అవసరాన్నిబట్టీ, 'మీరు' ను 'నువ్వు'గా, 'నువ్వు'ను ఏమీగాకుండా మాట్లాడుతుంది.

''బాబును వేసవికాలం శెలవులకు తీసుకొస్తాంగా, అప్పుడొద్దురుగానిలెండి? అప్పుడు బాబును మీరే వెళ్ళి తీసుకొద్దురుగాని. రసూల్! పద. మరీ పొద్దుపోయి చేరితే అక్కడ హోటల్లో గదుల కవష్టపడాలి!'' అన్నది వరూథిని.

రసూల్ కారు స్టార్టు చేశాడు. రవి కార్లోనుంచి తల బయటికిపెట్టి తండ్రికి 'టా!టా!' చెప్పసాగాడు. కారు మలుపు తిరిగిందాకా కొడుకు తండ్రికేసి చెయ్యి వూపుతూనే వున్నాడు.

దృష్టిపథంలోంచి అదృశ్యం అయిన కొడుకుని తలుచుకొన్న వెంకటపతి కళ్ళు చెమ్మగిల్లాయి.

''బోడిముండ!'' బయటికే అన్నాడు వెంకటపతి నడిరోడ్డుమీద నిలబడి. ఎవరయినా విన్నారో వినలేదో వెంకటపతి పట్టించుకోలేదు.

మూడోరోజుకల్లా వరూథిని హైదరాబాదునుంచి తిరిగొచ్చింది. ఇల్లంతా కలియజూసి వంటమనిషి మీదా, పనిపిల్లమీదా ధూంధాంలు చేసింది.

''రెండురోజులు ఇంట్లో లేకపోతే ఇల్లంతా అల్లకల్లోలం చేసి పారేశారు. పొట్టలు పగిలేట్లు తిని ఇచ్చకాలాడుతూ కూర్చొన్నారా?''

బుచ్చమ్మా, కమలా నోరు మెదపలేదు. పడకగదిలో ఉన్న ఖాళీ సీసాలూ, కడగని గ్లాసులూ, తినేసిన ఆకులూ, కాగితాలూ చూసిన వరూథిని కోపం తారాస్థాయినందుకొంది.

''ఈయ నెక్కడ చచ్చాడే?'' పనిపిల్లను చూసి గర్జించింది వరూథిని.

''ఈ రోజే... పొద్దున్నే బయటకెళ్ళారమ్మా!''

''అంటే ఈ మూడు రోజులూ ఇంట్లోనే పాతేసుకుని ఈ ఛండాలం అంతా చేశాడన్నమాట?''

కమల భయం భయంగా తల ఊపింది.

''ఆయనకు లేదమకో బుద్ధి! మీకేమయిందే? మంద యింట్లోచేరి తింటున్నారు. పాండవతలకు?'' అంటూ వరూథిని గదిలోని ఖాళీసీసాలను పనివాళ్ళమీదకు విసిరింది. వంటమనిషీ, కమలా కలిసి గబగబా గదంతా శుభ్రం చేశారు.

''గది ఊడుద్దామంటే గదిలోనుంచి బయటికి రాందే? మేం మాత్రం ఏం చేస్తాం తల్లీ!'' బుచ్చమ్మ మెల్లగా అంది, తమ తప్పేమీ లేదని రుజువు చేసుకొంటున్న ధోరణిలో.

వరూథిని తలంటి పోసుకున్నది. తల చిక్కు తీసుకొంటూ నిలువుటద్దం

ముందు నిలబడింది. పొడవైన నల్లటి నొక్కులజుట్టులో నుంచి దువ్వెన ఊడిరావటంలేదు. ఓ చేత్తో జుట్టు మధ్యకుపట్టి గట్టిగా చిక్కు తీసుకోవటం మొదలుపెట్టింది. ఆమె ఆలోచనలు కళ్ళేలు తెగిన గుర్రాల్లా పరుగెత్తుతున్నాయి.

హైదరాబాదులో తను విన్నది నిజమేనా? సినిమా హాలు గోపాలరావు పని కట్టుకొని తనున్న గదికొచ్చి చెప్పాడు. ఏమీలేకపోతే అతనెందుకొచ్చి చెప్తాడు? అసలతనికేం అవసరం వచ్చింది? కావాలంటే లాయరు దగ్గరక్కూడా తీసుకెళ్తానన్నాడు. అతని మాటలు నమ్మలేక వెళ్ళలేదు. వెళ్తే అసలు విషయం బయటపడేదేమో?

రామనాథబాబు ఎలాంటి మనిషో తనకు తెలియదా? తమ సినిమా హాలు ప్రాజెక్ట్ చెడగొట్టటానికే గోపాలరావు అన్నీ కల్పించి చెప్పి వుండకూడదా? ఆ స్థలం తాను కొట్టేయాలని ఇంత పన్నాగం పన్నాడేమో! లేకపోతే అతను అంత పనిగట్టుకొని తన దగ్గరకొచ్చి చెప్పాల్సిన అవసరం ఏముంది? అవీ ఇవీ చెప్పి తనను వల్లో వేసుకోవాలని చూస్తున్నట్టున్నాడు! ఆయన చూపులూ! మాటలూ! వెళ్ళిపోతూ హోటలుగదిలో తన వంక ఎలా చూశాడు? మళ్ళీ కలుస్తానన్నప్పుడు గొంతెలా పెట్టాడు?

జుట్టు చిక్కు విడి దువ్వెన సాఫీగా సాగుతోంది.

అన్నం తిని వరూథిని పక్కమీద నడుం వాల్చింది. ప్రయాణపు బడలికా వదల్లేదు. వళ్ళంతా విరగ్గొట్టినట్టుగా వుంది. కునుకు పట్టినట్టే పట్టి బుర్రలోని ఆలోచనల తీవ్రతకు తేలిపోతుంది.

"ముదనష్టపోడు. లేనిపోనిది పెట్టాడు మనసుకు!" ఆలోచనల ధాటికి ఆమె పెదవులు కదిలాయి. అప్రయత్నంగానే బయటికి అనేసింది. ఆ తర్వాత ఆమె మనసు కొంత ఊరడిల్లింది. నెత్తిమీద నుంచి బరువు దించినట్టయింది. తల్లోని చిక్కుముడి ఊడిపోతున్నట్టనిపించింది. హాయిగా నిద్రపట్టింది.

వరూథిని నిద్రలేచేసరికి సాయంకాలం ఆరుదాటిపోయింది.

"అబ్బ! ఎంత నిద్రపోయాను!" అనుకొంటూ వంటగదిలోకి వచ్చింది. వంటమనిషి బుచ్చమ్మ కాఫీ కలిపి ఇచ్చింది.

"వార్రాలేదా పొద్దున్నుంచీ?"

"మధ్యాహ్నం మీరు పడుకొన్నప్పుడొచ్చి ఫోంచేసి మళ్ళీ వెళ్ళిపోయారు."

"రామనాథబాబు ఊర్నుంచి వచ్చారా?"

"ఏమోనమ్మా! తెలియదు. మీరు వెళ్ళాకయితే ఇక్కడకు రాలేదు. పొద్దున వాళ్ళ నాయర్ మార్కెట్‌లో కన్పించాడు. గువ్వపిట్టలకోసం వచ్చానన్నాడు. అయ్యగారు లేకపోతే వాటికోసం ఎందుకు వస్తాడూ? ఏమోనమ్మా! ఇంకెవరి కోసమైనా పిట్టల్ని కొనుక్కుపోతున్నాడేమో నాయరు మరి!" బుచ్చమ్మ వరూథిని కాఫీ తాగుతున్నంతసేపూ అలా చెప్పుకుపోతూనే వుంది.

అవిడ్ని మాట్లాడనిచ్చేవాళ్ళుండాలేగాని, అవతలవాళ్ళు విన్నా వినకపోయినా

ఉండలోనుంచి దారంపోగు లాగినట్టు, ఒకదానికొకటి గొలుసులు కలిపి చెప్పకుపోతూనే వుంటుంది.

వరూథిని కాఫీ... కప్పులో కొంత వదిలేసి, వంటమనిషి చేతుల్లో పెట్టి, బాత్‌రూంలోకి వెళ్ళింది.

వరూథిని పూర్తి మేకప్ అయ్యేసరికి ఏడున్నర దాటింది.

"జట్కా పిల్చుకు రమ్మంటారా?" కమలమ్మ అడిగింది.

వరూథిని వాచీ చూసుకొని "ఇంకా టైం వుందిలే! ఓ అరగంట ఆగి రిక్షాపిలువ్" అని చెప్పింది. ఎందుకు జట్కా మానేసి రిక్షా పిలవమంటోందో అని ఆలోచిస్తూ కమల వెళ్ళింది.

ఎనిమిదింబావుకు వరూథిని ఎక్కిన రిక్షా వరూథినీ పిక్చర్ ప్యాలెస్ ముందు ఆగింది.

ఆఫీసు గదిలో శివరాం తలవంచుకొని పని చేసుకుంటున్నాడు. ఆఫీసు గది పక్కన ఓ క్షణకాలం నిలబడింది. ఎవరూ ఆమెను గమనించినట్టులేదు. తిన్నగా రిజర్వుడు క్లాసు గేటు ముందు కెళ్ళింది. గేటు కీపరుకూడా లేడు. తలుపు తోసుకొని వెనక పక్క ఎడం వైపు సీట్లల్లో ఒకదాంట్లో కూర్చొంది. రిజర్వుడు క్లాసులో పెద్దగా జనం లేరు. హాలంతా కలయజూసింది. కాసేపటికి హాల్లో మనుష్యులు మసక మసకగా కన్పించారు. రిజర్వుడు క్లాసులో కుడివైపున గోడ పక్కగా ఒక స్త్రీ, ఒక పురుషుడూ కూర్చొని ఉన్నారు. ముందు వరసలో పల్చపల్చగా అక్కడో ఇద్దరూ ఇక్కడో ఇద్దరూ కూర్చోని వున్నారు. కాటరింగ్ కుర్రాడు లోపలకొచ్చి గోడ పక్కగా కూర్చున్నవాళ్ళ దగ్గర కెళ్ళి వంగి నిల్చున్నాడు. ఏదో మాటల్లో పడివున్నవాళ్ళు కుర్రాణ్ణి పట్టించుకోలేదు. వాడలాగే పది నిముషాల దాకా నిల్చున్నాడు. అలా కేటరింగ్ కుర్రాడు నిరీక్షిస్తూ నిలబడ్డాడంటే అవతల వాళ్ళెవరో గొప్పవాళ్ళయి వుండాలి. ఆ సంగతి వాడికి కూడా తెలిసి వుండాలి. లేకపోతే వాడు చిటికెలువేసి మరీ ఖాళీ గ్లాసులూ, బాటిల్సూ తీసుకెళ్తాడు!

వరూథినికి కుతూహలం పెరిగి వాళ్ళకేసి పరిశీలనగా చూడసాగింది. వాళ్ళు ఆమెను చూసినట్టులేదు. కాని ఆమెకు అతణ్ణి ఎక్కడో చూసినట్టుగానే వున్నది. దూరంగా వుండటం వల్ల ఆమె అతన్ని పోల్చుకోలేకపోతోంది. అతన్ని పోల్చుకోవటానికి కొంతసేపు ప్రయత్నించి, సినిమా అయిపోయాక వెలుగులోనే చూడొచ్చని, వాళ్ళమీద నుంచి కళ్ళను తెరమీదకు మళ్ళించింది. మనసును తెరమీద కన్పించే దానిమీద లగ్నం చెయ్యటానికి ప్రయత్నించసాగింది.

అది తను చూసిన చిత్రమే. అయినా కథ మర్చిపోయినట్టుగానే వుంది. ఇంటర్‌వెల్ తర్వాత కథ నడుస్తోంది. భర్త భార్యను అనుమానించి వెళ్ళిపోయాడు. భార్య పిల్లల్ని పెట్టుకొని, దేముడి పటం ముందు నిలబడి కన్నీరు మున్నీరుగా ఏడుస్తూ పాడుతోంది. తన పాతివ్రత్యాన్ని కాపాడమనీ, భర్తకు తన శీలాన్ని నిరూపించి తనను తనభర్త దగ్గరకు చేర్చమని ఆ మహా ఇల్లాలు దేవుడితో మొర పెట్టుకొంటోంది.

పిల్లలుకూడా తల్లితోపాటు పాట లంకించుకొన్నారు. ఇద్దరు పిల్లలూ, తల్లి చెంపలమీద కారుతూన్న కన్నీటిని తుడుస్తోన్నారు. వాళ్ళ కళ్ళల్లోంచి కారే కన్నీటికి ప్రేక్షకుల చెంపలు తడిసిపోతున్నాయి.

కథ మధ్యలోనుంచి చూడటం వల్లనో ఏమో వరూధినికి ఏడుపు రాలేదు. మనసు కలత పడలేదు. పైగా అదంతా ఓ తమాషాగా అనిపించింది.

పిచ్చిముండ! కాకపోతే తన శీలాన్ని భర్తముందు నిరూపించమని దేవుణ్ణి వేడుకుంటుందేం? తన పాతివ్రత్యాన్ని తన భర్తచేత నమ్మించలేని ఆడది సంసారం ఏం చేస్తుంది? సంఘంలో ఎలా బ్రతుకుతుంది? మొగుడి మనస్సు మార్చాల్సింది తను కాదా? వట్టి పుణ్యానికే భార్యమీద అనుమానపడి పారిపోయే మొగుడిమీద దానికి అంత ప్రేమ ఎందుకో? అది భక్తా? అలా ఉంటేనే, అది పతివ్రతా? దాని బొంద! అది భక్తీ కాదూ, ప్రేమా కాదు, మొగుడ్నొదిలి బ్రతకలేక అలా ఏడుస్తూంది. పైగా దాని మెడకు గుదిబండల్లా ఇద్దరు పిల్లలు ఉన్నారు. అట్లా చెప్పుకుని దేవుడి ముందేడిస్తే బాగుంటుందిగా? దేవుడైనా నిజం చెప్పినందుకు సంతోషిస్తాడుగా? ఈ రకం పతివ్రతలు దేవుడి ముందు కూడా నిజం చెప్పరు. మొగుడికి చెప్తారా? అందుకే వాళ్ళకు అపనమ్మకం పుట్టి, అనుమానాలు పెరిగి పారిపోతారా! నిజంగా దానికి మొగుడు కావాలా? అన్ని ఏడుపులు ఏడుస్తుంది? కావాలంటే ఆ మాత్రం మొగుడు దొరకడా? చీటికి మాటికి పెళ్ళాం బిడ్డల్ని వదిలి పారిపోయేవాళ్ళేనా ఆదర్శ భర్తలంటే? ఆడదాన్ని పువ్వుల్లో పెట్టి పూజించే మగవాళ్ళు ఎందరు లేరు? తన భర్తలాంటివాళ్ళు.....వెంకటపతిలాంటివాళ్ళు దేశంలో ఎంతమందిలేరు? దేశం గొడ్డుపోయిందా? నిజమైన భర్తలంటే వాళ్ళే! భార్యేం చేసినా భరించేవాడే భర్త. అదే నిజమైన, నిస్వార్థమైన ప్రేమ. అదే ఆదర్శ దాంపత్యం. వాడే ఆదర్శమైన భర్త. అలాంటి భర్త దొరికిన ఆడదానిదే అదృష్టం. దాని జీవితం పండు వెన్నెల. మూడు పువ్వులూ ఆరు కాయలూ. అలాంటి భర్త దొరకాలంటే పూర్వజన్మ సుకృతం ఉండాలి. ఎన్నో నోములు నోచే వుండాలి. ఎన్నో ఉపవాసాలూ, ఒక్క పొద్దులూ, పూజలూ చేసి ఉండాలి. మరి ఈ సినిమా ఏమిటి? వీడు చెప్తున్నదేమిటి? ఈ కథ రాసిన వాడెవడు? ఈ సినిమా తీసినవాడెవడు? ఈ డబ్బాలు తెచ్చి ఈ హాల్లో ఆడిస్తున్నవాడెవడు?

వరూధినికి గోడ్రెజ్ బీరువాలో మిగిలిపోయిన వైన్ బాటిల్ గుర్తొచ్చింది. అందులో ఇంకా ఎంత ఉంది? క్వార్టరు కూడా లేనట్టుంది. అంటే సగం బాటిల్ పైగా అరగంటలోనే తాగేసిందా? ఛ! అంత ఎక్కువ తాగకూడదు. తాగితే ఏమయింది? ఇప్పుడు తను బాగానే వుందిగా? సినిమా బాగానే కన్పిస్తోంది. తను సీట్లోనే కూర్చొని వుంది. ఇంకేం తను బాగానే వుంది. ఆ మిగతాదికూడా తాగేస్తే సరిపోయేది.

వరూధినికి నవ్వాగలేదు. ఒళ్ళంతా వెచ్చ వెచ్చగా హాయిగా వుంది. మనసు శరీరంతో సహా గాల్లోకి తేలిపోతున్నట్టుంది.

దేవుడు మారిస్తేనో లేక తనే మనసు మార్చుకోనో, అంతకంటే గతిలేకో, ఇంతకంటే వేరే ఆడది దొరక్కో భర్త తిరిగొచ్చాడు. భార్య, భర్త కాళ్ళను పట్టుకొని క్షమించమంటూ భోరుభోరున ఏడుస్తోంది. పిచ్చిముండ కాకపోతే తన కన్యాయం చేసిపోయినవాడి కాళ్ళమీద పడి ఏడుస్తుందేం? తప్పు అతనిదయితే, తను క్షమించమని ప్రాధేయపడుతుందేం?

ఆవిడ్ని చాచి చెంపమీద కొట్టాలనిపించింది వరూథినికి. అది తెరమీద జరిగింది. నిజంగా తన జీవితంలో తన కళ్ళముందు అలాంటి సన్నివేశం తటస్థపడితే అంతపనీ చేసి వుండేది. వరూథినికి తెరమీద కన్పించే చిత్రం అపసవ్యంగా అతుకులు బొతుకులుగా వుంది. కొన్ని సంఘటనలు చూస్తున్నా బుర్రలోకి ఎక్కటంలేదు. భార్యాభర్తల మధ్య జరిగే సంఘర్షణ ఆమె మానసిక ప్రతిఘటనాశక్తిని పెంచిందేగాని, సానుభూతితో స్పందించలేదు.

కాళ్ళమీదపడ్డ భార్యతో ఏదో చెప్తున్నాడు భర్త. వరూథిని శ్రద్ధగా వినడానికి ప్రయత్నించింది. అతను ఏదో చెప్పాలని – చెప్పలేకపోతున్నట్టుగా ముఖం పెట్టి...... నా.....అంటూ పెళ్ళాన్ని వాటేసుకొని భోరున ఏడ్చాడు.

''ఏడుస్తాడేం? అంట్లవెధవ, ఏడవకేం చేస్తాడ్లే పిరికి సన్యాసి!'' అనుకొంది వరూథిని.

వాడు ఆ ఆడంగోడు, ఆ చవట వెధవ హీరో, ఈ సత్తుతపేలా ముఖంది హీరోయిన్! ఈ పిచ్చి జనం అంతా డబ్బులిచ్చి మరీ చూస్తారా? ఈ సినిమాలు చూపించడానికి తనలాంటివాళ్ళు లక్షలు ఖర్చుపెట్టి థియేటర్లు కట్టించటమా? ఛీఛీ! అంతకంటే బుద్ధితక్కువ పని మరొకటి వుండదు.

వరూథిని రియాక్షన్ మాంచి ధోరణిలో పడింది.

ఆ హీరో ఆదర్శ భర్తకు ప్రతిరూపం! పెళ్ళాన్ని ముందడిగిన ప్రశ్నేమిటి? ''పిల్లలేరీ?'' భార్య నోటికి చేతులు అడ్డం పెట్టుకొని ముఖం గోడకు రుద్దుకుంటుంది.

అదేం యాక్షన్? దాని బొంద యాక్షన్?

''నా బాబూ! నా చిట్టీ!'' అంటూ భర్త గుండెలు బాదుకుంటూ బయటికి పరుగు తీశాడు. ''ఏమండీ! ఏమండీ!'' అంటూ భార్య భర్త వెనకే పరుగు తీసింది.

ఇంతకీ ఆ భర్త వచ్చింది పెళ్ళాంకోసం కాదన్నమాట? పిల్లల కోసం వచ్చినవాడు ఆ ఏడుపు ముందే ఏడవచ్చుగా? ఈ రసాభాసంతా ఎందుకు?

తర్వాత తెరమీద, స్పీడుగా పోయే కారూ, రైలుకట్టలూ, కాలవలూ, కొండలూ కనబడుతున్నాయి. అదంతా పిల్లల్ని వెతకటంలోని భాగమన్నమాట?

ఇదంతా డైరెక్టరుగారి బుర్రలా వుంది? తప్పిపోయిన పిల్లల్ని వెదకడం అలాగా? బట్టలషాపులో ఆడవాళ్ళలో కలిసిపోయిన పెళ్ళాన్ని వెతుక్కోవడంకూడా తెలిసినట్టులేదు ఈ డైరెక్టరుకు. ఇంకా పిల్లల్ని వెదకటం ఏం చూపిస్తాడు నా బొంద?

వరూధినికి తెరమీద పిల్లలకోసం భార్యాభర్తలు చేస్తున్న గగ్గోలుమీద రోత పుట్టింది.

వెతకటం అంటే ఆమెకు గుర్తొచ్చింది. అన్నట్టు ఆవిడపక్కన కూర్చున్న ఆయనెవరూ?

వరూధిని తలతిప్పి కుడివైపు దూరంగా గోడపక్కగా ఉన్న సీట్లకేసి చూసింది. వాళ్ళిద్దరూ కూర్చొనివున్న సీట్లు ఖాళీగా వున్నాయి. ఆ వరుసలోనివి, ఇంకా ముందువీ పరిశీలనగా చూసింది. కాని అతడు లేడు. ఆమె లేదు.

వీళ్ళెప్పుడు వెళ్ళినట్టు? తన ముందునుంచి ఎవరూ వెళ్ళలేదే? మరీ ఎట్లా మాయమయ్యారూ? అవతల కుడివైపున వున్న గేటునుంచి వెళ్ళారా? అది ఎప్పుడూ మూసే వుంటుంది. అది తీయించుకొని వెళ్ళగలిగారంటే వారెవరై ఉండాలి?

వరూధిని చివాలున లేచింది. లేచిన ఊపుకో, లేక రక్తంలోని వైన్ వడికో గాని తూలింది. ముందు సీటుమీద చెయ్యివేసి తనను తానే నిలదొక్కుకుంది. 'ఓ. యస్!' తనకేం? తనిప్పుడు బాగానే వుంది. మెల్లగా అడుగులు వేసుకుంటూ బయటికొచ్చింది. బయట వరండాలో తలుపుపక్క స్టూలుమీద కూర్చున్న గేటుకీపర్ లేచి చేతులు కట్టుకొని నిలబడ్డాడు. వరూధిని వాడివంకన్నా చూడకుండా, వరండాలో నడిచి థియేటర్ బయటికొచ్చింది. హాలు బయటికి రాగానే చల్లగాలి తగిలి హాయిగా అన్పించింది.

అతను ఎటు పోయాడూ?

ఆలోచన ఆమె మనసునుబట్టి పీడించసాగింది. పార్కింగ్ ప్లేస్‌లోంచి ఓ కారు ముందుకొచ్చి ఆగింది. ఆ కారుని గుర్తుపట్టింది. రామనాథబాబుదే! రసూల్ తననుచూసి, కారు తెస్తున్నాడనుకున్న వరూధిని ఒక్కడుగు ముందుకువేసి, థియేటర్ మెట్లమీద ఆగిపోయింది.

రామనాథబాబు కారు డోర్‌తీసి నిలబడ్డాడు. ఆమె ఎక్కింది. ఆమెపక్కనే అతడూ ఎక్కి కూర్చున్నాడు. వెంటనే కారు సాగిపోయింది. గేటుదాటి రోడ్డెక్కింది.

సందేహంలేదు. తను థియేటర్లో చూసింది వాళ్ళిద్దర్నే! ఇంతకీ అదెవతి? పెళ్ళాంమ్మాత్రం కాదు. అంతవరకూ తనకు తెలుసు. ఎన్నాళ్ళనుంచి దీంతో? అందుకేనా అతను హైదరాబాద్ రానిది? ఇదేనా అర్జంటు పనిమీద వెళ్ళడం? రెండు మూడు నెలలుగా రామనాథబాబు, తనంటే పట్టీ పట్టనట్టు, అంటీ అంటనట్టు తిరగడానికి కారణం ఇదేనన్నమాట?

వరూధినికి మత్తు దిగిపోయింది. వళ్ళు చల్లబడిపోయింది. తలలోని మబ్బులు విచ్చిపోయాయి. పరుగెత్తి పరుగెత్తి అలసిపోయిన గుర్రంలా అయిపోయింది. కాళ్ళు ముందుకు సాగలేదు. థియేటర్నుంచి త్వరగా వెళ్ళాలని ప్రయత్నం చేసింది. కాని, మెట్లమీదనే చెక్కిన ప్రతిమలా నిలబడిపోయింది.

"ఒరేయ్! ఓ జట్కాలోపలకు తీసుకురా!" శివరాం హాలు కుర్రాడికి చెప్పి వరూధిని దగ్గిర కొచ్చాడు.

''ఎంతసేపయిందీ మీరొచ్చి? నేను చూడనేలేదు'' అన్నాడు.
''కార్లో వెళ్ళిందెవరూ?'' శివరాం కేసి చూడకుండానే అడిగింది.
''రామనాథబాబుగారే!''
''ఆవిడెవరని నే నడిగింది?''
శివరాం సమాధానం చెప్పలేదు. వరూథినికి తల, తను నిలబడ్డ సినిమాహాలు మెట్లకేసి కొట్టుకు చావాలనిపించింది! తను అడక్కూడని ప్రశ్నే అడిగింది. లజ్జా, బిడియం వున్న ఆడది చేయాల్సిన పని కాదు. అసలు తనెవరని ఆ మాట అడిగింది? అందులోనూ శివరాంను. రామనాథబాబు అడుగులకు మడుగులొత్తేవాడిని. అతనికింది నౌకర్ని. తన కిందున్న నెలజీతగాడ్ని.
వరూథిని శివరాంను తలెత్తి చూసింది. తనవైపే చూస్తూ నవ్వుతున్నవాడల్లా ముఖం దాచేసుకొన్నాడు.
శివరాంనుంచి సమాధానం లేకుండా వెళ్ళదల్చుకోలేదు వరూథిని. నిండా మునిగినదానికి చలేమిటి అన్నట్టుంది ఆమె ధోరణి. ఆమెవరో తెలుసుకోవాలన్నది ఆమె గుండెల్ని పట్టి పీడించసాగింది. ఈర్ష్యాద్వేషాలతో వళ్ళంతా ఉడికిపోతోంది.
''ఎవతట అదీ? ఏ ఊరు?'' వరూథిని తనేం మాట్లాడుతోందో, ఎలా మాట్లాడుతోందో తెలియని స్థితిలో ఉన్నది.
''కోలవెన్ను షావుకారుగారి కోడలు.''
''ఇక్కడే వుంటుందా?''
''నాలుగైదు నెళ్ళనాడు వచ్చారు. మామగారు, భుజంగరావుగారి నర్సింగ్‌హోంలో వున్నారు.''
''ఊహూఁ- అదన్నమాట కథ!''
అంతేనన్నట్టు తల ఊపాడు శివరాం.
''ఆవిడ మొగుడేం చేస్తుంటాడూ?''
శివరాంకు నెత్తిమీద కమ్మరివాడి సుత్తెలా తగిలిందా ప్రశ్న
''సుబ్బారాయుడుగారా? వూళ్ళో వ్యవసాయం చూసుకొంటాడు. మధ్య మధ్య వచ్చి పోతుంటాడు. ఆమెగారు అసలు షావుకారుగారి మేనకోడలే. ఆ తర్వాత కోడలైంది.''
''వాళ్ళు మీకు చుట్టాలా?''
శివరాంకు పక్కటెముకలమీద పోలీసులాఠీలా తగిలింది! ముఖం వెగటుగా పెట్టుకొని ''మాకేం కారు. మా పక్క వూరే వాళ్ళది'' అన్నాడు.
''అయితే వాళ్ళు మీ బంధువులు కాదన్నమాట!''
రామనాథబాబుమీద కసి శివరాంమీద తీర్చుకోవటానికి తప్పిస్తే ఆ మాటకు అర్థం లేదని వరూథినికి తెలిసే అన్నది.
''అసలు మా వూరే కాదంటే?'' శివరాం నిరసనగా అన్నాడు.
సినిమా వదలబోయేముందు మోగే బెల్ మోగింది. హాలుమీద పెద్దలైటూ,

వరండాలో లైట్లు, వెలిగేయి. అంత లైటు వెలుగులో వరూథిని నిలబడలేకపోయింది. ఆ వెలుగులో తన ముఖం శివరాం చూట్టంకూడా బాధగానే అనిపించింది ఆమెకు. అప్పుడు తన ముఖం అద్దం లేకపోయినా ఎలా వుంటుందో అర్థం చేసుకోగల తెలివితేటలున్నాయి వరూథినికి. విసురుగా మెట్లుదిగి జట్కా ఎక్కి కూర్చుంది. శివరాం జట్కా దగ్గిరకు వెళ్ళకుండా బుకింగ్ ఆఫీసు దగ్గరకు వెళ్ళిపోయాడు.

జట్కా రోడ్డుమీద పరిగెత్తుతూ వుంది. జట్కావాడు చక్రంలో కమ్చీ కర్ర పెట్టి మోగిస్తూ, బండిమీద నిలబడి, గుర్రం మీదకు వంగి ఈల వేస్తున్నాడు. గుర్రం గేలప్‌లో దూకుతోంది. జట్కా కుదుపులకు వరూథిని వూగిపోతోంది.

భర్తతో తను జట్కాలో కూర్చొని మొదటిసారిగా సినిమా కొచ్చిన రోజు గుర్తొచ్చింది వరూథినికి–

ఆనాడు సినిమాహాల్లో కుర్రాడు తెచ్చి డ్రింక్స్ ఇచ్చాడు. భర్తే తెప్పించాడనుకొని తాగింది. కుర్చీలపక్కగా అతను నిలబడ్డాడు. ఎన్నోసార్లు అతన్ని దొంగచూపుల్తో చూసింది. చాలా హుందాగా, పెద్దమనిషిలా నిండుగా నిబ్బరంగా కన్పించాడు. సినిమా అయ్యాక అతనే జట్కా మాట్లాడి ఎక్కించాడు. ఇంటిదగ్గర దించిన జట్కావాడు డబ్బు లివ్వబోతే ''అయ్యగారు కోపం చేస్తారు మీ దగ్గర తీసుకుంటే'' అని, తీసుకోకుండాపోయాడు. డ్రింక్స్ తెచ్చిన కుర్రాడూ అదేమాట అన్నాడు. ఆ రోజు అదేమిటని ఆశ్చర్యపడిన భర్తకు తనేం చెప్పింది?

''రామనాథబాబు మాకు దూరపు చుట్టం!'' అని చెప్పింది.

అంతా అబద్ధం. పిచ్చాడు. పల్లెటూరి మనిషి. నమ్మాడు!

ఆ మాట భర్తకు చెప్పేటప్పుడే అనుకొంది మనసులో. ఏమనీ? రామనాథబాబు నాకు కాబోయే చుట్టమనేగా? రెండోసారి పని కట్టుకొని ఆ సినిమా హాలుకే వెళ్ళింది. సినిమా చూట్టానికీ కాదు – హాలు చూట్టానికీ కాదు. రామనాథబాబును చూట్టానికే! తన ఆత్మబంధువును చూట్టానికే గదూ? అతను తన్ను టిక్కెట్లు కొననియ్యలేదు. తన ముస్పునే కొనేశాడు. రెండోసారి తన కార్లో ఇంటికి పంపించాడు. మూడోసారి తనే స్వయంగా కార్లోవచ్చి దించి వెళ్ళాడు. ఐదోసారి అయనే తనంతట తానే ఇంటికొచ్చాడు.

ఆ తర్వాత ఏం జరిగింది? వరూథిని బుర్ర బద్దలయిపోతూంది. జట్కా వచ్చి ఇంటిముందాగింది.

జట్కావాడికి డబ్బులిచ్చి వరూథిని దిగి లోపలికెళ్ళింది.

వంటమనిషిని పిలిచి ''వారింకా రాలేదా?'' అని అడిగింది.

''రామనాథబాబుగారు వూరికెళ్ళారన్నారుగా? వచ్చారామ్మా?'' బుచ్చమ్మ వరూథిన్ని ఎదురుప్రశ్న వేసింది.

వరూథినికి వళ్ళు మండిపోయింది. దగ్గర్లో ఏమీ లేకపోయింది. ఉంటే బుచ్చమ్మ ముఖం చిట్లేదే!

''ఏమిటి నీ వాగుడు? నేనడిగేదేమిటి, నువ్వు చెప్పేదేమిటి?'' వరూథిని కళ్ళు ఎర్రబడ్డాయి. వంటలక్క బుచ్చమ్మకు బుర్ర తిరిగిపోయింది.

''వారింకా రాలేదా?'' అని అడిగిన ధోరణిలో వున్న గౌరవాన్ని ఆప్యాయతనూ బట్టి అలవాటు ప్రకారం రామనాథబాబును గురించే వరూథిని అడిగిందనుకొన్నది వంటమనిషి. మరి ఆమె అనుభవం అదే! భర్తను గురించి అలా అడగటం బుచ్చమ్మ వినలేదు.

వరూథిని కళ్ళూ, ముఖం చూసి కలవరపడిన బుచ్చమ్మ తేరుకొని ''మనయ్యగారా? ఇప్పుడే భోంచేసి బయటి కెళ్ళారు'' అన్నది.

''హాలు దగ్గిరకేనా?''

''అరింకెక్కడి కెళ్తారమ్మా? అక్కడికే పోతారు'' అన్నది బుచ్చమ్మ.

ఈ రోజు వరూథినికి వంటమనిషి ప్రతి మాటా ఎత్తి పొడుపుగానూ, ఎద్దేవగానూ వుంది. నాలుగు తన్ని బయటి కీడ్చాలన్నంత కోపంగా ఉంది. కాని, ఆ ముసల్ది రోజూ మాట్లాడే సహజ ధోరణిలోనే మాట్లాడుతూంది. ఆవేమాటలు ఎన్నోసార్లు వరూథినితో అన్నది. దానిమాటల్లో అర్థాలూ, పెడర్థాలూ, వ్యంగ్యమూ వరూథినికి ఏనాడూ స్ఫురించలేదు. కాని ఈ రోజు దాని మాటలన్నీ ఆదోలా అన్పిస్తున్నాయి.

''అన్నం వడ్డించేనా అమ్మాయిగారూ?''

''ఏఁవొద్దు!''

''అదేంటమ్మా, పెరుగుతోనన్నా ఎంగిలిపడకపోతే ఎట్టా? కొంచమే పెడ్తానమ్మా!'' ఆప్యాయంగా అన్నది బుచ్చమ్మ.

''నీగ్గాదు చెప్పింది? నాకు ఆకలిగాలేదని?''

''అయితే ఓవల్టీను కలుపుకొస్తా!''

''ఏం వద్దో మొర్రో అంటుంటే నీ సణుగుడేమిటే?''

''ఏమీ తాక్కుండా ఎట్టానమ్మా మరి?''

వరూథిని విసురుగా పడకగదిలోకి వెళ్ళింది. నిలువుటద్దంలోని ప్రతిబింబం ఆమెను వెక్కిరిస్తున్నట్టుగా చూస్తూంది. మల్లెపూలు లాగేసి, ముడి విప్పేసింది. పిన్నులూ, సవరమూ తీసి టేబులుమీద పారేసింది. బీరువా తెరచి వైన్‌బాటిల్ తీసింది. అందులో సగానికి తక్కువగా వున్న వైనంతా గ్లాసులోకి కుమ్మరించింది. మంచంమీద కూర్చొని గటగటా నాలుగు గుక్కలు వేసింది. పొలమారి ఉక్కిరిబిక్కిరి అయిపోయింది. మరో పావుగంటలో మిగతా వైన్ కసిగా తాగేసింది.

మంచంమీద దొర్లింది. పదిన్నర దాటింది. అయినా నిద్రపట్టలేదు. మెదడులో మిడతల దండులా ఎన్నో అనుభూతులూ, అనుభవాలూ, సంఘటనల తాలూకు స్మృతులూ, ఊహలూ దాడి చేయడం మొదలుపెట్టాయి.

హైదరాబాదులో గోపాలరావు చెప్పిందికూడా నిజమేనా?

ఆ ఆలోచన రాగానే వరూథినికి గుండె ఆగినంత పనయింది. బయట రిక్షాగంట మోగినా, జట్కా చప్పుడు విన్నా భర్త వచ్చాడేమోననుకొని నాలుగుసార్లు

బయటకొచ్చింది. వెంకటపతి రాకకోసం ఆతంగా ఎదురుచూసింది. పదకొండు దాటినా వెంకటపతి రాలేదు. ఎంతసేపటికీ రాని భర్తమీద కసీ కోపం పెరగసాగాయి.

అసలు ఆయన సమర్థుడైతే తిప్పలెందుకు?

వెంకటపతి గురించిన పాత జ్ఞాపకాలు వరూథిని మనసులో కదలబారాయి.

పెళ్ళయిన కొత్తరోజుల్లో గండుపులిలా తనకేసి చూసిన వెంకటపతి - ఎలుగ్గొడ్డులా చేతుల్లో తన శరీరాన్ని బంధించి వేసిన వెంకటపతి- తినే తినే పళ్ళెంలో నీళ్ళు పోసినందుకు తనను వంగదీసి బాదిన వెంకటపతి ఏడీ? ఇప్పుడేమయ్యాడూ?

వరూథినికి అసహ్యం, కసీ, పెనవేసుకుపోగా, దుఃఖం పొర్లుకొచ్చింది.

వరూథినికి నిద్రరావటంలేదు. మేలుకుంటే తల పగిలిపోయేట్టుగా వుంది. లేచి బీరువా అంతా వెదికింది. తనక్కావల్సింది దొరకలేదు. మర్చిపోయి వదలడం అంటూ ఎప్పుడూ జరగలేదు. ఒక్కసారన్నా ఆ పని చేసివుంటే ఎంత బాగుండేది? ఇప్పుడది తనకు కావాలి. లేకపోతే బతకలేదు. బుచ్చమ్మను లేపితే? ఇంతరాత్రప్పుడు అదిమాత్రం ఎక్కడినుంచి తెస్తుంది? ఆ రామనాథబాబు దగ్గిరకే పంపితే? ఛీ ఛీ ఎంతఘోరం? ఆ రామనాథబాబుగాడు దాన్ని వళ్ళో కూర్చోబెట్టుకుని దాని పెదవులకు గ్లాసు అందిస్తూ ఉంటాడు.

వరూథినికి తల వెయ్యివక్కలు అయిపోతున్నట్లుగా వుంది. ఇల్లంతా వెదికింది. వెంకటపతి ఆమెకు కనిపించకుండా సీసాలు దాస్తూంటాడు.

ఎక్కడో? తను పాపిష్టిది! తనకు భయపడి సీసాలు ఎక్కడో దాస్తుంటాడు. ఎన్నిసార్లు భర్త తెచ్చుకొన్న సీసాలు తను పగల గొట్టలేదు? ఎన్నిసార్లు రసూల్‌కిచ్చి తిప్పి పంపించలేదు? అదంతా ఆయన మంచికే చేసింది. అతిగా తాగి మనిషి పాడయిపోతుంటేనే చేసింది.

వెంకటపతి దాస్తాడనుకొన్నచోటల్లా వెదికింది. ఎక్కడా కన్పించలేదు. దొంగ దాపరికం, ఎక్కడోక్కడ పెట్టేవుంటాడు. అసలు అది లేకుండా ఆ మనిషి బతకలేడు. తనకు మెదడు పెనంమీద పెట్టి కాల్చినట్టుగా అయిపోతుంది. దానికి విశ్రాంతి కావాలి. తను నిద్రపోవాలి. అది తనవల్ల కావడంలేదు. ఆ పని చెయ్యగలిగినది మందు ఒక్కటే, మార్గం ఒక్కటే.

అలజడిగా పక్కమీద దొర్లుతున్న వరూథినికి బయట గేటు తెరచిన చప్పుడు వినబడింది. బయటకు పరుగెత్తుకొచ్చింది. వెంకటపతి గేటుమూసి పిల్లిలా అడుగులు వేసుకొంటూ లోపలకు వచ్చాడు.

వరండాలో లైటు వెలిగింది. వెంకటపతి గాబరాపడిపోయాడు. తలెత్తి చూశాడు. వరూథిని ఎదురుగా నిలబడివుంది. ఆమె కళ్ళు ఎర్రగా మండిపోతున్నాయి. చెంపలు నిగనిగలాడుతున్నాయి. ముక్కుపుటాలు ఎగరేస్తూంది. నల్లటి వొత్తుజుట్టు భుజాలమీదగా జారి, రొమ్ములమీద పడివుంది.

గ్రామదేవతలా నిలబడివున్న భార్యను చూసి తత్తరపోయాడు. ఆమెలో ఏవో కొత్త అందాలు కొట్టవచ్చినట్టుగా కన్పిస్తోన్నాయి.

''చచ్చానా భగవంతుడా? దీంతో ఇవ్వాళ రంగం తప్పదు, ఈ రాత్రి తెల్లవారదు!'' అనుకొన్నాడు వెంకటపతి.

భార్యను తప్పుకొని హాల్లోకి వచ్చాడు.

తన వెనకే వచ్చిన వరూధిని అడుగులు, వెంకటపతికి తన గుండెలమీదే పడినట్టయిపోయి, చలనరహితంగా నిలబడ్డాడు! పెళ్ళాం విసరబోయే విచ్చుకత్తులకు వెన్నిచ్చి ఎదురు చూశాడు.

''విస్కీ వుందా?''

''విస్కీ లేదూ పాడూ లేదూ. తగ్గించుకోవాలని చూస్తున్నా'' తనలో తనే మాట్లాడుకొన్నట్టుగా అన్నాడు.

''మానేస్తారా?''

''మానేస్తేనే బాగుంటుంది.'' వెంకటపతికి ధైర్యం వచ్చింది. వరూధిని రూపంలో కన్పించిన తీవ్రత మాటల్లో లేదు!

''ఎప్పటినుంచి ఈ వైరాగ్యం?''

వెంకటపతి మాట్లాడలేదు.

''ఇప్పుడు విస్కీ కావాలి.''

''ఎవరికీ?'' వెంకటపతి భార్య ముఖంలోకి చూస్తూ అడిగాడు.

''నాకే!''

వెంకటపతి భార్యకేసి ఆశ్చర్యంగా చూశాడు.

''విస్కీ లేకపోతే బ్రాందీ అయినాసరే!''

వెంకటపతి తెల్లబోయి చూశాడు.

''అదీలేకపోతే సారా అయినాసరే!''

''అవన్నీ ఎందుకూ? నీ మందుందిగా? ఎర్రది! ద్రాక్షపళ్ళతో చేసేది!'' వెంకటపతి భార్యను బుజ్జగిస్తున్నట్లు చెప్పాడు.

''అదయిపోయింది. నా తల పగిలిపోతూంది. త్వరగా తెచ్చిపెట్టాలి.''

''అర్ధరాత్రప్పుడెక్కడ దొరుకుద్దీ?'' ఆలోచించి మరీ అన్నాడు వెంకటపతి.

''ఎక్కడయినా సరే!''

''ఎక్కడబడితే అక్కడ కొంటే కల్తీ సరుకు ఇస్తారు.''

''ఏదయినా సరే!''

వెంకటపతి మాట్లాడలేకపోయాడు. వరూధిని వందరూపాయల నోట్లు రెండు తెచ్చి భర్తకిచ్చి అన్నది –

''ఎంతయినాసరే, నాకు ప్రాణం పోయేటట్టుంది. తొందరగా రావాలి!''

వెంకటపతి మెత్తబడిపోయాడు. భార్యమీద జాలివేసింది.

పాపం, దాని మందయిపోయినట్టుంది. దానిబాధ తను చూడలేడు. ఏ మందయినా అలవాటయితే అంతే! అది లేకపోతే ప్రాణాలమీదకొస్తుంది. ఆ బాధేమిటో తనకు తెలుసు. ఇప్పుడు దీనిక్కూడా తెలిసివస్తుంది. ఇదీ ఒకందుకు మంచిదే. రేపు తనను అన్నప్పుడు చెప్పొచ్చు.

వెంకటపతి రోడ్డుమీద నడుస్తూ అనుకొన్నాడు.

ఓ గంట తిరిగి చివరకు 'చౌకు'లో ఉన్న ఓ సోడాషాపులో నూటడైబ్భై ఇచ్చి ఓ బాటిల్ కొన్నాడు. అందులో అంతా నికార్సయిన సరుకే వుంటుందని నమ్మకం కలిగింది. లేకపోతే నూటడెబ్భై ఎందుకు తీసుకొంటాడు? నూరు - నూట పాతికో దాని అసలు ధర. రామనాథబాబుకైతే ఇంకా చౌకగానే దొరుకుతుంది. పోతేపోయింది డబ్బు! మంచిది దొరికింది. తనకైతే ఏం కలిపినా ఫర్వాలేదు. వరూథినికి కదా! మంచిసరకు - సీమసరుకు కావాలి. ఇదయితే మనిషిని తిప్పేయదు. ఆ ఎర్రమందులో కూడా ఏ మాత్రమో నిషా ఉండాలి! లేకపోతే అదిలేనప్పుడు మనిషి ఇట్లా తల్లకిందులైపోదు. నిషా వున్నదేదయినా అలవాటయితే కష్టం.

వెంకటపతి బాటిల్ తెచ్చి పడకగదిలోవున్న భార్యముందు పెట్టాడు. విస్కీ బాటిల్ చూడగానే వరూథిని ముఖం వెలిగిపోయింది. భర్తకేసి చూసింది. ఆ కళ్ళల్లో భర్తమీద కృతజ్ఞతాభావం, జాలీ, అసహ్యం మూడూ విడివిడిగానే ఒకదానిపక్కన ఒకటి ఒరుసుకొని వున్నాయి.

''ఎంత?'' అని అడుగుతుందేమో చెప్పాలని వెంకటపతి భార్యముందే నిలబడ్డాడు. ఆమె అడగలేదు. అయినా వెంకటపతి చెప్పాడు.

''సీసా రెండొందలదాకా తీసుకున్నారు. సీమదే, మంచిదె.''

''సరే, మీరెళ్ళి పడుకోండి!'' భర్తమాటలు వినిపించుకోకుండానే వరూథిని అనేసింది.

''వట్టిదే తాక్కూడదు. సోడాకాయలు లేవుగా, నీళ్ళు కలుపుకో.''

వరూథిని కళ్ళు గుండ్రంగా తిప్పుతూ భర్తను చూసింది. వెంకటపతి అమాయకత్వానికి ఆమె నవ్వకుండా ఉండలేకపోయింది! .

వెంకటపతి జేబులో మిగిలివున్న ఇరవై ఐదు రూపాయలూ తడుముకుంటూ వరూథిని వున్న గదిలోనుంచి బయటికొచ్చాడు.

పాతిక రూపాయలు! తనకు రెండు రోజులకు సరిపోతుంది. ఆలోచిస్తూ పడుకున్నాడు వెంకటపతి.

కళ్ళుమూసుకోగానే గుర్రుపెట్టే వెంకటపతికి నిద్రపట్టలేదు. ఓ గంటసేపు ఊరంతా తిరిగేసరికి తాగిందాంట్లో సగం దిగిపోయింది. ఎప్పుడనంగా తాగాడు? ఎప్పుడో ఊరుపొద్దుకూక్కముందు. నడిరాత్రి దాటింది. ఇంకా ఏం ఉంటుంది? అన్నట్టు వరూథిన్ని హైదరాబాదు సంగతులు అడగలేదు. అడిగే అవకాశం ఎప్పుడుందీ? బాబు ఎలా వున్నాడో? హాలు సంగతి ఏమయిందో? ఎందుకో కుర్రాణ్ణి వదిలి వుండలేకపోతున్నాడు! వాడ్ని చూసి మూడురోజులే అయింది. అయినా పదేళ్ళయినట్టుంది.

గోడ గడియారం ఒకటి కొట్టింది. వెంకటపతి మెలకువగానే వున్నాడు. నిద్రపట్టడంలేదు. వళ్ళంతా కుంగతీసుకు పోతున్నట్టుగావుంది.

వెంకటపతి లేచి వరూథినిగదిముందుకు వచ్చాడు. గదిలో నిశ్శబ్దంగా వుంది.

తొంగి చూశాడు. వరూథిని పందిరి మంచానికి అడ్డంగా పడుకొనివుంది. రవిక తీసేసి బాడీతోనే పడుకొంది. చీర తొలగిపోయివుంది. దీర్ఘంగా బలంగా గాలి పీల్చి వదులుతూంది. ఆమె రొమ్ములు లయగా లేచి పడుతున్నాయి. గాఢ నిద్రలోవున్న వరూథిని ముఖం మెరిసిపోతూంది. పెదవులు అందంగా వంపులు తిరిగి వున్నాయి.

వెంకటపతి భార్య పడక పక్క నిలబడి తదేక ధ్యానంతో చూడసాగాడు. కొద్దినిముషాలు అలాగేచూసి అడుగు ముందుకు వేశాడు.

టీపాయిమీద వున్న గ్లాసు కిందపడింది. వెంకటపతి ఉలిక్కిపడ్డాడు.

ఇంకా నయం, విస్కీ బాటిల్ పడలేదు అనుకొన్నాడు.

బాటిల్ తీసుకొని లైటుకు ఎదురుగా పెట్టి చూశాడు. ఇంకా సగానికి పైగానే వుంది.

వెంకటపతి మనసు ఆగలేక పోయింది. బాటిల్ తీసుకుని, లైటు తీసేసి, గదిలోంచి బయటికి వచ్చేశాడు. తనగదిలోకి వచ్చి మంచం మీద కూర్చున్నాడు. బాటిల్ మూత తీసి, అమాంతం నోటికి అందించాడు. గట గటా నాలుగు గుటకలు వేశాడు. గొంతు మండిపోయింది. తనకే ఇలా అయిందేమిటి? బాటిల్ అటూ ఇటూ తిప్పి చూసుకొన్నాడు.

మోసం! అది కల్తీది! నూట డెబ్బై పుచ్చుకొన్నాడు. గాడ్దికొడుకు. అందుకే అది వళ్ళు తెలియకుండా పడి నిద్రపోతూంది.

బాధ పడ్డాడు వెంకటపతి.

అమ్మినవాడి మీద కసి! వరూథినిమీద కసి! తనమీద తనకే కసి! అందరి మీదా కసి! కసిగా బాటిల్‌లోదంతా తాగేశాడు వెంకటపతి.

## 30

ఓ నెల రోజులుగా వరూథిని థియేటర్‌వైపు ముఖం చూపించలేదు.

వెంకటపతే వెళ్ళి వస్తున్నాడు. భర్తను రామనాథబాబు గురించి మధ్య మధ్య అడిగింది. ఆ నెలరోజుల్లో రెండుసార్లే వెంకటపతి రామనాథబాబును చూడటం తటస్థించింది. వెంకటపతిని చూసీ చూడనట్టు వెళ్ళిపోతుండేవాడు. ఇదివరలో రామనాథబాబే వచ్చి నెలనెలా డబ్బు ఇచ్చి వెళ్తుండేవాడు. కాని, ఈ నెల రోజులుగా ఒక్కసారికూడా తొంగిచూడలేదు.

అయినా వరూథిని బెట్టుగా కూర్చుంది. వెంకటపతికి మరీ ఇబ్బంది అయిపోయింది. రామనాథబాబు వుంటే తనకు డబ్బులకు కొరవ వుండేదికాదు. అడిగినంత ఇస్తుండేవాడు. మధ్య మధ్య ఖరీదయిన బాటిల్స్ తెప్పించి ఇస్తుండేవాడు. మేనేజరు శివరాంను అడిగితే రామనాథబాబు చెప్పందే ఇవ్వటానికి వీల్లేదంటున్నాడు. మరీ వెంటపడితే ఐదో పదో దయదలచి ఇస్తున్నట్లు ఇస్తున్నాడు. ఆ సంగతి వరూథినికి చెప్పాలన్నా భయంగానే వుంది. దొంగకు తేలుకుట్టినట్టు ఊరుకున్నాడు.

రెండో నెల వచ్చినా రామనాథబాబు రావడంగానీ డబ్బు పంపించడంగానీ

జరగలేదు. వరూధిని ఇక ఉండబట్టలేకపోయింది. వెంకటపతితో శివరాంకు కబురు చేసింది.

ఆ సాయంకాలమే వస్తానన్న శివరాం రాలేదు.

భర్తమీద విసుక్కుంది. ''అసలతడేమన్నాడూ?''

''సాయంకాలం వస్తానన్నాడు.''

''మరి రాలేదేం?''

''నాకేం తెలుసూ?''

''మరేం తెలుసు? పో! వెళ్ళి ఇక్కడున్నట్టు రమ్మని చెప్పు! వాడికి పొగ రెక్కింది. ఏమనుకున్నాడో ఏమో?'' రుస రుసలాడిపోతూ అన్నది వరూధిని.

వెంకటపతి వెళ్ళి శివరాంకు మళ్ళీ చెప్పాడు.

శివరాం ఏదో వంకచెప్పి ''రేపు ఉదయం వస్తానని చెప్పండి!'' అన్నాడు.

ఆ మాటే వెంకపటతి భార్యకు చేరవేశాడు. శివరాం ఆ మర్నాడూ రాలేదు. వరూధిని నిప్పులు తొక్కింది.

మూడోరోజు మధ్యాహ్నం వచ్చాడు శివరాం.

''ఏం, నీక్కూడా అంత తీరకుండా పోయిందా?'' ముఖంమీద కొట్టినట్లే అడిగింది వరూధిని.

శివరాం మాట్లాడలేదు.

''డబ్బెంత ఉంది?'' అడిగింది వరూధిని.

''డిస్ట్రిబ్యూటర్స్ యకౌంట్సు కూడా ఈ నెలలో సెటిల్ చేయలేదు. వాళ్ళు ఫోన్ల మీద ఫోన్లు చేస్తున్నారు.''

''అయితే కలెక్షన్ అంతా ఏం చేశారు?''

''రామనాథబాబుగారే పట్టుకెళ్ళారు.''

''బ్యాంక్‌లో వుంది ఏమయిందీ?''

''అదీ వారే డ్రా చేసుకున్నారు.''

''నా కిప్పుడైదువేలు కావాలి. పోయిన నెల్లో కూడా నేనేమీ తీసుకోలేదు.'' గంభీరంగా ముఖంపెట్టి అన్నది వరూధిని.

''నన్నేంచెయ్యమంటారూ? హాలు వర్కర్సుకు జీతాలు కూడా ఇవ్వలేదు. కొద్దికొద్దిగా అడ్వాన్సులిచ్చి సర్దుకొస్తున్నాను. పోస్టర్స్, పబ్లిసిటీబ్యానర్లు కట్టేవాళ్ళు రోజూ నన్ను పీక్కుతింటున్నారు. కార్బన్లకూడా కావాలి. హాల్లో కూర్చుంటే నా ప్రాణాలు తీసేస్తున్నారు వాళ్ళు.''

''అదంతా నాకు తెలియదు. రేపు సాయంకాలంలోపు నాకు డబ్బు తెచ్చివ్వాలి.''

''నన్నేం చేయమంటారు మీరే చెప్పండి? ఉన్నదంతా రామనాథబాబుగారే తీసుకెళ్ళిరి! నా దగ్గర రూపాయి మిగల్చివ్వలేదు ఈ రెండు నెలలుగా. నన్నేం చేయమంటారు మీరే చెప్పండి?''

''నాకు తెలియకుండా రామనాథబాబు కెందుకిచ్చావ్?"

శివరాం ముఖం తేలవేశాడు.

''ఇది ఇవాళ్టిదికాదు. కొత్తేముంది? హోలు కట్టిందగ్గర్నుంచీ డబ్బు విషయం రామనాథబాబుగారే చూసుకుంటున్నారుగా? ఆ సంగతి మీకు తెలియందికాదు."

''సగంవాటా నాకుందని నీకు తెలుసుగా?" వరూథిని గొంతులో అధికారం పలికింది.

''అంతా మీదో, సగమే మీదో నాకెందుకమ్మా! అవన్నీ పెద్దవాళ్ళూ, ఓనర్సూ, మీరూ మీరూ చూసుకోవాలిగానీ" అంటూ లేచాడు శివరాం.

''ఇంతకీ ఏమంటావ్?" తాచుపాములా బుసకొట్టింది వరూథిని.

''నేననేదేముందమ్మా?" పాముకాటు తప్పించుకోడానికి ప్రయత్నం చేసేవాడిలా శివరాం అన్నాడు.

''అంతేనా?" వరూథిని పడగ విప్పింది.

''మీరేం చెప్పమంటే అదే చెప్తాను" అన్నాడు శివరాం.

''ఎవరికీ?"

''రామనాథబాబుగారికే."

''ఒకళ్ళకు చెప్పాల్సినంత ఖర్మ నాకేం పట్టింది?"

''మీ ఇష్టం" అని శివరాం గబగబా వెళ్ళిపోయాడు.

వరూథిని ఆరోజంతా కాలుగాలిన పిల్లిలా తిరిగింది. ఏం చెయ్యాలో ఆలోచిస్తూ అనేక నిర్ణయాలకు వచ్చింది. మళ్ళీ అవి మార్చుకొని మరో రకంగా ఆలోచించింది. ఏ నిర్ణయానికీ రాలేకపోయింది.

రెండోరోజు మధ్యాహ్నం, ఎలాగయినా రామనాథబాబును కలుసుకొని ఈ వ్యవహారమేదో తేల్చుకోవాలన్న నిర్ణయానికొచ్చి, డ్రస్‌చేసుకొని తయారయింది. బయలుదేర బోతుండగా శివరాం రిక్షాదిగి లోపల కొచ్చాడు.

జేబులోనుంచి కవరుతీసి వరూథినికిచ్చి అన్నాడు శివరాం -

''మూడు వేలు. రామనాథబాబుగారిచ్చి రమ్మన్నారు."

''మూడు వేలా? దానాధర్మం ఇస్తున్నాడా? నేనడిగింది ఐదువేలు!"

''ఆ మాట చెప్పాను. వారింతవరకే ఇచ్చి పంపారు."

''ఒకళ్ళిచ్చేదేమిటి నాకు? ఒకళ్ళ అజమాయిషీ ఏమిటి నా డబ్బు నేను తీసుకొనేదానికి?"

శివరాం చేతులు నలుపుకొంటూ నేలచూపులు చూశాడు.

''ఇప్పుడాయనెక్కడున్నాడూ? ఇప్పుడే ఆ సంగతేదో తేల్చుకుంటా!" తొడగొట్టి సవాల్ చేస్తున్నట్లుగా మాట్లాడింది వరూథిని.

''పొద్దున్నే మద్రాసు వెళ్ళిపోయారు."

''ఆ ముండతోనేనా?"

ఆ మాటన్నది వరూథినేనా? అంత నాగరికతగల వరూథిని, అంత అందమైన

వరూథిని, అంత సున్నితంగా కన్పించే వరూథిని ఎంత మొరటుగా మాట్లాడింది!

శివరాంకు నోరు ఎండిపోయింది ఇక మాట్లాడలేకపోయాడు. ఎక్కువసేపు ఆమెముందు నిలబడటంకూడా శ్రేయస్కరం కాదన్నట్టు భావించాడు.

''నేనొస్తానండీ! ఒక్కగంట లేకపోతే జరగటం లేదు. అంతా అరాజకంగా వుంది. ఎవడూ సరిగా పనిచెయ్యడంలేదు. ''

''అసలువాళ్ళకే పట్టకపోతే కూలిడబ్బులకు పనిచేసేవాళ్ళకేంపట్టింది?''

నాలుగడుగులు వేసిన శివరాం వెనుకనుంచి వచ్చిన వరూథిని మాటలకు ఆగిపోయాడు.

''అడ్డమైనవాళ్ళమీద నమ్మకం వుంచబట్టే ఇంతవరకు వచ్చింది. ఎవరిమీదో ఆధారపడి హాలు నడిపించాల్సిన ఖర్మ నాకేం పట్టింది? రేపట్నుంచి నేనే చూసుకొంటాను.''

''అదే మంచిది. అలాగే కానియ్యండి.'' శివరాం అంటూనే గేటు తీసుకొని వెళ్ళిపోయాడు.

సాయంకాలం ఐదింటికల్లా తయారై భర్తకోసం చూసింది. వెంకటపతి పొద్దున్ననగా తిని వెళ్ళినవాడు. ఇంతవరకూ అంతులేడు. హాలు దగ్గరే తారట్లాడుతూ వుండి వుంటాడని ఊహించుకొన్న వరూథిని వీధి గుమ్మంలోకొచ్చి రిక్షాపిల్చింది. వంట మనిషో, పని పిల్లో, భర్తో ముందుగా వెళ్ళి రిక్షాగానీ, జట్కాగానీ పిలుచుకురాందే వరూథిని గదిలోనుంచి బయటికొచ్చేదికాదు. అలాంటిది ఆ రోజు తనే గబగబా బయటికొచ్చి రిక్షా పిల్చుకొని ఎక్కింది.

వరూథిని పిక్చర్ ప్యాలెస్ దగ్గర కొచ్చేసరికి జనంతో చాలా రద్దీగా వుంది. మెయిన్‌గేటు మూసి వుంచారు. కౌంటర్ల దగ్గర జనం క్యూలో నిలబడి తోసుకొంటున్నారు. క్యూలో నిలబడ్డ వాళ్ళకంటే రెట్టింపు జనం ఆడా, మగా, అడ్డదిడ్డంగా నిలబడి, క్యూలో నిలబడ్డ తమ వారికేసి చూస్తున్నారు. రిజర్వ్‌డ్ క్లాసులోకి పోయేవాళ్ళనుమాత్రం మెయిన్ గేటు దగ్గర కాపలా ఉన్నవాళ్ళు పరీక్షగా చూసి లోపలకు వదులుతున్నారు. రిజర్వ్‌డ్‌క్లాసు బుకింగ్ కౌంటరు గేటు లోపల ఆఫీసుకు ఆనుకొని ఉంది.

వరూథిని రిక్షా దిగి జనాన్ని తప్పుకుంటూ గేటు వైపుకు నడిచింది. ఒక్కసారిగా జనంలో కలకలం బయలుదేరింది. నేలా, బెంచీ క్లాసు క్యూలు ములక్కర్ర విరిగినట్టు విరిగిపోయినై. వెనక ఉన్నవాళ్ళు ముందుకు తోస్తున్నారు. ముందున్నవాళ్ళు కాళ్ళు వెనక్కు నిగడదన్ని వెనక్కి నెట్టుతున్నారు. ఆ రద్దీలో వరూథిని ముందుకు వెళ్ళలేకపోయింది.

బుకింగ్ కంతల్లో చెక్కలు తీసేసారు. లోపలనుంచి వెలుగు కన్పిస్తోంది. టికెట్ల అమ్మకం సాగింది. చొక్కాలు విడిచి, గోచీలు బిగించి ఇద్దరు మనుషులు నేల కౌంటరు దగ్గర తోసుకొంటున్నవాళ్ళ తలల మీదగా పాకిపోతున్నారు. టికెటు తీసుకొన్న ఒక్కొక్కడు వెనక నుంచున్న నలుగుర్ని పడతోసుకొని

బయటికొస్తున్నాడు. ఐదునిముషాల్లో హాలు ఆవరణంతా పెద్ద జాతరయిపోయింది. టికెట్లు తీసుకొన్నవాళ్ళు మెయిన్‌గేటు దగ్గిర లాకులు బిగించిన కాలవలోని వరదనీటిలా ఆగి సుడులు తిరిగిపోతున్నారు.

మైన్ గేటులో నుంచి ఒక్కడు పోయే సందుమాత్రం వదిలి నలుగురు మనుషులు గేటు తన్నిపట్టి నిల్చున్నారు. అయినా ఒక్కడు దూరే సందులోంచి ఇద్దరు తోసుకుపోతున్నారు.

జనం వత్తిడి అంతగా లేనిచోట దూరంగా నిలబడి వరూథిని పరిశీలనగా చూస్తోంది. ఎన్నోసార్లు తను థియేటరుదగ్గర ఈ దృశ్యాన్ని చూసింది. ఇది ఎంత బాధాకరమైనదో ఇదివరకు ఆమెకు తట్టలేదు. లోగడ జనం అంతా గొర్రెల మందలా కన్పించేవారు. ఇంత పరిశీలనగా తనెప్పుడూ చూడలేదు.

"పిక్చరేమిటి?" వరూథిని తలెత్తి చూసింది.

గేటు పైగా ఉన్న ఆర్చిమీద బ్యానరూ, కట్ అవుట్ బొమ్మలూ కన్పించాయి.

"సీతారామ కల్యాణం!" అందుకే ఇంత పిచ్చిజనం. హరిశ్చంద్ర, సీతారామ కల్యాణం, లవకుశ - ఎన్నేళ్ళు గడిచినా ఈ దేశంలో చూస్తూనే ఉంటారు.

పిక్చరొచ్చి ఎన్నిరోజు లయింది? "శుక్రువారం ఐదాటలతో బ్రహ్మాండమైన విడుదల!" తాటికాయంత అక్షరాలతో గోడమీద రాసి ఉంది.

ఇవ్వాళ ఆదివారమా? మూడు రోజులనుంచీ ఇంత రష్‌గా వుందా? మరి కలెక్షన్స్ బాగా వుండి వుండాలే? మరి శివరాం అదేమిటి అలా ఏడుస్తాడు?

"రూపాయిన్నర టికెట్ మూడు రూపాయలు! కుర్చీ టికెట్ మూడు రూపాయలు! టికెట్ కావాలండీ?" గళ్ళ చొక్కావాడొకడు ఆమె పక్కగా వచ్చి నిలబడి అడుగుతున్నాడు.

వరూథిని తిరిగి వాడి ముంఖలోకి తేరిపార చూసింది. వాడు నాలుక్కరచుకొని జనంలోకి పారిపోయాడు. తనలాగా నిలబడ్డవాళ్ళదగ్గరకెళ్ళి టికెట్లు అమ్ముతున్నాడు. అలాంటివాళ్ళు ఇంకా నలుగురైదుగురు కన్పించారు. ఒకడు నేల, ఒకడు బెంచీ, మరొకడు కుర్చీ టికెట్లు బొత్తులు పెట్టుకొని జనంలో తిరుగుతూ అమ్ముతున్నారు. నేల టికెట్ కౌంటరు మీద చెక్క పడింది. అక్కడ మూగిన జనం ఒక్క ఊపున అడ్డం వచ్చిన వాళ్ళను తొక్కుకుంటూ, బెంచీ కౌంటర్‌మీద, అలలా వచ్చిపడ్డారు. అంతకుముందే అక్కడున్నవాళ్ళు గోడకు కర్చుకుపోయారు.

"ఘోరం! ఘోరం!" అనుకొంది వరూథిని.

బెంచీ టికెట్ కౌంటరుకూడా మూసివేశారు. బ్లాకులో అమ్మే కుర్రాళ్ళ గిరాకీ పెరిగిపోయింది.

"ఆట మొదలుపెట్టారంట. పదండి" అప్పుడే టికెట్లుకొన్నవాళ్ళు గేటుమీద పడ్డారు. ఎంతమందిగేటు దగ్గర మూగినా గేటు మాత్రం మనిషి పోయే సందుకు మించి తెరచిలేదు.

వరూథినికి కంపరమెత్తిపోయింది. ఎందుకా గేటు అలా బిగించి చస్తారు?

హాల్లోకి వెళ్ళేప్పుడు ప్రతి గేటు దగ్గరా మనుషులు ఉండనే ఉంటారు కదా? మళ్ళీ ఇక్కడ ఈ ఏపుడు ఏమిటి? ఇదేనా శివరాంగాడి మేనేజ్‌మెంటు? రామనాథబాబు అనుభవమూ తెలివీ? టిక్కెట్లు కొన్న జనం ఆట మొదలుపెట్టారని లబలబ లాడిపోతున్నారు. అయినా ఆ గేటు దగ్గర తంతు అలాగే సాగుతోంది.

వరూథిని జనాన్ని తప్పించుకొని గేటుదగ్గర కొచ్చింది. గేటు లోపల్నుంచి నలుగురు ఎద్దుల్లాంటి మనుషులు, ఇనప సువ్వలు పట్టుకొని, గేటు అటూ ఇటూ అంగుళం బెసక్కుండా తన్నిపట్టి నిలబడి ఉన్నారు. అందులో ఒకడు వెంకటపతి!

ఈయన రోజూ ఇక్కడ చేసే పని ఇదేనా? వరూథినికి వళ్ళు మండిపోయింది.

''గేటు వదలండి!'' వరూథిని బిగ్గరగా అన్నది.

జనాన్ని అదుపుచేసే పనిలో వున్నవాళ్ళు వరూథిని మాట వినిపించుకోలేదు. వరూథిని ఇంకా ముందుకు వచ్చి గట్టిగా అరచినంత పనిచేసింది.

''మీకే చెప్పేది! మొద్దుల్లా నిలబడి ఎందుకు అలా జనాన్ని అడ్డగిస్తారు?''

''అమ్మగారు, అమ్మగారు! తప్పుకోండి. తప్పుకోండి!'' జనాన్ని ఇరగతోసి త్రోవ చేశారు.

వరూథిని లోపలకొచ్చి గేట్లు బార్లా తెరిపించింది. వరమిచ్చిన దేవతను చూసినట్టుగా వరూథిన్ని చూశారు జనం.

మూడు నిముషాల్లో జనం అంతా కరిగిపోయారు.

''అట్టా వదిలేస్తే టికెట్ లేనివాళ్ళంతా థియేటరు గేట్లమీదకు ఎగబడతారమ్మా!'' అన్నాడు కొండలరావు.

''అందుకని డబ్బులిచ్చి టిక్కెట్లు కొన్నవాళ్ళను మోచేతుల్తో కుమ్మి, పొడిచి హింస పెడ్తారా? ఆ ఏడుపేదో టికెట్లు కలెక్టు చేసే గేటు ముందే ఏడిస్తే పోతుందిగా? అక్కడ నాలుగు గేట్ల మీద సర్దుకుంటారు జనం.''

వరూథిని నేరుగా థియేటర్‌లోకి వెళ్ళి పదినిముషాలు నిలబడింది. హాలంతా నిండుగా వుంది. తెరమీద విశ్వామిత్రుడు వచ్చి దశరథుడ్ని రామలక్ష్మణుల్ని తనతో పంపమంటున్నాడు.

''వాళ్ళు ముక్కు పచ్చలారనివాళ్ళు. వాళ్ళొచ్చేం చేస్తారు? కావాలంటే నేనే వస్తాను'' అంటున్నాడు దశరథుడు.

''ముసలాడివి నువ్వొచ్చేం చేస్తావు? వద్దు. పంపితే వాళ్ళనే పంపు. లేకపోతే చూడు ఏం చేస్తానో?'' అన్నాడు విశ్వామిత్రుడు.

దశరథుడు ఏడవడం మొదలుపెట్టాడు.

ఛీ! ఛీ! మహారాజుక్కూడా ఏడుపే?

వరూథిని తెరమీది దశరథున్ని చూడలేక థియేటర్లోనుంచి బయటికొచ్చి ఆఫీసు గదిలో ప్రవేశించింది.

శివరాం బ్లాకులో అమ్మిన టికెట్ల తాలూకు డబ్బులెక్కపెట్టుకొంటూ ''మొత్తం నూట ఇరవై టికెట్లు. టికెటుకు పెచ్చు అర్ధరూపాయిన అరవైరావాలి. ఏభయ్యే

ఇచ్చావేమోయ్?" అన్నాడు ఎదురుగా నిలబడివున్న ముఠానాయకుడితో.

''తక్కువ కమ్మేయాల్సి వచ్చింది సార్! మెయిన్‌గేటు తెరిచేశారు. రష్ తగ్గిపోయింది. రష్‌గా వున్నట్టు కన్పించకపోతే మా దగ్గిరెవరు టికెట్లుకొంటారు సార్?''

''మీకోసం బుకింగులు తొందరగానే క్లోజ్ చేయించాగా?" అన్నాడు శివరాం.

''అదికాదు సార్. మెయిన్‌గేటు తెరిచేసరికి మంది పల్చబడ్డారు సార్!"

''ఎవరోయ్ తెరిపించిందీ?'' అంటూ ఉండగా శివరాంకు వరూథిని కన్పించింది.

లేచి నిలబడ్డాడు. రేపట్నుంచీ హాలు దగ్గిర కొస్తానన్న వరూథిని ఆ రోజే వస్తుందని ఊహించని శివరాం ఖంగుతిన్నాడు.

''బ్లాక్‌లో వస్తున్న డబ్బు ఎవరి ఖాతాలో జమ కడ్తారూ?" అన్నది వరూథిని.

''ఎక్కడమ్మా! ఈ రోజే. అదీ యీ ఆటకే! ఆదివారం కదా? రష్‌గా ఉంది.''

''సరేలే, మొత్తం కలక్షన్ లెఖ్ఖచూసి ఆ బ్లాక్‌మనీతోసహా ఇట్లా ఇచ్చేయ్!" అంటూ వరూథిని కుర్చీ లాక్కొని కూర్చుంది.

''డిస్ట్రిబ్యూటర్ వాటా, టాక్సూ, దేనికిదానికి లెఖ్ఖలు విడివిడిగా చూడాలి." పెద్ద చిక్కు సమస్యలా వరూథిని ముందు పెట్టాడు శివరాం.

''చూడూ, నేవద్దన్నానా?" అతి సులువుగా సమస్యను తేల్చివేసి అన్నది వరూథిని.

''ఇవ్వాళ్టిది రేపుసాయంకాలానికి చూస్తాం!'' అది తిరుగులేని పద్ధతి అన్న ధోరణిలో చెప్పాడు శివరాం.

''అది నిన్నటివరకూ జరిగిన పద్ధతి. నాకు ఏరోజు చార్ట్ ఆరోజే కావాలి. సెకండ్‌షో బుకింగ్ క్లోజ్ అయిన గంటకు లెక్కలు తేలిపోయాలి. అంటే - పదిన్నరకు థియేటరు షేరు లెఖ్ఖచూసి క్యాష్ నా ముందు పెట్టాలి. ఇది ఇవ్వాళ్టినుంచే అమలు జరగాలి." సైన్యానికి ఆర్డరిస్తున్న కమాండరులా చెప్పింది వరూథిని.

## 31

వరూథిని ఆధ్వర్యంలో వరూథిని పిక్చర్ ప్యాలెస్ బాగానే నడిచిపోతూంది.

ఆమె థియేటర్ నడిపేభారం వహించి ఆరువారాలకు పైగా అయిపోయింది. సీతారామ కల్యాణం కలక్షన్ ఏమీ డ్రాప్ కాలేదు. ఇంకో ఆరువారాలు అలానే నడిచేట్టుంది. థియేటర్ షేర్ యాభై పర్సెంటు లెవెలుకు వచ్చింది. ఇంకా, వారానికి ఐదురోజులు హౌస్‌ఫుల్ అవుతూనే వుంది. ఆ ఆరువారాల్లోనే థియేటరు షేరు పద్దెనిమిది వేలు వచ్చింది. జీత బత్తేలు, ఖర్చులూ పోను, పదివేలు నికరంగా మిగిలింది. స్టాఫ్‌లో సగం మంది వరూథినికి సన్నిహితులయారు. ఆమె అంటే

భయభక్తులు చూపిస్తున్నారు. శివరాం మీదా, మిగతావాళ్ళమీదా, ఏవేవో ఉన్నవీ లేనివీ చెపుతున్నాడు అసిస్టెంటు మేనేజరు రామదాసు.

వరూథినికి రామదాసుమీద బాగా గురి కుదిరింది. వీలుచూసుకొని ఇంకో నాలుగువారాలు ఆగి, శివరాంకు ఉద్వాసన చెప్పి రామదాసును మేనేజర్ని చేయాలన్న నిర్ణయానికొచ్చింది. ఆమె ఉద్దేశ్యాన్ని గ్రహించిన రామదాసు వరూథినికి నీడలా తిరుగుతున్నాడు. ఆమె వంటిమీద ఈగ వాలకుండా కాపలా కాస్తున్నాడు. రామదాసు సహాయ సహకారాలవల్ల వరూథినికి థియేటరు మేనేజ్‌మెంటు వ్యవహారాలు నల్లేరుమీద బండిలా సాగిపోతున్నాయి. శివరాం అడకత్తెరలో పోకచెక్కలా అయిపోయాడు.

అతని విశ్వాసం రామనాథబాబు మీదే ఉంది. అది కన్పించకుండా పైకి నాటకం ఆడటం మొదలుపెట్టాడు. అయినా లాభం లేకపోయింది. రామదాసు, శివరాం తెరవెనకా ముందూ ఆడే నాటకం అంతా వరూథిని చెవిలో ఎప్పటికప్పుడే వేస్తున్నాడు.

రామనాథబాబుతో శివరాం ఎప్పుడు ఎక్కడ కలిసిందీ, వరూథిని లేనప్పుడు రామనాథబాబు ఎన్నిసార్లు వచ్చిందీ, అయన వచ్చినప్పుడు ఎవరితో ఎంతెంతసేపు మాట్లాడిందీ, థియేటరు చార్టుతోపాటు వివరాలు ఇస్తూనే వున్నాడు రామదాసు.

ఇకపోతే వెంకటపతికి వరూథిని పెత్తనం కొంత ఇబ్బందిగానేవున్నా హాలుమీద ఇదివరకులేని అధికారాలేవో సంక్రమించినట్టుగా ఉంది. అతనికి అదివరలో లేని మర్యాదా మన్ననా హాల్లో పనిచేసేవాళ్ళనుంచి అందుతోంది. కాకపోతే వచ్చినచిక్కల్లా వరూథినితోనే! ఒక్క రూపాయి కూడా తన చేతుల్లో పడటంలేదు. కాఫీ బీడీలతో సహా లెక్కలు కట్టి బొటాబొటిగా ఇస్తోంది. ఎంత గింజుకున్నా రోజుకు రెండు రూపాయలకంటే దొరకటంలేదు. అది సినిమా బండి వెంట వెళ్ళి, సినిమా పేపర్లు పంచి పెట్టేవాడి కూలికంటే పావలా తక్కువే.

ఆవిడకు ఇష్టమైనప్పుడు ఓ బాటిలో, ఆరో, తనే తెప్పించి ఇస్తుంది. అది వెంకటపతికి ఒక మూలకు చాలటంలేదు. థియేటర్ స్టోర్‌గదిలో వెంకటపతి దుకాణం వరూథిని సాగనివ్వడంలేదు. రోజులో ఎక్కువ టైం హాలు దగ్గిరే వుండటముచేత కన్ను వెంకటపతి మీద వేసే వుంచుతోంది. ఇంటిదగ్గర వుంటే సరేసరి.

ఓ నెల రోజులు ఆ బాధను ఎలాగో తట్టుకొన్నాడు. తర్వాత వరూథిని హాలు దగ్గరకు వొచ్చే సమయానికి వెంకటపతి ఇంటికి జారుకోవడం మొదలుపెట్టాడు. నాలుగు రోజుల్లో వరూథిని పట్టేసింది. మనిషిమీద మనిషిని పంపించి ఇంటి దగ్గర నుంచి పిలిపించడం మొదలుపెట్టింది.

వెంకటపతికి రామనాథబాబు ఉన్నప్పుడే బాగుండేదనిపించింది. అడిగినంత డబ్బు ఇచ్చేవాడు. వారానికి రెండు మూడు బాటిల్స్ ఇచ్చేవాడు. మొదట మొదట అయితే సీమ సరుకు చాలా ఖరీదైందే ఇచ్చేవాడు. మనిషి నిజంగా

పెద్దమనిషి, పెద్దచెయ్యి అతనిది. తనను ఎంత మర్యాదగా చూసేవాడు? మర్యాదా మన్ననా తెలిసినవాడు, జమీందారీ పాయ. అందుకే అన్ని గొప్ప లక్షణాలు. దీన్ని తగలెయ్యా! ఇది అంతటి పెద్దమనిషితోనూ పేచీ పెట్టుకొని పెత్తనం చెలాయిస్తూంది. దీనికి ఆ రామదాసుగాడొకడు తోడు. దాసుగాడికంటే శివరామే వెయ్యిరెట్లు నయం.

వెంకటపతికి గత మూడు రోజులుగా నోరు ఎండిపోతూంది. పెళ్ళాంమీద కసి కసిగా వున్నాడు. అవడానికి వరూథిని భర్తే అయినా వెంకటపతి రామనాథబాబుమీదే ఎనలేని అభిమానంగా వున్నాడు. బాహ్యరూపంలో వరూథిని పక్షంవాళ్ళు మనిషిగా కనబడ్డా వెంకటపతి మనసు రామనాథబాబు మనుషులవైపే మొగ్గింది.

మరో రెండు వారాలు గడిచాయి. శ్రీ రామనవమి వచ్చింది. వరూథిని థియేటర్లో సీతారామకళ్యాణం రోజుకు ఐదాటలు వేశారు. నవమి ఐదు రోజులూ హాలు ఫుల్‌గానే వుంది. తర్వాత తొమ్మిది రోజులూ నాలుగాటలు వేసినా, జనం బాగానే వచ్చారు. తొమ్మిదోవారం దాటింది. సీతారామకళ్యాణం ఇంకా లాగుతూనే వుంది.

"దాసూ! ఈ బొమ్మ మన థియేటర్లో శతదినోత్సవం చేయించుకోవాలి!"అన్నది వరూథిని.

"శతదినోత్సవం ఏమిటమ్మా? సిల్వర్ జూబిలీ చేయించుకొంటుంది. ఇంకా రెండురోజులు పోనియ్యండి. మళ్ళీ రైజ్ కాకపోతే నన్నడగండి" అన్నాడు రామదాసు.

వరూథిని తృప్తిగా, నిండుగా నవ్వుకొంది.

"అమ్మగారూ! చెప్పటం మర్చిపోయా –"వరూథిని కేసి చాటంత ముఖం చేసుకొని చూశాడు రామదాసు.

"ఏమిటదీ దాసూ?"

"డిస్ట్రిబ్యూటరీ సర్కిల్లో మన హాలుకు మంచి పేరొచ్చింది. అంతా మీ మానేజ్‌మెంటు గురించి చాలా గొప్పగా చెప్పుకొంటున్నారు."

"ఎవరన్నారూ?"

"మొన్న కొత్తగా వచ్చిన రిప్రజెంటేటివ్ చెప్పాడు. ఇక నుంచి పెద్ద పిక్చర్లన్నీ మన థియేటర్‌కే ఇస్తారు. ఏ డిస్ట్రిబ్యూషన్ సర్క్యూటయినా మన దగ్గరకే రావాలి. అంత మంచి పేరు పడిపోయింది మీ గురించి!"

"మనం హాలు కట్టి రెండేళ్ళవుతుంది కదా? ఒక్క పిక్చరన్నా ఇట్లా పోయిందా?" గర్వంగా ముఖంపెట్టి అడిగింది.

"నేనొచ్చాక మన హాల్లో ఇంత గొప్పగా పోయిన బొమ్మలేదు. ఇందులో ఇంకో మతలబుందమ్మా! ఆ రామనాథబాబుగారేమో ఈ శివరాంగాడిమీద వదిలిపోయేవారు. వీడి సంగతి మీకు తెలుసుగా? బాగా పోయే పిక్చర్ని నొక్కేసేవాడు. మూడో వారం తిరక్కముందే హోల్డ్ వరకు తెచ్చేవాడు. అట్లా ఎన్ని పిక్చర్లు

దెబ్బతిన్నాయమ్మా! ప్రొద్యూసర్లంతా ఒకటే ఏడుపుగదమ్మా! ఇప్పుడు చూడండి – మద్రాసులో, విజయవాడలో, గుంతకల్లులో మీ గురించి ఎట్లా చెప్పుకుంటున్నారో! మా బావమర్ది విజయచిత్ర కంబైన్స్‌లో అసిస్టెంటు డైరెక్టరుగా పని చేస్తున్నాడుగా! మొన్ననే వచ్చాడు. ప్రతి ప్రొడక్షన్ కంపెనీలో మీ గురించే మాట్లాడుకొంటున్నారమ్మా! ఇండస్ట్రీలో ఇప్పుడు మన థియేటర్ గురించి తెలియనివాళ్ళు లేరంటే నమ్మండి!" ఇంకా ఏం చెప్పాలా అని ఆగి ఆలోచించసాగాడు రామదాసు.

"రామదాసూ! రామనాథబాబు వారాల తరబడిగా మద్రాసులో మకాం వేస్తున్నాడు గదా, ఏదయినా పిక్చర్ తీసే ప్రయత్నంలో వున్నాడా ఏం?" అడిగింది వరూథిని, ఆ రోజు కార్లో రామనాథబాబు ప్రక్కకూర్చొని వున్న ఆడది గుర్తొచ్చి.

"అది సినిమా ముండా ఏమిటి?" అనుకొంది వరూథిని. కోలవెన్ను షావుకారుగారి కోడలన్నారుగా? మరి మద్రాసు చుట్టూ తిరుగుతున్నాడెందుకూ? దాన్ని హీరోయిన్‌గా పెట్టి సినిమా తీస్తాడా ఏం, కొంపదీసి? అది హీరోయిన్‌గా వేస్తే జనం హాలుమీద రాళ్ళు వెయ్యరూ? తెర తగలబెట్టరూ? తన ఆలోచనల్లో తనుగా వున్న వరూథినికి రామదాసు చెప్పింది వినిపించలేదు.

"అసలు సంగతేమిటంటే – షావుకారుగారికోడల్ని బుట్టలో వేసుకొని హైదరాబాదులో కట్టించబోయే హాలుకు పెట్టుబడి పెట్టించా..." రామదాసు ఆఫీసు గదిలోకి వస్తున్న శివరాంను చూసి ఆపేశాడు.

రామదాసు చెప్పిందే వరూథిని మనస్సును పట్టి పీడించసాగింది. రామనాథబాబు అలా ప్రవర్తించటానికి కారణం ఇదేనన్నమాట? దాన్ని అడ్డం పెట్టుకొని హైదరాబాదులో హాలు కట్టాలని చూస్తున్నాడు. అతని మొదటి హాలు కూడా ఇలాగే కట్టి వుంటాడు. దేని సొమ్ముతో కట్టాడో? అదేమయిందో? పైకి చూస్తే పెద్ద జమీందారల్లే కన్పిస్తాడు. రామనాథబాబు ఆస్తంతా ఇలా ఆర్జించిందే అయి వుండాలి? పోనీయ్! ఆ ముదనష్టం తనకెందుకూ? పీడా విరగడయిపోయింది.

తను తన హాలు జాగ్రత్తగా చూసుకోగలిగితే చాలు! తనకు అంతకంటే ఏం కావాలి? ఇంకా మూడో నెల అవలేదు. పదకొండు వారాలకే పాతిక వేలు థియేటర్ వాటా మిగిలింది. వడ్డీలూ, డిప్రెసియేషన్ వగైరా పోను ఇరవై వేలు నికర లాభం.

ఈ లెక్కన ఆ రామనాథబాబు ఈ రెండేళ్ళలో ఎంత తిన్నాడో? తనే పిచ్చిముఖం. పట్టించుకోకుండా ఊరుకుంది. ఈ హాల్లో కొట్టేసిన డబ్బుతోనే హైదరాబాదులో స్థలం కొంటున్నాడు. థియేటర్‌కేమో ఆమెచేత పెట్టుబడి పెట్టిస్తున్నాడు. మొత్తం థియేటర్‌లో సగం భాగం తను కొట్టేస్తాడు.

తనను మాత్రం ఏం చేశాడు? ఇరవైవేలు పెట్టించి తనచేత లిటిగేషన్‌లో వున్న స్థలం కొనిపించలా? చివరకు ఆ స్థలం మళ్ళీ కొని, థియేటర్‌కు డబ్బంతా తనచేత పెట్టించాడు. తరుగైన సొమ్ము లోన్‌గా తెచ్చాడు. ఇంతకీ అప్పులైనా

తీర్చాడా? అంతా పులుసులో వేసుకొన్నాడా? అసలు తనకు లెక్కలు చూపినంత థియేటర్‌కు ఖర్చయిందా? అందులోనే ఓ లక్షరూపాయిలదాకా కొట్టేసి ఎక్కువ చెప్పాడా? అయిందేదో అయిపోయింది ఇప్పటికైనా తను కళ్ళు తెరిచింది - అంతే చాలు!

వరూథినికి నిద్రపట్టక లేచి కూర్చుంది. బీరువాలోనుంచి వైన్ బాటిల్ తీసింది. గ్లాసు ముందు పెట్టుకొని పందిరి మంచంమీద కూర్చుంది.

వైన్ గొంతులోనుంచి కిందకు జారగానే మళ్ళీ ఆమె మనసు రామనాథబాబు మీదకు మళ్ళింది.

రామనాథబాబు మద్రాసు హోటల్లో దాంతో కులుకుతూ వుంటాడు. అసలు హైదరాబాదే వెళ్ళుంటాడేమో? మద్రాసని అబద్ధాలు చెప్తూండవచ్చు. హైదరాబాదు సినిమాహాలు సంగతి తననుంచి దాచటానికి ఈ ఎత్తువేసి ఉంటాడు. హైదరాబాదులో గోపాలరావు చెప్పింది కొంతవరకు నిజమే! గ్లాసులో వైన్ సగానికి తరిగిపోయింది. వరూథిని మెదడు వేగం హెచ్చింది.

రామనాథబాబు ఎంతకాలం దాక్కుంటాడు? సినిమాహాలు లాభాల్లో వాటాలకైనా వస్తాడుగా? రాకుండా పోడు! ఎప్పుడో వస్తాడు. అప్పుడడుగుతుంది తను, ఈ రెండేళ్ళ లాభం సంగతి చెప్పమని. ఈ రెండేళ్ళలో తన కెంత ఇచ్చాడూ? తను లెఖ్ఖపెట్టి చావలేదు. అతను ఇస్తూ వచ్చాడు. తను తీసుకుంటూ పోయింది. ఏమైనా తనకు రావాల్సిందాంట్లో సగంకూడా ఇచ్చి వుండడు. ఈ ఆరాలన్నీ ఆనాడు తనకు పట్టలేదు. 'నీదీ నాదీ' అన్న తేడా లేకుండా నడిచిపోయింది. రామనాథబాబే తను అనుకున్నది. ముష్టి డబ్బు విషయం ఎవరికీ పట్టలేదు. రామనాథబాబు ఓసారి, ''నేనే నీవాడ్ని అయినప్పుడు నాది నీది కాదా? నా సర్వస్వం నీదే! ఇదంతా నీ కోసమేగా?'' అన్నాడు.

అప్పుడు రామనాథబాబు గుండెలమీద తను వాలిపోయింది. రామనాథబాబు తనను, తనలో కలుపుకొంటూ ఎంత ఇదైపోయాడూ? తను రామనాథబాబును పెనవేసుకొని, అతని ముఖం తనమీదకు లాక్కొని ఏంచేసింది? అప్పుడు రామనాథబాబు....వరూథిని మనస్సు వశం తప్పిపోయింది. పెదవులు కంపించిపోయినై. దుఃఖం పొర్లుకొస్తూంది. పందిరి మంచం మీదనుంచి జారి తూలి కిందపడింది.

వెక్కి వెక్కి ఏడ్చింది వరూథిని.

రామనాథబాబును తల్చుకొని కుళ్ళి కుళ్ళి ఏడ్చింది వరూథిని.

ఎవరో తన వెనకొచ్చి నిలబడ్డారు. రామనాథబాబే! తనను రెండు చేతుల్తో ఎత్తుకెళ్లి మంచంమీద పడుకోబెడ్తున్నాడు. అతన్ని చెయ్యి పట్టుకొని తనమీదకు లాక్కుంటూ బలవంతంగా కళ్ళు తెరచి చూసింది.

వరూథిని చెయ్యి అప్రయత్నంగానే అతని చేతిని వదిలేసింది. తేలిపోతున్న దృష్టిని నిలిపి చూసింది. అతను రామనాథబాబుకాడు, భర్త వెంకటపతి!

పందిరి మంచం మీద కూర్చొని, తనను ఆనుకొని తనమీదకు వంగుతున్న వెంకటపతిని వరూథిని కాళ్ళతో తోసేసింది.

టీపాయ్‌మీద మిగిలిన వైన్ బాటిల్ తీసుకొని అదేపోతగా పోయాడు వెంకటపతి.

## 32

వరూథిని పిక్చర్ ప్యాలస్‌లో సీతారామకళ్యాణం శతదినోత్సవానికి ఏర్పాట్లు చురుగ్గా జరిగిపోతున్నాయి. వరూథిని అన్ని ఏర్పాట్లు స్వయంగా అజమాయిషీ చేస్తూంది. రామదాసూ, వెంకటపతీ రాత్రింబవళ్ళూ కష్టపడుతున్నారు.

శివరాం కూడా వరూథినికి అణిగిమణిగి పడివుంటున్నాడిప్పుడు: శతదినోత్సవానికొచ్చే కళాకారులకు, టెక్నీషియన్లకూ, ప్రొడ్యూసర్, డిస్ట్రిబ్యూటర్ తరఫువాళ్ళకోసం వరూథిని అన్ని ఏర్పాట్లు సమకూర్చింది. టౌనంతా బ్యానర్లు కట్టించింది తెల్లవారితే అంతా వస్తారు. పది గంటలకు వరూథిని పిక్చర్ ప్యాలెస్‌లో ఫంక్షన్. సాయంకాలం ఆరుగంటలకు అల్పాహారవిందు. రాత్రి వరూథిని యింట్లోనే ముఖ్యమైనవాళ్ళకు డిన్నర్.

నాలుగు రోజులుగా ఊపిరిసలపకుండా అయిపోయింది. అన్ని ఏర్పాట్లు బాగా జరిగిపోయాయని తృప్తికలిగాక వరూథినికి బడలిక తెలిసింది. బాగా అలసిపోయి ఉంది. మధ్యాహ్నం భోజనంచేసి పడుకుంది. బాగా చీకటిపడ్డాకగాని మెలకువ రాలేదు. ఏడుగంటలయింది. త్వరగా డ్రస్ చేసుకుని థియేటర్‌కు బయలుదేరింది.

థియేటరు దగ్గర రిక్షాదిగి మామూలు అలవాటు ప్రకారం ముందుగా ఆఫీసుకేసి వెళ్ళింది. ఆఫీసులో శివరాం పక్కన ఒక వ్యక్తి కూర్చొని వున్నారు. అతడి పక్కన దృఢకాయులు ఇద్దరు నిలబడి ఉన్నారు. వరూథిని గదిలోకి వచ్చింది. తనను చూసి వాళ్ళు నిలబడతారని ఆశించిన వరూథినికి ఆశాభంగమైంది. వరూథిన్ని చూసికూడ చూడనట్టే అవతల వ్యక్తితో థియేటర్ కలెక్షన్ గురించి చెబుతున్నాడు శివరాం. వరూథిని చివాలున వెనక్కు తిరిగి ఆఫీసు గదిలోనుంచి బయటకొచ్చింది. రామదాసు పరుగెత్తుకుంటూ ఆమె దగ్గర కొచ్చాడు.

"వాళ్ళెవరూ? అడ్డమైన వాళ్ళందర్నీ ఆఫీసులోకి చేరుస్తారెందుకూ?" కోపంతో ఉడికిపోతూ అన్నది వరూథిని.

"మీ కోసమే చూస్తున్నానమ్మా! ఆఫీసులో కూర్చున్నాయన రాంకృష్ణయ్య - రామనాథబాబు బావమర్ది."

"అహా! ఎందుకొచ్చాడంటా?" పెదవి విరుస్తూ అన్నది వరూథిని.

"ఏమో! వచ్చిందగ్గరనుంచీ ఆ శివరాంగాడితో ఒకటే మంతనాలు!"

"శివరాంను ఇంతవరకూ ఉంచడం మనదే పొరపాటు! ఏడవనియ్! అసలువాడివల్లే కాలేదు. బావమర్దేం ఏడుస్తాడు?" అని వరూథిని థియేటర్ వరండాలో కుర్చీ వేయించుకొని కూర్చుంది. రామదాసు పక్కన నిలబడ్డాడు. తెల్లవారి

శతదినోత్సవం కోసం చేసిన ఏర్పాట్లు గురించి చెప్పకుపోతున్నాడు రామదాసు. వరూథిని 'ఊ' కొడ్తూ ఇంకేదో ఆలోచిస్తూ కూర్చొంది.

రెండో ఆట బుకింగ్ అయిపోయింది. వరూథిని ఇంటికి వెళ్ళడానికి సిద్ధమయి ఆఫీసు గదిలోకి వచ్చింది.

''శివరాం! పూర్తయిందా?''

''ఆఁ అయిపోయింది, కాని డబ్బు మీకివ్వడానికి వీల్లేదంటున్నాడు!''

''ఎవడు వాడు?'' వరూథిని దురుసుగా అన్నది.

''రామనథబాబుగారి బావమరిది.''

''అతని కిక్కడేం పని? అసలు అతడ్నీ ఆఫీసులోకి ఎందుకు రానిచ్చావ్?'' వరూథిని అంటుండగానే రామకృష్ణయ్య గబగబా తోసుకొని ఆఫీసు గదిలో కొచ్చాడు.

''అదుగో, వచ్చారు! ఆయన్నే అడగండి!'' రామకృష్ణయ్యను చూపిస్తూ అన్నాడు శివరాం. ఒకపక్కన శివరాంకు చెమటలు కమ్ముకొస్తున్నాయి.

''ఒకడ్నడిగే పని నాకేమిటి? ముందా డబ్బు ఇలా ఇవ్వు!''

''అట్టా ఇవ్వడానికి వీల్లేదు!'' రామకృష్ణయ్య అరిచినట్టు అన్నాడు.

వరూథినికి ఛఱుమంది. ''ఎవరు నువ్వు? ముందు బయటకి నడువ్!'' అన్నది రామకృష్ణయ్యను చూసి.

''మర్యాదగా మాట్లాడు. ముందు నువ్వెవ్వరో చెప్పు!'' రామకృష్ణయ్య మొరటుగా అన్నాడు.

వరూథిని గుండెలు వేగంగా కొట్టుకొన్నాయ్.

''నేనెవర్నా? సమాధానం చెప్పాల్సింది నీక్కాదు, రామనాథబాబును రమ్మను చెబుతాను.'' ముక్కుపుటాలు ఎగరేస్తూ అన్నది.

''మా బావెందుకూ? అయ్యన్దేమీలేదు ఇక్కడ! ఏయ్ శివరాం, ఇట్టివ్వుడబ్బు!'' రామకృష్ణయ్య వరూథిన్ని దాటుకొని డబ్బుకోసం చెయ్యి చాపాడు. వరూథిని శివరాం ముందున్న నోట్లపాత్తి గభాలున అందుకోబోయింది. రామకృష్ణయ్య వరూథిన్ని తోసేసి డబ్బు అందుకొన్నాడు. వరూథిని తూలి గోడమీదకు పడింది! అప్పుడే ఆఫీసు గదిలోకి వచ్చిన వెంకటపతి కిందపడిన భార్యను చూశాడు.

అతనికి ఏం చెయ్యడానికి తోచలేదు. తన భార్యమీద చెయ్యివేసి తోసేసిన రామకృష్ణయ్యకేసి తీవ్రంగా చూశాడు. రామకృష్ణయ్యలాంటివాళ్ళను నలుగుర్ని అవలీలగా ఎత్తిఅవతల పారేయగల వెంకటపతి నిస్సహాయుడిగా నిలబడిపోయాడు. లోపల నాలుగు పెగ్గులు పడివుంటే అలాంటివాళ్ళను ఆరుగుర్ని తుక్కుకింద కొట్టేవాడు. కాని వరూథిని రెండు రోజులుగా వెంకటపతిని ఎండగట్టింది.

రామదాసు కొండలరావునూ, వెంకుల్నీ వెంటబెట్టుకొని రొప్పుకుంటూ వచ్చాడు.

వరూథిని చిరుతపులిలా లేచి నిలబడింది. జారిన పైట సర్దుకొంది. ఆమె కళ్ళు చింతనిప్పుల్లా మండిపోతున్నాయి. తాచులా బుసలు కొడుతూ వెంకటపతి, రామదాసులకేసి చూస్తూ అన్నది -

''ఏం, మీరు మగాళ్ళు కాదూ? మీకు చేతుల్లేవూ?"

మెరుపులా రామదాసు తన మనుషుల్తో రామకృష్ణయ్యమీద పడ్డాడు. మరుక్షణంలో ఇద్దరు వస్తాదులు, మరో నలుగుర్ని వెంటబెట్టుకుని గదిలోకి జొరపడ్డారు. రెండునిమిషాల్లో ఆఫీసు గదిలోని ఫర్నీచరంతా విరిగి కూలిపోయింది. పది ఆంబోతులు ఒక్కసారి తలబడి కుమ్ముకుంటున్నట్టుగా వుంది! ఎవరు ఎవర్ని కొడుతున్నారో తెలియడంలేదు. అందిన వాడిని, అందినచోటల్లా కుమ్ముతున్నారు.

కేకలూ! పెడబొబ్బలూ! శ్రీ రామచంద్రుడి పోష్టరుమీద చిక్కటి రక్తం చిమ్మింది. కిందపడ్డవాళ్ళు కిందపడగా ఉన్నవాళ్ళు తన్నుకొంటున్నారు. ఆఫీసు గదిలో ప్రారంభం అయిన దెబ్బలాట, ఆఫీసు ముందు ఆవరణదాకా పాకింది. మత్తగజాల కాళ్ళ దగ్గిర చిక్కిపోయిన లేడిపిల్లలా అయిపోయింది వరూథిని. తన్నుకొంటూ తన మీదకు పడుతున్న వాళ్ళను తప్పించుకొంటూ, కంపించిపోతూ గోడకు వదిగి వదిగి నిలబడింది వరూథిని.

వెంకటపతి భార్యను ఛాతీకి హత్తుకొని అతి కష్టంమీద గదిలోనుంచి బయటకు తీసుకొచ్చాడు.

తెరమీద శ్రీ రాముడు శివధనుస్సును విరిచాడు. సీత రాముడి మెళ్ళో దండవేస్తుంది. థియేటర్లో కూర్చున్నవాళ్ళు గగ్గోలుగా లేచారు. ఆఫీసు గదిముందునుంచి దెబ్బలాట, థియేటరు గేట్లదాకా వచ్చేసరికి జనం ఒక్క పెట్టున లేచారు! ఆడవాళ్ళూ, పిల్లలూ ఒకటే అరుపులూ – ఏడుపులూ. ఆపరేటర్‌కు ఇంజన్ రొదలో కింద జరుగుతుందేమీ విన్పించలేదు. ఫిల్మ్ నడుస్తోనే వుంది. తెరమీద జనక మహారాజు, దశరథ మహారాజు ఆనందబాష్పాలు విడుస్తున్నారు.

సీత రాముడి కళ్ళలోకి చూసింది.

లోకోత్తరుడైన శ్రీ రామచంద్రుడు – హాల్లో త్రొక్కివేయబడుతోన్న పిల్లల ఆక్రందనలూ, హాహాకారాలమధ్య సీత ముగ్ధసౌందర్యాన్ని మైమరచి చూస్తోన్నాడు.

వరూథిని భర్తతో ఇంటికి చేరింది. అప్పటికి పదిదాటి పోయింది. వెంకటపతికి పెద్దగా దెబ్బలేమీ తగలలేదు.

వరూథిని మెదడంతా ఓ చీకటి గుహలా అయిపోయింది! ఏదీ నిలకడగా ఆలోచించలేకపోతూంది. జరిగిందంతా ఓ పీడకలలా మాత్రం జ్ఞాపకం ఉంది.

''మీకేం దెబ్బలు తగల్లేదుగా?" భర్తను అడిగింది.

గూడూ, తలా రుద్దుకుంటూ ''పెద్దగా ఏం తగిలినట్టు లేదులే!" అన్నాడు. వెంకటపతి.

''రామకృష్ణయ్య ముందే ఇదంతా పథకం వేసుకొచ్చాడన్న మాట!" పెదవి కొరుక్కొని అన్నది వరూథిని.

''రామనాథబాబుకు కబురుచేస్తే మంచిదేమో?" అతడయితే బావమర్ది అంతు తేల్చుకుంటాడన్న ఆశతో అన్నాడు వెంకటపతి.

భర్త సలహా మొదటిసారిగా వరూథినికి నచ్చింది ఇదేనేమో!

ఆ రాత్రి వరూథిని స్వయంగా భర్తకు గ్లాసులోని విస్కీ తన చేతుల్తో ఇచ్చింది. అతను తాగినంత కసురుకోకుండా ఇచ్చింది.

బాగా తాగి, తిని, వళ్ళు నెప్పులు మర్చి హాయిగా నిద్రపోతున్న భర్తమీద వరూథిని హృదయంలో మొదటిసారిగా ప్రేమాభిమానాలు పొంగినై.

బాగా పొద్దెక్కి లేచిన వరూథినికి తల పగిలిపోతున్నట్టుగా వుంది. అప్పటికే వెంకటపతి బయటకి వెళ్ళిపోయాడు. రెండు అనాసిన్ బిళ్ళలు వేసుకొని కాఫీ తాగి మళ్ళీ వరూథిని పడుకొంది.

మధ్యాహ్నానికి వరూథిని తలనొప్పి తగ్గిపోయింది. స్నానం చేసి వస్తుండగా వెంకటపతి ఇంటికొచ్చాడు.

"కొండలరావు తలకు తగిలిందంట. వెంకులుకు చెయ్యి విరిగింది. రామదాసు వాళ్ళను ఆస్పత్రిలో చేర్పించాడు."

"రామనాథబాబు ఊళ్ళో ఉన్నాడా?" వరూథిని భర్తను అడిగింది.

"ఇంకా రాలేదట. రెండురోజుల్లో వస్తాడని తెల్సింది."

"రామదాసు ఎలా ఉన్నాడు?"

"వస్తానన్నాడే? రాలేదా?" అన్నాడు వెంకటపతి.

వెనక్కు తిరిగి చూసి "అదిగో, వస్తున్నాడు రామదాసు" అన్నాడు మళ్ళీ.

రామదాసు నడ్డి పట్టుకొని వంకరగా నడుస్తూ లోపలకొచ్చాడు. మెడ పక్కకు పెట్టి చూస్తూ నిలబడ్డాడు.

వరూథిని రామదాసును కూర్చోమని సోఫా చూపింది.

"వాళ్ళంతా వచ్చారా?" అడిగింది.

"ఎవరూ?" అన్నాడు రామదాసు మెడతోపాటు మనిషీ తిరుగుతూ.

"ఆర్టిస్టులు, శతదినోత్సవానికి రావల్సినవాళ్ళు."

"ఇంకేం శతదినోత్సవం అమ్మా! రాత్రికి రాత్రే సత్యనారాయణ టాకీస్‌వాళ్ళు అందరికీ ఫోన్లుచేసి చెప్పారు – వరూథినీ పిక్చర్ ప్యాలెస్ తగాదాల్లో పడిందనీ, వస్తే రైటింగులు జరుగుతై అనీ!"

"ఆ కిష్టిగాడే చేయించాడా?"

కిష్టిగాడంటే రామకృష్ణయ్య అని అర్థంచేసుకోటానికి రామదాసుకు సమయం పట్టింది.

"సత్యనారాయణ టాకీస్ వాళ్ళుమ్మాత్రం తక్కువ వాళ్ళా? మన థియేటర్ రాకముందు వాళ్ళదే టౌన్లో లీడింగ్. ఇప్పుడు వెనకపడిందిగా! అందుకే వాళ్ళకు మనమీద ఏడుపు." రామదాసు చెప్పాడు.

"రాత్రికి మళ్ళీవచ్చి అల్లరేం చెయ్యరు గదా?" వెంకటపతి రామదాసును అడిగాడు.

"ఏడ్చారు, ఇంకేం చేస్తారు? రాత్రి మనం తయారయిలేము గనుక అట్లా అల్లకల్లోలం చెయ్యగలిగారు. రామకృష్ణయ్యగాడ్నీ మరో ఇద్దర్నీ పోలీసులు లాకప్‌లోకి

తీసుకొన్నారుగా? ఇంకెవడొస్తాడు మన హాలు మీదకు అంత ధైర్యం చేసి? ఆ శివరాంగాడ్ని హాల్లో అడుగుపెట్టనివ్వొద్దు!" అన్నది వరూథిని.

"వాడ్ని ఇంకా థియేటర్ ముందుకు రానిస్తానా? వస్తే మెడపెట్టి గెంటిస్తా!" అన్నాడు రామదాసు.

"అంతే! ఆ పనే చెయ్! ఎవడడ్డొస్తాడో చూద్దాం! రాత్రికి నేను రావాలా? వంట్లో బాగాలేదు. జ్వరం వచ్చినట్టుగా వుంది" అంది వరూథిని రామదాసుతో.

"మీరెందుకమ్మా! అంతా నేను చూసుకొంటాగా? రెండో ఆట బుకింగ్ అయిపోగానే డబ్బు తెచ్చి మీకప్పచెప్తే సరిగదా?" భరోసా ఇస్తూ చెప్పాడు రామదాసు.

నడుంపట్టుకొని లేచి నిలబడ్డ రామదాసును చూస్తూ "డాక్టరుకు చూపించ కూడదూ?" అన్నది వరూథిని.

"డాక్టరుదాకా ఎందుకమ్మా? అదేపోతుంది. ఆ గదిలో అమాంతంగా నలుగురొచ్చిపడితే చెయ్యీ కాలూ ఆడలేదు. నెరాబాలో అయితేనా, నాకొడుకుల్ని" రామదాసు తర్వాతమాట మింగేశాడు.

"నెరాబాలో అయితే కాలికొద్దీ పరుగెత్తేవాడు ఈ రామదాసుగాడు!" అనుకొన్నాడు వెంకటపతి - దెబ్బలాట జరిగినప్పుడు రామదాసు తిన్న దెబ్బలు గుర్తొచ్చి. ఏ మాట కామాట, వెంకులూ, కొండ్రలావే గట్టిగా నిలబడ్డారు. తను మాత్రం ఊరుకున్నాడా? ఇద్దర్ని గట్టిగా జబిరాడు.

"వెంకటపతిగారూ! ఇప్పుడొస్తారా. కాసేపాగివస్తారా?" రామదాసు వెళ్ళబోతూ అడిగాడు.

"అన్నం తిని వస్తా, నువ్వు పద!" అన్నాడు వెంకటపతి.

ఆరుగంటలవుతుంది. వరూథిని ఇంటిదగ్గరే ఉంది. కాని ఆమె మనస్సంతా హాలుమీదే వుంది. అక్కడేం జరుగుతుందో అన్న ఆలోచన ఆమె మనసులో పాములా తిరుగుతున్నది.

సాయంత్రం ఆరున్నర అవుతుండగా రామదాసు మరో హాలు వర్కర్ను వెంటబెట్టుకొని రొప్పుకుంటూ వచ్చాడు.

"అంతా అయిపోయింది! హాలును వాళ్ళు స్వాధీనం చేసుకొన్నారు. మన చేతులు దాటిపోయింది." వగరుస్తూ చెప్పాడు రామదాసు.

అది విన్న వరూథినికి కాళ్ళకింద భూమి కదిలినట్లయింది. రక్తం గడ్డకట్టుకు పోతున్నట్టయింది.

"పోలీసులున్నారుగా? అదెట్లా జరిగింది?" వరూథిని తెప్పరిల్లుకొని అడిగింది.

"ఐదున్నరకు పోలీసులందరూ వెళ్ళిపోయారు. రామకృష్ణయ్యనుకూడా వదిలేశారు."

"పోలీసోళ్ళకి లంచం పెట్టి విడిపించుకొని వుంటాడు!"

"ఏం జరిగిందో ఏమో? రామకృష్ణయ్యతోపాటు యస్సైకూడా వచ్చాడు.

యస్పైవచ్చి రాత్రినుంచి బందోబస్తులోవున్న పోలీసుల్ని పంపించివేశాడు. రామకృష్ణయ్య ఇరవైమంది మనుషుల్తో వచ్చి హాలుమాదే నంటూ ఆక్రమించుకొన్నాడు."

''మరి నువ్వు యస్పైతో మాట్లాడలా?"

''న న్నేం చేయమంటారు? వారు హాలు మాదంటున్నారు. అది మీరూ మీరూ తేల్చుకోవాలి. రైటింగ్ జరక్కుండా చూట్టంవరకే మా పని!' అని చల్లగా తప్పుకున్నాడు యస్పై!"అన్నాడు రామదాసు.

వరూధినికి అర్థం అయింది - ఇదంతా ఎవరు ఆడిస్తున్న నాటకమో! రామనాథబాబే పోలీసుల్ని చేతిలో పెట్టుకొని రామకృష్ణయ్యను పంపించి హాలు స్వాధీనం చేసుకొన్నాడు. ఎంత జిత్తులమారి? పచ్చి మోసం! అతన్ని నమ్మి తను మోసపోయింది.

గాలివానకు వేళ్ళు పెళ్ళగిలి కిందబడ్డ పున్నాగచెట్టులా వరూధిని కూలబడింది!

## 33

ప్రతిరోజూ ప్రతిక్షణమూ, వరూధిని రామనాథబాబుకోసం ఎదురు చూసింది. మూడురోజుల్లో ఊళ్ళోకి వస్తాడనుకొన్న మనిషి ఐదురోజులయినా వచ్చినట్టులేడు. ఇదంతా కావాలనే చేస్తున్నాడు. తను వెళ్ళి అతని కాళ్ళమీద పడాలనే ఇదంతా చేస్తున్నాడు. దుర్మార్గుడు! తడిగుడ్డలతో గొంతులుకోసే రకం!

రామనాథబాబు రక్తం తాగాలన్నంత కసిగా వుంది వరూధినికి.

రామకృష్ణయ్య హాలు స్వాధీనం చేసుకొని ఇప్పటికి ఐదురోజులైంది. ఇది ఆరో రోజు. థియేటర్లో సీతారామకళ్యాణం ఇంకా ఆడుతూనేవుంది. కలెక్షన్స్ కూడా బాగానే వున్నాయని తెలిసింది. రామనాథబాబు ఇంకెంత కాలం తప్పించుకొని తిరుగుతాడో? ఏదో మార్గం వెతకాలి. ఏదో ఉపాయం ఆలోచించాలి. వెయ్యో రెండువేలో పారేసి ఆ పోలీసోళ్ళనే పట్టుకొంటే సరి. వరూధినికి ఈ ఆలోచన రాగానే డి.యస్.పి. గుర్తొచ్చాడు.

అందుకు ఒప్పుకుంటాడా? థియేటర్ తన డబ్బుతోనే కట్టించిందనీ, అందులో సగం వాటా తనకుందనీ ఆయనకు తెలుసుగా? ఆ మాత్రం న్యాయం చెయ్యలేడా? ఆడదానికి ఇంత అన్యాయం జరిగిపోతుంటే అంత పెద్ద పోలీసు ఆఫీసరు ఊరుకొంటాడా?

డి.యస్.పి.మీద ఆశలు పెంచుకొని వరూధిని ఆ రోజు మునిమాపువేళ బయలుదేరి అతని ఇంటికి వెళ్ళింది.

డి.యస్.పి. లుంగీ కట్టుకొని, వరండాలో కూర్చొని ఫైల్సు చూసుకొంటున్నాడు. గేటు తెరుచుకొని లోపలకు వస్తున్న వరూధిన్ని చూసి లేచి నిలబడ్డాడు.

''నమస్కారమండీ!" చేతులు జోడించి దగ్గర పెట్టకుండానే అన్నది వరూధిని.

''రండి! ఇలా కూర్చోండి!" నవ్వుతూ ఆహ్వానించాడు.

వరూధిని ఆశలు చిగురించాయి. దానికి ఆధారం ఏమీ లేకపోయినా అతనిమీద పెద్ద నమ్మకం ఏర్పడింది.

వరూథినికి విషయం ఎలా మొదలు పెట్టాలో తెలియక నిస్సహాయంగా డి.యస్.పి. కేసి చూసింది.

''అంతా విన్నానండీ!'' వరూథిని ముఖంలోకి చూస్తూ అన్నాడు డి.యస్.పి. అతని కంఠంలో సానుభూతి ధ్వనించింది.

వరూథిని నిట్టూర్చింది. కళ్ళలో నీళ్ళు తిరిగాయి. మనస్సు తేలికపడింది.

''చూశారుగా ఎంత అన్యాయం చేశారో? మీ యస్సై, సర్కిలూ కూడా వాళ్ళతో చేరిపోయి హాలును రామకృష్ణయ్య స్వాధీనంలో పెట్టారు.''

''పొరపాటు పడుతున్నారు. ఇందులో వాళ్ళ ప్రమేయం ఏమీలేదు.'' అన్నాడు డి.యస్.పి.

వరూథిని గాబరాపడిపోయింది. ఈయనకూడా ఇలా మాట్లాడుతున్నాడేం? క్షణం క్రితం మరి అంత సానుభూతి చూపించాడుగా? పోలీసువాళ్లను అర్థం చేసుకోవటానికి తనకు బుర్ర చాలదేమో?

''థియేటర్ ప్రొటక్షన్ కోసం వున్న పోలీసుల్ని ఎందుకు పంపించివేశాడు యస్సై? బందోబస్తు వుంటే రామకృష్ణయ్య హాలు స్వాధీనం చేసుకోగలిగేవాడా? ఆఁ అన్నట్లు, రామకృష్ణయ్యను ఎందుకు వదిలేశారు? హాలుమీదకొచ్చి వాళ్ళు దాడి జరిపితే మీ వాళ్ళెందుకు చూస్తూ ఊరుకున్నారు? ముందామాట చెప్పండి.'' వరూథిని ఉద్రేకంగా అడిగింది.

''హాలు వాళ్ళదేనని రామకృష్ణయ్య రుజువు తెచ్చాడు. అందువల్ల అతన్ని హాల్లో ప్రవేశించకుండా ఎవరూ అడ్డగించలేదు. అది 'లా'కు విరుద్ధం. రామకృష్ణయ్యను మేము వారిస్తే రేపు మా పీకలమీదకు వస్తుంది.''

వరూథిని ముఖం వడదెబ్బ కొట్టినట్టయి పోయింది. కొద్ది క్షణాలు మాట రాలేదు.

''అట్లా చూచినా ఆ హాలు రామనాథబాబుదీ, నాదీను. మేమిద్దరమే పార్ట్నర్స్. మధ్యలో యీ రామకృష్ణయ్యగాడెవడూ? థియేటరు రామనాథబాబు స్వాధీనంలోనో లేక నా స్వాధీనంలోనో ఉండాలి. హాలు మా ఇద్దరిదేనని మీకూ తెలుసుగా?'' వరూథిని చెప్పినదంతా ప్రశాంతంగా విన్నాడు డి.యస్.పి.

వరూథినికేసి జాలిగా చూశాడు. అతని ముఖంలో నవ్వు లీలామాత్రంగా కదిలి ఆగిపోయింది.

''అదంతా మీ భ్రమ! రామనాథబాబుమీద మీకున్న నమ్మకం!''

''హాలు కట్టేముందు లాయరుచేత పార్టనర్‌షిప్ డీడ్ రాయించాము. నేను కూడా సంతకాలు పెట్టాను.''

''ఆ పార్టనర్ షిప్ డీడ్ రిజిష్టరయిందా?''

వరూథినికి డి.యస్.పి. మాటల్లోని అంతరార్థం అర్థం కాలేదు.

''రిజిస్ట్రారు ఆఫీసులో చెయ్యాల్సిన పనులన్నీ అప్పుడే చేసేశానన్నాడు''

అంటూ వరూథిని గుటక మింగింది.

‘‘అన్నాడుకాని చేశాడా?’’

‘‘చేసే వుంటాడు. ఆ పత్రాలన్నీ రిజిస్ట్రారు ఆఫీసులో దొరుకుతాయి కావాలంటే.’’ అతినమ్మకంగా అన్నది వరూథిని.

‘‘ఇప్పుడు రామకృష్ణయ్య చూపించిన డాక్యుమెంట్సు ఏమిటో తెలుసా?’’ అన్నాడు డి.యస్.పి.

‘‘ఏం చూపించాడూ?’’ కుంగిపోతున్నట్లు అన్నది వరూథిని.

‘‘అసలు స్థలం రామనాథబాబు భార్య శ్యామలాంబ పేరుమీద ఉంది. థియేటరుకూడా ఆమెపేరుమీదే ఆమె డబ్బుతోనే కట్టినట్టూ, రెండేళ్లకు రామనాథబాబుకూ, మీకూ లీజ్ కిచ్చినట్టు,

ఇప్పుడేమో ఆ లీజు పిరియడ్ దాటిపోయినట్టు, మళ్ళీ కొత్తగా థియేటర్ను రామకృష్ణయ్యకు లీజుకిచ్చినట్టు పత్రాలు చూపిస్తోన్నారు.’’

‘‘అంతా అబద్ధం! అవి దొంగపత్రాలు, అంతా మోసం!’’ వరూథిని పిచ్చిదానిలా అరిచింది.

‘‘రామనాథబాబు నిన్ను ప్రేమించటంకూడా అబద్ధమే! అతన్ని నువ్వు నీ వాడనుకోవటమూ మోసమే! నిన్ను నువ్వు దగా చేసుకొన్నావ్. రామనాథబాబు సంగతి నాకు బాగా తెలుసు.’’

డి.యస్.పి. అలా కుండ బద్దలుకొట్టినట్లు మాట్లాట్టం వరూథినికి ఆశ్చర్యం వేసింది.

అతను వరూథినికి ఏదో సన్నిహితుడిలా అన్పించింది. పోలీసు ఆఫీసరులా అన్పించలేదు.

వరూథిని వచ్చే ఏడుపును ఆపుకుంటూ మొండిగా అన్నది –

‘‘రామకృష్ణయ్య చూపించినవన్నీ దొంగపత్రాలే. అవన్నీ మీరెందుకు నమ్ముతారు – నిజం మీకు తెలిసి కూడా?’’

ఇంకా ఆమెకు పూర్తిగా ఆశలు చావలేదు. డి.యస్.పి. చెప్పింది నమ్మడానికి ఆమె మనసు ఎదురుతిరుగుతోంది.

‘‘నిజానిజాల ప్రశ్నకాదు. ఎవరి హక్కులేమిటో, ఎవరి అధికారాలు ఏమిటో, ఆ స్థలం ఎవరిదో, ఆ థియేటర్ ఎవరిదో నిర్ణయించాల్సింది కోర్టు. నేనూ కాదు, మా పోలీసు బలగమూ కాదు’’ అన్నాడు డి.యస్.పి.

‘‘అలా అయితే వాళ్ళే కోర్టులో తేల్చుకోవాలి. అంతవరకూ థియేటర్లో కాలు పెట్టే హక్కు వాళ్ళకు లేదు. అది నా స్వాధీనంలో వుంది’’ అని వాదించింది వరూథిని.

డి.యస్.పి. ఆలోచనలో పడ్డాడు. ఆమె వాదనలో బలం లేకపోలేదనిపించింది.

‘‘కాని ఇప్పుడు హాలు వాళ్ళ స్వాధీనంలో వుందే మరి?’’ అన్నాడు డి.యస్.పి. సాలోచనగా.

''అది మీవల్ల జరిగిందే! అందుకు మీ యస్సై, సర్కిలూ బాధ్యులు.'' గొంతు పెద్దది చేసింది వరూథిని.

డి.యస్.పి. ముందు అంత చనువుగా మాట్లాడగలగటం ఆమెకే ఆశ్చర్యం వేసింది. అయినా అతని ముఖంలో కోపం కనపడటంలేదు. పైగా ప్రసన్నంగా వున్నాడు.

''అయితే నన్నిప్పుడేం చెయ్యమంటావ్?'' ఎంతో ఆప్యాయంగా ఆత్మీయుడిలా అడిగాడు డి.యస్.పి.

వరూథిని గుండెల్లో నిప్పు ఆరిపోయింది. హృదయంలో అమృతం చిలకరించినట్లయింది. కృతజ్ఞతాభారంతో ఆమె కళ్ళు అతని కనుపాపల్ని వెతికాయి.

''ఏం చెయ్యమంటావో చెప్పు మరి?'' డి.యస్.పి.స్వరం అతి మృదువుగా వుంది.

''రేపు సాయంకాలానికి థియేటర్ మళ్ళీ నా స్వాధీనంలోకి రావాలి. అంతే!''

''అదెలా సాధ్యం?''

''మీ మనుషుల్ని పంపండి!''

''పోలీసుల్ని పంపకూడదే మరి?''

''అయితే రౌడీలను పంపండి!'' వరూథిని అధరాలపై దరహాసం పరుగులు తీసింది.

డి.యస్.పి. బిత్తరపోయాడు. ఆమె ముఖంలోకి చూస్తూ ఆలోచనలో పడ్డాడు.

''పదివేలు ఖర్చయినా సరే, రేపీపాటికి వరూథిని పిక్చర్‌ప్యాలెస్ నా ఆధీనంలో ఉండాలి.'' వరూథిని శపథంచేసి, డి.యస్.పి.మీదకు సవాల్ విసిరింది.

## 34

సెకండ్ షో ఇంటర్వెల్‌కు ముందే, పది తలకాయలు పగిలి, ఐదు చేతులూ, మూడు నడుములూ, ఆరు కాళ్ళూ విరిగి, ఒక గాలెన్ రక్తం కూడా కారిన తర్వాత, వరూథినీ పిక్చర్ ప్యాలెస్ వరూథిని స్వాధీనంలోకి వచ్చింది.

ఆ రాత్రి దిగ్విజయం పొందిన వరూథిని, థియేటర్ నుంచి ఇంటికి వెళ్ళటానికి జట్కా ఎక్కుతుండగా మఫ్టీలో డి.యస్.పి. కన్పించాడు. వరూథినికి జట్కా దిగి అమాంతం రోడ్డుమీద డి.యస్.పి. కాళ్ళమీద వాలిపోవాలనిపించింది. కాని డి.యస్.పి. గంభీరంగా ముఖంపెట్టి, ఆమెను చూడనట్టే కారెక్కి డ్రైవ్ చేసుకుంటూ జట్కాను దాటుకొని వెళ్ళిపోయాడు.

వరూథిని బుర్రలో డి.యస్.పి. గురించిన ఆలోచనలు, వాన రాబోయే ముందు ఆకాశంలో ఆడే తూనీగల్లా ముసురుకున్నాయి.

ఆయన ఎంత మంచివాడు? ఆయనే లేకపోతే తను ఏమై ఉండేది? ఎంత నిండైన మనిషి? తనను చూసి కూడా చూడనట్టే వెళ్ళిపోయాడు. మర్యాదా మన్ననా తెలిసినవాడు. సభ్యత తెలిసిన వ్యక్తి.

డి.యస్.పి.తో రామనాథబాబును పోల్చి చూసుకొన్నది వరూథిని. తననుంచి ఏమీ ఆశించకుండానే ఎంత సహాయం చేశాడు? ఒక్కపైసా కూడా తీసుకోలేదు. ఈయనలాంటివాళ్ళు పోలీసు డిపార్టుమెంటులో అరుదుగా ఉంటారు. అసలు ఈయన మనుషుల్లోనే తప్ప పుట్టాడు. దేవుడిలా తనను ఆదుకున్నాడు. వరూథిని డి.యస్.పి.కి మనసులోనే చేతులెత్తి దణ్ణం పెట్టుకొంది.

వరూథిని జట్కా దిగుతూనే ఇంటిముందు ఆగివున్న కారును చూసి ఆశ్చర్యపోయింది!

రామనాథబాబు వచ్చాడా? తన చేతులో చావుదెబ్బతిని కాళ్ళ బేరానికి వచ్చినట్టున్నాడు! జన్మలో ఇంకా తను అతనిముఖం చూడదు. జట్కావాడికి డబ్బులిచ్చి ముందుకు నడిచిన వరూథిని చీకట్లో వున్న కారును చూస్తూ నిలబడిపోయింది.

ఇది రామనాథబాబు కారు కాదు. మరెవరిదీ?

కారులోంచి నవ్వుతూ దిగిన డి.యస్.పి.ని చూసి వరూథిని శిలా ప్రతిమలా నిలబడిపోయింది ! డి.యస్.పి. దగ్గిరగా వచ్చి నిలబడ్డాడు. వరూథిని గుండెలు వేగంగా కొట్టుకున్నాయి. ఆమె అడుగులు తడబడ్డాయి. మౌనంగా ఇంట్లోకి నడిచింది. అతడూ తనవెనుకే నడుస్తున్నట్టు గమనించింది. అతని అడుగుల చప్పుడు ఆమె గుండెల్లో సమ్మెట పోటుల్లా పడుతున్నాయి. అతన్ని ఆగమనే శక్తి ఇంకా తనలో ఉందేమోనని వెతుక్కుంది. నిస్సహాయతా, పరాధీనతా ఆమె అణువణువులో గూడుకట్టుకొని వున్నాయి.

## 35

వరూథినీ పిక్చర్‌ప్యాలెస్‌లో సీతారామకల్యాణం నూట ఇరవైఐదో రోజు కూడా ఆడి డబ్బాలు రైలెక్కాయి. ఆ రోజు కొత్త పిక్చర్ రిలీజు. అందులో ఇద్దరు హీరోలూ, ఇద్దరూ హీరోయిన్లు, ముగ్గురు విలన్లూ ఉన్నారు. అప్పటికే ఆ పిక్చర్ గురించి పెద్ద 'టాక్' ఉంది. సీతారామకల్యాణాన్ని మించి డబ్బు చేసుకొంటుందన్న అభిప్రాయం సినిమా పరిశ్రమలో పడిపోయింది. ఆ పిక్చర్‌మీద తమ షేరే ముప్పైవేలదాకా రావచ్చన్న అంచనాతో ఉంది వరూథిని.

మ్యాట్నీతో పిక్చర్ ప్రారంభం అయింది. హాలంతా కిటకిటలాడుతోంది. టికెట్ దొరకని వాళ్ళు ఆరుగంటలాటకు, మూడున్నర నుంచే క్యూలో నిలబడి వున్నారు. రామదాసు ఆఫీసుగదిలో వరూథిని ముందు చేతులు కట్టుకొని నిలబడి, యీ బొమ్మను రామనాథబాబు వాళ్ళు, వాళ్ళ పాత హాలుకు తీసుకోవాలని ఎంత ప్రయత్నించిందీ, చివరకు డిస్ట్రిబ్యూటరు ఏమన్నదీ - సవివరంగా మనవి చేస్తున్నాడు.

లోగడకంటే వరూథినిమీద అందరికీ భయభక్తులు ఎక్కువైనాయి. అక్కడ ఉండే జట్కావాళ్ళకూ, రిక్షావాలాలకూ కూడా హడలుగా ఉంది. కానిస్టేబుల్సూ,

యస్సైలూ, సర్కిల్సూ, ఎక్కడ కన్పిస్తే అక్కడే శల్యూట్సు కొడుతున్నారు. వరూథిని నడక, మాట కూడ మారిపోయాయి. ఆమె ప్రతిమాటా దబాయింపునో, అధికారాన్నో స్ఫురింపచేస్తోంది. ఆమె నడకలో దర్పమూ, అహంకారమూ తృళ్ళిపడుతోన్నాయి.

''దాసూ! అలా చూస్తోండు. రామనాథబాబును ఈ టవున్నుంచి తరిమేయకపోతే నా పేరు వరూథిని కాదు! సూదికోసం సోదికిపోతే... ఏదో బయటపడినట్టు, రామనాథబాబు చేసిన మోసాలన్నీ ఒక్కొక్కటే బయటపడుతున్నాయి. మొన్న డి.యస్.పి. గారు ఏమన్నారో తెలుసా?'' అడిగింది సగర్వంగా వరూథిని రామదాసును చూస్తూ.

తల ఆడించాడు రామదాసు.

''రామనాథబాబు జైలుకు పోయే రోజులు దగ్గర్లోనే వున్నాయన్నారు తెలుసా?'' అంటూ వరూథిని ఆఫీసు గదిలోకి వచ్చిన అమీనాను చూచి ''అడ్వాన్సు బుకింగ్ కౌంటర్ వేరేఉంది. అక్కడ కనుక్కోండి. ఇది ఆఫీసుగది.'' అన్నది.

కోర్టు అమీనా వెనకే లాయరూ, రామకృష్ణయ్య లోపల కొచ్చారు.

''వరూథిని మీరేనా?'' అడిగాడు అమీనా.

''అవును!'' అన్నట్టు తల ఊపింది వరూథిని.

''ఇక్కడ సంతకం పెట్టి ఈ కాగితం తీసుకోండి!'' అన్నాడు ముక్తసరిగా.

''ఏమిటి ఇదంతా?'' అగాధం ఒడ్డున నిలబడి కిందకు చూస్తున్న దానిలా అయిపోయి అన్నది వరూథిని.

''కోర్టు ఇంజెక్షన్? వరూథినీ పిక్చర్ ప్యాలెస్‌ను కోర్టువారు స్వాధీనంలోకి తీసుకున్నారు. కేసులో న్యాయస్థానం తీర్పు చెప్పేంతవరకూ థియేటర్ను సీల్ చేస్తున్నాం!''

వరూథిని అమీనా ముందు సంతకం పెడ్తూ అంతు తెలియని అగాధంలో పడిపోయింది.

## 36

''అమ్మగారొచ్చారయ్యా'' కానిస్టేబుల్ చెప్పాడు.

ఆఫీసులో కూర్చొని సర్కిల్‌తో మాట్లాడుతున్న డి.యస్.పి. తలెత్తి చూశాడు.

ఆరు నెల్లనాడు మూడో కాన్పుకు వెళ్ళిన భార్య శుక్రవారంనాడు వస్తున్నట్టు రాసింది. కాని మంగళవారమే వచ్చేసిందే? ఏం పుట్టి మునిగిందో? అనుకొని కానిస్టేబుల్ని చూసి ''సర్లేపో!'' అన్నాడు.

''అమ్మగారు బయట రిక్షాలో కూర్చున్నారు,'' భయపడుతూనే చెప్పాడు కానిస్టేబుల్.

డి.యస్.పి. చివాలున లేచాడు. సర్కిల్ కూడా ఆయన లేవగానే లేచి నిలబడ్డాడు. డి.యస్.పి. అదిరిపాటుగా బయటికొచ్చి చూశాడు. వరూథిని రిక్షాలో కూర్చొనివుంది. క్షణకాలం నివ్వెరపోయాడు. డి.యస్.పి.కి తల కొట్టేసినట్టుగా అనిపించింది.

''నువ్వెందుకు ఇక్కడ కొచ్చావ్? కబురుచేస్తే నేనే వచ్చేవాడ్నిగా?'' చిరాకు పడుతూ అన్నాడు.

''థియేటర్ను అమీనా సీల్ చేశాడు. నాకేమీ తోచడంలేదు. ఏం చెయ్యాలో?''

''సరే! నువ్వెళ్ళు ఇప్పుడు నేను టూర్ వెళ్తున్నా. ఎల్లుండి తిరిగొస్తా!''

''మీరు వెళ్ళేముందు వకీలుతో మాట్లాడతారేమోనని?'' అన్నది వరూథిని బాధగా.

''వీలుంటే చూస్తా. ఎల్లుండి పొద్దున్నే వస్తాగా నీకెందుకు?''

వరూథిని దిగులుగా అతని కళ్ళలోకి చూసింది.

వీలయినంత త్వరగా వరూథిన్ని ఆఫీసు ముందునుంచి పంపేయాలన్న ధోరణిలో ''రెండురోజుల్లో మించిపోయేదేమీలేదులే. రేయ్ రిక్షా? పోనియ్‌రా!'' అన్నాడు డి.యస్.పి.

వరూథిని ఇంటికి తిరిగొచ్చింది. వెంకటపతి కాళ్ళమీద తల పెట్టుకొని కుర్చీలో గొంతు కూర్చొని వున్నాడు.

''ఏమిటా కూర్చోవడం?'' అంది భార్య.

వెంకటపతి తలెత్తి చూశాడు. కళ్ళు తేలిపోతున్నాయి.

''ఆయనేమన్నాడూ?''

''ఏదో ఒకటి అన్నాడులే. ముందు నువ్వు సరిగా కూర్చో! వంటి మీద బట్టన్నా సర్దుకోవడం తెలియదా?'' అని వరూథిని విసురుగా లోపల కెళ్ళింది.

''అంతా నాశనం చేసింది!'' అన్నాడు వెంకటపతి. భార్య ఆ మాట వినేంత దగ్గర్లో లేదనే అన్నాడు. ఆమె వినాలని అతని మనసులోవుంది. ఆ మాట అనాలనే అంతసేపూ ఆలోచిస్తూ భార్యకోసం చూస్తూ కూర్చున్నాడు. కాని తీరా ఆమె వస్తుండగానే వెంకటపతి చివాల్న లేచి బయటికి వెళ్ళాడు.

ఆ రెండు రోజులు వరూథిని వెలుగు ముఖం చూడలేదు. డి.యస్.పి. వచ్చాడేమో చూసి రమ్మని మూడోరోజున భర్తను పంపించింది.

''ఇంకా రాలేదట. సాయంకాలానికి వస్తాడన్నారు.'' తిరిగొచ్చి వెంకటపతి చెప్పాడు.

సాయంకాలం ఆరయినా డి.యస్.పి. రాలేదు.

వరూథిని మళ్ళీ వెంకటపతిని వెళ్ళి చూసి రమ్మన్నది.

''ఎన్నిసార్లు తిరగమంటావ్? వస్తే ఆయనే వస్తాడ్లే!'' బద్ధకించి అన్నాడు. వెంకటపతి.

లాక్కుపోతున్నట్టున్న కాలివేళ్ళను విరుచుకున్నాడు. నోరంతా తెరచి ఆవలించాడు.

వరూథిని భర్త అవస్థను గుర్తించింది.

''మనవసరమా? ఆయనవసరమా? ఎన్ని సార్లయినా తిరగాలి.'' భర్తకు గీతా రహస్యం బోధిస్తున్నట్లుగా అన్నది వరూథిని.

జీవిత పరమార్థాన్ని గ్రహించిన వాడిలా ముఖం పెట్టి ''డబ్బులు కావాలి.'' అన్నాడు వెంకటపతి.

''మొన్ననేగా ఇచ్చాను?''

''అయిపోయినై. మొన్నటిది ఇవ్వాళ్టాకా ఉంటుందా? నిన్ననే అయిపోయింది.'' వేదాంత ధోరణిలో అన్నాడు వెంకటపతి.

''ముదనష్టపాడు! ఎంతిచ్చినా చాలదు ఎప్పటికప్పుడే తగలేస్తాడు.'' అనుకుంటూ గోద్రేజ్ బీరువా దగ్గరకు వెళ్ళింది వరూధిని. ఇరవై రూపాయలు భర్తమీదకు విసిరింది.

వెంకటపతి వళ్ళోపడిన రెండునోట్లు తీసుకొని ''ఇరవయ్యేనా? ఇది ఏమూలాలకు చాల్తదీ?'' అంటూ గొణుక్కున్నాడు.

వెంకటపతికి తెలుసు. అనుభవం అతని విజ్ఞానాన్ని పెంచింది సమయాసమయాలు పట్టు విడుపులూ తెలుసుకొన్నాడు.

వరూధిని చేతిలో వున్న మిగతా రెండు నోట్లూ భర్త మీదకు విసిరింది. కింద పడ్డ పదిరూపాయల నోట్లు ఏరుకుని, తిరిగిచూడకుండా అదేపోత పోయాడు.

వెంకటపతి మరో గంటకు తూలుతూ ఇంటికొచ్చాడు.

''ఏమయిందీ?'' ఆదుర్దాగా అడిగింది వరూధిని.

''అంతా అయిపోయింది?'' అన్నాడు వెంకటపతి.

''ఏమిటయిపోయింది? నా శ్రాద్ధమా?''

''ఆఁ? ఇంకా పదిహేనుంటే హోటలు వాడికిచ్చేశాను. పాతబాకీ, వెంట పడుతున్నాడు మరి!''

హోటల్లోకూడా బాకీలు పెడ్తున్నాడా?

వరూధినికి వళ్ళు మండిపోయింది. మరో సమయంలో అయితే భర్త అంతుకనుక్కొని ఉండేది. కాని ఆమె మనస్సును ఇప్పుడు తొలిచేస్తున్నది డి.యస్.పి. వచ్చాడా లేడా? అన్న విషయం.

''ఇంతకీ ఆయన వచ్చాడా లేదా?''

''ఒచ్చాడొచ్చాడు!''

''ఎప్పుడు?''

''ఎప్పుడో మరి! అసలొచ్చాడు.''

''ఎప్పుడొస్తానన్నాడూ?''

''వచ్చాడని చెప్తుంటే మళ్ళీ?'' అన్నాడు భార్య మందుతాగి తిక్కిరి బిక్కిరి అవుతోంది అనుకున్న వేంకటపతి.

''నా దెవసం! మనింటి కెప్పుడొస్తానన్నాడని నేనడుగుతుంది.''

భర్తను చూస్తుంటే వరూధిని వళ్ళు కంపరం ఎత్తి పోయింది.

''ఆఁ! ఆ మాట నేనడగలేదు. మర్చిపోయా. మళ్ళీ వెళ్ళొచ్చేదా?'' అన్నాడు వెంకటపతి వెళ్ళటానికి సిద్ధం అయి భార్య అనుమతి కోసం ఎదురుచూస్తూ.

''ఎక్కడికీ? వల్లకాట్లోకా?''

''అక్కడ లేడు డి.యస్.పి. ఇంట్లోనే ఉన్నాడు.'' తల విదిలించుకొని గుర్తుచేసుకొని చెప్పాడు వెంకటపతి.

''నా ఖర్మ! నా రాత!'' నొసటిమీద బాదుకొంది. వరూథిని.

ఛ! ఛ! కట్టుకొన్న వాడు ఇంట్లాంటివాడు కనుకనే తను అడ్డమైన వాళ్ళకూ అలుసయిపోయింది.

వరూథిని పడక గదిలోకి పరుగెత్తింది. వెంకటపతి మీద కసి డి.యస్.పి. మీదకు తిరిగింది.

ఊళ్ళోకొచ్చికూడా ఇంతవరకు రాలేదు. తనుం అతడేదో మంచివాడనుకొంటూంది. అతడూ సమయం వచ్చేసరికి ముఖం తప్పిస్తున్నాడా?

వరూథిని ఆలోచిస్తూ ఎంతసేపు కూర్చుందో గేటుదగ్గిర కారు ఆగిన చప్పుడు అయిందాకా తెలియలేదు.

డి.యస్.పి. కారుదిగి లోపలకొచ్చాడు. వరూథిని అతన్ని చూస్తూ ఆనందంతో పరవశం చెందింది.

ఈలోకంలో తనకున్న ఆత్మీయుడు ఈయన ఒక్కడే.

రాత్రి తొమ్మిదవొస్తుంది.

''పొద్దున్నే వస్తానని చెప్పి వెళ్ళారు. సాయంకాలమే ఊళ్ళోకి వచ్చి కూడా ఇప్పుడు కనిపిస్తున్నారా?'' దెప్పుతూ అన్నది వరూథిని.

''మీ ఆయన చెప్పలా?''

''ఆయనేవుంటే మంగలాడెందుకూ అన్నదట వెనకటికి ఓ తలచెడ్డ ఆవిడ!''

''అంటే ఇప్పుడు నేను మంగలాడ్ని అంటావా?'' వరూథిని చెయ్యి పట్టుకొని వళ్ళోకి లాక్కుంటూ, నవ్వుతూ అన్నాడు డి.యస్.పి. మోహన్‌రావు.

చెయ్యి విడిపించుకొంటూ ''మంగలాళ్ళనూ...'' నాలుక కొరుక్కుంది వరూథిని.

''ముందీ సంగతి చెప్పండి. ఏం చేశారూ? వకీలుతో మాట్లాడారా?'' అన్నది వరూథిని.

''అందుకేగా ఇంత ఆలస్యం అయింది. ఆరోజే లాయరు శంకర్రావుగారితో మాట్లాడి టూర్ వెళ్ళాను. ఇవ్వాళ రాగానే ముందు ఆయన్ను కలుసుకొన్నాను. ఆయనకు కేసు వివరాలన్నీ చెప్పాను.''

''లాయరుగారేం చెప్పారూ?'' ఆదుర్దాగా అడిగింది వరూథిని.

''శ్యామలాంబ భర్తకు నోటీసు ఇప్పించిందట. లీజు అయిపోయింతర్వాత థియేటర్ను అక్రమంగా తన అధీనంలోనే వుంచుకొన్నాడనీ, వెంటనే తన అన్నగారైన రామకృష్ణయ్యకు ఆ థియేటర్ను హేండోవర్ చెయ్యాల్సిందనీను. నెలరోజుల క్రితమే రామనాథబాబుకు లాయరు నోటీసు ఇప్పించిందట భార్య. అంటే నువ్వు థియేటర్ను తిరిగి స్వాధీనం చేసుకొన్న మూడోరోజే నోటీసు ఇప్పించిందన్నమాట. రామనాథబాబుతో పాటు నీకూ ఆ నోటీసు ఇప్పించి ఉండాలికదా? అలా ఎందుకు జరగలేదని లాయర్ను అడిగాను. ఆయనగారు చెప్పిందేమిటంటే, నీ తరఫున... అంటే పవర్ ఆఫ్ అటర్నీ రామనాథబాబుకు ఉందట. అది నిజమేనా?'' అన్నాడు డి.యస్.పి. మోహన్‌రావు.

''అవును! ఆ బిజినెస్ వ్యవహారాలన్నీ నా తరఫున ఆయనే చూసుకొనేట్లు రాసిచ్చాను. కాని అది ఆనాడు లీజుకోసం రాయించుకొన్నది కాదు. సినిమాహాలు సమ భాగస్తురాలిగా రాసిచ్చాను. మధ్య మధ్య చాలా పత్రాలమీద నా సంతకాలు తీసుకొంటూ ఉండేవాడు. అతన్ని గుడ్డిగా నమ్మాను. ఇంత మోసం చేస్తాడనుకోలేదు.''

''గొర్రె కసాయి వాడ్నే నమ్ముతుంది. మరి!'' గుర్రుగా అన్నాడు మోహన్‌రావు.

''అదికాదు శ్యామలాంబ మొగుడికే నోటీసు ఎందుకిచ్చింది? మొగుడికి నోటీసు ఇచ్చిన ఆడది ఎంత గుండెలు తీసిందయి వుండాలి? రామనాథబాబు నోటీసు అందుకొని ఏం చేశాడూ?''

''అంతా నాటకం! అతనికి తెలియకుండా ఇది జరిగి ఉండదు. అతను కావాలనే పెళ్ళాం చేత నోటీసు ఇప్పించుకొన్నాడు. భార్యకు యక్స్‌పార్టీ ఇంజంక్షన్ ఆర్డర్ వచ్చేట్టు చూసుకున్నాడు. నువ్విచ్చిన పవర్ ఆఫ్ ఆటర్నీని ఉపయోగించుకొని నీకు తెలియకుండా కోర్టులో ఆర్డర్ పుట్టించాడు. ఖండుడు! రామనాథబాబు!''

''రామనాథబాబుతో మీరు మాట్లాడితే బాగుంటుందేమో ఏమిటీ అన్యాయం అని? మీలాంటి వాళ్ళు నిలదీసి అడిగితే ఏం చెప్తాడో? మీరు గట్టిగా పట్టించుకొంటే రామనాథబాబు ఎక్కడికీ పోలేడు.'' డి.యస్.పి. మోహన్‌రావు మీద తన బరువుదించి, ఆశలన్నీ తనమీదే కేంద్రీకరింపజేసి అతని కళ్ళల్లోకి చూసింది వరూధిని.

''అదీ అయింది! అతనితో మాట్లాడే నీ దగ్గర కొస్తున్నాను. ఇదంతా తన కేమీ తెలియదనీ, అంతా తన భార్యేచేసిందని అన్నాడు. థియేటరు మీద నువ్వు పెత్తనం చెయ్యడం మొదలు పెట్టిన దగ్గర్నుంచీ తనకేమీ పట్టనట్టు ఊరుకున్నాడట! దీనికంతా నీ తొందర పాటే కారణం అంటూ మాట్లాడాడు.''

''మా ఇద్దరి పేరా కట్టిన థియేటర్ వాడి పెళ్ళాంపేర ఎలా అయిందన్నాడు?'' వరూధిని ఉద్రేకంతో అడిగింది. ఆమె కంఠం వణికింది.

''ఇంకా అతడ్ని అడిగేదేమిటి? తాటి చెట్టెందుకు ఎక్కావూ అంటే దూడ మేత కోసం అన్నట్టు మాట్లాడుతున్నాడు. మోసం చేసినవాడు చేశానని ఒప్పుకొంటాడా? అందులోనూ, డాబూ, అంతస్తూ, పరపతి ఉన్న రామనాథబాబు లాంటివాళ్ళు? మామూలువాడనుకొన్నావా? స్టేషన్‌లో పెట్టి నాలుగుతికితే అన్నీ ఒప్పుకోటానికి? అతడ్ని పట్టే విధంలో పట్టాలిగాని?'' మోహనరావు తీవ్రంగా ఆలోచిస్తూ అన్నాడు.

ఆరిపోబోతున్న ప్రమిదలో నూనెపోసి ఒత్తి పైకి నెట్టినట్టుగా వుంది వరూధిని మనస్సు. ఆ కొత్త వెలుగులో మోహనరావు అద్వితీయమైన తెలివితేటల్తో, అమోఘమైన శక్తి మంతుడిలా కన్పించాడు వరూధినికి.

మోహనరావు లేచి వెళ్ళడానికి సిద్ధమయి అన్నాడు –

''అధైర్యపడకు. నా శాయశక్తులా ప్రయత్నం చేస్తాను.''

''మళ్ళీ నా ఆస్తి నాకు దక్కినా దక్కకపోయినా, ఆ రామనాథబాబునీ, వాడి పెళ్ళాన్నీ జైలుకు పంపాలి. నా బతుకేమయినా ఫర్వాలేదు!''

''మంగమ్మ శపథం చేస్తున్నావ్." అన్నాడు మోహన్‌రావు నవ్వుతూ.

''మీకు నవ్వుగా వుంది. నా కడుపు రగిలిపోతూంది. రామనాథబాబు పెళ్ళాం ఎలా బాగుపడుతుందో చూస్తా."

''ఆ తెలివితేటలు ముందే ఉండాలి. ఆస్తీ అంతస్తూ ఉన్న వాళ్ళతో వైరం పెట్టుకొని గెలవాలంటే అంగబలం ఒక్కటే చాలదు. అర్థబలం కూడా కావాలి."

వరూథిని మోహన్‌రావుకేసి అయోమయంగా చూసింది.

మళ్ళీ ఇట్లా దిగిపోయి మాట్లాడుతున్నాడేమిటి? చాలా లోతు మనిషి!

''మీ ఉద్దేశం నాకు అర్థంకాలేదు. నన్నింకేం చెయ్యమంటారు?" అంది వరూథిని.

''ఇలాంటి వ్యవహారాలు పంతాలూ పట్టింపులతో తేలవు."

''అంటే వాళ్ళతో రాజీపడమంటారా? ఇది చెప్పటానికి డి.యస్.పి.గారెందుకూ? నేనే వెళ్ళి ఆ రామనాథబాబు కాళ్ళమీదా వాడిపెళ్ళాం కాళ్ళమీదా పడితే సరి పోతుందిగా?"

''అదికాదు నేనంటుంది? మోసాన్ని మోసంతోనే జయించాలి! డబ్బును డబ్బుతోనే సంపాదించాలి. రామనాథబాబును రూపుమాపాలంటే డబ్బు కావాలి. నా దగ్గిర అధికారం ఉంది. కానీ డబ్బులేదు. అది నీ దగ్గిరాలేదు. బాగా ఆలోచించుకో."

''నా దగ్గిరున్నదేదో ఇస్తాను. తాళిబొట్టుతో సహా అమ్మయినా తెస్తాను."

''ఛ! ఛ! అదేం మాట?"

''నేనేం అంత బికారిగా లేను. ముప్పైవేలకు పైగా బ్యాంకులో వుంది. ఆఖరి పైసావరకు తెచ్చి మీ చేతుల్లో పెడ్తా. ఆ రామనాథబాబుగాడ్ని జైలుకు పంపి ఆ థియేటర్ను నాకు ఇప్పించండి!"

''ఉద్రేకపడకు వరూ?"

''ఏదీ చేతకాకపోతే రామనాథబాబు తలైనాసరే..." వరూథిని రొప్పుతూ అన్నది.

డి.యస్.పి.కి భద్రాచలం అడవుల్లో మానవ రక్తం రుచిమూసి ఊళ్ళమీద పడ్డ ఆడపులిలా కన్పించింది వరూథిని.

''పులివేట! తస్మాత్ జాగ్రత్త!!" అనుకొన్నాడు డి.యస్.పి.

తెల్లవారే శంకర్రావును తీసుకొని వచ్చి వరూథినిచేత ఐదువేలకు చెక్కు రాయించి యిచ్చాడు.

ఆ తర్వాత నాలుగురోజులకు లాయరు శంకర్రావుని వెంటబెట్టుకొని వరూథిని దగ్గరకొచ్చాడు డి.యస్.పి.

''రామనాథబాబు మీద ఫోర్ట్వంటీకేసు బనాయిస్తున్నాం. దాంతో పాటు సివిల్ సూట్ కూడా వేద్దామంటున్నారు శంకర్రావుగారు." అన్నాడు మోహన్‌రావు.

''ఆ చేసేదేదో త్వరగా చెయ్యండి. చేద్దాం అనుకోవటంతోనే రోజులు గడిచిపోతున్నాయి." అన్నది వరూథిని.

''మనం కేసుపెడితే ఎంతో పకడ్‌బందీగా పెట్టాలమ్మా? నాలుగు రోజులు ఆలస్యం అయితే అయింది.'' అన్నాడు శంకర్రావు.

హ్యాండుబ్యాగ్‌లోనుంచి స్టాంపుపేపరు మీద టైపు చేసివున్న పత్రాలను తీసి వరూథిని ముందు పెట్టాడు లాయర్ శంకర్రావు.

''మొత్తం ఐదు లక్షలకు దావా వేస్తున్నాం!''

వరూథిని హృదయం ఆనందంతో పొంగింది.

''స్థలమూ అందులో కట్టిన థియేటరూ మీదేనని దావాతెస్తున్నాం.'' చెప్పాడు శంకర్రావు.

''రామనాథబాబుకూ వాటా వుందిగా. మనం అసలే లేదంటే చెల్లుతుందా?'' అనుమానంగా అడిగింది వరూథిని.

''అలా సగం సగం కేసు పెడితే మనకేసు నిలవదు. అందుకే మొత్తానికి పెట్టాను ఎసరు! మీ పొలం అమ్మిన డబ్బుతో రామనాథబాబు థియేటర్ కట్టాడని కేసు పెట్టాను. మీకున్న సన్నిహితత్వాన్ని పురస్కరించుకొని....''

''ఆ మాట కోర్టులో చెప్పాలంటారా?''బిడియపడుతూ తలవంచుకొని అన్నది వరూథిని.

''అసలు పాయింటదే! లేకపోతే కేసు నిలవదు. మీతో ఎలాంటి సంబంధం లేకుండా అంత డబ్బు రామనాథబాబుకు ఇచ్చారంటే కోర్టు నమ్మదు. చూడండి ఎలాంటి సంబంధం లేకుండానే నేను మీకు గానీ, మీరు నాకు గానీ లక్షలూ వేలూ పత్రాలూ గ్రటా లేకుండా ఇచ్చుకొన్నామంటే అర్థం ఏమిటి?'' తన పాయింటును విడమర్చి చెప్పాననుకొని తెలివిగా ముఖం పెట్టాడు లాయరు శంకర్రావు.

మోహన్‌రావుకు శంకరరావు ధోరణి బొత్తిగా నచ్చలేదు. ముఖం చిట్లించి ''అసలు విషయానికి రండి'' అన్నాడు.

''అసలు విషయమే ఇది! ఆమెగారికి ముందుగా చెప్పటం నా విధి కదా?''మళ్ళీ తిరిగి వరూథిన్ని చూసి ''చూడండి వరూథిని గారూ? మీ ఆయనగారు ఈ పాయింటును బలపరుస్తూ సాక్ష్యం చెప్పాలి.''

''ఏ పాయింటూ?'' వరూథిని తెల్లబోయి అడిగింది.

''అదే రామనాథబాబుకూ మీకూ అక్రమ సంబంధం వుందని.''

వరూథిని కళ్ళలో నీరు తిరిగింది. నిస్సహాయంగా లాయరు ముఖంలోకి చూసింది.

''అహో! అలా వుందని కాదు. లేకపోయినా ఉన్నట్టు చెప్తే మనకేసు బలంగా వుంటుంది.'' అన్నాడు శంకర్రావు.

డి.యస్.పి.వెగటుగా ముఖం పెట్టి కూర్చున్నాడు.

వీడ్నెందుకు లాయరుగా కుదిర్చానా అనుకొన్నాడు. అయితే శంకర్రావుకూ తనకూ మధ్యవున్న సంబంధాలు గుర్తొచ్చి పలక్కుండా బెల్లంకొట్టిన రాయిలా కూర్చున్నాడు.

‘‘మీ ఆయనగారి పేరేమన్నారూ? వెంకటపతిగారు కదూ? వారిని కూడా పిలవండి. వారితో సంప్రదించితే మంచిది. ఎందుకంటే బోనులో నిలబడి సాక్ష్యం చెప్పాల్సింది ఆయన కదా?'' అన్నాడు శంకర్రావు.

‘‘అవసరంలేదు! చెప్తార్లెండి. అలాగే చెప్తారు'' అన్నది వరూథిని.

తను ఆ మాట ఎలా అనగలిగిందో కూడా ఊహించలేకపోయింది వరూథిని.

‘‘సరే అయితే సంతకాలు పెట్టండి. రేపే పడేస్తాను కోర్టులో.'' అన్నాడు లాయరు.

శంకర్రావు పెట్టమన్న చోటల్లా వరూథిని సంతకాలు పెట్టింది.

సంతకాలు పెట్టిన కాగితాలను తీసుకొని బ్యాగ్‌లో పెట్టుకొంటూ, డి.యస్.పి.కేసి సాభిప్రాయంగా చూశాడు శంకర్రావు.

‘‘నావంకెందుకు చూస్తారూ? ఆమె ఎదురుగానే వుందిగా? ఆమెనే అడగండి.'' అన్నాడు మోహనరావు.

‘‘ఐదువేలిస్తే ప్రస్తుతానికి సరిపోతుంది!'' అన్నాడు శంకరరావు వరూథిన్ని చూస్తూ.

‘‘మళ్ళీ ఐదువేలా? మొన్ననేగా ఇచ్చాను?''

‘‘లోగడ మీరిచ్చిందంతా, ఇన్‌కంటాక్సు, సేల్సుటాక్సూ, ఎంటర్‌టైన్‌మెంటు టాక్సూ, టౌన్ ప్లానింగ్ డిపార్ట్‌మెంటు ఆఫీసుల్లో వాళ్ళకే సరిపోయింది. ఒక్కొక్క చోట వెయ్యిరూపాయలు పడేస్తేనేగాని పనులు జరగలేదు. వాళ్ళదగ్గర నుంచి మనం కొన్ని కాగితాలు పుట్టించాల్సి వచ్చింది. ఆ కన్సర్న్‌పీపుల్ వచ్చి రేపు కోర్టులో మన తరపున సాక్ష్యాలు కూడా చెప్పాలిమరి? ఈ కేసంతా సాక్ష్యాల బలంమీదే ప్రధానంగా ఆధారపడి వుంది. డాక్యుమెంటరీ ఎవిడెన్సు అవతల వాళ్ళకుంది. దాన్ని మనం కాదని రుజువు చెయ్యాలంటే మనం ఎన్నో రుజువులు పుట్టించాలి. ఎన్నో సాక్ష్యాలు చెప్పించాలి.'' ఇంకా శంకర్రావు చెప్తూండగానే వరూథిని లేచి లోపలకు వెళ్ళింది.

ఐదువేలూ అందుకొని శంకరరావు ‘‘ఇదంతా వీరి మద్దత్తు ఉండబట్టి.'' అంటూ డి.యస్.పి.కేసి చూశాడు.

ఆరడుగుల ఆఫీసరు మూడడగుల మనిషిలా కుంచించుకు పోయాడు.

వరూథిని ఏమిటోగా అయిపోయింది.

‘‘ఇంత తక్కువలో ఇన్ని ఆఫీసుల్లో మన పనులు జరుగుతున్నాయంటే డి.యస్.పి.గారి అండ వుండబట్టే! లేకపోతే ఒక్కొక్క ముండాకొడుకూ ఎంతెంత బెట్టుచేసేవాడో? ఈ పాటికే మనకు పదివేలు అయిపోయేది. ఇంకా మూడు డిపార్ట్‌మెంట్లలో కాగితాలు సేకరించాలి? పోలీసు డిపార్ట్‌మెంటు అయితే మనదేననుకోండి. పోతే ఎ.సి.టి.వో, లేబర్ ఇన్‌స్పెక్టరూ,శానిటరీ ఇన్‌స్పెక్టరూ వీళ్ళందరూ ఉన్నారు.వీళ్ళంతా గుడీ, లింగాన్నీ మింగేవాళ్ళే! పదండి డి.యస్.పి.గారూ! వరూథినమ్మా! వస్తానమ్మా. కోర్టుకు టైం అయిపోయింది'' లాయరు శంకరరావు లేచాడు.

గేటు వరకూ వరూథిని వచ్చి సాగనంపింది.

శంకర్రావు ఏదో చెప్తూనే వున్నాడు రోడ్డుమీద కారు దగ్గిరకు వచ్చేవరకు.

## 37

ఒక సంవత్సరం గడిచిపోయింది.

ఒక జాతి జీవనంలో ఒక సంవత్సరకాలం పెద్ద లెక్కలోనిదికాదు. దశాబ్దాలు గడిచినా పాక్కుంటూ నడిచే జాతి విషయంలో, ఒక సంవత్సరకాలం అసలు లెక్కలోనికే రాదు.

రెండు దశాబ్దాలు గడిచినా దేశాన్నీ రాష్ట్రాలనూ పాలించే నాయకులు, నిన్నో మొన్నో స్వరాజ్యం వచ్చినట్లూ, ఆ స్వాతంత్ర్యం ఇంకా పసిబిడ్డేననీ, పాకేస్థితిలోనే వుందనీ, దాన్ని పెంచి పెద్దచెయ్యడానికి ప్రజలు ఇంకా ఎన్నో త్యాగాలకు సిద్ధమవాలనీ, సదా అప్రమత్తులుగా వుండాలనీ, వేదికలమీదా, రేడియోల్లోనూ, పత్రికల్లోనూ గగ్గోలుపెడ్తూనే ఉన్నారు. పరిపాలకులు తమకు సంక్రమించిన అధికారాలను ప్రజలు సదా కాపాడుతూ ఉండాలనీ, అలా చెయ్యనినాడు ప్రజలే నోట్లో దుమ్ముకొట్టుకొని పోతారనీ, ప్రజలను హెచ్చరిస్తున్నారు. అది విన్నవాడు చావకుండా అలా బతుకుతున్నాడు. విననివాడు నిజంగానే మట్టిలో కలిసిపోతున్నాడు.

ఒక సంవత్సరకాలం సగటు మనిషి మనుగడలో పెద్దమార్పు లేమీ తేలేకపోయింది.

కాని వరూథిని జీవితంలో ఆ గడిచిన ఒక్క సంవత్సరమే ఎన్నో ఏళ్ళ మార్పులను తెచ్చింది!

కోర్టులో వ్యాజ్యం ఇంకా నడుస్తూనే ఉంది. అప్పటికి వరూథిని దగ్గర ఉన్న డబ్బు ఇరవై వేలకు పైగా హరించుకుపోయింది. కోర్టు ఖర్చులకూ, సాక్ష్యాలకూ, తదితర ఖర్చులకూ పోయిందిపోగా మిగిలిన డబ్బు శంకర్రావు ఇనప్పెట్టలోకి వెళ్ళి చేతులు మారాలనే భయం లేకుండా వెచ్చగా కూర్చొంది.

వరూథిని రెండువందల పాతిక అద్దె ఇస్తూన్న ఇల్లు ఖాళీచేసి నూటపదిరూపాయల అద్దె కొంపలోకి మారింది.

వెంకటపతి ఖరీదైన విస్కీ, బ్రాందీ మానేసి కల్తీ నాటుసారా తాగుతున్నాడు. దానికీ ఇబ్బందిగానే ఉంది. ఆ మధ్య ఎవడో సలహా ఇచ్చాడు. ఏవో బిళ్ళలు ఉన్నాయనీ, అవి రోజుకు రెండేసుకొంటే గాలెన్ నికార్సయిన సారాకంటే నిషాగా వుంటుందనీ, ఆ చెప్పిన పెద్ద మనిషే అడపాదడపా రెండు మాత్రలు పెడుతున్నాడు. వెంకటపతికి అది బాగానే వున్నట్టనిపించింది. సారా మానేసి అవి అలవాటు చేసుకొనే ప్రయత్నంలో పడ్డాడు.

ఈ ఏర్పాటు వరూథినికికూడా నచ్చింది. సారామానేసి భర్త బాగుపడతాడనే నమ్మకం ఎలా ఉన్నా ఖర్చయినా తగ్గుతుందనే ఉద్దేశ్యంతో వరూథిని అందుకు సమ్మతించి ఊరుకుంది.

వరూథిని కొడుకు హైదరాబాద్ జాగీర్దార్ కాలేజీలో నాలుగో క్లాసులోకి వచ్చాడు. వాడికి ఎనిమిదేళ్ళు నిండాయి. తొమ్మిదో ఏడు నడుస్తోంది. ప్రతి నెలా వాడికి రెండువందలదాకా పంపాల్సివస్తోంది. అది ఇదివరకటిలో ఉన్నంత తేలిగ్గా లేదు. ప్రతి శెలవలకూ వాడ్ని తీసుకురావడం, పంపించడం, డ్రస్సులూ – ఫీజూ – అంతా చేరి సంవత్సరానికి మూడువేలదాకా అవుతోంది. ఎంత ఖర్చు తగ్గించుకోవాలన్నా సాధ్యపడటంలేదు. ఇంటి అద్దె అయితే తగ్గించుకోగలిగింది కాని ఇంట్లో ఖర్చులు తగ్గించుకోలేకపోయింది వరూథిని.

ఆరు నెలల్లో కేసు తేలిపోతుందని కోర్టుకు వెళ్ళేముందు చెప్పిన శంకర్రావు ఇప్పుడు అడిగితే ఆరేళ్ళయినా పట్టొచ్చు అన్నట్టు మాట్లాడుతున్నాడు! పదేళ్ళు నడిచిన కేసులూ,పద్దానుగేళ్ళు నడిచిన కేసులూ, పాతికేళ్లు నడిచిన కేసులూ ఉదాహరణగా ఎత్తి, వరూథినికి చెప్తున్నాడు. మళ్ళీ మాట్లాడితే ఓ మునసబుగారు ఉద్యోగంలో చేరిన కొత్తలో పెట్టిన కేసు ఆయన హైకోర్టు జడ్జీ అయి రిటైర్ అయిన తర్వాత కూడా ఆ కేసు జిల్లా కోర్టులోనే నడిచిన సంగతీ చెప్తున్నాడు శంకర్రావు.

వరూథినికి తన వ్యాజ్యం సంగతి ఎలా వున్నా కోర్టు వ్యవహారాలు చాలా వరకు అర్థమైనాయి.

ఒకరోజు శంకర్రావుతో ''ఎలా అయినా మనకేసు రెండు నెలల్లో అయేట్లు మీరు చూడాలి'' అన్నది వరూథిని.

''అదెలా సాధ్యం?'' గాలి బిగపట్టి అన్నాడు శంకర్రావు

''మీరు తలచుకొంటే అదే సాధ్యం అవుతుంది.''

అది విని శంకర్రావు గర్వంగా నవ్వి, గంభీరంగా మౌనం వహించాడు.

''నేనూ విన్నాను! ఇప్పుడున్న సబ్ జడ్జీగారూ....?'' వరూథిని భావయుక్తంగా శంకర్రావుకేసి చూసింది.

''ఆయన లంచాలు తీసుకొంటాడనేనా మీ అభిప్రాయం? అలా ప్రచారం జరిగితే మీకేసే కొట్టేసే ప్రమాదం వుంది! జాగ్రత్త! ఆయన సంగతి మీకు తెలియదు''శంకర్రావు తీవ్రంగా అన్నాడు.

వరూథిని బెదిరిపోతుందని ఆశించిన శంకర్రావు వరూథిని ముఖం చూసి గతుక్కుమన్నాడు. భయం తాలూకు భయాలేమీ ఆమె ముఖంలో కన్పించలేదు. పైగా ఆమె పెదవులపై నవ్వు కూడా మాయలేదు.

''ఆయనగారి సంగతి నాకు తెలుసని నేననలేదు. మీకు బాగా తెలుసని మాత్రం విన్నాను'' అన్నది వరూథిని.

''ఆయన మాకు దూరపు బంధువు''

''బంధువుకూడానా? ఆ సంగతి నాకు తెలియదే?'' అన్నది వరూథిని

శంకర్రావు మాట్లాడలేదు.

''మరి జడ్జీగారితో ఎప్పుడు మాట్లాడతారూ?''

''దానికి మీరెప్పుడు సిద్ధమయితే అప్పుడే'' అన్నాడు శంకర్రావు.

వరూధిని వ్యానిటీ బ్యాగ్‌లోనుంచి నోట్లకట్టలు తీసి శంకర్రావు ముందు పెట్టింది.

''అహో! అన్నీ సిద్ధం చేసుకొనే వచ్చారే? ఎంతా?'' అన్నాడు శంకర్రావు నోట్లు లెక్కపెట్టుకోబోతూ.

''మూడువేలు'' అన్నది వరూధిని

శంకర్రావు నోట్ల కట్టలు టేబుల్ మీద వదిలేశాడు!

''పదివేలకు తక్కువయితే ముట్టే పనేలేదు. చిల్లర మల్లర మనుషులా? ఏమన్నానా? మూటికీ రెంటికీ కక్కుర్తి పడటానికి? పెద్దవాళ్ళతో పని?'' అన్నాడు శంకర్రావు.

''నా సంగతి మీకు తెలియంది కాదు. వున్నదంతా మీకే ఇచ్చాను!''

''నా కివ్వటమేమిటి?'' తీవ్రంగా వుంది శంకర్రావు కంఠం

''మీ కంటే మీకని కాదు. ఈ వ్యాజ్యం మీదే పెట్టాను. మిగిలిందేదో ఊడ్చి తెచ్చాను. మరింతకంటే నేనేం ఇవ్వగలను? మీరే ఆలోచించండి'' వరూధిని కంఠం వణికింది.

''అవునమ్మా నువ్వు చెప్పింది నేను గాదంటున్నానా? కాని మనం అవతలి వాళ్ళ అంతస్తూ అదీ కూడా చూడాలిగా? అవసరం మనది. ఆయనేమన్నా మనల్ని కావాలని అడిగాడా? ఆయన తీసుకో దలిస్తే అవతల పార్టీ శ్యామలాంబ ఇప్పటికిప్పుడు ఏభైవేలయినా ఇవ్వడానికి సిద్ధంగా ఉంది.''

''ఏభైవేలా?''

''ఏమిటమ్మా! అందులో అంత ఆశ్చర్యపడాల్సిందేముంది? సినిమాహాలు తాలూకు ఆదాయం మీరు ఏడాదిలో కోర్టులో కట్టిందే ఏభైవేలదాకా వుంది. ఐదారు లక్షల ఆస్తి! మాటలా! రేపు గెలిచిన వాళ్ళకు ఆ క్యాష్ యాభైవేలూ ఊరికినే వచ్చి నట్టేగా? అదే అవతల పారేస్తారు! వాళ్ళ సొమ్మేమయినా ఇస్తున్నారా?''

''ఏభై కాదు, ఎనభై అయినా నేనివ్వడానికి సిద్ధమే! కేసు గెలిచి ఆ డబ్బంతా మీరే తీసుకోండి. థియేటరు మాత్రం నా కప్పగించండి.''

''అమ్మాయ్! నువ్వు మాట్లాడేది వ్యవహార పద్ధతికాదు! అనుభవం ఉన్న వాళ్ళెవరూ ఇలా మాట్లాడరు. మీ కేసు గెలిచి థియేటరుతోసహా యాభైవేలూ- లేక అప్పటికి ఏ లక్షో అయితే అదీ-అంతా మీకు స్వాధీనం చెయ్యాలన్నదే నా అభిలాష. అది నా బాధ్యత కూడా.''అన్నాడు శంకర్రావు.

''అయితే ఆ శ్యామలాంబే ఇచ్చేందుకు సిద్ధమయితే ఇక మనం గెలిచేదేమిటి?'' సాలోచనగా అన్నది వరూధిని.

''ఆయన వాళ్ళదగ్గిర్నుంచి తీసుకొనేవాడయితే ఈ పాటికి థియేటరు వాళ్ళ స్వాదీనం అయే వుండేది. ఇవతల ఉందెవరూ? నన్ను కాదని డబ్బు కతికి అవతల పార్టీ వాళ్ళకు అనుకూలంగా తీర్పు ఇస్తాడా? ఆయనెవరు? మా

బంధువని చెప్పలేదూ? పైగా మేమిద్దరం ఒక ఊళ్ళోనే చదువుకున్నాం. అట్లాంటి భయాలు మీరేమీ పెట్టుకోవద్దు. నేను కూడా ఇంతకాలం మీకెందుకు చెప్పలేదంటారూ? ఇట్లాంటి విషయాలు గోప్యంగా ఉంచాలి."

శంకర్రావు చెప్తుండగా బయట కారు ఆగిన శబ్దం, తర్వాత డోరు తెరచి మళ్ళీ వేసిన చప్పుడూ అయింది. శంకర్రావు కిటికీలో నుంచి బయటకు చూసి ముఖం అదోలా పెట్టుకొని గబగబా నోట్లకట్టలు తీసి డ్రాయర్‌లో కుక్కాడు.

లోపల కొచ్చిన రామనాథబాబు వరూథిన్ని చూసి నిలబడి పోయాడు!

వరూథిని నివ్వెరపోయింది!!

"హల్లో వరూథినీ! కులాసా?" ఎంతో అభిమానంతో చిరునవ్వులు విసురుతూ పలకరించాడు రామనాథబాబు.

ఆమెకు ఎదురుపడి దాదాపు సంవత్సరం దాటిపోయింది. ఒక సంవత్సరకాలంలో ఎంత మార్పొచ్చింది. ఆ విశాలమైన కళ్ళకింద నల్లని నీడలు, వెలుగుల్ని విరజిమ్మే ఆమె కనుపాపలు జాలిగా వున్నాయి. రామనాథబాబు గుండెలు కలకబారినై.

మాటా పలుకూ లేకుండా ఓ క్షణం రామనాథబాబు ముఖంలోకి చూసి తలదించుకొంది వరూథిని.

రామనాథబాబు పెద్దగా నిట్టూర్చి వరూథిని పక్కగా వున్న కుర్చీని ఎడంగా లాక్కొని కూర్చొన్నాడు.

"ఏమండీ శంకర్రావుగారూ? వీళ్ళకేసేం చేశారు? ఏదో విధంగా వీళ్ళిద్దరికీ రాజీ కుదర్చకూడదూ?" అడిగాడు రామనాథబాబు.

"రాజీ చేయవలసినవాళ్ళు మీరు"

"నా మాట వినేవాళ్ళయితే ఇలా కోర్టుకెందు కెక్కుతారు?"

"ఏమైనా ఇప్పటికి మించి పోయిందేమీ లేదు. ఇద్దరికీ కావాల్సిన వాళ్ళు మీరు ఏదో రకంగా రాజీ కుదర్చండి"

"నాకు వాళ్ళిద్దరూ కావాల్సినవాళ్ళే. కాని వాళ్ళకు నేనేమీ కానట్టుగా వుంది వాళ్ళ ధోరణి. ఆగవమ్మా అంటే నా భార్య వినలేదు. ఈమె మట్టుకు ఈమె ఏం చేసింది? రౌడీలను పెట్టి థియేటరు స్వాధీనం చేసుకొంది. ఆవిడేమో కోర్టుకెక్కింది."

"పెళ్ళాన్ని వెనకేసుకొని పెద్దమనిషిలా మాట్లాడగానే సరికాదు. అసలు ఈ కుట్రంతా నువ్వెనకుండి చేయించిందికాదూ?"

"ఇదీ వరస, చూస్తున్నారుగా శంకర్రావుగారూ? శ్యామలకూడా ఈమెకు తీసిపోయిందేమీ కాదు, ఇదే ధోరణి అనుకోండి."

"ఆడవాళ్ళు! అందులోనూ ఆస్తి వ్యవహారాలు మరి!" ఎవర్ని సమర్థిస్తున్నాడో అర్థం కాని ధోరణిలో అన్నాడు శంకర్రావు

"తన్నుకు చావనియ్యండి. మధ్యలో నాకెందుకు? మరి నా డ్రాఫ్ట్ డీడ్ ఏం చేశారు? పూర్తయిందా?" రామనాథబాబు లేచి నిలబడ్డాడు.

అతనితోపాటు శంకర్రావూ లేచి ''ఏదీ! తీరికే లేదు. ఎల్లుండి తప్పకుండా'' అన్నాడు

''మళ్ళీ ఎల్లుండిదాకా గడువు పెట్టారేం? రేపు సాయంత్రానికన్నా ఇవ్వలేరా?''

''సరే! రేపు రాత్రి ఎనిమిది గంటలకు ఒకసారి రండి!''

''వస్తా!వరూ....వరూథినీ!''అంటూ రామనాథబాబు వెళ్ళిపోయాడు.

''శంకరరావు ఆయన్ని సాగనంపి వచ్చి కూర్చున్నాడు.''

''చూశావమ్మా! రామనాథబాబు?'' కళ్ళెగరేస్తూ అన్నాడు శంకర్రావు.

''అందుకే వచ్చాడంటారా?''

''ఇంకెందుకంటా! నువ్వున్నావనీ....''

''ఏదో డీడూ డ్రాఫ్టూ అంటున్నాడేం?''

''అంటాడమ్మా అంటాడు. మళ్ళీ రేపొస్తానన్నాడు వినలా!''

వరూథిని మాట్లాడలేదు.

''మరి ఆ సంగతేదో తేల్చి చెప్పాలి. నానిస్తే మనకే నష్టం. నేను కాదంటే రామనాథబాబు నేరుగా ఆయనతోనే సంబంధం పెట్టుకుంటాడు. రామనాథబాబు సంగతి నేను వేరే మీకు చెప్పాలా?''

వరూథిని లేచి నిలబడింది.

''మీరు రేపు కోర్టుకెళ్లే ముందొకసారి వస్తారా?''

''అది మళ్ళీ నా దగ్గిరెందుకూ? రేపు సాయంకాలం ఏడూ ఏడున్నర కొస్తాను. అటునుంచి అటే వెళ్ళొచ్చు.''

వరూథిని కళ్ళు తుడుచుకున్నది.

''మీరేమీ ఇది కావద్దు. అంతా నే చూసుకుంటా. రెండు నెలల్లోనే మీ బాధలన్నీ తీరిపోతయ్!''

లాయరు శంకర్రావు వరూథిన్ని తన కారులో పంపించాడు.

## 38

రోజులు గడిచిపోతున్నాయ్.

వరూథిని తన ఆశలన్నీ లాయరు శంకర్రావుమీద పెట్టుకొని బతుకుతోంది. ఆమె కష్టాలకు ఒక ఒడ్డంటూ కన్పిస్తోంది. శంకర్రావు మాట ఇచ్చిన ప్రకారమే ''వరూథినీ పిక్చర్ ప్యాలెస్ వ్యాజ్యం'' విచారణ కొచ్చింది.

అంతా వారం పదిరోజుల్లో తేలిపోతుంది. శంకర్రావు మధ్య మధ్య కన్పించి చాలా నమ్మకంగా చెప్తున్నాడు.

ఓ రోజు కనకయ్య గాలివాటుగా వచ్చిపడ్డాడు.

''అమ్మాయ్! ఎక్కడమ్మా వెంకటపతీ?'' నోట్లో చుట్ట అవతల పడేసి ఇంట్లోకి వచ్చి కూర్చున్నాడు కనకయ్య.

''ఇప్పుడే బయటికెళ్ళారు? ఇప్పటికి కన్పించామా ఏం?'' ముడిలో పిన్ను

పెట్టుకొని కనకయ్య ముందుకొచ్చింది వరూథిని.

''ఎక్కడమ్మా! తీరక లేదు. ఇది వరకటి మాదిరిగా లేదుగా? అటు ఊళ్ళో పొలం పనులూ, ఇక్కడ మిల్లుపనులూ, తీరక చస్తున్నా. ఏమిటలా వ్యాజ్యం శంకర్రావు కొదిలేసి మీపాటికి మీరు కూర్చున్నారు? ''

వరూథిని తనలో తను నవ్వుకొంది.

''అంతకంటే మనం చెయ్యగలిగిందేముంది? లాయర్లు చూసుకోవాల్సిందేగా?'' ధీమాగా అన్నది వరూథిని.

కనకయ్య తలెత్తి వరూథినికేసి చూశాడు.

''ఏం చూస్తున్నాడో ఏమో? నిన్న మా అల్లుడు కోర్టులోనే వున్నాడట మీ కేసు విచారణ జరిగేప్పుడు.''

వరూథిని కళ్ళు ఆత్రంగా కనకయ్య కేసి చూశాయి.

''ఆ శంకర్రావుగాడేదో ముంచేట్టుగా వున్నాడన్నాడే''

వరూథిని మాట్లాడలేదు.

''దొంగ ముండాకొడుకు వాడెక్కడ దొరికాడమ్మా నీకు? ఏదీ... ఆ పోలీసాయనే తీసుకెళ్లి శంకర్రావు చేతిలో పెట్టించాడు గదూ?''

''మీ అల్లుడేమన్నాడూ?'' వరూథిని గాభరాపడిపోయింది.

''ఆ శంకర్రావుగాడు వట్టి దగుల్బాజీగాడమ్మా! ఎక్స్‌పార్టీ దగ్గిర బాగా కతికాడో ఏమో? కేసంతా నాశనం చేస్తున్నాడట. జడ్జీగా రేమడిగినా తల గోక్కుంటూ దిక్కులు చూస్తున్నాడట.''

బావుటా బీడీకట్టా, దాంతోపాటు పుగాకూ బయటకు తీసి ఏది కాల్చాలా అన్న మీమాంసలో పడ్డాడు కనకయ్య.

వరూథిని కాళ్ళకింద భూమి జరిగింది! ముడిలో పువ్వు జారి కిందకు రాలింది.

''అలా జరగటానికి వీల్లేదే? నా దగ్గర వేరే ఏడువేలదాకా తీసుకొన్నాడు జడ్జీగారు అయనకు బంధువని!'' మిగతా సంగతి మింగేసింది కనకయ్యను నమ్మలేక.

''అమ్మాయ్! నీకంత నమ్మకం ఉంటే కాదనను. మా అల్లుడు రాత్రి భోజనాల దగ్గిర అంటుంటే విన్నాను. అది నీ చెవిని వేసి పోదామని వచ్చాను. ఆహాఁ! అసలు ఎందుకొచ్చాననంటే?'' రెట్టించాడు కనకయ్య.

ఎటూ చెప్పలేక వరూథిని కనకయ్యకేసి నిస్సహాయంగా చూసింది.

''సాంబయ్యగారి కష్టార్జితం. ఎనభై ఎకరాల మాగాణీ, దొడ్డీ దోవలూ....ఎంత ఆస్తి? ఎంత ఆస్తి? యాగాణి వదలకుండా తెగనమ్మి హోలుహోలని దానికింద పెట్టారా? అటు చూడబోతే రామనాథబాబు ఎంత కుచ్చితం మనిషో? ఇటు చూస్తే మన వెంకటపతి వట్టి అమాయకుడయిపోయా? నోరు వాయిలేని

మనిషి, ఏమిటో అమ్మాయ్! అనకూడదుగానీ....నువ్వు ఆడకూతురివి. ఆ కోర్టులో వ్యాజ్యాలూ....ఆ తంతులూ నీకు మ్మాతం ఏం తెలుసు? చేతులు కాలాక ఆకులు పట్టుకొంటే ఏం లాభమమ్మా? దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలి మరి?"

"అది కాదు కనకయ్యగారూ?......"

"ఏదవునో ఏదికాదో నాకేం బోధపడటం లేదమ్మా. మా అల్లుడు అంటే విన్నా. ఉండబట్టలేక వచ్చి పడ్డా. నే విన్నదేదో నీచెవిన పడేశా. ఆ తర్వాత నీ ఇష్టం. నే వస్తా?"

కనకయ్య లేచాడు. వంగి వంకె క్కర తీసుకొన్నాడు.

"ఇంకా ఏమన్నాడు మీ అల్లుడు. సంగతి చెప్పకుండానే పోతారేం?"

రెండడుగులు ముందుకేసి అడిగింది వరూథిని.

"మా గుర్నాథం మ్మాతం పూర్తిగా చెప్పాడా నాకు? అక్కడికీ తరిచి తరిచి అడిగా. వాళ్ళు లాయర్లమ్మా. కోర్టులో జరిగే లోపాయకారి వ్యవహారాలన్నీ మనకు చెప్తారా? అక్కడికీ మీరంటే ఆయనకున్న అభిమానంకొద్దీ ఆ మ్మాతం మాటైనా జారవిడిచాడు. ఉండబట్టలేక నీ చెవినివేసి పోదామని వచ్చా. వెంకటపతి వస్తే చెప్పు, నేను వచ్చి వెళ్ళానని? వస్తా!"

కనకయ్య వంకె క్కర ఆడించుకొంటూ వెళ్ళిపోయాడు.

వరూథినికి చెమటలు పట్టాయి. కిటికీ తలుపులు మూసి పొగ పెట్టినట్టయింది. ఏమీలేకపోతే కనకయ్య ఎందుకొస్తాడూ? నిప్పులేంది పొగరాదు. కనకయ్య చెప్పింది తోసి పారెయ్యడానికి వీల్లేదు.

వరూథిని టైం చూసుకొంది. ఇంకా తొమ్మిదిన్నర కాలేదు. గబ గబా చీర మార్చుకొని బయలుదేరింది.

శంకర్రావు తెల్లలాగూ, తెల్లచొక్కా, నల్లకోటూ, నల్లటై వేసుకొని కోర్టు కెళ్ళటానికి సిద్ధంగా ఉన్నాడు. ఆ రోజు ఫైల్ చెయ్యాల్సిన కాగితాలు వెతుక్కుంటూ హడావిడిగా ఉన్నాడు. వరూథినివచ్చి టేబుల్ పక్కగా నిలబడిందికూడా చూడలేదు.

"శంకర్రావుగారూ?"

శంకర్రావు కాగితాల్లోనుంచి తల ఎత్తకుండానే గుమాస్తాను కేకవేశాడు.

"ఎక్జిబిట్ ఆరూ..... తొమ్మిదీ ఏవీ?"

"టైపు చేస్తున్నా అయిపోయినై."

"ఇంకా ఎంతసేపు? టైం అయిపోయింది. నీకేమయినా పెన్నుందా? అవి రాత్రే టైపు చేసుకొని పెట్టుకోమని చెప్పలేదూ?"

"అయిపోయింది సార్! మీరు పదండి ఐదు నిముషాల్లో నేను తీసుకొస్తా. ఓయ్! ఇవన్నీ కార్లోసర్దు. చూస్తూ నిలబడతావేం?" గుమాస్తా గుడ్డలో ఫైల్స్ అన్నీ మూటకట్టి అందిస్తూ కుర్రాడిమీద కసురుకున్నారు.

"మన కేసూ—"

టేబులుముందు నిలబడి కాలర్ సర్దుకొని టైబిగించుకొంటున్న శంకర్రావుకు వరూథిన్ని చూడగానే గొంతు పిసికినట్టయిపోయింది! ఆమె కళ్ళు జ్యోతుల్లా మండిపోతున్నాయి.

''ఏమిటమ్మా? పొద్దుకూకులు మన కేసు మన కేసు అంటూ? బాగానే నడుస్తోందని చెప్పానుగా?'' ముఖం పక్కకు తిప్పుకొని చిరాగ్గా అన్నాడు శంకర్రావు.

''మీకు అలాగే ఉండొచ్చుగాని చూసేవాళ్ళకు అలాలేదు.'' వరూథిని కంఠం కటువుగా ధ్వనించింది.

''ఓహో!''

కణతమీద రాయి తగిలినట్టుంది శంకర్రావుకు.

''అయితే కేసు చేస్తున్నది మీరా నేనా?''

''నేనయితే మీదగ్గిర కెందుకొస్తాను?''

''అయితే మధ్య నేనెందుకూ? మీరే వాదించుకోండి.'' అంటూ గదిలోనుంచి బయటికి నడిచాడు శంకర్రావు.

వరూథిని వెనకే నడుస్తూ ''జడ్జీగా రేమంటున్నారూ?'' అన్నది.

''ఇదేమన్నా తెరమీద బొమ్మలాటనుకొన్నావా? కేతిగా డేమంటుందీ బంగారక్క ఏమంటుందీ చెప్పటానికి? కోర్టు కోర్టు! అక్కడ 'లా' మాట్లాడుతుంది.''

వరూథిని ముఖం ముడుచుకుపోయింది. అంత తిరస్కారంగా ఇంతవరకూ, తనముందు ఎవరూ - మాట్లాడలేదు.

''మీరేం దయాదాక్షిణ్యాలకు కేసు చేయడంలేదు! మీరు అడిగినంతా డబ్బిచ్చాను. పైగా పదివేలు అదనంగా తీసుకొన్నారు, కేసు గెలిపిస్తానని. సమాధానం చెప్పడానికి మీకు కష్టమౌతున్నట్టుంది.''

''అసలిలాంటి కేసులు ఒప్పుకోవడం నాదేతప్పు. ఆ డి.యస్.పి. చెప్తే ఒప్పుకొన్నా''

''ఒహాళ్ళు చెప్తే కేసు తీసుకోవడం ఏమిటి? మీకు చేతకాకపోతే వదిలేయండి అంతేగాని కేసుమాత్రం పాడు చెయ్యొద్దు!''

కారెక్క పోతున్న శంకర్రావు దిమ్మెరపోయి చూశాడు.

కారు పక్కనే నిలబడ్డ క్లయింట్స్ వరూథినికేసి శంకర్రావుకేసి మార్చి మార్చి చూశారు.

శంకర్రావు కోపాన్నంతా కారుడోరు మీద చూపించాడు.

వరూథినికి తన ముఖం మీదే ఆ తలుపు బాదినట్లనిపించింది.

వెళ్తూన్న కారుకేసి దిగాలుపడి చూసింది.

లాయరు గుమాస్తా వరూథినికేసి ఎగాదిగా చూసి లోపలకెళ్ళాడు.

వరూథినికి కనకయ్య చెప్పినదానికి రుజువు దొరికింది. శంకర్రావు ధోరణి అలాగేవుంది. ఏదో వంకతో తనతో పేచీ పెట్టుకోవాలన్నట్టున్నాడు.

ఏమీ తోచక రిక్షా ఎక్కి కూర్చుంది.

ఇంటికి వస్తోన్న రిక్షాను మళ్ళించింది వరూథిని. లాయరు గుర్నాథం ఇంటి ముందు రిక్షా దిగింది.

కార్లో కూర్చొని కోర్టుకు వెళ్ళబోతున్న గుర్నాథం వరూథిన్ని ఓ క్షణం సాలోచనగా చూశాడు. సాగిన కారాపించి గుర్నాథం దిగినిలబడ్డాడు.

వరూథిని గుర్నాథాన్ని చూస్తూ ఏం మాట్లాడాలో తోచక అలాగే నిలబడి పోయింది.

"ఏవండీ? మామయ్యగారు లేరే! పొద్దుటే ఊరెళ్ళారు." గౌరవాన్ని వలకబోస్తూ చెప్పాడు.

"కాదు మీ కోసమే వచ్చాను."

"నా కోసమా! ఏమిటి విశేషం?" చిరునవ్వులు చిందిస్తూ అన్నాడు నొసలు విరిచి.

"మా వ్యాజ్యం సంగతి మాట్లాడాలి."

"మా మామగారు కలిశారా?" ఏదో పొరపాటు జరిగినట్టుగా అన్నాడు.

"అవును! ఆ విషయంలో మీ సలహా తీసుకొందామని వచ్చాను."

"అదెలాగమ్మా! ఒకళ్ళ కేసులో మరొకళ్ళు తలదూర్చటం....."

"అయినా మీకు తప్పదు, కనకయ్యగారితో మాకున్న సంబంధాన్ని పట్టి మీకు తప్పదు." చొరవ తీసుకొని అన్నది వరూథిని.

గుర్నాథం నవ్వుకొని తల ఎగరేశాడు.

వాచీ చూసుకొని "టైం అయిపోయింది. ఇప్పటికే అర్ధగంట ఆలస్యం అయిపోయింది. సాయంకాలం కోర్టునుంచి రాగానే చూద్దాం." అన్నాడు.

"ఐదుగంటలకు రమ్మంటారా?"

"మీరిక్కడకి వద్దులెండి. ఆ శంకర్రావు వట్టి దరిద్రుడు. నేనే వస్తా మీ ఇంటికి."

"తప్పకుండా వస్తారుగదూ?"

గుర్నాథం తలెగరేసి కారెక్కాడు.

## 39

ఆ రోజు సాయంకాలం నాలుగ్గంటలనుంచీ వరూథిని గుర్నాథంకోసం ఎదురు చూడసాగింది.

"అమ్మగారూ నే వెళ్ళొస్తా!" అంటూ పనిపిల్ల కమల సంచిపట్టుకొని వరూథిని ముందుకొచ్చింది.

"అదేవిటే? ఎక్కడికి?"

"నిన్న చెప్పానుగదమ్మా మనువులోరొస్తున్నారని?" సిగ్గుపడింది కమల.

"అదేమిటే? ఇప్పుడెళ్తే ఎలా? లాయరుగారొస్తారే! కాఫీ టిఫిన్ చెయ్యాలి. నువ్వెళ్తే ఎలాగే మరి?"

''మా అమ్మ రమ్మంది. రేపొద్దున్నే పెళ్ళి చూపులు కొస్తారంట." తలవంచుకొని చెప్పింది కమల.

''ఆముసల్ది బుచ్చమ్మ మనమడి పెళ్ళికనివెళ్ళి మూణ్ణెల్లయింది. ఇంతవరకూ అయిపూ అజాలేదు. ఇంతకాలం తిని బాగా కొవ్వెక్కింది. కాస్త తిండి తక్కువయేసరికి ఉడాయించింది. దొంగముండ! ఈసారి రానియ్! కాళ్ళిరగ్గొట్టి బజార్లోకి నెట్టిస్తా. నువ్వుకూడా వెళ్తే ఎలాగే!"

''రేపు సాయంకాలానికి వస్తాగదమ్మా!"

''అదీ ఇట్టాగె చెప్పెపోయింది. అసలు మీ జాతినే నమ్మకూడదే. నాలుగు డబ్బులాడకపోతే మీ పుట్టంతా మునిగినట్టు ఏడ్చుకుంటారు. ఏవేఁ? అసలు ఇదెన్నో సారే? నువ్వు మనువులని నాగాలు పెట్టటం?"

''ఏం చెయ్యమంటారమ్మా? రెండు సంబంధాలు నాకునచ్చలేదు. రెండేమో..... ఆ పెళ్ళి కొడుకులు సైకిళ్ళూ వాచీలూ కావాలన్నారు. మా అయ్య దగ్గిరేముందమ్మా ఇయ్యటానికి?"

''రెండు సంబంధాలు నీకు నచ్చలేదా? ఎందుకే? కుంటోళ్ళా? గుడ్డోళ్ళా?"

''అఁవట్టి పల్లెటూరి మనుషులమ్మా. వంటిమీద గుడ్డకట్టుకోవడం కూడా రాని అడవిమనుషుల్లా ఉంటే ఎవరిష్టపడతారమ్మా?" కళ్ళు, తిప్పుకొంటూ చెప్పింది కమల.

వరూథిని పనిపిల్లకేసి చురచురా చూసింది. దీనికెంత నాగరికత బలిసిపోయింది? ఎంత అహంకారం?

''నీకు బస్తీనీళ్ళు వంటబట్టినయ్యే! పొగరుకూతలు కూయకుండా ఇంత తిండి పెట్టేవాడ్ని చూసి చేసుకో."

''ఒహాళ్ళు నాకు పెట్టేదేంటమ్మా? నా కష్టం నేనే తింటాను. అట్టాంటి ఎద్దు మొద్దోళ్ళను చస్తే చేసుకోను. నాకు పెళ్ళి కాకపోయినా సరే!"

వరూథినికి దాని ధోరణిచూస్తే వళ్ళు మండిపోయింది. ఇది బాగా షోకులు మరిగింది. ఇక మొగుడితో కాపరం ఏం చేస్తుంది? కూటికిలేక అల్లాడుతున్నదాన్ని తెచ్చి ఇంట్లో పెట్టుకొంది. ఎనిమిదేళ్ళ క్రితం చిరిగిన బట్టల్తో ఎముకలగూడులా, నల్లగా మురికిదారంలా వున్న దాన్ని తీసుకొచ్చి, దాని అమ్మా, అయ్యా కాళ్ళా వేళ్ళా పడితే తనింట్లో పెట్టుకొంది. బాబునైనా ఎత్తుకు తిప్పుతుందని దాన్ని ఇంట్లో పెట్టుకోడానికి తను ఒప్పుకొంది. ఇప్పుడది ఏపుగా అరటిచెట్టులా పెరిగింది. పిల్ల వళ్ళుచేసి నవనవలాడుతూంది. తన ఇంట్లో తన కళ్ళముందు పెరిగి పెద్దదయిన పిల్ల అలా మాట్లాడుతుంటే ఆశ్చర్యం వేసింది వరూథినికి.

''అయితే ఇలా రావే. హోటలు కెళ్ళి స్వీటూ హాటూ పట్టుకురా. కాఫీ నేనే చేసుకొంటాలే. ఆయనగారొచ్చే వేళయింది." అని వరూథిని డబ్బు తెచ్చియిచ్చింది.

''రేపు సాయంకాలానికి వస్తావుగదే? అన్నది వరూథిని పదిరూపాయలనోటు పనిపిల్ల చేతిలో పెడ్తూ."

''తప్పకుండా వస్తానమ్మా!'' సంతోషంగా అంది కమల.

''ఇంకేమొస్తావే నీ బొంద! ఆ మూడుముళ్ళూ పడగానే ఆకట్టుకొన్న వాడి వెంటపడిపోతావ్!'' నవ్వుతూ అంది వరూథిని.

ఆ నవ్వు వెనకాల నుంచి విచారం తొంగి చూసింది.

''అదేంటమ్మగారూ, మిమ్మల్నొదులుకొని నేనెక్కడికి పోతానమ్మా? ఆడ్ని కూడా ఈడకే తీసుకురానూ! వాడ్ని కూడా మనహోలు దగ్గిర గేట్లోనో, సినిమాహోలు బండితోలడానికో పెట్టేయండమ్మా!''

వరూథిని హృదయం ఆర్ద్రమైంది.

''నీకున్న విశ్వాసం ఆ ముసలిముండకు లేదే! ముప్పై ఏళ్ళగా మాఇంట్లో తిని బతికింది. ఇప్పుడు చూడవే అంతు లేకుండా పోయింది.''

''మీరేమన్నా అనండమ్మా ఆ బుచ్చమ్మంటే నాకు మొదటినుంచీ ఇష్టం లేదు. మీమీదే ఎన్నెన్నో చెప్పేది.''

''ఏం చెప్పేదే?'' రోషంగా అడిగింది వరూథిని.

''అదేనమ్మా! ఆ రామనాథబాబు, డి.యస్.పి. గారూ వచ్చేరోజుల్లో ఎదురింటివాళ్ళతో పక్కింటివాళ్ళతో గుసగుసలు చేసేదమ్మా!''

''ఇన్నాళ్ళనుంచీ నాకెందుకు చెప్పలేదే? దాని చెమడా లొలిపించేదాన్ని రానియ్ చెప్తా దాని పని?''

''ఆవిడంటే మీకు పంచప్రాణాలు గదమ్మా? ఆవిడ నన్నెక్కడ నిలవనిచ్చేదమ్మా?''

''ఏడ్వావులే. నువ్వుకూడా దాంతోనే చేరివుంటావు. ఎవరు చూశారు?''

''అట్టా ఒక్కనాటికీ అనుకోవద్దమ్మగారూ? నే వెళ్ళొస్తా!''

''సరే పో! త్వరగా టిఫెన్ పట్టుకొచ్చేయ్. రేపు సాయంకాలానికన్నా తప్పకుండా రా!''

''అట్నే అమ్మగారూ?'' పనిపిల్ల వెళ్ళిపోయింది.

వరూథిని స్నానంచేసి వెంకటగిరి తెల్లజరీచీర కట్టుకొంది. జడ వదులుగా అల్లుకొంది. వాకిట్లోకి రెండుసార్లువచ్చి తొంగిచూసి వెళ్ళింది. ఆరు దాటింది. అయినా గుర్నాథం రాలేదు.

అసలు రాడేమో? మొహమాటంతో అలా చెప్పాడేమో? ఈయనా లాయరేగా వాళ్ళకూ వాళ్ళకూ ఏవేవో సంబంధాలు ఉండనే ఉంటాయి. తను ఇంటికి వస్తానంటేనే భయపడ్డవాడు రేపు కేసు ఎలా చేస్తాడు? ఇప్పుడు కాకపోతే రేపు తెలియదా శంకర్రావుకు? అయినా గుర్నాథంతో తనకున్న పరిచయం ఎంత? కనకయ్య చెప్పిన వెంటనే తను గుర్నాథంతో మాట్లాడితే బాగుండేదేమో? మామ మాట అల్లుడు తోసేయలేక పోయేవాడు. తను చాలా పొరపాటు చేసింది. కనకయ్య ఊర్నించి వచ్చాడేమో? కబురుచేస్తే? అన్నట్టు ఈ మనిషేడీ? ఎక్కడ చచ్చినట్టు? తినిపోయినవాడు మళ్ళీ తిండికేనా ఇంటికి చేరడేం? ఛీ! ఛీ! ఏం

మనిషి? తనింత అవస్థపడుతుంటే ఆబోతులా తిని ఊరిమీద బలాదూరు తిరుగుతాడా?

వెంకటపతి గురించిన ఆలోచనలతో వరూథిని ముఖం కందిపోయింది. ముక్కుపుటాలు అదిరిపోసాగినై.

వాకిటికేసి చూసిన వరూథిని ముఖకవళికలు హఠాత్తుగా మారిపోయినై. కళ్ళు మెరిశాయి. ముఖం వికసించింది. శరీరం గాల్లో తేలిపోయినట్టయింది.

''వెంకటపతి గారున్నారా?''

''లేరు కూర్చోండి. నాలుగ్గంటల్నుంచీ మీకోసమే ఎదురు చూస్తున్నాను.''

''కోర్టులో నుంచి బయటపడే సరికే నాలుగున్నర అయింది. క్లయింట్లను వదిలించుకొని వచ్చేసరికి తల్రపాణం తోకకొచ్చింది.''అంటూ గుర్నాథం కోటు తీసి సోఫామీద పడేశాడు.

టై వదులు చేసుకొని సోఫాలో జారపడి వళ్ళు విరుచుకొన్నాడు.

వరూథిని ఓ ప్లేటులో స్వీటూ, మరో ప్లేటులో హాటూ తెచ్చి గుర్నాథం ముందు పెట్టింది.

''ఇవ్వాళ మా పనిపిల్లకూడా లేదు. వంటమనిషి మూడు నెలలుగా రాలేదు''

''అయ్యో! అంటే ఒంటరిగా మీరు పనంతా చేసుకోవాలన్నమాట?''

''ఇంతకు ముందే లెండి పనిపిల్ల వెళ్ళింది. రేపొస్తుంది. తీసుకోండి'' అంటూ వరూథిని లోపలకు వెళ్ళి మంచినీళ్ళు తెచ్చి టీపాయ్ మీద పెట్టింది.

''ఎందుకండీ ఇవన్నీ? కాఫీ ఇవ్వండి చాలు. వళ్ళంతా విరగ్గొట్టినట్టుంది''

గుర్నాథం వళ్ళు విరుచుకొని తనలో తనే నవ్వుకొన్నాడు.

''అనాసిన్ ఉంది ఇంట్లో ఇవ్వమంటారా?''

''అబ్బే ఏం అవసరం లేదండీ! మీరు అలానే నిలబడ్డారేం? కూర్చోండి'' అంటూ గుర్నాథం హల్వా ప్యాకెట్ విప్పి స్పూన్‌తో లాగి నోట్లో పెట్టుకున్నాడు.

''ఇంతకీ ఏమంటాడు శంకర్రావు?''

''ఉదయం వెళ్తే సరిగా మాట్లాడనుకూడా లేదు. ఏదో కుంభకోణం చేస్తున్నట్టుగా వుంది''

''అవతల రామనాథబాబు దగ్గర బాగా పట్టినట్టున్నాడు'' బాదం హల్వా గీకిగీకి నోటికి రాచుకొంటూ అన్నాడు గుర్నాథం.

''జడ్జీగారు లంచం తీసుకొంటారనీ, ఆయనకు చుట్టమనీ అదనంగా ఏడు వేలు గుంజాడు నా దగ్గర్నుంచి, మొత్తం పాతికవేలు దాటింది.''

''్రతాష్టుడు! ఎట్టెట్టా?'' ముక్కుమీద వేలేసుకొని నొసలు విరిచాడు గుర్నాథం.

''జడ్జీగారు ఆయనకు బంధువు కాదా?''

''అవటానికి ఏదో దూరపు బంధువే. కాని ఆయన లంచాలు తీసుకొనే మనిషికాదు. నిప్పులాంటివాడు. ఆయనగారు ఈ కోర్టుకు వచ్చినప్పటినుంచి ఈ శంకర్రావు, ఈ నాటకమే ఆడి రెండు వైపులనుంచీ గుంజుతున్నాడు.

మీకేసులో అవతలనుంచి బాగా ముట్టినట్టుంది. జడ్జీగారు ఎంత లీడింగ్ క్వశ్చన్ వేసినా వీడు కేసంతా పెడమార్గాన పట్టిస్తున్నాడు. ఇదుగో ఒక్కమాట చెప్తా! మీ మనసులోనే వుంచుకోవాలి" అంటూ గుర్నాథం వరూధిని మీదకు వంగాడు.

వరూధిని వెనక్కు జరగలేకా, ముందుకు వంగలేకా గాలి బిగపట్టుకొని కూర్చుంది.

"శ్యామలాంబగారి లాయరు చంద్రశేఖరంలేడూ ఆయనేమన్నాడో తెలుసా? శంకర్రావా? నేనా శ్యామలాంబ తరఫున వాదించేది? అన్నాడు. పెద్ద జోక్‌వేశాడనుకో!" అంటూ వరూధిని ముఖంలోకి చూశాడు గుర్నాథం.

"ఇంతకీ ఏం చెయ్యాలో చెప్పండి."

"అదే ఆలోచిస్తున్నా!" నీళ్ళు గుటకలు మింగి అన్నాడు.

"ఇందులో ఆలోచించటానికేముంది? మాకేసు మీరు తీసుకొని నడపండి"

"అట్లా వీలుపడదు. బార్ ఎథిక్స్‌కు వ్యతిరేకం"

"అంటే?"

"ఒకళ్ళు చేస్తున్న కేసు మరొకళ్ళు తీసుకోవడం లాయరు వృత్తి ఒప్పుకోదు అది ధర్మవిరుద్ధంగా భావిస్తారు."

"అవతలివాడు లంచాలుతిని కేసులు పాడుచేసి జనం నెత్తిన చేతులు పెడ్తుంటే, రెండో లాయరు చూస్తూ ఊరుకోవడం ఏం న్యాయమండీ? అవేం ఎథిక్స్ అండీ?" వరూధిని కంఠం తీవ్రంగా ఉంది.

"అలా తీసుకోకూడదని రూల్ లేదనుకోండి. కాని మాకు తోటి వాళ్ళతో చాలా సాధకబాధకాలుంటాయి. జనరల్‌గా ఒప్పుకోరు"

"మీరు ఒప్పుకుంటారనే ఇంత ఆశపెట్టుకొన్నాను. నాకు చెయ్యకపోతే ఎవరికి చేస్తారు? ఇదే, మీ స్వంత వాళ్ళకేసయితే చూస్తూ గాలికి వదిలేస్తారా? మా నాన్నగారి దగ్గర మీ మామగారు.... కనకయ్యగార్ని అడగండి. అంతా ఆయనే చెప్తారు" వరూధిని కళ్ళలో నీరు తిరిగింది.

"శంకర్రావు మీరిచ్చిన వకాల్తా వదులుకొంటాడా?"

"ఎవడికోసం? నిముషాలమీద చేయిస్తా ఆ పని. వాడు కొట్టేయ్యాల్సిందేదో ఇదివరకే కొట్టేశాడు. నా దగ్గర ఇక ఏమీ లేదనీ రాదనీ వాడికి తెలుసు. పొద్దుట ఆమాటకూడా అన్నాడు. నీ ఇష్టమొచ్చిన లాయర్ని పెట్టుకోండి అన్నాడు"

"ఆ మాట అన్నాడా?" గుర్నాథం ఆలోచనలో పడి అడిగాడు.

"అహ! ఆమాట నలుగురైదుగురుండగానే అన్నాడు. అయ్యో మర్చిపోయా మాటల్లోపడి. కాఫీతెస్తా ఉండండి?" అని వరూధిని లేచి వెళ్ళింది.

వంటగదిలో కాఫీ కలుపుతున్న వరూధినికి గుర్నాథం మీద అమిత విశ్వాసమూ, గురి కలిగాయి.

"ముందే ఈయన్ని లాయరుగా పెట్టుకొని వుంటే ఈ పాటికి తను కేసు గెలిచి ఉండేది. ఇప్పటికైనా తన అదృష్టం బాగుండబట్టి కనకయ్య దేవుడిలా వచ్చి

చెప్పాడు. లేకపోతే తనేంకాను? గుర్నాథం నమ్మదగిన మనిషిగానే వున్నాడు. అవతల పార్టీ లాయరు చంద్రశేఖరం ఈయనకు స్నేహితుడుకూడానేమో? అతను తప్పకుండా తనకేసు గెలిపిస్తాడు. ఈ కేసు గెలిచాక ఆ శంకర్రావుగాడి పనిపట్టించాలి. ఇలా మోసం చేసినందుకు శంకర్రావుమీద ఫోర్ట్వెంటీకేసు పెట్టేస్తేనో? వాడి అంతు తేల్చుకోకుండా తను వదుల్తుందా? ఏదీ కాకపోతే హాలు దగ్గర పనిచేసే వాళ్ళచేత నాలుగు తగలనిస్తే వాడి రోగం కుదిరిపోతుంది. అంతా బాగానే వుంది."

కాని...కాని...ఆ గుర్నాథం చూపేమిటి? మాట్లాడే ధోరణికూడా అదోలా వుంది! అతని ధోరణే అంతేమో? ఏమైనా తను సహించక తప్పదు. ఎవరికోసం?

కాఫీకప్పు తీసుకొని వరూథిని వంటగదిలో నుంచి వచ్చింది. సోఫాలో గుర్నాథం లేడు. ఇంతలోకే ఎటు వెళ్లాడు? రెండునిముషాలు అక్కడే నిలబడి చూసింది. పక్కగదిలోనుంచి సన్నగా దగ్గినట్టు వినిపించింది. తిరిగి చూసింది. గుర్నాథం పడక గదిలో మంచంమీద కూర్చొని వున్నాడు. ఓ చేత్తో తలనొక్కుకొంటూ, రెండో చేత్తో దిండు ఒళ్ళో వేసుకొని వత్తుకున్నాడు. వరూథిని స్తంభించిపోయింది!

కొద్దిక్షణాలు మాట రాలేదు. శరీరంలో అసహ్యం పారుకాడింది.

"తల తిప్పుతోంది...." తర్వాత మాటమింగి వరూథిని కేసి చూశాడు గుర్నాథం.

"కాఫీ తీసుకోండి. సర్దుకొంటుంది"

గుర్నాథం మంచంమీద కూర్చునే తెమ్మన్నట్టు చెయ్యి ముందుకు చాపాడు.

వరూథిని గదిలోకి వెళ్ళి మంచం పక్కగా నిలబడింది. కాఫీకప్పు పెట్టటానికి అక్కడ ఏమీ లేదు. గుర్నాథం చెయ్యి ముందుకు చాపాడు. వరూథిని కప్పు చివర పట్టుకొని అందించింది. గుర్నాథం కప్పు అందుకొంటూ వరూథిని కళ్ళలో కళ్ళు కలిపి చూశాడు.

"బాగా తలనొప్పిగా వుందా? బిళ్ళ ఇవ్వమంటారా?" వరూథిని అతని చూపులు తప్పించుకొంటూ అంది.

"ఏం బిళ్ళా?" గుర్నాథం గొంతు బొంగురుపోయింది.

"అనాసిన్, సారిడాన్ రెండూ వున్నాయి"

"వాటికి తగ్గే నొప్పికాదు" ఆగి మళ్ళీ అన్నాడు. "సరే! తే! ట్రై చేస్తా"

వరూథిని గదిలోనుంచి గబగబా బయటికొచ్చింది. డ్రెసింగ్ రూంలో అలమారు తెరిచి "అనాసిన్"కోసం వెతకసాగింది. బ్రాందీ బాటిల్ చేతికి తగిలింది. తాగాలన్న కోర్కెను బలంగా నిగ్రహించుకొంది. నరాలు లాగుతున్నాయి. మెదడంతా కుతకుతలాడిపోతూంది.

వీడు....ఆ కనకయ్య అల్లుడు....అక్కుపక్షి ఆ సుబ్బలక్ష్మి మొగుడు.. వీడేగా? ఆ చీమిడి ముక్కుదాని మొగుడికి ఎంత ధైర్యం? తన పడకమంచం మీద

కూర్చుంటాడా? వీడి పెళ్ళాం, తల్లి, తన యింట్లో కారాలుకొట్టీ, పచ్చళ్ళు పట్టీ బ్రతికినవాళ్ళు. అక్కయ్యకు చాలని లంగాలూ, వోణీలూ ఇస్తే కళ్ళకద్దుకొని తీసుకెళ్ళి కట్టుకున్నదేగా వీడి పెళ్ళాం? గుర్నాథానికి పెళ్ళయిన కొత్తలో కనకయ్య వెంటబెట్టుకొని తమ యింటికి తీసుకొచ్చాడు. అప్పుడు ఈ గుర్నాథంగాడు గిలకలపైకి లాగు వేసుకొని, మోకాళ్ళు దిగే చొక్కా వేసుకొని మెట్లమీదే నిలబడ్డాడు. కనకయ్య చేతులు కట్టుకొని తన తండ్రి ముందెలా నిలబడ్డాడు? ఇప్పటికీ గుర్తుంది.

''ఏం కనకయ్యా! ఈ కుర్రాడేనా నీ అల్లుడు? ఏదో చదువుకొన్నాడన్నావ్?'' బలరామయ్య ఫేముకుర్చీ చెక్కలమీద కాళ్ళాడిస్తూ అడిగాడు.

''అవును బాబుగారు! మెట్రిక్యులేషన్ పాసయ్యాడు'' చేతులు నలుపుతూ చెప్పాడు కనకయ్య.

''కట్నం ఏ మాత్రం ఇచ్చావేమిటి?'' పొగాకు కాడ ఈనెతీస్తూ అడిగాడు బలరామయ్య.

''కట్నాలూ కానుకలూ నేనెక్కడ ఇవ్వగలనండీ? మీకు తెలియందే ముంది'' బలరామయ్య అందించిన పొగాకు కాడ అందుకొంటూ అన్నాడు కనకయ్య.

''అయితే మంచి ఛాన్సే కొట్టావన్నమాట! మెట్రిక్యులేషన్ చదివినోడుగా? ఏదో ఆఫీసులో గుమాస్తాగా చేరి నాలుగు రాళ్ళు తెచ్చుకుంటాడు. ఇంకేం?'' చుట్ట గుప్పు గుప్పున వెలిగించాడు బలరామయ్య.

''ఆ మాట నిజమే అనుకోండి!'' బలరామయ్యగారిచ్చిన పొగాకుకాడ మడత పెట్టి బనీను జేబులో సర్దుకొని అన్నాడు కనకయ్య.

''మా అల్లుడికి యఫ్.ఏ;బి.ఏ. చదవాలని ఉంది. నిజం చెప్పొద్దూ ఆ కండీషన్ మీదే పెళ్ళికి ఒప్పుకున్నారు అతని తల్లిదండ్రులు. బి.ఏ. దాకా నేను చదివిస్తానని నేనూ ఒప్పుకున్నాను. వాళ్ళకేమీ లేదు. మెట్రిక్యులేషన్ దాకా వారాలు తిని, చందాలెత్తుకుని చదివాడు. ఇక అతని చదువు బరువంతా నా మీదే మరి! ''

''ఎట్టెట్టా వారాలు తిని చదువుకొన్నాడా? చదువుమీద శ్రద్ధ వున్నవాడేనన్న మాట? చదివించు! వృద్ధిలోకి వస్తాడు'' మేడ పంచపాళీలో గుంజకు ఆనుకొని తలవంచుకొని కిందనాపరాళ్ళ కేసి చూస్తూ నిలబడ్డ గుర్నాథంకేసి పరిశీలనగా చూసి అన్నాడు బలరామయ్య.

''మీ ఆశీర్వాదం! మీ ఆశీర్వాదంతో పాటు, మీ ఆర్థిక సహాయం అండదండలూ కూడా ఉంటే మా అల్లుడు బి.ఏ.కు ఆనర్సు పెట్టి ఎం.ఏ.బి.యల్.ఐపోడూ?'' కనకయ్య ఉక్కిరి బిక్కిరి అయిపోయాడు.

గుర్నాథం వంట్లో కితకితలు పెట్టినట్టయింది. తలెత్తి ఎన్నో ఆశలు నింపుకొన్న కళ్ళతో బలరామయ్యగారికేసి చూశాడు.

''నాన్నా? ఎంతసేపు నాన్నా?'' మండిగం గడప మీద కాలుపెట్టి దర్వాజా

కానుకొని నిలబడిన వరూధిని మెరుపుతీగలా కన్పించింది.

గుర్నాథం కళ్ళు జిగేల్ మన్నాయి. తలవంచుకొని ఊపిరి బిగబట్టి నిలబడ్డాడు.

''అయిపోయింది! వస్తా చిట్టితల్లీ!'' బలరామయ్యగారు కాళ్ళు నేలమీదకు దించి, చుట్ట అవతలపారేసి లేవడానికి ఉద్యుక్తుడయ్యాడు.

''ఏమిటి కనకయ్యా ముంతదాపరికాలెందుకు. తేల్చిచెప్పు!''

''అల్లుడు వచ్చే సోమవారంనాడు కాలేజీలో చేరాలి. ఓ ఐదొందలు సర్దండి. ఈ ఏడాదికి మళ్ళీ మిమ్మల్ని అడగను.'' కనకయ్య చేతులు నలుపుకొన్నాడు.

''అడిగేప్పుడు అప్పు. కాని నువ్వు తిరిగిచ్చిందెప్పుడూ? దాని కిందా దీనికిందా చెల్లు పెట్టడం, మిగిలింది ఎగనాం బెట్టి పిల్లలు గలోణ్ణని తల గోక్కోవటమేగా నువ్వు చేస్తోంది?''

''తమరన్నది కాదన్నానా? మీ దయ. మిమ్మల్ని నమ్ముకొన్నవాడ్ని మీ రాదుకోకపోతే మరెవరాదుకొంటారు చెప్పండి?''

బలరామయ్య ముఖం చాటంత అయింది.

''అప్పు లేదూ గిప్పు లేదూ! నువ్వు తిరిగిచ్చేదా పెట్టేదా?''

కనకయ్య మెడ జారిపోయింది.

''ఇదిగో! కనకయ్యా! రెండొందలిస్తా! మీ అల్లుడి చదువుకే సహాయం చేస్తున్నా ఈ ఏడాదికి మళ్ళీ నన్నడగొద్దు.''

కనకయ్య బలరామయ్యగారి కాళ్ళమీద పడేట్టుగా అయిపోయాడు. ఆనంద బాష్పాలు రాల్చాడు.

''ఇదిగో ఏమోయ్! నీ పేరేంటీ?''

''గుర్నాథం''

''ఓ గుర్నాథం! మీ మామ ఎంత అవస్థపడి నీకు చదువు చెప్పిస్తున్నాడో చూస్తున్నావుగా? ఏరుదాటి తెప్పతగలేసేవ్? బుద్ధిగా చదువుకొని పైకొచ్చి మీ మామకు ఓ చేయి అందించు. ఇంకా చిన్నా చితకా పిల్లలున్నారు!''

''గుర్నాథం! బలరామయ్యగారు చెప్పింది విన్నావుగా? అఁ గుర్తుంచుకో. పెద్దవారు చెప్పారు గుర్తుంచుకో?''

గుర్తే వుంది గుర్నాథానికి మర్చిపోలేదు.

బలరామయ్యగారి కూతురి పడకగదిలో పందిరి మంచంమీద దొర్లుతూ గుర్నాథం గుర్తుచేసుకొన్నాడు.

ఆరోజు ద్వారబంధం పట్టుకొని మండిగం మీద సుతారంగా కాలుపెట్టి నిల్చొని తనకేసి ఓ కొత్త జంతువునో, పురుగునో చూస్తున్నట్టుగా చూసిన వరూధిని ఇంకా గుర్తే వుంది.

అప్పుడప్పుడే పొటమరించే యవ్వనం ఎటునుంచి బయటకు రావాలా అని వెతుక్కుంటూంది. ఆమె శరీరపు పొందికా, వంపులూ ఇంద్ర ధనస్సులోని రంగుల్లా ఏది ఎక్కడ మొదలై ఎక్కడ అంతమయిందీ తెలియడంలేదు.

''వారాలు తినటమేమిటి నాన్నా?''

బలరామయ్యగారి నవ్వు గుర్నాథం గుండెల్లో దూరదూరాల్నుంచి వినిపించసాగింది.

''మీ అత్త మా జీతగాడితో ఉంది. నీ పెళ్ళాం వాడికి పుట్టిందే!''

''లంజను లంజా అంటే నువ్వు లంజ, నీ అమ్మ లంజ అంటుంది.''

వరూథినికి కళ్ళు చీకట్లు కమ్మాయి!

''గొర్రె కసాయివాడ్నే నమ్ముద్ది. రామనాథబాబు అవసరం తీరాక ఐదు లక్షల ఆస్తి కాజేశాడు. ఆ పోలీసోడేమో అన్నీ గడుపుకొని ఆ శంకర్రావుగాడిని తగిలించి తప్పుకొన్నాడు. నీకు అలాంటి వాళ్ళే కావాలి!'' సోఫామీద వదిలేసిన నల్లకోటు తీసి బుజాన వేసుకొన్నాడు గుర్నాథం.

''ఎంగిలి మెతుకులు ఏరుకొని బతికినవాడివి నువ్వు! వాళ్ళతో నీకు పోలికేమిటి? చెడి బతికిన రకం! మళ్ళీ గడప తొక్కావా పరువు దక్కదు. జాగ్రత్త!''

వెళ్తున్న గుర్నాథం ద్వారం దగ్గిర ఆగిపోయాడు.

''పరువు? బరితెగించిన దానివి నీకు పరువుకూడానా? మాటలు జాగ్రత్తగా రానియ్. నీ గడప తొక్కాల్సిన అవసరం నాకేమిటి? నువ్వు రమ్మని ఏడిస్తేనే నీ ఇంటికొచ్చాను. అసలు పరువు మర్యాదా వున్నవాడెవడూ నీ గడప తొక్కడు.''

గుర్నాథం గడపదాటి రోడ్డెక్కాడు.

వరూథిని థడేల్న తలుపులు మూసింది. గుర్నాథం కూర్చున్న సోఫాకేసి చూస్తేనే అసహ్యంగా వుంది. పడక గదిలో వున్న మంచంమీద కిరసనాయిల్ పోసి ముట్టించాలనిపించింది.

తెల్లదుప్పటీ, దిండుగలీబూ తీసి స్నానాలగదిలో బాయిలర్ పక్కన పడేసింది. వేరే ఇస్త్రీ దుప్పటితీసి పరచింది. మంచంమీద వాలిపోయింది. గుర్నాథం అంటుకొన్న శరీరం మండిపోతోంది.

మెదడులో పోటు...గుర్నాథం..గుర్నాథం...గుండెలు విచ్చిపోతున్నాయి. అవమానం, కసీ నరనరాన్నీ పట్టి గుంజుతున్నాయ్!

వాడికెంత ధైర్యం? తను ఎవరనుకొన్నాడు? వాడి బతుకేమిటి? వాడు....తన చెయ్యి.... బలరామయ్యగారి కూతురి చెయ్యి పట్టుకొంటాడా? నాన్నే వుంటే వాడ్ని నరికి ఉప్పపాతర్లో వేయించేవాడు. మామ...సాంబయ్యవింటే గుర్నాథం గాడ్ని నరికి కాకులకూ గద్దలకూ వెయ్యడూ? తన మామగారంటే మహా మహా వాళ్ళకే వణుకు! తను షావుకారు బలరామయ్యగారి కూతురు.. తను మోతుబరి భూస్వామి కోడలు. తనను అంటుకోవడానికి వాడికి ఎన్ని గుండెలు? డి.యస్.పి. గారుంటే వాడి రక్తం కళ్ళ చూడరూ? ఈ పాటికి గుర్నాథంగాడ్ని బొక్కలో తోయించేవాడు కాదూ? రామనాథబాబయితే మాత్రం ఊరుకొంటాడా? రౌడీల్ని పెట్టయినా తన్నించేవాడు కాదూ?

వరూధిని హృదయం పొగలూ సెగలూ చిమ్మి బద్దలైంది. ముఖాన చేతులు పెట్టుకొని ఏడ్చింది. ఇంట్లో వంటరిగా వున్న ఆమెకు తన ఏడుపే వింతగా విన్పించింది. కళ్ళు తుడుచుకుంది. బయట తలుపు కొట్టిన చప్పుడు వినబడింది. లేచి వెళ్ళింది. తలుపు తీసింది.

''ఏం చేస్తున్నావ్? నిద్రపోతున్నావా? ఎంతసేపట్నుండి నేను తలుపు కొడ్తుంది?'' వెంకటపతి భార్య ముఖంలోకి చూసి ఖంగారుపడ్డాడు.

''ఏమయిందీ? అట్టా వున్నావూ?''

''ఏమయిందా? నా దెవసమయింది'' గిరున వెనక్కు తిరిగి ఇంట్లోకి నడిచింది వరూధిని.

మబ్బులు లేకుండా మెరుపులూ ఉరుములూ రావడం వెంకటపతికి కొత్తేమీ కాదు. కాని ఈ సారి పిడుగు నెత్తినే పడ్డట్టయింది.

''ఏమైందబ్బా?'' ఆలోచన సాగలేదు. సాగిన ఆలోచనకు ఏమీ తట్టలేదు. భార్య వెనకే అడుగులు తేలవేస్తూ ఇంట్లోకి నడిచాడు వెంకటపతి.

''నువ్వసలు మగాడివేనా?''

కూర్చోబోతున్న వెంకటపతి వంచిన మోకాళ్ళమీద అలాగే ఉండిపోయి భార్యకేసి చూశాడు.

''ఏంటీ నీ గొడవ మళ్ళీ? సంగతేంటో చెప్పకుండా!''

''ఆ గుర్నాథంగాడు లేడూ?''

''ఏ గుర్నాథమంటా?'' అదేదో చిన్న సంగతేనని నిర్ధారణకొచ్చి సోఫాలో కూర్చున్నాడు వెంకటపతి.

''ఆ కనకయ్యగాడి అల్లుడు లేడూ?''

''ఏదీ! మన కనకయ్యగాడి అల్లుడు గుర్నాథమా??''

వరూధినికి ఏడుపు గొంతులో కొచ్చింది. గుటకలు మింగి అన్నది.

''నువ్వు ఇట్టాంటి అక్కుపచ్చివి కాబట్టే వాడట్టా చేశాడు''

''మన వ్యాజ్యంలో కనకయ్య అల్లుడికేం సంబంధమబ్బా!'' యుగయుగాలుగా దేవుడి ఉనికికోసం వెతుకుతున్న వేదాంతిలా ముఖం పెట్టాడు వెంకటపతి.

''ఏం సంబంధమా? నువ్వు అంటవెధవ్వని తెలిసి నీ పెళ్ళాం చెయ్యి పట్టుకొని లాగాడు.''

''ఎవరా మాట్లాడేదీ? వరూధినే? తన భార్య వరూధినే? ''

వెంకటపతి చివాల్న లేచి నిలబడ్డాడు.

''మగదిక్కులేని ముండను కాబట్టి సరిపోయింది. మరొక ఆడదాని మొగుడయితే గుర్నాథంగాడ్ని ఈపాటికి రోడ్డుమీదకు లాగి చావచితక తన్నడూ?''

''ఆ గుర్నాథం గాడికేం పనంటా ఇక్కడా? అసలెందుకొచ్చాడు?'' వెంకటపతి రుద్రుడయిపోయాడు. అతనికి ఏం మాట్లాడాలో తెలియడం లేదు. నోటికొచ్చింది ఏదో అంటున్నాడు.

''ఛీ! ఈ పాడు బతుకు బతికేకంటే ఏ నుయ్యో,గొయ్యో చూసుకుంటే మంచిది ఈ నీచపు బతుకు బతక్కపోతేనేం?'' కొంగు ముఖాన వేసుకొని భోరున ఏడ్చింది వరూథిని.

వెంకటపతికి భార్య మొదటిసారిగా నిస్సహాయురాలిగా కన్పించింది. ఊళ్ళో చావిట్లో గుంజకు చుట్టుకొని ఇంటిమీదకు పాకిన గుమ్మడి తీగ వెంకటపతి అంతరాంతరాల్లో మెదిలింది.

''నువ్వూరుకోమంటే! ఊరుకో! వాడెమ్మ! నాకొడుకు! ఆ గుర్నాథంగాడు అంతటివాడయ్యాడా? వాడంతేదో తేలుస్తా?'' వెంకటపతి పైపంచను అక్కడే వదిలేసి, నేలను గతగతా తన్నుకొంటూ గుమ్మం దాటి వీధిలోకొచ్చాడు.

''ఏవండీ?''అని ఇంకేదో చెప్పబోతూ వెనకే వచ్చిన వరూథిన్ని కసిరాడు వెంకటపతి.

''నువ్వు ముందు లోపలకు చావ్? తలుపేసుకో! ఫో!''

ఉగ్రుడై వున్న వెంకటపతిని చూస్తూంటే వరూథినికి శరీరం వణికింది. గుండెలు దడదడలాడాయి. కుక్కిన పేనులా కిక్కురుమనకుండా భర్త ఆజ్ఞను అమలు జరిపింది ఆ క్షణంలో వరూథిని.

## 40

వెంకటపతి వెళ్ళేసరికి గుర్నాథం టేబుల్ ముందు కూర్చొని తను చేసిన పనిని తల్చుకుంటున్నాడు. వెంకటపతిని చూడగానే తత్తరపోయి గుర్నాథం లేచి నిలబడ్డాడు. వెంకటపతి గుర్నాథం జుట్టు పట్టుకొని బరబరా బయటి కీడ్చుకొచ్చాడు.

''గాడ్దికొడకా? మా ఇళ్ళముందు ఎంగిలాకులు గతికి నోడివి. నీకెంత మదం దిగిందిరా?'' వెంకటపతి గుర్నాథంగాడ్ని వంగదీసి 'దభీదభీ' జబురుతున్నాడు. గుర్నాథం పెళ్ళాం సుబ్బలక్ష్మి అడ్డం వచ్చింది, దాన్ని ఒక్కతోపు తోశాడు. అడ్డంవచ్చిన కనకయ్యకు రెండు తగిలించాడు.

''తొత్తుకొడకా? ఎవరను కొన్నావురా?'' ఎగిరెగిరి గుర్నాథం పొత్తి కడుపులో తంతున్నాడు వెంకటపతి. గుర్నాథం నోట్లోనుంచి 'బొళుక్కు' 'బొళుక్కు' మని రక్తం కక్కుతున్నాడు.

''అయ్యో నా మొగుడ్ని వరూథిని మొగుడు చంపేస్తున్నాడ్రోయ్!'' చప్పిడి ముక్కు సుబ్బలక్ష్మి నెత్తిబాదుకొంటూ ఏడుస్తోంది.

''అయ్యో! నా అల్లుడ్ని బలరామయ్యగారి అల్లుడు చంపేస్తున్నాడండోయ్!''

''బాబోయ్! మీ కాళ్ళుపట్టుకొంటా! వదలండి! బుద్ధితక్కువైంది!''

''నా కాళ్ళమీద కాదు. నువ్వుకాదు. ఈ లంజాకొడుకును వెళ్ళి వరూథిని కాళ్ళమీద పడమను!''

''ఏరా! పద్దావాలేదా?'' అంటూ వెంకటపతి గుర్నాథం ముఖం మీద 'ఫెడీ ఫెడీ' తంతున్నాడు. గుర్నాథం ముందు రెండు పళ్ళూ విరిగిపోయి కింద పడిన్నె. నాలుక తెగి రక్తం కారుతోంది. మనిషి స్పృహ తప్పి పోతున్నాడు. నేల కొరిగి లేవడానికి ప్రయత్నం కూడా చెయ్యడంలేదు. అయినా వెంకటపతి కోపం తీరలేదు. కాలెత్తి గుర్నాథం మెడమీద పెట్టి అంటున్నాడు వెంకటపతి.

''ఎవరనుకున్నావురా వరూథినిని?''

''అబ్బ! ఇహ చాల్లేండి! చచ్చేట్టున్నాడూ?''

''నువ్వవతలకు ఫో!'' భర్త అరుస్తున్నాడు.

''వాడు చస్తే మన పీకలమీద కొస్తుంది. మీ మోటుతనమూ మీరూ సరే! చచ్చేదీ బతికేదీ కానరు!'' వెంకటపతి రెక్క పట్టుకొని బలంగా లాగింది వరూథిని. వెంకటపతి కోపంగా వరూథిన్ని తోసేశాడు.

పందిరిమంచం మీద కళ్ళుమూసుకొని పడుకొని వున్న వరూథిని ఉలిక్కి పడింది. కళ్ళు తెరిచింది. ఊహాచ్చిత్రం చెదరిపోయింది. నెత్తిమీద నుంచి బండ దించి నట్టయింది. కసి తీరింది. మనసు తేలిక పడింది.

అన్నట్టు తన భర్త అంత మొరటు మనిషే! అంతపనీ చేస్తాడు. పుటిక్కిన తగలరాని చోట తగిలి ఆ గుర్నాథంగాడు చస్తే! పోలీసులొచ్చి ఆయన్ను పట్టుకుపోతారు. అసలు ఈపాటికి అంతపనీ జరిగిందేమో? తను ఎంత తెలివి తక్కువ పనిచేసింది? అసలు ఆయన్ను పంపించటమేమిటి? అసలు ఆయనకీసంగతి చెప్పడం ఎందుకు? ఈపాటికి ఎంత అల్లరి అయిందో? ఆ విధంగా తన పేరు మోగిపోతూ ఉంటుంది.

అసలే ఆయన తెలివి తక్కువ మనిషి. మా ఆవిడ్ని ఈ గుర్నాథంగాడు పట్టుకొన్నాడని అక్కడ చేరిన వాళ్ళందరికీ చెప్పే ఉంటాడు. ఛీ! ఛీ! ఎంత అభాసు పాలయింది తన బతుకు? తను తల ఎత్తుకొని ఇంకెలా తిరుగుతుంది? పైగా ఆ గుర్నాథంగాడు లాయరు. వెంకటపతి తనను కొట్టాడని కేసు పెడ్తాడు.

''ధన్! ధన్!''

ఎవరో తలుపు కొడ్తున్నారు. వాళ్ళంతా ఇంటిమీదకు దాడికొచ్చారా? రౌడీల్ను పెట్టి ఆయన్నే కొట్టించాడేమో గుర్నాథం. తల పగిలిన ఆయన్ను...స్పృహలోలేని తన భర్తను ఇంటికి మోసుకొచ్చారా?

వరూథిని పక్కమీద నుంచి లేచి పరుగెత్తింది. వీధివాకిలి దగ్గిర కొస్తుంటే కాళ్ళు వణికాయి. తలుపు గడియ తీస్తుంటే చేతులు వణికాయి.

''ఏమైంది?'' తల వేలాడేసుకొని ఎదురుగా నిలబడిన భర్తను చూసి అడిగింది వరూథిని.

వెంకటపతి తలదించుకొని మాట్లాడకుండా లోపలకొచ్చాడు.

వరూథినికి తన భర్తలో మళ్ళీ మామూలు వెంకటపతి కన్పించాడు.

ఓ గంట క్రితం గుర్నాథాన్ని తన్నడానికి వెళ్ళిన వెంకటపతి ఏమయ్యాడు? ఆ

రౌద్రమూర్తి త్రోవలోనే చచ్చివుండాలి. నిప్పులు చెరుగుతూ వెళ్ళిన వెంకటపతి నీళ్ళు కార్చుకుంటూ తిరిగొచ్చాడు.

ఏమైందో ఏమిటో? మాటన్నా సరిగా చెప్పిచావడేం?

వరూథిని ఉక్కిరి బిక్కిరి అయిపోయింది. ఏమయిందో తెలుసుకోవాలన్న తహతహ ఆమెను వేధించసాగింది.

"ఆ గుర్నాథంగాడు ఏమన్నాడూ!?"

భర్త ఉలకలేదు. పలకలేదు.

"నిన్నే! పలకవేం?" వరూథినికి వళ్ళు మండిపోతూంది. వెంకటపతి నేరుగా పడక గదిలోకి వెళ్ళాడు. వరూథిని అనుసరించింది.

"ఏమై వుంటుంది?" అదే ప్రశ్న ఆమెను వేధించ సాగింది.

వెంకటపతి బీరువాతెరిచి వెతుకుతున్నాడు. ఎంత ధైర్యం వచ్చింది, ఈ మనిషికి? తన బీరువా తెరిచి చూస్తున్నాడు? పైగా తన ముందే ఆ పని చేస్తున్నాడే? తన వస్తువులను తాకటానికి కూడా జంకే మనిషి ఇంత మొండితనం ఎలా వచ్చింది? అక్కడేదో జరిగే వుంటుంది. లేకపోతే మరీ ఇంత ఇదిగా ప్రవర్తించడు. గుర్నాథంగాడ్ని బాగా తన్నే వచ్చి ఉండాలి. మనిషి పైకి కన్పించకపోయినా లోలోపల ఇంకా రగుల్తూనే వుండి ఉండాలి.

వరూథిని రెండడుగులు వెనక్కు వేసింది. విస్కీ సీసా తీసుకొని వెంకటపతి బీరువా మూశాడు. వరూథిని అక్కడేవున్నా లేనట్లే ప్రవర్తించాడు. సీసా తీసుకొని గదిలోనుంచి బయటకొచ్చాడు.

ఏదో జరిగే వుంటుంది. ఆ మందు పడకపోతే మనిషి ఆగేట్టు లేడు. ఆరాట పడిపోతున్నాడు. అది లోపలకు పోతేగాని మనిషి స్థిమితపడడు.

కన్నార్పకుండా భర్తకేసి చూస్తూ ఆలోచనలో పడింది వరూథిని.

వెంకటపతి సీసామూత పళ్ళసందున పెట్టి పెటిక్కిన మూత తీశాడు. బాటిల్ పైకెత్తి పెదవుల సందున బిగించాడు!

వరూథినికి గాబరా ఎక్కువయింది. వంటగదిలోకెళ్ళి ఓ గ్లాసూ, చెంబుతో నీళ్ళూ తెచ్చింది.

"అదేమిటి? మీకేమయినా మతిపోయిందా ఏమిటి?" వరూథిని భర్త చేతుల్లో నుంచి సీసా లాక్కుంది.

గ్లాసులో సగానికి తక్కువగా విస్కీపోసి మిగతా ఖాళీ నీళ్ళతో నింపింది.

"అసలేమయిందండీ?" గ్లాసు భర్తకు అందిస్తూ అనునయంగా అడిగింది వరూథిని.

గ్లాసు అందుకొని మూడు నిమూషాల్లో ఖాళీచేసి వెంకటపతి విస్కీ సీసాకేసి చూశాడు.

వరూథిని తన అయిష్టాన్ని బలవంతంగా అణచుకొని మళ్ళీ గ్లాసునింపి భర్తకు అందిస్తూ, అతని ముఖంలోకి చూసింది. భర్త ముఖంలో వస్తూన్న మార్పును

పసికట్టింది. అతనేదో చెప్పటానికి ప్రయత్నిస్తున్నాడు. మళ్ళీ ఏదో సందేహంతో ఆగిపోతున్నాడు.

మొత్తంమీద రాయి కదిలింది. మనిషి కరుగుతున్నాడు. సగానికి పైగా గ్లాసు ఖాళీచేసి కిందపెట్టి భార్యకేసి చూశాడు. ఈసారి వరూథిని కళ్ళతోనే ప్రశ్నించింది.

''కోడిగుడ్లున్నాయా?''

వరూథిని రక్తం చల్లబడినట్టయింది.

''ఉన్నాయిలే! ఇంతకూ ఏమయింది?''

''అట్టు. అట్టేయ్ - ఆకలేస్తూంది.''

వరూథిని వళ్ళు మంచుగడ్డయిపోయింది.

''మళ్ళీ ఇప్పుడెందుకూ? భోజనం చేసేవేళకూడా అవుతోంది. అన్నంలో కేస్తాన్లే! ఒకేసారి తిందురుగాని.''

''అయితే రానియ్‌మరి!'' గ్లాసు ఖాళీచేసి మళ్ళీ నింపమని భార్య ముందు పెట్టాడు.

వరూథినికి తెలుసు. ఆ గ్లాసు కూడా తాగితే మనిషి అడ్డం పడతాడు. మాటా పలుకూ ఉండదు. ఆమె ఓర్పు అడుగంటింది. భర్త తన సహనానికి ఉన్న ఎల్లలు దాటాడు.

''ఇక చాల్లే! ముదనష్టం! అక్కడేం చేసొచ్చావో చెప్పిచావరాదా?'' గొంతు పెద్దది చేసింది వరూథిని. గుడ్లెర్రబడ్డాయి.

''ఎక్కడా?'' వెంకటపతి ఎటో చూస్తూ అన్నాడు.

''వల్లకాట్లో!'' వరూథిని చెయ్యి ముందుకు విసిరింది.

''ఆ గుర్నాథంగాడి సంగతంటుంటే?'' రెట్టించింది.

''లేడు. ఇంట్లో లేడనుకొంటా.''

వరూథిని అవ్వాయ్ సువ్వాయ్‌లా లేచింది.

''అనుకొనేదిమిటి నా శ్రాద్ధం! ఇంతకీ వాడింటికెళ్ళారా? లేదా? ఇంతవరకూ ఏ గోడమూలనో చచ్చి తాగటానికి ఇంటికి చేరావా! ఉండు నీ పని చెప్తా!''

''అహ వెళ్ళానంటుంటే? ఏందంత అడ్డగోలుగా మాట్లాడతావ్?'' మాటలు వడుపుగానే వచ్చాయి. మనిషికి పురి ఎక్కుతోన్నట్టుంది.

''వెళ్ళేం నిర్వాకం చేశావో చెప్పి చావరాదు? ఆ గుర్నాథంగా డేమన్నాడు?''

''కనకయ్య, గుర్నాథం పెళ్ళాం నా మీద జెయ్యిన లేచారు.''

''నీ అక్కుపచ్చి మొఖం చూస్తే....''

''అట్టాగాదులే, చెప్పేది వినకుండానే ఏంటావాగుడు?'' వెంకటపతి కసిరాడు.

''తొందరగా చెప్పరాదూ? ఏమన్నారూ?''

''అంతా నీ మీదకే తోస్తున్నారు.''

''నా మీదకు తొయ్యడమేమీటి? పక్కటెముకలు విరగతన్నేవాళ్ళులేక.''

''కనకయ్య నన్ను చూడగానే 'భయ్' అని లేచాడు.''

''మా అల్లుడు రామనాథబాబూ, డి.యస్.పి. లాంటివాడనుకొందేమో మీ ఆవిడ? పరువుగలోడు." అన్నాడు కనకయ్య.

వెంకటపతి ఆగిపోయాడు.

''ముసలినక్క పళ్ళు రాలగొట్టలా నువ్వు?"

''మనమీద అభిమానంతో జాలిపడి ఆ శంకర్రావు సంగతి చెప్పాడంట. నువ్విట్టాంటి మనిషివనుకోలేదంట."

''వాడు వాగిందంతా వింటూ ఊరుకొన్నావా!"

''మధ్యలో కనకయ్యకూతురొకటి! తన మొగుడ్ని నువ్వు మరగేసుకో చూస్తున్నావని ఒకటే గోల. తన మొగుడు మంచివాడు కాబట్టి సరిపోయిందట. వాళ్ళ పిల్లల నోట్లో దుమ్ముపడేదంట!"

''దాన్నోట్లో పురుగులుపడా!"

''నీ దగ్గర డబ్బయిపోయేసరికి ఇట్టా తిరిగావంట. కనకయ్య అంటున్నాడు."

''ఎట్టా తిరిగానంట? ఈసారి కనపడనీయ్? వాడినడ్డి విరగగొట్టకపోతే నా పేరు..."

''డబ్బూ దస్కం లేకుండా ఆయనచేత పనిచేయించుకోటానికి ఈ పన్నాగం పన్నావంట."

''ఎవడా మాటంది? తొత్తుకొడుకు!" వరూథిని ముక్కుపుటాలు అదిరిపోతున్నాయి.

''నువ్వే పిలిచావంటగా?" వెంకటపతి కంఠం కటువుగా పలికింది.

''వెళ్ళి పిలిస్తే? వాడీపని చేస్తాడా?"

''గుర్నాథం ఏమీ ఎరగడంట. నువ్వే..."

''నేను?"

''మరి వాళ్ళట్టా అంటున్నారు."

''నువ్వు చేతగాని ముండవని వాళ్ళకు తెలియదా ఏం?"

నువ్వసలు మగాడివైతే వాళ్ళట్టా మాట్లాడతారా? ఆ గుర్నాథంగాడు ఇంట్లోవుండే పెళ్ళానికీ, మామకీ చెప్పి అట్లా అనిపించాడు.

వెంకటపతి మాట్లాడలేదు.

''ముండ? నీ అలుసు చూసుకొనేకదూ వాడింట్లో జొరబడి ఆ పని చేశాడు? ఈ బతుకు బతక్కపోతే ఏం? పౌరుషమున్న మొగాడయితే ఈపాటికి..."

''నీ మెతకబుద్ధి తెలిసే వాళ్ళట్టా మాట్లాడగలిగారు."

వరూథిని పెదవులు కంపించాయి.

''నీ తిరుగుళ్ళు చూస్తే ఆ గుర్నాథంగాడు..."

పెఠీమని గాజు పగిలిన శబ్దం!

రెండు చేతుల్తో ముఖం కప్పుకొని తల వంచేసుకొన్నాడు వెంకటపతి.

వెంకటపతి ముఖంమీద గాజుగ్లాసు బద్దలయింది. కుడిగవద ఎముకమీద గాజుముక్క గుచ్చుకుపోయింది. రక్తం చిమ్మింది. చొక్కామీదా, పంచెమీదా రక్తపుడాగులు, ముఖమూ, చేతులమీదా చిందిన రక్తం తొలకలుగా గడ్డ కట్టుకు పోతూంది.

వెంకటపతి తలెత్తి చూశాడు. వరూథిని వణికిపోతూ భర్తమీదకు వంగి ముఖంలోకి గాబరాగా చూస్తోంది.

''లంజాముండా?''

వెంకటపతి వరూథిని జుట్టు లంకించుకొన్నాడు. బలంగా గుంజి కింద పడేశాడు.

''వళ్ళు మదంపట్టి ఛస్తున్నావు!'' దభీమని గుద్దాడు.

వరూథినికి కలిగిన భయంలో దెబ్బ నొప్పి తెలియలేదు.

''అంతా నాశనంచేసి నన్ను ఎదవనుచేసి కూర్చోపెట్టావ్!'' మళ్ళీ గభీగభీ రెండు తగిలించాడు.

వరూథిని పెనుగులాడింది. మీదపడి కొడ్తున్న భర్త మొలపంచ లాగింది.

ఊడిపోతున్న పంచను సర్దుకొనే ప్రయత్నంలో భార్య జుట్టు వదిలేశాడు వెంకటపతి.

వరూథిని రేచుకుక్కలా తప్పుకొంది.

''నీ మగసిరి ఆడదానిమీద కాదురా! ఆ గుర్నాథంగాడి మీద చూపించు. పెళ్ళాం మీద కాదురా! ముదనష్టపాడ! పరాయిమొగాడు పెళ్ళాన్ని పట్టుకొంటే చూస్తూ వూరుకున్నోడివి నువ్వూ ఒక మొగాడివేనా? తూ! నీ బతుకుచెడ!''

''తప్పుడుముండా, నోరుముయ్! నిన్నూ!....'' అంటూ వెంకటపతి భార్యమీదకు దూకాడు.

వరూథిని పరుగెత్తింది. పడకగదిలో జొరబడి తలుపులు బిడాయించుకోటానికి ప్రయత్నించింది.

వెంకటపతి ఎగిరి తలుపులు తన్నాడు. తలుపులు బార్లాగా తెరుచుకొన్నయి. వరూథిని వెనక్కు విరుచుకుపడింది.

''నిన్ను పాపం తలచకూడదే!''

వెంకటపతి కిందపడ్డ భార్యను నేలమీద ఈడుస్తూ అరిచాడు.

''బంగారపుగడ్డ! అయినకాడి కమ్మించావ్? ఇల్లూ వాకిలీ, దిక్కూ దివాణం లేనివాణ్ణి చేశావ్! నా కొంప కూల్చావే! ఆఖరికి తండ్రీ కొడుకులకు కాకుండా చేశావ్! ఉన్న పరువు కాస్తా తీశావ్!''

''నువ్వాడదానివేనా? తాగి తందనాలాడతావా? సంసారంచేసే ముండవేనా నువ్వు? పో బయటికి?'' అంటూ వెంకటపతి వరూథిన్ని రెక్కపట్టుకొని పైకి గుంజాడు. వరూథిని తోటకూరకాడలా వేలాడపడిపోయింది. రెండుచేతుల్తో లేవనెత్తబోయాడు. వరూథిని మంచుముద్దలా అయిపోయింది. చేతుల్లోనుంచి జారిపోయింది.

వెంకటపతి గుండెలు ఆగిపోయినై. మైకం దిగిపోయింది. బుర్రంతా ఓ పెద్ద చీకటిగోళంలా అయిపోయింది. భయంకర నిశ్శబ్దం అతని భయాన్ని ఇనుమడింపజేసింది.

ఏం జరిగింది? తనేం చేశాడు?

''వరూ! వరూ!'' పిల్చాడు.

ఆమె పలకలేదు.

ఆమెను ఒళ్ళో కూర్చోపెట్టుకొని చుబుకం పట్టుకొని ఊపాడు. ఆమె తల ఎటు తిప్పితె అటే తిరిగి మళ్ళీ వేళ్ళాడబడుతోంది.

''నిన్నే? వరూ? ఏమయింది?''

వెంకటపతి గుండెలు కదలబడ్డాయి. చెమటలు పట్టిపోయినై. ముక్కుదగ్గిర వేలుపెట్టి చూశాడు. శ్వాస ఆడుతూంది.

ఫరవాలేదు. అన్నుబట్టిపోయివుంటుంది. ఏమిటి తనింత మూర్ఖంగా చేశాడు? ఏనాడూ లేనిది తనెందు కిలా అయిపోయాడు ఈరోజు? ఆ వెధవ విస్కీ! ఎక్కువగా తాగేశాడు. తనేం చేసిందీ తనకే తెలియదు.

వెంకటపతి భార్యను చేతులమీద ఎత్తుకొని మంచంమీద పడుకోబెట్టాడు. చన్నీళ్ళు తెచ్చి ముఖాన చల్లాడు.

''ఎట్టావుంది? నిన్నే? ఎట్టా వుందీ?'' దిగులుగా అన్నాడు.

వరూథిని కళ్ళు తెరిపిళ్ళ పడలేదు. పెదవులు కదల్లేదు.

భార్య పక్కనే దిగాలుపడి కూర్చున్న వెంకటపతికి పొరుగింట్లో నుంచి పసిబిడ్డ ఏడ్పు విన్పించింది.

''బాబు! బాబు!'' వెంకటపతికి రవి గుర్తొచ్చాడు. హృదయం కలతచెందింది.

బాబు తల్లిలేని బిడ్డ అవుతాడా? రేపొచ్చి అమ్మేమయిందని అడిగితే తనేం చెప్తాడు? తనే చేజేతులా చంపాననిచెప్తాడా? వరూథిన్ని తనే చేతులారా చంపుకొన్నాడు. అందరూ తనను అమాయకుడంటారు. తను హంతకుడు. భార్యనే చంపిన ఖూనీకోరు.

''వరూ? నిన్నే! ఎలావుంది?''

వెంకటపతి గొంతులోనుంచి మాటలు రావటంలేదు. గొంతు పూడిపోయింది. ఆమె ముఖంలోకి ఆదుర్దాగా చూశాడు.

వరూథిని పెదవులు కదిలాయి.

వెంకటపతి కళ్ళల్లో వెలుగులు మెరిసాయి.

''డాక్టర్ను పిల్చుకొచ్చేదా?''

వెంకటపతి అంతవరకు ఆ ఆలోచనే రానందుకు తనలో తనే గొణుక్కున్నాడు.

వరూథిని అక్కర్లేదన్నట్టు మెల్లగా చెయ్యి ఊపింది. కనురెప్పలు బరువుగా లేపింది. విశాలమైన ఆ కళ్ళలో చూపులు మందగొడిగా ఉన్నాయి. నీరసంగా మూలిగి భర్తముఖంలోకి చూసింది. అతని ముఖం రక్తంతో తడిసి భయంకరంగా వుంది. కాని అతని చూపులు మందలోనుంచి తప్పిపోయిన గొర్రెపిల్ల చూపుల్లా బెదురుగా వున్నాయి.

వట్టి అమాయకుడు! డాక్టర్ను పిలవటానికికూడా తన అనుమతే కావాలి. అన్నీ తనే చెప్పాలి.

అంత బాధలోనూ వరూథిని పెదవులపైన చిరునగవుల జిలుగు వెలుగులు దోబూచులాడినై. భర్తమీద జాలి కలిగింది.

''బాగా లోతుగా తగిలిందేమో డాక్టరు దగ్గిరకెళ్ళి చూపించండి!''

ఓ క్షణకాలం వెంకటపతికి అర్థంకాలేదు. అయోమయంగా చూశాడు.

అర్థమయాక అన్నాడు -- ''అదేముందిలే! అదే పోద్దిలే!''

గాయం మీద చెయ్యిపెట్టి తడుముకొన్నాడు.

''కాదండీ! గాజు పెంకు దిగబడిందేమో?''

''పెంకా గింకా? అంచుతగిలి తెగ్గోసుకొందనుకొంటా! రేపటికదే పోద్ది! నీ కెట్టా వుందీ? డాక్టర్ను పిల్చుకురమ్మంటావా?''

''అవసరం లేదులెండి. ముందు మీరెళ్ళి గాయందగ్గర శుభ్రంగా కడుక్కురండి. ఆ బట్టలు కూడా మార్చుకోండి. నా డ్రెస్సింగ్ టేబుల్ మీద ఆయింట్‌మెంట్ వుంది. అది రాయండి.''

''ఆయింట్ మెంటా గీయింట్‌మెంటా? అదెందుకు? దండగ? అదే పోతది!'' వెంకటపతి లేచి వెళ్ళాడు.

వెంకటపతికి గాయం చన్నీళ్ళతో కడుగుతున్నప్పుడు తెలిసింది నొప్పి.

అద్దంలో చూసుకొంటూ ''ఏమో అనుకొన్నా! బాగానే తెగింది? గాజుపెంకు గాదూ? స్వరున కోసుకుపోయింది.'' అనుకొన్నాడు వెంకటపతి.

''అన్నం పెట్టుకు తినండి. ఆ పనిముండ కూడా లేకుండా పోయింది.''

''మరి నువ్వు తినవా?''

''ఓ పక్కన గుండె దడొచ్చి నేను చస్తుంటే అన్నం ఏం తింటాను?''

వెంకటపతి ముద్దాయిలా ముఖంపెట్టి భార్యకేసి చూశాడు.

మాట్లాడకుండా వంటగదిలోకి వెళ్ళాడు. పళ్ళెం, గిన్నెలమోతా వింటూ వరూథిని అనుకొంది.

పశువు! నువ్వు తినవా అని అడుగుతాడు. నువ్వు తింటేగాని వీల్లేదని అన్నాడా? మరొకసారి అడిగాడా? ఇదే రామనాథబాబయితే ఎట్లా బతిమాలేవాడు? తను కాఫీ తాగకపోతే తనూతాగనని భీష్మించుకు కూర్చునేవాడు. తను తింటే తినేవాడు. తను నవ్వితే నవ్వేవాడు. తను బాధపడితే సహించేవాడుకాదు. అలాంటి రామనాథబాబు తనకు దూరం అయాడు. ఆ షావుకారి కోడలు....ఆ శ్యామలాంబ కూడా దొంగముండే? కానరాని కూబి. తను లేందే బతకలేదన్నట్టు మాట్లాడే రామనాథబాబు ఎంత మారిపోయాడు? తనకెంత అన్యాయం చేశాడూ? తలచుకొని కుమిలి కుమిలి పోతున్న వరూథినికి వంటగదిలోనుంచి భర్త వెంకటపతి మాట విన్పించింది.

''పెరుగంతా వేసుకోనా? ఇంకెవరూ లేరుగా?''

వరూథినికి కటిక చీకట్లో, బురదలో కూరుకుపోయినట్లయిపోయింది. గుండెలు తరుక్కుపోతున్నాయి. కన్నీటితో చెంపలు తడిసిపోతున్నాయి.

వెంకటపతి పెరుగ్గిన్నె పళ్ళెంలో బోర్లించుకొని, అన్నం కలిపి పెద్ద పెద్ద

ముద్దలుచేసి ఆప్యాయంగా ఎగరేస్తూ చిదానందంలో మునిగిపోయాడు.

## 41

''విశాఖపట్నం ఎందుకూ!'' అడిగాడు వెంకటపతి అర్ధాంగిని.

''అక్కడ పిచ్చాసుపత్రి ఉందిగా?'' అంది వరూథిని చిరబురలాడుతూ.

''ఉంటే?'' నోరు వెళ్ళబెట్టాడు భర్త.

''నిన్ను చేర్పిద్దామని?'' అన్నది భార్య.

''నేనెందుకూ! నువ్వే చేరిపో!'' వెంకటపతి నవ్వాడు.

జన్మకో శివరాత్రిలా వస్తుంది నవ్వు వెంకటపతికి. శరీరంలో ఎక్కడో పుట్టిన ఆ నవ్వు పెదవుల మీద కొచ్చి చాలాసేపు అక్కడే ఉండిపోయింది. ఎప్పుడో గాని భర్తను నిండుకళ్ళతో చూడని వరూథిని కళ్ళు, భర్తమీదే నిలిచిపోయాయి. ముసిముసి నవ్వులు ఆపుకోలేకపోయింది.

''ఇట్లాంటి మొగుడితో కాపరం చేసేకంటే ఆ పిచ్చాసుపత్రిలో ఉండటమే హాయి.''

''నువ్వు మంచోళ్ళకే పిచ్చెక్కిస్తావు. పాపం ఆ పిచ్చోళ్ళేమాగుతారు నీ ముందు?'' వెంకటపతి పచ్చగడ్డి మొలిచిన గనెంమీద నడిచినంత హాయిగా అన్నాడు.

''ఇహ చాల్లే తెలివి! నిన్నటినుంచీ నేను మొత్తుకుంటుందేమిటి? డి.యస్.పి. గారితో మాట్లాడదామని గదూ?''

''విశాఖపట్నంలో వున్న పోలీసాయన ఇక్కడ కోర్టులో జరిగే వ్యాజ్యంలో మనకేం సాయం చెయ్యగలుగుతాడా అని?'' అనుమానాన్ని నాన్చి నాన్చి వెళ్ళగక్కాడు వెంకటపతి.

''మీకు తోచదు. చెప్తే తెలియదు. మీతో వచ్చిన చావే అది.''

''అన్నీ నీకే తెలుసు చెయ్! చెయ్!'' సణుక్కున్నాడు వెంకటపతి.

''అదిగాదండీ? ఆ శంకర్రావును లాయరుగా పెట్టింది ఆ డి.యస్.పి.గారేగా? ఇప్పుడీ శంకర్రావు చేస్తున్న దగాకోరు వ్యవహారం అంతా ఆయన్తో చేబితే, వచ్చి వీడి తాట వలుస్తాడు. వీడ్ని తీసేసి మరో లాయర్ను పెడ్తాడు. ఆయనయితే జడ్జీగారితో కూడా మాట్లాడగలడుగా?''

''మరే! అవున్లే! ఆ మాటా నిజమేలే. పెద్ద పెద్దవాళ్ళు. వాళ్ళుల్లో వాళ్ళకు మాత్రం తెలిసుండదా?'' సమాధానపడ్డాడు వెంకటపతి.

''అదేగా నే చెప్పటం? చూస్తూ చూస్తూ కేసు పాడుచేసుకొంటామా? ఆ శంకర్రావుకు వదిలేసి? మన చేతనయింది మనం చేసుకోవాలిగాని? లేచి రిక్షా పిల్చుకురండి. టైం అయిపోతోంది బండికి.'' వరూథిని చీరలు సర్దుకొని పెట్టె మూస్తూ అన్నది.

వెంకటపతి రిక్షా తెచ్చి ఇంటిముందు నిలబెట్టి లోపలకొచ్చాడు. వెంకటపతి, భార్య సూట్‌కేసు పట్టుకొని ''రా! రా! రిక్షా వచ్చింది'' అన్నాడు.

''ఏం? రిక్షావాడ్ని లోపలకు రమ్మనకపోయారూ పెట్టె మీరు మోయకపోతే?'' అన్నది వరూథిని భర్త వెనక నడుస్తూ.

''ఆఁ ఇదేం బరువంట? వడ్ల బస్తా విసిరేసేవాడ్నొకప్పుడు!'' పెట్టెను పైకీ కిందకూ ఊపుతూ దాని బరువును అంచనావేసుకొంటూ అన్నాడు వెంకటపతి.

''నీకంటే ఆ వడ్ల బస్తా నయం. ఎన్నాళ్ళయినా ఈ మనిషింతే! నా ఖర్మ! నారాత!'' అనుకొంది వరూథిని.

రిక్షా ఎక్కి కూర్చుని వరూథిని ''ఇల్లు తాళం పెట్టి ఊరిమీద తిరగొద్దు! ఇల్లు జాగ్రత్త! డబ్బు చూసివాడుకోండి. నేనొచ్చేసరికి నాలుగురోజులు పట్టొచ్చు'' అన్నది.

''ఆఁనువ్విచ్చింది ఒక్కరోజుకు రాదు. నాలుగురోజుల్దాకా ఎక్కడొస్తది?'' గొణిగాడు వెంకటపతి.

''అసలే డబ్బులేక చస్తుంటే నీ గొణుగుడేమిటి?'' వరూథిని పర్సులో నుంచి ఐదు రూపాయల నోటుతీసి భర్త చేతిలో విసిరింది.

''నువ్వు పోనియ్‌వోయ్? ఏమిటి సుతారం చూస్తున్నావ్! అవతల బండి అందదు.'' వరూథిని రిక్షావాడ్ని కసిరింది.

సెకండ్ క్లాసు కంపార్ట్‌మెంటులో సూట్‌కేసు సర్దుకుని కూర్చుంది వరూథిని.

ఎదురుగా కూర్చున్నాయెనెవరో తనకేసే చూస్తున్నాడు. ఎక్కడో చూసినట్టుంది. ముఖం కిటికీ వైపుకు తిప్పుకొని ఆలోచించసాగింది వరూథిని.

అతన్ని తను ఎక్కడ చూసింది? ఏమీ ఎరగనట్టే తిరిగి ఓర చూపులు చూసింది. పెట్టెలో వున్న చాలామంది మగవాళ్ళు తనకేసే చూస్తున్నట్లనిపించింది వరూథినికి. అంతటితో మొదట చూసిన అతన్ని గురించిన ఆలోచన ఆగిపోయింది.

బండి విశాఖపట్నం చేరుకునేసరికి ఆరుగంటలన్నా అవుతుంది. డి.యస్.పి. ఊళ్లో ఉంటాడా? కాంప్ కెళితే? ఆయన వచ్చేదాకా తను ఎక్కడ వుంటుంది? అదృష్టం బాగుండి సమయానికి ఆయన ఊళ్ళో ఉంటే సరేసరి? ఆయన ఇల్లెక్కడో? ఎవర్నడిగినా చెప్తారు! డి.యస్.పి.గారిల్లు తెలియకుండా ఉంటుందా? అసలు ఇంటికి వెళ్ళడం బాగుంటుందా? నేరుగా ఆఫీసుకే వెళ్తేసరి. అక్కడే మాట్లాడొచ్చు. రాత్రికి ఉంటే ఆ ఏర్పాట్లన్నీ ఆయనే చూసుకొంటారు. సంవత్సరం పైగా అయింది ఆయన్ని చూసి. కోర్టులో వ్యాజ్యం వేసిన పదిరోజులకే ఆయన బదిలీ అయిపోయాడు. ఇంతవరకూ మనిషి ఇటు వచ్చినట్టుగా కూడా లేదు. అక్కడికీ తను నాలుగుత్తరాలు రాసింది. కాని సమాధానం లేదు. విసుగెత్తి అతని ముఖం మళ్ళీ చూడకూడదనుకొంది. కాని ఇప్పుడు తను అతని దగ్గరకే వెళ్ళి సహాయాన్ని అర్థించాల్సి వచ్చింది. ఆ శంకర్రావు సరైనవాడై కేసు సవ్యంగా నడిపిస్తే ఇలా తను ఒకళ్ళను ప్రాధేయపడాల్సి వచ్చేదేకాదు. ఆ త్రాష్టుడు అలా

చేశాడు. అసలు ఇలాంటి లాయర్ను తన నెత్తిన ఎందుకు రుద్దినట్టు ఆ పోలీసాయన? వాళ్లిద్దరూ మహా స్నేహితుల్లా మాట్లాడేవాళ్ళు. ఇప్పుడు ఈ శంకర్రావు ఇలా చేస్తున్నాడంటే మరి ఆయన బాధ్యత తీసుకోవద్దూ? ఎవడికోసం? ఎలా తప్పించుకొంటాడో చూస్తా?

అసలిలాంటి లుచ్ఛాలాయర్ని ఎందుకు అప్పజెప్పాడో? ముఖం మీదే అడిగేస్తే సరి. అందుకేం జవాబు చెప్తాడో? తను ఎదురుపడి అడిగితే ఈ మాత్రం సహాయం చెయ్యడా? తప్పకుండా చేస్తాడు. తనతోపాటే వచ్చి శంకర్రావు అంతు తేల్చుకోడూ? తన దగ్గిర అన్యాయంగా గుంజిన డబ్బు తిప్పి ఇప్పించేస్తాడు. ఎవడి కోసం ఇస్తాడు? జడ్జీగారికి లంచం ఇవ్వాలని చెప్పి తన దగ్గిర డబ్బుతీసుకోవడం మోసంకాదా? అది పెద్ద నేరంకాదా? ఈ సంగతి డి.యస్.పి.గారు వింటే అసలు ఫోర్ ట్వంటీ క్రింద శంకర్రావును బుక్ చేయించడూ? ఇట్లాంటి విషయాల్లో ఆయన చాలా నిక్కచ్చి మనిషి. తను సొంతంగా ఇంటరెస్టు తీసుకొని ఇప్పించిన కేసులో శంకర్రావు ఇలా చేస్తే డి.యస్.పి. గారు ఒక్కనాటికీ ఊరుకోరు. అసలు అక్కడదాకా ఎందుకు? డి.యస్.పి. గారు వచ్చి నిలబడితే శంకర్రావుకు చెమట్లు పట్టవూ? డి.యస్.పి.గారు తనంటే ఎంత యిదిగా వుండేదీ ఆ శంకర్రావుగాడికి మాత్రం తెలియదా ఏం? వాడ్ని...వాడ్ని మాత్రం వదిలిపెడ్తారా? ఆ తొత్తుకొడుకు గుర్నాథంగాడ్ని చెట్టుకు కట్టించి తన్నడూ? వాడు వెధవపని చేసింది కాక తనను అల్లరి చేస్తాడా? ఆ ముసలినక్క కనకయ్యగాడ్నికూడా. ఆఁ వాడేం చేశాడ్లే? ఆయనకు తెలియకపోవచ్చు అసలు విషయం. వీడే....ఈ గుర్నాథంగాడే ముందుగానే ఎత్తువేసి మామతో అలా చెప్పి ఉంటాడు. కనకయ్య వచ్చి తనకు చెప్తే తను నమ్మి వాడి ఉచ్చులో పడ్తుందని! తనలాగే కనకయ్యకూడా నమ్మి ఉంటాడు. కనకయ్య కావాలని తనను మోసం చెయ్యలేడు. తను అన్నా, తన తండ్రి అన్నా ఆయన కెంత గౌరవం? ఎంత అభిమానం. తన మామ సాంబయ్యగారంటే కనకయ్యకు ఎక్కడలేని గురి. ఆయనంటే ప్రాణాలు విడుస్తాడు. తమ ఇళ్ళ దగ్గిర బతికినోడుగదా? ఆ మాత్రం విశ్వాసం ఉంది. ఎటొచ్చీ వీడే, ఈ గుర్నాథంగాడే రోగ్. నాలుగురాళ్ళు సంపాదించి నల్లకోటు వేసుకొని కోర్టుకు వెళుతుండేసరికి కళ్ళు నెత్తిమీదకొచ్చాయి. వాడి రక్తం కళ్ళజూడాల్సిందే.

వాడి పెళ్ళాం! ఆ చీమిడి ముక్కు దానికెంత పొగరు? నా ఇంటిముందు కసువు ఊడ్చింది. అంట్లగిన్నెలు తోమిన ముండ, లాయరు పెళ్ళా మయేసరికి వళ్ళు కొవ్వింది. ఆయన్ని ఎంతెంత మాటలంది? అమాయకుడు, ఆయన కాబట్టి ఊరుకొన్నాడు. మరొకడైతేనా?

రెండోలైనుమీద ఎక్స్‌ప్రెస్ శరవేగంగా పోతూంది. వరూథిని చెవులు దిబ్బెళ్ళు పడిపోయినయ్. దాటిపోతున్న రైలుపెట్టెలు అలుక్కుపోయినట్లు కన్పించాయి. మళ్ళీ పొలాలూ, మధ్య మధ్య చెట్ల గుబుర్లూ దూరంగా ఇళ్ళూ కన్పించసాగాయి. వరూథిని మనసులో ఆలోచనలు మళ్ళీ పరుగు లంకించుకున్నాయి.

చెప్పిందంతా అబద్ధమేనా? కోర్టులో సరిగా వాదించటం లేదన్నాడు? అవతల పార్టీవాళ్ల దగ్గిర డబ్బు తీసుకొన్నాడన్నాడు. ఇవన్నీ అబద్ధాలా? అయితే శంకర్రావు కేసు బాగానే చేస్తున్నాడా? తనెంత తెలివితక్కువ మొహం? అలా ఎలా నమ్మింది? అనవసరంగా శంకర్రావుతో పేచీ పడింది. లేకపోతే దివ్యంగా కేసుచేసేవాడు. జడ్జీగారు ఆయనకు బంధువు. పైగా డబ్బు ఆశకూడా పెట్టాడు. శంకర్రావు తప్పకుండా వ్యాజ్యం గెలిపించేవాడు. తను చేజేతులా చెడగొట్టుకొన్నదా?

వరూథిని మెదడు కుంచించుకుపోయింది. గుండె గొంతులోకి వచ్చి పడుతున్నట్టుగా అయిపోయింది.

బండి రాజమండ్రి స్టేషన్‌లో ఆగింది. వరూథిని కెదురుగా కూర్చున్న పెద్దమనిషి దిగుతూ ఆమెకేసి అదోలా చూసి దిగిపోయాడు. ఎడంగా కూర్చున్న స్టూడెంటొకడు జరిగి ఆపసోపాలుపడ్తూ ఖాళీ అయిన జాగాలో వయ్యారంగా జారిగిలపడ్డాడు. కిటికీలోనుంచి బయిటికి చూసే నెపంతో ఆమెమీదకు వంగి కాసేపలానే నిలబడి మళ్ళీ తన చోట్లో కూర్చుంటూ గట్టిగా నిట్టూర్చాడు. వరూథిని పక్కకు జారిన పైటను సర్దుకొంది. వీడికేం పొయ్యేకాలం? నిండా పద్దెనిమిదేళ్ళులేవు చూస్తే! వీడు విశాఖపట్నం వరకూ వస్తాడు కాబోలు. ఖర్మ! అక్కడ వీడు చదివిచచ్చేదేమిటో? వరూథినికి కొడుకు రవి జ్ఞాపకం వచ్చాడు.

బాబు ఎలా వున్నాడో ఏమో? ఈ గొడవల్లోపడి వాడి ఉత్తరానికి జవాబు కూడా రాయలేదు. ముద్దుముద్దుగా ఎంత బాగా రాస్తున్నాడో? చక్కని వ్రాత. ఎంత మంచి ఇంగ్లీషు రాస్తున్నాడు! తనకే కొన్ని మాటలు తెలియటంలేదు. ఆ స్కూలు కాబట్టి వాడు అంత త్వరగా పైకి వస్తున్నాడు. లేకపోతే వాడు యిదుగో ఈ పోలాయిలాగే తయారవుతాడు. తను చాలా మంచిపని చేసింది. రామనాథబాబు కూడా ఆ విషయంలో ఎంతో చేయూతనిచ్చాడు.

బండి నిడదవోలులో ఆగటం వరూథిని గమనించలేదు. ఇద్దరమ్మాయిలు, ఒక ముసలమ్మతో, కంపార్ట్‌మెంటులోకి ఎక్కి కూర్చున్నారు. ఆ ఆడపిల్లల్ని చూస్తే చదువుకొంటున్న వాళ్ళలాగే వున్నారు. పైటలు భుజాలు దిగటంలేదు. క్షణంక్షణం పైటలు సర్దుకొంటూ వారపత్రికలు చదువుతున్నారు. మధ్య మధ్య తలెత్తి దిక్కులు చూస్తున్నారు. వాళ్ళిద్దరూ ఏదో మాట్లాడుకొంటూ వచ్చీరాని నవ్వులు నవ్వుతున్నారు. రాని నవ్వును తెచ్చుకొంటున్నట్టుగానూ, వచ్చే నవ్వును ఆపుకొంటున్నట్టుగానూ, వాళ్ళముఖాలు చూస్తున్న వరూథినికి అనిపించింది.

వరూథిని ఎదురు సీట్లోకి చూసి ''హమ్మయ్య! పీడా విరగడయింది!'' అనుకొంది. ఆ కుర్రాడు తన చోటు ముసలమ్మ కిచ్చి ఆ పిల్లలకెదురుగా పోయి నిలబడ్డాడు. వాడు ఇక తనకేసి చూడడు. ఇంకెందుకు చూస్తాడూ? అక్కడ చట్కారీ పిల్లలు దొరికారుగా? నిట్టూర్చింది వరూథిని.

వాడిప్పుడు తనవైపు చూడకపోతేనేం? ఛీ! ఛీ! ఏమిటి తనకు ఇలాంటి ఆలోచనలు?

''అవును! ఎవర్ని గురించీ తను ఆలోచిస్తోంది ఇంతవరకు? మధ్యలో వీళ్లగొడవతో తన ఆలోచన తెగిపోయింది''

వరూథిని మళ్ళీ తెగిపోయిన ఆలోచనల్ని అతకటానికి ప్రయత్నించసాగింది.

రామనాథబాబు గురించేనా? కాదే అసలు రామనాథబాబువల్లే గదా ఇంత అన్యాయం జరిగింది. ఏ గొడవాలేకుండా హాయిగా బతుకుతున్నదాన్ని ఇన్ని కష్టాలపాలు చేశాడు. తనను అన్యాయంచేసి అతను బాగుపడతాడా? అనుభవిస్తాడు. నమ్మిన మనిషికి ద్రోహం చేసినవాడు ఒక్కనాటికీ బాగుపడడు. అతని సంగతి కాదే తను ఆలోచిస్తోంది? ఆ గుర్నాథం గాడా? ఛ! ఛ! వాడ్ని తల్చుకొంటే తన వళ్ళు జలదరించిపోతోంది. మరెవరూ? ఆయన్ను గురించా? అయ్యో ఖర్మ! ఆయన్ను గురించి ఆలోచించడానికి కూడా ఏమన్నా ఉందా? ఉంటే తనకు కావాల్సిందేముంది? అసలు భర్త సమర్ధుడయితే తన కిన్ని తిప్పలెందుకు? ఆ శంకర్రావుగాడ్ని అలా ఆడనిచ్చేవాడా?

ఆ గుర్తొచ్చింది. శంకర్రావు గురించే తను అనుకొంటూ వున్నది. అతని విషయంలో తను పొరపాటు పడలేదు. ఆరోజు తను వెళ్ళినప్పుడు ఎలా మాట్లాడాడు? దులపరించుకుపోయాడు. అసలు ఈ కేసు ఒప్పుకోవటమే బుద్ధి తక్కువయిందని అనలా? దొంగ రాస్కెల్. శ్యామలాంబదగ్గర బాగా తిని, చివరకు ఇట్లా అడ్డం తిరిగాడు. అటూ ఇటూ తిన్నాడు. ఆరోజు తనే అన్నాడుగా? ఏభైవేలవరకూ శ్యామలాంబ ఇవ్వడానికి సిద్ధంగా ఉందని? ఇంకేం? ఇచ్చే ఉంటుంది? అందులో కొంత జడ్జీకిచ్చి, మిగతాదీ, తన దగ్గిర గుంజిందీ తను మింగేసి వుంటాడు. అన్నట్టు తనెంత పిచ్చి మొద్దు? తనుండగానేగా రామనాథబాబు శంకర్రావు దగ్గిర కొచ్చాడు? ఎంత నాటకం ఆడాడు? తనకేమీ పట్టనట్టు ఎంత తెలివిగా మాట్లాడాడు? రెండోనాడు రాత్రి రమ్మన్నాడు శంకర్రావు. అంటే రామనాథబాబు అప్పుడే డబ్బు తెచ్చి ఉండాలి. తనను చూసి అలా తప్పుకొన్నాడు. శంకర్రావు ఆశించినంత తను ఎప్పుడైతే ఇచ్చుకోలేకపోయిందో అప్పుడే అటు తిరిగిపోయాడు. తన దగ్గర వున్నదేదో ఇచ్చింది. ఇంకా తనెక్కడ తెస్తుంది ఏభైవేలు ఉన్న ఆస్తంతా ఆ హోలుకిందే తగలబడింది. బంగారంవంటి పొలాలను అయిన కాడికమ్మి ఆ రామనాథబాబు చేతుల్లోనే పోసింది. ఎంత ఆస్తి? కోర్టులో తను ఓడిపోతే? కట్టుబట్టలతో నడివీధిలో తను-

వరూథిని కళ్ళు నిండాయి. చెంపలమీదుగా కన్నీరు కారిపోతూంది. వాన జల్లు వీచి వీచి కొడ్తూంది. తల,మొహం అంతా తడిసిపోయింది.

''ఏమండోయ్! కిటికీ అద్దం వేయండి. జల్లు లోపలకొస్తోంది.''

ఎదురు సీట్లోనుంచి ఎవరో అన్నారు. వరూథిని కిటికీ అద్దం దించటానికి ప్రయత్నించింది. ఎంత గుంజినా కిందకు రావటంలేదు. అంతదూరంలో ఉన్న కుర్రాడు వచ్చి ఆమె మీదుగా చేతులు పెట్టి అద్దం దించాడు. ఆమె చెయ్యి అతనికి ఆనింది. దివ్యానుభూతి పొందినవాడిలా అయిపోయాడు.

‘‘అయ్యో! బాగా తడిసిపోయారే?’’ అన్నాడు కుర్రాడు.

ఇద్దరమ్మాయిలూ తనకేసి ఈర్ష్యగా చూస్తున్నట్టనిపించింది వరూథినికి.

వరూథిని పైట చెంగుతో ముఖం తుడుచుకొంది. ముఖం అద్దానికి ఆనించి బయటకు చూడసాగింది. అద్దం మీద నీటి బిందువులు జారిపోతున్నాయి. అద్దం మసక మసకగా అయిపోయింది. దూరంగా చెట్లూ, కొండలూ మసక మసగ్గా కన్పించి గుండ్రంగా తిరిగిపోతున్నాయి. వరూథిని గుండెల్లో గుబులు ముసురుకొంది. ఉరుములూ మెరుపులూ...గత జీవిత స్మృతులు; మెరుపుల్లా వచ్చిపోతున్నాయి! భవిష్యత్తంతా పిడుగుల వర్షం?

తనేమయిపోతుంది? తన బిడ్డ రవి ఏమైపోతాడు? తల రంపాలతో కోసి వేస్తున్నట్టుగా వుంది. పిచ్చి పిచ్చి ఊహలు బుర్రలో ముసురుకొంటున్నాయి. విశాఖపట్నం. పిచ్చాసుపత్రి. ఆయనేమన్నాడూ? తనను పిచ్చాసుపత్రిలో చేరమన్నాడు. కాదు తను చేరితే పిచ్చివాళ్ళకే పిచ్చి ఎక్కిస్తుందన్నాడు. పిచ్చివాళ్ళకు పిచ్చేమిటి? ఆ మనిషి పిచ్చికాకపోతే! తన భర్తకు పిచ్చా! ఆయనకు పిచ్చెక్కించింది తనేనా? తనకు పిచ్చి లేకపోతే మరొకళ్ళకు పిచ్చి ఎలా ఎక్కిస్తుంది?

వరూథిని కళ్ళు తెరిచి చూసింది. వర్షం ఆగిపోయింది. బయిట తెల్లని ఎండ పచ్చని చేలమీద మెరుస్తోంది. అందరూ కిటికీలు తెరిచారు. వరూథిని దించిన అద్దం అలాగే వుంది.

అద్దం పైకెత్తింది. బండి బాదంపూడి ప్లాట్‌ఫారంమీద కొచ్చేసింది. వరూథిని వాచీ చూసుకొంది. నాలుగూ ఇరవైఅయింది. ఇంత లేటుగా నడుస్తుందేం? ‘‘ఏవండీ? కాఫీ తీసుకోరా?’’ కాలరు సర్దుకొని తల దువ్వుకొంటూ అడిగాడు స్టూడెంటు కుర్రాడు.

ఎవర్ని ఉద్దేశించి అడిగాడు? అసలు అడిగిందెవర్ని? తననా? లేక ఆ అమ్మాయిల్నా? వరూథిని తనను కానట్టే కిటికీలో నుంచి బయటకు చూస్తూ కూర్చుంది.

ఆరూ పదిహేను నిముషాల తర్వాత బండి సామర్లకోట స్టేషన్ వదిలింది. బండి వేగంతో పాటు ఆమె ఆలోచనలూ వేగాని అందుకొన్నాయి. మరో రెండు గంటల్లో విశాఖపట్నం వచ్చేస్తుంది. డి.యస్.పి. గారు ఊళ్ళో ఉన్నాడో లేడో? తనను చూసి ఆశ్చర్యపోతాడు. తనకు జరిగిన అన్యాయానికి బాధపడతాడు. తనకు తప్పకుండా సహాయం చేస్తాడు. తను కేసు గెలుస్తుంది. మళ్ళీ హాలు స్వాధీనం చేసుకొంటుంది. హాల్లో శ్యామలాంబ కాలు పెట్టిన చోటల్లా ఫినాయిల్ వేసి కడిగిస్తుంది. ఆ శివరాంగాడ్ని ముందు పీకేయాలి. అసలందర్నీ మార్చేయాలి. వాళ్ళ మేనేజ్‌మెంటులో తీసేసిన వాళ్ళందర్నీ మళ్ళీ తీసుకోవాలి. మళ్ళీ తన జీవితం విరిసిన మల్లెపందిరి అవుతుంది.

ఆకాశంలో ఇంద్రధనస్సు రంగుల రేఖలు వొంగి వొంగి చూస్తున్నాయి. వరూథిని దృష్టి రంగుల కలయికమీద లగ్నమైంది. చూస్తుండగానే రూపురేఖలు

దిద్దుకొని హరివిల్లు విరిసింది. దృఢంగా ఆకాశాన్ని ఆవరించింది. భూమిని చుంబిస్తోంది. వరూథిని హృదయాన్ని దివ్యలోకాల్లోకి విసిరేసుకొంది. ఆమె కళ్ళల్లో ఆశాజ్యోతులు వెలుగుతున్నాయి. హరివిల్లుకింద ఆజానుబాహులతో గంభీరమైన చూపులతో కన్పిస్తున్నాడు...ఆనాడు ఇంటిముందు కారుపక్కగా నిలబడి తన హృదయాన్ని కలవరపరచిన ఆ మనిషి...డి.యస్.పి. మోహన్‌రావు.

బండి వైజాగ్ స్టేషన్లోకి వచ్చి ఆగింది. రెండుగంటలకు పైగా లేటు. ఆరున్నరకు రావల్సింది ఎనిమిదిన్నర దాటింది. స్టేషన్‌లో వెలుగుతున్న ట్యూబులైట్లకాంతి వరూథిని గుండెల్లోని చీకటిని ఇనుమడింప చేస్తోంది.

ఇంత పొద్దుపోయి ఎలా ఆయన్ను కలుసుకోవటం? ఆఫీసులో ఉండడు. ఇంటికిపోతే? బాగుండదు. తనెలా వెళ్తుంది? ఆయన భార్య ఎప్పుడో ఒకసారి క్లబ్బులో నలుగురుముందూ తనను తిట్టినట్టుకూడా విన్నది. ఆవిడ తనను చూస్తే ఇంకేమన్నా ఉందా? అసలు ఆయన ఆవిడకు దడిసే ఉత్తరాలు కూడా రాయలేదు. తను రాసిన ఉత్తరాలు దొంగతనంగా చదివిందేమో? కొత్తకొత్త అనుమానాలూ, భయాలూ వరూథిని మనసులో మెదిలాయి.

''అమ్మగార్దది! ముందే నే నడిగా?'' లైసెన్స్‌కూలీ చేతులో నుంచి సూట్‌కేసు లాక్కుంటూ, రెండోచేత్తో మరొకడ్ని తోసేస్తూ పోట్లాడుతున్నాడు.

కూలీ నిస్సహాయంగా వరూథినికేసి చూశాడు. ఆమె అంతకంటే అయోమయంగా చూసింది కూలీకేసి.

''అమ్మగార్ని ముందు నే చూశా! వదులహ! పెట్టె!'' రెండో రిక్షావాడు పెట్టి గుంజుతున్నాడు.

''ఏమిటీ న్యూసెన్స్! ముందు పెట్టె అక్కడ పెట్టండి!'' ఇద్దర్నీ కసిరి కూలివాడికి డబ్బులిచ్చి పంపేసింది. పెట్టె అందుకొని పక్కగా వెళ్ళి నిలబడింది.

''ఒరేయ్! అమ్మగారికి కారొస్తుందేమోరా! ఉట్టినే తన్నుకొంటున్నాం!''

''అయ్యా! అయ్యా! రిక్షా!'' మరొక ఆసామీ కేసి పరుగెత్తాడు రిక్షావాడు. వాడివెనకే రెండోవాడూ పరుగుతీశాడు.

తను ఇంతవరకూ విశాఖపట్నం చూడలేదు. ఇదే మొదటిసారి! తెలిసినవాళ్ళు కూడా ఎవరూ లేరు. ఎవరన్నా ఉన్నా వాళ్ళెక్కడ వున్నట్టు తనకు తెలియదు. ఇక్కడ మంచి హోటల్ ఏదో?

''అమ్మాయిగారూ! ఎక్కడకు పోతారూ?'' వయసుమళ్ళిన రిక్షావాడు మీసాలకింద పళ్ళు బయటేస్తూ అడిగాడు. వాడికేసి చూసిందామె.

''అమ్మాయిగారూ!'' చాలా మంచివాడులా వున్నాడనుకొంది! వాడన్నమాట గుర్తు చేసుకొని ముడతలుపడ్డ అతడి నొసలు చూస్తూ వరూథిని.

''దగ్గర్లో మంచి హోటలేదుందయ్యా?''

''మంచి హోటలా?'' అంటూ వరూథినికేసి చూస్తున్నవాడు తల వంచుకొని ఆలోచించసాగాడు రిక్షావాడు.

''దూరంలో అయితే వుందమ్మా మంచి లాడ్జింగ్!''

''మంచి హోటలేనా?'' నొక్కి అడిగింది.

''అమ్మోరమ హోటేలుకంటే మంచిది యీ టౌను మొత్తంలో లేదమ్మాయి గారూ!''

''ఎంతివ్వమంటావు?''

''తమ దయ.''

''ముప్పావలా ఇప్పించండి.''

వరూథిని పెట్టె అందించింది.

''మంచి గదులు - ఖాళీ దొరుకుతాయా?'' అడిగింది.

''ఓ మస్తుగా! చాలా పెద్దదిగదమ్మా అమ్మోరమహోటేలూ?''

''అమ్మోరమ ఏంటయ్యా?'' రిక్షాలో కాలుపెట్టబోతూ ఆగి అడిగింది వరూథిని.

''అదేనమ్మాయిగారూ! అనోరమ్మో పనోరమ్మో అంటారు. నాబోటివాళ్ళు అట్టానే అంటారు నోరుతిరక్క.'' సీటు తుడుస్తూ అన్నాడు రిక్షావాడు.

''ఏవిటో అడివిమేళాం! ఇంతకీ హోటల్ మంచిదేగా?'' రిక్షాలో కూర్చుంటూ అన్నది వరూథిని.

''క్లాసమ్మా క్లాసూ! క్లాసోళ్ళంతా ఆడనే దిగుతారు. తవరంటోళ్ళేనమ్మా అంతా ఆడ! దొరసాన్లూ...దొరలేనమ్మా! ఉన్నోళ్ళుతప్ప లేనోళ్ళు బరించలేరమ్మా ఆడ!'' గంటకొడుతూ ముందుకువంగి రిక్షా తోసుకొంటూ పోతూ అన్నాడు.

రిక్షా హోటల్ ముందు ఆగింది.

''ఇదేనమ్మా!'' పెట్టె భుజాన పెట్టుకొంటూ అన్నాడు రిక్షావాడు.

''అప్పుడే వచ్చేసింది? దూరం అన్నావ్?'' అన్నది వరూథిని రిక్షాదిగి.

ఓ పావలా ఎక్కువ అడగటంకోసం ముసలాడు అబద్ధం ఆడేశాడు.

వరూథిని హోటల్‌కు చేరుకొనేసరికి తొమ్మిది దాటింది.

రిసెప్షన్ కౌంటర్ దగ్గర పెట్టెదించి నిలబడ్డాడు రిక్షావాడు..

వాడికి డబ్బులిచ్చి రిసెప్షన్ బల్లదగ్గిర కొచ్చింది వరూథిని.

''సింగిలా? డబలా సార్?'' అన్నాడు కౌంటరు దగ్గరున్నవాడు బోర్డులో ఖాళీ నంబర్లు వెతుక్కుంటూ.

''ఏమిటోయ్ అది? పదమూడో నంబరు కార్నరు గదియ్యి వారికి.'' వరూథిని వెనకనుంచి వచ్చాయి ఆ మాటలు.

వరూథిని తిరిగి చూసింది. మల్లెపువ్వులాంటి గ్లాస్కోపంచా, ఖాదీ సిల్కులాల్చీ వేసుకొన్న ప్రొప్రయిటరు చిరునవ్వుతోనే పలకరించాడు వరూథిన్ని. కొద్దిగా వంచిన తలమీద ట్యూబ్‌లైటు కాంతి తళుక్కున మెరిసింది.

''రేయ్! సామాను తీసుకెళ్ళి పదమూడో నంబరు గదిలో పెట్టు!'' హోటలు కుర్రాడికి విసురుగా చెప్పి ''మీరు పదండమ్మా'' వరూథిన్ని చూసి మృదువుగా అన్నాడు హోటల్ ప్రొప్రయిటర్.

కౌంటరు అసిస్టెంటు లాడ్జింగ్ రిజిష్టరు తెరిచి బాల్ పెన్సిల్ వరూథినికిస్తూ ''ఇక్కడ పేరు...ఇక్కడ...'' అంటూ చెప్పసాగాడు.

''ఏమిటోయ్! నీకేమన్నా తలకాయుందా? మీరు పదండీ! తర్వాత రాయొచ్చు. రిజిష్టరు గదిలోకి పంపించు.''

కౌంటరు అసిస్టెంట్ గుండుదెబ్బ తగిలినవాడిలా అయిపోయాడు. రిజిష్టరు మూసి అవతల పెట్టి ''రండమ్మా!'' అతివినయంగా కౌంటరు దాటి బయటికి వచ్చి తలవంచుకొని పదమూడో నెంబరు గదికేసి దారితీశాడు.

హోటలు గదిలో కాలు పెట్టిన వరూథిని గాబరాపడింది! విశాలమైన గది. రెండు మంచాలు. డన్‌లప్ బెడ్స్. అటాచెడ్ బాత్, చిన్న డ్రాయింగ్ రూం. అందులో సోఫాసెట్టూ. రెండుచోట్లా ఫాన్లూ. డ్రాయింగ్‌రూం బెడ్‌రూం మధ్య కర్టెన్. అంతా హంగామాగా ఉంది.

ఎంత చార్జీ చేస్తారో? ఇంత పెద్ద రూం తనకెందుకూ? ఏమిటో ప్రొప్రయిటర్ ఇలా చేశాడు? తనను చూసి ఏ మహారాణీయో అనుకొన్నట్టున్నాడు. ఎంత గౌరవం చూపించాడు? అవునూ? ఆయన్నెక్కడో చూసినట్టుందే? ఎక్కడా? చెప్మా?

ప్రొప్రయిటర్ ముఖం గుర్తుచేసుకోవటానికి ప్రయత్నించింది. అవును! చూసినవాడే? అతను తనను గుర్తుపట్టి ఉండాలి. తనెవరో తెలిసుండాలి. లేకపోతే అంత మర్యాద ఎందుకు చూపిస్తాడూ? తన దగ్గర సింగిల్ రూం చార్జీయే తీసుకొంటాడేమో? అసలు డబ్బే పుచ్చుకోడేమో? ఛ! అదేమిటీ? తను ఊరుకుంటుందా? వద్దన్నా బలవంతాన డబ్బు ఇచ్చేస్తుంది. అసలీయన్ను ఎక్కడ చూసింది? హైదరాబాదులో చూసిందా? సినిమా డిస్ట్రిబ్యూషన్‌లో లోగడ ఉన్నాడేమో? హాలు ఓపెనింగ్ అప్పుడు చాలా పెద్దపెద్దవాళ్ళొచ్చారు. అందులో వున్నాడేమో? రామనాథబాబుకు ఏమన్నా బంధువో, స్నేహితుడో ఏమో? అసలు తనకు తట్టనేలేదు ఇంతవరకు. తను డి.యస్.పి. తాలూకు అని ప్రొప్రయిటర్‌కు తెలుసునేమో? అసలాయన మన ప్రాంతంవాడిలాగే వున్నాడు. ఆ మాటా ఆ తీరూను.

వరూథిని స్నానం చేసింది. గదిలోకే భోజనం తెప్పించుకొని తిన్నది. హోటల్ కుర్రాళ్ళు ఎదురెదురుగా వచ్చి హాజరవుతున్నారు. చాలారోజుల తర్వాత ఏదో విముక్తి దొరికినట్టుగా ఉంది.

ప్రయాణపు బడలికలో వున్న వరూథినికి పక్కమీద మేను వాల్చగానే నిద్ర ముంచుకొస్తూంది.

ఉదయాన్నే ఆయనకు కబురు చెయ్యొచ్చు. ప్రొప్రయిటరుగారికి చెప్తే ఆయనే కబురు పంపిస్తాడు. ఎందుకూ? తనే ఫోన్ చెయ్యొచ్చు.

డి.యస్.పి. గురించిన ఊహాచిత్రాలు మరుగైపోతూండగా వరూథిని నిద్రలోకి జారిపోయింది.

# 42

''వీళ్ళేనా? అన్ని గదులూ వెతికారా?'' సర్కిల్ ఇన్స్‌పెక్టర్ని చూసి అడిగాడు డి.యస్.పి.

''ఎస్సార్! ఎస్సై ఏడీ?'' అంటూ సి.ఐ. హెడ్డు కేసి తిరిగాడు.

''వస్తున్నారు సార్?'' హెడ్ యస్సైకోసం పరుగుతీశాడు.

''ఎన్నాళ్ళుగా సాగుతోంది ఇది?'' సి.ఐ.ని చూసి అన్నాడు డి.యస్.పి.

''ఈ మధ్యనే మొదలు పెట్టారు సార్! మొదట్లో డీసెంటుగానే నడిపారు.'' బిక్కమొహం వేసి అన్నాడు సి.ఐ.

డి.యస్.పి. మోహన్‌రావు ముఖం చిట్లించాడు.

''ఎస్సార్!'' అన్నాడు సి.ఐ. తన అధికారి మనోభావాలను చదవడానికి ప్రయత్నిస్తూ.

డి.యస్.పి. గోడవారగా వున్న ఆరుగురు ఆడవాళ్ళకేసి ఎగాదిగా చూశాడు.

''స్టైలు చూడండి! ఒక్కొక్కళ్ళు ఎలా ఉన్నారో?'' సి.ఐ. అన్నాడు.

పోలీసుల మధ్య నిలబడివున్న వాళ్ళలో ఒకతె నవ్వింది. ఇద్దరు తలలొంచుకొన్నారు. మిగతా ముగ్గురూ ఏ భావమూ లేకుండా డి.యస్.పి. కేసి చూస్తూ నిలబడ్డారు.

''వీళ్ళను చూస్తుంటే వీళ్ళ వయసుకూడా తెలియడంలేదే?'' పెదవి విరిచాడు డి.యస్.పి.

''అంతా మేకప్‌సార్. కాలేజీ గరల్స్‌లా, సినిమాస్టార్సులా ఉంటారు సార్ వీళ్ళు! లైట్ వెలుతుర్లో అసలు సరుకు తెలియదు. తెల్లార్తే లొటారం బయటపడ్తది!''

''ఇమ్మోరల్ ట్రాఫిక్ పెరిగిపోయిందయ్యా మన టౌన్లో.'' కాస్త ఆగిమళ్ళీ అన్నాడు ''మన టౌను అనే ఏముందిగాని స్టేట్ అంతా అట్లాగే ఏడ్చింది.''

''అవునుసార్! పెద్దపెద్ద కుటుంబాలనుంచే వస్తున్నారు కొంతమంది. ఈ మధ్య ఫామిలీ గరల్స్ కూడా దిగిపోతున్నారు సార్!''

''వీళ్ళేనా వుంది? ప్రొప్రయిటర్ని కూడా స్టేషన్‌కు పట్టుకురండి.'' డి.యస్.పి. చేతిబెత్తం తిప్పుకొంటూ కదిలాడు.

నడవాలో నుంచి యస్సై రొప్పుకొంటూ వచ్చి డి.యస్.పి. ముందు నిలబడ్డాడు.

''సార్...ఆ కార్నర్ గదిలో...ఇంకొక...ఉంది...సార్!'' అది అనాలో ఆమె అనాలో తట్టక వదిలేశాడు.

డి.యస్.పి. ఆగి యస్సైకేసి ఉరిమి చూశాడు.

''వాటార్యూ టాకింగ్? వై డోంట్ యూ బ్రింగ్ హర్?''

''హైక్లాసుగా మాట్లాడుతోంది సార్!''

''మాట్లాడితే వదిలేసి వచ్చావా? వాట్ ఏ స్టుపిడ్ యూ ఆర్?''

''చాలా ఇన్‌ఫ్లుయన్స్ ఉన్న మనిషిలా ఉంది సార్?''

''ఇన్ఫ్లుయన్స్! ఇన్ఫ్లుయన్స్! రంకుతనానికి కూడా రికమండేషనా? ఏ మినిష్టరు దగ్గర్నుంచి తెప్పించిందటా?''

''నా ఉద్యోగం పీకేయిస్తుందట. మహా పొగరుగా మాట్లాడుతోంది సార్!'' నీళ్ళు నమిలినట్టు అన్నాడు యస్సై.

''ఛప్! ముందా లంజను జుట్టుపట్టుకొని లాక్కురండి. సి.ఐ. నువ్వెళ్ళు.'' డి.యస్.పి. గర్జించాడు.

సి.ఐ.వెనకే యస్సై నడిచాడు.

డి.యస్.పి. ఏమీ తోచక ఒకళ్ళనొకళ్ళు ఒరుసుకొని నిలబడ్డ వాళ్ళకేసి చూడసాగాడు.

''ఏయ్! నిన్నే? నీ పేరూ?''

''సావిత్రి!'' గొంతు పెకలించుకొని చెప్పింది.

''ఊరూ?''

''బెజవాడదగ్గర.''

''ఏమ్మాత్రం సంపాదిస్తావ్?''

''సావిత్రి మాట్లాడలేదు.''

''మాట్లాడవేం?'' డి.యస్.పి. గర్జించాడు. చేతిలో బెత్తం గాల్లో గుండ్రంగా తిరిగింది.

''గది అద్దే, ఖర్చులూ పోను ఎక్కువేం మిగల్దు!'' సావిత్రి పక్కన నిలబడ్డ అమ్మాయి చెప్పింది.

''నీ పేరేంటి?''

''అనసూయ. మాది రాజమండ్రి?''

''నువ్వో?'' మూడో ఆమెకేసి చూశాడు.

''చంద్రమతి. నెల్లూరు!''

''నా పేరు దమయంతి. ఏలూరు.'' అడగందే చెప్పింది యాంత్రికంగా దమయంతి.

''సావిత్రి! అనసూయ! చంద్రమతి! దమయంతి! మీకేం రోగం వచ్చిందే ముండల్లారా? అంతా పతివ్రతలపేర్లు పెట్టుకొన్నారు?''

''మేం పెట్టుకొన్నామేంటి? మా అయ్యా అమ్మా పెట్టుకొన్నారు.'' సాగదీసింది సరస్వతి. డి.యస్.పి. కేసి చూసి కిసుక్కున నవ్వింది.

''అమ్మా! నీ యమ్మ...పెద్ద కిలాడీలా గున్నావే? ఏ ఊరూ?''

''కాకినాడ!''

''ఏయ్! నువ్వేమిటి? అసలు మాట్లాడవేం?'' ఆరోదానికేసి చూస్తూ అన్నాడు డి.యస్.పి.

ఆ అమ్మాయి అందరికంటే చిన్నదిగా వుంది. పద్దెనిమిదేళ్ళకంటే దాటినట్టు లేవు. ముడుచుకుపోయి ముఖం గోడవైపుకు తిప్పుకొని నిలబడింది.

''ఏం? నంగనాచీ? మాట్లాడవేం?'' బెదిరిస్తున్నట్టు అన్నాడు డి.యస్.పి.

కుళ్ళి కుళ్ళి ఏడవసాగింది. ముక్కులు చీదుకొని మళ్ళీ బావురుమంది.

''లక్ష్మీ ప్రసూనాంబ. పాపం కొత్త! మొన్ననే వచ్చింది. బందరుదగ్గిర వాళ్ళ ఊరు,'' బెజవాడ సావిత్రి సర్ది చెప్పింది.

''ఎక్కడోయ్ అదీ!'' తనను సమీపిస్తున్న సి.ఐ.ని ఉద్దేశించి అడిగాడు డి.యస్.పి.

''ఆవిడా...?'' ఆగిపోయాడు సి.ఐ.

''పతివ్రతనంటుందా?'' వెటకారంగా అన్నాడు డి.యస్.పి.

''కాదు. సార్!''

''ఏమిటి కాదు? నీ కేమిటి అభ్యంతరం? నీ బంధువా? పాత కాతా? ఆ? ఏం?''

''నాకేమీ కాదు సార్! మీ బంధువేనంట!'' అని సి.ఐ. గాలి బిగబట్టి ఆఫీసరుకేసి చూశాడు.

''రాట్! ఎవతోయ్ అదీ? జుట్టు పట్టుకొని లాక్కురండి!'' వళ్ళు తెలియని కోపంతో అన్నాడు డి.యస్.పి.

''మీ తాలూకు మనిషినని చెప్తుంది సార్! మా డి.యస్.పి. గారితో చెప్పి మీ అంతు తేలుస్తానని బెదిరిస్తోంది సార్!'' యస్సై అదును చూసుకొని అన్నాడు.

డి.యస్.పి.కి అవమానంతో వళ్ళు దహించుకుపోసాగింది.

''ఎక్కడా? ఏగదిలో?'' డి.యస్.పి. నేలను బూట్లతో తంతూ ముందుకు నడిచాడు.

''పదమూడో నంబరు గది. ఇటు సార్. హోటల్ రిజిష్టర్లో పేరులేదు. మహ తల బిరుసుగా మాట్లాడుతోంది.'' డి.యస్.పి. వెనకే నడుస్తూ చెబుతున్నాడు సి.ఐ.

డి.యస్.పి. బూటు శబ్దం చేసుకొంటూ గది ముందు కొచ్చి తలుపులు 'ధబీ! ధబీ!' బాదాడు.

కొద్ది క్షణాల్లో తలుపులు తెరుచుకొన్నాయి.

డి.యస్.పి. మోహనరావు స్తంభించిపోయాడు! స్థాణువులా నిలబడి పోయాడు. ప్రాణంలేని మట్టిబొమ్మలా నిలబడ్డ వరూథినికి మోహనరావును చూడగానే ప్రాణాలు తిరిగొచ్చాయి. ఆమె ముఖం ఆశల్తో వెలిగిపోయింది.

''నువ్వా? ఇక్కడేం చేస్తున్నావ్?'' మోహన్‌రావు గొంతు పెకలించుకొని అన్నాడు.

''మీ కోసమే వచ్చాను.''

సర్కిలూ, యస్సై వెనక్కు జరిగి వీలయినంత దూరంగా పోయి నిలబడ్డారు.

''యూ ప్రొసీడ్ మీరు కానియ్యండి.'' వెనక్కు తిరిగి సి.ఐ.తో అన్నాడు మోహనరావు.

''యస్సార్!'' ఇద్దరూ ఒకేసారి అని వెనక్కు చూడకుండా బయలుదేరారు.

''అదృష్టం బాగుంది సార్. ఇంకా నయం తొందరపడి ఆవిడగార్ని లాక్కొస్తే నిజంగానే డి.యస్.పి. గారు నాతాట వలిచేవారు.'' అన్నాడు యువకుడైన యస్సై సి.ఐ.వెనకే నడుస్తూ.

''డి.యస్.పి.గారి మనిషి కాకపోతే అంత అహంకారంగా మాట్లాడదయ్యా! నేనప్పుడే అనుకున్నాను.'' అన్నాడు సి.ఐ.

''ఓయ్! అప్పలస్వామీ? వీళ్ళందర్నీ వాన్ ఎక్కించు.'' హెడ్ కానిస్టేబుల్‌కు చెప్పి సి.ఐ. యస్సై వెంటరాగా హోటలు మెట్లు దిగాడు.

''ఏంటట్టా కులుకు సూపులు సూత్తారూ? పదండీ! యానెక్కండి!'' మందను అదిలించినట్టుగా అన్నాడు అప్పలస్వామి మీదమీదకు వెళ్తూ.

''ఆవిడెవరో వస్తుందని ఆగారుగా? ఆవిడేదీ?'' ఆరా తీసింది సావిత్రి.

''అదంతా నీకెందుకూ? నువ్వు నడవో!'' అన్నాడు హెడ్డు.

''ఆవిడ్నెందుకు వదిలారయ్యా! ముందీ మాట చెప్పు!'' అనసూయ అడిగింది – చేతిలో చెయ్యివేసి గుద్దుకొంటూ.

''ఓహో! సానా వుందే గోరోజనం? ఆవిడ మీ బోటి పోరంబోక అనుకున్నావా? క్లాసు. క్లాసు మడిసి!'' అప్పలస్వామి మీసాల గుబురుదాటి నవ్వు బయటికి రాలేదు.

''ఏంటయ్యా క్లాసూ? చేసేది ఆ పనేగా?'' కాకినాడ సరస్వతి అప్పలస్వామిని కసిరింది.

''ఆవిడకు లేని రూలు మాకేంటయ్యా? మేంరాం! ఏంచేస్తావో చేసుకో!'' రాజమండ్రి అనసూయ మొండికేసింది.

''ఏమేవ్? ఆ సూపర్నెంటేడీ?'' కాకినాడ సరస్వతి ఆరాతీసింది.

''పదమూడో నెంబరు గదిలో కెళ్ళాడుగా?'' నెల్లూరి చంద్రమతి అన్నది.

''జుట్టు పట్టుకొని లాక్కొస్తానని వెళ్ళిన మగాడు అక్కడే వుండిపోయాడేమే సరస్వతీ?'' ఏలూరు దమయంతి కళ్ళు తిప్పింది.

''గ్లాసుకదే గ్లాసు? ఏం! హెడ్డయ్యోయ్? అంతేనా?'' అన్నది బెజవాడ సావిత్రి చేతులు తిప్పుతూ.

అనసూయా, చంద్రమతీ, దమయంతీ, సరస్వతీ విరగబడినవ్వారు. బందరు లక్ష్మి ముసిముసి నవ్వులు వలికించింది. వాళ్ళ నవ్వులకు గదుల్లో ఖాళీ సీసాల ముందు కూర్చున్న మగాళ్ళ గుండెలు గుబగుబలాడాయి.

''ఏందే ముండల్లారా డి.యస్.పి. గారిమీద ఏళాకోళాలు! ఆరిన్నారంటే మీయమ్మ.....మిమ్మల్ని ..'' బండబూతు లొచ్చాయి అప్పలస్వామి నోటికి.

ఆ మాట అన్నదెవరో గుర్తించలేకపోయాడు అప్పలస్వామి.

''ఓయ్! పెద్దకరోడాలావున్నావు. ఎవరే నువ్వు?'' మీసాలు పీక్కున్నాడు అప్పలస్వామి.

''యుహ! సూత్తాలేందోయ్ తొయ్యక?" హెడ్లు తన సిబ్బందిని పురమాయించాడు.

అంతవరకూ నోళ్ళు తెరుచుకొని తమాషా చూస్తున్న ఫోర్ ట్వంటీ, త్రినాట్ ఫోర్, ఫైవ్ సెవనా జీరో, త్రిబుల్ త్రీ కానిస్టేబుల్స్ ఆడవాళ్ళను చుట్టుముట్టి ముందుకు నడిపించారు.

హోటల్ ఆవరణలో వున్న పోలీసువాన్ దగ్గిర కొస్తుండగా సావిత్రి చెవిలో నోరుపెట్టి అప్పలస్వామి గొణిగాడు.

''మడిపికో వందిచ్చుకోండి. కేసు మాఫయిపోతది."

''మొన్ననేగా మేమొచ్చింది? అప్పుడే వందేడ్నుంచి వస్తయ్? నిన్నా మొన్నా వచ్చింది హోటల్‌వాడికి, బ్రోకర్‌కూ సరిపోయా? ఇవ్వాళేమో మీరొచ్చి పడితిరి?" అన్నది సావిత్రి అప్పలస్వామి గుబురు మీసాల్లోకి చూస్తూ.

''ఏందే ఈళ్ళకిచ్చేదీ? కోర్టు ఏసినా యాభయ్యో వందో? జుల్మానా అక్కడే కడ్దాం" అన్నది సరస్వతి.

''ఎక్కండెక్కండి" వెనక వాన్‌డోర్ తెరచి మహనిక్కచ్చి మనిషిలా అరిచాడు అప్పలస్వామి.

''ఇది ఎన్నోసారి?"

''ఏడు"

''మీయమ్మ మీతో మాట్టాట్టమే పీక్కు రేసుకొన్నట్టుందే? జరుగహ?" సరస్వతిని నెట్టి పక్కన కూర్చున్నాడు హెడ్లు.

''ఏడోసారంటే నువ్వేడుస్తావెందుకూ?" అన్నది అనసూయ.

''మా పోలీసోళ్ళంటే మీకు బొత్తిగా భయమేపోయింది!" ముందు కూర్చున్న యస్సై వినాలన్నట్టు పెద్దగా అన్నాడు అప్పలస్వామి.

''ఇది చాలా అన్యాయం సార్!" సి.ఐ. పక్కన ముందుసీట్లో వొదిగి కూర్చొని అన్నాడు యస్సై.

''నీ సర్వీసెంతా?" అడిగాడు సి.ఐ.

''రెండేళ్ళు!"

''ఇంకో రెండేళ్ళు పోనీయ్! అంతా న్యాయంగానే కన్పిస్తుంది! నాకిరవై రెండేళ్ళ సర్వీస్. ఇరవైఏళ్ళుగా నేను ఏది చేస్తే అదే న్యాయం అనుకొంటున్నా"

వాన్ మెరక ఎక్కుతో ధ్వని చేస్తోంది.

యస్సై వెనక కూర్చున్న సావిత్రి, అనసూయ, దమయంతి, చంద్రమతి, సరస్వతుల కేసి దిగులుగా చూశాడు.

లక్ష్మీ ప్రసూన పైట చెంగు అడ్డం పెట్టుకొని సన్నగా ఏడుస్తోంది.

ఆ ఏడుపు పోలీసు వాన్ రొదలో కలిసిపోయి ముందుకూర్చున్న యస్సైకి వినిపించటంలేదు.

## 43

''అంతపని చేశాడా శంకర్రావు.'' మోహన్‌రావు పళ్ళునూరాడు.

వరూథిని కళ్ళుతుడుచుకొంది. గుర్నాథం సంగతికూడా చెప్పాలనిపించింది. ఎలా చెప్పాలా అని ఆలోచిస్తూ, ఇప్పుడు కాదులే ముందా శంకర్రావుగాడి వ్యవహారం తేలనీయ్, అనుకొని వూరుకొంది.

''రామనాథబాబే మంటాడూ?'' మోహన్‌రావు సాలోచనగా అన్నాడు.

వరూథిని అతని ముఖంలోకి చూసి నిట్టూర్చింది.

''రామాయణమంతా విని రాముడికి సీత ఏమౌతుందన్నట్లుంది మీరడగటం?''

''అయితే నన్నిప్పుడేం చెయ్యమంటావ్?''

బ్రహ్మాండం బద్దలు కొడ్తాడని ఆశించి ఎదురు చూస్తోన్న వరూథిని నీరసించి పోయింది.

''తీసుకెళ్ళి శంకర్రావు చేతుల్లో పెట్టి ఇప్పుడు నన్నేం చెయ్యమంటావని అడుగుతారేం?''

''వాడింత రోగ్ అని నేను మాత్రం అనుకున్నానా ఏం? అప్పుడు బాగానే వుండేవాడు మరి!''

''వాడు మొదట్నుంచీ అంతే. దగాకోరు.''

''అయితే నేను తెలిసే నీ కేసు వాడికిప్పించానంటావా?'' నొసలు ముడిచాడు మోహన్‌రావు.

''అని నేనన్నానా? ఇప్పుడైనా తెలిసిందిగా మోసగాడని?''

''ఇప్పుడు తెలిసినా ప్రయోజనం ఏమిట్లే?''

''అదేమిటీ? మీ రొచ్చి అడగండి. నాడబ్బు నాకిచ్చి వకాల్తా వదులుకోమనండి. వాడి తాతల్లాంటి ప్లీడర్లు దొరుకుతారు.''

''మళ్ళీ వాడి తాతెందుకూ? ఈయనకన్నా మంచి లాయర్ను పెట్టుకో!''

వరూథిని నవ్వుఆపుకోటానికి ప్రయత్నించి కోపాన్ని నటించింది.

'మీ మాటలూ మీరూ? ఎప్పుడు బయల్దేరదాం?''

''నీతోనా?''

''వేరే పెట్టెలో ఎక్కండి. ఏం పోయింది?'' వరూథిని అలిగింది.

''నేననేది అదికాదు. ఇప్పుడు బయలుదేరటానికి వీలుపడదని.''

''ఇప్పుడు యీ అర్ధరాత్రి పూట బయలుదేరమని ఎవరన్నారూ? బండి మాత్రం ఏముంది? తెల్లవారి ఎక్స్‌ప్రెస్‌కు వెళ్దాం.'' అన్నది వరూథిని.

''రేపు మా ఐ.జి. వస్తున్నాడు. వారంరోజులు మా రేంజ్‌లోనే టూర్ వుంది. చాలా ముఖ్యమైన రైడ్స్ కండక్ట్ చెయ్యాలని మా డి.ఐ.జి. ఆర్డర్స్ ఉన్నాయి. ఏజెన్సీ ఏరియాలో గిరిజనులు భూస్వాములమీద తిరగబడ్డారు! ఇప్పటికే ఐదారు దోపిడీలూ, హత్యలూ జరిగాయి.''

''ఆ దోపిడీలూ, హత్యల సంగతి నాకెందుకూ చెప్పడం? ఎప్పుడొస్తారో చెప్పండి.''

''ఐ.జీ. వెళ్ళేదాకా వీలుపడదు మరి!''

''అంటే?''

''ఓ వారం రోజులన్నా పడ్తుంది. తర్వాత శెలవు పెట్టాలి. అది మా యస్.పి.కి చెప్పుకొని మానేజ్ చేసుకొంటాలే?''

డి.యస్.పి. ఏదో డొంక తిరుగుడుగా మాట్లాడుతున్నాడనుకొంది వరూధిని. తల వంచుకుని నేలచూపులు చూస్తూ కూర్చుంది.

''నువ్వు ఉదయం ఎక్స్‌ప్రెస్‌కు వెళ్తన్నావుగా? సీట్ రిజర్వు చేయిస్తాను. ఏం?''

వరూధిని తలెత్తి మోహన్‌రావు ముఖంలోకి చూసింది.

''నేను వెళ్ళడంలేదు. ఇక్కడే వుంటా.''

''ఆc! ఇక్కడే వుంటావా? ఎందుకూ?''

''అవును! ఇక్కడే వుంటా? నువ్వు నాతో వచ్చేదాకా ఇక్కడే వుంటాను.''

''మా ఐ.జి. పోగానే వస్తానన్నానుగా?''

''మీ ఐ.జి. పోతే నాకేం? ఉంటే నాకేం? నువ్వు నాతో రావాలి. ఆ శంకర్రావు వ్యవహారం చూడాలి. నన్ను తీసుకెళ్ళి నట్టేట్లో ముంచేశావ్! ఆ బాధ్యతనీదే. ఎవరికోసం వస్తావ్?'' మొండిగా మాట్లాడింది వరూధిని.

''నువ్వు తెల్లవారేసరికి ఇక్కడ్నుంచి వెళ్ళిపోవాలి!'' మోహన్‌రావు కంఠంలో అధికారం, దర్పం ధ్వనించాయి. వరూధినికి వీపుమీద కొరడాదెబ్బ 'ఛెళ్' మని తగిలినట్టు అయింది!

''ఎం? ఎందుకు పోవాలంట?'' బింకంగా అన్నది.

''వరూ? నేను చెప్పేది విను!'' మోహనరావు తగ్గిపోయి మాట్లాడాడు.

వరూధినికి బిగువు సడలిపోయింది.

''అసలీ హోటల్లో ఎందుకు దిగావ్? నువ్వు చూశావుగా ఏం జరిగిందో? ఎలాంటి వాళ్ళు ఈ హోటల్లో వుంటారో?''

''నాకేం తెలుసూ? ఆ ముసలి ముండాకొడుకు ఈ హోటలే మంచిదని తీసుకొచ్చాడు.''

''అయిపోయిందేదో అయిపోయింది. నేనుండబట్టి సరిపోయింది. మా డి.ఐ.జి.కి కంప్లెయింట్స్ వెళ్ళాయట, ఈ ప్రొప్రయిటరు లోకల్ పోలీసుల్ని కట్టుకొని బ్రోతల్ నడుపుతున్నాడని. ఆయన ఇక్కడున్నాడనే హఠాత్తుగా రైడ్ చెయ్యటం జరిగింది. నువ్వీ హోటల్లో వంటరిగా వుండటం, నిన్ను నేను వదిలేయడం, మా డిపార్టుమెంటులో పై వాళ్ళకు తెలిసిందంటే ఇంకేమయినా వుందా?''

అంతవరకూ మౌనంగా వింటున్న వరూధిని మోహనరావు ముఖంలోకి తీక్షణంగా చూసింది. అతని ముఖం చూస్తుంటే ఆమెకు వెగటు పుట్టుకొచ్చింది.

''ఆ చెప్పేదేదో సూటిగా చెప్పండి.''

''బ్రోతల్ యాక్ట్ కింద నిన్ను అరెస్టు చెయ్యాల్సి వుంటుంది. కాని...''

వరూథిని అభిమానం కర్పూరంలా మండిపోతూంది.

''కానీ...నేను చెయ్యలేదు. ఎంతో రిస్క్ తీసుకొన్నాను. మా సి.ఐ. ఒట్టి దొంగరాస్కెల్. వాడు యస్.పి. చెవులో వేస్తాడు. అది ఐ.జి. దాకా పాకే ప్రమాదం వుంది!''

''పోనీ నన్నూ అరెస్టు చెయ్యండి. బ్రోతల్ యాక్ట్ కింద బుక్ చేసి కేసు పెట్టండి. సంవత్సరంన్నర క్రితమే ఈ నేరం జరిగింది. అందుకు కర్తవ్వూ, సాక్షివీ నువ్వే! నువ్వు అరెస్టుచేసి తీసుకుపోయావే వాళ్ళకూ నాకూ తేడా ఏమిటి? వాళ్ళు శరీరాన్ని డబ్బు కోసం అమ్ముకొన్నారు. నేను నా డబ్బుతోపాటు అన్నీ ఇచ్చాను! మనిషినీ మనసునూ నా సొంతం చేసుకొన్నానని భ్రమపడ్డాను. మోసపోయాను. దగాపడ్డాను. వాళ్ళు శరీరాన్ని మాత్రమే అమ్ముకున్నారు. నేను అన్నీ అమ్ముకున్నాను. అన్నీ పోగొట్టుకొన్నాను. అరెస్టుచెయ్యండి. నాకు శిక్ష వేయించండి. ఈ బతుక్కంటే, ఆ జైలు గోడల మధ్యే సుఖంగా ఉంటుంది. ఈ పెద్ద మనుషులా, మోసగాళ్ళా ముఖాలు నాకు కన్పించవు. వాళ్ళనుంచి దూరంగా బతుకుతాను. అరెస్టు చెయ్యండి. చూస్తారేం?'' వరూథిని ఆగి మోహనరావు కేసి చూసింది.

కిటికీ దగ్గరకెళ్ళి నిలబడి బయటకు చూస్తున్నాడు మోహనరావు.

''ఆగావేం? అరువూ? పిచ్చికుక్కలా అరవంగానే సరిగాదు. ఇవతలవాళ్ళ మంచిచెడ్డలు, గౌరవమూ, హోదా చూడాలి.''

''నీ హోదా? నీ గౌరవమూ? ఆ రామనాథబాబు కాళ్ళు పట్టుకుని తిరిగినప్పుడేమైంది?''

''నోర్ముయ్! వాగబాక!''

''ఏం చేస్తావేం? బ్రోతల్ యాక్ట్ క్రింద కేస్ పెడతావ్. అంతేగా? పద ఆ కోర్టులోనే చెప్తా. ఆ శంకర్రావుతో కలసి నా డబ్బు కొట్టేశావని!''

డి.యస్.పి. దిమ్మెరపోయి చూశాడు.

''ఏంటట్లా చూస్తావ్? నీకు, నివ్వరస్టు చేసిన ఆడవాళ్ళకు తేడాఏమిటి? డబ్బుకోసం వాళ్ళు శరీరం అమ్ముకుంటే నేరం! అయితే నువ్వు చేసిందీ అదేగా? నా డబ్బుకోసం నీతిని అమ్ముకున్న వాడివేగా? బ్రోతల్ యాక్టుక్రింద నిన్నెందుకు బుక్ చెయ్యకూడదూ? నీ కెందుకు శిక్షవేయరూ? ఆ కోర్టువారినే అడుగుతా పద!''

మోహన్‌రావు నొసటన పట్టిన చెమటను తుడుచుకున్నాడు. వరూథిని మాట్లాడేదాంట్లో 'లా' పాయింట్ ఉన్నట్టే తోచింది. అసలు 'లా' ఎలా ఉంది? అది ఆడది చేస్తే తప్పు! మగాడు చేస్తే తప్పుకాదా? అదే ఆడది చేస్తే శిక్ష పడుతుంది. మొగాడు చేస్తే నేరంకాదు. వరూథిని మాట్లాడేది తర్కమే. బతికాం. అది 'లా' కాదు. అలా 'లా'లో లేదు.

''సిగ్గు బిడియం విడిచిన దానివి! నీతో నాకెందుకల్లరి? నువ్వు రేపు ఎక్స్‌ప్రెస్‌కు వెళ్ళు. నీ మంచికోరే చెప్తున్నా.''

''నే వెళ్ళను. ఇక్కడే ఉంటా! మీ ఐ.జి.ని రమ్మను. ఆయనొస్తే నేను చెప్తా. నీ బండారం బయటపెట్టికాని ఇక్కడనుంచి పోను.'' మోహన్‌రావు తగ్గిపోయాడని గ్రహించిన వరూథిని రెచ్చిపోయింది.

''తెగేదాకా లాగకు. నన్నర్థం చేసుకో వారంరోజుల్లో నేను తప్పక వస్తా. నన్ను నమ్ము.'' ఐ.జి. పేరెత్తగానే జావకారి పోయాడు.

''నిన్ను నమ్మి మొలలోతు బురదలో కూరుకుపోయాను. నీ మూలాన్నే రామనాథబాబుకూ, నాకూ చెడింది. నువ్వేకారణం.''

''అంత అడ్డగోలుగా మాట్లాడితే నేనింకేం చెప్పేది?''

వరూథిని మనస్సు కదలబారింది. చివాల్న తలెత్తి మోహన్‌రావు మొఖంలోకి చూసింది. ఈ మోహన్‌రావులో కూడా ఓ వెంకటపతి ఉన్నాడు. ఎంత అసమర్థుడిలా మాట్లాడుతున్నాడు?

''అసలు ఆ రామనాథబాబే నా మీద పిటీషన్లు పెట్టించి, మినిష్టర్‌కు చెప్పించి, ట్రాన్సఫర్ చేయించాడు తెలుసా? నా మీద ఇంకా ఎన్‌క్వైరీ జరుగుతోంది.''

''ఏమని పెట్టించాడూ?'' వరూథిని చల్లబడింది. ఆమె ధోరణి మారింది.

''అదే! నీ దగ్గర డబ్బుతీసుకొని రౌడీలను పెట్టి వాళ్ళ హాలు నేను స్వాధీనం చేయించానని పిటీషన్ పెట్టించాడు. మన టౌన్‌లో కొంతమంది రౌడీల దగ్గర స్టేట్‌మెంట్స్ కూడా తీసుకుని పంపాడు. పైగా నీతో నాకు అక్రమసంబంధం ఉందని కూడా పెట్టించాడు. అందువల్ల నన్ను వెంటనే ట్రాన్సఫర్ చేసి విచారణ జరిపించాలని, మంత్రిగారితో తనేకాక ఇద్దరు ఎం.ఎల్.ఏ.ల చేత కూడా చెప్పించాడు. ఇంకా లంచాలు తిన్నానని, ఇంకేవేవో చేశానని చెత్తంతా పెట్టించాడు. థియేటర్ దావా - కోర్టులో నువ్వు వేసిన వారానికే నాకు ట్రాన్సఫర్ వచ్చింది. తెలుసుగా? నేనుంటే నీకు సహాయం చేస్తానని ఆ పని చేయించాడు.''

అదా కారణం? పులి అనుకున్న మోహన్‌రావు మేకలా అయిపోయాడు. అతడి అసమర్థత, ఉద్యోగం ఊడుతుందేమోనన్న భయం, అతని ప్రతిఅణువులోను, ప్రతిమాటలోను ద్యోతకం అవుతోంది. తన భర్త వెంకటపతికంటే ఇతడేమీ ప్రతిభావంతుడు కాదు. చదువువుంది. అదృష్టం కొద్దీ ఈ ఉద్యోగం దొరికింది. ఈ పోలీసు యూనిఫారంలో అధికారం ఉంది. ఆ కవచంలో మనిషి గంభీరంగా, శక్తిమంతుడులా కనిపిస్తున్నాడు. కాని అతని లోపలి వ్యక్తిత్వం తన భర్త వెంకటపతి వ్యక్తిత్వం కంటే భిన్నమైంది కాదు. వరూథిని ఆలోచనలు పరుగులు తీశాయి. అతన్ని అంచనా కట్టింది. వీళ్ళ ముఖాలు వీళ్ళు చేసేదేమిటి? ఆ మాత్రం తను చేసుకోలేదా? పై రూపాలు చూసి మోసపోయింది.

వరూథినికి తన శక్తిసామర్థ్యాలమీద నమ్మకం పెరిగింది. ఆవిడ కళ్ళకు డి.యస్.పి. మోహన్‌రావు వట్టి పిరికివాడిలా దద్దమ్మలా కన్పించాడు.

''నన్ను ముందీ ట్రబుల్లోంచి బయటపడనీయ్! వాళ్ళ అంతుతేలుస్తా!'' అన్నాడు మోహన్‌రావు.

అతని మాటలు వరూధినికి అసహ్యాన్ని కలిగించాయి.

''ముందు నువ్వు బయటపడు! వాళ్ళ సంగతి నువ్వేం చూస్తావ్?''

డి.యస్.పి.కి తన పై అధికారి అన్నట్టుగా ఉంది. వరూధిన్ని ఏమో అనుకున్నాడు తనకు వీలు దొరికితే అమాంతం తినేస్తుంది.

మోహన్‌రావు టైం చూసుకుని నిలబడ్డాడు. ''రెండు దాటింది. వాళ్ళు నాకోసం ఎదురుచూస్తుంటారు పోతా.'' కొంచెం ఆగి ''నీ ప్రయాణం రేపు ఎక్స్‌ప్రెస్ కేగా?'' అన్నాడు.

''నా యిష్టం వచ్చినప్పుడు పోతా. నీకెందుకూ? పోయి నీ పని చూసుకో. ఆ ఆడవాళ్ళమీద చూపు నీప్రతాపం?'' వరూధిని అతన్ని సాగనంపటానికి లేచింది.

వచ్చిన కోపాన్ని లోలోపలే తొక్కిపట్టి మోహన్‌రావు పేలవంగా నవ్వాడు.

''కొంచెం ఆగు నా తడాఖా చూపిస్తాను. కాళ్ళులేక కాదు కాలమొచ్చి చిక్కాను. ఆ రామనాథబాబుగాడ్ని ప్రాణాలతో వదులుతానా. ఐ.జిని పోనీయ్! నేనొచ్చి ఆ శంకర్రావుగాడ్ని ఏంచేస్తానో నువ్వే చూద్దువుగాని?''

''ఆ మాట నా తల్లో వెంట్రుకలన్నిసార్లు చెప్పావు. మూడగంటలుగా అదే పాట. పాడిందే పాడరా పాచిపళ్ళ దాసుడా అన్నట్టుంది.''

''సామెతలు కూడా నేర్చుకున్నావే? ఏమోననుకున్నాను. రేపు ఎక్స్‌ప్రెస్‌కు వెళ్ళు నా మాటవిని. ఎందుకు చెప్తున్నానో ఆలోచించు.''

''అబ్బా! ఒహటే జీడి..... వెళ్ళూ..... వెళ్ళూ..... విశాఖపట్నం నీ సొంత ఇల్లు కాదు.''

''ఈ విశాఖపట్నంలో అంతా స్టూడెంట్స్.''

''ఉంటే? నాకోసం క్యూలో నిలబడతారా ఏం?''

''ఛ! అదికాదు. వాళ్ళకు తెలిసిందంటే టౌనంతా అల్లరయి పోతుంది. ఇక బ్లాక్‌మెయిల్ చేసే పత్రికల కరస్పాండెన్స్ ఉన్నారు. వాళ్ళకు తెలిసిందంటే, నా కొంప మునిగి నట్టే! నీ ఫొటోతోసహా మన భాగోతం అంతా బెజవాడ పత్రికల్లో ఎక్కుతుంది. అసలే ఎన్‌క్వైరీలో ఉన్నా ఇది కూడా జరిగిందంటే....''

వరూధిని అతనికేసి దీక్షగా చూస్తూ ఆలోచనలో పడింది.

''నీకు పుణ్యం ఉంటుంది. ప్లీజ్ రేపు వెళ్ళు.''

వరూధిని రెండడుగులు వెనక్కు వేసింది. అతడు తన కాళ్ళమీద పడి బ్రతిమాలుకుంటున్నట్లు ఊహించుకుంది!

''వెంకటపతే నయం. ఆయనకంటే అథమస్తుడు. అనుకుంది వరూధిని.''

''రేపు వెళ్తావుగా? నేను వారం రోజుల్లో వస్తా. వస్తా మరి!'' డి.యస్.పి. మోహన్‌రావు పదమూడో నెంబరు గదిలోనుంచి బయటపడ్డాడు.

వరూథిని తలుపు మూసి పక్కమీద కూచ్చుంది. హోటల్ ఆవరణలో జీపు సాగిన ధ్వని. మరోక్షణంలో జీపు చప్పుడు దూరమైపోయింది. జీపులో గంభీరంగా కూర్చొని వెల్తున్న డి.యస్.పి. – వరూథిని మెదడులో అల్లిబిల్లి తిరిగి, పల్టీలు కొడ్తున్నాడు. వరూథిని ఆవలించింది. నిద్రపోవటానికి ప్రయత్నించింది.

సర్కసులో తాటిమీద నడుస్తోంది. అందమైన ఆడది. కింద వల పట్టుకొని నిలబడ్డారు మగవాళ్ళు.

ఆ ఆడది ఎవరూ? తనే! వలపట్టుకొన్న మగవాళ్ళెవరూ? రామనాథబాబూ, మోహన్‌రావూ, శంకర్రావూ, గుర్నాథం. నలుగురూ నాలుగు కొసలు పట్టుకొని మెడలు విరుచుకొని తనకేసి చూస్తున్నారు. తాను తాటిమీద నడుస్తోంది. అందరూ చప్పట్లు కొడ్తున్నారు. తను చివరిదాకా నడిచింది కాబోలు! పడకుండా నడిచింది. పడితే ఏంచేస్తారూ? తనెప్పుడూ పడకుండా నడిస్తే వాళ్ళకేం ఇంట్రస్టు ఉంటుంది. వాళ్ళ అంతరాంతరాల్లో ఉన్నది అదే కోరిక. మెడ నడుం విరిగి, కాళ్ళు చేతులు విరిగి, నెత్తురు మడుగులో పడివున్న తనను చూడాలనే ఇంతమంది టిక్కట్లు కొనుక్కొని వచ్చారు.

తను పడలేదు. వాళ్ళకు ఆశాభంగమైంది. కాని చప్పట్లు కొడుతున్నారు. అంతా నాటకం. ఉయ్యాల తనకేసి వచ్చింది. అది పట్టుకుని రెండుసార్లు ఊగింది. దానిమీదనుంచి, ఎత్తుగా వున్న మరోఉయ్యాలమీదకు దూకింది. మరో ఉయ్యాల అది ఇంకా ఎత్తుగా మరొకటి, అది ఇంకా ఎత్తుగా తను ఆకాశంలో నక్షత్రాలకు దగ్గరగా తిరుగుతోంది. కిందకు చూసింది. వల పట్టుకొన్న రామనాథబాబూ, మోహన్‌రావూ, శంకర్రావూ, గుర్నాథం చీమల్లా కనిపిస్తున్నారు. వాడెవడూ? కనకయ్య? మేజిక్కులు చేస్తున్నాడు. టోపీలోనుంచి పావురాలను తీస్తున్నాడు. అంతా తనవైపే చూస్తున్నారు. అతనెవరూ! బఫూన్లా ఉన్నాడు? ఉండటమేమి? బఫూనే. వెంకటపతి. తన భర్త వెంకటపతి! ఏదో చేశాడు. జనం నవ్వలేదు. అంతా తనకేసి మెడలు విరుచుకుని చూస్తున్నారేం? అటుకేసి ఒక్కడూ చూడడేంటీ. వెంకటపతి దిగులుగా ముఖం పెట్టాడు. సింహాల రింగులోకి వెళ్ళాడు బఫూన్. వాటితో ఆడుకుంటున్నాడు. శివంగి మీదకి దూకింది. వెంకటపతి తప్పించుకోవటానికి దారిలేదు. చుట్టూ ఇనపచువ్వలు బయటకు వచ్చే గేటు ఎవరో మూసి పట్టుకున్నారు! వాళ్ళెవరూ? పెళ్ళి బ్రాహ్మలు. వాళ్ళకు సర్కసులో ఏం పని? అసలు సర్కసంతా చేయించేది మేమే అంటున్నారా? సివంగి అరుస్తోంది! దాని వెనక రెండు సింహాలు పరిగెత్తుకొస్తున్నయ్! బఫూన్ పారిపోడేం! భయపడడేం? అలా మొద్దులా నిలబడతాడేం? పారిపోడే? ఏంమనిషి? సివంగి నోరుతెరిచింది. అదేమిటి ఆయనే దాని నోట్లో తలపెడతాడూ? ఏవండీ! మిమ్మల్నే? సింహం నోటిలో వెంకటపతి తల. పటపట కొరుకుతోంది. నువ్వుమనిషివా? గొడ్డువా? ఉయ్యాల పట్టుతప్పింది. తను కిందపడిపోతుంది. పైన ఖాళీ ఉయ్యాలలన్నీ వెనక్కి ముందుకి ఊగుతున్నాయి. తను కింద పడిపోతుంది! కింద వల, వలపట్టుకొన్నవాళ్ళేరి? జనం లేచి నిలబడ్డారు.

తన భర్తను సింహం మింగేసిందా? సింహాలు అరుస్తున్నాయి. తోకలు ముడిచి రింగుచుట్టూ తిరుగుతున్నాయి. వాటిమధ్యలో ఎవడో నిలబడి కొరడా ఆడిస్తున్నాడు. వంటిమీద వెండి, బంగారం పతకాలు మెరుస్తున్నాయి. ఎవరాయన? ఇంకెవరూ? మామగారు. తన మామగారే! వెంకటపతి తండ్రి సాంబయ్యగారు కొరడా పట్టుకొని ఆడసింహాన్ని బాదుతున్నాడు. అది వెంకటపతి తల వదిలేసింది. తల చితికిందికాని మనిషి చావలేదు. బతికే ఉన్నాడు. రింగ్ మాస్టర్ మామగారు సివంగిని గొడ్డును బాదినట్టు బాదుతున్నాడు. ఆయన చావలేదు. భర్త బతికే ఉన్నాడు. తను కింద పడిపోతూంది. వల లేదు. వాళ్ళులేరు. అమ్మో! తనకు కాళ్ళు విరుగుతాయ్. చేతులు విరుగుతాయ్. తల వక్కలౌతుంది! అదేమిటీ? తనెక్కడ పడింది? సాంబయ్య కొరడా ఎత్తి తనను కొడ్తాడెందుకూ? ఏమిటట్లా చూస్తా నిలబడతావ్. మీ అయ్య నన్ను కొడ్తూ ఉంటే? నిన్నే! అసలు నువ్వు మగాడివేనా? నువ్వుమగాడివేనా? భర్త కదిలాడు వెంకటపతి తండ్రిచేతిలో కొరడా లాక్కొని ఆయన మెడచుట్టూ చుట్టాడు. అటులాగు, నేను ఇటులాగుతా. ఇద్దరూ కొరడా గుంజుతున్నారు. ఎంతకీ చావడేం ఈ రింగుమాస్టరు? ఈ ముసలాడు? కొరడా తెగింది. తను వెల్లకిలా పడింది-

వరూథిని లేచి కూచ్చుంది. నోరు తడారిపోయింది. గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి లేచి లైట్ వేసింది. కూజాలో నీళ్ళు రెండుగ్లాసులు తాగింది.

రోట్లో పాత్రం తిరుగుతున్న మోత వినబడుతుంది. పిండిరుబ్బుతున్నారనుకుంది. ప్లేట్లు గ్లాసులు కడుగుతోన్న చప్పుడు వినపడుతోంది. వరూథిని వాచీ చూసింది. ఐదైంది. ఆరుంబావుకు ఎక్స్‌ప్రెస్ వళ్ళంతా విరగ్గొట్టినట్టుగా ఉంది.

బ్రాతూమ్‌లోకి వెళ్ళింది.

స్నానంచేసి బట్టలు మార్చుకునే సరికి ఐదున్నర అయింది. హోటల్ కుర్రాడు ఇడ్లీ కాఫీ తెచ్చాడు.

"అక్కడ పెట్టు. నేను గది ఖాళీ చేస్తున్నా. బిల్లు చేయించి పట్టుకురా. ఓ రిక్షాకూడా స్టేషన్‌కు."

కుర్రాడు ఎగాదిగా చూసి, "సరే! అమ్మగారూ!" అన్నాడు.

"ఎక్స్‌ప్రెస్‌కు వెళ్తున్నా. టైంలేదు. త్వరగా రావాలి."

తలవూపి కుర్రాడు వెళ్ళిపోయాడు.

ఇడ్లీ తిని కాఫీ తాగింది. ప్రాణం తేరుకుంది. చెప్పులు తొడుక్కుని, సూట్‌కేస్ బెడ్‌మీద పెట్టి టైం చూసుకుంది.

ఆరయిపోతూంది. కుర్రాడు బిల్లింకా తేలేదేం.

"ఏమిటమ్మా! వెళ్తున్నారా?" వరూథిని వాకిలికేసి చూసింది.

ప్రొప్రయిటర్ మందహాసం చేస్తూ నిలబడి వున్నాడు.

"రాత్రి నేను హోటల్లో లేను. ఉంటే అలా జరిగేది కాదు."

"రాత్రి మిమ్మల్ని అరెస్టు చేయలా?" అడగకూడదనుకొంటూ అడిగేసింది.

"నన్నా! అరెస్టా!" చాలా తేలిగ్గా తీసుకొని అన్నాడు.

"రాత్రి మీకోసం పోలీసులు రాలా? ఎక్కడున్నారూ?"

''ఇంట్లోనే వున్నా! బై ఎలక్షన్స్‌లో గెలిచిన ఈ ఊరి ఎం.పి.కి మా ఇంట్లో డిన్నరు ఇచ్చాం. చాలా పొద్దుపోయిందాకా వాళ్ళు ఉన్నారు. అందుకే మీ దగ్గరకు రాలేక పోయాను."

వరూథిని షాక్ తగిలినట్టయిపోయింది.

''మీకేమీ ఇబ్బంది కలుగ లేదుగా?"

వరూథిని నిట్టూర్చింది. ఓస్! అందుకా ఆయన రాలేకపోయానంటున్నాడు.

''నాకు టైం అయిపోతూంది. బిల్లు పంపించమన్నా ఇంకా తేలేదు."

''మీరేం భయపడాల్సిన పనిలేదు. మన హోటల్లో మళ్ళీ పోలీసు కాలుపెట్టే పనేలేదు! ఆ డి.యస్.పి. మోహన్‌రావు వారంరోజుల్లో ట్రాన్సఫర్ అయిపోతాడు!"

వరూథిని గుండెలు ఝల్లుమన్నాయి.

''ఎక్కడికి?"

''ఇక్కడనుంచి వదిల్తే చాలు. ఎక్కడకెళ్తే మనకేం? ఆయనమీద లోగడ్నుంచే కంప్లయింట్స్ ఉన్నాయట."

వరూథిని టైం చూసుకొంటూ ''ఆలస్యమైపోతోంది. బండి అందదేమో? త్వరగా బిల్లు తెప్పించండి." అని పర్సు తెరిచి నోట్లు బయటకు తీసింది.

''అంత బిల్లేమయింది లెండి మీరివ్వటానికి?"

''అట్లా కాదు తీసుకోండి!" వరూథిని తొందరపెట్టింది.

''ఫర్వాలేదు. ఈసారొచ్చినప్పుడు ఇద్దురుగాన్లేండి. ఎక్స్‌ప్రెస్‌కే వెళ్ళాలంటే టైం అయిందీ. బయలుదేరాలి. రేయ్! బోయ్! పెట్టె తీసుకో. రిక్షాలో వెళ్తే బండి అందదేమో? మన బండిలో పెట్టు. డ్రైవరొచ్చాడేమో చూడు." అని బోయ్‌కి చెప్పి హోటల్ ప్రొప్రయిటరు బయటకు నడిచాడు.

''మిమ్మల్నెక్కడో చూశాను. గుర్తురావటం లేదు." అప్రయత్నంగా అని నాలుక కరుచుకొంది వరూథిని.

ప్రొప్రయిటరు వెనక్కు తిరిగాడు.

''నన్ను గుర్తుపట్టారేమో అనుకున్నాను. హైదరాబాద్‌లో ఓ సారి గోపాలరావుతో కలిసి మీరున్న హోటల్‌కు వచ్చా. గోపాలరావు మా కజిన్ బ్రదర్. అప్పచెల్లెళ్ళ బిడ్డలం!"

''ఓహో! అలా చెప్పండి" వరూథిని కళ్ళు విప్పారాయి.

గోపాలరావు కజనా? అందుకే పాపం! ఇంత ఇదిగా ఉన్నాడు. ఎందుకో ఏమిటో అనుకొంది తను.

''మీ పేరూ?" ప్రొప్రయిటర్ని కొంతదూరం నడవనిచ్చి అడిగింది అతని వెంటే నడుస్తూ.

''గోపాలరావు" నడుస్తూనే చెప్పాడు.

''కాదు. మీ పేరు." అతను వినలేదేమో అనుకొంది.

''నా పేరు గోపాలరావే. నేను యస్. గోపాలరావు, మా వాడు యం."

వరూథిని హోటలు గదులముందుగా నడుస్తూ గదులకేసి చూసింది. అంతా నానాఖంగాళీగా వుంది. లోపలంతా గలీజుగా వుంది. రాత్రివచ్చేటప్పుడు సరిగా చూడలేదు. తనగది ఒక్కటే అంతబాగుంది. ఆ పదమూడో నంబరు చూసి హోటలంతా చాలా డీసెంటుగా వుందనుకొంది. గదుల్లో మనుషులు ఆమెకేసి గుడ్లప్పగించి చూస్తున్నారని గమనించింది. వరూథిని.

ఛీ! ఛీ! అంకఛండాలం. మనుషుల్లా ఉన్నారా? వట్టి చెత్త హోటల్. మురికి కూపం, నరకలోకం. తన ముందు అతి హుందాగా నడుస్తోన్న ప్రొప్రయిటర్ యస్. గోపాలరావుమీద అంతకుముంద ఏర్పడిన గౌరవంలో సగం పోయింది వెనకనుంచి అతన్ని చూస్తోన్న వరూథినికి.

వరూథిని వాల్తేరు స్టేషన్ చేరేసరికి ఎక్స్ప్రెస్ ప్లాట్‌ఫారం మీద ఉంది. కూలీకి సూట్‌కేసు అందించి బుకింగ్ కౌటరు దగ్గరకు పరుగెత్తింది.

గార్డు విజిల్ వినబడింది. వరూథిని గాబరాగా పేట్టెలు వెతుక్కుంటూ కూలీ వెంట పరుగెత్తింది. ఆమె ఎక్కుతూండగానే బండికదిలింది. కూలీ ఫ్లూట్ బోర్డుమీద వేలాడుతూ చెయి చాపాడు. కూలీచేతిలో చేతి కొచ్చిన చిల్లర పెట్టింది. వాడు కిందకు దూకి తీరిగ్గా చేతిలో చిల్లర లెక్క చూసుకోసాగాడు. వాడు తలపైకెత్తేసరికి బండి ప్లాట్ ఫారందాటి వేగాన్ని అందుకొంటూంది.

కంపార్ట్‌మెంటు దాదాపు ఖాళీగానే వుంది.

ఒకావిడ ఇద్దరు పిల్లల్ని పెట్టుకుని ఒక మూలగా కూర్చుని ఉంది. మరో ఇద్దరు ఆమెకు పక్కగా, వాళ్ళకు ఎదురుగా ఓ కళ్ళజోడు పెట్టుకున్న ఆవిడ కూర్చుని వున్నారు. మగాళ్ళెవరూ లేరేం? ఆ ఆలోచనతోపాటు ఇది ''లేడీస్ కంపార్ట్‌మెంటు''అన్న సంగతి స్ఫురణకు వచ్చింది.

ఖాళీగావున్న బెర్త్ మీద కూర్చొని మెడకిందా, ముఖమూ చెంగుతో తుడుచుకుంది వరూథిని. ఆమె గుండెదడ తగ్గేసరికి ఎక్స్ప్రెస్ అవుటర్ సిగ్నల్ దాటి చాలా దూరం వచ్చింది.

ఎదురుగా నల్ల కళ్ళజోడులోనుంచి తననే చూస్తున్న ఆవిడను చూసి వరూథిని పెదవి విరుచుకుంది. పర్సులో ఉన్న తన కూలింగ్ గ్లాసెస్ తీసి పెట్టుకోపోయి, తను సిగ్గుపడింది. ఆవిడను చూసి తను పెట్టుకొన్నదని ఆమె అనుకుంటుందేమోనన్న ఆలోచన కంట్లో పడ్డ బొగ్గు నలుసులా బాధ పెట్టింది.

అందుకే తనకు లేడీస్ కంపార్ట్ మెంటులో ఎక్కడం ఇష్టం ఉండదు. ఆ కూలివాడు తెచ్చి ఇందులో తగలేశాడు. హడావిడిలో తనూ గమనించలేదు. పగలంతా ప్రయాణం బోర్! ఆ ముటముట లాడే ముఖాల్ని చూస్తూ, తను కూర్చోవాలి.

వచ్చేప్పుడు రాజమండ్రిలో దిగిన సిల్కులాల్చీ, వైజాగుదాకా వచ్చిన గళ్ళచొక్కా గుర్తొచ్చి నవ్వుకుంది వరూథిని.

ఎక్స్‌ప్రెస్ కరక్టు టైంకే చేరింది. వరూథిని కిటికీలోంచి తల చెయ్యి బయటికి పెట్టి కూలీకి సైగ చేసింది. బండిదిగి స్టేషన్ బయటకొచ్చింది. జుట్టు రేగిపోయి వుంది. ముంగుర్లు చెంపలమీద పడుతుంటే సర్దుకుంటూ కూలీ వెనకే నడిచి, రిక్షా స్టాండులోకి వచ్చింది. బట్టలు బొగ్గు దుమ్ము కొట్టుకుని, మాసి, నలిగి ఉన్నాయి. ముఖం వాడిపోయి వుంది. కూలివాడికి డబ్బులిచ్చి రిక్షామాట్లాడుకొని ఎక్కి కూర్చుంది.

రిక్షాలూ, కార్లనూ, జనాన్నీ తప్పుకుని రిక్షా స్టేషన్ రోడ్డు దాటింది. మెయిన్‌రోడ్డెక్కి రిక్షావేగంగా పోతోంది. ఎదురుగా వస్తున్న లారీని తప్పిచ్చుకోబోయి, వెనక వస్తున్న కారుకు అడ్డం వచ్చాడు రిక్షావాడు. కారుడ్రైవరు రిక్షా దాటిపోతూ చురుచురా రిక్షావాడికేసి చూశాడు.

"పోవోయ్! సూత్తున్నాడు మగాడు!" అంటూ కాళ్ళమీద లేచి బలంగా తొక్కాడు. మెల్లగా తొక్కుతున్న ముందురిక్షావాడ్ని ఏదో అన్నాడు. వాడ్ని దాటేసి మళ్ళీ నడిరోడ్డుమీదకొచ్చాడు.

"వీడివ్వాళ దేనికో గుద్దుతాడు." కోడెదూడలా ఉన్న రిక్షాయువకుడి పిక్కలు చూస్తూ అనుకొంది వరూథిని.

"ఏమిటా అదిరిపాటు? మెల్లగా పోనీ!"

"రిక్షా ఇచ్చేయాలమ్మా. అరగంటాలస్యమైతే ఒకరోజు అద్దె గుంజుతాడు ఓనరు."

రివ్వున దూసుకు పోతోంది సిమెంటు రోడ్డుమీద రిక్షా. వాడికది అలవాటే.

బండముండాకొడుకు! వాడితో మాట్లాడి లాభంలేదు. ఇట్టాంటివాళ్ళను పోలీస్టేషన్‌లో పెట్టి ఉతికిచ్చాలి. లేకపోతే దారికి రారు.

వరూథినికి డి.యస్.పి. గుర్తొచ్చాడు. ఆయనకు ట్రాన్స్‌ఫర్ అవుతుందన్నాడు. హోటల్ గోపాలరావు. ఇక్కడికి వేస్తే బాగుంటుంది. ఇట్లాంటి పొగరుబోతుల పనన్నా పట్టచ్చు. వారం రోజుల్లో వస్తానన్నాడు. వస్తాడా? ట్రాన్స్‌ఫర్ అయాకన్నా వస్తాడేమో? అసలు వస్తాడా అని? వచ్చినా ఆ శంకర్రావును అదుపులో పెట్టగలడా?

లక్ష్మీసిల్క్‌ప్యాలెస్..... జనతా మెడికల్‌స్టోర్స్..... రవీంద్ర మిలటరీ హోటల్..... బాటా చెప్పులషాపూ..... దాటిపోతోంది రిక్షా.

ఇదేమిటిలా పోతున్నాడు? ఈ రోడ్డున వస్తున్నాడేమిటి? షరాబ్ బజార్ నుంచి వెళ్తే దగ్గరకదూ? వీడికి కండబలం తప్ప బుద్ధి బలంలేదు. మొద్దుసన్నాసి. వరూథిని గుండెలు కొట్టుకో సాగాయి. తను ఆ రోడ్డున వచ్చి చాలా రోజులైంది. ఇటు రావడమంటేనే మనస్కరించదు. ఏమిటో తలకొట్టేసినట్టుంది. తలెత్తి చూడలేదు. దృష్టి నిలిపి చూడలేదు. దుర్గావిలాస్ దాటింది రిక్షా. ఇక వచ్చేదే "వరూథినీ పిక్చర్ ప్యాలెస్". అమ్మగారి హాలు. టౌనుమొత్తం మీద పేరుగల హాలు. కొత్తలో

హాలు చూట్టానికే జనం విరగబడ్డారు. హాలుకు పక్కనా, ఎదురుగా ఎన్నో షాపులు వెలిశాయి.

'వరూథినీ బేకరీ', 'వరూథిని మంగలిషాపూ', 'వరూథినీ షోడా షాపూ', 'వరూథినీ కిళ్ళీ షాపు'..... రిక్షాలో వరూథిని తలవంచుకొంది. రెప్పలు వాల్చేసుకొంది.

రిక్షావేగం తగ్గింది. అరుస్తూ, బెల్ కొడుతున్నాడు. వచ్చే రిక్షా పోయే రిక్షా. మధ్యమధ్య కార్ల హారన్ మోతలు, జనంతో రద్దీగా ఉంది. కార్లు తప్పుకుని, రిక్షాల ముందుకొస్తున్నారు జనం.

వరూథిని మనస్సు ఆగటం లేదు. హాలుమీద ఆమె పెంచుకున్న మమత నరనరాన్ని పట్టి గుంజుతోంది. వీడేంటి? ఇంత మెల్లగా పోతాడు?

''నేల బెంచీ అయిపోయినాయ్!''

''కుర్చీ తీసుకోండి!'' ఆవిడెవరో భర్తను దబాయిస్తోంది.

''కుర్చీ మూడురూపాయలు.... కుర్చీ మూడు.....'' బ్లాక్ చేసే కుర్రాడు అరుస్తున్నాడు.

''ఏ బొమ్మ ఆడుతుందో?'' తలవంచుకొనే కళ్ళెత్తి చూసింది వరూథిని.

కాగితపు జండాలు, తోరణాలు గాలికి రెపరెప లాడుతున్నాయి. బేనర్ను, పోస్టర్ను, కట్అవుట్సూ ప్లెడ్‌లైట్ వెలుగుల్లో మెరిసి పడిపోతున్నాయి.

''కొత్త పిక్చర్ రిలీజై ఉంటుంది. ఏం పిక్చరూ?'' వరూథిని తలయెత్తి చూసింది.

''శ్యామల''

శ్యామలా! ఇదెప్పుడు తీశారూ? తను వినలేదే?

''థియేటర్!''

''శ్యామల''

'థియేటర్' చిన్న అక్షరాలకింద శ్యామల పెద్దక్షరాలు ప్లెడ్‌లైట్ కాంతిలో వెలిగిపోతున్నాయి.

ఈ థియేటరెప్పుడు కట్టారు? ఇదే బజారు! ఇదే రోడ్డు? రిక్షావాడెటుపోతున్నాడూ?

''ఏయ్! రిక్షా ఆపు!''

రిక్షావాడు పక్కకు తీసి ఆపాడు.

''వరూథిని పిక్చర్ ప్యాలెస్'' బోర్డుమీద అక్షరాలు పీకేసిన వరవడి మాత్రం ఇంకా కన్పిస్తూనే ఉంది. ఆ బోర్డుమీదే కొత్తక్షరాలు గుండ్రంగా లావుగా కన్పిస్తున్నాయి.

''థియేటర్ శ్యామల''

''ఇదేమిటీ? ఏమైంది?'' అప్రయత్నంగానే వరూథిని రిక్షాదిగింది.

బేకరీవాడూ, కిళ్ళీ షాపువాడు, ''వరూథిని'' పేరు చెరిపేసి ''శ్యామలా బేకరీ'', ''శ్యామలా కిళ్ళీషాపు'' అని కొత్తగా రాయించేశారు.

వరూథినికి కాళ్ళు భూమిలోకి దిగిపోతున్నాయి! తన కళ్ళే తనను మోసం చేస్తున్నాయా? ఇది నిజమా? కలా?

రిక్షావాడు థియేటర్ గోడమీదున్న బొమ్మలకేసి దీక్షగా చూస్తూ నిలబడ్డాడు. విజయలలిత డాన్సింగ్ ఫోజు చూట్టంలో తన్మయుడై ఉన్నవాడికి వరూథిని పిలుపు వినిపించలేదు.

వరూథిని కళ్ళు చీకట్లు కమ్మాయి! థియేటరు ముందున్న అన్ని దీపాలు కళ్ళమీద పడుతోన్న చీకటిని తొలగించలేక పోయాయి. చెవుల్లో రైలు కూతలు వినబడసాగిన్నై. తలతిరిగి పోతూంది. గుండెల్లో పోటు. ఎలాగో రిక్షాలోకి చేరవేసుకుంది శరీరాన్ని.

''ఏయ్ రిక్షా? నీకే చెప్పేది?'' ఎంతో పెద్దగా అన్నాననుకుంది. కాని గొంతు లేవలేదు. కళ్ళమీద నీటిపొరలు కమ్ముకొస్తున్నాయి. పెదవులు వణుకుతున్నాయి.

''నమస్కారం అమ్మా?'' గడ్డం పెంచుకొన్నవాడొకడు రిక్షా ముందుకొస్తూ అన్నాడు.

వరూథిని ఉలిక్కి పడింది! అతడు ఎటునుంచి వచ్చాడో చూడలేదు. పొంగి వస్తున్న దుఃఖాన్ని ఆపుకోటానికి ప్రయత్నం చేస్తూ అతనికేసి చూసింది.

''నన్ను గుర్తుపట్టలేదా? రామదాసుని?'' అన్నాడు అతను నల్లగా వికారంగా పెరిగిన గడ్డం ఆడించుకుంటూ.

''నువ్వా రామదాసూ?'' తన ఆశ్చర్యాన్ని అణుచుకోలేక పోయింది వరూథిని.
అవునమ్మ గడ్డం పెంచాను. తిరుపతి మొక్కుంది.

''ఇక్కడేం చేస్తున్నావ్?'' ఆమె కంఠంలో ఆశ్చర్యం కంటే సందేహమే ఎక్కువగా స్ఫురించింది.

''ఉదయమే వచ్చాను.''

''ఈ హాల్లో పనిచేయటం లేదా?''

''ఈ హాల్లోనా? పనిచేయటమా? మీకు తెలిసిందేగా?''

''ఆహాఁ! అదిగాదు సినిమాచూట్టానికి వచ్చావా?''

''కథానాయకి మాదే! దాంతో వచ్చాను.'' మందహాసం చేస్తూ చెప్పాడు రామదాసు.

వస్తోంది కథానాయకి! కథానాయకి! కథానాయకి! కథానాయకి! కథానాయకి! గోడలమీద, ఎలక్ట్రిక్ స్తంభాలమీదా, సినిమాహాలు ముందూ ఆమె చూసిన పోస్టర్లూ, రంగులూ - బొమ్మలూ - వరూథిని బుర్రలో గిరగిరా తిరిగాయి.

''ఇప్పుడెక్కడుంటున్నావ్?''

''మాడిస్ట్రిబ్యూషన్ హెడ్డాఫీసులోనే. నెలకైదురోజులేనమ్మా హెడ్‌క్వార్టర్స్‌లో ఉండేది. మిగతా ఇరవై ఐదు రోజులూ టూరింగే? హాలు మన స్వాధీనం నుంచి పోయిన నెలకే రిప్రజెంటేటివ్‌గా చేరాను. శేఖరం గారి కాళ్ళమీద పడ్డా. వారే పాపం! సహాయం చేశారు. మీ సంగతి అప్పుడప్పుడు అంటుంటారు.''

రామదాసు చెప్తున్నది మొదటి రెండుముక్కలూ తప్ప ఆమె బుర్రకు ఎక్కటం లేదు. వింటున్నట్టుగా రామదాసును చూస్తూనే ఉంది. కాని ఆమె మనసెక్కడో వుంది.

''నీకేమన్నా తెలుసా?''

''ఏమిటమ్మా?''

''కోర్టువారు స్వాధీనంలో ఉంది కదా? కోర్టు ద్వారానే లీజుకివ్వడం జరిగింది. వారెలా పేరుమారుస్తారు.''

''అదేమిటమ్మా! మీకు తెలియదా? ఊళ్ళో లేరా?'' అసలే నల్లటి ముఖం ఇంకా నల్లకప్పేసిపోయింది.

వరూథినికి దున్నపోతుమీద ఎక్కివస్తున్నవాడు కన్పించాడు! యమపాశాలు మెడచుట్టూ మెలిచుట్టుకుని పాముల్లా కదలాడుతున్నట్టుగా వుంది వరూథినికి!

''ఇంతసేపైతే ఎట్టాగండీ?'' రిక్షావాడు విసుగ్గా అన్నాడు.

వీడెప్పుడొచ్చాడో! గాడ్డికొడుకు. సినిమా పోస్టర్లు చూట్టం ఇప్పటికైంది కాబోలు. రామదాసును చూస్తూ, రిక్షావాడిని గురించి అనుకుంది వరూథిని.

''అయితే కేసు పోయిన సంగతి మీకు తెలియదన్నమాట? నిన్ననే తీర్పు ఇచ్చారట. శ్యామలాంబగారు అప్పటికప్పుడు థియేటర్ పేరు మార్పించారు. ఇవాళే రీ ఓపెనింగ్ ''థియేటర్ శ్యామల'' అని ఎంత పబ్లిసిటీ ఇచ్చారో చూశారుగా? మా పిక్చర్ కంటే వాళ్ళ థియేటర్‌కే ఎక్కువ పబ్లిసిటీగా ఉంది- పేరు మారిందనీ.....''

''రామనాథబాబు లేడా?''

''మధ్యాన్నం కన్పించాడు. ఇప్పుడింకా వచ్చినట్టు లేదు. ఈ లోపలేమన్నా వచ్చాడేమో?''

''ఏ రిక్షా పోనియ్!''

''అదేమిటీ? దిగండి. కథానాయకి చూడరూ? రిజర్వ్ క్లాసులో రెండు సీట్లు ఖాళీగా పెట్టించా.''

వరూథిని తల అడ్డంగా తిప్పి ''రామదాసూ! రేపొకసారి వస్తావా?'' అన్నది.

రిక్షా సాగింది.

రామదాసు రిక్షా పక్కనే నడుస్తూ ''నే నివ్వాళే వద్దామనుకున్నా - బుకింగ్ క్లోజ్ అయింతర్వాత. మీరే కన్పించారు. రేప్పొద్దున్నే వస్తా. అదే ఇల్లుగా?'' అన్నాడు.

''తప్పకుండా రావాలి. ఆఁ. అదే ఇల్లు!'' రిక్షాలో నుంచి తల బయటికి పెట్టి అన్నది వరూథిని.

రామదాసు తల ఎగరేస్తూ నిలబడ్డాడు. రిక్షావాడు సడన్ బ్రేక్ వేశాడు. థియేటర్ ముందు వరూథిని తూలింది. రిక్షాను దాదాపు రాచుకొంటూ థియేటర్‌లోకి తిరుగుతోంది. 'యంబాసిడర్' కారు.

''అమ్మగారొస్తున్నారు, అమ్మగారొస్తున్నారు. గేట్లు తెరవండి.'' గేటుదగ్గర ఒకడు హడావిడి చేస్తున్నాడు.

కారువెనక అద్దంలో నుంచి కార్లో కూర్చున్న ఆవిడ ముడీ, మెడా ఠీవిగా కన్పించాయి. ఇంకా ముందుకు వంగి చూసిన వరూథిని కళ్ళకు అద్దాన్ని ఆనుకొని వేలాడుతున్న బొమ్మ అడ్డం వచ్చింది.

ఆ బొమ్మ... ఆ బొమ్మ హైదరాబాద్‌లో కొని కార్లో కట్టింది తనే! తన కా బొమ్మంటే ఎంతో ఇష్టం. ఆ బొమ్మ తనను చూసి గుర్తు పట్టింది. తనను పిలుస్తోంది. తనను చూసి నవ్వుతోంది.

''ఎప్పుడూ నువ్వు ఆ బొమ్మకేసి చూస్తావ్!'' రామనాథబాబు అడిగాడు.

''ఇంకేం నువ్వు నీ బొమ్మకేసి చూసుకో!''

రామనాథబాబు తన కేసి చూశాడు. భుజాలకిందగా చేతులు పెనవేసి తనను ఒళ్ళోకి లాక్కున్నాడు. ఉక్కిరిబిక్కిరి చేసి పారేశాడు.

''వదలండి! పట్టపగలు. నడిరోడ్డుమీద ఇదేమిటి? ముందు డ్రైవరున్నాడన్నది కూడా మర్చిపోయారా ఏం?''

హైదరాబాద్ విజయవాడ రోడ్డుమీద యంబాసిడర్ కారు అరవై మైళ్ళ వేగంతో పోతూంది. నిముషానికి ఒక మైలు రాయి. జరిగిపోయిన రాళ్ళూ, గడిచిపోయిన కాలమూ తలచుకొంటూ వరూథిని రిక్షా ఇల్లు దాటి పోవటం కూడా గమనించలేదు.

''ఏయ్! రిక్షా! ఆపు! వెనక్కు తిప్పు! ఇల్లు దాటివచ్చేశాం!''

''మీరు చెప్పకపోతే నా కెట్టా గుర్తు? మరి సూత్తా కూర్చున్నారేం?''

''సర్లే! వాగబాక. రిక్షా తిప్పి పోనియ్.''

రిక్షా ఇంటిముందుకొచ్చి ఆగింది. వరూథిని రిక్షా దిగి మీద గుమ్మం మెట్లెక్కింది. రిక్షావాడు సూట్‌కేసు మెట్లమీద దించి నిలబడ్డాడు. వాడ్ని చురచుర చూసి ఓ పావలా కలిపి వాడి చేతిలో విసిరేసింది.

తలుపు తడుతున్న వరూథిని చేతికి తాళం తగిలింది.

''హారి భగవంతుడా? ఎక్కడ చచ్చాడో?'' చివరిమాట భర్తను ఉద్దేశించే అన్నది తను. కాని భగవంతుడు వింటే తనను ఉద్దేశించే అన్నదనుకొంటాడు. విన్నాడో? లేదో? మరి! ఆ భగవంతుడు.

వింటేమ్మాత్రం ఏం కొంప మునిగిపోయింది? తనను ఇంతకంటే ఏం చేస్తాడు?

వీధి వాకిలి మెట్లమీద తాళం పెట్టిన తలుపుముందు కూలబడిన వరూథిని దేవుడితో తగాదాపడింది.

## 45

''రామనాథబాబా? ఎక్కడున్నాడూ?'' అన్నాడు రామదాసు.

రేపు పొద్దునే వస్తానన్న రామదాసు మూడోరోజు వరూథిని ఇంటికొచ్చి కూర్చున్నాడు.

''మొన్న ఊళ్ళోనే ఉన్నాడన్నావుగా?'' అన్నది వరూథిని.

''నిన్న కూడా వున్నాడమ్మా! పొద్దుట నేను వచ్చేముందే బయలుదేరి ఊరి కెళ్ళిపోయాడు.''

''దాన్ని వెంటపెట్టుకొనేనా?''

''దేన్నమ్మా?'' రామదాసు నోరు తెరిచి అలానే వుంచాడు.

''కోలవెన్ను షావుకారుగారి కోడల్ని? ''

''ఆమె ఇక్కడెక్కడుంది? హైదరాబాదులోనే వుందటగా హాలు కట్టిస్తూ?''

''మరి నిన్న హాలు దగ్గరున్న అమ్మగారెవరంటా?''

''ఆమేనమ్మా! శ్యామలాంబగారు. రామనాథబాబుగారి భార్య.''

''మళ్ళీ మొగుడూ పెళ్ళాం కలిశారన్నమాట?'' అని పెదవి నొక్కుకుంటూ ఆలోచనలో పడింది వరూథిని.

''అంతా పై పై నాటకం! మొగుడూ పెళ్ళాలు బాగేనే వుంటారు''

''మరి రామనాథబాబు అలా మాట్లాడతాడేం?''

''మాట్లాడడు మరీ? తడిగుడ్డలతో గొంతులుకోసే రకం!''

వరూథినికి కళ్ళెర్రబడ్డాయి.

ఎంత మోసం? ఎంత కుట్ర? రామనాథబాబును ఏం చేసినా పాపం లేదు!

''హైదరాబాదే వెళ్ళాడేమో? దాన్ని కూడా ముంచేస్తాడు.''

''కాదమ్మా! విశాఖపట్నం వెళ్ళాడు. అక్కడేదో హాలు అమ్మకాని కొచ్చిందంట. కొనాలనే ఉద్దేశంతోనే వెళ్ళాడు.''

''అక్కడ దేన్ని పట్టుకొన్నాడో?''

''అక్కడ ఈయన పప్పులేం ఉడకవ్. ఇలాంటి బాబులు చాలామంది ఉన్నారు''

వరూథిని సరిగా వినలేదు.

''ఏమిటి రామదాసూ నువ్వంటున్నది?''

''ఇట్టాంటి బాబులు ప్రతి టౌన్లోనూ తయారయారమ్మా!''

''ఆఁ! వరూథిని కళ్ళు రెపరెపలాడాయి.''

అంతలోనే ఆమె ముఖం వివర్ణమయింది.

''సంవత్సరంగా మన ఏ క్లాసు టౌన్లన్నీ చూస్తూ తిరుగుతున్నాగా? షోకిలాగాళ్ళంతా సినిమా హాల్సులో చేరతారు. ఆఫీసు ముందూ, టెర్రెస్‌మీద కుర్చీలు వేసుకొని వచ్చేపోయే ఆడవాళ్ళను చూస్తూ కూర్చుంటారు. వాళ్ళకదే పనయిపోయింది. పల్లెటూళ్ళనుంచి, జబ్బులనీ, పిల్లల చదువులనీ వంకపెట్టుకొని, స్థితిగల కుటుంబాల్లోనుంచి బస్తీలకు రావడం, సినిమాలనీ పాడనీ మోజులుపడటం చివరికి ఇట్టాంటివాళ్ళ చేతుల్ల పడటం. కుటుంబాలకు కుటుంబాలే నాశనం అయిపోతున్నాయిగదమ్మా! మన టౌన్లో సగంమంది డాక్టర్ల ప్రాక్టీసేమిటను కున్నావ్?''

''నర్సింగ్ హోంలు కట్టడం. గదులద్దెకివ్వటం. గుండెజబ్బూ, నీరసమూ, ఆయాసమూ అనిచెప్పి ఏళ్ళ కొద్దీ ఉంచి టానిక్కులూ, మందులూ ఇవ్వటం వేలువేలు గుంజటమూను. అదేపని. ఛీఛీ! ఏం నర్సింగ్ హోంలో? ఏం సినిమా హాళ్ళో? ఊళ్ళు ఊళ్ళు నాశనం అయిపోతున్నాయ్. రామ! రామ! ఏ బస్తీ చూసినా? బెజవాడ-గుడివాడ-బందరు-గుంటూరు-తెనాలి-ఏలూరు..ఇంతెందుకు? ఎక్కడ రెండు సినిమాహాళ్ళుంటే అక్కడల్లా నర్సింగ్‌హోంలు వెలుస్తున్నాయి.

నాలుగు నర్సింగ్ హోంలు వుంటే- అక్కడ రెండు సినిమాహాళ్ళు లేస్తున్నాయి. అబ్బే ఇంకా ఏంబాగుపడతా..."

వరూథిని లేవడం చూసి ఆగిపోయాడు రామదాసూ. ఆమె ముఖంలో కత్తి వాటుకు నెత్తురు చుక్కలేదు. రామదాసు కేసి చూడలేక పోతూంది.

''ఉండు! కాఫీ తెస్తాను రామదాసూ!" అంటూ లోపల కెళ్ళింది.

చన్నీళ్ళతో ముఖం కడుక్కొని కాఫీకలుపుతూ అనుకొంది వరూథిని.

ఇన్నాళ్ళూ రామదాసు అంటే తను ఏమో అనుకొంది. అసాధ్యుడు. అతడు చెప్పిందంతా నిజమే. అందులో ఆవగింజంత అబద్ధం లేదు. రిప్రజెంటేటివ్‌గా ప్రతి టౌనూ తిరిగి చూసిన వాడు. ఆ షావుకారుగారి కోడలంతేగా? ఇట్లాటి రకం చాలా మంది ఉంటారు.

తను? మరి తనూ? తనూ అంతేగా?

గుండెలో దబ్బనాలు గుచ్చినట్టున్నాయి రామదాసు మాటలు. దీనికంతా కారణం ఆ రామనాథబాబే!వాడ్ని ప్రాణాలతో వదలకూడదు!

వరూథిని కాఫీకప్పు రామదాసుకు అందించి మళ్ళీ ఎదురుగా కూర్చుంది.

''మీరే తెచ్చారు? వంటమనిషిలేదేమో?" కాఫీ తాగుతూ అన్నాడు రామదాసు.

కొండ్రలావు ఏమయ్యాడయ్యా రామదాసూ?

వరూథినికి అకస్మాత్తుగా కొండ్రలావెందుకు గుర్తొచ్చాడో రామదాసుకు అర్థం కాలేదు. ఓ క్షణం ఆలోచించి చెప్పాడు.

''వాడా! పూర్తిగా చెడిపోయాడమ్మా! అసలే వాడున్న పేటంతా రౌడీలే! వాళ్ళతో చేరాడు. పనీపాటాలేదు. ఎవడు తాగబోయించి వందరూపాయలిస్తే వాడు చెప్పినవాడ్ని వెళ్ళి తన్నొస్తాడు. అట్లావుంది వాడిపని. వాడిప్పుడు మన టౌన్లోనే లేడు. బెజవాడలో పెద్ద మొనగాడిలా కాలరెత్తుకు తిరుగుతున్నాడు. అప్పటికీ ఓసారి చెప్పా. ఏమిటిరా ఇదని? వాడు..."

''రామదాసూ?" అతడిమాటలకు అడ్డొచ్చి అన్నది వరూథిని.

''నువ్వు గడ్డం ఎందుకు పెంచావ్?" కొండ్రలావు మీదనుంచి సంభాషణ తనగడ్డం మీదకు తిరిగేసరికి రామదాసు కొంచెం గాబరాపడ్డాడు.

''చెప్పాగా తిరుపతి మొక్కని?"

''ఏంపాపం చేశావ్?"

''మనిషన్న తరువాత ఏ పాపమూ చెయ్యకుండా వుంటాడా?" మాటజారి, జారినందుకు బాధపడ్డాడు రామదాసు.

''వెంకటేశ్వరస్వామి నీ జుట్టు తీసుకొని నీ పాపాన్ని కడిగేస్తాడా?" వరూథిని నవ్వింది.

అలా నవ్వుతున్న వరూథిన్ని చూస్తుంటే రామదాసుకు భయం వేసింది.

''పాపం కడిగేసుకోటానికేనా అందరూ దేవుడి దగ్గర కెళ్ళేది? పుణ్యం సంపాదించుకోవటానికని ఎందుకనుకోకూడదు?"

''కొండ్రావుని నా కొకసారి కన్పించమని చెప్తావా?'' ఆమె చూపులు తీక్షణంగా వున్నాయి.

''కొండ్రా వెందుకమ్మా!''

''వాడితో పనుంది!''

''వాడితో రిస్క్‌కూడా వుంది.''

''మరి నువ్వు చేస్తావా?''

''ఏమిటదీ?''

''రామనాథబాబును వేసెయ్యాలి!''

చింత కొమ్మమీద గొడ్డలిదెబ్బ గుర్తొచ్చింది రామదాసుకు.

''ఎటు తిరిగి గడ్డం పెంచావ్! అంతా ఒకేసారి కొట్టుకుపోతుంది.''

వరూథిని ఇంకా ఎలా నవ్వగలుగుతుంది? రామదాసు ఆమెకేసి ఆశ్చర్యంగా చూశాడు.

''అది అంత తేలిగ్గాదు.''

''అని ఎవరన్నారూ? అంత తేలికయితే నీదాకా ఎందుకూ?'' వరూథిని కంఠం 'ఖంగ్'న మోగింది.

రామదాసు తత్తరపోయాడు.

ఆమెకేసి చూస్తూ ''ఆడది; శక్తి!'' అంటారు ఇందుకే కాబోలు అనుకున్నాడు.

''ఏం? మాట్లాడవేం? పదిరోజుల్లో పని అయిపోవాలి.''

''పదివేలవుతుంది.''

''అలాగే పని పూర్తి చెయ్!''

''నా ఒక్కడితో ఏమవుతుంది? ఇద్దరు ముగ్గుర్నన్నా పట్టుకోవాలి. వాళ్ళు ముందే అడుగుతారు.''

''అంతా ముందే ఎలా ఇస్తాను?''

''అంతా అవసరంలేదు. ముందు సగం ఇవ్వండి. పూర్తయాక మిగతా సగం.''

వరూథిని లేచి పడక గదిలోకి వెళ్ళింది. రామదాసుకు ఆలోచించే వ్యవధి దొరికింది.

రామనాథబాబును ఖతం చెయ్యటం మాటలా? కొండ్రావు కళ్ళలో కదిలాడు. వాడికి వందిస్తే చాలు ఏ పనయినా చేస్తాడు. ఒక వెయ్యి పారేస్తే రామనాథబాబు తల నడిరోడ్డుమీద నరుకుతాడు. వాడికీ రామనాథబాబంటే కోపమే! ఓరకంగా రామనాథబాబు తనకూ శత్రువే. ఆ థియేటరు వరూథినమ్మ కింద ఉంటే ఈపాటికి తను మేనేజరయేవాడు. ఏడాదికి మూడువేలు జీతం, మూడువేలు బ్లాకూ దొరికేది. ఊళ్ళు ఊళ్ళు పట్టుకు తిరగలేక చస్తున్నాడు తను.

''ఇదిగో!'' కర్చీఫులో కట్టినమూట రామదాసు ముందు పడేసింది.

''పెద్ద గొలుసు పదిసవర్లు. అది కాసులపేరు ఇరవైరెండు సవర్లు, గజ్జెల వడ్డాణం పద్దెనిమిది సవర్లు, జడ బిళ్ళా, జడకుప్పెలూ, ఆ నాలుగు జతల వంకీ గాజులూ చేరి పది సవర్లకు పైగా వుంటాయ్ మొత్తం ఏభై సవర్లబంగారం... అమ్మితే నువ్వడిగిందానికంటే మూడింతలు ఎక్కువే వస్తుంది''.

''నగలన్నీ అమ్మేస్తారా?''

''అవన్నీ పాతకాలం నాటివేలే! వాడేవీ పెట్టేవీ కాదు. రవ్వల దుద్దులూ, రాళ్ళ నెక్లెసూ, సన్న గొలుసూ, నా చేతి గాజులూ కలిపితే ఇంకా పది వేలొస్తాయి. పనయిన తెల్లవారి రా. నీ డబ్బు నీ చేతుల్లో పోస్తాను.''

''అబ్బే అందుకనలేదు నేను. నగకట్టు అమ్మతున్నారే అని బాధకొద్దీ అన్నాను.'' రామదాసు తప్పుకొన్నాడు.

రామదాసు అసాధ్యుడు. ఎంత తెలివిగా మాటమార్చాడూ? అనుకొన్నది వరూథిని అతన్ని చూస్తూ.

''ఇవి నే నమ్మితే ముందే పట్టుపడతాను. డేంజర్. మీ నగలు మీరే అమ్మితే మంచిది కాష్ ఇవ్వండి.''

కేటు. రామదాసు ముందాలోచన ఉన్నవాడు. పని చేయగల సామర్థ్యం ఉన్నవాడే? వరూథినికి ధైర్యం కలిగింది.

''అనుభవం బాగానే వున్నట్టుందే రామదాసూ? ఇంతకుముందేదన్నా...?'' ఓరగా చూస్తూ అన్నది వరూథిని.

రామదాసు గుబురు గడ్డంలోనుంచి పెదవులు కదలడం కన్పించింది వరూథినికి.

రామదాసు లేచాడు.

''మళ్ళీ ఎప్పుడు కన్పించమంటారు?''

''ఎప్పుడోనా? ఆలస్యం అమృతం విషం అంటారు. రాత్రికి రా!''

వెళ్ళామన్న ప్రయత్నంలో రెండడగులు వేసి ఆగిపోయాడు. రామదాసు.

''అంతా చేతులు దాటిపోయాక బాబును సఫా చేస్తే మీకొచ్చేదేమిటి?'' వరూథిని ముఖంలోకి చూసి ఎందుకు అన్నానా అని నాలుక కొరుక్కున్నాడు.

''అప్పుడే ఏమయిందీ? ముందు లేదూ ముసళ్ళపండగ?''

ఆహారంకోసం బోనులో అలజడిగా తిరిగే పులి గుర్తొచ్చింది రామదాసుకు.

''వస్తానమ్మా! రాత్రి రెండో ఆట బుకింగ్ క్లోజ్ అయ్యాక కనిపిస్తాను. పొద్దుపోతుంది ఫర్వాలేదుగా?''

''అలాగే!'' వరూథిని రామదాసును వీధి వాకిలిదాకా సాగనంపింది.

బీరువా తెరిచి నగలపెట్టెలో వున్న రాళ్ళనెక్లెసూ, నాలుగు ఉంగరాలూ, తెగిపోయిన బంగారపు గొలుసుముక్కలూ తీసి మిగతా నగల్లో కలిపి మూటగట్టింది. పొయ్యిమీద వున్న అన్నం కాటుకంపు రాగా వరూథిని వంటగదికేసి పరుగెత్తింది. అన్నంగిన్నె మూతతీసి కాటువాసనతో పొగలు చిమ్ముతున్న గిన్నెలో నీళ్ళు పోసింది. అన్నంగిన్నె అటూ ఇటూ కదిలిస్తూ కూర్చుంది.

''ఎవరా గడ్డమోడు మనింటోనుంచి పోతున్నాడూ?'' వరూథిని గిన్నె పొయ్యిమీద వదిలి వెనక్కుతిరిగి చూసింది. భర్త నిలబడి వున్నాడు.

''నీతో అతను మాట్లాడలేదా?''

''నన్ను చూడలేదు. నేను ఇటునుంచొచ్చా, ఆ గడ్డమాయన అటునుంచి వెళ్ళిపోయాడు.''

''రామదాసు!''

''ఏ రామదాసు?''

''మన హోల్లో పనిచెయ్యేలా? ఆ రామదాసే. గడ్డం పెంచాడు.''

''ఓహో మన రామదాసా? పడమటిల్లు తలుపు తీసుంటేను?''

''ఆఁ'' కళ్ళు పెద్దవి చేసింది వరూథిని.

''బీరువా తలుపులు తెరిచుంటే అందుకడిగా! దొంగాడేవన్నా జొరబడ్డాడేమోనని?''

''అమ్మో! ఏం జాగ్రత్త! ఏం జాగ్రత్త'' తమాషాగా అంది వరూథిని.

''వడ్డించమంటారా?'' అడిగింది వరూథిని.

వెంకటపతికి కొత్తగానూ, వింతగానూ విన్పించింది.

''పెట్టు! పెట్టు!'' అని పదిసార్లు అంటేగాని అన్నం పెట్టని వరూథిని పదిగాకముందే అన్నం పెడతానంటోంది. అది అసలు తనకు పెట్టింది ఎన్నిసార్లు? వంటమనిషి ఉన్నప్పుడు అదే పెట్టేది. ఆవిడ వెళ్ళాక తనే ఎక్కువసార్లు పెట్టుకొని తినేవాడు. అయితే కేసు పోయిన దగ్గర్నుంచీ తనంటే ఎదురెదురుగా ఉంటోంది. గౌరవం చూపిస్తోంది. ఆ రోజు వ్యాజ్యం పోయిన రోజు వరూథిని ఊళ్ళోలేదు కాబట్టి సరిపోయింది. లేకపోతే ఏం చేసి వుండేవాడో తనకే తెలియదు. ఎంత ఆస్తి నాశనం చేసింది? ఇంకా ఇప్పుడేముంది? తను తినటానికీ, అది పెట్టటానికీ?

''ఏమిటండీ మీ ఆలోచనా మీరూనూ?''

''ఇంకేముంది ఆలోచించటానికి అంతా అయిపోయిందిగా?''

''వడ్డిస్తున్నా! ముందు మీరు కాళ్ళు కడుక్కురండి.'' పళ్ళెం, గ్లాసూ తీసి వంటింట్లో పీట వాల్చింది.

''ఏమిటంటా తొందర? ఎక్కడికి పోవాలంట? ఇంకేం చేస్తావు పెత్తనాలు? అంతా అయిపోయిందిగా?''

తనూ గట్టిగానే మాట్లాడగలడు. తనూ తెలివిగానే చురకలు వేయగలడు. దాని నోటికి వెరిచి ఊరుకున్నాడు ఇంతకాలం.

భార్య తగ్గినకొద్దీ వెంకటపతి బుర్ర చురుగ్గా పని చెయ్యసాగింది.

''పెత్తనాలా పాడా, తొందరగా తినండి. షరాబు బజారుకు వెళ్ళి రావాలి''

''నగలు కొంటావా? ఇంకేం కొంటావ్ ఆ రోజులు పోయినైగా?'' అంటూ గబగబా అన్నం కలుపుకొన్నాడు.

''నగలు అమ్ముదామని!''

వెంకటపతి నములుతున్న ముద్ద మింగి భార్య కేసి చూశాడు.

''ఉన్నయ్ అవేగా? అవికూడా తగలెయ్. తర్వాత జోలి పట్టుకు తిరుగుదువుగాని.''

''అదికాదండీ, హైకోర్టులో అపీలు చేస్తున్నాంగా?''

''ఈ కోర్టులో అయింది. ఇక ఆ కోర్టులో గెలుస్తావ్. ఫో! ఫో!'' విసురుగా అన్నాడు వెంకటపతి.

''ఆ! ముమ్మాటికి. ఇక్కడ శంకర్రావు అవతలివాళ్ళ దగ్గిర కతికి కేసు పాడు చేశాడు. హైకోర్టులో తప్పకుండా గెలుస్తాము. అక్కడ రామనాథబాబు ఆటలు సాగవు. అది హైకోర్టు! డాక్టరు భుజంగరావుగారుకూడా ఈమాటే అన్నారు.''

''ఆ! ఇక్కడలేని న్యాయం అక్కడుంటది?'' దిగులుగా అన్నాడు వెంకటపతి.

''ఎందుకూ? అంతగా దిగులుపడి పోతారూ? పొద్దున గుండె పరీక్ష చేయించుకోటానికి డాక్టరుగారి దగ్గిర కెళ్ళాను. అక్కడ గవర్నమెంటు ప్లీడరు హర్షిప్రసాదరావుగారు సమయాని కున్నారు. డాక్టరుగారే మన వ్యాజ్యం సంగతి ఎత్తారు. వారు చెప్పమంటే విషయాన్ని టూకీగా ఆయనకు చెప్పాను. ఆయన నాలుగుమాటల్లో తేల్చి చెప్పారు–'' భర్త వింటున్నాడా లేదా అనే అనుమానం వచ్చి ఆగింది.

తలవంచుకొని తింటున్న భర్త తలెత్తి ''డాక్టర్ల కేం తెలుస్తాయి కోర్టు సంగతులు?'' అన్నాడు.

వరూథినికి వళ్ళు మండిపోయింది.

ఒకటీ సరిగా విని చావడు. విన్నా తలకెక్కదు. అందులోనూ తిండిలో పడ్డాడా ఇక చెప్పనక్కర్లేదు.

కోపాన్ని నిగ్రహించుకొని వరూథిని అన్నది– ''డాక్టరంటారేం? గవర్నమెంటు ప్లీడరు చెప్పాడంటుంటే?''

''గవర్నమెంటు ప్లీడరా? అట్టయితే సరే! అయిందయింది'' పళ్ళెంలోని ఆఖరి మెతుకులు ముద్దచేసి నోట్లోకి విసురుకొంటూ అన్నాడు వెంకటపతి.

వరూథిని మళ్ళీ అన్నం పెట్టి పెరుగుగిన్నె బోర్లక్కున గుమ్మరించింది.

''అంతా వేశావ్ ! మరి నీకో?''

''నేను తినన్లే ! మీరు తినండి.''

''ఓహో ! తిన్నావన్నమాట?''

వరూథిని మనసు కలత చెందింది. ఏం మనిషి? తిన్నానో లేదో తెలియటంలా? తిన్నాననగానే నమ్మేశాడు. ఇలాంటి మనుషుల్ని ఎందుకు పుట్టిస్తాడో భగవంతుడు? పుట్టించాడే పో, తన పాలిటే పడేయాలా? తన కర్మ కాకపోతే?

పెరుగుముద్ద మింగి వెంకటపతి ''అన్నం కాటుపోయినట్టుందే? కాటు పోయింది! కాటుపోయింది'' అన్నాడు.

''నా బతుకే కాటుపోయింది !'' అనుకొన్నది వరూథిని భర్తను చూసి.

వెంకటపతి తింటున్న అన్నంలోని మాడుచెక్కలు తెల్లటి పెరుగులోనుంచి తొంగి తొంగి చూశాయి.

## 46

''ఎన్నిరోజులు పడ్తుందటా?'' రిక్షా ఎక్కి కూర్చున్న భార్యను అడిగాడు వెంకటపతి.

''ఎన్నో రోజు లెక్కడండీ? వారంరోజుల్లో తిరిగి రానూ? హైకోర్టులో కేసు దాఖలు చెయ్యగానే వస్తాను. ఇల్లువదిలి ఊరుమీద తిరక్కండి.'' అంటూ ఇంటికేసి చూసి దిగాలు పడిపోయింది.

ఇంకా ఏమున్నాయ్ ఆ ఇంట్లో? ఉన్నవేమో తన ఒంటిమీదే ఉన్నాయి. రవ్వల దుద్దులూ, సన్నగొలుసూ, మంగళసూత్రం, రెండు జతల నొక్కుల గాజులూ, ఓ ఉంగరంతప్ప మిగతా నగలన్నీ కొలిమిలో కరిగి ఈపాటికి ముద్దయి వుంటాయి. ఏ షావుకారు పెళ్ళామో, కూతురో బంగారం కొని నగలు చేయించుకొంటూ వుంటుంది. అమ్మ నగల్లో ఎక్కువభాగం తనకే ఇచ్చింది. తమ ఇంట్లో తరతరాలనుంచి వస్తున్న బంగారం అది. ఋణం తీరిపోయింది.

తలచుకొని వరూథిని కళ్ళనీళ్ళ పర్యంతం అయింది. భార్యను చూసి వెంకటపతి దిగాలు పడిపోయాడు.

''రిక్షా! పోనియ్ బాబూ!'' అన్నది వరూథిని.

భర్తకేసి తల ఊపింది.

రిక్షా కదలిపోయింది.

రిక్షా కనిపించినంతదూరం చూసి వెంకటపతి వాకిట్లో మెట్లమీద చతికిలబడ్డాడు ఎండలో. కాలిమీద కాలు వేసుకొని పై మోకాలు రెండు చేతుల్తో గుంజుకుంటూ ముందుకు వంగి ఆలోచనలో పడ్డాడు.

అరగంట అలాగే కూర్చున్నాడు. అయినా ఆలోచన తెగలేదు. కిందా పైనా వేడెక్కి బ్బుర చ్చురుమంది. లేచాడు. పంచ దులుపుకొని నెత్తిమీద వేసుకొన్నాడు.

''మాలావు ఎండ కొడ్తుందే? పొద్దు రెండుబారలన్నా ఎక్కలేదు. ఎండ దంచేస్తుంది. ఎండాకాలం వచ్చినట్టుంది.'' గొణుక్కున్నాడు వెంకటపతి.

లోపలకెళ్ళి తాళం తెచ్చాడు. తలుపుకు తాళంవేసి రోడ్డున పడ్డాడు. జేబులో వున్న కరెన్సీనోట్లను చేత్తో తడిమి చూసుకొన్నాడు.

వారంరోజులు అడిగేవాళ్ళు లేరు. ఇష్టారాజ్యంగా తిరగొచ్చు. తాగొచ్చు.

''ఓ మడిసీ ! తప్పుకో ! నీకేనయ్యా ! గంట కొడ్తావుంటే వినపట్టంలా?'' వెనకనుంచి రిక్షావాడు ఒకటే అరుపు.

''చూళ్ళేదులే ! ఫో !ఫో !'' వెంకటపతి తప్పుకొని రోడ్డువారగా నడవసాగాడు—దొంగసారా అంగడికేసి.

స్టాండ్‌కు ఇంకా హైదరాబాద్ బస్ రాలేదు. వరూథిని రిక్షా దిగి స్టాండింగ్‌లో బస్ వచ్చేచోటుకు వెళ్ళి నిలబడింది. కూలివాడు పెట్టె తెచ్చి ఆమె పక్కన పెట్టి వెళ్ళిపోయాడు. బస్సుకోసం ఎదురుచూస్తున్న వరూథినికి లోపలకు వస్తున్న ఎంబాసిడర్ కారు కన్పించింది.

ఆ కారు...? ఆమె గుండె వేగంగా కొట్టుకోసాగింది. కార్లో నుంచి దిగాడు రామనాథబాబు. తనవైపే చూస్తూ వస్తున్నాడు. అదే నవ్వు...అవే చూపులు. మనిషిలో మార్పేమీ లేదు. అతడు దగ్గరగా వచ్చేస్తున్నాడు. వరూథిని తలవొంచి కళ్ళు దించేసుకొంది.

‘‘ఎక్కడికి వరూ ప్రయాణం?''

ఎంత తియ్యగా మాట్లాడతాడు?

‘‘హైదరాబాదేనా వరూ?''

ఎంత ఆప్యాయత ఆ పలకరింపులో పలుకుతుంది? అతని కెలా తెలిసింది తను హైదరాబాదు వెళుతున్నట్టు?

జనానికి దూరంగా వెళ్ళి నిబడింది. రామనాథబాబు ఆమె వెనకే వచ్చాడు.

‘‘హైకోర్టులో అపీలు చేస్తున్నావటగా? ఇంకా కోర్టులూ, కేసులూ ఎందుకు చెప్పు? నీ రెటమతం నీది. చెప్తే వింటావా?''

‘‘ఐదులక్షలాస్తి నీ పెళ్ళాని కప్పజెప్పి చేతులు ముడుచుకు కూర్చోమంటావా?''

రామనాథబాబు పక్కలకు చూసి, ‘‘ఇది బస్‌స్టాండ్ వరూ! మెల్లగా మాట్లాడకూడదూ?'' అనునయంగా చెప్పాడు.

‘‘ఏం? నన్ను తలగొట్టి మొలేస్తారా? పరువెప్పుడో గంగలో కలిసిపోయింది. నా ఇష్టం వచ్చినట్టు చేసుకుంటా నువ్వెవడివి అడగటానికి? ''

‘‘ఆవిడా అదేమాట! చేసుకోండి. చేసుకోండి. మధ్య నే నెవర్నీ? ఇక్కడ అయింది చాలు ! మీ కీర్తి హైదరాబాదులో కూడా చాటింపు వేయించుకోండి. మాటే వినిపించుకోని మనుషుల్తో ఏం మాట్లాడతారు ఎవ్వరైతే మ్మాతం?'' టిన్‌లోనుంచి తీసిన సిగరెట్టు కిందపడింది. మరోకటి తీసి వెలిగించుకొన్నాడు రామనాథబాబు.

ఎంత హుందామనిషి? కిందపడ్డ సిగరెట్టు వైపన్నా చూడలేదు. తేరగా వచ్చింది. పరాయి సొమ్ము. ఆడాళ్ళ సొమ్ము.

‘‘ఎందుకు బస్‌లో పడి పోతావ్? కారు తీసుకెళ్ళు. ఇంజన్ చెక్ చేయించి రేపు తెల్లవారుతూనే పంపిస్తా.''

‘‘నీ కార్లో తిప్పేవాళ్ళను తిప్పు. చాల్లే! నీ కారూ వద్దు! నీ మర్యాదా వద్దు'' స్టాండ్‌లోకి వస్తున్న హైదరాబాద్ బస్సును చూసి వరూథిని గబగబా ముందుకు నడిచింది.

‘‘సరే, నీ ఇష్టం. నే వస్తా! నాలుగురోజుల్లో హైదరాబాద్ రావాల్సిన పని ఉంది. అప్పటిదాకా ఉంటావా?'' ఆమె పక్కనే నడుస్తూ ఆగిపోయాడు రామనాథబాబు.

వరూథిని మాట్లాడకుండా బస్ ఎక్కింది.

''వరూ ! నే వస్తామరి !'' కింద నిలబడి చెయ్యి ఊపాడు రామనాథబాబు.

వరూథిని తల ఊపింది.

''వస్తాడు? వస్తాడు? ఇక ఒకటే రావటం ! ఇక నీ నాటకం మీద తెర పడుతుంది!! హైదరాబాద్ వచ్చి లాయర్లను పట్టుకొని పెళ్ళాన్ని గెలిపించే రోజులు అయిపోయినై. ఆ శ్యామలాంబ ఇంకెలా గెలుస్తుందో నే చూస్తాగా? హైకోర్టుకు వెళ్తున్నాననగానే కాళ్ళబేరాని కొచ్చాడు. కింద కోర్టులో దొంగ ఏడ్పు ఏడ్చి గెలిచాడు. హైకోర్టులో ఓడిపోతామని వాళ్ళకీ తెలుసు. తెలిసే ఇట్లా దిగజారిపోయి మాట్లాడుతున్నాడు. అసలు వాడి పెళ్ళామే అదిరిపోయి మొగుడ్ని పంపించి ఉంటుంది. బోడిముండ. దాని పని అప్పడే ఏమయింది? వెధవముండ. దాన్ని..'' అనుకొంటూ ఆగిపోయింది.

కారుదగ్గర కెళ్తున్న రామనాథబాబును రెప్పవాల్చకుండా చూసింది వరూథిని.

ఆ నడకలో ఎంత రాజసం? ఆ మనిషి పొందికా? ఆ మాట తీరూ, ఆ చూపులూ-- ఆనవ్వూ-- మళ్ళీ తనకు కన్పించవా? అతను మళ్ళీ కన్పించడా?

వరూథినికి కడుపు తరుక్కుపోయింది. గుండెలు తోడేస్తున్నాయి.

భగవంతుడా? తను మనసారా ప్రేమించిన మనిషిని చేజేతులా చంపుకొంటున్నదా?

రామదాసు చేతిలో చురకత్తీ, కొండ్రలావు చేతులో ఈటే వరూథిని కళ్ళముందు నిగనిగలాడాయి ! ఆమె గుండెలోనే దిగబడ్డాయి. పొర్లుకొస్తున్న దుఃఖాన్ని దిగమింగడానికి ప్రయత్నించి విఫలురాలైంది.

''ఏమ్మా ? మీ ఆయన రావటం లేదా? పుట్టింటి కెళ్తున్నావా?'' పక్క సీట్లో కూర్చున్న గంగాభాగీరథీ సమానురాలు ఓదార్చటానికి ప్రయత్నించింది.

''ఎన్నో నెలా?'' నెత్తిమీద ముసుగు సర్దుకొని వరూథిన్ని ఓసారి పరీక్షించి అన్నది మళ్ళీ.

''అప్పడే వెళ్తున్నావేం అమ్మాయీ? మా కాలంలో ఏడోనెల నిండంది పోనిచ్చేవాళ్ళు కాదమ్మా.''

అంత దుఃఖంలోనూ వరూథినికి నవ్వొచ్చింది.

''మీ నాన్నగారు హైదరాబాద్‌లో ఏం చేస్తుంటారు?''

''ఇక్కడ మీ ఆయన కేంపని?''

''మా పెద్దబ్బాయి పెళ్ళానికి కడుపు పోయిందంట! అబ్బాయి రమ్మని రాస్తే వెళ్తున్నా''

ఇక అక్కడికి ఆపి, ఎన్ని అడిగినా మాట్లాడవేం అన్నట్టు వరూథినికేసి చూసింది. వయసు మళ్ళిన ఆ విధవావిడ.

కర్మగాలి ఆవిడకు తన పక్కనే సీటు దొరకాలా! డోకు వచ్చేట్టుంది. వీలయినంత ఎడంగా జరిగి ముఖం తిప్పకొని బయటికి చూస్తూ కూర్చుంది. వరూథిని.

బాబు ఎలా వున్నాడో? డిసెంబరు సెలవలకు వచ్చినపుడు బాగా చిక్కిపోయి వున్నాడు. వాడికి పరీక్షలుకూడా దగ్గిరకొస్తుండాలి. ఎలా చదువుతున్నాడో!

## 47

బస్ హైదరాబాద్ చేరే సరికి ఎనిమిది అయింది. టాక్సీ చేసుకొని హోటల్ కెళ్ళింది వరూథిని.

హోటల్ గదిలో దిగుతూనే గోపాలరావు నంబరుకు ఫోన్ చేసింది.

''హల్లో!''

''గోపాలావుగారి యిల్లు ఇదేనా అండీ?''

''అవునండీ! మీ రెవరూ?''

''వరూథిని.''

''గోపాలరావుగారింట్లో లేరండి.''

''ఎప్పుడొస్తారో?''

ఏమో తెలియదు.

''వారొచ్చాక ఒకసారి ఫోన్ చెయ్యమని చెప్తారా?''

''అలాగే!''

''రూం నంబరు ట్వెంటీవన్. క్రీడావన్ హోటలు. ఆబిద్..''

అవతల ఫోన్ పెట్టేశారు. వరూథిని రిసీవర్ పెట్టేసింది. అదేం పొగరూ? మాట్లాడుతుండగానే పెట్టేసింది ఆవిడ? మాట్లాడింది పెళ్ళామా? కూతురా? గొంతు పెద్దదాని గొంతులా వుంది. మాట్లాడే తీరుచూస్తే చిన్నపిల్లలా వుంది. స్టయిల్‌గా మాట్లాడింది. పెళ్ళామా! తల్లా కాదు... తల్లా పెళ్ళామా? అమ్మా? కూతురా? ఏదీకాదు. కోడలేమో? గోపాలరావుకు అంత పెద్ద కొడుకు ఉండటానికి వీల్లేదే? ఆయన మనిషి అలా కనిపిస్తాడుకాని వయస్సు ఎక్కువ ఉండదు. అంత పెద్దకూతురూ ఉండదు. అయితే అత్తా? కోడలా? అత్తో, కోడలో అయివుండాలి. ఎవరైతే ఏంగాని అసలు గోపాలరావుకు రాగానే చెప్తారా? పెళ్ళాం అయితే చెప్పదు. అమ్మయితే మర్చిపోతుంది. కూతురయితే ఇంట్లో ఉండదు సినిమాకు పోతుంది. కోడలయితే చెప్తుంది. అసలు మామతో మాట్లాడుతుందా? మామ సాంబయ్యకు ఎదురుపడి మాట్లాడాలంటే తనకు ప్రాణాలు అన్నుబట్టేవి. కోడలైతే మొగుడికి చెప్పి తండ్రికి చెప్పిస్తుంది. కోడలే...

ఆలోచిస్తూ వరూథిని టవల్ భుజాన వేసుకొని బాత్‌రూంలోకి నడిచింది.

అరగంట తర్వాత ఫోన్ మోగింది. వరూథిని మంచంమీద నుంచి ఫోన్ దగ్గర కొచ్చింది.

''హల్లో!''

''గోపాలరావుగారా? నేను వరూథిన్నండీ?''

''వరూథినా? అంటే?''

''నేనేనండీ? వరూథినీ పిక్చర్ ప్యాలెస్...''

''సారీ! గుర్తు రావటం లేదే?''

''మీరు గోపాల్రావుగారే కదూ?''

''అవునూ!''

''విశాఖపట్నం హోటల్ ప్రొప్రయిటరు గోపాలరావుగారి కజినేకదూ మీరు?''

''ఆహాఁ! మీకా గోపాల్రావు కావాలా? ఆయన యం. గోపాల్రావు. నేను యస్. గోపాల్రావుని.''

''క్షమించాలి. పొరపాటయిపోయింది.'' వరూథిని ఫోన్ పెట్టేసింది.

ఛీ! ఛీ! తనెంత పొరపాటు పనిచేసింది? ఆయన యం. గోపాల్రావా? ఆ హోటల్ ఆయన యన్. గోపాల్రావా? ఈయనేమో యస్. వీళ్ళకు పేర్లే దొరకవా ఏం? గోపాల్రావులూ వెంకటేశ్వర్రావులూ, సుబ్బారావులూ...వీళ్ళను తగలెయ్య ఏం మనుషులూ? ఏం పేర్లూ? ఆంధ్రదేశంలోని జనాభాలో సగంమందికి ఇవే పేర్లు;

రామనాథబాబు! ఎంత అందంగా ఉంది పేరు? మళ్ళీ అతను గుర్తొచ్చాడేం? వీడు చచ్చినా నన్ను వదిలేట్టు లేడు! అన్నట్టు రామదాసు ఈ పాటికి...

టెలీఫోన్ డైరక్టరీ తిగేస్తున్న వరూథిని వేళ్ళు వణికాయి.

గోపాలరావు యం. బంజారా హిల్స్. ఇదేం ఇక్కడేవుంది.

వరూథిని రిసీవర్ ఎత్తి హోటల్ ఎక్స్చేంజి వాడికి నంబరు చెప్పింది.

''స్పీక్ ఆన్ సర్ !''ఎక్స్చేంజ్‌వాడి కంఠం పలికింది.

సార్ అంట సార్! వీడి బొంద! మేడం అనొద్దూ?

''హల్లో! ఎవరు కావాలండీ?'' మొరటుగా అడిగాడు అవతలివాడు.

''యం. గోపాల్రావు గారు లేరా?''

''ఇది గోపాల్రావు గారిల్లండీ.'' బండగా వుంది మాట.

వీడ్ని తగలెయ్యా వీడెవడూ? పెళ్ళయిన కొత్తలో వెంకటపతిలా ఛ!ఛ! వెంకటపతి తన భర్త! వీడెవడో?

''మీ రెవరూ?''

''ఆరి నౌకర్ని''

''గోపాల్రావుగార్ని పిలువ్!'' నొక్కి అన్నది వరూథిని.

''అయ్యగారు ఊళ్ళో లేరమ్మా'' అవతలవాడు మెత్తబడిపోయాడు.

''ఎక్కడికి పోయారూ? ఎప్పుడొస్తారూ?''

''బెజవాడ వెళ్ళారమ్మా! ఫేమిలీతో వెళ్ళారు.''

''ఎప్పుడొస్తారు?''

''ఫేమిలీని దిగబెట్టివస్తారు. రేపు రాత్రికి వస్తారేమో!''

''రాగానే క్రీడా భవన్ నుంచి వరూథిని ఫోన్ చేసిందని చెప్తావా? గుర్తుంటుందా?''

''ఆఁ ఏంటీ! కీచక భవన్ నుంచి అరూదినా?''

''నీ బొందా! నీ బోలె!'' వరూథిని రిసీవర్ పెట్టేసింతర్వాత గాని తిట్టలేదు. తను తిట్టింది వాడికి వినబడే ఉంటుందనుకొంది.

వరూథిని తిరిగి వెళ్ళి పక్కమీద వాలింది. రేపు రాత్రిక్కాని గోపాలరావు రాడు. ఎప్పుడు వెళ్ళాడో ! ఆ మాట అడగనే లేదు. ఫేమిలీని తీసుకెళ్ళాడా? బెజవాడలో వదిలి వస్తాడా? ఇవేం ఫామిలీలు మొగుడు తోడురాందే వెళ్ళ లేరా? హైదరాబాద్‌నుంచి బెజవాడ వెళ్ళటానికి మొగుడుతోడుకావాలా? వీళ్ళు పెళ్ళాలా? గుది బండలా? ఈ రకం సజ్జుతో ఈ మగాళ్ళు ఎట్లా కాపరాలు చేస్తున్నారో? అఁకాపరాలా? ఏదో పై పై నాటకం ! ఎప్పుడూ వీళ్ళ కళ్ళు వెతుకుతూనే ఉంటాయి. ఆకలి ముఖాలు వేసుకొని అందమైన ఆడది కనిపిస్తే చాలు ఎలా చూస్తారో? చురుకైన ఆడది కనిపిస్తే చాలు! గంటలకొద్దీ మాట్లాట్టానికి ఏమీలేక పోయినా ఎదురుగా కూర్చోని పడిగాపులు కాస్తారు. చెలాకయిన ఆడది కనిపిస్తే పెంపుడు కుక్కలా తోకలాడించుకొంటూ చుట్టూ తిరుగుతారు. ఈ మగాళ్ళూ! ఈ ఆడాళ్ళూ!

వరూథిని బుర్ర వేడెక్కిపోయింది. తలలో ఏదో తెలియని సన్ననిపోటు! చెవుల్లో వింత ధ్వనులువిన్పిస్తున్నాయి. గుండె కలుక్కుమంది. పళ్ళరసం వత్తే చక్కలమధ్య పెట్టి వత్తినట్టుగా వుంది!

ఏమిటామోత? శివరాత్రినాడు జనం తొక్కిడిలో గర్భగుడిలో టెంకాయలు కొట్టినమోత! కొబ్బరికాయలు అడ్డంగా పగిలి పోతున్నాయి. తెల్లటి కొబ్బరి చిప్పలు!

అబ్బా కింది పెదివి ముందు పళ్ళతో నొక్కిపట్టి, పక్కమీద మెలితిరిగి పోయింది వరూథిని. బాగా పొద్దుపోయి పడుకున్న వరూథినికి పొద్దెక్కిగానీ మెలుకువరాలేదు.

టైంచూసుకొని గాబరా పడిపోయింది. బాబు స్కూలుకు తొమ్మిదిలోపే వెళ్ళాలి. క్లాసులు మొదలు పెట్టకముందే బాబును తీసుకు రావాలి. క్లాసులోనుంచి రావటానికి వాడు బిడియపడతాడు. క్లాసు జరుగుతుండగా తీసుకెళ్తామంటే అక్కడి టీచరూ పిల్లలు కూడా అదోలా వింతగా చూస్తారు. అదేం మామూలు స్కూలా! జాగీర్దార్ స్కూలు! వరూథిని హడావిడిగా స్నానం చేసి కాఫీ అన్నా తీసుకోకుండా హోటలు నుంచి బయటికొచ్చింది. టాక్సీ ఎక్కి బేగంపేట బయలుదేరింది.

బాబుని చూసి ఎన్నాళ్ళయిందో? వాడు శెలవల కొచ్చినప్పుడు చూడటమే. రెండు నెలలకు పైగా అయింది. ఈ ముదనష్టపు గొడవల్తోనే సరిపోయింది తనకు. బిడ్డ ఎలా వున్నాడో ఏమో? హఠాత్తుగా తనను చూసి ఎంత సంతోషపడ్తాడో? ఈ రోజంతా బాబుతోనే గడిపేయొచ్చు. తనకూ ఏమీ పనిలేదు. గోపాలరావు ఊళ్ళో లేకపోవటం మంచిదే అయింది. లాయర్లూ, కోర్టులూ, గొడవల్లో పడితే తనకు ఇంత తీరిక ఎక్కడుంటుంది?

టాక్సీ స్కూలు కాంపౌండులోకి వచ్చి ఆగింది.

వరూథిని దిగి బోర్డర్స్ ఉండే బిల్డింగ్ కేసి వెళ్ళింది.

మరో పావుగంటలో కొడుకుని వెంటబెట్టుకొని తిరిగొచ్చి టాక్సీ ఎక్కింది. టాక్సీ హోటల్‌ముందు ఆగింది.

''ఈ డ్రెస్సెప్పుడు కొన్నాంరా? గుర్తేలేదు.'' కొడుక్కు ఉప్మా తినిపిస్తూ అన్నది తల్లి.

''ఇవి కొత్తవిగదమ్మా! బాబాయి తెచ్చి ఇచ్చాడమ్మా?''

''ఏ బాబాయ్? ఎప్పుడిచ్చాడు?''

''మన బాబాయే! రామనాథబాబాయి.''

వరూథిని గుండె ఝల్లుమంది.

''ఎప్పుడొచ్చాడు బాబూ? నిన్ను చూట్టానికి వస్తూవుంటాడా?''

''పోయిన మంత్‌లో ఒక్కసారీ, ఈ మంత్‌లో ఒకసారీ వచ్చాడమ్మా! వచ్చినప్పుడల్లా ఏమైనా తెచ్చి ఇస్తుంటాడమ్మా!''

వరూథిని కళ్ళు చెమ్మగిల్లాయి. రామనాథబాబుకు వాడంటే ఎంత ప్రేమా? దుర్మార్గురాలు తనెంతకు సిద్ధమయింది?

''బాబాయేడమ్మా?''

''రాలేదు బాబూ! ఇంద! తినుమరి?'' అని ప్లేటు కొడుకుముందు పెట్టి ముఖం తిప్పుకొని పైటచెరుగుతో కళ్ళు తుడుచుకొంది.

''అమ్మా! నాన్నను ఒక్కసారికూడా తీసుకురాలేదేం అమ్మా? డాడీ మా స్కూలే చూళ్ళేదుగా? ఎట్లా వుంటుంది, పెద్దదా, చిన్నదా అని శెలవుల కొచ్చినప్పుడల్లా అడుగుతాడమ్మా.'' అమాయకంగా చేతులు తిప్పుతూ అన్నాడు రవి.

''ఈ సారి వేసవికాలం శెలవులు అయిపోయాక వస్తావు చూడూ? అప్పుడు మీ నాన్నగారితోనే వద్దువుగానిలే బాబూ!''

''అమ్మా! నాకు తాతయ్య ఉన్నాడంటగా?''

''ఎవరు చెప్పారూ?''

''నాన్నే చెప్పాడు. తాతయ్య సంగతులు బోలెడన్ని చెప్పాడమ్మా! నీతో చెప్పొద్దంటాడు ఎందుకూ?''

''మీ నాన్ననే అడక్కపోయావ్రా?''

''తాతయ్య మనింటి కెందుకనే రాడూ?''

''ఈసారి వచ్చినప్పుడు మనూరెళ్ళి తాతయ్యనే అడుగు.''

''తాతయ్య దగ్గిరకు నువెళ్ళనిస్తావా?''

వరూథిని కొడుకుకేసి ఓ క్షణం చూసింది.

''నాకేం పట్టింది? నువ్వెళ్తే?''

''తాతయ్యంటే నీ కిష్టం లేదంటగా? తాతయ్యతో నువ్వు పోట్లాడావా?''

''ఇవన్నీ మీ నాన్నే చెప్పాడా?'' వరూథిని ముఖం కందిపోయింది.

రవి బెదురు చూపులు చూశాడు.

''ఊఁ, తొందరగా కానియ్? బజారుకు పోవద్దా?''

''అమ్మా! జ్యూ కెళ్దామే?''

తల్లీ కొడుకూ జ్యూలో సాయంకాలం నాలుగ్గంటలదాకా గడిపారు. జంతువులను చూస్తూ, ఐస్క్రీం తింటూ, కేరింతలు కొడుతున్న కొడుకుని చూస్తూ, తన్మయురాలై పోయింది వరూథిని. కొడుకు తల్లిచేత బలవంతంగా ఐస్క్రీం తినిపించాడు. చెట్టుకింద కూర్చొని సేద తీర్చుకొంటూ రవి భవిష్యత్తును గురించి ఎన్నో ఊహలల్లుకొంది.

తిరిగివస్తూ బజార్లో రవికి బట్టలు కొన్నది. ఇంకా వాడడిగినవన్నీ కొన్నది. ఐదున్నరకు హోటల్ చేరారు తల్లీ కొడుకు. వరూథిని అలసిపోయి వుంది. పక్క మీద వాలి నిట్టూర్పులు విడిచింది.

హైకోర్టులో కూడా కేసు నెగ్గకపోతే? రవి భవిష్యత్తు ఏమికాను?

''అమ్మా సినిమాకు తీసుకెళ్ళవా?'' అడిగాడు రవి.

''అబ్బ నీ ఓపికేంరా?''

ఏం సినిమాలో? పాడు సినిమాలు. ఒక్కటీ అయ్యా అమ్మకు పుట్టినవి కావు. ఈ సినిమా కథలకు తలా తోకా వుండదు.

''ఏంమ్మా మాట్లాడవేం? సినిమాకు తీసుకెళ్ళవా?''

''ఏం సినిమాలున్నాయిరా? ఏం సినిమా చూస్తావ్?''

''టార్జాన్ అండ్ ది గ్రేట్ రివర్!'' తనే టార్జాన్‌లా ఫోజు పెట్టి అన్నాడు రవి.

''ఊఁ, త్వరగా బట్టలు మార్చుకో పోదాం.''

''ఇప్పుడు కొన్నవి కొత్తడ్రస్ వేసుకోనా?'' సంతోషంగా అడిగాడు.

* * *

ఆ రాత్రి కొడుకుని పొదువుకొని పడుకొని ఎన్నో ఆశా సౌధాలు నిర్మించుకొంది వరూథిని.

తెల్లవారి తొమ్మిది దాటకముందే రవిని స్కూల్లో దిగబెట్టి తిరిగి హోటలు కొచ్చింది.

రాత్రి గోపాలావు ఊరినుంచి తిరిగి వచ్చి ఉంటాడా? ఆలోచిస్తూ వరూథిని ఫోన్ ఎత్తింది.

''హల్లో!''

నౌకరు పలికాడు.

''గోపాలావుగారు వచ్చారా?''

''ఆఁ. రాత్రే వచ్చారు.''

''నేను ఫోన్ చేసిన సంగతి చెప్పావా?''

''మీ పేరు గుర్తులేదమ్మా! ఎవరో అమ్మగారు మూడుసార్లు చేశారని చెప్పాను.''

''సర్లే! ఆయన్ను పిలువు!''

''లేరమ్మా! ఇప్పుడే ఫ్యాక్టరీకి పోయారు. ఫోనా? ఉంది. వేసుకోండి... ఐదూ - ఏడూ - మూడూ - మూడూ - మళ్ళీ ఏడూ -''

వరూథిని నంబరు నోట్ చేసుకొని రిసీవర్ ఎత్తి నంబరు తిప్పింది.

''హల్లో! గోపాల్రావ్, హియర్!''

''నేనండి! వరూథిని!'' వరూథిని హృదయం పొంగింది.

''ఆఁ. ఎవరూ? ఓహో! మీరా? ఎప్పుడొచ్చారూ?''

''మొన్నరాత్రి.''

''మొన్నరాత్రా? మరయితే... ఓహో మీరేన్నమాట. మొన్నా నిన్నా కూడా ఫోన్ చేసింది. వెధవ మీరని చెప్పలేదే? ఏదో కీచకా బోచకా అన్నాడు''

''వాడు తప్ప మరొకడు దొరకలేదా ఏం మీకు?''

''నమ్మకస్తుడు. పిచ్చోడు. మా ఊరినుంచి తీసుకొచ్చా. ఇంతకూ ఎక్కడున్నారూ? ఏమిటి సంగతీ?''

''క్రీడాభవన్‌లో, రూం నంబరు...''

'ఛ! ఛ! ఆ హోటల్లో ఉన్నారా? ఆ హోటల్‌కు అంత మంచి పేరు లేదు. వెంటనే మార్చేయండి.'

''ఎక్కడికి మార్చమంటారూ?''

''ఆఁ చూడండి! మీరు గది ఖాళీచేసి రెడీగా వుండండి. కారు పంపిస్తున్నా.''

''మీరు రాకూడదా ఏం?''

''నే చెప్పాగా! ఆ హోటల్ సంగతి! మీరు కార్లో వచ్చేయండి. ఈలోపల న్యూమూన్ హోటల్లో రూం బుక్ చేస్తా. ఓ. కే! ఉంటామరి!'' గోపాలరావు ఫోన్ పెట్టేశాడు.

వరూథిని న్యూమూన్ హోటల్ చేరేసరికి గోపాల్రావు పోర్టికో మెట్లమీద నిలబడి వున్నాడు.

డ్రైవర్ కారాపి దిగి, వెనక్కు పరుగెత్తుకొచ్చి డోర్ తెరిచాడు. వరూథిని కారు దిగింది.

గోపాల్రావు ఎదురెళ్ళి కళ్ళతోనే స్వాగతం పలికాడు. ఆమె పెదవులపైన కదిలిన చిరునవ్వులు కృతజ్ఞతను తెలియజేశాయి.

## 48

వెంకటపతికి భార్య వెళ్ళాక మొదటి మూడు రోజులూ సర్దాగా ఉంది. భార్య ఇచ్చిన డబ్బంతా మూడురోజుల్లోనే ఖర్చు పెట్టాడు. పొద్దునా సాయంకాలం మస్తుగా తాగి కోడి పలావులు తిన్నాడు. ఎన్నో నెలల తర్వాత దొరికింది. అంత సుఖం. నాలుగో రోజున డబ్బులయిపోయేసరికి, తనే అన్నం వండుకొని పచ్చడీ, పెరుగూ వేసుకొని తిన్నాడు. ఆ రోజంతా ఇంటిపట్టునే ఉన్నాడు.

ఇంట్లో ఉంటే పిచ్చెత్తినట్టయిపోతుంది. బయటికెళ్ళి ఏం చేస్తాడు? చేతిలో చిన్న పైసాలేదు. మూడు రోజులుగా పుష్కలంగా తాగాడు. ఒకరోజు లేకపోయేసరికి పిచ్చెత్తినట్టయింది. ఐదోరోజుకు మనిషి చచ్చుబడిపోయాడు. వళ్ళంతా జలగలుపట్టి పీకినట్లయింది. తెల్లవారి కాఫీనీళ్ళకు కూడా కరవైపోయింది. ఇల్లంతా వెతికాడు. ఎక్కడా ఒక్క రూపాయికూడా దొరకలేదు.

'ఎక్కడ దాస్తుందో! దాని దాపరికమూ అదీ? డబ్బంతా పట్టుకుపోయింది'.

అనుకొంటూ ఇల్లంతా కాలుగాలిన పిల్లిలా తిరిగాడు.

ఈ రోజు తాగకపోతే తను బతకలేడు. కాళ్ళు కుంగదీస్తున్నాయి. తల వాలిపోతోంది. మెడలు నిలవడం లేదు.

పడక గదిలోకి వెళ్ళి బీరువా హాండిల్ గుంజాడు. రాలేదు.

తాళం చెవులు పట్టుకెళ్ళిందా? అలా పట్టుకెళ్ళదే? ఇకడే ఎక్కడో దాచి ఉంటుంది.

పరుపుకింద వెతికాడు కన్పించలేదు. మంచం ఎక్కి బీరువా మీద వెతికాడు. కన్పించింది - వెండి బిందె!

వెంకటపతి మరొక ఆలోచన రాలేదు. మరోక్షణం ఆగలేదు. వెండి బిందె పుచ్చుకొని మంచం మీద నుంచి దూకాడు.

మార్వాడీ దుకాణంలో వెండి బిందె అయినకాడికి అమ్మాడు. వాడిచ్చిన మూడొందల పాతిక రూపాయలు తీసుకొని బయటపడ్డాడు. కూల్‌డ్రింక్ షాపు సందులోకి వెళ్ళాడు.

అన్నం బదులూ, నీళ్ళబదులూ కూడా నాటుసారా తాగాడు. ఆరు గంటలకు సందులో వున్న గదిలో నుంచి బయటపడ్డాడు. బ్రహ్మాండంగా వుంది! మనసుతో పాటు ఒళ్ళుకూడా గాల్లో తేలిపోతూంది. తోవలో కనబడ్డ హోటల్లో తినగలిగినంత తిన్నాడు. హోటల్లో మెట్లు దిగుతుంటే వెంకటపతికి మెట్లూ రోడ్డూ ఒకే లెవల్లో కన్పించాయి.

రిక్షా పిలిచి మెల్లగా కూర్చున్నాననుకుంటూ ఎగిరి అందులోకి ఎక్కాడు.

"పోనియ్!" అన్నాడు రిక్షావాడ్ని చూడకుండా.

"ఎక్కడికండీ?" అన్నాడు రిక్షావాడు.

"ఎక్కడికయితే నీ కెందుకూ? పోనియ్యమంటూంటే? ఇట్టా పోనియ్!" అంటూ ఎడంచెయ్యి కుడివైపుకు చూపించాడు.

రిక్షావాడు నవ్వాపుకోలేక ముఖం దించుకొని రిక్షా వెంకటపతి చూపించిన రోడ్డుకు మళ్ళించాడు.

రిక్షా వేగంగా పోతుంటే చల్లగాలి వెంకటపతి ముఖాన్ని తాకి అతడి మత్తుని కొంత మోసుకొని పోయింది.

"ఆపాపు! ఇంకా పోతావేం? మా హాలొచ్చేసిందిగా?" వెంకటపతి మూసిన కళ్ళు తెరుస్తూ అన్నాడు.

''ఇది శ్యామలాథియేటర్ బాబూ?'' అన్నాడు రిక్షావాడు. వెంకటపతి తెలిసి మాట్లాడటం లేదని.

''ఇది వరూథినీ పిచ్చర్ పాలస్! తెలిసా? ఎవర్దనుకొన్నావ్? నాది!'' గుండె మీద చెయ్యి కొట్టుకొంటూ ''వందెకరాల పొలం! ఎట్టాంటిది పొలం! మొనగాడి పొలం! అమ్మి కట్టాం ఈ హాలు!''

''శ్యామలా అని పేరు మార్చారు గదయ్యా?''

''మళ్ళీ మారుస్తాం! వరూథినీ పిచ్చర్ అని. హైకోర్టే వచ్చి మార్పిస్తది. కింద కోర్టులో దగా చేశారు.''

''కథానాయక ఆడుతోంది! ఎల్తారా?''

''ఆడనియ్! ఆడనియ్! శ్యామల్నే ఆడనియ్!''

''శ్యామల కాదు.. శ్యామల్లో కథానాయక ఆడుతోందండీ?''

''దేన్నో దాన్ని ఆడనియ్! కతానాకినే ఆడనియ్! నువ్వు రిక్షా ఆపావా?''

''మీరే దిగాలి. రిక్షా ఆగేవుంది.''

వెంకటపతి రిక్షా దిగుతూ తూలి రిక్షా పట్టుకొని నిలబడ్డాడు. రూపాయి రిక్షావాడి కిచ్చి నీ కెంత రావాల అంత తీసుకో!'' అన్నాడు ఎప్పుడో తప్ప రిక్షా ఎక్కని వెంకటపతి.

టికెట్ కొనకుండానే హాల్లోకి వెళ్ళి కూర్చున్నాడు వెంకటపతి. గేట్లో వాడు చూసీ చూడనట్టు ఊరుకొన్నాడు.

సినిమా చూస్తున్న వెంకటపతికి మొదటి మూడురీళ్ళూ గజిబిజిగా వుంది. తర్వాత కథలో పట్టు దొరికింది.

కథానాయకలో సగం వరూథినీ... వరూథినిలో సగం కథానాయక కన్పించారు వెంకటపతికి. వరూథిని కథ కథానాయకి కథగానో, కథానాయకి కథ వరూథిని కథగానో, నడిచి కథ ముగిసినట్టుందేగాని స్పష్టంగా తెలియలేదు వెంకటపతికి.

సినిమా అయిపోయింది. జనంలోపడి తోసుకొంటూ వెంకటపతి రోడ్డెక్కాడు.

ఆకలి ఒకటే ఆకలి. మనిషి కరకరలాడిపోతూ మిలటరీ హోటల్‌కు నడిచాడు. మీల్స్ టికెట్ కొనడానికి కౌంటర దగ్గిర నిలబడి జేబులోకి చెయి పోనిచ్చాడు వెంకటపతి. జేబులోకిపోయిన చెయ్యి చాలాసేపటి వరకు బయటికి తిరిగి రాలేదు.

''కొట్టేశారు! డబ్బు కొట్టేశారు!'' వెంకటపతి మత్తు పూర్తిగా దిగిపోయింది.

కేకలు పెట్టాడు. పెద్ద పెద్ద అంగలు వేస్తూ కథానాయక ఆడుతోన్న సినిమాహాలుకేసి పరుగెత్తాడు వరూథిని భర్త -

## 49

''మన లాయరేమిటి అట్లా మాట్లాడతాడూ?'' వేట్ 69 గ్లాసులోకి వంచుతూ అన్నది వరూథిని.

''సుబ్బరామయ్యగారికి మించిన చెయ్యిలేదు. సివిల్ దావాల్లో ఆయన్ని మించినవాడు మన రాష్ట్రంలోనే లేడు." గ్లాసు అందుకొని సోడాపోసి కలుపుతూ అన్నాడు గోపాల్రావు.

''ఆయన చెప్పిందాన్ని పట్టి చూస్తే నాకు అంత నమ్మకం కలగటంలా మరి?" తన గ్లాసులో మరికొంచెం సోడా కలుపుకొంటూ అన్నది.

''అరెరే! అంత సోడా పోస్తావేం? డైల్యూట్ అయితే మజా ఏం ఉంటుంది?"

''నాకు స్ట్రాంగ్ అవదూ? గుండె అసలే బలహీనం" అన్నది వరూథిని.

అసలు తనకు జబ్బు ఏమిటా అన్న ఆలోచన వచ్చింది వరూథినికి. మొదట్లో భర్త కొట్టినప్పుడు - పల్లెటూరికి మూటాముల్లేకట్టమన్నప్పుడు తనకు గుండెనొప్పి అని ఊహించింది. కావాలనే భర్తతో బొంకింది. భుజంగరావు పరీక్ష చేసి అదోలా నవ్వాడు ఆరోజు! రామనాథబాబు ఉండబట్టి సరిపోయింది. లేకపోతే ఆ డాక్టరు ఎంతమాట అనేవాడో మరి? ఆ రోజు భర్త లేవకముందే రామనాథబాబు దగ్గిరకెళ్ళింది. అప్పుడు రామనాథబాబు తనను ఎంత తమాషా చేశాడు? ఎన్ని గిలిగింతలు పెట్టాడు? నవ్వించి కవ్వించాడు -

''నిన్ను మళ్ళీ ఆ పల్లెటూరికి పంపించకుండా ఆపలేనంటావా? అదెంత పని? నిన్నే ఏం ఖర్మ! నీ భర్త వెంకటపతినే ఈ టౌన్‌కు కట్టిపడెయ్యలేనూ? అది నువ్వు కావాలంటేనే సుమా? నీకిష్టమయి ఇక్కడ కాపరం ఎత్తేసి, మీ, ఊరి కెళ్ళానంటే నేనేం బలవంతం చెయ్యను."

అని అతడన్నప్పుడు తనకెంత కోపం వచ్చింది? మళ్ళీ ఎంతలో నవ్వించాడు? ఆ రాత్రిభర్త కొట్టిన దెబ్బలూ, అవమానం క్షణాలమీద మరిపించి మురిపించలా? అయస్కాంతంలాంటి అతన్ని వదిలి తను ఎలా ఉండగలదు?-

''మీరు ఆలోచించే పనేం లేదు. ఆయన మాట తీరే అంత? ఆయన తరహాయే అంత. గెలుస్తాం గెలుస్తాం అని మాయమాటలు చెప్పి అయినకాడికి డబ్బు గుంజి, తీరా కేసు హియరింగ్‌కు వచ్చేసరికి జూనియర్‌గాళ్ళను కోర్టుకు పంపి, 'వాడెళ్ళబట్టి పోయింది, నేను వెళ్తే తప్పక గెలిచేవాళ్ళం - సుప్రీంకోర్టుకు అపీలు చేద్దాం, ఇక్కడ వాళ్ళంతా...' అంటూ అంకచెండాలం చెత్తంతా వాగి, మళ్ళీ డబ్బు గుంజే చౌదరిలాంటి వాడనుకొనేవ్ మన లాయరు సుబ్బారామయ్యగారంటే" గోపాల్రావు నాలుగు గుక్కలేసి, ఏకబిగువున మాట్లాడి, ఏక వచన ప్రయోగందాకా వచ్చి వరూథిని కళ్ళల్లోకి మత్తుగా చూశాడు.

అప్పటికిగాని రామనాథబాబు గురించిన ఆలోచనలు వరూథిని బుర్రలో ఆగిపోలేదు.

''అయితే ఎంత ఫీజు తీసుకొంటాడూ?" గ్లాసు దించి అడిగింది.

''ఫీజా? ఇట్లాంటి కేసులో ఆయనకో పద్ధతి ఉంది. కేసు గెలిస్తే అందులో సగం వాటా ఆయన కివ్వాలి! ఈ లోపల దమ్మిడీ ముట్టుకోడు. స్టాంపు ఖర్చులు మాత్రం మనం పెట్టుకుంటే చాలు."

వరూథినికి గుండె గొంతులోకి ఎగబాకి అడ్డం పడ్డట్టయింది! అంతకు ముందు తాగిన విస్కీ నిషా దిగిపోయింది.

తనకు నిజంగానే గుండెపోటు వుంది! లేకపోతే ఇంత బాధేమిటి? కొద్ది క్షణాలు కళ్ళు మూసుకొని తెప్పరిల్లింది.

''ఏమిటప్పుడే కళ్ళు మూస్తున్నావ్? రోజూ అరబాటిల్ అయినా మనిషివి తొణికేదానివి కాదే?''

''అదికాదు. ఆస్తిలో సగం ఆయన కివ్వడం ఏమిటి? ఐదులక్షల ఆస్తి!''

''ఐదు లక్షలవనీ పదవనీ! ఇప్పుడది నీదికాదు. శ్యామలాంబది. అందులో ఇప్పుడు నీకు దమ్మిడీ లేదు. గెలిస్తే రెండున్నర లక్షల ఆస్తి నీకు ఊరికినే వచ్చినట్టు!''

గోపా్లరావు తర్కం అర్థం చేసుకోవటానికి ప్రయత్నిస్తుంటే, నాలుగు పెగ్గుల విస్కీ తాగినంత నిషా ఎక్కి తల తిరిగిపోయింది వరూథినికి.

''నువ్వేం ఆలోచించవద్దు. నామాట విను. కోర్టు ఖర్చులూ, స్టాంపు ఖర్చులూ నేను పెట్టుకొంటా. నువ్వొట్టి సంతకాలు నాలుగు పడేసి కూర్చో. నేను తిప్పుతా చక్రం. ఆ రామనాథబాబుగాడి పని నేను చెప్తాగా?'' అంటూండగానే ఫోన్ మోగింది.

వరూథిని ఫోన్ ఎత్తి ''మీకే?'' అంటూ రిసీవర్ అందించింది.

''ఫామిలీ వచ్చారా? ఇంత ఆలస్యం అయిందేం? బెజవాడలో ఎప్పుడు బైలుదేరారు? ఆఁ! ఎప్పుడూ? ఎక్కడా?'' గోపా్లరావు ముఖం ముందు నల్లబడింది. మెల్లగా షాక్ తట్టుకొని తేరుకొన్నాడు.

''ఏం జరిగిందీ?'' వరూథిని ఖంగారుపడుతూ అడిగింది.

''జగ్గయ్యపేట దాటింతర్వాత కారాపి మనిషిని పొడిచేశారట.''

''ఎవర్ని?'' ఆ ప్రశ్న ఆమె గుండెల్ని చీల్చుకొని వచ్చింది.

''ఎవర్నో తెలియలేదు. ఎంబాసిడర్ కారు. నంబరూ - ఆ 2434 అట! మన వైపు నుంచే హైదరాబాద్ వస్తున్నదట. మన కారుముందే ఉందట ఆ బండి. మన డ్రైవర్ అది చూసి కారు వెనక్కి తిప్పి జగ్గయ్యపేట పోయి పోలీస్టేషన్‌లో చెప్పాడట.'' గోపాలరావు చెప్పుకు పోతూనే ఉన్నాడు.

వరూథిని తన గ్లాసు ఖాళీచేసి మళ్ళీ గ్లాసు నింపుకొని సోడా పోసుకోకుండా రెండు గుక్కలు వేసింది! ఆమె కళ్ళు నిప్పుకణాల్లో మండుతున్నాయి! చంపలు విద్యుత్‌కాంతిని తిప్పికొడ్తున్నాయి?

గోపాలరావుకు వరూథినిలో ఎప్పుడూ చూడని అందం కన్పించింది. ఆ అందం కవ్వించింది.

''నీట్‌గా తాగుతున్నావ్? లే! పడిపోతావ్. పడుకో!'' అంటూ గోపాలరావు ఆమె చేతిని పట్టుకొన్నాడు.

వరూథిని గోపా్లరావు చేతిని విసిరికొట్టింది.

ముందున్న వేట్ 69 బాటిల్ ఎగిరి కిందపడింది!

''పగిలిపోయింది! అంతా పోయింది!'' వరూథిని తెలిసి అంటున్నట్టు అనిపించలేదు గోపాలరావుకు.

''పోతే పోయిందిలే! లే! నువ్వు రెస్టు తీసుకో.''

''నా కింకా రెండు.. రెండు బాటిల్స్ కావాలి. తెప్పించు!''

''ఇంకా ఎందుకు? ఇప్పటికే?'' ఆమె కళ్ళల్లోకి చూశాడు.

''ప్లీజ్! తెప్పించండి. మీకు పుణ్యముంటుంది. మీరు చెప్పినట్టు చేస్తాను. సుబ్బరామయ్యకే కేసు ఇస్తాను. ఇప్పుడే సంతకాలు పెడ్తా. కాగితాలు తెప్పించండి.''

''ముందే ఆయనకు రాసివ్వకూడదు. గెలిచిన తర్వాత ఇంకో పద్ధతిలో ఇవ్వాలి. అంతవరకూ హామీగా నాకు రాసివ్వాలి. ఈ మాట ఆయనే చెప్పాడు – నాతో మాట్లాడమని.''

''వరూథినీ పిక్చర్ ప్యాలెస్ అంతా రాసిస్తాను. కావాలంటే ఇప్పుడే రాయించుకో. కాని ముందు తెప్పించు... నా... గుండె పగిలిపోయింది.''

''పగిలింది బాటిలే వరూథినీ!''

''రక్తం కారిపోతోంది!''

''కాదు వాట్ 69 విస్కీ! నువ్వు తాగి మాట్లాడుతున్నావ్.''

''నువ్వు తాక్కుండా మాట్లాడొద్దు! నువ్వూ తాగు.''

గోపాలరావు ఓ క్షణం ఆలోచించి 'బోయ్'ని పిల్చి చెప్పాడు.

ఒక వేట్ 69 బాటిలూ, ఒక బ్రాందీ బాటిలూ తెచ్చి ముందు పెట్టాడు బాయ్.

''ఎందుకు మార్చి తెప్పించావ్? ఒకటదీ ఒకటిదీ?'' అన్నది వరూథిని.

''ఒకటే వుందట 69. అందుకే రెండోది...''

గోపాలరావు వేట్ 69 బాటిల్ తీసి గ్లాసులో పోశాడు. వరూథిని గ్లాసు ఎత్తింది.

''ఉండుండు! సోడా!'' అన్నాడు సోడా కార్క్ తీస్తూ.

వరూథిని తాగేసింది! గ్లాసు కిందకు వదలింది! గ్లాసు పగిలింది!

పగిలిన గాజుముక్కల్ని చూస్తూ వెక్కి వెక్కి ఏడ్చింది వరూథిని.

''హాల్లో సగం పోతుందని బాధపడుతున్నావ్ కదూ?''

''కాదు. నాలో సగం... సగం పోయింది.'' ఎక్కడో చూస్తూ కుమిలిపోతూ అన్నది వరూథిని.

''నీ కెందుకూ? ఆ హాలు గొడవా? గెలిస్తే గెలుస్తాం. లేకపోతే లేదు. న్యూ వరూథినీ పిక్చర్ ప్యాలెస్ ఒకటి ఆరునెలల్లో కట్టిద్దాం. ఆ రామనాథబాబుగాడి ముఖం మీద కొట్టినట్టు! లే మరి? ఊఁ?'' అంటూ గోపాలరావు వరూథిన్ని లేవదీసి పక్కమీద పడుకోబెట్టటానికి ప్రయత్నించాడు.

వరూథిని కళ్ళు మూతలు పడిపోతున్నాయి. తోటకూరకాడలా మనిషి జారిపోతోంది.

''నువ్వెళ్ళు! నాకు... ఇక్కడ... ఇక్కడ బాధగా వుంది." గుండెమీద చేతులు పెట్టుకొని అన్నది వరూథిని.

''పడుకో ముందు అదే తగ్గిపోతుంది. ఎక్కువగా తాగావ్‌లే. అందుకని..."

''ముందు...మీ...మీ...రెళ్ళండి...వె...వెళ్ళరా?"

వరూథిని తూలి బెడ్‌మీద వెల్లికిలా పడిపోయింది!

## 50

వారం రోజుల్లో వస్తానంది పదిరోజులు దాటింది. అయినా రాలేదు. ఇన్ని రోజులు ఆడేం చేస్తుంది? హైకోర్టుతో పనికదా? అప్పుడే ఎక్కడ తేలుద్ది? ఉంటే ఉంది. తనకిక్కడ ఎట్టా జరుగుతుందనుకొంది? బొటాబొటిగా ఇచ్చి వెళ్ళింది. అదిచ్చింది మూడురోజులు రాలేదు. ఇవ్వాళో రేపో దిగుద్దేమో?

భార్య వరూథిన్ని గురించి ఆలోచిస్తున్న వెంకటపతికి వెండి బిందె గుర్తొచ్చింది.

వెండిబిందెలోనుంచి, వెండి పళ్ళెమూ, వెండిగ్లాసులూ, కప్పులూ, సాసర్లూ, వెండిగిన్నెలూ, స్పూన్లూ దొర్లి వెంకటపతి కళ్ళల్లో మెరిశాయి! వెంకటపతి చెవులు దిబ్బెళ్ళు పడ్డాయి.

సీసాలో అడుగున మిగిలింది గ్లాసులోకి వంచుకున్నాడు. గ్లాసు ఖాళీ చేశాడు. సీసాలో ఇన్ని నీళ్ళుపోశాడు. సీసా బాగాకుదిపి నోటిదగ్గర పెట్టుకొన్నాడు. సీసా అడుగు చేత్తో తడుతూ మెడపైకెత్తి ఆఖరి చుక్కలు చప్పరించాడు.

అది వెళ్ళి పన్నెండా? పదమూడా! సోమవారం సోమవారం సోమవారం ఏడూ!.... ఏడా ఎనిమిదా? మంగళవారం నుంచీ... ఇవ్వాళేవారం?

వెంకటపతి తల పైకెత్తి ఆలోచించసాగాడు. ఆలోచన ఆగిపోయినా తల మాత్రం కిందకు దించలేదు.

తనే మనుకుంటున్నాడో? ఇదేనెలా? ఎండలు ముదిరిపోయినై. మాగాటి చేలన్నీ నెర్రెలు కొట్టి ఉంటాయి. ఇంక పొలం పనులన్నీ అయిపోయినట్టేగా? జనపకట్టే... కందికట్టే ఇంటికి చేరివుంటాయ్. ఈ వరదాకా ఎందుకూ? ఎప్పుడో చేరి ఉంటాయ్. కడాలు మోపులు కట్టి వరిగడ్డి తోలే వుండాలి? ఈపాటికి గడ్డి వాములు కూడా పడుండాలి. ఎందుకు పడవూ? సంవత్సరాది పండగ్గూడా వస్తావుంటే? ముసలాయనేం చేస్తున్నాడో? పొలం పనులన్నీ అయిపోయి వుండాలి. పొలం పనులా! ఎక్కడుంది పొలం? అంతా అయిపోయిందిగా? ఏం తిని బతుకుతున్నాడో? దిబ్బుందిగా దిబ్బ? ఆఁ! ఆ దిబ్బలో ఏముంది మట్టి? ఏం పండిస్తావ్ఁ? ఏకత? ఎట్టా బతుకుతున్నాడో ముసలాయన?

గెలుస్తానంటుందిగా హైకోర్టులో? గెలవనియ్? గెలవనియ్? ఆ సినిమా హాలమ్మేసి పొలం కొనుక్కుంటే సరి! మరి అమ్మనిస్తదా? ఇయ్యదియ్యదు! చూస్తా? ఎట్టా అమ్మనియ్యదో? దాని పెత్తనమేంటి? బోడి పెత్తనం? అసలెవడ్డి? దానమ్మ మొగుడ్డా? ఆస్తంతా నాదే? అసలు దాన్ని ఈసారి రానియ్!....

వెంకటపతి సీసాకేసి చూసుకొన్నాడు. తిరగా బోర్లావేసి చూసుకొన్నాడు. ''చుక్కలేదు!'' నీళ్ళుపోసి కడిగితాగిన సంగతి మరిచిపోయి అనుకొన్నాడు.

రానియ్? వస్తదిగా? ఇంకెన్నాళ్ళు కూర్చుంటదక్కడ? ఎన్నాళ్ళయింది పోయీ? పదమూడు... పద్దానుగా? సోమవారం-సోమారం-ఎనిమిది. ఎనిమిదెనిమిది పదహారు ఆఁ. అదెల్లి పదహారురోజులైందా? పదహారు రోజులపండుగ చేశారా? చేసినట్టున్నారే? ఆహాఁ చెయ్యేలా! అత్తగారింట్లో వున్న తనను అయ్యలాక్కొచ్చాడుగా? తను ఉందెక్కడా? మూడోరోజునే వచ్చిపడ్డాడుగా తండ్రి? 'లే! లే! రా! రా' అంటూ గిరికీలు కొట్టించి రెక్కపట్టుకొని లాక్కొచ్చాడుగా? అప్పుడు తన ప్రాణం ఎట్టా కొట్టుకులాడింది? ఇంటికొచ్చినా, మనసంతా వరూథిని మీదే ఉంది. ధ్యాసంతా దానిమీదే! దాన్ని చూడంది తన మనసు నిలిచేదికాదు.

ఎన్నాళ్ళయిందీ వరూథిన్ని చూసి? రెండో వారంకూడా అయిపోతేను? రావాలి మరి?

వెంకటపతికి ఐదుగిన్నెల స్టీలు క్యారియరూ, వరూథిని విడిచి వెళ్ళిన జరీ పట్టుచీరా జ్ఞాపకం వచ్చాయి.

రాగానే అవన్నీ చూడదూ? తనను బతకనిస్తుందా? బిందెపోయినప్పుడే అవీ పోయినై అని చెప్పాలి. రెండుసార్లు దొంగలు పడ్డారంటే అసలు నమ్మదు. ఆవలిస్తే పేగులు లెక్కపెడ్తుంది. దొంగలెట్లావచ్చారూ? తాళం పగలగొట్టి ఇంట్లో జొరబడ్డారు అప్పుడు తను ఇంట్లోలేడు. ఎక్కడ కెళ్ళాడూ? బజారు కెళ్ళాడు! ఎందుకూ అని అడిగితే?

వెంకటపతి ఏం చెప్తే బాగుంటుందని ఆలోచించాడు.

''ఏదో ఒహటి చెప్పొచ్చులే!'' అని సర్దిచెప్పుకొన్నాడు తనకు తనే.

అతను షరాబు బజార్లోనూ, సారా అంగడి రత్తమ్మకూ అమ్మిన సామాను వేళ్ళు మడిచి లెక్క పెట్టసాగాడు. పదేళ్ళూ అయాక మళ్ళీ ముడిచి తెరిచాడు. వెండిబిందెతో సహా పదమూడు శాల్తీలు తేలినై.

ఇవన్నీ ఎత్తుకు పోయారు దొంగలుపడి! ఇంకా ఏమున్నాయ్ దొంగలెత్తుకు పోయేవి? ఆ ఇప్పుడేం అవసరం?

జేబులో చెయ్యి పెట్టి నోట్లకట్ట తీసి లెక్క పెట్టుకొన్నాడు వెంకటపతి.

ఇంకా రెండొందలపాతిక చిల్లర వుంది. అదీ ఇంకా పదహారు రోజులు రాకపోయినా ఫర్వాలేదు. అసలు వాడెమ్మ... నాయాల... ఆరోజు సినిమా హాల్లో డబ్బు కొట్టెయ్యకపోతే ఇవన్నీ ఎందుకు అమ్మేవాడు? ఆ డబ్బే ఇంకా ఉండేది. అసలు బిందె అమ్మినప్పుడు వరూథినికి ఏం చెప్పాలా అన్న ఆలోచనే రాలేదు.

''డబ్బు లేకపోతే ఏం చెయ్యమంటావేం? చావమంటావా?'' అని అడగాలనుకొన్నాడు. మళ్ళీ ఏది అమ్ముదామా అని ఆలోచన వచ్చి, అన్నీ వెతికేప్పుడే ఈ 'దొంగలు' ఆలోచన తట్టింది. వెండి బిందె అమ్మినప్పుడున్న భయం తర్వాత వస్తువులు అమ్మినప్పుడు లేదు. ఇప్పుడసలే లేదు. దొంగలు పడ్డారు. ఆఁ అంతే?

తనేం చేస్తాడూ  దొంగలు పడితే? ఆడది అట్లా ఇల్లొదిలి తిరుగుతుంటే దొంగలు పడరా'ఏం?

ఏమిటీ ఏం ఎక్కినట్టేలేదు? రొండో సీసాకూడా? అది ఇవ్వాళ ముట్టనని ఒట్టేసుకొని బీరువా వెనక పెట్టాడుగా!  ఇట్లా తాగేస్తే ఎంతయినా చాలదు. తగ్గించేయాలి. అసలు దానివల్లే తను ఇట్టా అయిపోయాడు. అలవాటయింది పాడుది. తనకెట్టా అలవాటయిందీ?

తొలింబరం తను తాగిందెప్పుడూ? ఆఁ రామనాథబాబుగారింట్లో ఆయనే తనకిది అలవాటు చేశాడు. ఏమాటకామాట పాపం వరూథిని - వద్దనే అన్నది. అప్పుడే తను వరూథిని మాట వింటే ఎట్టా ఉండేదో? వెంకటపతి లేచి  బీరువా వెనకదాచిన సారాసీసా తెచ్చుకొని పంటితో బిరడా లాగుతుండగా బయట కారు హారన్ వినిపించింది.

చేతులో సీసా, పళ్ళసందున బిరడా అట్లాగే ఉండిపోయినయ్!

చెవులు రిక్కించి విన్నాడు. తలుపు కొడ్తున్న చప్పుడు. కొద్ది క్షణాలు వెంకటపతి బుర్ర పనిచెయ్యకుండా  ఆగిపోయింది. మళ్ళీ గట్టిగా తలుపు కొడ్తున్న ధ్వని! వెంకటపతి లేచి నిలబడ్డాడు. కాలూ చెయ్యీ ఆడలేదు.

''వచ్చింది! వచ్చింది! సమయానికి వచ్చేసింది. ఇప్పుడెట్టా?'' వెంకటపతి గుండెలు దడదడ కొట్టుకొన్నాయి.

నోట్లోవున్న బిరడాతీసి సీసాకు పెట్టి సీసా బీరువా చాటున దాచాడు. ఖాళీ సీసా దొడ్లో పారేసి గ్లాసు కడిగి  పెట్టేశాడు.

మూతి పంచెకు తుడుచుకొని, జారిపోతున్న మొలపంచ బిగించి చొక్కా సర్దుకొంటున్న వెంకటపతి చేతికి నోట్లపాత్తి  తగిలింది!

ఇంత డబ్బు తన దగ్గిర ఉంటే ఇంకేమన్నా ఉందా? ఎక్కడిదని అడగదూ? అసలు ముందు డబ్బు లాక్కుంటది.  ఎక్కడన్నా దాయాలి. ఎక్కడ దాస్తే? ఆఁ ఈడయితే సరి! చూడదులే!

వెంకటపతి తన మంచంమీదవున్న దిండుగలీబులో నోట్లపాత్తి దాచి బయటికి వచ్చాడు.

మళ్ళీ తలుపు చప్పుడు! తలుపులు ఊగుతున్నాయి!

''ఆఁ వస్తున్నా?'' వెంకటపతి అడుగులు తడబడుతున్నాయి.

వరూథిని ఇంతసేపేం జేస్తున్నావంటే? ఏం చెప్పాలీ? నిద్రపోతున్నాలే!

''ఆఁ తీస్తున్నా!'' వెంకటపతి తలుపు తెరిచాడు.

''వరూథిని గారిల్లే కదండీ?''

అమ్మయ్య బతికాడు! వచ్చింది వరూథినికాదు. వరూథిని కోసం ఎవరో వచ్చారు.

''ఊళ్ళో లేదుగా? హైదరాబాద్ పోయింది. పోయి పదిహేను రోజులైంది.''

వెంకటపతి చెప్పాడు అతడ్ని చూస్తూ.

పొడుగాటి మనిషి. ఖద్దరు లాల్చీ, పేటంచు పంచా వేసుకొని తల కొంచెం వంచి నిలబడి ఉన్నాడు. అతడి ముఖం వాడిపోయి వుంది.

''వరూథిని భర్తగారు మీరేనా?''

తల ఊపాడు వెంకటపతి.

''నా పేరు గోపాల్రావు. వరూథిని....'' గోపాల్రావు గొంతు పూడిపోయింది! తిరిగి ఇంటిముందాగిన కారు దగ్గిరికి నడిచాడు.

కారు డోరు సందుల్లోనుంచి నీరు బొట్లు బొట్లుగా కారుతూంది! కారు డ్రైవరూ, నౌకరూ వెనక డోర్‌పక్కన నిలబడి గోపాల్రావుకేసి చూశారు.

''ఒరేయ్ రాముడూ? నువ్వటునుంచి ఎక్కరా! నేనూ నారాయణా ఇటు అందుకుంటాం.'' గోపాల్రావు పంచ దోపుకొంటూ అన్నాడు.

డ్రైవర్ నారాయణ డోర్ తెరిచి కారు లోపలికి వంగి కరిగిపోయిన మంచుముక్కల్ని బయటికి విసిరాడు. కొన్ని కారు దగ్గరకు వస్తున్న వెంకటపతి కాళ్ళమీద పడ్డాయి.

''అయిసంతా కలిగిపోయిందయ్యా?'' దోసిలితో మంచు బిళ్ళలూ నీళ్ళూ ఎత్తి బయటికి పోస్తూ అన్నాడు నారాయణ.

''రేయ్? రాముడూ! అట్లా లేవదురా. చేతులు కిందకు పోనిచ్చి లేపు!'' గోపాల్రావు వంగి కార్లోకి తలపెట్టి అన్నాడు.

వెంకటపతి ''ఏందదీ?'' అంటూ గోపాల్రావూ నారాయణ మధ్యగా వంగి కార్లోకి తలపెట్టి చూశాడు.

తడిసిన తెల్లబట్ట ముసుగులో వుందెవరూ?

వెంకటపతి పాదాలమీద పడ్డ మంచు కరిగి నీరైపోయింది! వెంకటపతిలో రక్తం చల్లబడింది! గుండె మంచుగడ్డ అయింది!

''ఆఁ! అట్లా అట్లా రానియ్! నారాయణా నువ్విటు పట్టుకో. మెల్లగా! ఆఁ ఇహ తిప్పుకో. ఒరేయ్ రాముడూ? నువ్వట్టాగే పట్టుకు దిగు. అదిగట్లా. ఇహ తిరగండి. తలవైపు ముందుకుండాలి. ఇంట్లో కెళ్ళేప్పుడు.''

గోపాల్రావు మెడ పక్కకు తిప్పి వెంకటపతిని చూసి ''తలుపులు బార్లాగా తీయండి'' అన్నాడు.

వెంకటపతి వీధి తలుపులు నెట్టి వీధివైపున నిలబడ్డాడు.

మార్చినెల మిట్టమధ్యాహ్నం మంగళవారంనాడు వరూథిని శవాన్ని ఇంట్లోకి చేర్చారు గోపాల్రావూ, నారాయణా, రాముడూ.

''ఎక్కడ దించాలీ?'' నారాయణ వెంకపటతిని అడిగాడు.

వెంకటపతి వరూథిని పడకగదికేసి చెయ్యి చూపించాడు.

''మళ్ళీ గదిలోకి ఎందుకండీ? ఈ వరండాలో పెడ్తే బాగుంటుందిగా?'' అన్నాడు గోపాల్రావు జారిపోతున్న వరూథిని నడుంకింద చెయ్యి జరుపుకొంటూ.

తల ఊపాడు వెంకటపతి.

''చాప! చాప పట్టుకురండి. ఇటు ఈ గోడపక్క దించుదాం'' అన్నాడు గోపాల్రావు.

వెంకటపతి లోపలికెళ్ళి ఇల్లంతా వెతికి ''చాపున్నట్టు లేదే?'' అన్నాడు.

''చాప లేకపోతే దుప్పటి పట్టుకురండీ?'' అన్నాడు గోపాల్రావు విసుగ్గా.

''ఆగు!''

-పందిరిమంచం మీదున్న దుప్పటి అంచు పట్టుకొని లాగుతూన్న వెంకటపతి ఆగిపోయాడు ''ఆగు!'' అన్నట్టు విన్పించి.

వరూథిని నడిమంచం మీద కూర్చుని మల్లెపూల దండ జడలో తురుముకొని, అద్దంలో అందం చూసుకొంటూన్నది.

''నీగ్గాదూ? చెప్పేది? అసలు నా గదిలో కెందుకొచ్చావ్?''

''దుప్పటి... దుప్పటి... నీ కోసమే.''

''ఏమండోయ్ ఎంతసేపూ? ఏదో ఒకటి పట్టుకురండి!'' వరండాలో నుంచి మాటలు విన్పించాయి.

వెంకటపతి భ్రమ తొలగిపోయింది. దుప్పటీ దాంతోపాటు ఒక దిండూ తీసుకొని వరండాలో కొచ్చాడు.

''అటుగాదు. ఇటేయండి. ఉత్తర దక్షిణాలుగా?'' గోపాల్రావు వెంకటపతికి దిక్కులు చూపించాడు.

దుప్పటి పర్చి దిండు వేస్తున్న వెంకటపతిని చూసి నారాయణ అన్నాడు -

''దిండెందుకండీ? అసలు వేయకూడదనుకొంటా.''

''ఇంకా నయం, పరుపు తెచ్చాడు కాదు'' అనుకొన్నాడు గోపాల్రావు.

''ఆఁ, దించండి! తల ఇటువైపుండాలి.'' గోపాలరావు గోడవైపు చూపించాడు.

ముగ్గురూ శవాన్ని దించి పడుకోబెట్టారు. గోపాల్రావు కాళ్ళూ, చేతులూ, తలా సర్ది వెంకటపతివైపుకు చూశాడు.

''ఇది తడిసిపోయింది. ముందు తెల్లబట్ట ఏదన్నా శుభ్రమైంది తెచ్చి కప్పండి. కొత్తబట్ట తెచ్చేదాకా!'' శవంమీద తడిసి మురికిగా ఉన్న బట్టను తీసి పక్కన పెట్తూ అన్నాడు గోపాల్రావు.

వెంకటపతి లోపలకెళ్ళి ఉతికిన తన పైపంచె తెచ్చాడు.

పంచె విప్పి కప్పబోతూ వరూథిని ముఖంకేసి చూస్తూ, ఉండిపోయాడు.

''ఏమిటా ఛండాలం? నీ మురికిపంచె కప్పుతావా?'' వెంకటపతికి తనలో నుంచే ఆ మాటలు విన్పించాయి.

''ఇలా ఇవ్వండి.'' అంటూ గోపాల్రావు వెంకటపతి చేతిలో నుంచి బట్ట తీసుకొని శవం మీద కప్పాడు.

పాతేసిన రాయిలా నిలబడిపోయాడు వెంకటపతి!

''మీరలా కూర్చోండి.'' వెంకటపతిని పట్టుకొని తీసుకెళ్ళి కొంచెం ఎడంగా కూర్చోబెట్టాడు గోపాల్రావు.

''ఊరుకోండి. ఆమె కలా రాసిపెట్టి వుంది. ఏం చేస్తాం?''

ఏదో లోకంలో వున్న వెంకటపతికి స్పృహ వచ్చినట్టయింది.

గోడకు జారబడి వెంకటపతి ''ఎట్టా జరిగిందీ? ఎప్పుడూ?'' అన్నాడు.

''మూడు రోజులయింది.''

కొంచెం ఆగి ''అంటే - ఆదివారం రాత్రి పోయింది'' అన్నాడు గోపాలావు.

''ఆదివారం పోతే ఇప్పటిదాకా అక్కడే వుంచారా?''

''ఈ తెల్లవారుఝామున ఐదూ, ఐదున్నర కిచ్చారు శవాన్ని పోలీసులు. అదీ కమీషనర్ ఫోన్ చేస్తే. చాలా గొడవైంది.'' అన్నాడు గోపాలావు.

''అవునండీ! అదీ... అయ్యగారు నిన్న పగలూ, రాత్రీ తిరిగి పెద్ద పెద్దోళ్ళను పట్టుకొంటేనే అయింది.'' డ్రైవర్ నారాయణ.

''బాబుగారు రాత్రంతా జాగారం చేశారు. నిన్న పొద్దుట్నుంచి పచ్చి గంగ ముట్టలా. మీరెళ్ళి రండి నేనుంటా?'' గోపాలావు దగ్గరగా జరిగి అన్నాడు నౌకరు రాముడు.

''మీకు మాత్రం నిద్రాహారాలున్నాయా ఏం? ముందు మీ రెళ్ళి త్వరగా రండి!'' అని గోపాలావు పర్సుతీసి డ్రైవర్ చేతులో పది రూపాయల నోటు పెట్టాడు.

''ఆ కారు హోటల్ దగ్గర కడిగించండి. ఇదుగో నారాయణా?'' వెళ్తూన్న డ్రైవర్ని వెన్కకు పిల్చి గోపాలావు ఇంకో ఇరవైరూపాయలు తీసి ఇచ్చి ''ఐస్ పట్టుకురండి!'' అన్నాడు.

డ్రైవరూ, నౌకరూ వెళ్ళిపోయారు.

''పోలీసులేంటీ? ఏమన్నా అఘాయిత్యం చేసుకొందా?'' అడిగాడు వెంకటపతి.

''ఆదివారం సాయంకాలం బాగానే వుంది. లాయరు సుబ్బరామయ్యగారితో మాట్లాడి ఐదున్నరకల్లా హోటల్కు తిరిగొచ్చింది. ఆమెగార్ని హోటల్లో వదిలి నేను వెళ్ళిపోయాను. అప్పుడెంతో సంతోషంగా వుంది. ఆమెగారికి అప్పుడప్పుడు తాగే అలవాటుందా?''

''అప్పుడప్పుడేం? బాగా అలవాటే!''

''అదే ప్రాణం తీసింది. మా డ్రైవర్ నారాయణలేడూ? వాడిచేత ఫుల్ బాటిల్ తెప్పించుకొందట ఆ సాయంకాలమే. వాడు నాకు తెల్లవారి చెప్పాడు.''

''అలవాటేగా? తాగితేనే ప్రాణం పోతుందంటారా?'' అనుమానాన్ని బయటపెట్టాడు వెంకటపతి.

''పోస్టుమార్టంలో అదే తేలింది.''

''ఆఁ! అట్టాగా?''

వెంకటపతికి అర్థం కాలేదని గ్రహించాడు గోపాలావు.

''బాగా తాగటం వల్ల గుండెమీద పనిచేసి గుండె ఆగిపోయిందని శవపరీక్ష చేసిన డాక్టరు రిపోర్టిచ్చాడు. ఆ రిపోర్టు బలం మీదే పోలీసులు మనకు శవాన్ని అప్పగించారు. అప్పటికీ ఎంతో ప్రయత్నం చేస్తే!''

''తాగటం వల్లేం కాదులేండి!'' సాలోచనగా అన్నాడు వెంకటపతి.

గోపాలావు నొసలు చిట్లించుకొని వెంకటపతికేసి చూశాడు.

"అసలు గుండె జబ్బుంది. ఇది ఇప్పుడిదికాదు. చాలా కాలంగా ఉందే."

"అట్లా చెప్పండి. అసలే హార్ట్ కంప్లయింట్ వున్న మనిషి నిండు బాటిల్‌కి బాటిలే ఒక్కసారి తాగితే గుండె ఆగిపోక ఏమౌతుంది? తన చేతులారా ప్రాణం తీసుకొంది. పాపం!" అని వరూధిని శవం కేసి నిట్టూర్పులు విడిచాడు గోపాలావు.

"అసలు ఈ సినిమా హాలే దాని ప్రాణం తీసింది."

దిగాలుపడిపోయాడు వెంకటపతి.

"ఏమయితే ఏం లెండి? అంతా అయిపోయిం తర్వాత చేసేదేముంది? ఎవరెవరికి కబురుపెట్టాలో మరి? మనిషిని పంపించి వాళ్ళకు కబురుచేస్తే మంచిది. దూరాభారంలోవున్న వాళ్ళు వచ్చేదాకా బాడీ ఉండటం కష్టం! ముప్పై ఆరుగంటలు దాటింది. అప్పటికీ ఐసుగడ్డల్లో ఉంచబట్టి ఈ మాత్రం ఉంది. చూడండీ! ఇప్పటికే ఏమాత్రమో వాసన ప్రారంభమయింది."

గోపాలావు టైం చూసుకొని "ఏరీ? వీళ్ళింకా రాలేదా? వస్తే పంపొచ్చు. దగ్గర్లో ముఖ్యమైన వాళ్ళెవరున్నారూ?" అన్నాడు.

"బాబు! హైదరాబాదులోనే వున్నాడుగా? మీకు తెలవదా? బాబు! అక్కడే వున్నాడు. బాబు..." వెంకటపతి పైపంచ నోట్లో కుక్కుకొని తల వంచుకొన్నాడు.

వెంకటపతి తలా, వీపూ గజగజా వణికిపోయాయి! కంఠంలో నుంచి వస్తున్న శబ్దం విని గోపాలావు అన్నుబట్టిపోయాడు.

ఇనపతెర ఊడి మీద పడిపోయినట్టయింది! శరీరం వణికి చెమటలుపట్టింది. కొడుకుని తల్చుకొని తండ్రి కుమిలిపోతున్నాడు. గుండెలు చీల్చుకొని, కడుపు కోసుకొని వస్తున్న దుఃఖాన్ని మళ్ళీ శరీరంలోనే ఇముడ్చుకోలేక అతని ప్రతి అణువూ స్పందించిపోతున్నట్టయింది.

"పిల్లవాడు అక్కడే వున్నాడని తెలుసు. కాని పోలీసులూ పోస్టుమార్టంతోనే సరిపోయింది. పసివాడు. పాపం! మీరుకూడా లేకుండా ఓదార్చటం మరొకరి వల్ల అవుతుందా? పైగా ఇంతదూరం. తల్లి శవంతోపాటు తెల్లవారుఝామున పసివాడ్ని వేసుకురావటానికి నాకే మనస్కరించలేదు."

"మంచి పనే చేశారు. వచ్చి వాడేం చేస్తాడూ? ఇంకా ఏముందని చూస్తాడూ? వాడి చదువు ఆగమవటం తప్ప? పరీక్షలు కూడా ననుకుంటా?"

వెంకటపతి కనిగుంటల్లో నీళ్ళు నిలిచిపోయాయి.

డ్రైవరూ, నౌకరూ హోటల్లో తిని కారు కడిగించుకొని వచ్చారు.

## 51

"హారెరె! ఎట్టాంటింట్లో పుట్టింది? ఎట్టాంటి లోగిట్లో కోడలై కాలు పెట్టిందీ? చివరకు హోటల్లో దిక్కులేని చావయిందా వరూధినమ్మకు?" ముక్కుమీద వేలేసుకున్నాడు కనకయ్య.

''అయ్యో! నా బంగారు తల్లీ? పువ్వుల్లో పెరిగావు గదే తల్లీ! బలరామయ్య నాన్నగారు భూమిమీద నడవనిచ్చారా? నీకీ చావు రాసిపెట్టుంచాడా? ఆ పాపిష్టి దేవుడు?" నెత్తి బాదుకుంటూ ఘొల్లుమంది వరూథిని తల దగ్గిర కూర్చొని వంటమనిషి బుచ్చమ్మ.

''అమ్మగోరో! ఓ అమ్మగారో?" పనిపిల్ల కమల వీధిలోనుండే పెద్ద పెట్టున ఏడుస్తూ ఇంట్లోకి వచ్చింది.

''మీ పేరేమన్నారూ? గోపాల్రావుగారేగా! ఎంత అన్యాయం జరిగిపోయిందండీ? అమ్మాయి చనిపోయేప్పుడు బిడ్డగానీ, భర్తగానీ, అయిన వాళ్ళెవరూ దగ్గిర లేరు కదా? కొడుకు అక్కడవుండీ లేనివాడయాడు. భర్త ఇక్కడుండిపోయాడు. ఎంత బాధపడిందో?" అన్నాడు కనకయ్య కళ్ళు తుడుచుకొంటూ కళ్ళజోడు తుడుచుకొని పెట్టుకొన్నాడు.

''ఎవరుండిమ్మాత్రం ఏం లాభం? నిద్రలో వున్న మనిషి నిద్రలోనే పోతే?"

''ఆదివారంరాత్రే పోయిందన్నారుగదా? వెంకటపతిగారికెందుకు కబురు చెయ్యలేదండీ? కాకితో కబురుచేసినా మేమొచ్చే వాళ్ళంకదండీ?" గోపాల్రావుకేసి వంకరగా చూస్తూ అడిగాడు కనకయ్య.

మళ్ళీ మొదలా? వీడెవడూ? ఈ ముసలాడు అసాధ్యుడులాగున్నాడే? అనుకున్నాడు గోపాలరావు.

''మీరొస్తే శవం ఇంకా మార్చురీలోనే ఉండేది. పోలీసోళ్ళు మీ దగ్గిర రెండుమూడువేలన్నా గుంజకుండా ఇచ్చేవాళ్ళుకాదు."

''ఎట్టెట్టా. ఇది మామూలు చావు కాదన్నమాట?" కనకయ్య ముందుకు వంగి గోపాల్రావు ముఖంలో ముఖం పెట్టి అన్నాడు.

గోపాల్రావు ముఖం ముడుచుకుపోయింది.

''హార్ట్ఫెయిల్యూర్! కాని ఆవిడగారిగదిలో ఖాళీ బ్రాందీ సీసాలు, విస్కీ సీసాలూ దొరికినై. అందులో హోటల్ గదా? నలుగురొచ్చేపోయే వాళ్ళుంటారు. హోటల్ వాళ్ళను కిందామీదాపెట్టి కొంత గుంజినట్టున్నారు. మీరొస్తే మిమ్మల్ని మూడు చెరువులనీళ్ళు తాగించేవాళ్ళు. నేను పైవాళ్ళను పట్టుకొని అవస్త పడితేనే ఇరవై నాలుగ్గంటలు పట్టింది బయటపడటానికి..." కనకయ్య వినడంలేదని గ్రహించి ఆపేశాడు గోపాల్రావు.

కనకయ్యలేచి నడుం పట్టుకొని వెంకటపతి దగ్గరకొచ్చాడు.

''మామగారికి కబురందిందా?"

వెంకటపతి తల అడ్డంగా తిప్పాడు.

''అదేమిటి వెంకటపతీ? సాంబయ్యగారికి కారు పంపించమంటావా? మా కారు రెడీగానే వుంది పంపిస్తా!"

''వద్దులే! అసలాయన వస్తాడోరాడో? వచ్చి చేసేది మాత్రం ఏముందిక్కడ? పోనీయండి."

''మరి మీ పెద్దబావమర్ది? అదే ఆ ఇల్లరికం వెళ్ళి నాయునకన్నా కబురుచేశావా? ఇంకెవరున్నారూ తోడబుట్టినవాళ్ళూ? ఇంకో అన్న రెండోవాడో మూడోవాడో, ఎక్కడో దేశాలు పట్టుకు తిరుగుతున్నాడనుకొంటానే?" పోతే మరి...?" అసలే ముడతలుపడ్డ కనకయ్య ముఖం ఇంకా ముడతలుపడింది.

''ఎవరూ వద్దు బతికుండగా లేని ప్రేమలు చచ్చాక వస్తాయా ఏం? అసలు జీవుడు పోయినప్పుడే అయినోళ్ళెవరూలేరు దగ్గర. ఇక కట్టె పోయేటప్పుడెందుకూ? కాలిపోయే కట్టె! బతికినన్నాళ్ళూ దాని పాటికి అది బతికింది. పోయేటప్పుడు కూడా దాని పాటికి అదేపోయింది." తరతరాల వేదాంతుల వారసుడుగా మాట్లాడాడు వెంకటపతి.

కనకయ్య నోరు తెరుచుకొని, నొసలు ఎత్తి వెంకటపతిని చూశాడు.

వెంకటపతే ఈ మాట్లాడేది? ''చీకట్లోగాని వజ్రం మెరుపు కనపడదు. కష్టాల్లో వున్నవాడే తేజోవంతుడవుతాడు!" కనకయ్యకు నెల రోజులుగా తన ఇంటిముందే పురాణం చెప్తూన్న పండితుడి పలుకులు గుర్తొచ్చాయి.

''మరయితే ఇంక ఆలస్యం ఎందుకూ? అంత్యక్రియలకు ఏర్పాట్లు చేయిద్దాం. చీకటి పడేసరికి శవం శ్మశానానికి చేరాలి. ఏవండీ గోపాలావుగారూ?"

''అవునవును! రావాల్సిన వాళ్ళెవరూ లేరంటున్నారుగా? ఉన్నా లాభం లేదు. చూడండి? అంత ఐసు వేశామా? ఇన్ని సాంబ్రాణీకడ్డీలు వెలిగించామా? అయినా వాసనకొడ్తూనే వుంది. రాత్రికూడా వుంచాల్సివస్తే తెల్లవారి మనిషి దగ్గర నిలబడలేం." అన్నాడు గోపాలావు.

''శివశివా! పసిమి బంగారంలాంటి వళ్ళు. మల్లెమొగ్గల్లాంటి పలువరుస. కలువపువ్వుల్లా ఆ కళ్ళూ... ఆ నవ్వూ - ఆ వర్చస్సూ - ఆ తెలివీ.... ఆ చురుకూ - ఆ రాజసం - ఆ హుందా... మళ్ళీ మనం చూడం. రాజు అయినా రాణీ అయినా మట్టిలో కలవాల్సిందేగా? మట్టిలో పుట్టాం. మట్టిమీద బతుకుతాం. మట్టిలో కలుస్తాం. ప్చ్! ఏం మనుషులు? మట్టి మనుషులు?" కనకయ్య కంఠం ఆర్ద్రమైంది.

కళ్ళజోడు కిందగా కన్నీటిబొట్లు రాలి మట్టిమీద పడి మట్టిలో కలిసిపోయినై.

## 52

వరూథిని శవం శ్మశానవాటిక చేరేసరికి రామనాథబాబు అక్కడ కొచ్చాడు. - ఆ వచ్చింది రామనాథబాబే? రామనాథబాబు బతికే వున్నాడు. రామనాథబాబు చిరంజీవి. అతనికి మరణం లేదు. అతడు అజేయుడు. అతని వదనం అలా వుందేం? అతని చూపుల్లో తళుకులేవీ? నడకలో ఆ ఠీవి ఏదీ? కవ్వించి నవ్వించే అతని కళ్ళమీద ఆ పొరలేమిటి? రామనాథబాబు నేను చనిపోయానని ఏడుస్తున్నాడా? పాపిష్టిదాన్ని! నిన్ను చంపమని రామదాసుకు నగలమ్మి డబ్బిచ్చాను. నిన్ను చంపటమంటే నన్ను నేనే చంపుకోవటం అని తెలుసుకోలేకపోయాను. పిచ్చి మొహాన్ని

హైదరాబాదులో హాలు పూర్తయిందా? వరూథినీ పిక్చర్ ప్యాలెస్ ఇక శాశ్వతంగా శ్యామలాంబా పిక్చర్ ప్యాలెస్‌గానే వుంటుందిలే. హైకోర్టులో నేను అపీలు చెయ్యలేదుగా? లాయరు సుబ్బరామయ్య కేసు లేదన్నాడు. ఈ గోపాలావు కేసు ఉందంటున్నాడు. నా తరఫున తను కేసు నడుపుతాడట. డబ్బు అతనే పెట్టుబడి పెడ్తాడట. అందుకు నా వరూథినీ పిక్చర్ ప్యాలెస్‌లో సగం వాటా ఇవ్వాలట? నీక్కాదనీ, నీకు లేదనీ, నీమీద కేసు గెలిచేది ఆ గోపాలావుకు ఇవ్వటానికేనా? అది నేను చచ్చినా ఒప్పుకోను. ఒక్కనాటికీ ఒప్పుకోను. అంతా నువ్వే తీసేసుకో. నాకేం వద్దు. ఆ హాలు గోడలన్నీ ముదనష్టంగా ఉన్నాయ్. సున్నం వేయించండి. హాల్లో సీట్లుకూడా బాగా లేవేమో? నేను చూసి చాలారోజులైంది బాగుచేయించండి -

ఆ శివరాంగాడు బ్లాకులో టికెట్లు అమ్మి సొమ్ము చేసుకొంటున్నాడు. పాపం! బీదా బిక్కీ కూడా వస్తారు... వాళ్ళను దోచేయటం అన్యాయం. వద్దని నువ్వు చెబితే నీ పెళ్లాం వింటుందా ఏం? ఆ షావుకారుగారి కోడలు - దానిబుద్ధి మంచిదికాదంట. అంతకుముందే ఇద్దర్ని మార్చిందట. దాన్ని వదిలేయ్! ఇది! నీ పెళ్ళాం శ్యామల! దీని బుద్ధిమాత్రం ఏమిటట? ఇది తడిగుడ్డల్తో గొంతులు కోస్తుంది. కూబి. ముచ్చు? నా మాటవిని వదిలేయ్ దాన్ని. నువ్వు వేరే హాలు కట్టుకో. ఇక్కడ కాకపోతే - విజయవాడో, గుడివాడో, బందరో, గుంటూరో, అక్కడెక్కడయినా కట్టుకో. రాయలసీమా - ఇప్పుడు ఫర్వాలేదు. అక్కడా ఏ క్లాసు థియేటర్లు వస్తున్నాయి. వెనకబడ్డవాళ్ళు కదూ? ముందుకొస్తున్నారు అక్కడికే వెళ్ళు. వీళ్ళకు దూరంగా వుండు.

నా బాబు. నా బిడ్డ రవి. వాడ్ని చూసుకోవా? ఆయన - వాళ్ళ నాన్న అమాయకుడు. అభం శుభం తెలియని మనిషి. ఆయన వల్లేమీ కాదు. నా బిడ్డ అన్యాయం అయిపోతాడు. వాడి చదవు? అదే నాకు దిగులు. బాబును చదివిస్తావు గదూ? బాబు అందం, తెలివీ వున్నవాడు. వాడ్ని చదివిస్తే వృద్ధిలోకి వస్తాడు. ఐ.ఏ.యస్. అవుతాడు. కాదు బాబును ఐ.పి.యస్.కు ప్రయత్నించమను. వాడు వాడి నాన్నకంటే ఆజానుబాహుడు అవుతాడు. వాడికి నా తెలివి - నా బొంద - నా తెలివేం తెలివి? నీకంటే తెలివికలవాడే అవుతాడు. నా కొక్కటే కోరిక. బాబును యూనిఫారంలో చూడాలని వుంది.

డి.యస్.పి. మోహన్‌రావు నా బాబు ముందు బలాదూర్ తిప్పటానికి కూడా పనికిరాడు. అతనొట్టి జ్వరిగొడ్డు, పిరికివాడు. నాబాబు - వాళ్ళతాత... బాబు తాత సాంబయ్యగారు - తెలుసుగా? అంత గుండె గలవాడౌతాడు. నా బాబు ధైర్యశాలీ ధీశాలీ అవుతాడు. బాబుకు ఐ.ఏ.యస్. వద్దని చెప్పు. ఐ.పి.యస్సే మంచిదని చెప్పు. లాయరవుతానంటాడేమో! వద్దు! పచ్చిమోసం అది! బాబుకు యూనిఫారం వేసి నాకొక్కసారి చూపించవా? నా బాబు... నా బాబు...

రామనాథబాబు గట్టిగా చెవులు మూసుకొన్నాడు. అయినా వరూథిని కంఠం వినిపిస్తూనే వుంది అతని గుండెల్లో.

వరూథిని తన గుండెల్లో వుండే మాట్లాడుతుందా? చితిమీదున్న వరూథిని కంటిరెప్పలెత్తి తన్ను చూట్టానికి ప్రయత్నిస్తోందా?

భ్రమలో పడిపోయాడు రామనాథబాబు.

అతని కళ్ళమీద మబ్బుతెరలు పడుతున్నాయి.

వెంకటపతి కుండ భుజాన పెట్టుకొని, కొరివి చేత్తో పట్టుకొని కాష్ఠం చుట్టూ తిరుగుతున్నాడు.

"మూడుసార్లు తిరుగు. వెనక్కు చూడకుండా కొరివి ముట్టించు. తిరిగి చూడకుండా వెళ్ళిపో!" అంటూ కనకయ్య నల్లరాయితో కుండకు చిల్లికొట్టాడు. నీటిధార చిమ్మింది.

రామనాథబాబు కళ్ళల్లో మేఘాలు కరిగాయి. అతడి చంపలమీదగా రాలుతున్న అశ్రుబిందువులు, వెంకటపతి భుజంమీది కుండలోనుంచి పడుతోన్న నీటిధారలో కలిసిపోయినై.

వెంకటపతి చితికి నిప్పు అంటించాడు.

రామనాథబాబు విడిచిన ఆ రెండు కన్నీటిబొట్లకోసమే జీవితాంతం వేచివున్నా ఇక ఈ జన్మకిది చాలు – అన్నట్లు వరూథిని అసంతృప్తిగా, అశాంతిగా పైకి లేస్తోన్న అగ్నిజ్వాలలకు ఆహుతి అయిపోయింది.

భగభగమండే చితికేసి చూస్తూ తల పట్టుకొని గొంతు కూర్చున్న వెంకటపతి చేతులు పట్టుకొని అన్నాడు కనకయ్య –

"ఏమిటయ్యా అది? ఊరుకో! ఋణం తీరిపోయింది."

"ఏముంది? బూడిద మిగిలింది!" వెంకటపతి కళ్ళల్లో రక్తపు జీరలు ఉబికివస్తున్నాయి.

"ఎంతయ్యా అమ్మాయి వయసూ? ముప్పైకూడా దాటలేదనుకొంటా! అప్పుడే నీకు నూరేళ్ళు నిండినయమ్మా వరూథినమ్మా! పోయావా తల్లీ?" వెంకటపతిని ఓదార్చబోయిన కనకయ్యకు గుండెలు జారినై.

"దానికేం అది హాయిగానే పోయింది. మిగిలినవాళ్ళకే బాధ!"

వెంకటపతి బూడిదై రాలిపోతున్న చితికేసి చూస్తూ "ఏంటిటా చేశావ్? మనదేదో అయిపోయింది. బాబుని... బాబుని కూడా..." అంటూ కుమిలిపోయాడు.

ఎముకలు కాలి రాలిన కుమ్ములా అయిపోయింది, తనయుడ్ని తల్చుకొన్న తండ్రి హృదయం.

చెరువులో స్నానం చేసి తడిబట్టలు పిండుకుంటూ కనకయ్య చెరువు ఒడ్డున నిలబడివున్న రామనాథబాబు దగ్గిరకొచ్చాడు.

"ఏమిటి? రామనాథబాబుగారూ? స్నానం చెయ్యరా?" అడిగాడు కనకయ్య.

"ఇంటికెళ్ళి చేస్తాన్లేండి!" తడిపొడిగా అన్నాడు రామనాథబాబు.

''ఏమిటింత ఆలస్యంగా వచ్చారు? కబురెప్పుడందిందేం?"

''నాకు నిన్ననే తెలిసింది."

''నిన్ననే తెల్సిందా? శవాన్ని తెచ్చింది ఇవ్వాళే గదా?" ఆశ్చర్యంతో అనుమానాన్ని జాగ్రత్తగా పొదివి అన్నాడు కనకయ్య.

''మా బావమర్ది సంగతి మీరు వినలేదా?"

''ఎవరూ? మీ బావమర్ది రామకృష్ణయ్యా? ఏవయిందీ" ఉత్సుకతతో వళ్ళంతా కళ్ళు చేసుకొని చూశాడు కనకయ్య.

''పోయాడు. పొడిచేశారు!"

''శివశివా? మీ బావమర్ది రామకృష్ణయ్యనా? ఏదీ? సినిమాహాలు చూసే రామకృష్ణయ్యనేనా? ఎప్పుడూ? ఎక్కడా? ఏమిటి?"

''ఆదివారం తెలతెలవారుతుండగా జగ్గయ్యపేట ఊరు దాటాక మూడో మైలురాయి దగ్గిర, కారాపి పొడిచేశారు! డ్రైవర్ తప్పించుకు పారిపోయాడు."

''ఘోరకలి! ఘోరకలి! డ్రైవర్? రసూలేనా? పాపం పిల్లలు కలవాడు. తప్పించుకు బయటపడ్డాడు పాపం!" పోయిన రామకృష్ణయ్యను వదిలేసి తప్పించుకున్న రసూల్‌మీద సానుభూతి చూపించాడు కనకయ్య.

''రసూల్ కాదు. వాడికి ఒంట్లో బాగుండక నెలరోజుల్నుంచి రావటం లేదు. కొత్తవాడ్ని పెట్టాం."

''ఎవరి పనంటా? డబ్బేమయినా తీసుకెళ్తున్నాడా పోయేటప్పుడు?"

''డబ్బు కాసించి చేసిందికాదు. ఆయన దగ్గరేమీలేదు. ఆ కార్లో అసలు నేను వెళ్ళాల్సినవాడిని! ఆఖరి నిముషంలో నేనుండి పోవాల్సి వచ్చింది. ఆయన్ను పంపించాను హైదరాబాద్‌లో ముఖ్యమైన పని ఉండి."

''అదృష్టం కాకపోతే నువ్వు పోవాల్సినవాడివికదూ? అందుకే అంటారు శివుడాజ్ఞ లేంది చీమైనా కుట్టదని. రామకృష్ణయ్య కెవరబ్బా అంత శత్రువులూ? నువ్వంటేసరే-?" కనకయ్య సాగదీసి రామనాథబాబు ముఖంలోకి చూశాడు.

ఇంకేదో చెప్తాడని ఆశించిన కనకయ్యకు రామనాథబాబు మౌనం ఆశాభంగాన్నే కలిగించింది.

''నేను వెళ్ళొస్తా కనకయ్యగారూ? రామనాథబాబుగారూ వస్తా?" అంటూ శెలవు తీసుకొన్నాడు గోపాల్రావు.

అటూ ఇటూ చూసి ''వెంకటపతిగా రెక్కడా?" అని అడిగాడు.

''అడుగో! ఆ చెట్టుపక్కన కూర్చున్నట్టున్నాడు చూడండి!" అన్నాడు కనకయ్య.

గోపాల్రావు వెళ్ళి వెంకటపతికి తను వెళ్తున్నట్టు చెప్పి తలవంచుకొని విచారాన్ని తెలియజేశాడు.

''మీ ఋణం తీర్చుకోలేను. మీరుండబట్టే కళేబరమయినా ఇంటికి చేరింది. లేకపోతే పోలీసోళ్ళు, ఎక్కడో ఏ ఎట్టోళ్ళచేతో పారేయించేవాళ్ళు. అదిపోయి మీకు కష్టం కలిగించింది," అన్నాడు వెంకటపతి.

''నాకేం కష్టంలెండి. ఆ మాత్రం మనిషికి మనిషి సాయపడకపోతే బతకటమెందుకూ? వస్తా మరి? మూడు రోజులుగా ఫ్యాక్టరీ ఏమయిందో తెలియదు. బోనస్‌లనీ, ప్రావిడెంట్ ఫండ్సనీ, పచ్చిగడ్డలనీ, వర్కర్లు తగాదాలూ - సమ్మెలూ లేవతీస్తామని బెదిరిస్తున్నారు. మరి శెలవు తీసుకొంటా!''

''దినానికి తప్పకుండా రావాలి.'' కారుదాకావచ్చి అన్నాడు వెంకటపతి.

''ఆఁ! తప్పకుండా! పదముడోరోజేగా?'' అని కారెక్కాడు గోపాలరావు.

కార్లోకూర్చొని పోతూ ''ఇవ్వాల్టినుంచి లెఖ్కా? ప్రాణం పోయిన రోజునుంచీ లెఖ్ఖా?'' లెఖ్ఖ చూసుకోసాగాడు గోపాలరావు.

''అదేమిటి రామనాథబాబూ? ఇంటిదాకా రారా?'' అన్నాడు కనకయ్య కారెక్కుతున్న రామనాథబాబును ఉద్దేశించి.

''పనుంది. అర్జెంటుగా పోవాలి. అవతలమనుషుల్ని కూర్చోపెట్టి వచ్చాను.'' రామనాథబాబు కారు స్టార్టు చేశాడు.

''ఆదివారం ఉదయం రామకృష్ణయ్యను పాడిచేశారూ? ఆ రాత్రే వరూథినమ్మ పోయిందీ? చిత్రంగా వుందయ్యా! చూస్తే! దీనివెనక ఏదో పథకం ఉన్నట్టుగా తోస్తుంది. వరూథినిది మామూలు చావేనంటావా?'' మతలబుగా మాట్లాడాడు కనకయ్య.

''మీ అనుమానమేదో పోలీసులకు చెప్తే పోతుందిగా! వస్తారా?'' ఇంజను ఆపకుండా కారాపి అన్నాడు రామనాథబాబు.

''పోలీసులా? ముందు నా ప్రాణం తీస్తారు. వాళ్ళతో పనికాదు. నాకెందుకొచ్చిన పీడ? కందకు లేని దురద కత్తిపీట కెందుకూ?'' కనకయ్య దురద తీరక అన్నాడు.

రామనాథబాబు కనకయ్యను చూసి పెదవులు విప్పకుండానే నవ్వి వెళ్ళిపోయాడు.

వరూథిని భౌతిక దేహాన్ని దహనం చేసి ఇంటికి తిరిగి వచ్చిన వెంకటపతికి తోడుగా ఒక్క కనకయ్యే మిగిలాడు.

''అమ్మాయి నగా నట్రా అంతా జాగ్రత్తచేశావుగా? నువ్వసలే మందమతివి. ఎక్కడ పెట్టావో, ఏమో హడావుడిలో, భద్రం చేయ్!'' వెంకటపతి వెనకే ఇంట్లోకి వస్తూ అన్నాడు కనకయ్య.

''నగలా? అయ్యెక్కడున్నాయ్?''

''అదేవిఁటి వెంకటపతీ?'' కనకయ్య గుండె బాదుకొన్నాడు.

''చాలా వరకు ముందే అమ్మేసింది. ఆ వంటిమీదున్న నగలు ఆ హోటల్ వాళ్ళో, పోలీసోళ్ళో కాజేశారంట!''

''ఎవరు చెప్పారూ?''

''గోప్రాలావే చెప్పాడు.''

''అట్లా చెప్పు! గోప్రాలావు చెప్పాడా? శవం ఇంటికొచ్చేసరికి ఒక్క నగ లేదంటావ్?''

''నీళ్ళు పోసేటప్పుడు వేలుకు ఒక ఉంగరం మాత్రం వుంది. అది రవ్వల ఉంగరం అనుకొంటా. మెరిసిపోతూ కనబడింది."

''మరి అదన్నా తీసిభద్రం చేశావా?"

''లేదు."

''నీ తెలివి దొంగల్దోలా? అదేంటయ్యా?"

''అది మనది కాదు."

''అమ్మాయి వంటి మీదుంది మనది కాక ఎవర్దవుతుందయ్యా?"

''అది రామనాథబాబుది." నిర్వికారంగా అన్నాడు వెంకటపతి.

ఇతడు రాయా? మనిషా? దేవుడా? కనకయ్య ఊహకు అందలేదు వెంకటపతి.

''మరి నే వస్తా? సూపర్ కొనుగోలు చెయ్యాలి."

''అప్పుడే ఎరువేంటి? రెండోపంట పండిస్తున్నారా మన పొలాల్లో కూడా? నీళ్ళు చాల్తయ్యా?"

''ఆహాఁ! రెండో పంటకు మన పొలాలకు నీళ్ళు ఇంకా ఇవ్వలేదుగా? వచ్చే ఏడు ఇస్తారంటున్నారు. పట్టు పట్టుమని కొనబోయే తరుణంలో ఎద్దడిగా వుంటుంది. అప్పుడయితే బ్లాకులో కొనాలి. అందుకే మనకు కావల్సిన సూపరూ, ఎండ్రినూ ముందే కొని పడేస్తున్నా."

''కొత్త కాలవ కింద పొడానికి సూపరేం లాభంలేదు! నైపోగూ, పచ్చెరువూ, ఓపికుంటే ఎకరానికి నాలుగు బళ్ళు చెరువు మట్టితోలు! అప్పుడు చూడు భూమెట్టా పండుద్దో కనకయ్యా?"

వీధి గుమ్మం దిగుతున్న కనకయ్య చెవుల్లో ''మట్టితోలు భూమెట్టా పండుద్దో!" అన్న మాటలు గింగురుమన్నాయి.

కార్లో కూర్చొని శ్యామలా థియేటరు ముందు నుంచి పోతున్న కనకయ్య చెవుల్లో ''మట్టితోలు! భూమెట్టా పండుద్దో!" ఇంకా వినిపిస్తూనే వుంది.

శేషావతారం మిల్లుముందు నుంచీ రామచంద్రయ్య ఎరువులకొట్టు ముందు నుంచీ, అల్లుడి యింటిముందునుంచీ, కొడుకు ఇంటిమీదగా పోతున్నప్పుడు కూడా కనకయ్యకు వెంకటపతి మాటలు ''మట్టితోలు! మట్టితోలు!" వినబడుతూనే వున్నాయి.

బస్తీ వదిలి ఊళ్ళో కొచ్చింది కారు. ఊళ్ళో చెరువు పక్కన రోడ్డుమీదకు రాగానే కనకయ్య అంతరంగంలో మళ్ళీ వెంకటపతి మాటలు ''మట్టితోలు! మట్టితోలు! అప్పుడుచూడు! భూమెట్టా పండుద్దో?" వినిపించసాగాయి.

## 53

నీలం, ఎరుపూ, పసుపూ, ఆకుపచ్చ లాగులూ, తెల్లటి బనీన్ల మీద స్కూలు గుర్తులూ చూస్తూ నిలబడిపోయాడు వెంకటపతి.

విచ్చిన పత్తి చేనూ, పువ్వు విడిచిన జనపచేనూ, పూతకొచ్చిన కందిచేనూ గాలితో సయ్యాటలాడుతూ ఊగుతున్న జొన్నచేనూ, వెంకటపతి స్మృతి పథంలో

పరచుకు పోతున్నాయి... మెయిన్‌గేటు దాటి పూల మొక్కల మధ్యన వున్న రోడ్డుమీద బిక్కుబిక్కుమంటూ, బెదిరిపోయిన చూపుల్తో నడిచివస్తోన్న వెంకటపతి కాళ్ళకు ప్లేగ్రౌండులో లేగదూడల్లా గెంతుతూ ఆడుకొంటున్న పిల్లలు బంధం వేశారు.

వరూథిని పోయిన ఐదోరోజున స్కూలునుంచి కార్డువచ్చింది. వెంకటపతి ఆ వీధిలోనే వున్న స్కూలు మాష్టరుచేత కార్డు చదివించుకొన్నాడు. పద్దానుగో తారీఖు పరీక్షలు అయిపోతై అనీ, పదహారునుంచీ స్కూలు మూస్తారనీ, పదిహేనో తేదీ, సాయంకాలం బోర్డర్సుగా వున్న కుర్రాళ్ళను తీసుకెళ్ళవచ్చనీ మాష్టరు చదివి చెప్పాడు.

వెంకటపతి వెండి సబ్బు పెట్టే, వెండి కాటుక్కాయా, వెండి కుంకం భరిణా, వెండిపూత లక్ష్మీదేవి ప్రతిమా, స్టీలు బీరువా తెగనమ్మి పద్దానుగుర్రాత్రి హైదరాబాద్ బస్సెక్కాడు. తెల్లవారకట్ల హైదరాబాద్ చేరి, మధ్యాహ్నందాకా పట్నంలో తిరిగి, సాయంకాలం నాలుగ్గంటలకు బేగంపేటలో వున్న జాగీర్దార్ స్కూలుకు చేరుకున్నాడు.

గులాబి తోటలోని రంగురంగుల పువ్వుల్లా వున్న ఆ పిల్లల్లో తన బిడ్డ ఎవరా అని వెతుక్కోసాగాడు వెంకటపతి. దూరాన్నుంచి చూస్తే ఒక ఎత్తున్న వాళ్ళంతా ఒకలాగే కన్పిస్తున్నారు.

ప్లే గ్రౌండ్ చుట్టూ తిరుగుతూ వెంకటపతి కొడుకుని వెతకసాగాడు. గంట వినబడి స్కూలు భవనం కేసి చూశాడు. ప్లేగ్రౌండ్‌లో వున్న కుర్రాళ్ళు ఆటలూ, డ్రిల్లూ ఆపేసి ప్రవాహంలా ఉరకలు పరుగులు తీస్తూ ప్లేగ్రౌండులో నుంచి వస్తున్నారు.

''ఆ వచ్చేవాడు బాబులా వున్నాడే? రవి? ఆ వచ్చేవాడే నాబాబు! వెంకటపతి హృదయం పొంగిపోతూంది.

''బాబూ!'' తన ముందునుంచి పరుగెత్తిన కుర్రాణ్ణి ఉద్దేశించి పెద్దగా అన్నాడు.

ఆ పిలుపువిన్న కుర్రాడు కొంతదూరం ముందుకుపోయి ఆగిపోయాడు.

''బాబూ! రవీ!'' వెంకటపతి అడుగులు ముందుకు పడినై.

కుర్రాడు వెనక్కు తిరిగి వెంకటపతికేసి నాలుగడుగులు వేసి ఆగిపోయాడు.

''హూ! హూ ఈజ్ హీ?''

''నేనేరా? బాబూ!'' వెంకటపతిలో పుత్రవాత్సల్యం పెల్లుబికింది.

''నాన్నా!'' ఉద్రేకంతో తండ్రి దగ్గరకు పరుగెత్తి మరుక్షణంలోనే ఆగి ''అమ్మేది నాన్నా?'' అని అడిగాడు కుర్రాడు.

ముందుకు చాచిన చేతులు వెనక్కు పోయినై. తనచేతుల్తో బంధించి కొడుకుని గుండెకు హత్తుకోవాలన్న వాంఛ నీరుకారిపోయింది. ముఖం పక్కకు తిప్పుకొని ఎత్తుగా విశాలంగా వున్న స్కూలు భవనాల కేసి చూశాడు వెంకటపతి.

''మీ బడి చాలా పెద్దదిరా? ఇంత పెద్దబడి, నేనెక్కడా చూడలేదురా! అసలింత పెద్ద పెద్ద మేడలుంటాయని కూడా అనుకోలేదు. మీ అమ్మ చెప్పింది

గానీ? నేను చూడకపోతే నమ్మేవాణ్ణి కాదనుకో." వెంకటపతి గొంతు వణికి పోయింది.

''అమ్మ రాలేదా నాన్నా?'' తండ్రికి దగ్గరగా వచ్చి అడిగాడు రవి.

''రాలేదురా బాబు!'' ఎటో చూస్తూ చెప్పాడు వెంకటపతి.

''పోయినసారి చెప్పింది నాన్నా నిన్నే పంపిస్తాననీ? అందుకే రాలేదు.''

''అమ్మ చెప్పిందా బాబూ?'' కొడుకుని దగ్గిరకు తీసుకొంటూ అడిగాడు వెంకటపతి.

''వాట్ డాడీ! ఇంత సో డర్టీ క్లోత్స్?'' మురికిపట్టి అడసలుకట్టి వున్న తండ్రి చొక్కా మొలపంచా చూస్తూ అన్నాడు కొడుకు.

వెంకటపతికి సరిగా అర్థంకాలేదు. కాని తన బట్టల్ని చూపించి ఏదో అన్నట్టు మాత్రం తెలిసింది.

''దుమ్ము కొట్టుకొన్నాయ్‌లే బాబూ!''

''మంచి బట్టలు వేసుకొని రావాలి నాన్నా! లేకపోతే ఇక్కడ నవ్వుతారు నాన్నా? మా క్లాసు మేట్సూ, రూంమేట్సూ పోట్లాటొచ్చినప్పుడు 'యువర్ డాడీ ఈజ్ సో డర్టీ' అంటారు నాన్నా! మమ్మీ ఎలా వచ్చేదనుకున్నావ్?''

''పదబాబూ! బట్టలు సర్దుకో పోదాం.'' తండ్రి కొడుకు చెయ్యి పట్టుకున్నాడు.

కాని రవే తండ్రి చెయ్యి లాగుతూ ముందుకు నడిచాడు. తను చదువుకొనే క్లాసురూమూ, పడుకొనేగదీ, డైనింగు హాలూ, లైబ్రరీ, వాళ్ళు సినిమా చూసే హాలూ! అన్నీ చూపించాడు తండ్రికి. స్కూలు బిల్డింగ్ వెనక్కు తీసుకెళ్ళి చూపించాడు.

''ఇది మా వెజిటెబుల్ గార్డెన్ డాడీ.''

''ఇక్కడ కూరలు పండిస్తాం'' అన్నాడు కొడుకు.

వెంకటపతి తోటంతా కలియజూసి, అక్కడ మొక్కలకు నీళ్ళు చాలలేదనీ, ఇక్కడ తెగులు పట్టిందనీ, అక్కడ పూత రాలిపోతుందనీ చెప్పాడు.

అంతవరకూ తండ్రికి ఏమీ తెలియదనుకొన్న రవి విస్మయంగా చూశాడు. తండ్రిని తీసుకొని డార్మిటరీలోకి వస్తోన్న రవికి మేట్రన్ ఎదురైంది.

''హాల్లో! రవీ! వేరీజ్ యువర్ మమ్మీ? డింట్‌షీకం?''

''నో మేడమ్?''

వెంకటపతి కొడుక్కేసి గర్వంగా చూసుకొన్నాడు.

''ఓ! యువర్ సర్వెంట్ హాజ్ కం టూ టేక్ యూ?'' బాబ్డ్ హెయిర్ వెనక్కు తోసుకొంటూ అన్నది మేట్రన్.

రవి ముఖం కందిపోయింది. కుర్రాడు ఉడికి పోతున్నట్టయి పోయాడు.

వెంకటపతికి జుల్పాల దొరసానిమీద కోపం వచ్చింది. అంతంత పొడుగున మాట్లాడితే చిన్నాడు వాడేం జవాబు చెబుతాడూ?

''థెన్! హర్రీ అప్!''

మ్మేటన్ రవి బట్టలూ, పుస్తకాలూ పెట్టెలో సర్ది ఇచ్చింది.

వెంకటపతి సూట్‌కేసు చేత్తో పట్టుకొని కొడుకు వెనకే నడిచాడు.

ప్రిన్స్‌పాల్ రూం ముందు నిలబడ్డాడు రవి. ప్రిన్సిపాల్ బయటకొచ్చి రవిని చూసి చిరునవ్వు విసిరాడు.

''సో యూర్ లీవింగ్?''

''యస్సర్! హి ఈజ్ మై ఫాదర్!'' తండ్రిని చూపించి అన్నాడు రవి.

ప్రిన్సిపాల్ ముఖం మారిపోయింది! వింతగా చూశాడు. అంతలోనే సర్దుకొని చిరునవ్వు విసురుతూ ''నమస్కారం'' అన్నాడు.

వెంకటపతి చేతులెత్తి దణ్ణం పెట్టాడు.

''యువర్ సన్ ఈజ్ ఏ వెరీ ఇంటిలిజెంట్ బాయ్. హి లెట్స్ ఆల్ డిస్టంగ్‌షన్స్! హి విల్ కం అప్!'' అన్నాడు ప్రిన్సిపాల్.

తలిదండ్రులు పిల్లల్ని కార్లలోనూ, టాక్సీల్లోనూ తీసుకుపోతున్నారు. వచ్చేకార్లూ, పోయేకార్లూ అంతా హడావిడిగా వుంది.

వెంకటపతి రవిని తీసుకొని కార్లు తప్పించుకొంటూ అవుట్ గేటు కేసి నడుస్తున్నాడు.

''నాన్నా? మన కారెక్కడా?'' అన్నాడు రవి విసుగ్గా తండ్రి పక్కనే నడుస్తూ.

''కారెక్కడుంది బాబూ? మనకూ? నేను నడిచివచ్చాను.''

''నడిచా? టాక్సీలో రావచ్చుగా!'' అన్నాడు కొడుకు.

''అంత డబ్బు లేదు బాబూ నా దగ్గర! రోడ్డు మీద కెళ్ళి రిక్షా ఎక్కుదాం! బస్ స్టాండింగుకు ఏం తీసుకొంటాడో?'' చివరిమాట మెల్లగా తనలో తనే అనుకొన్నాడు.

వెంకటపతి కొడుకుని రిక్షా ఎక్కించి తను పక్కన కూర్చొని చెప్పాడు.

''ఏడింటికి బస్సుంది. అదెక్కితే పొద్దు పొడవకముందే దిగుతాం.''

''నీ దగ్గిర డబ్బులెందుకు లేవూ? మమ్మీ అయితే హోటల్లో దిగి టాక్సీలో వస్తుంది? నువ్వెందుకు ఇట్లా వచ్చావ్?'' తీవ్రంగా ముఖంపెట్టి అడిగాడు రవి తండ్రిని. వెంకటపతి మౌనంగా చూశాడు కొడుకుని.

''మమ్మీ ఈజ్ వేరీ బాడ్! నీకు డబ్బు లివ్వకుండా పంపించింది.''

''బాబూ!'' తండ్రి కొడుకు చెయ్యి పట్టుకున్నాడు. తల్లిమీద వాడికి కోపం వచ్చిందని అర్థం చేసుకొన్నాడు.

''అమ్మ దగ్గిర డబ్బులేదు. అంతా అయిపోయింది.''

''టువేర్ డాడీ? ఎక్కడకు పోయింది?''

వెంకటపతికి కొడుకు ప్రశ్న అర్థం అయినా సమాధానం చెప్పలేక ఊరుకొన్నాడు. కుర్రాడ్ని మరిపించాలని స్కూల్లో జరిగింది గుర్తుచేసుకొని అడిగాడు.

''ఆ జులపాల అమ్మాయి ఏంటి ఇంగ్లీషులో అన్నది?''

''నువ్వు సర్వెంట్ అన్నది! నౌకరు అట నౌకరు! ఇడియట్ బమ్! బంక్!'' రవి బుగ్గలు కందిపోయినై.

తనను చూసి ఆమె నౌకరు అనుకొంది. అవును తన ఆకారం ఎలా ఉంది? తన బట్టలు ఎలా వున్నాయి? తను చదువురాని మొద్దు. తను చదివింది పూరిపాకలో, చిత్తడినేలమీద తాటాకు చాపలేసుకొని. అదీ ఎన్నాళ్ళూ? అప్పటికి అక్షరాలు కూడా రాలా. బలరామయ్యగారి బండిలో తను సినిమాకెళ్ళిన తెల్లవారినుంచే తన తండ్రి బడి మాన్పించాడు.

ఆరోజు తనకెంతో హాయిగా వుంది. ఇప్పుడు తనను చూసి ఆమె నౌకరు అనుకోవడంలో తప్పేమీలేదు. మొదటిసారి ఆడుకొనేచోట తనను రవి ఎలా చూశాడు? ఏమన్నాడూ? డర్టీ ఇంకా ఏమో అన్నాడు. మరి ప్రిన్సిపాల్ తనకు నమస్కారం చేశాడేం? నౌకర్లకూ, జీతగాళ్ళకూ పెద్దోళ్ళు నమస్కారం పెట్టరుగా?

''బాబూ? మీ ప్రిన్సిపాల్‌గా రెందుకు దణ్ణం పెట్టారూ?''

''నేను చెప్పానుగా మా నాన్నగారని?''

''బాబూ రవీ?'' వెంకటపతి కొడుకునెత్తి ఒళ్ళో కూర్చోపెట్టుకొని గుండెలకు హత్తుకొన్నాడు.

''ఏమన్నావో మళ్ళీ చెప్పు? ఇంగ్లీషులోనే చెప్పులే.'' వెంకటపతి ఉద్వేగంతో ఊగిపోతున్నాడు.

''సర్ హీ యీజ్ మై ఫాదర్!'' రవి స్వరం స్పష్టంగా పలికింది.

కొడుకు చెప్పింది వల్లిస్తూ ''సర్-హీ-యీజ్-మై-ఫాదర్!'' వెంకటపతి కంఠం రుద్ధమయింది. లోతుకు పీక్కుపోయిన కనుకొనల్లో అశ్రువులు తిరిగాయి.

''డాడీ! వై ఆర్ యూ క్రయింగ్?'' రవి తండ్రిని చూసి కలవరపడ్డాడు.

పసివాడి బింకమూ, పట్టూ సడలిపోయినై. రెక్కలారని కోడిపిల్లలా తండ్రి వడిలో ముడుచుకు పోయాడు.

''బాబూ! మీ ప్రిన్స్‌పాల్‌గారు ఏదో అన్నారు? అదేమిటి?''

రవి గుర్తు చేసుకొన్నాడు. సర్దుకు కూర్చొని గొంత సవరించుకొని చెప్పాడు.

''నీ కొడుకు చాలా తెలివికలవాడు. హీ విల్ కం అప్. అంటే- పైకి వస్తాడు. గొప్పవాడ్ని అవుతానని అన్నాడు నాన్నా!''

వెంకటపతి వళ్ళు పులకరించి పోయింది. కొడుకుని గుండెలకు హత్తుకొని తల నిమురుతూ రిక్షాలో కూర్చున్న సంగతే మర్చిపోయాడు.

వరూథిని తెలివైన పనే చేసింది. బాబును మంచి స్కూల్లో వేసింది. నిజంగా వాడెంతో వృద్ధిలోకి వస్తాడు. ఆ మాట ప్రిన్స్‌పాల్‌గారే అన్నారు. కాని వాడి చదువు ఇక సాగదుగా?

వెంకటపతి గుండెలు బీటలు తీశాయి. రోడ్డుమీద చెట్టున ఎండిన కొమ్మగాలికి విరిగిపడింది!

వీడి గతేం కాను? వీ డెలా బతుకుతాడు? వీడికి ఈ బట్టలుండవు. రేపట్నుంచి తినటానికి కూడా తిండి వుండదు. వాడేమై పోతాడు? తనెలా పోషిస్తాడు? తరచి తరచి కొడుకు భవిష్యత్తు గురించి ఆలోచించిన వెంకటపతికి కళ్ళు చీకట్లు కమ్మాయి. గుండె తరుక్కుపోతోంది.

తను బతికి ఏం ప్రయోజనం? కొడుక్కు పట్టిన దుర్గతిని చూడగలడు?

"నాన్నా! అమ్మ ఎందుకు రాలేదూ?"

వెంకటపతి నిలువెల్లా వణికిపోతున్నాడు. ఎముకలూ, నరాలూ తేలిన చేతుల్తో, కాయలుకాచి మొద్దుబారిన వేళ్ళతో కొడుకు వళ్ళు నిమిరాడు. చంపలు స్పృశించాడు. జుట్టు నిమిరాడు.

"మాట్లాడవేం నాన్నా?"

ఏం మాట్లాడుతాడూ? ఏమని చెప్తాడూ? ఎలా చెప్పగలడు?

"మమ్మల్ని ఎంత అన్యాయం చేసి పోయావే నువ్వూ?" వెంకటపతి గుండెలు మూలిగాయి.

## 54

రవి మైమరచి నిద్రపోతున్నాడు.

వెంకటపతి కొడుకు పక్కమీద కూర్చొని ఆరిపోయిన బీడీకొన బొటనవేలి గోటితో గీరి మళ్ళీ వెలిగించాడు.

వీధిలో ఎక్కడో తలుపు కొట్టిన శబ్దం. రెండో ఆట సినిమా కెళ్ళొచ్చిన పెళ్ళాం తలుపు కొడ్తూ వుంటుంది. తాగొచ్చిన మొగుడు తలుపు బాదుతున్నాడేమో? మళ్ళీ శబ్దం!

ఆ కొట్టున్నది తమ తలుపేనని నిర్ధారణ కొచ్చాక కూడా వెంకటపతి లేవడానికి సంశయించాడు.

ఎవరొస్తారు ఈ వేళప్పుడు? వరూథిని సినిమాకు వెళ్ళలేదు. తను తాగి రాలేదు. అసలు తాగడానికి డబ్బులేవీ? తినడానికే లేదు. ఇంకా తాగటానికెక్కడ వుంటుంది? తను ఇంట్లో వున్నయ్ అన్నీ అమ్మేశాడు. దాని చీరలన్నీ అమ్మాడు. రెండు కంచాలూ - ఒక గ్లాసూ - అన్నం తపేలా - పులుసు చట్టీ మిగిలింది. తను వండే కూడు బాబుకు అసలు సహించడం లేదు. చిక్కి సగమయిపోయాడు. మిసమిసలాడే వాడి బుగ్గలు పీక్కుపోయాయి.

నిద్రపోతున్న కొడుకు చంపలు మృదువుగా స్పృశిస్తూ అనుకొన్నాడు వెంకటపతి.

మళ్ళీ తలుపుకొట్టిన చప్పుడు.

ఎవరొస్తారీ ఇంటికి? ఎవరున్నారు రావడానికి? వచ్చినా తనతో ఏం పని? వెంకటపతి లేచాడు. తూలిపడబోయాడు. కాళ్ళు వణికాయి! అడుగులు తేలిపోతున్నాయి. నరాలు గుంజుతున్నాయి. తలలో నాదు. తను ఉండలేడు. తాగకపోతే బతకలేడు. తన పని అయిపోయింది. ఇంకేం అమ్మి తాగుతాడు? ఏముంది? బాబు కెలా తిండిపెడ్తాడు? తనకు కూలిచేసే ఓపిక లేదు. వళ్ళంతా గుల్లయిపోయింది. పేగుల్లో మంట! చెవుల్లో హోరు. ఎంత నడిచినా తరిగినట్టులేదు. గదిలో నుంచి వీధి గుమ్మం దగ్గిరకు రావటానికి కూడా ఎంతసేపు పట్టిందో తెలియదు.

తలుపు తీసి ''ఎవరూ?'' అన్నాడు.

గబగబా లోపలికొచ్చి ''నేనండి రామదాసును!'' చిన్నగా అన్నాడు ఆ వచ్చిన వ్యక్తి.

''ముందు తలుపేయండి.'' అన్నాడు మళ్ళీ.

రామదాసు గడ్డంతోపాటు తలమీద జుట్టుకూడా లేదు.

''నువ్వు రామదాసువా?'' సందేహంగా అన్నాడు వెంకటపతి.

''అవునండీ? తిరుపతి వెళ్ళి మొక్కు తీర్చుకొచ్చా. రండి లోపలకు అర్జెంటుగా మాట్లాడాలి.'' అన్నాడు రామదాసు.

''కొండ్రలావుది పెద్దబెడదగా వుంది. దొరికిపోతాడేమో భయంగా వుంది!''

''కొండ్రలావేంటీ? దొరికిపోవటమేంటీ?'' రామదాసు ముఖంలోకి చూస్తూ అన్నాడు వెంకటపతి.

రామదాసు ఓసారి తల అటూ ఇటూ తిప్పి ఎవరూ లేరన్న నిశ్చయానికొచ్చాడు.

''మీరిప్పుడు ఏమీ తెలియనట్టు మాట్లాడితే నష్టం మీకే? మీ మేలు కోరే వచ్చాను. కొండ్రలావు దొరికాడంటే మిమ్మల్ని ఖూనీ కేసులో బిగించి వేస్తాడు.''

''ఖూనీ కేసా? నే నెవర్ని ఖూనీ చేశానని?''

''చేయించింది చేసిన దానికంటే కూడా పెద్ద నేరం.''

''ఏమిటయ్యా నువ్వనేది? ఖూనీ ఏంటీ? నేరమేంటీ?''

వెంకటపతికి తడిపొడి మాటలు చెప్పి లాభంలేదని గ్రహించాడు. రామదాసు.

''మీ భార్య వరూధినమ్మ రామనాథబాబును ఖూనీ చెయ్యమని నగలమ్మి ఐదు వేలిచ్చింది. మిగతాది పనయాక ఇస్తానని వాగ్దానం చేసింది. ఆ తాగుబోతు ముండాకొడుకు మరొక రౌడీ తొత్తుకొడుకుని జత కట్టుకొని రామనాథబాబు కోసం నెలరోజులు కాపేసి, చివరకు జగ్గయ్యపేట దగ్గిర కారాపి అందులో ఉంది ఎవరో కూడా చూడకుండా రామనాథబాబేనని రామకృష్ణయ్యను పొడిచేశారు! అసలు ఆరోజు ఆ కార్లో రామనాథబాబే ఉండాల్సింది. ముందుగా అందిన ఇన్ఫర్మేషన్ ప్రకారం రామనాథబాబే బయలుదేరి పోవాల్సింది. ఆఖరి క్షణంలో మారిపోయింది. చీకట్లో ఎవరోకూడా చూడకుండా పొడిచేశారు. అంతవరకూ వెళ్ళిన వాళ్ళు వెనక్కు తగ్గటానికి వీలుండదు మరి! వాళ్ళిద్దరూ ఇప్పుడు పరారీలో ఉన్నారు. ఆ కొండ్రలావుగాడు మనిషిమీద మనిషిని పంపించి నా ప్రాణం పీక్కుతింటున్నాడు మిగతా ఐదువేలకు. రేపు సాయంకాలం లోపుగా డబ్బివ్వకపోతే వాడే పోలీసుల దగ్గిరకెళ్ళి అప్రూవర్‌గా మారిపోతాడట! వెంకటపతిగారే చంపినట్టూ, లేక చంపించినట్టో చెప్పేస్తానని బెదిరిస్తున్నాడు. దానికి తగ్గట్టు శ్యామలాంబగారు తన అన్న రామకృష్ణయ్య కేసులో మీకు సంబంధం ఉన్నట్టు అనుమానపడుతోంది. ఎట్లాగయినా ఆ ఖూనీకేసులో మిమ్మల్ని ఇరికించి తన కసి తీర్చుకోవాలని ప్రయత్నిస్తుంది. కొండ్రలావు లొంగిపోయి పోలీసులకు దొరికితే ఆ తర్వాత మీరూ నేనూ చేసేది ఏమీ ఉండదు! వాడిముఖాన ఆ డబ్బు పారేయకపోతే...''

రామదాసు ఆపి ఎక్కడో చూస్తున్న వెంకటపతిని తట్టి ''వెంకటపతిగారూ? వెంకటపతిగారూ?'' అంటూ గాబరాగా పిల్చాడు.

వెంకటపతిలో చలనం కన్పించి రామదాసు తేరుకొన్నాడు.

''వరూథిని - రామనాథబాబుని చంపమందా?''

''అదేమిటి వెంకటపతిగారూ రెడ్డొచ్చె మొదలాడమన్నట్టు మళ్ళీ మొదటికొచ్చారూ?''

''వరూథిని నగలమ్మి రామనాథబాబుని ఖూనీచెయ్యమని ఇచ్చిందా?''

''ఇంతకీ మీరేం చెప్తారో చెప్పండి. వాడికి రేపు సాయంకాలంలోపుగా సర్దాలి. లేకపోతే కొంప మునుగుతుంది!''

''కొంప మునిగినా తేలినా నా దగ్గిరేముంది ఇవ్వటానికి?''

''మీరలా అంటే కాదు కొంతయినా సర్దాలి.''

''నా దగ్గిరేముందయ్యా? తిండికి జరక్క నే నేడుస్తుంటే! ఉన్నదంతా అది బతికుండగానే ఊడ్చి పెట్టేసిందిగా?''

''సరే! ఇంతకంటే నేను చెప్పగలిగిందేమీలేదు. ఆ కొండ్రలావుగాడు రేపోమాపో పోలీసులకు లొంగిపోకమానడు. మిమ్మల్ని ఇరికించక మానడు? ఖూనీ కేసులో ఇరుక్కున్న వాళ్ళకు ఆజన్మఖైదో ఉరో తప్పదు! అందుకు మీరు సిద్ధమయితే దేవుడయితే మాత్రం ఏం చేస్తాడు? పోలీసులు మిమ్మల్ని అరెస్టుచేసి తోమినప్పుడు ఏ సందర్భంలోనైనా నా పేరు చెప్తారో అది మీకే ఎదురు తిరుగుతుంది! నేనూ కొండ్రలావూ తెలివిగానే తప్పుకోగలం! ప్రాసిక్యూషన్ సాక్షిగానే కోర్టుకొస్తా జాగ్రత్త! అది మాత్రం గుర్తుపెట్టుకోండి! మీమీ తగాదాల్లో మేమెందుకిరుక్కోవాలి? జైలుకు పోవాలి? ఆఁ నే వస్తా! మీ ఆఖరిమాట అదేనా?'' రామదాసు లేచి నిలబడి బెదిరించాడు.

తలవంచుకొని దీర్ఘాలోచనలో వున్న వెంకటపతి ఉలకలేదు. పలకలేదు. సమాధానం చెప్పలేదు సరికదా రామదాసు కేసి కన్నెత్తయినా చూడలేదు. రామదాసు తలుపులు బార్లాగా తెరిచి వెళ్ళిపోయాడు. వెంకటపతి అలా ఎంతసేపు కూర్చున్నాడో అతనికే తెలియదు.

తెల్లవారు ఝామున వస్తోన్న మైల్ అవుటర్ సిగ్నల్ దగ్గిర ఆగి కూత పెడుతోంది.

వెంకటపతి కదిలాడు.

''బలరామయ్య కూతురా, ఎంతపని చేశావే! చచ్చికూడా సాధిస్తున్నావు గదే!'' అనుకొన్నాడు సాంబయ్య కొడుకు వెంకటపతి.

ఇల్లు నాలుగు మూలలా కలియ జూశాడు. నా అన్నదీ, చెయ్యికోతగ్గదీ ఏదీలేదు ఇంట్లో పందిరిమంచం తప్ప. ఆదమరిచి తల్లి మంచం మీద నిద్ర పోతున్నాడు కొడుకు రవి. కొడుకుని ఎత్తుకొని భుజాన వేసుకొన్నాడు. రెండడుగులు వేసి ఆగిపోయాడు వెంకటపతి.

''నిలువుటద్దం ఏం చేశావ్? అదీ అమ్మావా?''

తిరిగి చూశాడు వెంకటపతి.

వరూథిని పందిరి మంచంమీద కూర్చొని ముడిలో మల్లెచెండు ముడుచుకొంటూ ప్రతిబింబం కన్పించక చిరాకు పడుతుంది.

''అమ్మాను! నేనే అమ్మాను! నాకోసం కాదు. నా తాగుడుకోసం కాదు. బాబుకోసం. ఆకలితో నకనకలాడిపోతుంటే చూడలేక అమ్మాను. నువ్వు దిగు! నీ పందిరి మంచం కూడా అమ్మాలి. బాబుకోసం అయితే ఏదయినా చేస్తాను. తెలుసా? కాని నా కిప్పుడు టైంలేదు. కూర్చో దానిమీద పడుకొని పొర్లాడు. మేం పోతున్నాం.''

''నాన్నా'' తండ్రి భుజంమీద తల పెట్టుకొని కలతనిద్రలో వున్న రవి తలెత్తి మూసుకు పోతున్న కనురెప్పలు బలవంతంగా ఎత్తి చూశాడు.

వెంకటపతికి పందిరిమంచం ఖాళీగా, బోసిగా కన్పించింది. అతని ఊహా చిత్రాలు చిరిగిపోయాయి. భ్రమలు పటాపంచలైనాయి.

''ఎక్కడికి నాన్నా!''

''తాతయ్య దగ్గరకు?''

''తాతయ్యంటే నాకు చాలా ఇష్టం! ఐ లైక్ తాతయ్యా! నో... ఐ లవ్ తాతయ్యా. ఉఁ ఈజ్ రైట్ డాడీ?'' రవి కళ్ళు మూతలు పడినై.

తండ్రి భుజం మీద చెంప ఆనించాడు. గూడ ఎముక గట్టిగా తగలగా మెత్తటి భాగం కోసం వెతికి దొరక్క మళ్ళీ కటువుగావున్న తండ్రి భుజంమీద చెంపను చేర్చాడు రవి.

రామదాసు తెరిచి వెళ్ళిన వరూథిని ఇంటి తలుపులు మళ్ళీ మూయబడలేదు!

## 55

వెంకటపతి ఊరి పొలిమేరల్లోకి వచ్చేసరికి తెల్లవారిపోయింది.

జమ్మిచెట్టుకింద కొడుకుని దించి, పై పంచతో ముఖానికి పట్టిన చెమటను తుడుచుకున్నాడు.

''డడీ? ఇంకా ఎంత దూరం మన ఊరు?'' నిద్రమత్తు వదిలించుకొని అడిగాడు రవి.

''వచ్చేశాం బాబూ! అదుగో ఆ కనిపించేదే ఊరు!''

రవి తలతిప్పి పొలాలమీదగా చూశాడు. విశాలంగా, స్వచ్ఛంగా వున్న రవి కళ్ళు అరుణభాస్కరుని తొలికిరణాలు సోకి కాంతివంతమైనాయి.

'ఇటు! ఇటు! అదుగో అక్కడ! ఈ తిన్నగా చూడు. చెట్లు గుబురు గుబురుగా వున్నాయ్ చూడూ! అదే మన ఊరు.''

వెంకటపతి, నిలబడ్డ కొడుకుకు పక్కగా మోకాళ్ళమీద కూర్చొని చెయ్యెత్తి చూపిస్తూ చెప్పాడు.

''ఇక నేనే నడుస్తా! నన్నెత్తుకోవద్దు! రా నాన్నా వెళ్దాం!'' తండ్రి చెయ్యి పట్టుకొని ఊరిదగ్గర కొచ్చామన్న సంతోషంతో అన్నాడు రవి.

తెల్లవారిందాకా కొడుకుని మోసిన వెంకటపతికి మెడ లాగింది. భుజాలు బరువెక్కాయి. అక్కడికీ రవి మధ్య మధ్య దిగి నడవటానికి ప్రయత్నించాడు. కాని కొడుకుని చీకట్లో, చేలల్లో, కట్టలమీదా నడిపించటానికి వెంకటపతికి మనసొప్పలేదు. చీకట్లో పురుగూ పుట్రా ఏమయినా ఉండొచ్చు. మోడూ మొక్కా తగిలితే వాడి కాళ్ళు రక్తం చిమ్మవూ? వెంకటపతి, రోడ్డు వదిలి అడ్డతోవన నడిచి ఊరి పొలిమేరల్లోకి చేరాడు.

''ఇటు రా బాబూ!'' అంటూ వెంకటపతి కొడుకు చెయ్యి పుచ్చుకొని జమ్మిచెట్టుకు ఎడంగా మెరకమీదున్న నూతి దగ్గరకు తీసుకెళ్ళాడు.

తాగాడికి కట్టివున్న బొక్కెనతో నీళ్ళు తోడుతూన్న వెంకటపతి, కుతూహలంతో బావిదగ్గరకొచ్చి తొంగిచూట్టానికి ప్రయత్నిస్తోన్న రవిని ఎడంగా నిలబడమని హెచ్చరించాడు.

తండ్రి బొక్కెనతో నీళ్ళుతోడి, ఒడ్డున పెట్టగానే, రవి నీళ్ళలో రెండు చేతులూ పెట్టి దోసిళ్ళతో నీళ్ళు పైకెత్తి ముఖంమీద చల్లుకుంటూ ఓ కొత్త అనుభూతిని పొందసాగాడు.

వెంకటపతి కొడుకు ముఖమూ, కాళ్ళూ చేతులూ కడిగి పై పంచెతో తుడిచాడు. పొద్దున్నే వీస్తున్న చల్లగాలి తగిలి రవి ఆనందంతో గంతులు వేశాడు.

వెంకటపతి మరో బొక్కెన నీళ్ళు తోడి ముఖం, కాళ్ళూ కడుక్కొని, పంచతో తుడుచుకొంటూ, కొడుకుని తీసుకొని వరలబావి దగ్గర్నుంచి జమ్మిచెట్టు దగ్గరకు నడిచాడు.

''బాబూ! రవీ! ఈ కాలవకట్టనే నడిచివెళ్ళు. అక్కడ ఎత్తుగా మర్రిచెట్టు కన్పిస్తోంది చూడు - అదే మన ఊరి చెరువు. చెరువు కట్టదిగగానే మన ఊళ్ళో కెళ్ళే రోడ్డు వస్తుంది. ఆ రోడ్డమ్మటే వెళ్తే -''

''నాన్నా! నువ్వో?''

''ఆ రోడ్డమ్మటే వెళ్తే రామాలయం వస్తుంది. రామాలయం దాటితే రచ్చబండ''

''ఎందుకు నాన్నా అవన్నీ చెప్తావూ? నువ్వు రావా?'' బిక్కమొహం వేసి అన్నాడు రవి.

''రాను బాబూ! రాలేను. ఈ ఊరితో నాకు ఏనాడో ఋణం తీరిపోయింది.'' అన్నాడు తండ్రి.

''అయితే నేనూ వెళ్ళను!'' మొండిగా అన్నాడు కొడుకు.

''ఇంకెక్కడికి వెళ్తావు బాబూ? నువ్వెళ్ళాల్సింది అక్కడికే.''

''నీతోనే వస్తా!''

''నాతోనా? నాకు ఇల్లు లేదు. పొలంలేదు. ఊరుకూడా లేదు బాబూ

నాకు. ఇల్లు, పొలంతోపాటు ఊరుకు కూడా దూరం అయాను! నీకు తాతయ్య ఉన్నాడు. తాతయ్యకు తలదాచుకోవటానికి చోటు వుంది. నీకోసం తాతయ్య ఎదురుచూస్తూ ఉంటాడు వెళ్ళుబాబూ! వెళ్ళు!"

"తాతయ్య దగ్గరకు నువ్వెందుకు రావూ?"

"తాతయ్యకు నేనంటే కోపం బాబూ?"

"అమ్మంటేనే కోపం అని చెప్పావుగా?"

"అవును బాబూ! నేనంటేకూడా కోపమే. తాతయ్య దగ్గరకు నేను రాలేను."

"తాతయ్యకు నేనంటే కోపం లేదా?"

"లేదు బాబూ లేదు. నువ్వంటే తాతయ్యకు ప్రాణం. చాలా ఇష్టం. తాతయ్య నీ కోసమే వెయ్యి కళ్ళు పెట్టుకొని ఎదురు చూస్తూ ఉంటాడు. వెళ్ళు బాబూ-"

"నాన్నా!" రవి తండ్రి చెయ్యి గట్టిగా పట్టుకొన్నాడు.

"రచ్చబండ దాటగానే వీధిమలుపులో మాలక్షమ్మ చెట్టుంది."

"మాలక్షమ్మ చెట్టంటే?"

"వేపచెట్టు బాబూ! ఆ వేపచెట్టుకు ఎదురుగా వున్న వీధిలోనే తిన్నగా వెళ్తే తాతయ్య ఇల్లొస్తుంది. ఇప్పుడు తాత ఉండేది ఆ ఇంట్లో కాదు. ఆ ఇంటికి వెనగ్గా ఒక సందు పోతుంది. ఆ సందులోనుంచి వెళ్తే... ఇదంతా ఎందుకులే బాబు? అక్కడకు పోయి ఎవర్నడిగినా చెప్తారు. వెళ్ళు బాబూ! వెళ్ళు!" వెంకటపతి కొడుకు పట్టుకొన్న చేతిని వదిలించుకొని వాడి తల నిమురుతూ, తల పక్కకు తిప్పుకొన్నాడు.

"తాతయ్య నిన్ను పెంచి పెద్దవాడ్ని చేస్తాడు. వృద్ధిలోకి తెస్తాడు. నువ్వు తాతయ్య చెప్పినట్టు విను. తాతయ్యకు తను చెప్పినట్టు వినకపోతే కోపం వస్తుంది. తెలుసా బాబూ? తాతయ్య చెప్పినట్టే వినాలి నువ్వు." వెంకటపతి కంఠం బొంగురుపోయింది.

"నువ్వూ అమ్మా తాతయ్య చెప్పినట్టు వినలేదా? అందుకేనా తాతయ్యకు మీరంటే కోపం?"

"నిజం చెప్పావు బాబూ! నిజం చెప్పావు. అందుకే మా గతి ఇలా అయిపోయింది. నువ్వైనా తాతయ్య చెప్పినట్టు నడుచుకో." వెంకటపతి కొడుకుని రెండడుగులు ముందుకు నడిపించి తను ఆగిపోయాడు.

"బాబూ! ఊళ్ళో వాళ్ళు నిన్ను పలకరించి ఎక్కడి కెళ్తావనీ, ఎవరి అబ్బాయివనీ అడుగుతారు. అడిగితే ఏం చెప్పాలో తెలుసా?"

"ఎందుకడుగుతారూ. అడిగితే నే నెందుకు చెప్పాలి?"

"కాదు బాబూ అడుగుతారు. అడిగితే మనం మర్యాదగా సమాధానం చెప్పాలి."

"ఎందుకూ? నేనెవరయిందీ వాళ్ళ కెందుకు చెప్పాలీ? మన బజార్లో ఎప్పుడూ ఎవరూ అట్లా అడగలేదేం?"

"అది బస్తీ! బస్తీల్లో ఎవరూ పట్టించుకోరు. కాని ఇది పల్లెటూరు. ఇక్కడ

కొత్తవాళ్ళు ఎవరు ఊళ్ళోకి వచ్చినా అడుగుతారు. మనం మర్యాదగా చెప్పాలి. ఏం చెప్తావు బాబూ? ఎవరి అబ్బాయివని అడిగితే?"

"వరూథిని కొడుకు అని చెప్తాను."

"వద్దు బాబూ! వద్దు!" వెంకటపతి గుండెలదిమి పట్టుకొన్నాడు.

"వెంకటపతి కొడుకుని అని చెప్పేదా?"

"వద్దు! రవీ వద్దు!" తండ్రి హృదయం రగిలిపోయింది.

"మరింకా ఎట్లా చెప్పాలి?"

"సాంబయ్యగారి మనవడ్ని అని చెప్పు బాబూ!"

చెరువుకట్టమీద వస్తోన్న మట్టిబళ్ళని చూసి వెంకటపతి తొందరపడ్డాడు. ఊళ్ళోవాళ్ళు ఎవరూ చూడకుండా దాటిపోవాలన్న ఆదుర్దాలో కటువుగా అన్నాడు.

"బాబూ! ఇక వెళ్ళు. నేపోతున్నా. తాతయ్య చెప్పినట్టు విను. తాతయ్య భూమినే నమ్మిన మనిషి! నువ్వు తాతయ్యను నమ్ముకో. సాంబయ్యగారి మనవడినని చెప్పుకో."

వెంకటపతి గిరున వెనక్కు తిరిగి పెద్ద పెద్ద అంగలు నాలుగు వేసి ఆగి పోయాడు. కాళ్ళు ముందుకు సాగటంలేదు. ముందు తోవకన్పించటం లేదు. కళ్ళమీద నీటిపొరలు కమ్మాయి. ఆకాశం భూమీ అంతా జలమయంగా కన్పించింది.

రవి వెనకనుంచి పరుగెత్తుకొస్తాడనీ, తనను పెనవేసుకొని వెక్కి వెక్కి ఏడుస్తాడని ఊహించాడు. అతనిలోని ప్రతి అణువూ ఆశించింది. క్షణాలూ, నిముషాలూ దొర్లిపోయినై. చంపుకొన్న మమతా మమకారాలు వెంకటపతి హృదయంలో తిరిగి లేచి నిలుచున్నాయి. గిరున వెనక్కి తిరిగి చూశాడు. కాలవగట్టున చెంగు చెంగున పరుగులు తీస్తున్న రవి కన్పించాడు. అప్పటికే చెరువు దగ్గిరగా వెళ్ళిన రవి, తనకుదూరమైన కొడుకు, ఇంకా చిన్నవాడుగా కన్పించాడు వెంకటపతికి.

వెంకటపతి గుండె బద్దలైంది. తనకొడుకు రవి, తనలో భాగమైన రవి, తనకేసి కన్నెత్తయినా చూడకుండా వెళ్ళిపోతున్నాడు. ఎంతటి పాపిష్టి జన్మ తనది? వాడు తనకేమీ కానట్టు, నిర్విచారంగా వెళ్ళిపోతున్నాడు. తన బిడ్డకే తనంటే ప్రేమ లేదా? ఇక తను కావాలని కోరుకున్న వాళ్ళెవరున్నారూ?

అవును తన కెవరున్నారు? తన కెవరూ లేరు. తను ఎవరికీ ఏమీకాడు! తన జన్మ వృథా! ఇంక దేన్ని చూసుకొని ఎవరికోసం తను బతకాలి! రవికి తనంటే ఎంతో అనుబంధం ఉందనుకొన్నాడు. వాడి కళ్ళల్లో, వాడి మనసులో అజ్ఞాతంగా తనే వున్నాడనుకొన్నాడు. కాని అదంతా వట్టిభ్రమ. అది తన భ్రమే! అన్నీ ఎండమావులు!

పొలం వెళ్తూన్న తల్లిని చూసి పలుపులాక్కుంటూ, 'అంబా' అని చావిట్లో అలమటించే లేగదూడ గుర్తొచ్చి వెంకటపతి ఖిన్నుడైపోయాడు.

తండ్రి గుండెల్లో నిప్పులు వెదజల్లి, దూరంగా, కాలువగట్టుమీద దూరంగా దూరదూరంగా, పోతున్నాడు వెంకటపతి కొడుకు రవి.

వాడు తన కొడుకు! కాని వాడికి తండ్రి అంటే...? కొడుక్కు తండ్రిమీద

ఏమీ ఉండదా? కొడుకు తండ్రికి ఏమీకాడా? తనకు తన తండ్రంటే - వడ్లలారీ పక్కన వెల్లకిలాపడి ఆ రోజున తనకేసి చూసిన తండ్రి-ఆ రోజు తను తప్పతాగి వాకిట్లో తండ్రికి అడ్డం నిలబడినప్పుడు తనకేసి చూసిన తండ్రి సాంబయ్య - వెంకటపతి కళ్ళలో మెదిలాడు.

తరతరాలుగా వస్తున్న తండ్రీ కొడుకుల అనుబంధం ఇదేనా?

"బాబూ! రవీ! అటు వెళ్ళకు, అదంతా తుమ్మచెట్లు. ముళ్ళు గుచ్చుకుంటాయి. ఇటు దిగు. కాలవ కట్ట! రవీ? బాబూ రవీ!" వెంకటపతి ఎలుగెత్తి అరిచాడు. ఎదురుగాలి వెంకటపతి మాటల్ని తిరిగి వెంకటపతి దగ్గరకే మోసుకొచ్చింది. రవి కాలువగట్టు దిగిపోతున్నాడు.

మట్టి బళ్ళు మాగాట్లో బండ్ల గాడిలో పడి వస్తున్నాయి.

వెంకటపతి వడివడిగా నడిచిపోతున్నాడు. కొత్తకాలవ పొలం. అంతా నెర్రెలు కొట్టి వుంది. పొలం కలయజూస్తూ గనెం మీద వేగంగా నడుస్తోన్న వెంకటపతి మనస్సు సుడిగుండంలా తిరిగిపోసాగింది.

ఒకప్పుడు అది తమ పొలమే. అక్కడే తను మొదటిసారిగా నాగలి పట్టాడు. అప్పుడదంతా రాయీ, రప్పా - మెట్టా. వాన చినుకుల మీద ఆధారపడిన గడ్డ. కాలవ పడ్డాక మట్టి బంగారమైంది. ఇదంతా కనకయ్యే కొనుక్కొన్నాడు. కనకయ్య ఏం చేస్తాడు వ్యవసాయం? ఏమిటి గనేలన్నీ ఇట్లా ఒడుదుడుకుగా ఉన్నాయ్? సమంగా నేరుగా గనెం నరికితేనే చేనుకు అందం, చందం! ఇల్లు చూసి ఇల్లాల్ని చెప్పొచ్చు అన్నట్టు, గనెం చూసి రైతును చెప్పొచ్చు. తను చేసేప్పుడు ఈ భూమి ఎలా ఉండేది? ఇప్పుడెలా అయిపోయింది? ఎక్కడి మెరకలు ఎక్కడక్కడ పల్లాలు అక్కడే, నీటిజాలులుపడ్డ పొలం ఇంకేం పనికొస్తుంది? ఏ ఏడుకాఏడు చేస్తేనే చేను పదును తేలి వుంటుంది. కనకయ్య ఏమైనా పొలం వస్తాడా చస్తాడా? ఏ కవఁతగాళ్ళో చూస్తూ వుంటారు. తల్లి చేతుల్లో పెరిగిన బిడ్డ దారి వేరు. భూమీ అంతే? అరెరే! ఈ మొక్కలు చేలో పెరిగితే ఇక ఈ భూమి ఎందుకు పనికొస్తది? దీని వేళ్ళు ఎంతో లోతుకు తంతాయి. భూసారం అంతా గుంజేస్తది ఇది.

వెంకటపతి గనెం మీద నుంచి చేలోకి దిగి వంగాడు. పురచేత్తో ఏపుగా పెరిగిన మొక్క పట్టుకొని గుంజాడు. అది అతననుకున్నంత తేలిగ్గా పెగిలి రాలేదు. వెంకటపతి నవ్వుకొన్నాడు. రెండు చేతుల్తో ఆ పిచ్చి మొక్కను పట్టుకొని గట్టిగా గుంజాడు.

ఒకనాడు ఎడంచేత్తో సునాయాసంగా లాగి పారేయగలిగేవాడు. ఆ పిచ్చిమొక్క ఈరోజు ఎంత గుంజినా పెగిలి రావడంలేదు.

తనపని అయిపోయింది. తన కండలు బిగువు తప్పాయి. నరాలు పట్టు తప్పాయి. గుండె దిటవులేదు. మనోనిబ్బరం అంతకంటే లేదు. తను సాంబయ్య కొడుకు వెంకటపతి కాడు. వరూథిని మొగుడు వెంకటపతి. తను భూమికి ద్రోహం చేశాడు. ఆ భూమి తనమాట వినదు. ఆ గడ్డమీద ఇక తనకు

మనుగడలేదు. ఆ గడ్డమీద ఆ మట్టిని నమ్ముకొని బతికేవాళ్ళ ముఖాలు ఇక తను చూడలేడు. తను మట్టిలో కలిసిపోవటం కంటే గత్యంతరం లేదు.

ఎలుకలమందు! ఎండ్రిన్, ఒక గుక్కెడు చాలు. రామచంద్రయ్య ఎరువుతో పాటు ఎండ్రిన్ కూడా అమ్ముతాడు. మళ్ళీ తనకు భూమిదొరకదు. కాని ఎండ్రిన్ దొరుకుతుంది. తను మరోజన్మ ఎత్తితే ఈ గడ్డమీదే. కాని మళ్ళీ మనిషి అయి పుడ్తాడో... లేక... ఏ ఎలుకో-

పిచ్చి మొక్కను పట్టుకులాగుతున్న వెంకటపతి చేతులు పట్టుతప్పాయి. చేలోనుంచి గట్టెక్కి వేగంగా నడవసాగాడు వెంకటపతి.

మరి కొండ్రలావు ఏమైపోతాడు? అతడి పెళ్ళాం బిడ్డలకు దిక్కెవరూ? రామదాసు తప్పుకొంటాడా? ఎలా తప్పుకొంటాడు? కొండ్రలావు రామదాసు పేరు చెప్పకుండా వుంటాడా? ఈ హత్య రామదాసు చేతుల మీదుగా చేయించిందేగా? రామదాసు లేకపోతే కొండ్రలావు ఒక్కడితో ఏమౌతుంది? వాడికంత తెలివెక్కడుంది? రామదాసునీ కొండ్రలావునీ అనే పనేముంది? డబ్బుకాసపడి చేశారు. అంతా వరూథినే చేయించింది. దాని మనసులో ఎంత కసీ పగా వున్నాయి? అందమైన మృదువైన వరూథినిలో ఎంత కాఠిన్యం వుందీ! ఎన్ని దుర్మార్గపు ఆలోచన లున్నాయి?

ఈపాటికి కొండ్రలావు దొరికేడేమో? పోలీసులు తనకోసం గాలిస్తూనే వుంటారు! రామనాథబాబుకు తనసంగతి తెలియదా? రామనాథబాబు అలాంటివాడు కాడు. తనమీదకు కేసు రానీయకుండా చూడడా? అతనేం చేస్తాడు పాపం! పెళ్ళాం అతని మాట వినకపోతే? వరూథిని తన మాట వినేదా? అంతే రామనాథబాబు సంగతి కూడా. అన్నను ఖూనీ చేయించిన వాళ్ళ కుటుంబాన్ని నాశనం చేయకుండా శ్యామలాంబ మాత్రం ఎందుకు ఊరుకోవాలి? ఆమె అన్నని వరూథిని చంపించింది. వరూథిని భర్తకు ఆమె ఉరి వేయిస్తుంది. వరూథిని చేసిన పాపాన్ని భరించాల్సింది తనే! తను ఆమె భర్త! భరించాల్సింది తనే!

అమాయకుడు కొండ్రలావు తాగిన మైకంలో చేసి ఉంటాడు. ఆ పాపం వాడి భార్యాపిల్లలు ఎందుకు అనుభవించాలి? అన్నిటికి కారణభూతుడు తనే. ఆ శిక్ష తనే అనుభవించాలి. బస్తీలో తనకోసం గాలించి దొరక్కపోతే ఊళ్ళోకి వచ్చి పడ్తారు పోలీసోళ్ళు. తన తండ్రి సాంబయ్యనూ కొడుకు రవినీ, అడుగుతారు. ఊళ్ళోజనం అంతా ఇంటి చుట్టూ మూగుతారు. వెంకటపతి హంతకుడు! ఖూనీకోరు. జనం ఆగుబ్బుగా చెప్పుకొంటారు. తన తండ్రి సాంబయ్య, కొడుకు హంతకుడు అనుకొంటాడు.

తన కొడుకు రవి తన తండ్రి ఖూనీకోరు అనుకొంటాడు. వాళ్ళు పోలీసుల ముందు నిలబడి ఏం సమాధానం చెప్పుకొంటారు! తనెక్కడున్నాడని చెప్తారు? తనే పోలీసు స్టేషన్‌కు వెళ్ళి లొంగిపోతాడు. ఇందులో ఎవరి ప్రమేయములేదని చెప్తాను కొన్నాళ్ళు జైల్లో పెడతారు. రెండు పూటలా ఇంత అన్నం పెడ్తారు. ఉంటానికి గదులుంటాయి. అంతకంటే తనకు కావల్సింది కూడా ఏమీలేదు.

తను బయట వుండీ ఏ వల్లా బతకలేడు. ఏ పనీ చేయలేడు. ఉన్నన్ని రోజులు ఇంత తిండి పెడ్తారు. తర్వాత ఉరి తీస్తారు. ఆ తర్వాత అన్నమూ నీడా అవసరమేలేదు. ఉరి వేయకపోతే జన్మఖైదు వేస్తారు. అదైనా మంచిదే. తనకు ఈ బయటి ప్రపంచమే ఓ పెద్ద బందిఖానాలా వుంది. అదే సుఖం. ఆ జైల్లోనే స్వేచ్ఛగా ఊపిరి పీల్చుకుంటాను. తన బరువు తనకు ఉండదు. కూటికీ కొరత ఉండదు.

కొండ్రలావు బతికిపోతాడు. వాడి పెళ్ళాం బిడ్డల ఉసురు తన రవికి కొట్టకూడదు. అంతకంటే తను కోరేదీ, తన బిడ్డకు చేయగలిగిందీ ఏమీలేదు.

పెద్దబజార్లో ఎలుకల మందూ, ఎరువు అమ్మేరామచంద్రయ్య షాపు ముందే పోలీసుస్టేషన్-

వెంకటపతి గుండె రాయి చేసుకొన్నాడు. అతని పాదాలు దృఢంగా నేలను తాకుతున్నాయి. వేగంగా నడుస్తున్నాడు. పొద్దు కరకరా పైకి వస్తోంది.

ఇక తను భయపడాల్సిన పనేలేదు. పారిపోవాల్సిన అవసరం అంతకంటే లేదు. తనకు ఏదైనా ఒకటే. అటు రామచంద్రయ్య షాపు-ఇటు పోలీసుస్టేషన్. పాపం! కొండ్రలావు పెళ్ళాం బిడ్డలు!

వెంకటపతి చేలల్లో నుంచి పోతున్న అడ్డదారి విడిచి రహదారి ఎక్కాడు. వెంకటపతి పాదాలు లేపిన ఎర్రదుమ్ము గాలికి లేచి రోడ్డుపక్క చింతచెట్ల చిగుళ్ళను తాకుతోంది.

తను పొద్దు తిరిగేలోపల బస్తీకి చేరగలడు. తను మొదటిసారి ఆ రోడ్డు మీద బలరామయ్యగారి సవారిబండి జల్లలో వెనకపక్కన వొదిగి కూర్చొని సినిమా చూట్టానికి బస్తీకి వెళ్ళాడు. అప్పుడు వరూథిని బండిలో ఎక్కడ కూర్చుంది? ఎవరి వళ్ళో కూర్చుంది సరిగా గుర్తు రావడంలేదు-

వరూథిని పక్కన వెనకసీట్లో కూర్చొని చిన్నకారులో బస్తీకి వెళ్ళింది ఇంకా బాగా గుర్తుంది. ఆ తర్వాత జరిగిందంతా ఓ పెద్ద పీడకలలా వుంది.

"అదేమిటి రోత! ఎవరన్నా చూస్తే నవ్వుతారు. కాళ్ళు కింద పెట్టుకొని కూర్చోవాలి." వరూథిని తనకేసి ఓరగా చూసి అంటోంది. తను ఠక్కున సీటు మీద నుంచి కాళ్ళు దించాడు.

"అబ్బ! నా కాలు! అన్నీ మోటుపనులే." వరూథిని మూతి గుండ్రంగా తిప్పింది. ఎంత అందంగా వుంది? వరూథిని పక్కన కూర్చొని కార్లో వెళ్తుంటే ఎంత హాయిగా ఉంది? ఎంత దర్జాగా వుంది ఎప్పుడూ ఇలాగే వరూథిని పక్కనే కూర్చొని కార్లో పోతూంటే?

హారన్ మోగింది! వెంకటపతి రోడ్డుమీదనుంచి పక్కకు జరిగాడు.

వెంకటపతి తలెత్తి చూశాడు.

కనకయ్య కారు దుమ్ము లేపుకుంటూ దూసుకుపోయింది.

కనకయ్య అల్లుడు గుర్నాథం భార్యపక్కన ఠీవిగా కూర్చొని పోతున్నాడు పట్నం నుంచి పల్లెటూరికి.

## 56

తాతయ్యను గురించి ఆలోచిస్తూ కాలవదిగి చెరువుకట్టమీద కొచ్చిన రవి ఆగిపోయాడు.

వెనక్కు తిరిగి తండ్రికోసం రయ్యిన పరిగెత్తసాగాడు.

'నాన్నా! నువ్వెళ్ళొద్దు! నువ్విక్కడే వుండు. తాతయ్యకు చెప్పి నీ మీద కోపం లేకుండా చేస్తాను. తాతయ్య నామాట వింటాడు. తాతయ్యకు నేనంటే ఇష్టం అని చెప్పావుగా? నేను మళ్ళీ వచ్చి నిన్ను తాతయ్య దగ్గరకు తీసుకెళ్తా.' అని చెప్పాలనీ, ఎలుగెత్తి అరవాలనీ ఆ పసి హృదయం పరితపించిపోయింది. పరుగెత్తి పరుగెత్తి అలసి సొలసి నిలబడిపోయాడు.

తండ్రి జాడ కన్పించక దిగాలుపడ్డాడు.

''నాన్నా!'' దిక్కులు ప్రతిధ్వనించాయి.

''తాతయ్యే మంచివాడు. నీ దగ్గిరకి రానే రాను. నేను తాతయ్య దగ్గరే ఉండిపోతా. తాతయ్యంటేనే నా కిష్టం!''

చొక్కా అంచుతో కళ్ళు తుడుచుకొని వెనక్కు తిరిగాడు వెంకటపతి కొడుకు రవి.

రవి మళ్ళీ కాలవదాటి చెరువుకట్ట దిగి ఊళ్ళోకి వచ్చేసరికి రెండు బారలు పొద్దెక్కింది. ఎండ చిటచిటలాడిపోతూంది. తలలో నుంచి కారుతున్న చమట చంపలమీదగా జారి చొక్కాను తడిపేస్తూంది.

''ఎవరా పోయేదీ?'' రామాలయం ముందుగా నడుస్తోన్న రవిని చూసి ఆలయం అరుగుమీద కూర్చొన్న ఓ పెద్దమనిషి చుట్ట నోట్లో నుంచి తీసి, ఊసేదానికి వ్యవధిలేనట్టు ఉమ్మి నోటిలో పెట్టుకొనే కొంచెంగా తల పైకెత్తి కేకేశాడు.

రవి మాట్లాడకుండా ముందుకు నడిచాడు.

''నిన్నేరా బుడ్డోడా? ఎవరింటికి పోతున్నావ్?''

'బ్లడీ ఓల్డ్ రాస్కెల్. బుడ్డోడూ గిడ్డోడు అంటాడేం? ఈ ముసలాడూ?' అనుకుంటూ రవి ఆగి ముసలాయన ముఖంలోకి చూశాడు.

''ఎవరబ్బాయివిరా నువ్వూ? ఊళ్ళో ఇంతకుముందెప్పుడూ చూడలేదే?'' తను చూడకపోవడానికి తప్పంతా రవిదేనన్నట్టు అడిగాడు.

''సాంబయ్యగారి మనవడ్ని.''

''సాంబయ్యా? ఏ సాంబయ్యా?''

పక్కన కూర్చున్న వాళ్ళకేసి ప్రశ్నార్థకంగా అడిగాడు శివయ్య.

''మనూళ్ళో సాంబయ్యెవరు శివయ్యా? ఉన్నదల్లా ఊరుబోయిన వెంకయ్య కొడుకు సాంబయ్యే?'' అన్నాడు శివయ్యను చూసి సూరయ్య.

''ఆ సాంబయ్యకు మనవడున్నాడా? నాకు తెలియదే?''

అన్నాడు శివయ్య తనకు తెలియకుండా ఊళ్ళో ఏదీ జరగటానికి వీల్లేదన్న ధోరణిలో.

''వరూథినికి ఒక కొడుకుండాలయ్యా? వాడు పట్నంలో ఎక్కడో చదువుతున్నాడని విన్నాను'' అన్నాడు పరంధామయ్య.

''నేనే!'' తనకు తెలియకుండానే అనేశాడు రవి.

అన్నాక వీళ్ళ కెందుకు చెప్పానా అనుకొన్నాడు.

''ఈ మధ్య మీ అమ్మ పోయిందటగా? ఏం జబ్బా?'' అడిగాడు పరంధామయ్య ముఖమంతా కళ్ళు చేసుకొని రవికేసి చూస్తూ.

రవి బిక్కమొఖం వేశాడు. తలవంచుకొని ముందుకు కదిలిపోయాడు.

''జబ్బా? అదంతా ఓ పెద్ద కథ!'' అన్నాడు గోపాలం.

''అయితే అంతా ఆరిపోయాక వెంకటపతి ఊరు చేరాడన్నమాట?''

అంటూన్న శివయ్య చప్పున ఏదో గుర్తొచ్చినవాడల్లే గొంతెత్తి అరిచాడు.

''మీ నాన్న వెంకటపతి ఏడిరా?''

ఆ ప్రశ్నకు సమాధానం కోసం రామాలయంలో కూర్చున్న వాళ్ళంతా ఎదురు చూశారు.

కాని రవి తిరిగి చూడకుండా వడివడిగా నడిచిపోయాడు.

## 57

''ఆడ దిబ్బుంది చూడూ? ఆ దిబ్బ మీద నిట్టాడి పాకుందా? ఆ పాకలోనే మీ సాంబయ్య తాతుండేది. ఈ బొందపక్కగా దొరువులో కాలిబాటుంది. ఇటునుంచి పో.''

''థాంక్యూ.''

పుల్లెద్దు గంగడోలు నిమురుతూ బండిముందు నిలబడ్డ శివరామయ్య జీతగాడు ఆశ్చర్యంగా రవికేసి నోరు తెరుచుకొని చూశాడు.

ఎద్దుల కేసే చూస్తున్న రవిని కన్నార్పకుండా చూస్తూ పరాకుగా వున్న జీతగాడిమీదకు పుల్లెద్దు కొమ్ము విసిరింది.

''ఏహేయ్! నీ పొగరణుగుద్దిలే! పా! ఇయ్యాల పది బళ్ళు మట్టి తోలాల!'' అంటూ జీతగాడు చక్రంమీద కాలు పెట్టి పసిగొయ్య పట్టుకొని ఎగిరి తొట్లో కూర్చున్నాడు.

పగ్గాలు గుంజి చెర్నాకోలతో పుల్లెద్దును అదిలించి బండిని చావిడి పెణ్ణెం దాటించాడు.

జల్లలో నిండుగా పోసివున్న ఎరువుమట్టి బండి కుదుపులకు తొణికింది.

''తప్పుకో! ఇంకా సూత్తా నిలబడ్డావేం? ఆడ మట్టి దిబ్బ మీద పాకే? పో మరీ?'' బండి తొట్లో నిలబడి మెడ పక్కకు తిప్పి అరిచాడు జీతగాడు.

రవి జల్లలో నుంచి జారుతున్న మట్టిని తప్పించుకొని ఎడంగా నిలబడ్డాడు.

వెనక రెండు మట్టి జాళ్ళు, వదులుకొంటూ బండి వెళ్ళిపోయింది.

చావిట్లో నుంచి ఆవులూ, గేదెలూ, దూడలూ మోరలు పైకెత్తి ఒకదాన్ని ఒకటి తోసుకుంటూ బయటికొచ్చాయి.

వాటి వెనకే అన్నం మూట భుజాన వేసుకొని చిన్న జీతగాడూ, వాడి చెల్లెలూ పరుగెత్తుకొచ్చారు.

చావిటి గోడవారగా నిలబడ్డ రవికేసి వింతగా చూశారు. పశువులు వాముల దొడ్డిదాటి వీధిలోకి వెళ్లేదాకా చూస్తూ నిలబడ్డాడు.

వెనక చిక్కున గంతులేస్తూ తలలు 'ఢీ' ఇచ్చుకొంటూన్న కోడె దూడల మీదనుంచి చూపు మరల్చుకోలేక పోయాడు రవి.

శివరామయ్యగారి గొడ్లచావిడీ, వాముల దొడ్డీ దాటి ఈతబొందల దగ్గిర కొచ్చాడు రవి. వేసవికాలం కావటం వల్ల దొరువులో నీళ్ళు లేవు. కాలిబాట పడింది. కాలిబాటన దొరువులో కొంతదూరం నడిచి జవ్వలు తాటి పక్కగా గుట్టపైకి ఎక్కి నిలబడి చూశాడు. ఎదురుగా ఎత్తైన దిబ్బా, దిబ్బ మీద రెండు నిట్టాళ్ళపాక కన్పించాయి.

అక్కడా తాతయ్య ఉండేది? ఊళ్ళో పెద్ద పెద్ద ఇళ్ళున్నాయి. మేడలున్నాయి. కాని తాతయ్య ఊరి బయట తాటాకుపాకలో ఉంటా డెందుకూ? ఒక్కడూ అక్కడ ఉంటానికి తాతయ్యకు భయం వెయ్యదా? తాతయ్య చాలా ధైర్యస్థుడయి ఉండాలి? హి మస్ట్ బి ఏ బ్రేవ్ మేన్! హి ఈజ్ లైక్ రాబిన్ హుడ్!

రవి బుర్రలో క్లాసు పుస్తకాల్లో చదివిన గ్రేట్ రాబిన్ హుడ్ మెదిలాడు.

తాతయ్యను చూట్టానికి ఆ లేత గుండెలు ఉరవళ్ళు పరవళ్ళు తొక్కాయి. ఎక్కడలేని సత్తువ వాడి కాళ్ళలోకి వచ్చింది.

పరుగు పరుగున దిబ్బ ఎక్కాడు.

పాక ముందుకొచ్చి నిలబడ్డాడు.

పాకలోకి వెళ్ళటానికి తన ఎత్తున కిందకు వాలిన చూరు తప్ప అడ్డం ఏమీ లేదు. తనైతే ఎట్టైనా వెళ్ళొచ్చు!

ఒకచోట తాటాకులు పైకి తోసి నరికి ఆర్చిలా చేసివుంది.

అదే తాతయ్య వెళ్ళే ద్వారం అయి వుంటుంది! తను అటు నుంచే, తాతయ్య వెళ్ళే మార్గం నుంచే వెళ్ళాలి.

రవి పాకలో కాలు పెడ్తూనే దిగ్భ్రాంతుడే నిలబడిపోయాడు!

ఎదురుగా కుక్కి నులక మంచం కన్పించింది. కుక్కి మంచంమీద మురికి దుప్పటి జోరెలు కట్టినట్టు కిందకు జారివుంది. అడసగట్టిన గుడ్డదిండు చివర్లు పగిలిపోయి పీలికలు బయటికి తొంగి చూస్తున్నాయి. మంచం పట్టెకు ఆని వాలి ఉన్న కర్ర మీద పై ఎత్తున నున్నని నల్లటి అరవడి వుంది. ముందు మంచం కోటికి పక్కగా అరిగిపోయి మట్టి కొట్టుకున్న చెప్పులున్నాయి.

సాంబయ్య తాత? మరి తాతయ్య ఏడీ?

రవి కళ్ళు పాకంతా కలయ జూశాయి.

మంచం పక్కగా తడిక చాటున ఉన్నదెవరూ? తెల్లటి పల్చటి గిరజాలూ - వాటికింద ముడతలు పడ్డ మెడ - మెడ కింద వంగిన బొంగులా వెన్నెముకా - దానిమీద వెదురు కణుపుల్లా వెన్నుపూసలూ - వాటి కంటుకొని విల్లంబుబద్దలా పక్కటెముకలూ - మొల వెముకలకు చుట్టుకొని నీరుకావి పంచా - ఈ మనిషా సాంబయ్య తాత? ది గ్రేట్ రాబిన్ హుడ్?

రవిని నిస్పృహ ఆవరించింది. కళ్ళ వెంట నీళ్ళు తిరిగాయి. అడుగులు ముందుకు వేసి మంచం దగ్గిరకొచ్చి ఈసారి తాతయ్యను ఇంకా దగ్గిరగా చూశాడు.

తాతయ్య పీటమీద కూర్చొని ముందుకు వంగి దవడలు ఆడిస్తున్నాడు. మధ్య మధ్య చెయ్యి పైకీ కిందకీ లేస్తుంది.

వెనక ఊపిరి బిగబట్టి నిలబడ్డ మనవడికి ఈసారి సాంబయ్య వీపు స్పష్టంగా కన్పించింది.

ఎండకు కాగిన శరీరం, ఎరుపూ నలుపూ కలిసిన రంగులో ముడతలు పడి వుంది.

వీపుమీద స్వేదబిందువులు ముత్యాల్లా మెరుస్తున్నాయి. చెమట ఆరినచోట తెల్లని గుండ్రని ఉప్పు కళ్ళు అతికించినట్టుగా వుంది. పైన తాటాకు కప్పు చల్లగా వున్నా బయటనుంచి వేడిగాడ్పు రివ్వున వీస్తోంది. రోహిణి సూర్యుడు నిప్పులు కక్కుతూ పైకిపాకి వస్తోన్నాడు.

రవికి నోరెండిపోతోంది. కడుపులో పేగులు కలవళ పడుతున్నాయి. ఆకలి దహించుకు పోతూంది.

''తాతయ్యా!'' నోరారా పలికాడు.

ముద్ద ఎత్తిన చెయ్యి ఆగిపోయింది.

''తాతయ్యా!''

''ఎవడ్రా నువ్వూ?''

తాతయ్యకు పళ్ళు వూడినట్టులేదు. మాట నిండుగా పటువుగా, కఠినంగా వచ్చింది.

''నేనే తాతయ్యా?''

సాంబయ్య ముద్దనోట్లో పెట్టుకొని పళ్ళెంలోని అన్నం తుడిచి మళ్ళీ నోట్లో పెట్టుకొన్నాడు. కుండలోని అన్నం తుడిచి పళ్ళెంలో కుమ్మరించుకొన్నాడు.

''తాతయ్యా!'' మనవడి గొంతు పూడిపోయింది.

''నాకే లేదు. నీ కెక్కడ తెచ్చి పెట్టేదిరా!''

అన్నం కలుపుకొని చేతినిండా ముద్ద ఎత్తుకొని అన్నాడు సాంబయ్య.

తాతయ్య ఎంత చెడ్డవాడు? అసలు నాన్న ఈ తాతయ్య దగ్గరకు ఎందుకు పంపించాడు? నాన్న ఇంకా చెడ్డవాడు? అమ్మ ఉంటే? వద్దన్నా కూరికూరి అన్నం పెట్టేది. తనను వదిలేసి పోయింది అమ్మ. అమ్మకూడా చెడ్డదే? వీళ్ళంతా చెడ్డవాళ్ళే?

తాతయ్యా చూడు ఎలా బొక్కుతున్నాడో తనకేసి తలైనా తిప్పలేదు. కన్నెత్తయినా చూడలేదు. తాతయ్య ఎంత దుర్మార్గుడూ? ఈయన బోడి అన్నం ఎవరిక్కావాలి? కుండలో మెతుకులు?

''నీ బోడికుండ అన్నం కోసం రాలేదు'' కసికసిగా అన్నాడు పసివాడు.

''జాంకాయలు కొయ్యటానికొచ్చావా? నిన్న జామకొమ్మ విరిసింది నువ్వేన్రటా?''

రవి మాట్లాడలేదు!

తాతయ్య తనను గుర్తించలేదు. ఎవరో అనుకొంటున్నాడు.

''సొరపిందెలు తొక్కింది కూడా నువ్వేనేంటిరా గాడ్దా? మాట్లాడవేం?''

''నేను నీ మనవడ్ని!'' గొంతు పెకలించుకొని అన్నాడు.

''బెల్లం చేతులో పడిందాకా అందరూ మనవళ్ళేరా? పొగాక్కాడ తెచ్చి పెట్టండి అంటే ఒక గాడ్దెకూ వళ్ళొంగదు మళ్ళీ.''

ఈ తాతయ్యకు ఎలా చెప్తే అర్ధమౌతుంది? తను ఎలా చెప్పాలి? ఆలోచనలో పడ్డాడు మనవడు.

''మాట్లాడవేంరా? మీ అయ్య ఒట్టి సోమరిపోతు! పనీపాటాలేదు. ధర్మసంతానాన్ని కని వూరిమీద వదిలాడు. మీ అబ్బ సరిగా వుంటే మీకు ఈ అడుక్కుతినే కర్మ ఎందుకు పడ్తుందిరా? నువ్వూ మీ బాబల్లేనే తయారవుతున్నావేందిరా?''

కంచం తుడిచి ఆఖరిముద్ద నోటి దగ్గరకు ఎత్తాడు సాంబయ్య.

''నేను వరూధిని కొడుకుని!''

సాంబయ్య నోటిదాకా వెళ్ళిన అన్నం ముద్ద కిందపడ్డది! నవనాడులూ బంధించాయి! తిరిగి చూడాలని ప్రయత్నించాడు. కాని అది అతనికి సాధ్యంకాలేదు.

ఆ క్షణంలో సగంలోనే విశ్వరూపాన్ని చూసిన ధృతరాష్ట్రునిలా అయిపోయాడు సాంబయ్య.

''నీ మనవడ్ని!''

''వరూధిని నాకు కోడలే కాదు. దాని కొడుకువి నాకు మనవడి వెట్లా అవుతావురా?''

''వెంకటపతి కొడుకుని.''

''నాకు కొడుకే లేడు. మనవడెక్కడి నుంచి వస్తాడురా?''

సాంబయ్య హృదయాంతరాళంలో జరిగిన సంక్షోభంలో ఆవిర్భవించిన భావనలు అతడి పెదవులు విడివడి బయటికి రాలేకా, లోపల ఉండలేకా అతని ప్రతి జీవకణాన్నీ పట్టి దహించివేశాయి.

''క్కే! క్కే! క్కే!'' గుడ్లు పెట్టటానికి ఒకమూల ముడుచుకొని వున్న కోడిపెట్ట గగ్గోలుగా అరిచింది.

గండుపిల్లి వెంటబడి తరుముతుంటే తత్తరపోయిన కోడిపెట్ట పాకలోనుంచి బయటికి పరుగెత్తింది.

''ఉష్షా! ఉష్షో!'' అంటూ సాంబయ్య లేచి నిలబడ్డాడు.

పాకలో నుంచి సాంబయ్య బయటకొచ్చేసరికే కోడిపెట్టా గండుపిల్లీ కనుచూపుమేరలో లేవు.

కంటిమీద అరచెయ్యి పెట్టుకొని అటు ఇటూ కలియచూశాడు.

దిబ్బకింద దొరువులోనుంచి దూరంగా కోడిపెట్ట అరుపులు వినిపిస్తున్నాయి!

''ఇంకెక్కడి కోడి? గుడ్లకొచ్చిన పెట్ట! మాయదారి గండుపిల్లి పొట్టన పెట్టుకొంది. పదిరోజుల బియ్యపుగింజలు పోయినై. మళ్ళీ వాటికోసం తవుళ్ళాడాలి? ఈనగాచి నక్కలపాలు చేసినట్టయింది!''

నడుం పట్టుకొని గొణుక్కుంటూ మళ్ళీ పాకలోకి వచ్చిన సాంబయ్యకు వెంకటపతి కొడుకు స్మృతిపథంలోకి వచ్చాడు.

ఏడీ! వాడేడీ? ఇప్పుడింతకుముందే ఇక్కడున్న కుర్రాడేడీ? వెళ్ళిపోయాడా?

సాంబయ్య గండుపిల్లి పట్టిన కోడిలా వణికిపోయాడు.

వాడు... బాబు... సాక్షాత్తు తన కళ్ళముందు కొచ్చిన తన మనవడు... ఏడీ?

సాంబయ్యకు మనసు వశం తప్పిపోయింది.

ఇదంతా తన భ్రమా? పగటికలా? బాబుని తను కళ్ళతో చూడలేదు. కాని వాడి కంఠం విన్నాడు. బాబు స్పర్శను గాలి తన దగ్గరకు మోసుకొచ్చింది. వాడు తనవాడేనని తన రక్తం పసికట్టింది. ఒక్కసారి కళ్ళతో చూడనన్నా లేదే? బాబు రావటం పోవటం అంతా తన భ్రమే? బాబు రాలేదు. వస్తే తనను వదలి వెళ్ళలేడు. వెళ్ళడు. తను వెళ్ళి ఊరంతా గాలిస్తాడు. పొలాలన్నీ వెతుకుతాడు. ప్రపంచం అంతా చుట్టి వెతుకుతాడు.

సాంబయ్య మంచం మీదకు వంగి కర్ర అందుకోబోయాడు. తూలి కుక్కి మంచంలో కూలిపోయాడు. మళ్ళీ లేవటానికి ప్రయత్నించిన సాంబయ్య కళ్ళు బైర్లుకమ్మినై.

''తాతయ్యా?''

అదే కంఠం. అదే పిలుపు. ఆ పిలుపులో ఎంతటి మమకారం? తన చెవులు తనను మోసం చేస్తున్నాయి.

''తాతయ్యా! ఇదిగో నీ కోడి!''

మళ్ళీ అదే గొంతు. అదే తియ్యటి పిలుపు.

సాంబయ్య కళ్ళు తెరిపిళ్ళు పడ్డాయి. కంటిమీది ఇనుపతెరలు పటాపంచలవుతున్నాయి. వెలుగు కన్పిస్తోంది.

కోడిపెట్టను రెండు చేతుల్తో పొదివి పట్టుకొని తాతయ్య ముందు నిలబడ్డాడు రవి!

సాంబయ్యలో క్షీణించిపోయిన జీవశక్తి తిరిగి పుష్టిని సంపాదించుకొంది. రక్తం ఉరకలు తీసింది. అపారమైన వాత్సల్య సాగరం చెలియలికట్ట తెంచుకొని ప్రవహించింది.

సాంబయ్య చేతులు ముందుకు చాచాడు.

హఠాత్తుగా ప్రత్యక్షమైన భగవంతుడ్ని భక్తుడు ప్రశ్నించినట్టుగా అన్నాడు సాంబయ్య.

"ఎవరయ్యా నువ్వా?"

"సాంబయ్య మనవడిని!"

"సాం...బ...య్య...మనవ...డి...వా...నువ్వు?" సాంబయ్య కనుకొనల్లో నీరు పొంగింది.

"నువ్వు ఊరుబోయిన వెంకయ్య కొడుకు సాంబయ్యవేనా?" రవి కోడి పెట్టను కింద దించుతూ అడిగాడు.

"అవును! ఊరుబోయిన వెంకయ్య కొడుకును నేనే! నీ తాతయ్యను నేనే!" రవిని రెండుచేతుల్తో పొదివిపట్టుకొని విశాలమైన తన ఎదురురొమ్ముకు హత్తుకున్నాడు.

"నువ్వేరా నా మనవడివి. నువ్వేరా వారసుడివి."

సాంబయ్య కౌగిలిలో రవి ఆకలిదప్పులు మర్చిపోయాడు. అలసట మర్చిపోయాడు. సర్వం మర్చిపోయాడు.

"తాతయ్యా నేను వరూథిని కొడుకుని కానా?"

"కాదు. సాంబయ్య మనవడివి."

"వెంకటపతి కొడుకుని కానా?"

"కాదు. సాంబయ్య మనవడివే."

"తాతయ్యా!"

"ముమ్మాటికీ నువ్వు సాంబయ్య మనవడివే. ముమ్మూర్తులా సాంబయ్య మనవడివే. జన్మజన్మలా నువ్వు నా మనవడిగానే పుట్టాలిరా!"

తాతా మనవల మనసులు వూసులాడాయి.

ఆ మధురమైన దివ్యానుభూతికోసమే ఇంతకాలం బ్రతికి వేచి వున్నానేమో అనుకొన్నాడు సాంబయ్య.

తాతా మనవల కౌగిట్లో తరతరాల అనుబంధాలు పెనవేసుకొన్నాయి.

కోడి పెట్ట మంచం కింద దూరి నిర్భయంగా కూర్చుంది.

సాంబయ్య ఛాతీమీద చంప ఆనించి సొమ్మసిల్లిపోయిన రవి కదిలాడు. ముఖం వెగటుగా పెట్టాడు. ఏదో వాసన! భరించలేకపోయాడు.

తాతయ్య చెమటంతా తన చంపకు అంటుకొని చిరాకు వేస్తోంది. తన తల నిమురుతోన్న చేతికేసి చూశాడు.

తాతయ్య చేతి గోళ్ళలో మట్టి నల్లగా పేరుకుపోయి వుంది. తాతయ్య మెడ మీదా, వంటిమీదా మట్టి చారికలున్నాయి.

తాతయ్య నీళ్ళు పోసుకోడా? నీళ్ళు పోసుకొన్నప్పుడు సబ్బు పెట్టి రుద్దుకోడా?

"తాతయ్యా నీ వళ్ళంతా మట్టే!"

''మట్టిలో పుట్టినవాడ్ని''

రవి తలెత్తి తాతయ్య ముఖంలోకి చూశాడు.

''మట్టిమీద బతికేవాడ్ని''

రవి కళ్ళు పెద్దవి చేశాడు.

''మట్టిలోనే కలిసిపోయేవాడ్ని''

రవికళ్ళు గుండ్రంగా తిప్పుతూ తాతయ్యకేసి తదేకంగా చూశాడు.

''వంటిమీద మట్టుండక మరి బంగారముంటుందా?''

''మరి నీ దగ్గర వాసనొస్తోందిగా తాతయ్యా?''

''అది చమటవాసన మనవడా! చమటంటే మట్టికిష్టం. అందుకే అదున్నచోట మట్టి వుంటుంది. ఆ వాసన భూమి కిష్టం! నీ కిష్టంలేదా బాబూ?''

''నీ కిష్టమేనా?'' ఎదురుప్రశ్న వేశాడు రవి.

''ముందు నువ్వు చెప్పు. తాతయ్యేగా ముందడిగాడూ?''

'తాతయ్యకు ఎదురు చెప్పకూడదు. తాతయ్య చెప్పినట్టే విను!' తండ్రిమాటలు రవి చెవుల్లో ఇంకా వినిపిస్తూనే వున్నాయి.

''నీ కిష్టమయితే నాకూ ఇష్టమే తాతయ్యా'' అన్నాడు రవి.

రవి మాటలతో సాంబయ్య హృదయంలో అమృతం చిలకరించినట్టయింది. కళ్ళలో ఆనందబాష్పాలు నిండాయి.

''నీలో నా రక్తం ప్రవహిస్తోందిరా. నీలో నేనున్నానురా! నువ్వు నా మనవడివే కదరా బాబూ!''

సాంబయ్య రవి చెంపలు నిమిరి రవి కళ్ళలోకి చూశాడు. మనవడి కంటి పాపలో తన ప్రతిబింబాన్ని చూసుకొన్నాడు సాంబయ్య.

''బాబూ! లే! ఆకలిగా లేదూ? కుండగోక్కుని అన్నమంతా తినేశాను'' ఆ మాటలంటున్న సాంబయ్య కడుపు తరుక్కుపోయింది.

''నాకేం ఆకలిగా లేదు. మంచినీళ్ళు కావాలి.'' రవి బింకంగా అన్నాడు.

ఇసుక మీద పెట్టిన మట్టికుండలో నుంచి ఇత్తడి గ్లాసుతో తెచ్చి సాంబయ్య మనవడికి నీళ్ళిచ్చాడు.

రవి గ్లాసు అందుకొని ఆత్రంగా తాగాడు.

ఒకనాడు దోసిలితో అమృతాన్ని ఇవ్వగల తను, ఈనాడు ఆకలితో వచ్చిన బిడ్డకు మంచినీళ్ళే ఇచ్చాడు.

''బాబూ ఇంకా కావాలా?''

కావాలన్నట్టు రవి తల వూపాడు.

కుండలో నీళ్ళు ముంచుతోన్న సాంబయ్యకు గుండె చెరువయింది.

గంజి కాయటానికి నూకలు కూడా లేవు. సొరకాయ కోసి అమ్మితే సాయం కాలానికి బియ్యం తేవచ్చు. కోడిపెట్ట నమ్మితే? పిల్లి పట్టిన కోడి పెట్టను ఎవరు కొంటారు? గాయం మానేదాకా ఎవరూ కొనరు. సాయంకాలందాకా బాబు ఆకలితో ఎట్లా ఉంటాడు?

సాంబయ్య మధనపడుతూ నీళ్ళగ్లాసు రవి కందించాడు. రవి నీళ్ళు తాగి లేని ఉత్సాహాన్ని తెచ్చుకొని తాతయ్యకేసి చూశాడు.

"రా! బాబూ! మన దిబ్బమీద జాంచెట్టుంది. కాయలేమన్నా ఉన్నాయేమో చూద్దాం."

సాంబయ్య రవి చెయ్యిపట్టుకొని పాకలోనుంచి బయటకు తీసుకొచ్చాడు.

జామచెట్టు కింద మనవడి పక్కగా నిలబడి తల పైకెత్తి పరీక్షగా చూశాడు సాంబయ్య.

"అదుగో అక్కడ, దోరపండినవి రెండున్నాయి. చూడూ?" అంటూ సాంబయ్య చేతికర్ర ఎత్తి పైకి విసిరాడు. కాని అవి అందలేదు.

"ఒరేయ్ బాబూ! నేను నిన్ను ఎత్తి పట్టుకుంటా. నువ్వు కర్రతో జాంకాయలు కొడ్తావా?"

"తాతయ్యా నువ్వు నన్నేం మోస్తావు? ముసలాడివి?"

"అయితే నువ్వు నన్ను మొయ్యరా! పడుసోడివిగా?"

"ఓఁ" అంటూ రవి తాతయ్యను వాటేసుకొన్నాడు.

"ఓరే! ఓరే! పడ్తానా?" తాతయ్య పకపక నవ్వాడు.

ఎన్నాళ్ళకు తను మళ్ళీ నవ్వాడూ?

మనవడ్ని మురిపెంగా చూసుకొన్నాడు సాంబయ్య.

రవి జబ్బలు పట్టుకొని పైకెత్తి తన భుజాలమీద కూర్చోపెట్టుకొని కర్ర ఇచ్చి "ఊఁ! కొట్టు ఇహ. ఒక్క దెబ్బకు పళ్ళురాలాలి."

"ఎవరివి తాతా?" గిలిగింతలు పెట్టినట్టుగా నవ్వాడు రవి.

సాంబయ్యకు అర్థమయేసరికి కొద్ది క్షణాలు పట్టింది.

"హారి భడవా! ఏమోననుకొన్నాను ఎంత తెలివితేటల్రా నీకు? నువ్వూ...?" వరూథిని స్ఫురణకు వచ్చింది. మాట పూర్తి చెయ్యలేక పోయాడు సాంబయ్య.

రవి కర్ర విసిరాడు. ఒక్క దెబ్బన రెండుకాయలు కిందపడ్డాయి.

"భళా! అదిరా దెబ్బ!" అంటూ సాంబయ్య రవిని కిందకు దించాడు.

రవి కాయలు ఏరి తెచ్చి సాంబయ్య చేతిలో పెట్టాడు.

"తినరా బాబూ! తిను!"

"తాతయ్యా! నీ కొకటి నా కొకటీ."

"నాది కూడా నువ్వే తీసుకో. రెండూ నువ్వే తిను."

"నువ్వు తినవా తాతయ్యా?"

"నువ్వు తింటే నేను తిన్నట్టే! ఇక నాకు ఆకలి వేయదురా రవి."

"అదేమిటి తాతయ్యా?"

"నిన్ను చూస్తుంటే నాకు ఆకలి ఉండదు. నువ్వు తింటే నా కడుపు నిండుతుంది. నీ కోసం బతుకుతానురా. చాలా రోజులు బతకాలిరా నేను..."

సాంబయ్య ఉద్రేకంలో పడి చెప్పుకుపోతూంటే రవి విస్మయంగా చూస్తూ ఉండిపోయాడు.

తాతయ్య ఎంత మంచివాడు? అమ్మానాన్నా కంటే తాతయ్యే మంచివాడు.

చూస్తావేం? తినెయ్యి బాబూ!

''కడిగి తినాలి. ఇవి మట్టిలో పడ్డయ్‌గా?''

క్షణకాలం సాంబయ్య స్తంభించిపోయాడు. జామకాయలు కడిగి తింటారా?

''నేనయితే అట్లాగే తింటానురా. నా చిన్నప్పటినుంచీ అట్లాగే తినేవాణ్ణి తెలుసా?''

''అయితే నేనూ అట్టాగే తింటా. చూడు.''

''ఒరేయ్? వెంకిటిగా?''

సాంబయ్య దిబ్బమీద నిలబడి కిందకు చూస్తూ కేక వేశాడు.

తాటితోపులోకి పోతున్న వెంకటయ్య ఆగి తలెత్తి చూశాడు.

''రా! రా! పైకిరా! తాడెక్కాలి!'' సాంబయ్య చెయ్యివూపుతూ పిల్చాడు.

''అర్ధరూపాయికంటే ఎక్కువ పడదు. రూపాయిన్నర అంటే మళ్ళీ లాభంలేదు.'' కొడవలివున్న చెయ్యి విసురుతూ అరిచాడు వెంకటిగాడు.

''అమ్మకానికి కాదురా తింటానికి రా!''

''మహా తినేవాడివిలే. నువ్వు తింటావా పెడ్తావా? పతేడూ అమ్ముకొంటూనే వున్నావుగా?''

''నా మనవడు తింటానికిరా! చప్పున రారా మరి!''

''ఎవరూ వచ్చింది?''

''నా మనవడ్రా. ఇనపట్నంలా? నా మనమడు.'' సాంబయ్య కంఠం తాటితోపులో గింగురుమంది.

''తాడెక్కినందుకు ఒక గెల నువ్వు తీసుకొందువుగానిలేరా! చప్పున రా మరి?''

సాంబయ్య తలపైకెత్తి తాటికాయలకేసి చూసి తల దించుకొని తన పక్కన నిలబడి వున్న మనవడికేసి చూసుకొన్నాడు.

''తాతయ్యా నాకు తాటిచెట్టెక్కటం నేర్పవా?'' తాటిచెట్టు మీద ఆకులమధ్య ఉన్న ముంజకాయల కేసి చూస్తూ అడిగాడు రవి-

''తాడెక్కేవాడి తల తన్నుతావురా నువ్వు?'' ముందు జామచెట్టెక్కటం నేర్చుకో.

''తాడెక్కేవాడి తలెట్టా తంతారు తాతయ్యా?'' అమాయకంగా కళ్ళు తిప్పుతూ అడిగాడు రవి.

''అది తన్నేవాడికే తెలుస్తుందిరా మనవడా?''

''నువ్వెప్పుడన్నా తన్నావా తాతయ్యా?''

**మంగళవాద్యాలు మోగినై - సాంబయ్య చెవుల్లో! సాంబయ్య కళ్ళముందు -**

పెళ్ళిపందిరి! వెంకటపతి వరూధిని మెడలో తాళి కట్టేప్పుడు తను బలరామయ్యకేసి చూశాడు. పెళ్ళి పందిరంతా కలియజూసి మీసం దువ్వుకొన్నాడు తను.

''ఏం తాతా తన్నావా?''

''తన్నానురా? కాని-కిందపడ్డాను.''

''నేనూ పడతానా?''

''నువ్వు పడవురా! నాకు తెలుసు!''

సాంబయ్య తెల్లని మీసాల్లోనుంచి మందహాసం తొంగిచూసింది.

## 58

సాంబయ్య మనవడి కాలక్షేపంలో పడి ప్రపంచాన్నే మర్చిపోయాడు.

ఆ రోజంతా ఓ ఘడియలా గడిచిపోయింది.

తాతయ్యను చుట్టుకొనే తిరుగుతున్నాడు రవి. వాడు ఒక్క క్షణం కన్పించకపోతే తాతయ్య కళ్ళు వాడిని వెతుకుతున్నాయి.

''తాతయ్యా!'' ముఖం బిగించుకొని పొద్దున్నే పొగాకుకాడ యీనె తీస్తూ నులకమంచం మీద కూర్చున్న తాతయ్యకేసి చూశాడు రవి.

''టాయ్‌లెట్ కెళ్ళాలి!''

''ఆఁ'' సాంబయ్య నోరు తెరిచి అట్లాగే వుంచాడు.

''నంబరు టూ!'' రెండేళ్ళు చూపిస్తూ సిగ్గుపడ్డాడు రవి.

''ఓహో! చెంబు పట్టుకెళ్ళటానికి ఇంగిలీసులో టాయ్-టుయ్ అంటారా?'' పక్క ఎముకలు ఎగిరేట్టు పగలబడి నవ్వాడు సాంబయ్య.

''ఇక్కడ దొడ్డి లేదుగా ఎట్లా?''

''బస్తీలో ఉన్నట్టు ఇక్కడ దొడ్లూ గిడ్లూ ఉండవ్. పద ఆ తోపుల్లో కూచుందువుగాని.''

సాంబయ్య రవిని తోపుల్లోకి తీసుకెళ్ళాడు.

''తాతయ్యా! నువ్వు దూరంగా పోయి నుంచో!''

''ఒరే! ఒరే! ఆడపిల్లవంటరా నువ్వు అంత సిగ్గుపడిపోతున్నావ్?''

''ఫో తాతయ్యా!''

సాంబయ్య ముసి ముసిగా నవ్వుకొంటూ జవులతాటిచెట్టు కొచ్చి నిలబడ్డాడు.

పొద్దు బారెడెక్కింది.

సాంబయ్య బియ్యం కడిగి అత్తెసరు పెట్టి కుండ పొయ్యిమీద పెట్టాడు. పొయ్యిలో నిప్పురాజేసి గొట్టంతో వూది మంట పెద్దది చేశాడు.

పొయ్యి ముందున్న పుల్లలకేసి పరకాయించి చూసుకొని మనవడ్ని కేకవేసి పిలిచాడు.

''ఈ పుల్లల్తో ఇయ్యాళ యీ వణ్ణం ఉడికేట్టు లేదురా నాయనా! తొందరగా వెళ్ళి తాటితోపులో జీబులూ, గులకలూ ఏమన్నా దొరుకుతాయేమో ఏరుకొస్తావా?''

‘‘ఓ అట్లాగే తాతయ్యా!’’ బిళ్ళంగోడులా లేచి పరుగెత్తాడు రవి.

‘‘తొరగా రావాలి. ఆలస్యం అయితే అన్నం నసుపాయ పడ్డది.’’ వెనక నుంచి కేక వేశాడు సాంబయ్య.

పది నిమిషాలు గడిచాయి. పుల్లాప్పుల్లా, నలీ పోగుచేసి పొయ్యిలో వేసి నిప్పు ఆరకుండా చూసుకొంటున్నాడు సాంబయ్య.

వాటెడు తాటి గులకలూ, జీబులూ మోసుకొని వగర్చుకొంటూ వచ్చాడు రవి.

‘‘అరే! అప్పుడే అన్ని ఎట్లా ఏరావురా? రోజంతా ఏరినా అన్ని కావే?’’ ఆశ్చర్యాన్ని ప్రకటించాడు సాంబయ్య.

‘‘ఏరటం ఎందుకు తాతయ్య అక్కడ పోగులు పోసుంటేనూ?’’ రవి గులకలూ, జీబులూ తాతయ్య ముందు పడేస్తూ అన్నాడు.

‘‘అందులో నుంచి తెచ్చావా?’’ సాంబయ్య నెరిసిన కనుబొమ్మలు ముడిపడ్డాయి.

‘‘వెనక నుంచి ఎవడో అరుస్తున్నాడు. పరుగెత్తుకొచ్చా తాతయ్యా?’’

‘‘తప్పు రవీ! అట్టా తీసుకురాకూడదు.’’

‘‘నువ్వే తెమ్మన్నావుగా?’’

‘‘తాళ్ళు దులిపి గుట్టలు వేసుకొన్నారు. అందులోనుంచి తేకూడదు. తోపులో మిగిలిపోయిన వేమన్నా ఉంటే ఏరుకోవాలి – మనం.’’ సాంబయ్య కంఠం పూడిపోయింది.

రెండు జీబులు మడిచి పొయ్యిలో దూర్చాడు. భగ్గున లేచాయి మంటలు.

‘‘ఆ తాటి తోపెవరిది తాతయ్యా?’’

‘‘ఆ తాటి చెట్లు నేను నాటినవే!’’

గులకలు పొయ్యిలోకి విసిరాడు సాంబయ్య. చిటపట రవ్వలు లేచాయి.

‘‘అయితే ఆ తాటి చెట్లు నీవేగా తాతయ్యా?’’

‘‘ఒకప్పుడు! ఇప్పుడు కావు. ఇప్పుడాతాటితోపు కనకయ్యది!’’

‘‘ఎందుకిచ్చావు తాతయ్యా?’’ రాగం తీస్తూ అన్నాడు రవి.

సాంబయ్య జీబులూ గులకలూ కలిపి పొయ్యిలో కుక్కాడు. ఒక్కసారిగా మంటలూ రవ్వలూ లేచాయి.

‘‘నన్ను మోసం చేసి నా తాటితోపు కాజేశారు?’’

పొయ్యిమీద అన్నం కుతకుతలాడిపోతూంది.

‘‘అయితే తప్పంటావేం తాతయ్యా? మనవి మనం తెచ్చుకొంటే ఏం తప్పు? ఆ కనకయ్యను తన్ని మన తాటితోపు మనం తీసుకొందాం తాతయ్యా’’

సాంబయ్య కళ్ళల్లో పొయ్యి మంటలు ప్రతిఫలించాయి. మనవడిని దగ్గరకు లాక్కొని కౌగలించుకొన్నాడు.

పొయ్యిమీద అన్నం పొంగిపోయింది.

59

''తాతయ్యా? ఏం పెట్టి తోముకోవాలి?''

''నీకు చేతుల్లేవంటరా?''

''సబ్బు! సబ్బుపెట్టి వళ్ళు తోముకుంటారుగాని వట్టి చేతుల్తో తోముకుంటారా ఎక్కడన్నా?''

నీళ్ళగాబు దగ్గర నిలబడి నాలుగు చెంబులు నీళ్ళు పోసుకొని తాతయ్యను సబ్బు అడిగాడు రవి.

''నే చూపిస్తా వుండూ! చేతుల్లో సత్తువుంటే సబ్బూగిబ్బూ ఎందుకురా?'' అంటూ సాంబయ్య మనవడి వీపు రుద్దసాగాడు.

''తాతయ్యా చక్కిలిగింతలు పెడ్తున్నావ్?'' నీళ్ళు గాబుదగ్గిర కుప్పిగంతులు వేస్తూ అన్నాడు రవి.

''గోళ్ళతో గీరతావేం తాతయ్య? అందుకే నీ గోళ్ళలో అంతంత మట్టి పట్టి వుంటుంది.''

సాంబయ్య రవి నెత్తిన మట్టి కడివెడు నీళ్ళు గుమ్మరించి ''ఇప్పుడు చూడరా వళ్ళెంత శుభ్రంగా వుందో? మెరిసిపోతున్నావ్.''

''తలకు షాంపూ, వంటికి సింథాల్ రుద్దుకోవాలి తాతయ్యా!''

''ఆ సబ్బూ, సాంపూ పోవాలంటే మళ్ళీ చేతుల్తోనే రుద్దుకోవాలి కదరా?''

సాంబయ్య రెండో కడవనీళ్ళు రవి నెత్తిన కుమ్మరించాడు.

''ఓ!ఓ!'' నీళ్ళు పుక్కింతలు పెట్టి వదులుతూ సంతోషంతో చిందులు వేశాడు రవి.

60

మనవడు బాచింపెట్టు వేసుకొని పీటమీద కూర్చున్నాడు.

సాంబయ్య మోకాళ్ళమీద కూర్చుని, మనవడిముందు పళ్ళెంపెట్టి కుండలోని అన్నం తీసి పెట్టసాగాడు.

''అదేంటి తాతయ్యా? నీ పళ్ళెం నాకిచ్చావూ? మరి నీకేదీ?''

''ఇదిగో ఈ మూకుట్లో తింటాగా?''

''ఛీ! మట్టిదాంట్లో తింటారా ఎక్కడన్నా?''

''దేన్లో తిన్నా అన్నం రుచి ఒకటేగా?''

''నీ వెండి పళ్ళెం ఏమయింది తాతా?''

''కాజేశారు.''

''దొంగలా?''

''అయినవాళ్ళే!''

సాంబయ్య ఉడుకు మిడుకు అన్నం చెక్కపేడుతో లాగి మూకుట్లో

వేసుకొన్నాడు. అన్నంలో కలిపి వండిన కోడిగుడ్డు తీసి వల్చి రవి పళ్ళెంలో వేశాడు.

''సగం నువ్వు తీసుకో తాతయ్యా?" వేడి వేడి గుడ్డును కంచంలో గుండ్రంగా తిప్పుతూ అడిగాడు రవి.

''ఆ గుడ్డు నీదేరా బాబూ! గండుపిల్లిని కొట్టి పెట్టను బతికించుకొన్నావ్." అది నీ కష్టార్జితమే! నీ సంపాదనే, నీ సొంతమే.

తాతయ్య మాటలు రవి రక్తంలో కొత్త సంచలనాన్ని కలిగించాయి. ముఖం గర్వంగా పెట్టి తాతయ్యకేసి చూశాడు.

''కోడి ఎన్ని గుడ్లు పెడ్తుంది తాతయ్యా?"

''ఆc! ఏడాదికి పది అటూ ఇటూ రెండొందలు పెడ్తది."

సాంబయ్య చూపులు మనవడిమీద నిల్చాయి.

''ఒక్క గుడ్డమ్మితే ఎంతొస్తుంది?"

తాతయ్య కంటి వెలుగే మనవడికి సమాధానమై నిలిచింది.

## 61

రోహిణీ ఎండ రోళ్ళు బద్దలు కొడ్తూంది.

''తాతయ్యా! ఉక్కపోస్తూంది. చూడు వళ్ళంతా పొక్కులు లేచాయి." రవి తాతయ్యకు వీపు చూపించాడు.

''అవేం చెయ్యవులే. కొద్దిగా పేలింది. అంతే!"

అంచు ఈనె ఊడిపోయిన తాటాకు విసనకర్రతో విసురుతూ, అరచేత్తో రుద్దాడు మనవడి వీపు సాంబయ్య.

''ఇదేం ఫానూ? టేబుల్ ఫాన్ వేసుకొంటే ఎంత గాలి వస్తుందో తెలుసా?"

''అంతకంటే మంచిగాలే వస్తుంది. రా!" సాంబయ్య నులక మంచం మోసుకుపోయి వేపచెట్టు కింద వేశాడు.

తాతయ్య పక్కన మంచంలో పడుకొని రవి వేపచెట్టు మీదున్న కాకి గూటికేసి కుతూహలంగా చూశాడు.

వేపచెట్టు చల్లని నీడలో, తాతయ్య స్పర్శలో హాయిగా పడుకొన్నాడు రవి.

వేపచెట్టు పచ్చదనానికి పసిహృదయం పరవశించిపోయింది.

## 62

రోహిణీకార్తె వెళ్ళిపోయిన రాత్రి.

ఆకాశం భగ్గున వెలిగింది. 'ఫెళ ఫెళ' ఉరిమింది శూన్యం!!

''తాతయ్యాలే! లే!" ఆరుబయట మంచం వేసుకొని తాతయ్య పక్కన పడుకొన్న రవి మంచం మీది నుంచి దిగి తాతయ్యను కుదిపాడు.

సాంబయ్య కళ్ళు తెరిచి మేఘావృతమైన ఆకాశం కేసి చూశాడు. 'మెరుపు!'

సాంబయ్య కళ్ళు జిగేల్‌మన్నాయి. తపతప గులకరాళ్ళల్లే చినుకులు బడబడా ఉరిమింది ఆకాశం.

"తాతయ్యా! లే! పిడుగులు పడ్తాయి. పాకలోకి పోదాం."

"పిడుగులు పడ్తే పాకయినా మేడయినా ఆగదురా."

"వర్షంలో తడిసిపోతావ్. లే!"

"తడవనియ్! కాగిన నేలకు నీళ్ళు కావాలిగా? మనిషికీ అంతే!"

"వర్షంలో తడిస్తే జలుబు చెయ్యదూ?"

"జలుబా? అది మననేం చేస్తుందిరా?"

కాగిన నేల వానజల్లుకు తడిసి విడిచే వానలు పీలుస్తో, తొలకరి చినుకులతో, ఎండిన పెదవులు తడుపుకొంటూ సాంబయ్య మనవడిని తీసుకొని పాకలోకి వచ్చాడు.

## 63

"ఏంటవి తాతా?"

"విత్తనాలు!"

పాత గుడ్డ మూట విప్పుతూ చెప్పాడు సాంబయ్య.

రవి కుతూహలంగా వంగి చూశాడు తాతయ్య దగ్గరకు జరుగుతూ.

"ఇవి బీర. ఇవి సొర. ఇవి చిక్కుడూ-ఇవేమో కాకర..."

వేటికవి ఏరిపెడ్తూ చెప్పాడు సాంబయ్య.

"అదేంటి తాతయ్యా? చీకేసిన టెంకి మూట కట్టావూ? ఛూ!"

"ఇది నువ్వు చీకిందేరా మనవడా!"

రవికి గుర్తొచ్చింది. ఓ రోజు తాతయ్య పెద్ద మామిడిపండు తెచ్చిచ్చాడు. తను రసం పీల్చి టెంకె ఎక్కడో పారేశాడు. మామిడి రసం ఎంత బాగుందో? తాతయ్య తను చీకేసిన టెంకె మూట కట్టాడా?

"రారా రవీ! పాదులు తవ్వి విత్తనాలు పెడ్దాం! నేల మంచి పదునుగా వుంది."

సాంబయ్య మనవడ్ని తీసుకొని పాకలోనుంచి బయటకొచ్చాడు.

"నేను తవ్వుతా. నువ్వు మట్టి తీయ్?" మనవడు తాత చేతిలోని గునపం పట్టుకొన్నాడు.

"అహా. ఎట్టెట్టా? ఎయ్యి పలుగు చూద్దాం."

గునపం రవిచేతుల్లోకి వదిలాడు సాంబయ్య.

రవి బలంకొద్దీ పలుగు కిందపడకుండా పట్టుకొన్నాడు.

"ఓరేయ్! నువ్వు పలుగంతలేవు. పలుగేం వేస్తావురా? నీవల్ల కాదులే ఇట్టా తే పలుగు."

"నువ్వుండు తాతా!"

రవి పళ్ళు బిగించి పలుగు భూమ్మీద వేశాడు. కస్సున దిగిపోయింది భూమిలోకి పలుగు.

సాంబయ్య హృదయం పొంగిపోయింది. గర్వంగా మనవడికేసి చూసుకొన్నాడు.

తొలి విజయంతో కలిగిన ఉత్సాహంతో రవి పలుగుతీసి మళ్ళీ పలుగు వేశాడు.

సాంబయ్య వంగి కూర్చొని చేత్తో మట్టి తీశాడు.

ఐదోసారి భూమిలోకి దించిన పలుగు తియ్యలేక రవి తాతయ్య ముఖంలోకి చూశాడు.

''అయిందా అబ్బాయి పని? నే చెప్పలేదంటరా?'' అంటూ సాంబయ్య పలుగు పైకి లాగాడు.

రవి అరచేతులు చూసుకొన్నాడు.

ఎర్రబడ్డ అరచేతులు ఊదుకొంటూ ''తాతయ్యా! చూడు నా చేతులు?'' అన్నాడు.

''మట్టిరాయ్! లేకపోతే బొబ్బలెక్కుతాయ్.''

సాంబయ్య ఇంత మట్టితీసి మనవడి చేతులమీద చల్లాడు.

''నువ్వు మట్టితీయ్. నే తవ్వుతా చూడు.''

సాంబయ్య చేతిలోని గునపం భూమిని తాకి ఆరంగుళాలు లోపలికి చొచ్చుకుపోయింది.

ఓ పావుగంటలో తాతా మనవళ్ళు కలిపి ఓ పెద్ద పాదుతవ్వారు.

''తాతయ్యా నీ చేతులేవీ?''

''నా చేతులకేంరా?''

సాంబయ్య మనవడి ముందు చేతులు చాపాడు. నాపరాయిగచ్చులా వున్న తాతయ్య చేతులు తాకిచూశాడు మనవడు.

''నీ చేతులు ఎర్రబడలేదేం తాతయ్యా?''

సాంబయ్య నవ్వాడు.

''నా చేతులకు ఈ పని అలవాటేగా?''

''అలవాటయితే చేతులు బొబ్బలెక్కవా?''

''పనికి అలవాటయిన చేతులు గునపంకంటే గట్టిగా వుంటాయి. కష్టజీవి చేతుల్లో ఇనుముకూడా మెత్తబడిపోతుందిరా రవీ!''

''అయితే నేను కూడా అలవాటు చేసుకొంటా తాతయ్యా!''

సాంబయ్య మనవడ్ని దగ్గరకు లాక్కొని గుండెలకు హత్తుకున్నాడు.

సాంబయ్య మామిడి టెంకె పాతి మట్టి కప్పాడు.

రవి పోస్తున్న నీళ్ళు సాంబయ్య వేళ్ళ సందులనుంచి జారి పాదులోకి దొర్లాయి.

''ఇది ఎన్నాళ్ళకు కాయలు కాస్తుంది తాతయ్యా?''

''నీకు కొడుకు పుట్టేనాటికి కాస్తుందిరా?''

''తూ! నాకు కొడుకా? నాకు కొడుకొద్దు తాతయ్యా.''

''ఏం?''

తలెత్తి ముసిముసి నవ్వు నవ్వుకొంటూ మనవడికేసి చూసి అన్నాడు సాంబయ్య

''కొడుకు లేకపోతే ఎట్లారా మరి నీకు?''

''నువ్వున్నావుగా?''

''ఓరి! ఓరి! నా బాబూ!''

సాంబయ్య తనువు పులకరించిపోయింది.

## 64

''రవీ! లే! ఇంకా కూర్చున్నావేం? వెళ్దాం పద!'' సాంబయ్య కర్ర తీసుకొని చెప్పులు తొడుక్కుంటూ మనవడికేసి చూశాడు.

''ఎట్లా వచ్చేది తాతయ్యా!'' చేతులు వెనక్కు పోనిస్తూ అన్నాడు రవి.

తాత మనవడికేసి ఆశ్చర్యంగా చూశాడు.

''నువ్వేకదరా వస్తానన్నావ్?''

'నా లాగు చినిగిపోయింది. ఛీ! ఎట్లా వచ్చేది తాతయ్యా?' రవి చిరిగిన లాగులోకి వేళ్ళు పోనిచ్చి చూసుకుంటూ సిగ్గుపడిపోయాడు.

''ఓరే వొరే! అదాసంగతి? లుడిగీ చినిగిపోయిందా?'' నవ్వుతూ అంటూన్న సాంబయ్య, అంతలోనే గుండె మెలితిప్పినట్టుగా బాధపడిపోయాడు.

పట్టుబట్టలు తొడగాల్సిన బిడ్డ చిరిగిపోయిన లుడిగీలు తొడుక్కొని సిగ్గుపడి వళ్ళు దాచుకొంటున్నాడు.

సాంబయ్య పెట్టెతెరిచి ఏనాటిదో పాత కండువా బయటికి తీశాడు.

పట్టుపంచె మధ్యమధ్య మరకలు పడివున్నా ఎక్కడా పిగిలినట్టులేదు.

పంచె మడతలు విప్పి దులిపాడు. విడివడిన మడతల్లోనుంచి గతించిన రోజులు గుర్తొచ్చాయి -

అది వెంకటపతి పెళ్ళికి కొన్నది. మంచి మొనగాడైన కండువా కొనాలంటే కనకయ్యే ఎన్నికచేసి పెట్టాడు. ఆ పట్టు కండువా తలకు చుట్టుకొని, ఆకాశం అంతటి పెళ్ళిపందిట్లో నిలబడి తను పెత్తనం చేశాడు. అదొక్కటే ఇంకా చినుగు పట్టకుండా మిగిలివుంది. దాన్ని తను తర్వాత పెద్దగా వాడలేదు. అందుకే ఇంకా చెక్కుచెదరకుండా వుంది. పెళ్ళి సంబరంలోపడి తను ఆ పట్టుకండువా కొన్నప్పుడు - అది తన మనవడికి అక్కరకొస్తుందనుకొన్నాడా? వాడికోసమే తను ఇన్నాళ్ళూ దాన్ని దాచిపెట్టాడా?

''బాబూ ఇట్లారా!''

రవి పట్టు పంచెకేసి వింతగా చూస్తూ తాతయ్య దగ్గిర కొచ్చాడు.

సాంబయ్య మనవడి చినిగిన లాగు తీసేసి, పట్టుకండువా కట్టి వెనకగా గోచీ

లాగి బిగించి దోపాడు. రవికి అంతా తమాషాగా వుంది. పంచె కట్టిన మొల చుట్టూ చేతుల్తో తడిమి చూసుకొని ఉషారుగా గంతులేశాడు –

''ఇప్పుడా మొగాడివయ్యావూ?" మనవడిని ఆప్యాయంగా చూసుకొంటూ అన్నాడు సాంబయ్య.

''ఏంటి తాతయ్యా?"

''గోచిపెట్టి పంచె కట్టినవాడేరా మగాడంటే."

''ఫో! తాతయ్యా! నా కిదేం బాగుండలేదు. జారిపోతుంది. నాకు లాగే బాగుంటుంది."

''ఉంచు! ఉంచు లాగమాక! అలవాటులేక జారిపోయినట్టుంది. అంతే. పట్టుపంచకట్టే ఎంత బాగున్నావో తెలుసా? ఏం లుడిగీలురా? ఎదవ లుడిగీలు! దా వెళ్దాం!" మనవడి చెయ్యి పట్టుకొని సాంబయ్య పాకలోనుంచి బయటికొచ్చాడు.

మృగశిరకార్తెలో పడ్డ వర్షాలకు భూమి పదునయింది. రైతులు అరకలుకట్టి తొలి దుక్కులు దున్నటం ప్రారంభించారు.

సాంబయ్య మనవడని వెంటబెట్టుకొని దిబ్బదిగాడు.

''ఇటు! ఇటు! దొరువులోకి నీళ్ళొచ్చినయ్! ఆర్నెల్లదాకా మనం అటు వెళ్ళటానికి వీల్లేదు. ఊళ్ళో కెళ్ళాలంటే ఇహ డొంకలోనుంచి వెళ్ళాల్సిందేరా రవీ!"

''ఇటు వెళ్తే చాలాదూరమా తాతయ్యా!"

''ఎంతదూరం లేరా? కాలు సాచి నడిస్తే!"

''ఊఁ నడువ్. నువ్వు ముందు నడవాలి! నీ వెనకే నేను. ఆఁ."

సాంబయ్య మనవడ్ని ముందు పెట్టి తను వెనకే నడవసాగాడు.

''ఒరేయ్! రవీ! ఆగు! చావిట్లో గొడ్లను విడిచినట్టున్నారు." సాంబయ్య ఓ వీధిమలుపు తిరుగుతూ మనవడ్ని హెచ్చరించాడు.

ఆవులూ, గేదెలూ, కోడెదూడలూ ముట్టెలు పైకెత్తి గలిబిలిగా చావిట్లోనుంచి వీధిలో కొచ్చాయి.

''తాతయ్యా ఎన్ని ఆవులో? ఎన్ని గేదెలో చూడు తాతయ్యా?" రవి సాంబయ్య చెయ్యి లాగుతూ అన్నాడు.

తాతయ్య చూస్తూనే నిలబడ్డాడు. కాని అతని మనసు ఎక్కడో వుంది.

''తాతయ్యా ఈ చావి డెవర్దీ?"

''ఆ చావిడి ముందున్న ఆ భవంతి చూడూ?" సాంబయ్య అడుగులు ముందుకు వేశాడు.

''ఎంత పెద్ద ఇల్లో? ఇదెవరిది తాతయ్యా?"

సాంబయ్యకు గొంతు పూడిపోయింది. కడుపు రగిలిపోయింది. గొంతు పెగల్చుకొని చెప్పాడు.

''ఈ ఇల్లూ, ఆ చావిడీ మనదేరా?"

''మందా తాతయ్యా?"

''ఒకప్పుడు మనదే. ఇప్పుడు రామచంద్రయ్యది! బస్తీలో ఎరువుల వ్యాపారం చేస్తుంటాడు. ఆయన రెండో కొడుకు ఇక్కడుండి వ్యవసాయం చేయిస్తున్నాడు."

''ఇంత మంచి ఇల్లూ, ఇంత పెద్ద చావిడీ, అన్ని ఆవులూ గేదెలూ ఎందుకమ్మేశావ్ తాతయ్యా?"

''నే నమ్మలేదురా బాబూ?"

రవి తాతయ్యకేసి చూశాడు.

''నా చేత బలవంతంగా అమ్మించార్రా!"

''ఎవరు, తాతయ్యా?" మనవడి ముఖంలో వచ్చిన మార్పును సాంబయ్య గ్రహించాడు.

''చెప్పవేం తాతయ్యా? ఎవరూ?"

''తర్వాత చెప్తాలేరా బాబూ! నడు! పోదాం."

సాంబయ్య ఇంటి ముందు నుంచి కదిలాడు. రవి తాతయ్య వెనకే నడవసాగాడు.

మహాలక్ష్మమ్మ చెట్టు దాటి, రచ్చబండల కెదురుగా వున్న విశాలమైన వీధిలో సాంబయ్య మనవడ్ని వెంటబెట్టుకొని తలవంచుకొని నడిచిపోసాగాడు.

రెండంతస్తుల మేడముందు ఎత్తుగా వున్న మెట్లదగ్గిరకొచ్చి ఆగిపోయాడు సాంబయ్య.

రవి తలెత్తి ఎత్తైన మేడా, విశాలమైన ఆవరణా కలియ చూశాడు. తాతయ్య కేసి తిరిగి అడిగాడు–

''ఈ ఊళ్ళో అన్నిటికంటే పెద్ద మేడ ఇదేనా తాతయ్యా?"

సాంబయ్య అవునన్నట్టు తల ఊపాడు.

''ఈ మేడ ఎవర్ది తాతయ్యా? ఇది కూడా మనదేనా?"

కాదన్నట్టు తల అడ్డంగా తిప్పాడు సాంబయ్య.

''ఎవరదీ?" లోపల్నుంచి కేక విన్పించింది.

తాతా మనవడు తలలెత్తి చూశారు.

కనకయ్య చదువుతోన్న పేపరు పక్కకు పెట్టి, కళ్ళజోడు సర్దుకుంటూ తల పక్కకు తిప్పి చూశాడు.

''ఎవరూ?" చూపు సరిగా ఆనినట్టు లేదు. కళ్ళజోడు పైనుంచి గుడ్లెత్తి చూశాడు కనకయ్య.

''నేనే! సాంబయ్యను."

ఒకనాటి బలరామయ్యగారి పడకకుర్చీలో కాళ్ళు బారచాపి పడుకొనివున్న కనకయ్య చప్పున లేచి నిలబడ్డాడు.

''సాంబయ్యా నువ్వా? రావయ్యా రా! అక్కడే నిలబడ్డావేం? ఆఁ, ఆఁ, ఆ బుడ్డోడూ–" అంటూ ఆశ్చర్యంగా నోరుతెరిచి రవికేసి చూశాడు కనకయ్య.

''నేనే గుర్తులేను. ఇంకా ఆ బుడ్డోడేం గుర్తుంటాడులే నీకు?" తనకు తనే చెప్పుకొన్నట్టుగా అన్నాడు సాంబయ్య.

''ఈ కుర్రాడూ...?'' కనకయ్య వరండాలో రెండడుగులు ముందుకు వేసి రాగం తీశాడు.

''నా మనవడు.''

''ఎట్టెట్టా? వరూథినమ్మ కొడుకు... బలరామయ్యగారి మనవడా?''

సాంబయ్య ముఖం చిట్లించుకొన్నాడు.

రవి తాతయ్యకేసి, కనకయ్యకేసీ మార్చి మార్చి చూశాడు.

తను సాంబయ్య తాత మనవడు కాదా? ఆయన బలరామయ్యగారి మనవడంటాడేం?

''రెండేళ్ళకిందట ఎప్పుడో చూశాను. బాగా సాగాడు. రావోయ్ రా! ఇది ఒకప్పుడు మీ తాతగారిల్లేలే?''

కనకయ్య వరండాలో గుండ్రటి స్తంభాల మధ్యగా ముందుకొస్తూ అన్నాడు.

సాంబయ్య మనవడి చెయ్యి పుచ్చుకొని ఆపాడు.

''కనకయ్యా! ఒకపనిమీద వచ్చానయ్యా'' సాంబయ్య కడుపులో పేగులు తోడేసినట్టు బాధపడుతూ అన్నాడు.

''పైకిరా. ఇట్టా వచ్చి కూర్చోవచ్చాయి. నిలబడే మాట్లాడతావేం? లోపలికి రాకూడదా ఏం?'' కనకయ్య మొదటి మెట్టు మీదకు దిగుతూ అన్నాడు.

తన గుండె చీల్చి చూసినట్టు చెప్పాడు కనకయ్య. ఆ గడపలు తొక్కకూడదని తను ఏనాడో నిశ్చయించుకొన్నాడు.

ఆనాడు... వెంకటపతిని – బలరామయ్య అల్లుడ్ని... తీసుకెళ్ళడానికి వచ్చాడు. మళ్ళీ ఇవ్వాళ మనవడ్ని వెంటబెట్టుకొని వచ్చాడు. అంతే! మళ్ళీ ఇన్నేళ్ళగా ఆ ఇంటి చాయలకన్నా రాలేదు. ఆ మేడకేసి కన్నెత్తయినా చూడలేదు. ఆనాడు ఈ భవనం బలరామయ్యది. ఈరోజు కనకయ్యది. ఈ ఇంటికి ఆనాడు తనువస్తే బలరామయ్య వణికిపోయాడు. సకల మర్యాదలతో సగౌరవంగా ఆహ్వానించాడు. ఆనాడు తనది పై చెయ్యి. ఈనాడు – అందులో ఈ కనకయ్య... తన మోచేతుల కింద నీళ్ళు తాగి బతికిన కనకయ్య ముందు... నిలబడి అర్థిస్తున్నాడు తను.

'చింత చచ్చినా పులుపు చావలేదు. వట్టి మొండి ఘటం. ఎంతో పని లేకపోతే గాని ఈ సాంబయ్యరాడు. అందులోను మనవడ్ని వెంటేసుకొచ్చాడు. ఏదో విశేషం ఉండాలి.' వయస్సు మళ్ళిన కనకయ్య బుర్ర పదును చెడలేదు.

''ఏమిటి సాంబయ్యా? విశేషం? కుర్రాడు పట్నంలో ఏదో పెద్ద స్కూల్లో చదువుతున్నాడని విన్నానే?'' అంటూన్న కనకయ్యకు పద్దెనిమిదేళ్ళ క్రితం, సరిగా ఇదే రోజుల్లో అల్లుడిని వెంటబెట్టుకొని, బలరామయ్యగారి కాళ్ళముందు, ఈ గడపల్లో నిలబడిన దృశ్యం కళ్ళల్లో మెదిలింది.

ఓడలు బండ్లూ, బండ్లు ఓడలూ అవడం అంటే ఇదే కదా? ఇవ్వాళ ఆ బలరామయ్య మనవడ్ని వెంటబెట్టుకొని వాడి చదువుకు సహాయాన్ని అర్థిస్తూ, సాంబయ్య తనముందు నిలబడ్డాడు. సాంబయ్య అనేం? బలరామయ్య బతికుంటే

ఆయనే తన కాళ్ళ దగ్గిరకొచ్చి ఉండేవాడు. ఆ రోజు బలరామయ్య తన అల్లుడి చదువుకు ఎంతా ఇచ్చింది?

కనకయ్య పాత జ్ఞాపకాలు తవ్వుకోసాగాడు.

రెండా మూడా? నాలుగొందలదాకా ఇచ్చాడా? ఏదీ అంతిచ్చినట్టు లేదే? తను కనీసం వందన్నా ఇవ్వలేకపోతే? వందేమిటి? మూడో నాలుగో ఇస్తే?

తనకూ అంతరాత్మ అంటూ ఒకటుందనీ, దాన్ని ఇతరుల్ని మోసం చేసినంత తేలిగ్గా మోసం చేయడం కష్టమనీ కనకయ్య మొదటిసారిగా గుర్తించాడు.

'ఆఁ రెండొందలిస్తే చాల్లే! ఆ బలరామయ్యకూడా అంతే ఇచ్చినట్టు గుర్తు. గుర్తేమిటి? అంతే ఇచ్చాడు. అంతే!'

కనకయ్యలో మొదట మహావృక్షంలా కన్పించిన అంతరాత్మ గోక్కాడలా అయిపోయింది. మరో భావన అతనిలో తలెత్తింది.

దాతృత్వంలోని ఆనందం - అందులో బలరామయ్య మనవడికే దానం చెయ్యడంలో కలిగిన మహదానందం - అలాంటి మేడలు ఇంకా రెండుకొన్నా కనకయ్యకు కలిగేది కాదేమో?

"పాపం! తల్లిలేని పిల్లవాడు. నాలుగక్షరం ముక్కలబ్బితే వాడన్నా బాగుపడతాడు. మీ అయ్యా కొడుకులకు పొట్ట కోసినా అక్షరం లేదు కదా? వాడి నయినా చదివించండి." రవి కేసి సానుభూతిగా చూశాడు కనకయ్య.

సాంబయ్య మనసు వికలమైపోయింది! కనకయ్య చెప్పింది అంతా నిజంగానూ - అంతా అబద్ధంగానూ తోచింది. ఇందులో కొంత నిజమూ, కొంత అబద్ధమూ ఉన్నట్టుగా తోచింది కొంచెం దూరం ఆలోచిస్తే.

రవిని చదివించాలా? ఎలా?

మనవడి నెత్తిమీద నిమురుతూ దగ్గిరకు తీసుకొన్నాడు సాంబయ్య. రవి ముఖం చిన్నబుచ్చుకున్నాడు. వాడి బుర్రలో ఎన్నో ఊహలూ, భయాలూ - ఆశలూ అల్లిబిల్లి తిరిగిపోతున్నాయి.

"వాడి చదువు గురించి కాదు నే నొచ్చింది!" కనకయ్య ముఖంలోకి చూస్తూ అన్నాడు సాంబయ్య.

మరి ఎందుకొచ్చాడో? ఎంత ఆలోచించినా తట్టలేదు కనకయ్యకు.

"చల్లకొచ్చి ముంత దాస్తావెందుకూ? చెప్పూ!"

అదేమాట సాంబయ్య కనకయ్యను కనీసం వందసార్లయినా అని ఉంటాడు. అసలా మాట సాంబయ్యనుంచే కనకయ్యకు పట్టుపడింది. అయితే ఈసారి అనడం కనకయ్య వంతు అయింది పడటం సాంబయ్య వంతు అయింది.

"కొత్త కాలవకింద పొలం - నాలుగెకరాలు కౌలు కిస్తే - " సాంబయ్యకు గుండె గొంతులోకి వచ్చినట్టయి ఆగి "చేసుకొంటాను" అన్నాడు గొంతు తడిచేసుకొని.

"సాంబయ్యా? నువ్వా! పొలం కౌలుకు చేస్తావా?" సాంబయ్య కళ్ళల్లోకి సూటిగా చూస్తూ అన్నాడు కనకయ్య.

''అవతల వాళ్ళేం ఇస్తున్నారో అదే మగతా నేనూ ఇస్తాను"

''మగతా కాదు సాంబయ్యా? ఈ వయసులో నువ్వింకేం పొలం పని చేస్తావని?"

''నా మనవడున్నాడు. నేనున్నాను. ఇద్దరం కలిసి నాలుగెకరాలు చేసుకోలేమా ఏం?" మనవడ్ని ఇంకా దగ్గిరకు తీసుకొంటూ అన్నాడు సాంబయ్య.

''ఊరు పొమ్మంటుంది. కాడురమ్మంటుంది అన్నట్టు, నువ్వా ముసలాడివి! నీ మనవడా ముక్కు పచ్చలారని వాడు! మీరు పొలం ఏం చేస్తారూ? పండించి నాకేం మగతా ఇస్తారూ?" కనకయ్య కళ్ళజోడు తీసి చొక్కా అంచుతో తుడుచుకొన్నాడు.

సాంబయ్య కళ్ళలోని ఎర్రటి జీరలు ఇంకా ఎర్రబడ్డాయి.

''నీ కెందుకూ? నీ మగతా నీ కిస్తే సరిగదా? నా జీవితంలో నేను ఎవరికీ ఒక్కకానీ ఎగ్గొట్టలేదు. ఒకళ్ళది ఒక్కకానీ తినలేదు. నేను తిన్నా మరొకళ్ళకు పెట్టినా నా కష్టార్జితమే!"

సాంబయ్య ఆత్మాభిమానం మూర్తీభవించిన శిలాశిల్పంలా అయిపోయాడు.

''ఆ సంగతి నువ్వు చెప్పాలా? నాకు తెలియదా సాంబయ్యా? ఈ ఏడు పాత కౌళ్ళే మానేసి సొంత వ్యవసాయం చేయించాలంటున్నాడు మా పెద్దబ్బాయి. కౌలుదారీ బిల్లనీ మన్ననీ మశానమనీ చాలా వచ్చాయిగా? మా అల్లుడూ మా పెద్దోడూ ఇద్దరూ వకీళ్ళేకదా? ఈ చట్టం చట్టుబండలూ వాళ్ళకు తెలిసినంత మనకేం తెలుసు? వాళ్ళు ససేమీ ఇక భూములు కౌలుకివ్వడానికి వీల్లేదని బల్లగుద్ది చెప్పుతున్నారు. నన్నేం చెయ్యమంటావు సాంబయ్యా నువ్వే చెప్పు? ఏ మాత్రం వీలున్నా..." కనకయ్య ఆగిపోయాడు.

అప్పటికే సాంబయ్య వెనక్కు తిరగడం చూచి కనకయ్య నోరుమూసి, కళ్ళజోడు కాడలు చెవులకు తగిలించుకొన్నాడు.

మనవడ్ని తీసుకొని సాంబయ్య కనకయ్య ఇంటిముందునుంచి కదిలాడు. సాంబయ్య కాళ్ళకు అంటుతోన్న మట్టి డెబ్భై ఏళ్ళనాటి తన అనుభవాన్ని మూగగా బాధగా చెప్పింది.

సాంబయ్య తండ్రి వెంకయ్య ఉత్తరాదినుంచి వచ్చి, ఆ మట్టి మీదే నిలబడి బలరామయ్య తండ్రి వీరభద్రయ్య గారిని కమతం అడిగాడు. భద్రయ్య గారింట్లో వెంకయ్యకు కమతం దొరికింది. నిలువనీడ దొరికింది. భుక్తి గడిచింది. పెళ్ళి చేసుకొన్నాడు. పొలం కౌలుకు తీసుకొన్నాడు. కొడుకు పుట్టాడు. సొంతభూమి ఏర్పడింది. తను సంపాదించింది కొడుక్కు ఇచ్చిపోయాడు. తండ్రి ఇచ్చిన ఆస్తిని కొడుకు పదహారింతలు చేశాడు. పట్టింది బంగారం అయింది. అతడు నడిచిన నేల సస్యశ్యామలమైంది. అతడి ఉనికి భూమాతకే వెలుగయింది.

కాని... కాని... ఈనాడు ఆ వెంకయ్యకొడుకు... ఊరుబోయిన వెంకయ్య కొడుకు సాంబయ్య మళ్ళీ అదే చోట, వీరభద్రయ్యగారి భవనంముందు గడపల్లో, ఆ మట్టి మీదే నిలిచాడు.

కాని ఈనాడు వీరభద్రయ్య లేడు. వీరభద్రయ్యగారి కొడుకు బలరామయ్యలేడు. సాక్షాత్తూ ఆ బలరామయ్య మనవడినే ఊరుబోయిన వెంకయ్య కొడుకు సాంబయ్య వెంటబెట్టుకొని వచ్చి ఆ ఇంటిముందు నిలబడి అర్థించాడు.

వీరభద్రయ్యగారి మేడలో బలరామయ్య వాలుకుర్చీలో కూర్చున్న కనకయ్య కాళ్ళారజాపి పెద్ద గండంగడిచినట్టు నిట్టూర్చాడు.

మనవడి చెయ్యి పుచ్చుకొని నడిచిపోతున్న సాంబయ్యకు తల తెగి నేలమీద దొర్లినట్టయింది.

సాంబయ్య కాళ్ళకింద నేల కంపించిపోయింది. మట్టి కుంగిపోతూంది. సాంబయ్య బాధతో కుంచించుకుపోయాడు.

''కనకయ్య గారింట్లోనుంచి వచ్చే మనిషెవరూ?'' రచ్చబండ దగ్గిర నిలబడ్డ రాంసుబ్బయ్య వీరయ్య నడిగాడు.

వీరయ్య పరకాయించి చూసి ''ఆ వచ్చేది సాంబయ్య కాదూ? ఆఁ సాంబయ్యే మనవడితో వస్తున్నాడు చూడూ?'' అన్నాడు.

''ఏం పనిమీదెళ్ళేడో? ఈ మధ్య సాంబయ్య ఊళ్ళోకే రావటం మానేశాడుగా?''

''ఆ ఇంకా ఏం పనుంటుంది లేవయ్యా? పాతిక్కో పరక్కో చెయ్యి చాపటానికి వెళ్ళుంటాడు. మనవడొకడు తోడయ్యాడుగా? తనెట్టా బతుకుతాడూ? వాడ్నెట్టా సాకుతాడూ?'' వీరయ్య సానుభూతినే చూపిస్తోన్నాననుకొన్నాడు.

''ఖర్మయ్యా! ఖర్మ! నొసటిరాత ఎవడు తప్పిస్తాడూ? ఎట్లాంటి సాంబయ్య ఎట్లా అయిపోయాడూ? దేహీ అని ఒకడ్ని అడిగినవాడు కాదయ్యా?''

''భోజనమయిందా?'' వీరయ్యను అడిగాడు రాంసుబ్బయ్య.

''ఇంకెక్కడా?''

''పద ఇంటికేగా?'' పై పంచ నెత్తిమీద వేసుకొని బయలుదేరాడు.

సాంబయ్య మనవడితో రచ్చబండముందుగా నడిచిపోతున్నాడు. రామాలయం దాటిపోతున్న తాతా మనవళ్ళను, అప్పటికే తిని తీరిగ్గా రామాలయం అరుగుమీద కూర్చున్న గ్రామస్తులు చూసి పలకరించారు. ముభావంగా వెళ్ళిపోతూన్న సాంబయ్య బతుకు ఆ పూటకు వాళ్ళకు కాలక్షేపానికి పనికొచ్చింది.

డొంకలోకొచ్చిన సాంబయ్యకు ఎల్లమంద కొడుకు నరశిమ్మ అరక కట్టుకొని వస్తూ ఎదురయ్యాడు. ఎల్లమంద సాంబయ్య దగ్గిర ఎన్నో ఏళ్ళు కూలిపని చేశాడు. చచ్చేంతవరకూ సాంబయ్యను నమ్ముకొని బ్రతికాడు.

''ఈ అబ్బాయిగారు తవఁరి మనవడా?'' నరశిమ్మ అరక ఆపి సాంబయ్యను పలకరించాడు.

''అవునోయ్! ఎక్కడికీ అరక? రోజులెఖ్ఖా? ఎకరం లెఖ్ఖా? ఎవరి పొలం?''

''సొంతానికే అయ్యగారూ? చెరువుకంతం నేనూ ఓ ఎకరం చేసుకొంటున్నాగా?''

సాంబయ్య కళ్ళల్లో జ్యోతులు వెలిగాయి.

''నరశిమ్మా? చెరువుకింద బంజరుభూమి ఇంకా పనికొచ్చేదేమన్నా ఉందా?''

''ఏడుంది అయ్యగారూ? మాకే చాలక తన్నుకు చస్తున్నాం. ఈ ఏడు నా పొలం ఐదుసెంట్లు తగ్గింది. పోలిగాడు తనదంటూ కలుపుకొన్నాడు. నోటీసులనీ – పట్టాలనీ కరణంగారి గూపుల్తో ఒక పక్కన చస్తున్నాం.''

''ఆ కొత్తకాలవకింద బంజరు చేసుకోవచ్చు గదరా?''

''ఆఁ! అదేడ పండుద్ది సామీ? మురుక్కొట్టిందంటే రెక్కల కష్టం దండగ! ఎందుకు దొరా? ఎవరికీ?''

''నాకేరా నరశిమ్మా. నేనే చేసుకొందామని!''

నింపాదిగా అన్నాడు సాంబయ్య.

నరశిమ్మకు నెత్తిమీద తాటిపండు పడ్డట్టయింది.

''ఏంటీ? సాంబయ్యగారూ? మీరు బంజరు సాగుచేస్తారా?''

''ఏంరా? చెయ్యకూడదా? నీకంటే నా కెక్కువేముంది గనక?'' సాంబయ్య పెదవులపై హాసరేఖలు కదిలి అంతలోనే అదృశ్యమైనాయి.

''ఎంత మాటయ్యగోరూ?'' నరశిమ్మ మొఖం వెలవెలపోయింది.

''పద! అరక ఆగి ఉంది. అవసరమైనప్పుడు కేకవేస్తా. ఓ చెయ్యి సాయంపట్టాలి. కలిసొస్తే నీ ఋణం ఉంచుకోను.''

''నా పాణం ఇస్తానయ్యగోరూ?'' నరశిమ్మకు గొంతు ఆర్ద్రమైంది.

అరకతోలుకు వెళ్ళిపోతున్న నరశిమ్మను చూస్తూ ''విశ్వాసం ఉన్న మనుషులు! ఏమైనా ఆ తండ్రి కొడుకుల దారే వేరు!'' అనుకొన్నాడు సాంబయ్య.

## 65

''ఆ రింగు లేంటి తాతయ్యా?''

''ఇవి రెండూ నా మురుగులు. ఇది మా తండ్రి కడియంరా!'' సాంబయ్య వెండి కడియమూ బంగారపు మురుగులూ మనవడి చేతికిస్తూ చెప్పాడు.

నోటికి చెయ్యి అడ్డం పెట్టుకొని విరగబడి నవ్వాడు రవి.

''ఎక్కడన్నా మగాళ్ళు మురుగులూ కడియాలూ తొడుక్కుంటారా?''

''మా కాలంలో ఉండేవిరా. చెవిపోగులుకూడా పెట్టుకొనేవాళ్ళుంరా బాబూ! ఇప్పుడివన్నీ ఎబ్బెట్టయిపోయినైగాని!''

''తూ! తూ! ఏంటి తాతయ్యా?''

''ఒరేయ్! తూ.తూ. అంటున్నావ్ గాని ఇవే ఇప్పుడు మనకు అక్కరకు వచ్చినయ్ గదరా మరి?''

''ఛీ! ఛీ! తాతయ్యా. వేసుకొంటావా బాగుండదు!''

''కాదురా ఈబంగారం మురుగులమ్మి భూమి దున్నుకొందాం. కాడీ మేడి, నాగలి దుంపా ఉన్నయ్. సన్నకారువైనా ఓ జత దున్నలు కొందాం. ఏమంటావ్?''

రవికి దున్నలు కొనడం అంటే ఎంతో సరదా పుట్టింది.

''తాతయ్యా ఈ వెండి కడియం అమ్మవా?'' చేతుల్లో వెండి కడియం తిప్పుతూ అడిగాడు రవి.

సాంబయ్య గుండెల్లో ఎక్కడో కలుక్కుమంది. వీడిదీ 'అదే' ధోరణా?

''ఎందుకురా? అమ్మి ఏం చేద్దామని?'' మనవణ్ని అగ్నిపరీక్షకు పెట్టాడు సాంబయ్య.

''ఇదమ్మితే ఒక గొర్రె పొటేల్ వస్తదా తాతయ్యా?''

సాంబయ్య సగర్వంగా రవికేసి చూసుకొన్నాడు. వాడికి తన సాలూ, తన ధోరణులే వచ్చాయని తృప్తిగా నవ్వుకొన్నాడు.

''ఏంటి తాతయ్యా నవ్వుతావ్? ఆ రోజు చెరువుకట్టమీద చూశాను తాతయ్యా! ఒకడు తలగుడ్డ కట్టుకొని పొటేలుకు 'ఢీ' ఇస్తున్నాడు. ఇప్పట్నుంచీ అలవాటు చేసుకోకపోతే ఒక్కసారిగా ఢీ ఇస్తే తలపగిలిపోతుంది గదా తాతయ్యా?''

చేతులు ఊపుతూ తను చూసింది వర్ణిస్తూ తన ఊహల్ని చెప్తున్న మనవణ్ని కన్నార్పకుండా చూసుకున్నాడు సాంబయ్య. వీడు ఉద్దండుడు! తెలివికలవాడు. పిడుగంటే పిడుగే. ఇంకా నాలుగేళ్ళుపోతే వాడిముందు తనేం పనికొస్తాడూ? తను చేసిన పుణ్యం ఏదన్నా ఉంటే ఈ మనవడి రూపంలో తిరిగి తనకు అక్కర కొచ్చింది!

''రవీ? ఈ వెండి కడియం అమ్మటానికి వీల్లేదురా. ఇది నా తండ్రిది. నీ కిస్తున్నాను. నువ్వు నీ కొడుక్కివ్వాలి.''

''నా కొడుక్కా?''

''వాడు వాడి కొడుక్కి. వంశపారంపర్యంగా అలా వెళ్తుండాలని నా అభిలాషరా!''

''పో తాతయ్యా నీదంతా పిచ్చి!''

''అవున్రా! నిజం చెప్పావు. నాదంతా పిచ్చేరా?'' ఆ మాటన్న తాతయ్య బాధ పడుతోన్నట్టు రవి గ్రహించాడు.

''అయితే ఇది నాదేగా తాతయ్యా?''

తల ఊపాడు సాంబయ్య.

రవి వెండి కడియం కాలికి తొడుక్కున్నాడు. అది మోకాలుదాటి పైదాకా వచ్చింది.

సాంబయ్య సంతోషానికి అవధుల్లేవు.

''రవీ నీ కెన్నేళ్ళురా?''

''నీ కున్నన్నే తాతయ్యా!''

''అమ్మ భడవా!'' బిత్తరపోయాడు.

''అవును తాతయ్యా! చూడూ! కావాలంటే లెఖ్ఖ వేసుకో!''

సాంబయ్య చెయ్యి ముందుకులాగి వేళ్ళు లెక్కబెట్టసాగాడు రవి.

''ఇంత తెలివి నాకుంటే ఇట్టా అయిపోయేవాణ్ని కాదు.'' దూరంగా తాటితోపులోకి చూస్తూ అన్నాడు సాంబయ్య.

''నువ్వు చదువుకోలేదుగా తాతయ్యా మరి?''

''మీ అమ్మ చదువుకొంది. మీ మేనమామలు చదువుకొన్నారు. మీ తాత చదువుకొన్నాడు. చదవేస్తే వున్న మతి కాస్తా పోయిందన్న సామెతను వాళ్ళు రుజువు చేసుకొన్నారు. వాళ్ళు సర్వనాశనం అయారు. నన్నూ నా కొడుకునీ సర్వనాశనం చేశారు!''

మనవడి ముఖంలోకి చూస్తూ ఆ మాటలు పైకి అనలేకపోయాడు సాంబయ్య.

''తాతయ్యా? చెప్పవేం? ఏమిటీ చూస్తున్నావ్?''

''ఏం లేదురా! నీ వెండి కడియమే చూస్తున్నా! మా అయ్య పిక్కంత లేదురా నీ తొడ! కడియం వేస్తే పిక్కదాటి పైకొచ్చేదికాదురా.''

''మీ నాన్న కెంత బలం ఉండేదేం?''

''ఏనుగంత!''

''మీ నాన్నకంటే నాకే ఎక్కువ బలం ఉంటుంది. తెలుసా తాతయ్యా? మరిగొఱ్ఱెపొటేలు ఎట్లా కొందాం తాతయ్యా?''

''కొందాం బాబూ! గొఱ్ఱెపోతులూ, కోడెదూడలూ, ఆవులూ, గేదెలూ అన్నీ కొందాం బాబూ? మళ్ళీ అన్నీ కొనుక్కుంటాం.''

మనవడ్ని దగ్గరకు తీసుకొని తల నిమురుతూ చెప్పాడు సాంబయ్య. మనవడి కళ్ళల్లో వెలిగిన వెలుగుకు సాంబయ్య హృదయంలోని చీకట్లు దూరదూరంగా పారిపోసాగినై.

## 66

''బంగారపు మురుగులమ్మిన డబ్బు పెడ్తే ఓ మోస్తరైన దున్నపోతులైనా వస్తాయనుకున్న సాంబయ్య ఆశలు అడియాశలయినాయి. బంగారం ధర పెరిగింది. దున్న పోతుల ధర కూడ పెరిగింది. ముసలిదున్నను ఒక దాన్నీ, వొట్టి పోయిన గేదెపడ్డ నొకదాన్నీ కొనుక్కొచ్చాడు. రెంటిని జత కలిపాడు.''

ఓ రోజు ఉదయాన సాంబయ్య నాగలిదుంపకు పసుపురాసి బొట్టుపెట్టి మనవడ్ని పిలిచి కొబ్బరికాయ కొట్టమన్నాడు.

''ఒక్క దెబ్బకు రెండుగా మధ్యగా పగలాలి! కొట్టు!''

''తాతయ్యా నువ్వే కొట్టు. నాకు చేత కాదు.''

''నీ వల్ల కాకపోతే ఇంకెవరివల్ల అవుతుందిరా. కొట్టు! ఈ అరక నీది. ఈ భూమి నీది! నువ్వే కొట్టాలి. మరి!'' సాంబయ్య మనవడికి ఊతం ఇచ్చాడు.

రవి కొబ్బరికాయ పైకెత్తి సత్తువకొద్దీ నాగలిదుంప మీదకు విసిరాడు. కాయ రెండుగా భళ్ళున పగిలింది.

''సెభాష్! ఇక నీకు తిరుగులేదు. భూమిని బద్దలు కొడ్తావురా! నువ్వు నడిచిన నేలమీద రతనాలు రాల్తాయి. నువ్వు పట్టింది బంగారమౌతుంది. పద!''

సాంబయ్య దున్నను అదిలించాడు. అరకసాగింది. సాంబయ్య ముల్లుకర్ర

పట్టుకొని అరక వెనక నడిచాడు. మనవడు తాతయ్య పక్కన నడిచాడు. అరక దిబ్బదిగి డొంకన ఊళ్ళోకి వచ్చింది. రామాలయం దగ్గిర కుడివైపు వీధిలోకి తిరిగి కొత్త కాలవ బంజరు పొలాలకేసి పోసాగింది.

ఊళ్ళోకి సర్కస్ వచ్చిన రోజున కూడా అంత వింతగా చెప్పుకోలేదు. దున్నపోతూ, బ్రెనుకట్టి అరకతోలక పోతూన్న తాతా మనవళ్ళను విరగబడి చూశారు. అగుబ్బుగా చెప్పుకొన్నారు. డెబ్భైయ్యోపడిలో పడిన ముసలాడూ, పదేళ్ళు నిండని అర్భకుడు - ముసలిదున్న - గొడ్డుపోయినగేదె - అందులో కాలవతట్టు బంజరు వ్యవసాయం. ఒకప్పుడు ఊళ్ళో అందరికంటే మోతుబరిరైతూ - ఆగర్భ శ్రీమంతురాలి కడుపున పుట్టిన బిడ్డా - తాతా మనవడూ - పొలం దున్నటానికి పోతున్నారంటే ఊరు ఊరంతా గుడ్లుమిటకరించుకొని చూసింది. చెవులు రిక్కించుకొని విన్నది.

ఈ ముసలాడికి ఎక్కడలేని ఆరాటం! లేకపోతే ఈ చాదస్తం ఏమిటి? ఆ ముక్కా చెక్కలేం దున్నుతాడు? ఏం పండిస్తాడు? ఏం బాఁవుకొంటాడు? అంత కాపీనం ఉండబట్టే మనిషికి ఈ గతిపట్టింది. నోరు కట్టుకొని సంపాదించాడు. కాని మోకాళ్ళు అడ్డం పడే సరికి తినటానికి లేదు. అయినా ఈ మనిషికి ఆశ చావలేదు.

తలొక రాయీ విసరకపోయినా తలొక మాటా అన్నారు.

''రవీ! మొన్న మనం రాళ్ళు గుర్తుపెట్టాం చూశావా? ఆ రాళ్ళ మధ్య భూమి మనం దున్నుకోవాలి.'' సాంబయ్య కాడిమీద నుంచి నాగలిదుంప దించి తిప్పికడుతూ చెప్పాడు.

రవి తాతయ్యకు తాళ్ళు అందిస్తూ అడిగాడు ''ఇదెంత ఉంటుంది తాతయ్యా?''

సాంబయ్య మనవడికేసి ఆశ్చర్యంగా చూశాడు.

''ఎన్ని హెక్టార్లుంటుంది తాతయ్యా?''

సాంబయ్య నోరెళ్ళబెట్టి ఇంకా మనవడి కేసి చూస్తూనే ఉన్నాడు.

''ఎన్ని హెక్టర్లుంటుంది తాతయ్యా?''

''ఎక్టారు కాదురా ఎకరం! ఎకరం అనాలి.''

''నాకు తెలుసులే తాతయ్యా! టూ పాయింట్ ఫైవ్ ఏకర్స్ మేక్ ఒన్ హెక్టర్!'' అన్నాడు మనవడు.

సాంబయ్య అయోమయంలో పడి మనవడికేసి తదేకంగా చూశాడు.

వీడు తాతయ్యకు చదువు చెప్తున్నాడు. అప్పుడే ఎంత చదువు చదివాడు? వీడి వయసుకు మించిన చదువు! అంతకు, మించిన తెలివి. వెంకటపతికి ఈ వయస్సులో రెండోట్ల రెండు కూడా రాలేదు గుణింతాలు అన్ని బడులూ రాలేదు. వీడూ - వీడి తెలివితేటలూ - అసాధ్యంగా ఉన్నాయి. రవిని ఇంకా చదివిస్తే ఎంత గొప్పవాడౌతాడో? జిల్లా జిల్లాకే అధికారి అవుతాడు కాని...

‘‘ఇది ఎన్నెకరాలుంటుంది తాతయ్యా?’’

సాంబయ్య ఆలోచనలకు మనవడిమాట అడ్డొచ్చి నిలబడింది.

‘‘ఎన్నో ఎకరాలా? డెబ్బై ఎనభై సెంట్లుంటుందేమో!’’

‘‘కొలవకుండా ఎట్లా చెప్పావ్ తాతయ్యా?’’ రవి ప్రశ్నించాడు.

‘‘నా అంగ ఒక గజంరా! రా! చూడూ!’’ సాంబయ్య నాగలి కట్టి లేచాడు.

మనవడ్ని వెంటబెట్టుకొని కాలవవారగా వున్న రాళ్ళ మధ్య అంగలు లెఖ్ఖ పెట్టుకొంటూ నడిచాడు.

‘‘నిడివి తొంభై అంగలు. అంటే తొంభైగజాలు!’’ మనవడికేసి తిరిగి చెప్పాడు.

‘‘ఇక అడ్డం కొలుద్దాం! రా! ఒకటీ-రెండూ-మూడూ-’’

సాంబయ్య పెద్ద పెద్ద అంగలు వేస్తూ పోతూంటే రవి నడకే పరుగుగా తాతయ్య వెనకే నడిచాడు.

‘‘మూడు పదుల మీద ఎనిమిదీ... తొమ్మిదీ... తొమ్మిదిన్నరా కాస్త తక్కువ నలభై అనుకో!’’ సాంబయ్య ఆగి గుక్కతిప్పుకొన్నాడు.

‘‘సో! తాతయ్యా! నైంటీ ఇంటూ పార్టీ-ఉచి ఈజ్ ఈక్వెల్ టూ థర్టీసిక్స్. యాడ్ టూ జీరోస్. దట్ మేక్స్ త్రీ తౌజండ్ సిక్స్ హండ్రెడ్..’’ మనవడు మల్టిప్లికేషన్ చేస్తుంటే సాంబయ్య ఊపిరి బిగబట్టి చూడసాగాడు.

వీడనేదేమిటో రవంత కూడా తనకు అర్థం కావటం లేదు. భూమి కొలతలు ఇంటూ బొంటూ-కొట్టాగిట్టా అంటే ఎట్టా తేల్తాయ్?

‘‘యూ ఆర్ కరెక్ట్ తాతయ్యా! త్రీఫోర్త్ ఆఫ్ యాన్ ఎకర్! డెబ్బై అయిదు సెంట్లకు ముప్పైగజాలు తక్కువ.’’

సాంబయ్య తెల్లబోయి చూశాడు. ఎంత ఖచ్చితంగా లెక్ఖకట్టి చెప్పాడూ? తనేదో తరుగుంటదనుకున్నది కూడా గజాల్లో లెక్కకట్టి చెప్పాడు. తన మనవడు సామాన్యుడు కాడు. ఇంత చదువూ, తెలివీ ఉన్నవాడు వీడు తనకు దక్కుతాడా? భూమి దున్నుకొనే బతుకుతాడా?

సాంబయ్య గుండె సలసల కాగిపోయింది.

‘‘తాతయ్యా! నువ్వెట్టా చెప్పావు తాతయ్యా? లెఖ్ఖ చేయకుండానే చెప్పావ్?’’ తాతయ్య సామర్థ్యం మీద అపారమైన గురి కలిగిన మనవడు అడిగాడు.

‘‘నాదంతా అనుభవం మీద చెప్పటమేరా. అదెట్టాగో తిరిగి నీకు చెప్పలేను మరి!’’

సాంబయ్య మనవడ్ని దగ్గిరకు తీసుకున్నాడు. రవికి సాంబయ్య తాత ఎత్తుగానూ, గొప్పగానూ కన్పించాడు.

‘‘రా! రారా! బాబూ! రా నాగలి పట్టడం నేర్చుకో. భూమి తీరు తిన్నగా చూసుకో. తూర్పు పడమర్లగా సాళ్ళు దున్ను! అట్టయితే వాటంగా ఉండేట్టుగా వుంది ఈ భూమి.’’

సాంబయ్య భూమిలోకి నాగలి క్రుదించి, మనవడి రెండు చేతులూ మేడిమీద పెట్టించి– ''ఆఁ అదుగట్టా! మేడి గట్టిగా నొక్కి పట్టి తిన్నగా చూసుకో.'' అన్నాడు.

సాంబయ్య పగ్గాలుపట్టి ఎలపల ఉన్న దున్ననూ, దాపట వున్న గేదనూ అదిలించాడు.

''ఎ హే హేయ్! ఛో! ఛో!!''

అరక సాగింది. నాగలి భూమిని పట్టి పెళ్ళగిస్తోంది.

భూదేవి వడిలో సీత కళ్ళు తెరిచింది.

సాంబయ్య హృదయం పులకరించి పోయింది. ఆనందాశ్రువులు కంటి రెప్పల్ని విడలేక నిలిచిపోయినై–

తొమ్మిదేళ్ళ వెంకటపతి నాగలిపట్టినరోజు – తనయుడు వెంకటపతి చెమటతో భూమి తడిపిన రోజులు – సాంబయ్య కన్నీటి పొరలతో కదిలి మెదిలి కరిగి పోసాగాయి.

## 67

జూన్ నెల సగం గడిచిపోయింది. వర్షాలు పడుతున్నాయి. సాంబయ్య బంజరు దుక్కిదున్ని, నారు సంతన చేసుకొనే ప్రయత్నంలో వున్నాడు.

తెరిపి ఇస్తే రేపోమాపో అరకకట్టి పొలం పదును చేసి నాటు వేయాలన్న తహతహతో, పాకలోనుంచి బయటికొచ్చి విడిపోతున్న నీటి మబ్బులకేసి చూస్తూ నిల్చున్నాడు.

తాతయ్య పక్కనే నిలబడి రవి తలపైకెత్తి ఆకాశం కేసి చూశాడు. దిగంతాలను కలుపుతూ విరిసిన ఇంద్రధనుస్సును కళ్ళు వలయంగా తిప్పిచూస్తూ,

''రైన్! రైన్! గో ఏవే! లిటిల్ చిల్డ్రన్ వాంట్ టూ ప్లే!'' అంటూ పాడుకొంటున్న రవి హఠాత్తుగా పాట ఆపేశాడు.

పంచె కుచ్చీళ్ళు పైకిపట్టుకొని లసలసలాడిపోతున్న మట్టిదిబ్బ మీదకు ఎక్కివస్తోన్న రామనాథబాబు కన్పించాడు.

''బాబాయ్? బాబాయ్!'' ఎలుగెత్తి పిలుస్తూ ఎదురు పరుగెత్తుకెళ్ళాడు రవి.

రవిని దగ్గరగా చూసిన రామనాథబాబు ముఖంలో విషాదఛాయలు అలుముకున్నాయ్.

వీడా వరూథిని కొడుకు రవి? మీటితే పాలుగారే ఆ బుగ్గలేవీ? ఆ చిలిపి కళ్ళల్లో అల్లరేదీ? ఎప్పుడూ నిండుగా జమీందారు బిడ్డలా డ్రెస్ చేసుకొనే రవి యేనా ఈ చాలీచాలని మురికి బట్టల్లో ఉన్నది?

''బాబాయ్!''

''రవిబాబూ!'' రామనాథబాబు కంఠం వణికింది.

''మీ తాతయ్యేక్కడ బాబూ?''

''పాకలో ఉన్నాడు. రా!'' అంటూ రవి రామనాథబాబు చెయ్యి పట్టుకొన్నాడు. పాక దగ్గరకు తీసుకుపోసాగాడు.

రామనాథబాబు గుండెలు కదబడ్డాయి. సింహం గుహలో చొరబడబోతున్న

వాడి స్థితిలో పడిపోయాడు. తను రావటం పొరపాటయిందేమో? ఎవర్నన్నా పంపిస్తే బాగుండేదేమో? ఎవర్ని పంపించినా తన ఆశయం నెరవేరదు. అది తను బాగా ఆలోచించి మధనపడి తేల్చుకున్న సంగతే! సాంబయ్యకు ఎదురుపడక తప్పదు. సింహాన్ని గుహలో ఉన్నప్పుడే జోకొట్టాలి. తప్పదు-

రవి ముందు దారితీయగా రామనాథబాబు పాకలో ప్రవేశించాడు. అతని కళ్ళు బెదురుగా పాకంతా వెతికాయి. సాంబయ్య కన్పించలేదు.

"తాతయ్య పాకవెనక పందిరికింద ఉన్నాడేమో? పిలుచుకొస్తా. నువ్విక్కడే కూర్చోబాబాయ్!" అంటూ రవి తాతయ్య నులక మంచం వాల్చాడు.

రామనాథబాబు మనసు, తెగిన నులకతాళ్ళ కుక్కిమంచంలా అయిపోయింది.

వీడు అప్పుడే ఎంత మర్యాదా, మన్ననా నేర్చుకొన్నాడూ? పిలుపులో ఎంత ఆప్యాయత ఉంది? వరూధిని కొడుకు ఈ పూరిపాకలో ఉంటున్నాడా? ఈ నులక మంచం వాడి పడకా?

తాతయ్యను వెతుక్కుంటూ రవి పాక వెనక్కు వచ్చాడు.

పొట్ల తీగ పందిరి కింద కూర్చొని పొట్ల పిందెలకు రాళ్ళు కడ్తూ కన్పించాడు సాంబయ్య.

"తాతయ్యా! తాతయ్యా!" ఉద్వేగంతో పందిరికిందకు పరుగెత్తుకొచ్చాడు రవి.

రాయికట్టిన తాడు పొట్లపిందెకు ముడివేసి పొట్లకాయ సర్దుతూ "రవీ? ఎక్కడికి పోయావురా? ఇంకా నాలుగు రాళ్ళేరుకురా, ఈ నాలుగు పిందెలకు కూడా కట్టేస్తేపోతుంది." పళ్ళసందున గోగునార పట్టుకొని అన్నాడు సాంబయ్య.

"బాబాయ్! బాబాయొచ్చాడు తాతయ్యా!" రవిలో ఉత్సాహం పరుగులు తీసింది.

"బాబాయా?" పళ్ళసందున ఉన్న గోగునారతాళ్ళు తీసి భుజంమీద వేసుకొన్నాడు సాంబయ్య.

"నా కున్న దొక్కడే కొడుకు! వాడే లేడనుకుంటుంటే నీకు బాబాయి ఎక్కడ్నుంచి వచ్చాడా?" అనుకొంటూ సాంబయ్య మనవడికేసి చూశాడు.

"నువ్వు రా తాతయ్యా! తొందరగా" సాంబయ్య చెయ్యి పట్టుకొని పాకలోకి లాక్కుపోయాడు మనవడు.

"నమస్కారమండీ!"

రామనాథబాబు నిలబడే ఉన్నాడు.

సాంబయ్య కళ్ళు చిట్లించి నొసలు ముడిచి చూశాడు.

"ఎవ్వరా ఈయన రవీ?"

"నేను రామనాథబాబును!" నూతిలోనుంచి వచ్చినట్టుంది రామనాథబాబు గొంతులోనుంచి వచ్చిన ఆ మాట.

"రామనాథబాబా!"

సాంబయ్య కొయ్యబారిపోయాడు.

కొద్ది క్షణాలు ఎవరూ మాట్లాడలేదు.

రవి అశాంతిగా, ఆదుర్దాగా రామనాథబాబునూ, సాంబయ్యనూ మార్చి మార్చి చూడసాగాడు.

"ఏం వచ్చావ్?" సాంబయ్య కంఠం కఠినంగా వుంది.

రామనాథబాబు ఉలిక్కిపడ్డాడు. మళ్ళీ మౌనంగా నిలబడ్డాడు.

"ఇంకా నా దగ్గిరేముందని?" సాంబయ్య గొంతు మెత్తబడిపోయింది.

"రవి-రవిబాబును తీసుకెళ్దామని వచ్చాను. బాబు స్కూలు ఎల్లుండి తెరుస్తారు. స్కూలు తెరిచే రోజుకు తప్పక హాజరు కావాలి."

సాంబయ్య కళ్ళకు చీకట్లు కమ్మాయి. ఆ చీకటిలో తోకచుక్కలు కన్పించాయి.

"రవి నా వాడు. నా మనవడు!"

"అందుకే మిమ్మల్ని అడుగుతున్నాను. వాడి భవిష్యత్తు గురించి ఆలోచించి ఒక నిర్ణయానికి రావాల్సింది కూడా మీరే! మీ మనవడి చదువు పాడవకుండా చూడాల్సింది కూడా మీరే కదా?"

సాంబయ్య సందిగ్ధంలో పడ్డాడు.

"ఏం పెట్టి చదువుకొంటాడు? ఉన్నదంతా మీరంతా కలిసి నాశనం చేశారుగా?"

"అది నా వొక్కడి తప్పూ కాదు. అయిందేదో అయిపోయింది. మీ మనవడికి చదివించే పూచీ నాది."

"ఆ భారం నీ కెందుకయ్యా?" నీరసంగా అన్నాడు సాంబయ్య.

"భారం కాదు. అది నా బాధ్యతగా భావిస్తాను."

"నా మనవడికి చందా యిచ్చి చదివిస్తా నంటావ్! అంతేనా!" ఎత్తి పొడుపుగా అన్నాడు సాంబయ్య.

"దాన ధర్మాలు చెయ్యటానికి రాలేదు. నా ఋణం తీర్చుకోవటానికి వచ్చాను."

"నువ్వు వెయ్యి జన్మలెత్తినా నీ ఋణం తీర్చలేవు. వందబళ్ళు కట్టించినా, వెయ్యిమందికి చదువు చెప్పించినా నీ ఋణం తీరేదికాదు. నా బిడ్డను నాకు దూరం చేశావు. నా భూమిని పరులపాలు చేశావు. పచ్చని సంసారంలో చిచ్చుపెట్టావు. నిండు దీపాన్ని ఆర్పివేశావు. లక్ష దేవుళ్ళకు పూజచేసినా, కోటి దేవతలకు మొక్కినా నీ ఋణం తీరేదికాదు. రౌరవాది నరకాలు అనుభవించినా నీ పాపం తీరేదికాదు. జన్మకి ఈ పాపం నిన్ను కట్టి కుడుపుతుంది. పో! ఇక వెళ్ళు! నా కళ్ళముందు నుంచి పో!" సాంబయ్య కళ్ళు జ్యోతుల్లా మండిపోతున్నాయి.

గుండెల్లో అగ్నిజ్వాలలు లేచాయి. ఎన్నో ఏళ్ళగా గూడు కట్టుకున్న బాధ కరిగి పొగలు - శెగలు చిమ్మింది. అణువణువూ దహించి వేసింది. మనిషి ఉద్రేకంతో వణికిపోతున్నాడు.

ఆ స్థితిలో తాతయ్యను చూసిన రవి గుండెలు అవిసిపోయినై. ఏవో తెలియని భయాలు పసి హృదయాన్ని చుట్టివేశాయి.

రామనాథబాబుకు ముచ్చెమటలు పోశాయి. అయినా అతి ప్రశాంతంగా నిలబడి రవిబాబును చూస్తూ ఉండిపోయాడు. పెదవులపై మునుపటి చిరునవ్వులు మళ్ళీ తొణికిసలాడాయి. తన నెత్తిన వున్న పెద్ద బరువేదో దించాడు సాంబయ్య.

తనలో అణువణువునూ పట్టి పీడిస్తున్న విషాన్ని సాంబయ్య పిండేశాడు. తన కిప్పుడు ఎంతో హాయిగా వుంది.

''సాంబయ్యగారూ? ఒక్కమాట చెప్తా వింటారా?''

సాంబయ్య ముఖం పక్కకు తిప్పుకొని మౌనంగా విన్నాడు.

''మీ మనవడు చాలా చురుకైనవాడు. తెలివితేటలున్నవాడు. వృద్ధిలోకి రావాల్సినవాడు. వాడి చదువు ఆపొద్దు! వాడి భవిష్యత్తును నాశనం చెయ్యొద్దు, మీ ఐశ్వర్యం హరించుకుపోయి మీరీ స్థితిలో ఉండటానికి కారణాలు చాలా ఉన్నాయి. దానికి బాధ్యులైన వాళ్ళల్లో నేను ఒకడ్ని మాత్రమే. కాని ఇప్పుడు మీ మనవడు రవిబాబు భవిష్యత్తును మీరే చేజేతులా పాడుచెయ్యటానికి సిద్ధం అయ్యారు. ఈ మాటమాత్రం గుర్తుంచుకోండి.''

రామనాథబాబు రవి తల నిమిరి ''నే నొస్తా బాబూ!'' అని చెప్పి పాకలో నుంచి బయటికొచ్చాడు.

తిరిగి పాకలోకి తొంగిచూసి ''సాంబయ్యగారూ వస్తా!'' అన్నాడు.

''ఉండుండు. మళ్ళీ ఆ నేరం నా మీదెందుకూ? వాడ్నే అడుగు. వస్తానంటే తీసుకెళ్ళు!'' అంటూ సాంబయ్య కాళ్ళువశం తప్పి మంచంలో కూలబడ్డాడు.

రామనాథబాబు ఒక్క అంగలో తిరిగి పాకలోకి వచ్చాడు.

''రవీ! రా వెళ్దాం! మీ తాతయ్య వెళ్ళమంటున్నాడుగా? రా!''

''వెళ్ళరా! నీ కిష్టమయితే వెళ్ళు!''

రామనాథబాబుకూ, సాంబయ్యకూ మధ్యలో ప్రతిమలా నిలబడిపోయాడు రవి. ''రారా! రవీ! ఎల్లుండే స్కూల్లో చేరాలి. రోడ్డుమీద కారు ఆగి వుంది. పోదాం రా!''

''పోరా! పో! ఎద్దు ముడ్డి పొడుచుకుంటే ఏం వస్తుంది? చదువుకుంటే అందలా లెక్కవచ్చు! ఊళ్ళేలవచ్చు!'' సాంబయ్య స్వరం పెదవులు దాటలేక లోలోపలే గురుగురలాడిపోయింది.

సాంబయ్యా, రామనాథబాబూ రవికేసి కన్నార్పకుండా చూస్తున్నారు.

క్షణాలు యుగాలుగా గడిచిపోతున్నాయి. రవి మెదడులో ఎన్నో ఊహలు మెదిలాయి. అటు బాబాయి.... చదువు - పట్నవాసం - ఇటు తాతయ్య - పొలం - పూరిపాక -

''తాతయ్యా!'' రవి ఒక్కదూకులో తాతయ్య వొళ్ళో వాలిపోయాడు.

సాంబయ్య మెడచుట్టూ రవి చేతులు పెనవేసుకుపోయినై. తాతయ్య గుండెమీద చెంపలు రుద్దుకుంటూ అన్నాడు రవి.

''తాతయ్యా! నీ దగ్గరే ఉంటా. నాకు నువ్వేకావాలి తాతయ్యా!''

మనవడి చంపలమీద నిలిచిన కన్నీటిబొట్లను తుడిచి సాంబయ్య వాడ్ని గుండెలకు హత్తుకున్నాడు.

తాతయ్య హృదయంలో అమృతం చిలకరించింది. ఆ పూరిపాక ఆనంద నిలయం అయింది.

రామనాథబాబు తాతా మనవళ్ళను చూస్తూ తన అస్థిత్వాన్నే మర్చిపోయాడు.

రక్తపాశాన్ని ఎవడూ తెంచలేడు. మమతా మమకారాలూ, అనుబంధాలూ ఎంత బలమైనవి? రామనాథబాబు కళ్ళు ఆర్ద్రమైనాయి. గుండెలు చెదిరిపోయినై. ఎప్పుడూ నవ్వుతూ కళగావుండే అతని ముఖంమీద పూరిపాక నీడలు పాకాయి! మట్టిదిబ్బదిగి పోతున్న రామనాథబాబు కాళ్ళు బురదలో జారిపోతున్నాయ్.

''రామనాథబాబు వెళ్ళిపోయాడా?''

''ఆc! వెళ్ళిపోయాడుగా తాతయ్యా?''

''మీ నాన్న సంగతేమయినా చెప్పాడా?''

రవి బిక్కమొహం వేశాడు.

''నువ్వుకూడా అడగలేదా?''

సాంబయ్య చుట్టుకొన్న ఇనుపతెరలు తెగిపడ్డాయి. పుత్ర వాత్సల్యం జలపాతంలా దూకింది.

''తాతయ్యా! నీ కొడుకుమీద నీకు కోపం తగ్గిందా?'' రవి కళ్ళలో కాంతిరేఖలు కదిలాయి. గుండెల్లో ఆశలు మోసులెత్తాయి.

సాంబయ్య నిస్సహాయంగా పసివాడిలా మనవడి కళ్ళలోకి చూశాడు.

''తాతయ్యా! అయితే నాన్న తిరిగొస్తాడు. నాన్న తప్పకుండా వస్తాడు. ఉండు తాతయ్యా! ఇప్పుడే వస్తా!'' రవి పాకలో నుంచి బయటకు పరుగెత్తాడు.

దిబ్బదిగి తాటితోపుదాటి, డొంకనపడి, ఊళ్ళోకి పరుగులు తీశాడు.

రామాలయం వెనకనే కారెక్కబోతున్న రామనాథబాబు రవిని చూసి ఆగిపోయాడు.....

మునిమాపువేళ సాంబయ్య పాకముందు కాలుకాలిన పిల్లిలా తిరుగుతూ మనవడి రాకకోసం వెయ్యికళ్ళతో ఎదురుచూశాడు.

బురదలో కూరుకుపోతున్న కాళ్ళను ఎత్తిఎత్తివేస్తూ, వెక్కివెక్కి ఏడుస్తూ దిబ్బెక్కి వస్తోన్న మనవడ్ని చూసి సాంబయ్య చేతిలోని కర్ర వదిలేశాడు!

## 68

ఏరువాక పౌర్ణమి ఎన్నోరోజులు లేదు. ఈ ఏడు మెరకలూ పల్లాలూ చదును చేసుకొంటే మరో నలభైసెంట్లు కలుస్తుంది. నిరుటేడు తొంభయ్ సెంట్ల దాకా కలిసొచ్చింది. అంతకుముందు ముప్పాతిక. ఈ ఏడు తను అనుకున్నట్టు నాటు మొక్కలు గుచ్చగలిగితే మొత్తం రెండెకరాలకు మించిన సాగు. ఏం ఫర్వాలేదు. మనవడు వచ్చిన వేళా విశేషం. వాడి అదృష్టం బాగుండాలి. నిరుడు పండినట్టు ఈ ఏడు కూడా పండితే రెండెకరాల మీద పంట, తిండిగింజలు పోను ఓ పుట్టెడు ధాన్యం అమ్ముకోవచ్చు! దిబ్బమీదవచ్చే ఆదాయంతో పై ఖర్చులన్నీ ఎల్లమారి పోతాయి. ఇన్నాళ్ళు ఏ పొలమూ, పుట్రా లేని రోజుల్లో తనకు ఇంత తిండి పెట్టింది ఈ దిబ్బేగా? ఈ ఏడు వేసవికాలంలో కూరగాయల ధరకూడా

బాగా పలికింది. హెచ్చు రేట్లమీద అమ్మాడు. ఇబ్బడి కిబ్బడి ఐవేజు వచ్చింది. రవి తన చేతికి ఆసరాగా వచ్చింతర్వాత దిబ్బమీద రెట్టింపు కూరగాయులు పండించగలుగుతున్నాడు. దిబ్బమీద కష్టమంతా వాడిదే. నీళ్ళు పోస్తాడు. పాదులు తవ్వుతాడు. కలుపు మొక్కలు తీస్తాడు. కూరగాయులు కోస్తాడు. తట్ట నెత్తిన పెట్టుకొని దుకాణంలో వేసివస్తాడు. వాడు లేకపోతే ఇదంతా తనవల్ల అయేదా? దిబ్బ దగ్గర కొచ్చే మారు బేరగాళ్ళు సగానికి సగం ధరమీదే కొనుక్కొని వెళ్ళేవాళ్ళు. దేముడు చల్లగా చూస్తే, ధాన్యం రేటు ఈనాడున్నట్టే, పై పంటనాటి క్యూడా ఉంటే మళ్ళీ రూపాయలు తను కళ్ళజూస్తాడు. తను దాచిపెట్టిన రూపాయి రూపాయిగానే ఉండదు. అదీ పెరుగుతుంది. పిల్లల్ని పెడ్తుంది. కలిసిరావాలిగాని రెండేళ్ళుపోతే ఏ ఎకరం గరువు కొనుక్కోవచ్చు. అదట్టుంచు! ముందు దున్న సంగతి చూడాలి. ఇది ఎత్తుపడిపోయింది. ముసలిదైపోలా మరి! పాపం ఏ మాట కామాట. బాగా పని చేసింది. దాని బొమికలు పిండేశాడు తను. ఇక లాభం లేదు. రాను రాను ఆ గేదెపడ్డ గ్రాసం దండగ్గావుంది. మెడమీద కాడేస్తే ముట్టె నేలకు రాచిపారేస్తుంది. ఇహ వీటితో వ్యవసాయం కుదర్దు. దున్న పోతుల్ని కొనక తప్పదు. నడికారువికొంటే నాలుగైదేళ్ళు దిగులు లేదు. ఆ తర్వాత ఒకేసారి గిత్తల్నే కొనచ్చు. తను కొనే దేమిటి అప్పటికి వాడే కొనుక్కుంటాడు. రవి కోడెదూడలంటే ప్రాణం విడుస్తాడు.

''ఏమిటి తాతయ్యా? లెక్క తేల లేదా?'' బెండమొక్కలకు నీళ్ళు పోస్తూ, ఆరుబయట మంచం వేసుకుని కళ్ళు అరమూతలు వేసి వేళ్ళు మూసి తెరుస్తూ కూర్చున్న సాంబయ్యను చూసి అడిగాడు రవి.

''ఏం లెఖ్ఖల్రా?'' మనవడ్ని చూసి నవ్వుతూ అన్నాడు సాంబయ్య.

''నాకు తెలియదా? నువ్వు పొద్దుకూకులూ వేసిన లెఖ్ఖలేవేస్తూ ఉంటావుగా?''

''చేసిన పనే చెయ్యడం - వేసిన లెఖ్ఖలే వెయ్యడం - అంతకంటే నేను చేసే పనేముందిరా?''

''ఏమిటి తాతా మనవళ్ళు ఏవో కూడికల్లో తీసివేతల్లో ఉన్నారూ?'' అంటూ కనకయ్య పాక వెనకనుంచి వచ్చాడు.

''ఎవరిదీ? కనకయ్యా? ఇట్టా ఊడిపడ్డావ్? ఎటునుంచొచ్చావ్?'' మంచం మీద జరిగి కూర్చొని చోటు చూపిస్తూ అడిగాడు సాంబయ్య.

''ఇటు తోపులోనుంచి వచ్చాలే! నీ వంట్లో ఎట్లావుందీ? ఆ మధ్య రామసుబ్బయ్య కన్పించి, ''సాంబయ్య పని ఐపోయిందయ్యా. మనిషి చచ్చు బడ్డాడు.'' అంటే చూచిపాదామని వచ్చా''

''ఆఁ! ఏదో నాలుగు రోజులు నలత! అదేం చేస్తుందిగాని, ఇట్టా వచ్చావ్ ఏమిటి విశేషం?'' తెల్లటి కనుబొమలకింద నల్లటి కనుపాపల్ని తిప్పి కనకయ్యను చూస్తూ ప్రశ్నించాడు సాంబయ్య.

అమ్మ సాంబయ్యా! మనిషిలో చేదు చావలా ఇంకా? చూచిపోదామని వచ్చానంటే

ఎట్లా మాట్లాడుతున్నాడో చూడు? కనకయ్య పక్క చూపులు చూస్తూ అన్నాడు-
''దిబ్బమీద ఎక్కడా జానెడు చోటు వదలకుండా కూరగాయలు పండిస్తున్నావ్. నీదయ్యా పట్టుదలంటే! దిబ్బమీద మొక్కల్ని కలియజూస్తూ ''నీ చేతుల్లో పడితే మట్టే బంగారం అవుతుందయ్యా?" సాంబయ్యను ఉబకేస్తున్నాననుకొంటూ అన్నాడు."
''ఏం? నీ కళ్ళు దీనిమీదకూడా పడ్డయ్? కొంటావా ఏం?"
కనకయ్య వీపుమీద కొరడా తగిలింది! సాంబయ్యకేసి బిత్తరపోయి చూశాడు.
''కొన్నవిచాలుగాని - మొత్తంమీద నీలో పలుకు చావలేదయ్యా!"
''పుట్టుకతో వచ్చింది పుడకతోనే పోవాలయ్యా! మధ్యలో వచ్చిందయితే మధ్యలోనే పోతుందిగాని-"
''ఆఁ మా బాగా చెప్పావ్! అంతే! అంతే!" కనకయ్యకు సాంబయ్య మాటల్లోని చేదు తలకెక్కింది. రాని నువ్వు తెచ్చుకొని నవ్వాడు.
ఇంత వయస్సు వచ్చినా ఈ సాంబయ్యకు బుద్ధి మందగించలేదు. చూపు తగ్గలేదు. చెవుడూ రాలేదు. కాకపోతే మనిషి కంకాళంలా వున్నాడు. అంతే! సాంబయ్యను శల్య పరీక్ష చేస్తూ అనుకొన్నాడు కనకయ్య.
''సాంబయ్యా! నీకు ఓటుందిగా?" సాంబయ్యతో డొంక తిరుగుడు వ్యవహారం లాభం లేదనుకొని సూటిగానే అడిగాడు కనకయ్య.
''ఆఁ. ఓటా? ఏంఓటూ?" పొగాకు కాడ విప్పుతూ అన్నాడు సాంబయ్య.
''ఏం ఓటంటా వేమిటి నీ పేరు ఓటర్ల లిష్టులో ఉంటేనూ?"
''ఉంటే ఉందేమోలే?" కాడ యీనె తీస్తూ.
''ఉందేమోలే అంటావేమిటి? సాంబయ్య - సన్ ఆఫ్ - ఊరుబోయిన వెంకయ్య - అని ఓటర్ల లిష్టులో అచ్చుగుద్ది ఉంటేను?"
''ఆఁ వుంది. ఏం చేయమంటావ్?" సాంబయ్య చుట్టిచుట్టి కనకయ్యకు చూపుతూ-
''కేటు! ఇది నువ్వు తాగవులే!" అన్నాడు.
''ఆమాట చెప్తామనే వచ్చాగానీ ఉండు! అంటూ కనకయ్య జేబులోనుంచి రెండు పుగాకు కాడలు తీసి ''ఇది కాల్చి చూడూ! చేబోల్డి. బూడిత్తోట పుగాకు. మనిషిని పంపి మరీ తెప్పించా!" అన్నాడు కనకయ్య!
''నాకెందుకు లేవయ్యా అది? ఇవ్వాళ నువిస్తే కాలుస్తాననుకో! రేపెవడిస్తాడంటా?" సాంబయ్య చుట్టు నోట్లో పెట్టుకొని అగ్గిపెట్టె కోసం మంచంకోడు దగ్గిర వెతకసాగాడు.
కనకయ్య జేబులోనుంచి అగ్గిపెట్టె తీసి సాంబయ్యకిచ్చాడు. ఒక కాడ జేబులో పెట్టుకొని రెండోకాడ చుట్టుచుట్టుకొన్నాడు కనకయ్య.
సాంబయ్య చుట్ట వెలిగిస్తూ గుప్పుగుప్పున అగ్గిపుల్ల వెలుగుతోపాటు పొగవదులుతూ ''మళ్ళీ వోట్ల జాతరొచ్చిందేంటి?" అన్నాడు.
''ఆఁ! వచ్చే నెలలోనే ఎలక్షన్స్. ఏడో తారీఖు అటో ఇటో తేలిపోతుంది. ఈ ఏడు పోటీ ముమ్మరంగా ఉందయ్యా. ఎవరు గెలిచినా ఒకటీ రెండు తేడాతోనే అనుకో!"

సాంబయ్య చేతిలోనుంచి అగ్గిపెట్టె తీసుకొని చుట్ట నోట్లోపెట్టుకొని కొసకొరికి ఊశాడు కనకయ్య.

చుట్టనుసి చిటికెన వేలుతో రాలూస్తూ ''ఈసారి కూడా ఆ తోడల్లుళ్ళు ఇద్దరేనా పోటీ?'' అన్నాడు సాంబయ్య.

''తోడళ్ళుళ్ళా? ఇద్దరూ దొంగలే!'' కనకయ్య నోట్లో నుంచి చుట్టతీసి అన్నాడు. మళ్ళీ చుట్ట నోట్లోపెట్టుకొని అగ్గిపుల్ల గీశాడు.

''ఇందులో దొంగలు కానిదెవర్లే? అందరూ దొంగలే!'' సాంబయ్య ఖాండ్రించి వూసి కనకయ్య ముఖంలోకి చూశాడు.

కనకయ్య గతుక్కుమన్నాడు.

''అగ్గిపుల్ల దండగెందుకూ? చుట్టకు చుట్ట ముట్టించూ!'' సాంబయ్య తన చుట్ట తిప్పి పట్టుకున్నాడు.

''అగ్గపుల్లకూడ అదా ఎక్కడ చేస్తాం?'' అంటూ కనకయ్య అగ్గిపుల్ల గీచి చుట్ట వెలిగించుకొన్నాడు.

''అవున్లే! ఆ రోజులు పోయినైగా?'' సాంబయ్య చుట్ట పాగ వదులుతూ కనకయ్యకేసి ఓరగా చూశాడు.

''అంటే నీ ఉద్దేశ్యం? ఎలక్షన్సలో పోటీచేసే వాళ్ళంతా దొంగలేనంటావా?'' కనకయ్య పెదవులు దాటి పొగతోపాటు మాటలు బయటి కొచ్చినయ్-

''ఆ! ముమ్మాటికి!''

''మహా! మహా! మన జాతి నాయకులందర్నీ తీసి పారేస్తున్నావే? దేశానికి స్వరాజ్యం తెచ్చిందెవరూ?''

''ఎవరో ఒకర్లెద్దూ? ఎవరయితే ఏం దంట?''

''అసలు వాళ్ళు లేకపోతే మనకు స్వరాజ్యం వచ్చేదా! చెప్పవయ్యా చెప్పు?'' కనకయ్యకు వేడెక్కింది.

''ఆ! తెచ్చారు! తెచ్చేంజేశారంట ఆ సోరాజ్జాన్ని?''

''ఏం జేశారా? ప్రజకిచ్చారు. మన కిచ్చారు.''

''నీకిచ్చారేమో? నాకేం ఇవ్వలేదు!'' సాంబయ్య తుపుక్కున ఊసి చుట్ట మంచం కోటిమీద రాశాడు.

ఇది తెలిసిన మేళాంకాదు. తెలియని మేళాంకాదు. అంతా అడ్డగోలు మనిషి. కనకయ్యకు చిర్రెత్తుకొచ్చింది.

''నాతోపాటు నీకూ ఇచ్చారుగా? ఓటు! వందెకరాల ఆసామి అయినా ఒకటే ఓటు. సెంటు భూమి లేనివాడికీ ఒకటే! ప్రజలందరికీ తలా ఒక ఓటు ఇచ్చారు. ఐదేళ్ళ కొకమారు ఎలక్షను పెట్టి కావల్సినవాడ్ని ఎన్నుకునే హక్కు ఇచ్చారు. అదే ప్రజాస్వామ్యం అంటే. ఈ భూ ప్రపంచం మొత్తంమీద మనదే పెద్దది!''

''అంత పెద్దదయితే నిలవదు లేవయ్యా! గాలీవానొస్తే ముందు పడేది పెద్ద చెట్టే!''

''ఏందయ్యా నువ్వూ? బోడిగుండుకూ మోకాలికి ముడేస్తావూ?'' కనకయ్య చిరాకు పడిపోయాడు.

''ఆ ముడి పడే రోజొస్తే నువ్వూ నేను ఆపితే ఆగుద్దా? అదే పడతది?'' దూరంగా తాటితోపు వెనగ్గా కనిపించే కొండలకేసి చూస్తూ వేదాంతిలా అన్నాడు సాంబయ్య.

''పడ్డది! పడ్డది!'' కనకయ్య చేతులు తిప్పుతూ వెటకారంగా అన్నాడు.

మళ్ళీ ''అసలు నీ బోటోడికి ఓటివ్వడం బుద్ధి తక్కువనుకో!'' అన్నాడు కనకయ్య.

''అసలు ఇవ్వమని ఎవడేడ్చాడయ్యా? తీసుకోమనూ? తీసుకోమనూ?'' సాంబయ్య చేతికర్ర మంచం పట్టెమీద కొడ్తూ రంకెలు వేశాడు.

కనకయ్యకు వళ్ళు చల్లబడింది. తను పొరపాటు చేశాడు. మాట జారాడు. సాంబయ్య పోట్లఎద్దు లాంటివాడు. జవం ఉడిగినా పొగరణగలేదు. ఈ ముసలెద్దును బుజ్జగించి మళ్ళీ కాడికిందకు తీసుకు రావాల్సిందేగాని మరో పద్ధతిలో లొంగదు.

కనకయ్య తాపీగా ఆలోచించాడు. నోట్లో చుట్టబెట్టుకొని పీల్చాడు. పొగ రాలేదు. తిప్పి చూశాడు. ఆరిపోయివుంది.

''చేబోలు పుగాగంట? చేబొలు పొగాకు! అంతామోసమే! పొరుగూరుది తీసుకెళ్ళి ఆ ఊళ్ళో అమ్మతుట్టున్నారు పొందూరు ఖద్దరకు మల్లె!''

కనకయ్య సణుక్కొంటూ చుట్ట అవతల పారేసి మంచంమీద సర్దుకొని కూర్చున్నాడు. సాంబయ్యకేసి సాలోచనగా చూస్తూ మృదువుగా అన్నాడు.

''సాంబయ్యా గాందీగా రేమన్నారో తెలుసా?''

''తెలిస్తే ఇట్టా ఎందుకుంటానూ? నీలాగే ఉండేవాడ్ని''

. అదిగో మళ్ళీ పొడిచాడు! అనుకొన్నాడు కనకయ్య.

కాని ఈసారి సాంబయ్య నవ్వుతూనే అన్నాడు.

తన మాట ముందుకు సాగనియ్యడేం? సాంబయ్యకు ముక్కుతాడు. ఎలా వెయ్యాలీ?

కనకయ్యకు ఆలోచన తేలిరావటం లేదు

''గాంధీ గారేమన్నారేంటీ?'' దాదాపు చివరిదాకా కాలినచుట్టను చూసుకొంటూ, పారేయాలా వద్దా అన్న మీమాంసలోపడి అన్నాడు సాంబయ్య.

గాంధీగారేమన్నాడూ? ఇహ ఇట్టా పెతోడికీ చెప్పటం మొదలు పెట్టే అక్కడ ఎలక్షన్లు కాస్తా అయిపోతాయి. ఈ రకంగా తను ఎలక్షను ప్రచారం ఏం చేస్తాడూ? ఓట్లేం వేయిచుకొంటాడు? ఎవడైతే మాత్రం ఎట్లా గెలుస్తాడూ?

''ఏందో అన్నాడన్నావ్? మళ్ళీ బెల్లంకొట్టినరాయిలా మాట్లాడవేం కనకయ్యా?''

''గాంధీగారేమన్నారంటే ...?'' గుటకమింగి కనకయ్య మళ్ళీ మొదలు కొచ్చాడు.

''మనకు సొరాజ్యంవచ్చిన మొదటిరోజుల్లో అది ఢిల్లీ కోటలోనే ఉండిపోయిదనుకో! అప్పడు గాంధీగారు ఏమన్నారంటే... ఇట్టాకాదు. ఈ సొరాజ్యం

గ్రామాలకెళ్ళాలీ, గ్రామ సౌరాజ్యం రావాలీ అన్నారు. అప్పుడుగాని మనదేశం రామరాజ్యం కాదన్నారు. పల్లెటూళ్ళే దేశానికి ఆయువు పట్టన్నారు. నాయకులందర్నీ గ్రామసీమలమీద పడమన్నారు. అహోరాత్రాలూ జనం నిద్రాహారాలూ మాని పల్లెటూళ్ళను బాగుచేయమన్నారు. ఇకపోతే మన గాంధీగారు చెప్పినట్టు మన నాయకులు గ్రామాభివృద్ధి కోసం...పంటాయతీ రాజ్యాన్ని స్థాపించి..."

"అందుకేనా జనం పల్లెటూళ్ళు వదిలి పట్నాలకు ఎగబడుతున్నారూ?" మధ్యలో అందుకొని అన్నాడు సాంబయ్య.

కనకయ్య వేపకాయ కొరికినవాడిలా ముఖం పెట్టాడు.

"అద్గదీ పాయింటు సాంబయ్యా! ఏమోననుకున్నా సాంబయ్యా! నువ్వు అసలు కీలకం పట్టుకొన్నావనుకో! నువ్వు చెప్పినట్టు ప్రజలు పల్లెటూళ్ళు వదిలి బస్తీలమీద పడటం చూసి- ఇదిట్టా గాదని నెహ్రూగారేం చేసారంటే... పవరంతా పల్లెటూళ్ళకు బదలాయించే పథకం వేశారు. ఇహ ఆ తర్వాత మన శాస్త్రిగారైతే ఏమీ...మన ఇందిరమ్మ ఐతే ఏమీ...అధికారాన్ని సకేంద్ర...ఆహ్...వికేంద్రీకరణం చేసి మన గ్రామాలకు వప్పజెప్పేశారు. రైతుదగ్గిర్నుంచి రెడ్డిదాకా ఇప్పుడందరూ అదేపనిలో వున్నారనుకో."

"ఏదీ? అధికారం పంచుకొనే పనేనా?"

"ఉండవయ్యా దేముడా? మధ్యలో నువ్వు పుల్లవిరుపు మాటలెందుకు? నాకు కోపం వస్తుంది? ఆ ప్రకారంగా ఇప్పుడు గ్రామ పంచాయితీలద్వారా, సమితులద్వారా, జిల్లా పరిషత్తులద్వారా మన గ్రామాలను మనమే పాలించుకొనే అధికారం మనకొచ్చిందన్నమాట! మన గాంధీ మహాత్ముడు కన్నకలలు ఇప్పటికి పండాయి సాంబయ్యా!"

"ఆయన కలలు పండేసరికి ఇక్కడ పండించినవాడికి పంట దక్కటం లేదు. దున్నేవాడకి భూమి దొరకటంలేదు."

నుదుటి చెమట తుడుచుకుంటూ సాంబయ్యకేసి నోరు తెరుచుకొని చూశాడు కనకయ్య.

"తొందర పడమాక! మన స్వరాజ్యం ఇప్పుడిప్పుడే బందాడుతుంది. లేచి నిలబడనియ్! బతికి బట్ట కట్టనియ్?"

"ఏంది కనకయ్యా నువ్వు చెప్పేదీ? ఆ సౌరాజ్యమేదో నిన్నో మొన్నో వచ్చినట్టు మాట్లాడతావ్? అంత వయసొచ్చిన ఆడపిల్లయితే ఈపాటికి నలుగుర్ని కనేస్తుంది. మగాడయితే ఐదెకరాల కొండ్ర దున్నుతాడు. మహామహా నాయకులూ, ఇన్ని కోట్ల జనమూ కలిసి ఇన్నేళ్ళూ చేసేదేంటంటా? ఇంకా పారాడుతుందీ- బందాడుతుందీ- అంటావు నువ్వు? " సాంబయ్య చుట్టపీక అవతల పారేశాడు. మంచం కిందనుంచి దోసకాయ చెంబు తీసుకొని, ఎత్తి గటగటా నీళ్ళు తాగాడు.

ఈ సాంబయ్య కాలంవచ్చి చిక్కాడు కాని కాళ్ళు లేక చిక్కలేదు. మనసులోనే అనుకున్నాడు కనకయ్య.

''అది అట్టావుంచు! ఈసారి నేను నుంచుంటున్నా!''

''నువ్వా? నుంచుంటున్నావా? ఏందేందీ?'' సాంబయ్య చెంబు కింద పెట్టి ఆశ్చర్యంగా కనకయ్య ముఖంలోకి చూసాడు.

''ఏం? నేను నిలబడకూడదా?''

''ఎందుకు నిలబడకూడదూ? వెంకట్రామయ్యకంటే నువ్వు నాలుగాకులు ఎక్కువ చదివినోడివేగా? డబ్బూ ఉంది. నీకేం?''

''అది కాదు సాంబయ్యా! బోడి సర్‌పంచ్ కైతే నేనెందుకు నిలబడతానూ? మనకైతే సమితి ప్రెసిడెంట్ అయే అవకాశం ఉంది'' ఈసారన్నా మనం గట్టిపట్టు పట్టాలి. అందుకా వెంకట్రామయ్య చాల్డు! నువ్వయితే ఢంకామీద దెబ్బకొట్టి అవుతావని నన్నొత్తిడి చేస్తే 'సరే' అన్నా! అని మాటిచ్చా. జిల్లాలో ఎనిమిదో, తొమ్మితో సమితులు పట్టుకొన్నామంటే జిల్లాపరిషత్ చైర్మన్‌కూడా...ఏడుకొండలవాడు దయతలిస్తే మనూరికే వస్తది. జిల్లాపరిషత్ చైర్మన్ ఉంటే ప్రభుత్వము మన ఊళ్ళో ఉన్నట్టే. ఇక మంత్రులు మనచుట్టూ గింగిరాలు తిరగరూ?'' కనకయ్య లేచి అమాంతం గాలిలో తిరుగుతున్నట్లుగా కన్పించాడు సాంబయ్య కళ్ళకు.

సాంబయ్య తాగిన చెంబుడు మంచినీళ్లు ఆవిరైపోయినై. పెదవులు పొడారిపోయినై.

'కనకయ్యా! ఓరి కనకయ్యా! నువ్వెంతటి వాడివయ్యావురా!' సాంబయ్య మనసు మూలిగింది.

''ఇదంతా గాంధీగారు నీ కలలో కొచ్చి చెప్పాడా లేక నువ్వే ఆయన కలల్లోకి వెళ్తే...?''

''ఆపవయ్యా సాంబయ్యా! ఆపు! మనవడింటున్నాడు తాతయ్య పరిహాసం!''

తట్టనిండా కూరగాయలు కోసుకొస్తూన్న రవిని చూసి అన్నాడు కనకయ్య.

రవి తట్ట తాతయ్య ముందు దించి నిలబడ్డాడు.

సాంబయ్య తట్టలోకి పరిశీలనగా చూస్తూ ''బీరలు! బాగా లేత పిందెలు కూడా కోసినట్టున్నావేంరా రవీ?'' అన్నాడు.

''పురుగు పట్టింది తాతయ్యా! చెట్టు మాడిపోతుంది.'' అని కనకయ్యకేసి ఎగాదిగా చూశాడు రవి.

''సాంబయ్యా నీకేమయినా మతుందా? ఆ రామనాథబాబుతో పంపిస్తే హాయిగా చదువుకొంటూ పట్నంలో రాజాలాగా బతికే కుర్రాడ్ని ఈవజాన మట్టి మీద పొర్లిస్తున్నావ్? ఆ పన్లేమిటీ? ఆఁ? ఆ బట్టలేమిటీ?''

అంటూ కనకయ్య జేబులో నుంచి పదిరూపాయల నోట్లకట్ట తీశాడు. ఐదు లెఖ్ఖ పెట్టి విడిగాతీసి ''ఒరే అబ్బయ్! ఇట్టారా?'' అని రవిని పిల్చాడు.

రవి తాతయ్యకేసి చూశాడు.

''నేనేం పరాయివాడ్ని కాదులేవోయ్!'' అంటూ కనకయ్య లేచి వెళ్ళి రవి చేతిలో బలవంతంగా ఏభై రూపాయలు పెట్టి అన్నాడు - ''పండక్కు బట్టలు

కుట్టించుకో. మీ తాతయ్య కివ్వబాక! ముడిమీదముడి వేసి దాచేస్తాడు."

"మరి నే వస్తా సాంబయ్యా! ఏడో తారీఖు ఎలక్షను. మాలపల్లెలో నరసిమ్మా, ఏసోబు కొడుకులకూ నీ మాటంటే గురి అనుకుంటా. ఆ రెండు కుటుంబాల ఓట్లకు నీదేపూచీ. ఒక్కటీ బీరుపోకుండా మనకే రావాలి. వస్తామరి!" కనకయ్య బయలుదేరాడు.

"కనకయ్యా ఆగు! ఆయన డబ్బు అవతల పారేయ్‌రా!" సాంబయ్య బుసలుకొడ్తూ అన్నాడు.

మరుక్షణంలో కనకయ్య కాళ్ళదగ్గిర నోట్లు విసిరేశాడు రవి.

"ఏవిటయ్యా నీ అహంకారం? ఏం చూసుకొని ఈ మిడిసిపాటు అఁ!"

"డబ్బిచ్చి ఓట్లు కొంటావా!"

"రామ రామ! కుర్రాణ్ణి చూస్తే మనసు కరిగి..."

"చాల్లే నీ గుంటనక్క వేషాలూ! నీ డబ్బుకు అమ్ముడుపోయే వాళ్లెవరూ లేరిక్కడ. పద! పద!"

"పోతా! పోతా! నీ దిబ్బమీద పందిరేసుకుందామని రాలేదులే! నువ్వెంతా? నీ బిసాదెంతా? బోడి ఓటు. ఎవడి క్కావాలి?"

"నాది బోడి ఓటూ నీది మంచి ఓటూ! అందరికీ సమానంగా ఇచ్చాడని ఇంతకు ముందేగా కూశావ్?"

"సాంబయ్యా? మాటలు తిన్నగా రానియ్!"

"బోడి ఓటంట? బోడి ఓటు! అదిచ్చినోణ్ణే అడగవోయ్‌పోయి! నా ముందెందుకు చిందులేస్తావోయ్?"

"ఓయ్ గియ్ అంటే పట్టానికి వెనకటి అల్లా టప్పా కనకయ్య ననుకున్నావేమో? చూస్తా! నీ అంతు చూస్తా!"

"ఏందోయ్ నువ్వు చూసేదీ? సాంబయ్య కర్ర తీసుకొని నిలబడ్డాడు."

"ఏం చూస్తానో-నువ్వే చూస్తావ్‌గా?" కనకయ్య ఎగిరెగిరిపడుతూ దిబ్బ దిగి అదే పోత పోయాడు.

"సూత్తాడంట సూత్తాడు! నీ ఉడతూపులకు బెదిరేవాళ్ళెవరూ లేరిక్కడ?" నిప్పులు కక్కాడు సాంబయ్య చూపుకందినంతవరకు కనకయ్యను చూస్తూ.

దృష్టిపథంలోనుంచి పోయిన కనకయ్య తిరిగి సాంబయ్య బుర్రలో కదిలాడు. ఒక కనకయ్య వంద కనకయ్యలై గుండెలు తొలిచేస్తున్నారు. రక్తాన్ని పీల్చేస్తున్నారు. కండల్ను తినేస్తున్నారు. ఎముకల్ని పట్టి కొరుకుతున్నారు. సాంబయ్య గుండెమీద చెయ్యిరుద్దుకుటూ కుక్కి మంచంలోకి జారి వాలి పోయాడు.

"తాతయ్యా!" ఆదుర్దాగా పిలుస్తూ తాతయ్యను పట్టుకొన్నాడు మనవడు. సాంబయ్య వళ్ళు చెమటలు పట్టిపోయింది.

నీరసంగా చూస్తూ మనవడ్ని మంచినీళ్ళు అడిగాడు. రవి తెచ్చిన నీళ్ళు తాగి, చెంబు తిరిగిస్తూ మనవడి కళ్ళల్లో చూస్తూ అడిగాడు.

''ఏమ్మిటా బాబూ! అలా అయిపోతావ్? నాకేం నేను బాగానే ఉన్నానా!''
మనవడి కళ్ళు తుడుచి చెంపలు నిమిరాడు.
''రవీ! ఎందుకురా అట్టా అధైర్యపడిపోతావ్? నాకేమయిందని? నాకేంరా నేను రాయిలా ఉన్నాను. లే! అన్నం తిందువుగాని!'' పాలిపోయిన సాంబయ్య పెదవుల మీదనుంచి చిరునవ్వులు జారి తెల్లటి మాసిన గడ్డంలో చిక్కుకుపోయినై.
''ఆకనకయ్యగాడ్ని తన్నాలనిపిస్తుంది తాతయ్యా? '' రవి ముఖం జేవురించి పోయింది. పెదవులు వణికిపోతున్నాయ్.
''ఓస్ వాడ్నా? నే నెప్పుడో తన్నానా?'' సాంబయ్య బిగ్గరగా నవ్వాడు.
''నిజంగానా తాతయ్యా?''
''ముల్లుగర్ర తిరగేసి ఆవజాన జబురుతుంటే ఇక చూడ్రా నాయాలా! గోచీ ఊడదీసుకొని బజార్నపడి అదే పరుగు! అదేపరుగు!''
''బ్రేవో! తాతయ్యా బ్రేవో!'' చప్పట్లుగొట్టూ కేకలువేశాడు మనవడు.
''తాతయ్యా! మళ్ళీ చెప్పు! మళ్ళీ చెప్పు!'' ఉత్కంఠతో అడిగాడు రవి.
''రాంమందిరందాటి, రచ్చ బండ దూకి ఒకటే పరుగనుకో! అట్టా పరుగెత్తి పరుగెత్తి కడాన మీ తాతయ్య ఇంట్లో జొరబడి దాక్కున్నాడు.''
''మళ్ళీ నీ ఇంటికే ఎందుకొచ్చాడూ? నువ్వే తంతూ ఉంటే?''
''అదేరా! బలరామయ్య ఇంటికెళ్ళి తలదాచుకొన్నాడు.''
''మరి మీ తాతయ్యంటావేం?''
అరే! తనేం చెప్పాడు? తనకు తెలియకుండానే అనేశాడు. తన పట్టుదల సడలిపోతుందా? తను మాత్రం మనసును ఇంకెంత కాలం తొక్కిపట్టగలడు.
''కనకయ్య పంచె ఊడదీసుకొని పరుగెత్తుతుంటే జనం నవ్వలేదా తాతయ్యా?'' రవి నోటికి చేతులడ్డం పెట్టుకొని నవ్వుతూ అడిగాడు.
''నవ్వా? కడుపులు చెక్కలయ్యేటట్లు నవ్వారుకదా బాబూ!''
సాంబయ్య విరగబడి నవ్వసాగాడు.
తాతయ్య నవ్వులో మనవడి నవ్వులు కలిసిపోయినై.
రవి పొట్ట చేత్తో పట్టుకొని మెలికలు తిరిగిపోతూ నవ్వసాగాడు.

## 69

''ఓరేయ్! రవీ ఇట్టా రారా!'' సాంబయ్య గావు కేక సెట్టాడు.
చేలో గడ్డ విరుస్తోన్న రవి తాతయ్య కేకవిని పరుగెత్తుకొచ్చాడు.
సాంబయ్య దున్నపోతు మెడపట్టెడవిప్పి, కాడిలేపి ఓ చేత్తో పట్టుకొని, రెండోచేత్తో దున్న సిగమారు పట్టుకొని గుంజుతూ వున్నాడు.
దమ్ము చేస్తోన్న దున్న బురదలోపడి లేచే ఓపికలేక సాంబయ్యకేసి నిస్సహాయంగా చూస్తూ వుంది.
''దాపటి దాని పట్టెడవిప్పు. ముందుకాడి దించుదాం. ఇదిట్టా లేచేట్టులేదు.''

కిందపడ్డ దున్న సిగమారుకింద వదిలేసి కాడి రెండుచేతుల్తో పైకెత్తుతూ అన్నాడు సాంబయ్య.

రవి బ్రెపడ్డ పట్టెడవిప్పి కాడికిందనుంచి తప్పించి భుజాలమీద కాడి ఆనించుకొని తాతయ్యకేసి చూశాడు.

"ఆఁ! అట్టా! చక్కగా దించు!"

తాతా మనవళ్ళు నాగలి దించి బురదలో ముట్టెదూర్చి నిశ్చింతగా పడుకొన్న ముసలిదున్న దగ్గిరకొచ్చారు.

"రవీ! నువ్వెనక్కుపోయి లేపు! నేనిటు చూస్తా!"

సాంబయ్య పిలమండలవరకూ దిగిపోతున్న నీటిలో కరిగిపోతున్న మట్టి గడ్డలమీద పాదాలు దృఢంగా ఆనించి దున్న మీదకు వంగాడు. దానిమెడ కిందగా చేతులు పోనిచ్చి మనవడికేసి చూసి తలెగరేశాడు.

బురదనీటిలో వున్న దున్నపోతు తోక మలుగుల దగ్గిర రెండు చేతుల్తో బలంగా పట్టుకొని "రెడీ? తాతయ్యా!" అన్నాడు రవి.

"రడీ! పట్టు! ఊఁ! లేపు!" సాంబయ్య పళ్ళు బిగించి దున్నమెడ పట్టుకొని పైకి ఎత్తుతూంటే, రవి దున్నతోక మెలిపెట్టి పైకి గుంజసాగాడు.

"ఏహేయ్! లే ! లే!"

తాతా మనవళ్ల పిలుపులు ముసలిదున్న ఆలకించింది. కదిలింది. ముందు కాళ్ల మీద మోకాల్తుండా వేసి, వెనక్కాళ్ళ గిట్టల పట్టుకోసం బురదలో వెతికింది. తాతా మనవళ్లు ముఖాలు వికసించాయి.

"అదే పట్టు! వదలమాక! అహేయ్! లే! లే!" సాంబయ్య దున్న మెడకిందకు భుజం పోనిచ్చి కొమ్ములు పట్టుకొని అదిలించసాగాడు.

రవి వెనక్కు విరగబడి పట్టినపట్టు విడవకుండా గుంజుతోన్నాడు. దున్న పోతు మళ్లీ ఒక ఊపు తెచ్చుకొంది. సగానికి పైగా లేచింది. ఇంకొక ఊపు... ధడేల్న పడింది!

అంతదూరం బురద నీళ్లు చిమ్మాయి! సాంబయ్య చేతులు పట్టు తప్పాయి. గుండె మీద దున్న కొమ్ములు వొరుచుకున్నాయి. గూటి ఎముక జవజవలాడింది. రవి చేతుల్లోనుంచి తోక జారి బురద నీళ్ళు ముఖంమీద చిమ్మాయి. దున్న పడిన చోట రేగడినేల కుంగిపోయింది.

ఈసారి దున్న అడ్డం పడ్డది. కాళ్ళు నిగడతన్నింది. ముక్కోళ్ళలోనుంచి తెల్లటి నురుగు బురద నీటిలో కలిసి బయటికి చిమ్మింది. తెరిచిఉన్న నోట్లోకి బురదనీరు పోయి మళ్ళీ బయటికొస్తూంది.

మనవడు తాతయ్యకేసి చూశాడు! తాత దున్న కేసి చూశాడు! దున్న ఆకాశంకేసి చూసింది!

దాని రెండో కన్ను నిశ్చలంగా భూమినే చూస్తూ ఉండిపోయింది.

"రవీ నువ్విక్కడేవుండు! నేను మాదిగాడ్ని పిలుచుకొస్తా!" సాంబయ్య మాదిగ పల్లెకు బయలుదేరాడు.

## 70

''ఏడేంటిరా? తొమ్మిదన్నా ఇయ్యి!''

''అంతకంటే ఇచ్చుకోలేనయ్యగారూ! దున్న కురచది!''

''ఏవంత కురచదంటా? అయితే ఎనిమిది కట్టుకో!''

''ముసల్ది అయ్యగారూ! ముడతలు పడిపోయింది. తోలు తేలిరాదయ్యా!''

''ఆఁ! నీ మాటలకేంగానీ, ఎనిమిది గట్టితీసుకో!''

''ఇంకో అర్ధవేసుకోండి. ఏడున్నరకు ఖాయంచెయ్యండిదొరా!'' పిచ్చి గాడు కత్తి తిరగేసి వీపు గోక్కుంటూ అన్నాడు.

''అట్టాగే కానియ్! ఒరేయ్ పిచ్చిగా! మా వాడికి మంచి చెప్పులు కుట్టివ్వాలిరా!''

''మనవడి గోరికా? అట్టాగేదొరా? చరమం వలవగానే ఊరేసి బాగుచేసి కుట్టిస్తా దొరా!''

''తాళాతోళీగా కుట్టమాక! బాగావుండాలి. కిర్రూ కుచ్చులూ పసందుగా వుండాలి.''

''ఉప్పుడోరూ కుర్రకారు అట్టాకుట్టించు కోటంలేదు బాబయ్యా! అంతా బత్తీ పద్దతే!''

''మరట్టా నీ చేతేమవుతుందిరా?''

''ఏం దొరోయ్? తీసేత్తన్నారు? ఆళ్ళకంటే సోగ్గా కుడ్తా! ఆళ్ళయి ఆర్నెల్లయితే నాయి ఆరేళ్ళుఉంటయ్ దొరా! మీరే సూత్తారుగా? అబ్బాయిగార్ని పిలవండి ఆది తీసుకుంటా!''

పిచ్చిగాడివెంట వచ్చిన మనుషులు దున్నకాళ్ళు కలిపి మోకులు కడ్తుండగా పిచ్చిగాడు రవి కాలి ఆది తీసుకొన్నాడు.

ఆ రాత్రి రవి అన్నం తినకుండా దిగులుగా కూర్చున్నాడు.

''ఏరా బాబూ? అట్టా ఉన్నావ్? దున్నపోయిందని దిగులు పెట్టుకొన్నావా ఏందీ? ఈ ఏడెట్టాగో కష్టపడ్డాం. మన రెక్కలకష్టం అక్కరకొస్తే వచ్చే ఏడు మొనగాడి దున్నలు కొందాం. రెండెకరాల పంటమీద ఆమ్మాత్రం కొనలేమా? ఏం? లే! అన్నం తిను!''

''హౌ క్రూయల్ యూ ఆర్? తాతయ్యా?''

''ఏంటిరా? ఏంటిరా?''

''నువ్వు చాలా దుర్మార్గుడివి తాతయ్యా! చాలా చెడ్డవాడివి తాతయ్యా?''

తాతా మనవళ్ళ మధ్య నిశ్శబ్దం ఆవరించింది.

ఈదురుగాలికి పాక వాసానికి కట్టిన లాంతరు గుప్పుగుప్పున ఎగసి పొగలు కమ్ముతూంది.

ఎంతసేపటికీ తాతయ్య మాట్లాడకపోయేసరికి రవికి భయం వేసింది.

తాతయ్యకు ఎంత కోపం వచ్చిందో?

బిక్క మొహంవేసి తప్పు చేసినవాడిలా తాతయ్యకేసి తలతిప్పి చూశాడు.

తాతాయ్య ముఖంలో కోపం కన్పించలేదు. అదోలా వింతగా తనలో తనే నవ్వుకొంటున్నాడు.

''ఒరే రవీ! ఇట్టాంటి దెబ్బలెన్నో తిన్నానురా! నా గుండె మొద్దుబారి పోయిందిరా! నా కన్నబిడ్డ నాకు దూరం అయినప్పుడే నా గుండె పాషాణం అయిందిరా! మనుషులు పోతేనే నా కళ్ళవెంట నీరు రేలేదు. ఇక దున్నపోతొక లెఖ్ఖటరా?''

''అమ్మ చచ్చిపోయింది. నాన్న పోయాడు. దున్నపోతు కూడా చచ్చిపోయింది. తాతయ్య నువ్వుకూడా...?'' రవి తాతయ్యను వాటేసుకొని తాతయ్య వొడిలో తల దాచుకొన్నాడు.

''పుట్టిన వాళ్ళందరూ ఎప్పుడో ఒకప్పుడు చచ్చిపోయేవాళ్ళేరా! అసలు మనం పుట్టింది ఏడవటానికంటరా? బతకటానికిరా! బతకటానికి. బతికినన్నాళ్ళూ మగసిరిగా బతకాలి! ఒకళ్ళను 'దేహీ' అంటూ అడక్కూడదు. అడ్డంవచ్చిన వాటిని నరుక్కుంటూ వెళ్ళాలి! చేతగాని వాడే ఏడుస్తాడు. చేతుల్లో సత్తువ వున్న వాడెవడూ ఏడవకూడదు. సంతోషంగా బతకాలి! మనిషికి సంతోషం ఎక్కడుందటావా? కష్టపడి పని చెయ్యటంలో ఉంది. చెమటోడ్చి భూమి దున్నటోంలో వుంది. రెక్కల కష్టం అక్కరకు రావటంలో ఉంది. మన కష్టార్జితం మన చేతుల్లో కొచ్చినప్పుడు ఉండే ఆనందంలాంటిది ఈ భూమ్మీదే మరొకటి లేదురా బాబూ!''

''తాతయ్యా?'' రవి కళ్ళు తడుచుకొని తాత కళ్ళల్లోకి చూశాడు.

రయ్యిన వీచేగాలికి లాంతరు ఊగుతూ గప్‌గప్‌న ఎగిరి మండిపోతూ పాకంతా వెలుగు నిస్తోంది!

''తాతయ్యా నువ్వేడుస్తున్నా వెందుకూ?''

''నేనా? ఏడవటమా? లేదే?''

''మరి ఆ కన్నీళ్ళెందుకూ?''

''సంతోషంరా! సంతోషం!''

''సంతోషం కలిగితే కన్నీళ్ళొస్తయ్యా తాతయ్యా?''

''ఆఁ! వస్తయ్‌రా! వస్తయ్! ఏడుస్తూ వదిలిన కన్నీళ్ళు నేలమీద పడితే భూదేవి సిగ్గుపడుతుందిరా! బాధతో కుమిలిపోతుంది. ఆనందంతో వచ్చిన కన్నీరు భూమిని తాకితే భూమాత పులకరించిపోతుంది. కన్నతల్లి కడుపు పండుతుంది! ఆ తల్లి అందుకోసమే ఎదురు చూస్తుంటుందిరా బాబూ! బిడ్డలకు తన సర్వస్వం ఇవ్వాలని తహతహలాడిపోతుంది. ఈ నేలా, ఈ గాలీ, ఈ ఆకాశం చమటోడ్చే వాడి సొత్తురా! అందల మెక్కినోడిది కాదురా!''

''తాతయ్యా? నేను ఇంకెప్పుడూ ఏడవను!''

''నాకూ తెలుసురా! నాకు తెలుసు. ఎందుకో చెప్పనా?''

''నాకూ తెలుసు? నేను నీ మనవడ్నేగా! అందుకని!''

సాంబయ్య మనవడ్ని గుండెలకు హత్తుకొన్నాడు.

''లే! అన్నం తిందాం!''

సాంబయ్య మనవడ్ని తీసుకొని తడికవారంగా వార్చిపెట్టిన అన్నపుకుండ దగ్గిరకొచ్చి కూర్చున్నాడు.

''ఈ రోజు నేను పెడ్తా తాతయ్యా అన్నం!'' అన్నాడు రవి.

ఎన్నేళ్లయిందో? ఒకళ్ళు పెట్టగా తిని తను!

''పెట్టరా బాబూ! పెట్టు!''

సాంబయ్య తన కంచం మనవడి ముందుంచాడు. రవి కుండమీద మూకుడు తీసి, తెడ్డుతో తాతయ్య పళ్లెంలో అన్నం పెట్టాడు.

అన్నం తిని లేచి సాంబయ్య చుట్ట చుట్టుకొంటూ, పక్కమీద దుప్పటి పరుస్తోన్న మనవడితో అన్నాడు.

''అట్టా పోవడం దాని అదృష్టమేరా రవీ! ఏ పనికీ పనికిరాని ముసలిగొడ్డు గతేమవుతుందో తెలుసా? దానికి దానా పెట్టరు. మిగతా గొడ్లతోపాటు మేత వెయ్యరు. ఎండయినా వానయినా చావిటి బయట కట్టెయ్యాల్సిందే? అది అట్టా రోజూ రోజూ చస్తుంది. కడకు ఇంకా ప్రాణం ఉండగానే మాదిగోడు కోసి చెప్పులు కుడ్తాడు. ఈబాధలేమీ లేకుండా మన దున్న దున్నుతూ దున్నుతూ కాడి మెడమీద వేసుకొనే పోయిందిరా! దాని ఋణం అది తీర్చుకొని హాయిగా కన్ను మూసింది. అదృష్టం అంటే దాందేరా! మనుషులకు కూడా రాదురా ఆ అదృష్టం!''

తాతయ్యా తను ఇంకా దున్నను గురించి బాధపడుతున్నాడను కొంటున్నాడేమో? తాతయ్య చెప్పాక తనకు దిగులు తీరింది. బెంగ పోయిందిగా? దుప్పటి పరచి పడుకొని తాతయ్య గురించే ఆలోచించసాగాడు రవి.

''తాతయ్య నీకు చదువురాదుగదా! ఇదంతా నువ్వెట్టా నేర్చుకొన్నావ్?''

మనవడి ప్రశ్న అర్జునుడు వేసిన నమస్కారబాణ ద్రోణాచార్యులవారి పాదాలముందు పడినట్టు తాతయ్య ముందు పడింది.

''నాకు చదువురాదనీ, బడికి వెళ్ళలేదనీ ఎవరు చెప్పారురా నీకు?''

లోలోపల నవ్వుకుంటూ తాతయ్య తిరిగి ప్రశ్నించాడు మనవడ్ని.

''నాకు తెలుసులే! అదికూడా ఒకళ్ళు చెప్పాలేంటీ?''

గిలిగింతలు పెట్టినట్టు నవ్వాడు రవి.

''ఒరేయ్ రవీ! వినరా మరి! ఈ నేల నా పలక. నాగలే నా బలపం. పొలమే నా బడి! భూమ్మీద దిద్దాను. రోజుకు ఒక్కొక్కమాట నాకు ఈ భూమే నేర్పింది. నా తల్లీ, దైవం, గురువూ ఈ భూమేరా రవీ! ఇప్పుడు చెప్పరా మనవడా? నీబడి గొప్పదో నాబడి గొప్పదో? నీచదువెక్కువో నాచదువెక్కువో?''

## 71

కార్తీకమాసం.

సందకాడ మొదలు పెట్టిన వాన నడిరాత్రయినా ఇంకా వదల్లేదు.

సాంబయ్య చుట్టపొగ వదుల్తూ, మెరుపుల్లో వర్షపు ధారల్ని చూస్తూ, పాక

మీద తాటాకులు వానకూ గాలికీ చేస్తున్న చప్పుళ్ళు వింటూ పాకలో కుక్కి మంచంలో దిగులుగా కూర్చొని ఆలోచిస్తున్నాడు.

ఏమిటో ఆ విలయం? కార్తీకమాసంలో ఇంత వర్షం ఎప్పుడన్నా ఉందాయ ఏదో శాస్త్రానికి నాలుగు చినుకులు పడటం కద్దు! కాని యీ వానేమిటి? పంట మీదున్న చేలు ఏమౌతాయి? వరి పాలుపోసుకొంటూ వుంది. కంకులు వంగి వాలితే ఇంకా పంటేం దక్కుద్ది? పాలు కారిపోయి తాలూ తప్పా రాలుద్ది! వరదేసి మురుక్కొట్టిందంటే పురుగు మ్మాత్రం పట్టదూ? యీ పట్టువదలకుండా తెల్లార్లూ కొట్టిందంటే ఇంకా ఏముంటుంది? నోటికాడ కూడు మట్టి పాలౌతుంది....

సాంబయ్య వదులుతున్న పొగ బయటికెళ్ళలేక పాకలోనే సుడులు తిరిగి పోతూంది. ఉరిమురిమి మెరిసినప్పుడల్లా పాకలోనే పొగమేఘాలు కనిపిస్తున్నాయి సాంబయ్యకు.

తనూ మనవడూ రెక్కలు ముక్కలు చేసుకొని, మూలుగుపిండి సాగుచేశారు. అర్ధాకలితో ఉండి పొలానికి ఎరువు తోలారు. గుడ్డా గోసీ చూసుకోకుండా విత్తనాలు కొని నారుపోశారు. నారు పెంచి నాటువేసారు. దున్న పోయింతర్వాత తనూ మనవడూ పశువులై పొలం దున్నారు. పారదమ్ముచేసి భూమిని పదును చేశారు. తన నడుములు పడిపోయినై. మనవడి చేతులు బొబ్బలెక్కినై. పైరు నవనవలాడుతూ ఏపుగా పెరిగింది. బాగా దుబ్బు చేసింది. నిండుగా గుత్తంగా కంకులు విడిచింది. ఒక్కవారం పదిరోజులాగితే వరి కోత కొచ్చేది. అమావాశ ఒకటీ రెండు రోజులుందనగా కోసి కుప్ప వేసేపని! పండగెళ్ళగానే కుప్ప నూర్పిళ్ళు చేసేపని!

ఎట్టా లేదన్నా రెండుపుట్ల ధాన్యం కళ్ళ జూసేవాడు. అదే మంచి భూమైతే తను చేసిన చాకిరికీ, పోషణకూ మూడు పుట్లకు తక్కువ పండేదికాదు. మూడేంటి? తన తూరుప్పొలం కాంతమ్మ మనవర్తిది - ఎకరం రెండు పుట్లురాల్చలా?

ఫెళ ఫెళా ఉరిమింది! సాంబయ్య కళ్ళు జిగేల్‌మన్నాయి. ఆ వెలుగులో మనవడి ముఖం మెరిసింది. సాంబయ్య లాంతరువత్తి పైకి తోసి మనవడికేసి చూశాడు. రవి ఆదమర్చి నిద్రపోతున్నాడు. వచ్చిన కొత్తలో ఇట్టావానపడితే ఎగిరిపడేవాడు. ఒకోసారయితే లేచి చుట్టేసుకొని వణికిపోయేవాడు.

ఫెళ ఫెళా! - మిన్ను విరిగి మీదపడ్డట్టయింది సాంబయ్యకు.

ఎక్కడో పిడుగు పడిందనుకొన్నాడు సాంబయ్య.

రవి కదిలి చలికి ముడుచుకొని పడుకొన్నాడు.

కప్పులోనుంచి నీటిబొట్లు జారి రవి నుదుటిమీద పడ్డాయి.

సాంబయ్య కుక్కి మంచం పక్కకులాగి, మనవడికి దుప్పటికప్పి లాంతరు వత్తి తగ్గించాడు. మనవడిపక్కన కూర్చుని మళ్ళీ చుట్ట నోట్లో పెట్టుకొని పీల్చాడు. వట్టి గాలీ, బూడిదా! తిప్పి చూసుకొన్నాడు. చప్పగా ఆరిపోయివుంది. అగ్గిపుల్లతీసి వెలిగించాడు. ముట్టుకోలేదు. మళ్ళీ కొడితే అగ్గిపుల్ల విరిగిపోయింది.

"నిప్పెట్టె దమ్ముకుంది!" అనుకొంటూ వంగి మంచం పక్కన లాంతరు తీసుకొని పైకెత్తి వత్తి పెద్దది చేశాడు. కొక్కి నొక్కి గ్లాసు పైకిలేపి చుట్టదూర్చాడు.

బర్నర్‌లో వున్న వత్తికి చుట్ట ఆనించి లోపలకు పీల్చాడు. వత్తి మంట గప్పు గప్పున చుట్టమీదకు వంగి వాలిపోతూ ఆరిపోయేట్టుగా అనిపించింది.

సాంబయ్య చుట్టకాల్చుకొని, వత్తి తగ్గించి లాంతరు మళ్ళీ కింద పెట్టాడు. చుట్ట కొస వేళ్ళతో వత్తుకుంటూ సాంబయ్య కళ్ళు చిట్లించుకొని బయటకు చూశాడు.

వర్షం తగ్గిందా? తగ్గినట్టే వుంది. పాక కప్పుమీద మోత అంతగాలేదు. బయటగాలీ, వాన మోతకూడా అంతగా విన్పించటంలేదు. చూరు కార్చే నీళ్ళ మోత కూడా క్రమంగా తగ్గిపోయింది.

సాంబయ్య చేతికర్ర తడుముకొని తీసుకొన్నాడు. కర్ర ఊతం వేసుకుంటూ పాక చూరుకింద నిలబడి బయటికి చెయ్యి పెట్టి చూశాడు. ఒక్క చినుక్కూడా పడటంలేదు. వాన వెలిసింది.

సాంబయ్య పాకలోనుంచి బయటికొచ్చాడు. తల పైకెత్తి ఆకాశం కేసి చూశాడు. తెలిమబ్బులు పరుగులు తీస్తున్నాయి. చుక్కలు మిణుకు మిణుకు మంటూ మబ్బుల్లో నుంచి తొంగి చూస్తున్నాయి. సాంబయ్య చూస్తుండగానే మబ్బులు విడి పోయినై ఆకాశం నిర్మలమైంది. సాంబయ్య మనసు తేలికపడింది. కాలి బొటన వేలితో నేలమీద గుచ్చి చూశాడు. దుక్కీ, దుక్కీన్నరకంటే ఎక్కువేం పడి వుండదు. అంతే అంతకుమించి లేదు. అయితే ఫర్వాలేదు. ఈ వాన ఏం చెయ్యదు! మానుకాయ యేమన్నా ఉంటే రాలిపోతుంది. అదీ మంచిదేలే. ఇక ఈ పట్టున ఆగితే పంట చెక్కుచెదరదు. మనవడి అదృష్టం! వాడి రెక్కల కష్టం. అక్కరకొచ్చింది. తనకు తెలుసు! వాడు వృద్ధిలోకి వస్తాడు! వాడు పట్టింది బంగారం అవుతుంది.

మురుక్కాలవ తెగితే వచ్చి చేలోకి పడ్తుంది. వర్షం తగ్గినమాత్రం లాభం ఏముంది? ఇంక పంట చేతికేమొస్తుంది? కొత్తకాలవకు దిగువున, మురుక్కాలవకూ కనకయ్య పొలానికీ మధ్య ఉన్న పల్లాలు మెరకలూ చదును చేసి సాగుచేశాడు. కనకయ్య చేలో నీళ్ళు పోవాలంటే పక్కనున్న మురుక్కాలవనుంచే పోవాలి. వెనకటి రోజుల్లో ఆ పొలం తన కింద వున్నప్పుడు మురుక్కాలవ సజావుగా వుండేది. చేలో గండికొట్టి మురుక్కాలవలోకి పెడ్తే ఎంత వరదనీరున్నా అంతలోకే తీసేసేది. కాని ఇప్పుడు మురుక్కాలవ ఎక్కడికక్కడ మేటలు వేసిపోయింది. పాతిక ఇరవై ఏళ్ళుగా ఇంత మట్టి తీసినోడులేడు. గట్టిగా రెండు దుక్కులు కొట్టిందంటే మురుక్కాలవ ఎగతంతది. ఇంక కనకయ్య చేలో నీళ్ళు ఎట్లా పోతయ్? ఆ లెక్కన నీరు తియ్యా లంటే వారం పడ్తుంది. ఈ తరుణంలో వారం రోజులు అంత లోతున నీళ్ళుంటే పంటకు పంటా నష్టం, గడ్డికి గడ్డీ నష్టమవుతుంది. చప్పున ఆ మురుగు పోవాలంటే మురుక్కాలవగండి కొట్టాల్సిందే?-

ఆ ఊహలో సాంబయ్య గుండె గండి కొట్టినట్టయిపోయింది! అట్లా జరిగితే ఇంకేమన్నా వుందా? నిరుడు కనకయ్య తన చేనుకు దిగువున మురుక్కాలవ గండి కొట్టించాడు. కాబట్టే మురుగు దిగువన పడిపోయింది. అదేపని ఎగువన చేస్తే? ఎగువన మిగలదు. ఈ ఏడు కనకయ్య అంత పనీ చేయించగలడు. అసలే తన మీద కసిగా ఉన్నాడు. ఈపాటికి గండి కొట్టించాడేమో?

సాంబయ్య ఆలోచనలు ముందుకు సాగలేదు. మెదడు తిమ్మిరి పట్టిపోయింది. గబగబా తలగుడ్డ చుట్టుకొన్నాడు. పార భుజాన తగిలించుకొన్నాడు. కర్ర తీసుకొన్నాడు. నిద్రపోతున్న మనవడ్ని ఓసారి పరికించి చూసి పాకలోంచి బయటకొచ్చాడు. తలపైకెత్తి ఆకాశం అంతా కలయజూశాడు.

''గొరకొయ్యలు పొడిచినియ్యే!'' అనుకొంటూ దిబ్బ దిగాడు సాంబయ్య.

ఊరు మాటుమణిగి ఉంది. రచ్చబండల కింద పొడిచేటులో ఊరకుక్కలు ముడుచుకొని పడుకొని వున్నాయి. సాంబయ్య కర్ర మోతవిని ఓ కుక్కలేచి వళ్ళు విరుచుకొంది. ముట్టె పైకెత్తింది. అరవటానికి బద్ధకించి మళ్ళీ దించేసుకొంది. ఎవ రెట్టా పోతే నాకేం అన్నట్టు చలికి ముడుచుకొని రెండో కుక్కను ఆనుకొని పడుకొంది.

రామాలయం తలుపుల సందుల్లోనుంచి ప్రమిదదీపం వెలుగు మిణుకు మిణుకు మంటూ బయటికి కన్పిస్తోంది. ''ఎవరాపోయేది?'' అన్నట్టు శ్రీ రామచంద్రుడి పంచ లోహపు విగ్రహం గుడిముందుగా పోతున్న సాంబయ్యను చూస్తూంది. నూనె అయిపోయి కొడిగట్టి ఆరిపోవటానికి సిద్ధంగా వున్న జ్యోతిని చూడకుండా హనుమంతుడు రాములవారి పాదాల్నే చూస్తూ కూర్చున్నాడు. చాకలి వాడి మాటవిని భర్త తనను అనుమానించి నిప్పుల్లో దూకమన్న రోజు గుర్తు చేసుకొని తల్లి భూదేవిని స్మరించుకొంటున్నట్లుంది సీతమ్మ-

ఆ రోజు భూదేవి ఆదుకోకపోతే, తనను తల్లి కడుపులో దాచుకోకపోతే తన గతేంకాను? ఎంతైనా తల్లి తల్లే! అందులో తల్లులగన్న తల్లి భూదేవి ఆయమ్మ దారే వేరు?

సాంబయ్యకు రామాలయంలో శ్రీ రామనవమినాడు దేవుళ్ళ విగ్రహాలను చూచినప్పుడల్లా కలిగే ఊహలు రాత్రిపూట వంటరిగా గుడిముందు పోతున్నప్పుడు మాత్రం రాలేదు.

అందుకే శ్రీ రాముడు సాంబయ్యను పోల్చుకోలేక 'ఎవరాపోయేది?' అని వుంటాడు. కాని సాంబయ్య మనసు దేవుడిమీద లేదు.

అతని ఆలోచనలూ, భయాలూ, ఆశలూ, ఆవేదనా అన్నీ చేలో పడి వరిగున్న వరికంకుల మీదే లగ్నమై ఉన్నాయి. అతని హృదయ కవాటాలు పొంగివచ్చే వరదను ఆపలేక విరిగి కూలిపోతున్నాయి.

సాంబయ్య వడివడిగా అడుగులువేస్తూ చెరువుకట్ట దాటి మాగాటి గనెం మీద నడుస్తోన్నాడు -

* * *

ఈదురుగాలి పాకలోకి విసిరివిసిరి కొట్టింది. పొగచూరిన లాంతరు గుప్పున మండి ఆరిపోయింది. రవికి మెలకువ వచ్చింది. జారిపోయిన దుప్పటి లాక్కుంటూ ''తాతయ్యా!'' అని పిల్చాడు.

దుప్పటి కప్పుకొని మళ్ళీ ''తాతయ్యా!'' అన్నాడు.

రవి పక్కలో తడిమి చూశాడు. తాతయ్య లేడు. చివాల్న లేచి కూర్చున్నాడు. మంచం దిగి చీకట్లో పాకంతా వెతికాడు. పాక బయటికొచ్చి ''తాతయ్యా!''

అని బిగ్గరగా పిల్చాడు. చుక్కల మిణుకు మిణుకు వెలుగుల్లో దిబ్బంతా వెతికాడు.

తాతయ్య ఏమైనాడు? తాతయ్య ఎక్కడికి పోయాడు? ఇంత రాత్రిపూట చీకట్లో తనను వంటరిగా వదిలేసి తాతయ్య ఎక్కడికి పోయాడు? తాతయ్య ఎక్కడికి పోతాడూ? ఉంటే దిబ్బమీద లేకపోతే పొలాన! దిబ్బమీద లేడు.

''తాతయ్యా?'' రవి ఎలుగెత్తి అరుస్తూ దిబ్బ దిగాడు. డొంకనపడి పరిగెత్తాడు. ఊళ్ళో వీధుల్లో పరుగులు తీశాడు. చెరువుకట్ట దగ్గిర కొచ్చి ఆగి అలుపు తీర్చుకున్నాడు. చెరువులో కప్పలుచేసే ధ్వనులు భీతి కొలుపుతున్నాయి. కీచురాళ్ళ ఈలలు గుండెల్లో గుబులు రేకెత్తిస్తున్నాయి. మ్రిచెట్టు ఊడలు కొండ చిలువల్లా ఊగుతూ కనిపిస్తున్నాయి.

''తాతయ్యా!'' మళ్ళీ ఎలుగెత్తి అరిచాడు. ఒక్కక్షణం ఇలకోళ్ళు ఈలలు ఆపేశాయి. మరుక్షణంలోనే కీచురాళ్ళ ధ్వనులు రెట్టింపయ్యాయి.

రవి చెరువుగట్టు దిగి పొలాలకేసి పరిగెత్తసాగాడు. గనెం మీద కాళ్ళు జారుతున్నాయి. దూరదూరాల్లో కనిపించి అంతలోనే మాయమౌతున్న వెలుగులు గుండెల్లో గుబుళ్ళు రేపుతున్నాయి. చీకట్లో దారీ తెన్నూ తెలియటంలేదు. మాగాటి గట్లన్నీ ఒకటిగానే కన్పిస్తున్నాయి. గనెం ఎటు మళ్ళితే అటే పోతున్నాడు. కాలి కేదో మెత్తగా చల్లగా తగిలితే ఎగిరి గంతేశాడు! జెర్రిపోతు ఎగిరి నీళ్ళలోకి దూకింది. చెళ్ళున నీళ్ళమీద బాదినట్టయింది. నీళ్ళు చింది గనెంమీద పడ్డాయి. గుండెలు ఝల్లుమన్నాయి.

''తాతయ్యా?''

దిక్కులు ప్రతిధ్వనించాయి.

గట్టు తప్పిపోయాడు.

చేలకు అడ్డం పడ్డాడు.

బురదలో కూరుకుపోయిన కాళ్ళను ఎత్తెత్తివేస్తూ మోకాటిలోతు నీళ్ళల్లో పడి నడుస్తున్నాడు. ఎంత నడిచినా తరగటంలేదు.

తాతయ్య ఎక్కడా? తాతయ్య పొలం ఎక్కడా?

''ఓ తాతయ్యా?''

ఆ పిలుపుకు ఆకాశం వరిగింది. భూమి కంపించింది. శిలలు కరిగాయి. కాలం స్తంభించిపోయింది. ప్రకృతి ఊపిరి బిగబట్టింది!

''ర...ర...వీ...ఇటు...ఇటు...రా...రా!'' దూరంగా సన్నగా మూలుగు వినబడుతోంది.

అది తాతయ్య గొంతే! తాతయ్య ఇక్కడే వున్నాడు. తాతయ్య చేలోనే వున్నాడు. తన పిలుపు విన్నాడు. తనను రమ్మని పిలుస్తున్నాడు.

''తాతయ్యా! వస్తున్నా! వస్తున్నా! ఎక్కడా?'' తాతయ్య కంఠస్వరం వినిపించిన వైపుకు తిరిగి నడిచాడు.

దూరాన ఎత్తుగా కాలవకట్ట మసక మసగ్గా కన్పిస్తోంది.

ఇదే తాతయ్య పొలం! మరి తాతయ్యేడీ? తాతయ్యను పిలుస్తూ చేనంతా కలయతిరిగి మురుక్కాలవ దగ్గిర కొచ్చాడు.

మురుక్కాలవ గండికి అడ్డంగా పడి వున్నాడు సాంబయ్య తాత!

గండికి ఇరువైపులా బురదమట్టి ఎత్తుగా లేచి వుంది. మధ్య సాంబయ్య పడి వున్నాడు. మురుగునీరు సాంబయ్య ఛాతిమీదుగా పొంగి చేలోకి సన్నగా ప్రవహిస్తోంది.

రవికి గుండెలు అవిసిపోయిన్నై, తాతయ్య మీదకు వంగి చెయ్యి పట్టుకొని ఊపుతూ ''తాతయ్యా! ఇక్కడ పడుకొన్నావేంటీ?'' అన్నాడు.

''వచ్చావా బాబూ! నువ్వొస్తావని నాకు తెలుసురా?'' సాంబయ్య గొంతు ప్రవహిస్తున్న వరదనీటి 'గుడగుడ' లో కలిసిపోయింది.

''ఇదేమిటి తాతయ్యా ఇక్కడ పడుకొన్నావూ?''

''పడుకోలేదురా! పడిపోయాను! ఇంకా నయం తోవలోనే పడిపోలేదు ఈపాటికి మన చేనంతా మునిగిపోయేది. మురుగుదెబ్బకు పైరంతా నాశనం అయిపోయేది. ఆ కనకయ్యగాడు నేను అనుకున్నంత పనీ చేయించాడు. వాడి చేలో నీరు తొందరగా పోవటానికి ఈ మురుక్కాలవ గండీ కొట్టించాడు. గండీ ఎంత పెద్దది కొట్టించాడో చూడు! అదృష్టం బాగుండి ఈ బుద్ధి పుట్టి సమయానికి వచ్చానా! లేకపోతే ఇంకేమయినా దక్కేదా?''

''అది సరేలే తాతయ్యా! అసలు ఎట్లా పడ్డావంటే?''

''గండీ పూడుస్తూ కాలు పైకి వేశారా. జరున జారింది. పాత నొప్పి బయటపడింది. శీలమండ కలుక్కుమందీ! ఇక నావల్ల కాలా. 'దభీ' మని ఇరుసుకు పడిపోయ్యానా! ఝాము నుంచీ లేవటానికి ప్రయత్నిస్తున్నా. లేవలేక పోయ్యానా! తొంటి దగ్గర పట్టు చిక్కటంలా – జారిందో ఏమో?''

''తాతయ్యా!'' దిగాలు పడిపోయాడు మనవడు.

తాతయ్య జబ్బ రెండుచేతుల్తో పట్టుకొని లేపటానికి ప్రయత్నించాడు. బుడ బుడ నీళ్ళు తోసుకొని చేలో పడ్డాయి.

''అట్టా కాదులేరా రవీ! ముందా పార తీసుకొని కొంత మట్టి గండీ మీదకు విసురు. నీటి ఉరవడికి మట్టి కోసుకొని మొత్తం కొట్టుకు పోయేట్టుంది.''

''ముందు నువ్వు లేవాలిగా? నిన్నట్లా వుంచి మట్టి ఎట్లా వేసేది?''

''నేను లేస్తే నీటి ఉరవడిని నువ్వాపలేవు. నేను పూడ్చిన మట్టికూడా కొట్టుకు పోతుంది. పార తీసుకో! రెండు పక్కల్నుంచీ గండీ బిగించుకొంటూ రా!''

రవి పార తీసుకొని చేలో బురదా మట్టీ తీసి గండీలో వేసి పూడ్చసాగాడు.

గండి మధ్య పడుకొని సాంబయ్య నీటి ప్రవాహపు ఉధృతాన్ని ఆపుతూ మనవడికి గండీపూడ్చే మెలుకవలు చెప్తున్నారు.

మనవడు గండీపూడ్చి తాతయ్యకు ఊతం ఇచ్చి లేపి నిలబెట్టే సరికి తూర్పుదిక్కున అరుణరేఖలు పొటమరించాయి.

సాంబయ్య కుడిచెయ్యి మనవడి భుజంమీద మోపి ఎడంచేత్తో కర్రపోటీ వేస్తూ కాలవకట్టమీద అడుగులు వేసుకొంటూ నడవసాగాడు.

''ఒరే రవీ! అంత రాత్రిపూట చేలకు అడ్డం పడి చీకట్లో ఒక్కడివీ ఎట్లా వచ్చావురా? నీకు భయం వేయలేదంటరా?''

''చేలో గండికి అడ్డంపడి లేవలేక ఒంటరిగా ఉన్నప్పుడు నీకు భయం వెయ్యలేదా తాతయ్యా?''

''నువ్వొస్తావని నాకు తెలుసుగా?'' ముసిముసిగా నవ్వుకొన్నాడు సాంబయ్య.

''రాకపోతే?'' కొంటెగా కళ్ళు తిప్పాడు రవి.

''ఎందుకు రావూ! నా మనవడు నన్నొదిలి వుండలేడని నాకు తెలవదా ఏం?'' సాంబయ్య మనవడి భుజం మృదువుగా నొక్కాడు.

రాత్రి పడ్డప్పుడు తను ఇకలేచి భూమ్మీద నిలబడలేడనుకున్నాడు. ఏ ఎముకో ఇరిగిందనుకొన్నాడు. తొంటి జారిపోయిందనుకొన్నాడు. కాని అంత ప్రమాదమేమీ జరగలేదు. ఆసరావుంటే తను నడవగలడు కూడా. ఈరోజు గడిస్తే గానీ దీని అంతు ఏదో తేలదు.

''ఇకనుంచి నువ్వు పొలం వెళ్ళొద్దు తాతయ్యా?''

సాంబయ్య ఆగి మనవడి కళ్ళల్లోకి చూశాడు.

''నేనే వెళ్తా!''

సాంబయ్య నోరు తెరిచి తెల్లటి కనుబొమ్మల్ని ఎత్తి ఆశ్చర్యంగా చూశాడు.

''ఏం తాతయ్యా అట్లా చూస్తావూ? పొలం పని నేను చెయ్యలేనా? అరక కడ్తా. పొలం దున్నుతా. నాటు వేస్తా. కోత కోస్తా. నూర్చి పంట ఇంటికి తెస్తా. అంతేగా తాతయ్యా వ్యవసాయం అంటే?''

సాంబయ్య కళ్ళలో తరుణభాస్కరుని కిరణాలు ప్రతిఫలించాయి.

తాతా మనవళ్ళు ఊళ్ళోకి వచ్చేప్పటికి రెండు బారలు పొద్దెక్కింది.

రామాలయం దగ్గిర కొస్తుండగా పక్క వీధిలోకి తిరిగి పోతూన్న ఎంబాసిడర్ కొత్తకారు హఠాత్తుగా ఆగిపోయింది. డ్రైవర్ దిగి గబగబా సాంబయ్య వెనక నుంచి పరుగెత్తుకొచ్చాడు.

''ఏవయ్యోయ్! అయ్యగారు పిలుస్తున్నారు.'' డ్రైవర్ సాంబయ్య ముందుకొచ్చి, దూరంగా ఆగివున్న కారుకేసి చూపిస్తూ అన్నాడు.

''ఎవరా అయ్యగారూ?'' సాంబయ్య దీర్ఘం తీస్తూ అన్నాడు.

''ప్రెసిడెంటుగారు!''

''ఏ ప్రెసిడెంటూ? ఎవుడికి పెసిడెంటూ?''

''సమితి ప్రెసిడెంటు-కనకయ్యగారు. నిన్ను పిలుస్తున్నారు.''

సాంబయ్యకు జీవనాడులు తెగిపోతున్నాయ్. కనకయ్య కార్లో కూర్చుని తన్ను పిలిపిస్తున్నాడు. తన గడపలో కుక్క కాపలాకాసిన కనకయ్య కారు దిగడా? డ్రైవర్‌తో తనను కేక వేయిస్తాడా?

''ఏంటట్టా నిలబడ్తావూ? ప్రెసిడెంటుగారు పిలుస్తున్నారంటే? కారాగుంది!'' డ్రైవర్ చిరాకుపడ్తూ అన్నాడు.

''అంత అవసరముంటే ఆయన్నే దిగి రమ్మను. ఫో! పోయి చెప్పు!''

సాంబయ్య పెడసరితనానికి డ్రైవరు కంగారుపడ్డాడు. డ్రైవర్ తిరిగి కారు దగ్గిరకు పోబోతుండగా కనకయ్యే కారుదిగి రాసాగాడు.

పాందూరు ఖద్దరు పేటంచు పంచా, ఖాదీ సిల్కు లాల్చీ భుజం మీద మడత నలక్కుండా ఖద్దరు పైపంచా–వేసుకొని తనముందు నిలబడ్డ కనకయ్యను - ప్రెసిడెంటు కనకయ్యను సాంబయ్య ఎగాదిగా చూశాడు.

''ఏంటి సాంబయ్యా? నీదంతా రెటమతం అయిపోయిందే? ఆ కాలవ కింద బంజర్లో కాలు పెట్టొద్దయ్యా అంటే విన్నావా?''

''అయితే ఇప్పుడేమయిందంటా?''

''ఏమయిందా? పోనియ్ చేసుకొన్న వాడివి పట్టా అన్నా తెచ్చుకొన్నావా? అదీలేదు. నా బోటోడ్ని అడిగితే ఈపాటికి పట్టా ఇప్పించేవాడ్ని కదూ?''

''ఇప్పుడిప్పించరాదూ? నామీద అంత అభిమానం వున్న వాడివైతే?''

''ఇంకా ఇప్పుడేంటి ఇప్పించేది మట్టి! అంతా చెయ్యి దాటిపోతే? నా మాట అట్టుంచు! రెవెన్యూ మంత్రిగారు కూడా ఇప్పుడేం చెయ్యలేరు. తెలుసా?''

''ఇప్పుడు నిన్నుగానీ ఆ మంత్రినిగానీ నేనేం అడగటం లేదు లేవయ్యా! ఆడ బంజరు భూముంది. అందరూ సాగుచేసుకుంటున్నట్లే నేనూ చేసుకొంటున్నా. నా ముఖానే పొద్దు పొడిచిందా ఏంది?''

''ఆ భూమి రాజకీయ బాధితుడికి ఇచ్చేశారు.''

''బంజరు బాగు చేసింది నేను. భూమి దున్నుకుంటుంది నేను. సాగు చేసుకొంటున్నది నేనయితే రాజకీయం ఓడికెందుకయ్యా ఇస్తారూ? వాడేం చేశాడనీ?'' సాంబయ్య లోతుకుపోయిన కనిగుంటల్లో నిప్పు కణాలు కదిలాయి.

''అట్టా అడ్డగోలుగా మాట్టాడమాక! రాజకీయ బాధితుడంటే ఏమనుకున్నావ్? గోగాకులో పురుగులాగ కొట్టిపారేస్తున్నావ్? దేశానికి స్వరాజ్యం తెచ్చినవాడు. భారతాంబ సంకెళ్ళు తెగగొట్టినోడు! రాజకీయ బాధితుడంటే తెలుసా? గాంధీ గారు ఉప్పు తీసుకు రమ్మంటే తీసుకొచ్చారు నిప్పుల్లో దూకమంటే నిప్పుల్లో దూకారు. విదేశీ బట్టలు తగలబెట్టమంటే తగలబెట్టారు.''

''కల్లుకుండలు పగలకొట్టమంటే పగలకొట్టారు? ఆ! తెలుసులేవయ్యా పెద్ద చెప్పొచ్చావ్?''

''లాటీ దెబ్బలు తిన్నారు. జైళ్ళకెళ్ళారు. అప్పుడు వాళ్ళు సత్యాగ్రహాల్లో దూకి నిరాహార దీక్షలు చేస్తుంటే నువ్వు ఎద్దు ముడ్డి పొడుచుకొని భూమి దున్నుకుంటూ హాయిగా కూర్చున్నావుగా? ఇప్పుడొచ్చి 'భూమీ భూమీ' అంటే ఎట్టా వస్తది?'' కనకయ్య పేటంచు పైపంచ ఎగరేసుకొంటూ రుసరుసలాడిపోయాడు.

''అదంతా నాకెందుకయ్యా? ఇంతకీ ఈ భూమికోసం వాళ్ళేం చేశారో చెప్పవయ్యా! ఒక్కరాయి కదిలించారా? గుప్పెడు మట్టి పోశారా? ఒక్క చెమట బొట్టు కార్చారా?'' సాంబయ్య కనకయ్యను నిలదీసి అడిగాడు.

అప్పటికి రామాలయం అరుగులమీద కూర్చున్న వాళ్ళూ, దారే పోయే వాళ్ళూ పదిమందిదాకా చేరి చుట్టూ నిలబడ్డారు.

''ఏంటి సాంబయ్యా నీ ఎడ్డెం తెడ్డెం మాటలూ నువ్వూనూ? ఇట్టా అయితే

నువ్వీ జన్మలో బాగుపడవ్!" కనకయ్య సర్పంచ్ కేసి తిరిగి ''విన్నావుగా వీరయ్యా, ఈ సాంబయ్య వరస? కాలవకింద ఐదెకరాలూ మన ప్రభుత్వం రాజకీయ బాధితుడి కిచ్చిందంటే, ఈ మనిషెట్టా మాట్లాడుతున్నాడో విన్నావుగా?" అన్నాడు.

''కాలవకింద పొలమా? ఏ నంబరూ?" వీరయ్య ఆరాగా అడిగాడు.

''అదేనయ్యా మా పొలంకింద ఎల్లలేదూ? కాలవకూ నా పొలానికీ మధ్య ఉన్న పోరంబోక్!"

''ఎవరి కిచ్చారంటా?" పంచాయితీ బోర్డు నాల్గవ వార్డు మెంబరు సూరయ్య అడిగాడు.

''రెడ్డిపాలెం రామానందంగారి కిచ్చారు."

''ఎప్పుడంటా?" రెండోవార్డు మెంబరు అడిగాడు.

''ఇప్పుడేం? అప్పుడే ఏడాది కావస్తుంది? నాకు మొన్ననే తెలిసింది. అది వదిలేసి ఇంకెక్కడన్నా చూసుకుంటాడేమో పాపం అని చెప్తుతూంటే, చూడండయ్యా ఈ సాంబయ్య ఎట్లా మాట్లాడతాడో?"

''అది సరేగాని? మనూరికి కరెంటెప్పుడు తెప్పిస్తారూ?" సర్పంచ్ వీరయ్య అడిగాడు.

''శాంక్షన్ అయిపోయిందిగా? వచ్చేనెల్లో వేయించేస్తా!"

''మా గొందిలో తంబం పడేట్టు చూడండి పెసిడెంటుగారూ? మా గొందిలో వాళ్ళం యావన్మంది ఒక్కోటు బీరుపోకుండా మీకే ఏశాం మరి?"

''ఈఏడు ఎరువుల కోటా కొంచెం ముందెత్తున అందేట్టు చూడండి ప్రెసిడెంటుగారూ?" ఎరువులు నిలవలు చేసి బ్లాకులో అమ్మే రెండో వార్డు మెంబరు అన్నాడు.

''నిరుడు కోటా నాకిప్పిస్తామన్నారు! వట్టిదే అయింది. ఈ యేడు తప్పకుండా ఇప్పించాలండోయ్!" మూడోవార్డు మెంబరు సూరయ్య అన్నాడు.

''కనకయ్యగారూ! నా కొక ట్రాక్టరు ఇప్పించకూడదూ!" అన్నాడు రామసుబ్బయ్య.

''నీకెందుకయ్యా ట్రాక్టరూ? నీకంత వ్యవసాయం ఎక్కడుందీ?" అది తనకే రావాల్సినట్టు అన్నాడు రామకోటయ్య.

''బ్లాకులో అమ్ముకున్నా ఆరేడు వేలు వస్తుంది. వ్యవసాయమే చేయాలా ఏం?" అన్నాడు చంద్రమౌళి.

''ఎవడికందిందాడే? రారాపోదాం!" యువకుడు ప్రకాశం పంచ దులుపుకొని పక్కవాడ్ని పిలుచుకొని కాలు సాగించిపోయాడు.

అప్పటికే సాంబయ్య మనవడి భుజం మీద చెయ్యివేసి రామాలయం దాటి, రచ్చబండలు దాటిపోయాడు.

''బండిట్టా తీసుకురావోయ్!" కనకయ్య డ్రైవర్ని పురమాయించాడు.

ఇంకా మిగిలివున్న వాళ్ళను ఉద్దేశించి అన్నాడు – ''ఈరోజే హైదరాబాద్

పోతున్నా. ఛీఫ్ మినిష్టరుగారు వచ్చే నెల్లో మనూరొస్తున్నారు. మన గ్రామ పంచాయితీ కొత్త బిల్డింగ్‌కు శంకుస్థాపన ముఖ్యమంత్రిగారిచేత చేయిస్తున్నా. మనూళ్ళో ఏర్పాట్లన్నీ బ్రహ్మాండంగా జరగాలి. ఏం వీరయ్యా మరొస్తా!"

కనకయ్య కారెక్కాడు. కారు దుమ్ములేపుకుంటూ సాగిపోయింది.

''తాతయ్యా ఈ ప్రభుత్వం ఎవరిది?"

''ప్రజలదట!"

''ప్రజలంటే ఎవరూ?"

''మనమేనట?"

''ఈ భూమెవరిదీ?"

''ప్రభుత్వానిదట!"

''ప్రభుత్వమే మనదయితే ప్రభుత్వం భూమి మనదే కదా తాతయ్యా?"

''కాని కనకయ్య కాదంటున్నాడుగా?"

''అయితే కనకయ్యదా ప్రభుత్వం?"

-దిబ్బ ఎక్కించి పాకలోకి తీసుకెళుతూ ఆగి తాతయ్య కళ్ళల్లోకి చూస్తూ అడిగాడు మనవడు.

## (72)

వారం రోజులుగా సాంబయ్య మంచంలో పడి వున్నాడు. మగతలో పడినా సాంబయ్యకు మనవడిమీద మమత తీరలేదు. భూమ్మీద మమకారం అణగారిపోలేదు. ఏవేవో కలవరింతలు! పలవరింపులు!

''పొలం మీద ఓదెలు ఎట్లా ఉన్నాయోరా! సారపాదుకు నీళ్ళు పోశావా? పొట్లపిందెలకు రాళ్ళు కట్టావా? చిక్కుళ్ళు ముదిరిపోతున్నాయేమో? వంగలకు పురుగు పట్టిందేమో చూశావా? ఓదెలు కదిలించినట్టు ఏమయినా ఆనవాళ్ళున్నా యేమో చూశావా?"

మనవడు తాతయ్యకు సేవచేస్తూ అడిగిన ప్రశ్నలన్నింటికీ సంతృప్తికరమైన సమాధానాలు చెపుతూ ఉన్నాడు.

ఆరోజు ఉదయాన్నే లేస్తూ రవి తాతయ్య నొసటిమీద చెయ్యివేసి చూశాడు.

''తాతయ్యా! జ్వరం తగ్గిపోయింది. వళ్ళు చల్లగా వుంది." అన్నాడు రవి.

సాంబయ్య కళ్ళు తెరిచి రవికేసి చూశాడు. ఇన్ని రోజులుగా కన్పించే మగత లేదు. కళ్ళలో చురుకుతనం మిలమిలలాడింది. వళ్ళు చమటలుపోసి ఉంది. మనవడ్ని ఆసరా చేసుకొని లేచి కూర్చున్నాడు.

''పెద్ద కలొచ్చిందిరా! ఆ కలలోనే నా జబ్బంతా ఎగిరిపోయింది."

''ఏం కల తాతా?" మనవడి కళ్ళు మెరిశాయి.

''ఎన్నాళ్ళయింది బాబూ నేను మంచాన పడి?"

రవి వేళ్ళు మడిచి లెక్కచూసి ''ఇవ్వాల్టికి ఏడు." అన్నాడు.

''ఏడురోజులే? ఓదెలు ఎండిపోయి గింజ రాలిపోలేదంటావా?"

''లేదులే తాతయ్యా! నేల ఇంకా ఆరలేదు."

సాంబయ్య ముఖం వికసించింది. మనవడి తలమీద వేళ్ళు నిమురుతూ కళ్ళలోకి చూశాడు.

''ఇంకా నూకలున్నాయ్!''

''ఉన్నయ్ తాతా! ఇవ్వాళా రేపూ వస్తాయ్!''

సాంబయ్య నీరసంగా నవ్వాడు మనవడ్ని చూస్తూ.

''మళ్ళీ లేచి తిరుగుతాననుకోలేదురా! ఇంకా ఈ భూమ్మీద నాకు నూకలున్నాయ్ కామాలు! మళ్ళీ లేచి కూర్చోగలిగాను.''

''లాంగ్ లివ్ తాతయ్యా?''

''ఏమిటా బాబూ నువ్వన్నది?''

''నేనేం అనలేదుగా తాతయ్యా?''

''ఇప్పుడేదో లివ్వూ-లాంగూ-అన్నావుగా?''

తన మనసులో వున్న భావాలు పెదవులుదాటి వచ్చాయని అప్పుడుగాని అర్థంకాలేదు మనవడికి. చెదిరిపోతున్న చూపుల్ని నిలదొక్కి తాతయ్యను చూశాడు.

''నీకు చావు లేదు తాతయ్యా?''

సాంబయ్య తనువు అమృత ఝరిలో తడిసిపోయింది! మనవడు తనకు అమరత్వాన్ని ప్రసాదిస్తున్నాడు. వాడికి మించిన మనిషిలేడు. వాడికి మించిన దేవుడు లేడు బాలవాక్కు బ్రహ్మవాక్కు అన్నారు. కాని... కాని...

''వేరు తెగిన చెట్టు బతకదు. ఎండినకొమ్మ నిలవదు. రా రవీ!'' సాంబయ్య కళ్ళల్లో వెలుగూ, చీకటీ పోటీ పడ్డాయి.

మాటల కందని భావాలేవో సాంబయ్య ముఖంలో కన్పించాయి.

''చిరంజీవి! నా మనవడు చిరంజీవి!''

''ఏమిటి తాతయ్యా అంటున్నావూ?''

''నేనేమీ అనలేదే!''

సాంబయ్య తనలోకి తాను చూసుకున్నాడు.

''నా మనవడు చిరంజీవి అన్నావుగా?''

''అవును! నా మనవడు చిరంజీవి.'' సాంబయ్య మనవడ్ని దగ్గరకు తీసుకొని నిమిరాడు.

''తాతయ్యా నూకలున్నాయ్! జావ కాచుకొస్తావుండు?''

''ఉప్పు మరికాస్తవెయ్యి! వసిపడ్డ నోటికి బాగుంటుంది.''

మనవడు పొయ్యి ముందుకూర్చుని జావకాస్తుంటే కన్నార్పకుండా చూస్తూ కూర్చున్న సాంబయ్య హృదయం కుతకుత ఉడికిపోయింది.

వీడికి ఉయ్యాల కట్టినరోజు! ఎంత ఘనంగా జరిగింది? ఎన్ని వందల మంది వచ్చారూ? ఇంటిముందు ఎన్ని కార్లు ఆగినై. అధికార్లూ, షావుకార్లూ పెద్ద పెద్ద చదువులు చదివినోళ్ళు ఎంత మంది వచ్చారో? వాడికి ఎన్నో బహుమతులు తెచ్చారు. ఆ ఉయ్యాల తొట్టి ఒక్కటే రెండుపుట్ల ధాన్యం ఖరీదు చేస్తుంది. వాడికి తొడిగిన బట్టలూ, బంగారు మొలతాడూ - అట్టా తను పుట్టి బుద్దెరిగింతర్వాత

ఎవరికీ జరగటం చూడలేదు. ఆ రోజు తను వంగి ఉయ్యాల తొట్లోకి చూస్తూ వాడు తనవాడు కాదనుకొన్నాడు. వరూథిని కొడుకు, బలరామయ్య మనవడే అనుకొన్నాడు. వాడు తన చూపుడివేలు గుప్పెట్లో పట్టుకొని గుంజాడు. కళ్ళు నిలిపి తనకేసి చూశాడు. వాడప్పుడే తన తాతయ్యను గుర్తుపట్టాడు. కాని తనే గుర్తించలేదు. తనే మోసపోయాడు.

''తాతయ్యా! ఉడికిందా? చూడూ?'' మసిగుడ్డతో ఆవిర్లు కొడుతున్న కుండను పొయ్యిమీద నుంచి దించి సాంబయ్య ముందు పెట్టాడు.

సాంబయ్య గుండెలు పగిలిపోయాయి. ఏడు లంకణాల తర్వాత ఆకలి కూడా మర్చిపోయాడు. ఖిన్నుడై మనవడి కేసి చూసుకొన్నాడు.

మనవడు కాచి ఇచ్చిన జావతాగి సాంబయ్య మధ్యాహ్నానికి తేరుకొన్నాడు. చుట్ట వెలిగించుకొని పొగవదులుతూ క్రరపోటీ వేసుకొని కాలు పట్టి పట్టి వేస్తూ పాక బయటికొచ్చాడు. ఆకాశం, భూమీ, చెట్లూ, నీరూ, గాలీ, కొత్తగా వింతగా కన్పించాయి. ఇవి నిత్య నూతనం. వీటికి జరామరణాలు లేవు. నిత్యయౌవనం. సస్యశ్యామలం. వీటిని చూట్టానికే తను మళ్ళీ బ్రతికాడు. ఇవి ప్రాణదానం చేస్తాయి. మనిషికి పుష్టినిస్తాయి. సంతోషాన్నిస్తాయి. మనిషి వీటికోసమే బతుకుతాడు. అవి మనిషి కోసమే ఉన్నాయి. సాంబయ్య మనస్సు విహంగమై నీలి ఆకాశంలో - వెండి మబ్బుల్లో, చెట్ల పచ్చదనంలో, నీటి చల్లదనంలో, నేలమెట్టపల్లాల్లో రెక్కలు విప్పుకొని విహరించ సాగింది -

''తాతయ్యా! పడిపోతావ్! లోపలికి రా!'' మనవడొచ్చి తాతయ్యను పాకలోకి నడిపించుకెళ్ళి మంచం మీద కూర్చోపెట్టాడు.

''రవీ! నువ్వెళ్ళి ఎల్లమందకొడుకు నరశిమ్మని కేకేసుకురా! రేపు కట్టేత, ఓదెలు కట్టి కుప్పేద్దాం!''

''తాతయ్యా!''

''వాడూ నువ్వూ మోపులు కట్టి, మోస్తే నేను కుప్ప మీదుంటాను. పొద్దు వాటాలేసరికి కుప్పలేస్తుంది.''

''తాతయ్యా ఇంకా నువ్వు పొలం వస్తావా? కుప్పవేస్తావా?''

''ఆс! కుప్పవేస్తా! మళ్ళీ మాట్లాడితే కుప్పనూరుస్తా. చూస్తావుగా సాంబయ్య తాత తడాఖా?''

## 73

''ఏందబ్బాయిగారూ? అన్ని పనలేసి కడ్తున్నారూ? నువ్వేం మోస్తావంతంత మోపు? సూత్తే కూత్తంత లేవూ?'' నరశిమ్మ రెండు వాటాలు పైరు తీసి మిగతాది కట్టకట్టి రవి నెత్తిన పెట్టాడు.

మెడనరాలు బిగబట్టి తలమీది పంటకట్టను రెండు చేతుల్తో పట్టుకొని బయలుదేరాడు రవి. కాళ్ళ మీద తడినేలకుంగింది. రవి వెనకే చిన్న చిన్న అడుగుజాడలు

కన్పిస్తున్నాయి. మొదట తేలిగ్గా వున్న కట్ట రానురాను బరువుగా అనిపించసాగింది. ఇంకా పెద్దమోపే మోయగలనని మొదట అనుకొన్న రవికి, కుప్పదాకా మోసుకొచ్చేసరికి నెత్తిమీద బరువు తెలిసివచ్చింది.

పంట మోపును నెత్తిన పెట్టుకొని చేలో నడిచి వస్తోన్న మనవడ్ని చూసుకొన్న సాంబయ్య మేను పులకరించిపోయింది.

''అద్గట్టా రానియ్!'' సాంబయ్య మనవడు దించిన తొలిమోపు అందుకొని బొడ్డు కట్టాడు. నరశిమ్మ మోపుతెచ్చి దించాడు. రవి రెండో మోపుకోసం పరుగులుతీశాడు.

''మనవడు! మీకు మించిన చెయ్యే!'' నరశిమ్మ తలగుడ్డ బిగించుకొంటూ సాంబయ్యతో అన్నాడు.

సాంబయ్య నడిబొడ్డు కడ్తూ ముసిముసి నవ్వులు నవ్వుకొన్నాడు.

నరశిమ్మ వచ్చేసరికి రవి మరోమోపు బిగించి తనే నెత్తికెత్తుకోవటానికి ప్రయత్నం చేస్తున్నాడు.

పొద్దు చరచరా పైకి ఎక్కి వస్తోంది!

వరికుప్ప మోకాటెత్తున లేచింది

సాంబయ్య కుప్పమీద కూర్చొని మోపులందుకొని పరుస్తున్నాడు. చేతి కర్రతో అంచులు సర్దుతున్నాడు.

పొద్దు నెత్తిమీద కొచ్చింది.

వరికుప్ప నడం ఎత్తుకు లేచింది.

సాంబయ్య కుప్పతోపాటు పైకిలేస్తూ వున్నాడు.

పొద్దు తిరిగింది!

కింద మనవడు మోపులు మోస్తున్నాడు.

కుప్పమీద తాతయ్య ఎండకు మెరిసిపోతున్నాడు.

పైనుంచి కిందకు చూశాడు సాంబయ్య. నెత్తిమీద మోపు పెట్టుకొని వస్తోన్న రవి ఇంకా చిన్నగా కన్పించాడు.

''అబ్బాయిగారూ! ఈ మోపుతో ఆపండి. పొద్దు తిరిగిందిగా! బువ్వతిందాం!'' మోపి నెత్తినపెట్టి అన్నాడు నరశిమ్మ!

''నేను దిగితే మళ్ళీ ఎక్కలేనుగానీ నువ్వు తిని మిగిలింది పైకి అందించు. అక్కడే కూచుని తింటాలే!'' మనవడితో అన్నాడు సాంబయ్య.

''ముందు నువ్వు తిను! తాతయ్యా!'' రవి అన్నం మూట కుప్ప మీదకు విసిరేశాడు.

సాంబయ్య రెండు చేతుల్తో అన్నం మూట వడిసి పట్టుకొని ''పసివాడివి! ముందుగా నువ్వు తినాలిరా?'' అన్నాడు.

''ముసలాడివి! ముందు నువ్వే తినాలి తాతా!'' కింద నుంచి కేకవేశాడు రవి.

''అమ్మో! మనవడా? నీకెంత పలుకుందిరా?''

''నీకు లేదా ఏం?'' మాటకు మాట విసిరాడు మనవడు.

సాంబయ్య అన్నం మూట విప్పి ముద్ద కలిపి ఎత్తాడు.

''అయ్యగోరూ! అయ్యగోరూ! అమ్మగారికి నొప్పులొచ్చినై.''

''పిల్లా! పిల్లాడా?''

''ఇంకా పెసవం అవలేదు. అమ్మగోరు అల్లాడిపోతున్నారు. తొందరగా బయలుదేరండయ్యా!''

–లబలబలాడిపోతున్న రామి సాంబయ్య స్మృతిపథంలో పరుగులుతీసింది.

గడ్డిగూటిలో కూర్చుని తింటోన్న అన్నం ముద్దను గిన్నెలోకి వదిలేశాడు – దుర్గమ్మ కోసం–కాదు–తనకు పుట్టబోయే కొడుకుకోసమే! దుర్గమ్మ ప్రసవించింది. వెంకటపతి భూమ్మీద పడ్డాడు! ఆ వెంకటపతి కొడుకు రవి తనకు ముద్ద అందించాడు యీ నాడు.

''ఏం తాతా చూస్తున్నావ్? పచ్చట్లో కారం చాల్లేదా?'' కింద నుంచి కొంటెగా అడిగాడు మనవడు.

''ఉప్పెక్కువయిందిరా!''

''తినకుండా ఎట్టా తెలిసిందో తాతయ్యకు?''

''నా మనవడి సంగతి నాకు తెలియదేంటి?'' సాంబయ్య మనవణ్ని ఉడికిస్తూ అని ముద్ద నోట్లో పెట్టుకొన్నాడు.

పొద్దు వాలిపోతూంది!

కుప్ప మనవడి ఎత్తున లేచింది.

చేలో మూడొంతులకు పైగా పైరు కుప్పమీదకు చేరింది.

సాంబయ్య పళ్ళు బిగించి లేనిఓపిక తెచ్చుకొని వరికట్టలు అందుకొని కుప్ప మీద పరుస్తున్నాడు. వంగని కాలు నిగడతన్ని కుప్పమీద చతికిలబడి కూర్చున్నాడు.

కళ్ళమీద అరచేయి అచ్ఛాదనగా పెట్టుకొని పొద్దుకేసి చూశాడు సాంబయ్య. తల దించి పొలం అంతా కలయజూశాడు. నెత్తిన వరిమోపు పెట్టుకొని వస్తూన్న రవి ఇంకా మరీ చిన్న వాడిగా కన్పించాడు కుప్పమీద కూర్చున్న సాంబయ్యకు. మనవడు మోసుకొస్తున్న మోపు చివర్న వరి కంకులు ఊగుతూ పడమటి ఎండకు మెరిసిపోతున్నాయి! బంగారువన్నె లీనుతోన్న ధాన్యపు గింజలు సాంబయ్య హృదయంలో కోటితారకలై మెరిశాయి.

పైరు ఏపుగానే పెరిగింది. కంకి సడింపుగానే ఉంది. కుప్పకూడా తేలివచ్చింది. ఎట్లా లేదన్నా రెండు పుట్లకు తక్కువ రాలదు. ధాన్యం ధరా పైకొమ్మమీదే ఉంది. వచ్చే ఏడు మాంచి దున్నపోతుల్ని కొనొచ్చు. ఎద్దులయితే ఎగవనున్న రెండెకరాల బంజరు కూడా సాగు చెయ్యొచ్చు. నాలుగేళ్ళు ఇట్లాగే కష్టపడితే రెండెకరాల శేరీ మాగాణి కొనొచ్చు. అమ్ముకుపోయే వాళ్ళు చాలా మంది ఉన్నారు. ఆ కనకయ్య మాత్రం ఎంతకాలం వ్యవసాయం ఏడుస్తాడూ? సొంత వ్యవసాయం ఏం చేస్తాడూ? ఆళ్ళెవళ్ళో చెయ్యాల్సిందేగా? వెంకటపతి పుటకలకు ఆ కనకయ్యకు 'నాది' అంటూ

సెంటు భూమిలేదు. తనకు మాత్రం ఏమంత ఉంది? వెంకటపతి పెళ్ళి నాటికి తనెంత సంపాదించాడు? డెబ్బై ఎకరాల మాగాణీ, దొడ్డి దోవలూ, మెట్ట పొలమూ, కలిసి రావాలేగాని కష్టపడే వాడికి ఎన్నేళ్ళుపడుతుంది? తనలాగే తన మనవడూ కష్టజీవి. తనకంటే వాడికి తెలివితేటలూ ఎక్కువే. లెఖ్ఖాష్టతం తెలుసు. వాడూ తనంతటి వాడౌతాడు. తనకంటే ఎక్కువ భూమినే సంపాదిస్తాడు. వాడి పెళ్ళినాటికి ఎంత లేదన్నా పదెకరాల ఆసామీ అవుతాడు. వాడు తనకొడుక్కి వెంకటపతికి తను ఇచ్చిందానికంటే ఎక్కువ ఇస్తాడు. ఆ శక్తి వాడిచేతుల్లో వుంది.

మనవడు వాడి తండ్రి పోగొట్టిన భూమి సంపాదిస్తాడు. కనకయ్య మనవడు తన మనవడి కాళ్ళదగ్గిర కొచ్చేరోజూ వస్తుంది.

సాంబయ్య దృష్టి సారించి చుట్టూవున్న పొలాలను చూడసాగాడు.

చేలల్లో మధ్య మధ్య వున్న గట్లన్నీ తెగిపోతున్నాయి. చూపు ఆనినంత వరకూ ఆ భూమంతా ఏకఖండంగా కన్పిస్తోంది. వందలకొద్దీ కూలీలు పని చేస్తున్నారు. ఎన్నో నాగళ్ళూ, ఎన్నో కొడవళ్ళూ-పారలూ-ఎన్నో చేతులూ- అందరికంటే ముందు నిలబడి వున్నాడు తన మనవడు.

వందలకొద్దీ వరిమోపులు వచ్చి పడుతున్నై. కుప్ప వేగంగా పైకి లేస్తోంది. ఇంకా ఇంకా పెరుగుతోంది. దానిమీద కూర్చున్న తను ఇంకా పైకి పోతున్నాడు. ఆకాశాన్ని అందుకొంటున్నాడు. చుక్కల్ని తాకుతున్నాడు. కింద భూమి నవ్వుతోంది. పలకరిస్తోంది -

"ఏమిటి తాతయ్యా పైకి చూస్తున్నావ్? ఆకాశాన్ని అందుకుంటావా ఏం?"

"అవున్రా మనవడా! ఆకాశాన్నందుకొంటా. దిక్కులకు వంతెన కడ్తా. నేలంతా సొంతం చేసుకొంటా. నీలాంటి మనవడుంటే నేనేదయినా చెయ్యగలనురా! ఏదయినా చెయ్యగలనురా."

"ముందీ మోపందుకో!" మనవడు నెత్తిమీద మోపు తాతయ్యకు అందించాడు.

వంతెనమీద ఒక కారూ జీపూ వచ్చి ఆగినై. సాంబయ్య త్రుళ్లిపడ్డాడు! విశ్వాసంతరాళాల్లోకి ఎగిరిన మనసు తిరిగి భూమ్మీద కొచ్చింది. నెత్తిమీద తెల్లటి కొంగలు బారులు కట్టి పోతున్నాయి. ఉలిపి పిట్టలు గుంపులు గుంపులుగా చేలల్లో వాలి మళ్ళీ లేస్తున్నాయి.

మనవడి నెత్తిమీద పంట మోపు అందుకొంటున్న సాంబయ్య చేతికి పట్టు దొరకటంలేదు.

"ఎవరా వచ్చేదీ?" దృష్టి నిలిపి తేరిపార చూశాడు సాంబయ్య.

కాలవదిగి వస్తోన్నారు ఖద్దరు తెల్లపంచలవాళ్ళు ముందు నడుస్తున్నారు. వాళ్ళ వెనగ్గా ఐదారు ఎర్రబుట్టలు కన్పిస్తున్నాయి. వాటి ముందు ఖాకీ యూనిఫారమూ, క్రాస్ బెల్టూ ఠీవిగ నడిచి వస్తోంది.

ఎవరదీ! ఎవరదీ? సందేహంలేదు. వాడే కనకయ్య! ప్రెసిడెంటు కనకయ్య. అతని పక్కన వచ్చేదెవరూ? తనెప్పుడూ చూళ్ళేదే? ఈ ఊరివాడు కాదు. సన్నగా

బక్కగా వున్నాడు. మోకాళ్ళు దిగని పంచె. వంటిన చొక్కాలేదు. ఉత్తరీయం కప్పుకొని వున్నాడు. చేతులో గుడ్డ సంచి నెత్తిన తెల్లటి టోపీ. గాంధీగారల్లేనే ఉన్నాడు. అచ్చు అపరగాంధీలా ఉన్నాడే? గాంధీగారు టోపీ పెట్టేవాడా? లేదే? మరీయన పెట్టుకొన్నాడేం? గాంధీగారు ఈళ్ళందర్నీ టోపీలు పెట్టుకోమని మరి తనెందుకు పెట్టుకోలేదు? ఈళ్ళే గాంధీగారి పేరు చెప్పుకొని తమ నెత్తిన టోపీలు పెట్టుకుంటున్నారేమో? ఆ కనకయ్య వెంటబడి ఎందుకొస్తున్నాడూ? తన పొలంకేసే వస్తున్నారేం? తన చేలో కాలు పెట్టారు. కనకయ్య చెయ్యి తిప్పుతూ తన భూమంతా చూపిస్తున్నాడు. ఆయన టోపీ సర్దుకొంటూ తల ఆడిస్తున్నాడు. భూమికేసి చూస్తోన్నాడు. అతనెవరూ? కుప్ప దగ్గరకొచ్చాడు.

సాంబయ్యకు కళ్ళు బైర్లు కమ్ముకొని వస్తున్నాయి!

అయితే కనకయ్య చెప్పింది నిజమేనా?

ఆ వచ్చింది రామరాజ్యమేనా? కాదే-రామ-రామ ఆ-రామానందం-రాజకీయ బాధితుడు! రాజకీయంలో బాధలుపడినోడు. రెడ్డిపాలెం రామానందం. ప్రెసిడెంటు కనకయ్యతో వచ్చాడు. పోలీసు బలగంతో వచ్చాడు. ఈ భూమి కోసం వచ్చాడు. ఈ భూమి తనది కాదా? ఈ పంట తనది కాదా?

భూమీ ఆకాశమూ కలిసిపోతున్నాయి. చెట్లూ చేలూ తిరిగిపోతున్నాయి. నరాలు తెగిపోతున్నాయి. గుండె విచ్చిపోతోంది-

"ఈనేల నాది! ఈ పంట నాది. ఈ భూమి..." అతని కంఠ స్వరం విడిచిన గాలి విశ్వవ్యాపితమైంది.

సాంబయ్య భూమ్మీద పడ్డాడు!

దిక్కులు ప్రతిధ్వనించాయి. చెట్లూ ఊగాయి. భూమి కంపించింది.

"తాతయ్యా?" మనవడి నెత్తిమీద పంటమోపు కిందకు జారింది.

మొదలు నరికిన చెట్టులా, చిత్తడి రేగడి నేలమీద బోర్లాపడి వున్న తాతయ్య దగ్గరకు దూకు దూకాడు.

నరశిమ్మ మోపు కింద పారేసి పరుగెత్తు కొచ్చాడు. సాంబయ్య ముఖం మట్టిలో కూరుకొని వుంది.

బాహువులు బార్లాగా చాపి భూమ్మీద ఆని వున్నాయి. పిడికిళ్ళు బిగించుకొని ఉన్నాయి. కాలివేళ్ళు భూమిలోకి గుచ్చుకొని వున్నాయి.

రవి, నరశిమ్మ సాయంతో సాంబయ్యను వెల్లికిలా తిప్పాడు. సాంబయ్య పెదవులు భూమిని తాకిన చోట అన్నం మెతుకులు పడి ఉన్నాయి. తెరిచివున్న నోటిలో నల్లటి రేగడిమట్టి, ఎర్రటి రక్తంతో కలిసి వుంది. కనిగుంటల్లో మట్టి!

ముఖం అంతా మట్టి అలుముకొని సాంబయ్య తాత మట్టితో చేసిన మనిషిలా కన్పించాడు మనవడికి.

"తాతయ్యా!" రవి తాతయ్యను కదుపుతూ బిగ్గరగా పిల్చాడు. తాతయ్య పలకలేదు.

''తాతయ్యా?''

''ఇంకెక్కడి తాతయ్య బాబూ? సాంబయ్యగారు పోయారు!'' నరశిమ్మ తలగుడ్డ విప్పి కళ్ళు తుడుచుకొన్నాడు.

రవి తాతయ్య మీద వాలిపోయాడు. బిగుసుకు పోయిన చేతి వేళ్ళు తెరిచాడు. సాంబయ్యే చేతిలో వున్న గుప్పెడు మట్టి మనవడి చేతిలోకి వచ్చింది. ఆ మట్టిచేతుల్తో ముఖం కప్పుకొని ''తాతయ్యా!'' అని బిగ్గరగా అరిచాడు.

సాంబయ్య తాత ఇచ్చిన మట్టి మనవడి పెదవులు తాకి ఓదార్చింది. ఆ మట్టి చేతుల్తో కళ్ళు తుడుచుకొన్నాడు.

అల్లంత దూరంలో పడివున్న తాతయ్య కర్ర తీసుకొన్నాడు రవి. కళ్ళల్లో నిప్పులు కురిశాయి! సాంబయ్య మనవడి చేతిలో కర్ర ఎర్రటి ఎండలో మెరిసింది!

కనకయ్య తలవంచి నేల కరిచాడు. కనకయ్య వెనకున్న రామానందం తల ''టాంగ్''న మోగింది! నెత్తిమీద తెల్లటోపీ ఎగిరి అంత దూరాన పడింది.

ఇద్దరు పోలీసులు వచ్చి రవిని రెక్కలు విరిచి పట్టుకొన్నారు.

రామానందం తలపట్టుకొనికూలబడ్డాడు. రక్త శిక్తమయిన చేతుల్ని చూసుకొన్నాడు.

''బాపూజీ! అహింసతో స్వరాజ్యం తెచ్చామే! నెత్తురుకూడు తినమని నా నొసట రాశావా మహాత్మా?'' అనుకొన్నాడు.

''అహింసతో స్వరాజ్యం తెచ్చారేమోగాని - అహింస కూడు పెట్టదండీ రామానందం గారూ!'' కనకయ్య ఖద్దరు పంచెకయిన బురద దులుపుకొంటూ అన్నాడు.

''ఇన్‌స్పెక్టరూ! ఆ కుర్రాడ్ని వదిలేయండి! పసివాడు! వాడికేం తెలుసు! ఉద్రేకంలో కర్ర విసిరాడు.''

''ఏమిటి రామానందం నీ చాదస్తం! అహింస - అహింస - అని మా కొంపల కెసరు తెచ్చి పెట్తావా ఏం?'' కనకయ్య సిల్కులాల్చీ గుండీలు పెట్టుకొంటూ ఇన్‌స్పెక్టర్ను సమీపించాడు.

''ఇన్‌స్పెక్టరుగారూ వీడెవరనుకొన్నారూ?'' కనకయ్య పోలీసుల మధ్య ఉన్న రవిని చెయ్యెత్తి చూపిస్తూ చెప్పాడు.

''నిప్పు! నిప్పు! రవ్వ రాజి రాజి నిప్పవుతుంది. కారుచిచ్చవుతుంది. పసివాడని ఇవ్వాళ వీడ్నొదిలేస్తే రేపు ఊళ్ళకు ఊళ్ళే మండిపోతాయ్!''

''కనకయ్యా? పాపం పసివాడు-''

అంతవరకూ రవికేసి కన్నార్పకుండా చూస్తున్న రామానందం కనకయ్య కేసి తిరిగి నీరసంగా అన్నాడు.

''నువ్వూరుకోవయ్యా స్వామీ!'' కనకయ్య రామానందాన్ని మందలిస్తున్నట్లు అన్నాడు.

''అది కాదు ప్రెసిడెంటూ!''

''నీకేం నువ్వెన్నయినా చెప్తావ్. తిని కూర్చున్నావుగా? ఐదెకరాల ఈ ఎదవ బంజరుకు అప్పుడే పదిహేనొందలు అడ్వాన్సుగా పుచ్చుకొన్నావ్! నువ్వమ్ముతానంటే నా పొలంలో కలిసేదనికొన్నా. లేకపోతే ఈ తగాదాల పొలం అసలెవడు కొంటాడూ?''

రాజకీయ బాధితుడు రామానందం కేసి కనకయ్య గుర్రుగా చూశాడు.

''పొలమూ పంటా స్వాధీనం చేసుకో! కాని కుర్రాడ్ని వదిలేయ్. వాడి ముఖంలో వర్చస్సు చూస్తుంటే నాకెవరెవరో తలపుకు వస్తున్నారయ్యా కనకయ్యా!'' రామానందం రాజీగా అన్నాడు.

''డేంజర్! డేంజర్! ఆ ముసలాయన మాట వినబాకండి ఇన్‌స్పెక్టర్!''

కనకయ్య జెర్రిగొడ్డులా బెదిరిపోతూ అన్నాడు.

''కొట్టింది నన్ను! దెబ్బ తిన్న వాడ్ని నేను! నీ కెందుకయ్యా కనకయ్యా? ఇన్‌స్పెక్టర్‌గారికి నన్ను చెప్పనీయ్?''

''ఇవ్వాళ నిన్ను కొట్టినోడు రేపు నన్ను కొడ్తాడు. ఈరోజు నీపొలం ఆక్రమించినవాడు రేపు నా భూమి నాకు దక్కనిస్తాడా?''

అంటూ కనకయ్య ఇన్‌స్పెక్టరుకేసి తిరిగి ''ఏమిటండీ సి.ఐ.గారూ? మీరూ చూస్తూ నిలబడతారేం? ఇవ్వాళ రామానందం! రేపు కనకయ్య! ఎల్లుండి మీ పోలీసులమీదే తిరగబడతాడు వీడు! ఏమనుకున్నారో?'' అన్నాడు.

''కుర్రాడు జువనైల్ కదా అని చూస్తున్నా!'' ఇన్‌స్పెక్టర్ అరిచేతిలో పొట్టి కర్ర తిప్పుకొంటూ అన్నాడు.

''తిరుగుబాటుకు ఇది నాంది! విప్లవం ఎక్కడో లేదు. వీడిలోనే వుంది. వీళ్ళు పెరిగి పెద్దవాళ్ళయి తిరుగుబాటు చేస్తారు. విప్లవాలు తెస్తారు. ఈనాడు పసివాడని వదిలారా రేపు వాడే పెద్దవాడవుతాడు. ఒక్కడేకదా అని ఊరుకొన్నారా రేపు వందమందవుతారు. కోటి మందవుతారు. అమ్మమ్మ! ఇక మన వల్ల కాదు వీళ్ళ నాపటం! మీ పోలీసూ, మిలటరీ, కారుచిచ్చులో మిడతల దండనుకో! అందుకని ఇన్‌స్పెక్టర్‌గారూ? నా మాట విని-ఈ సాంబయ్య మనవడ్ని వదలొద్దు. ఏ నేరస్థుల స్కూల్లోనో పారేయండి!''

''దటీజ్ రైట్! ప్రెసిడెంటుగారూ!'' అస్తమిస్తున్న సూర్యకాంతిలో ఇన్‌స్పెక్టర్ బెల్టు తళుక్కుమంది.

''నో! నో! దటీజ్ నాట్ రైట్! దిస్ లాండ్ ఈజ్ మైన్! ఇట్ బిలాంగ్స్ టు మై గ్రాండ్...ఫా!''

పోలీసుల బంధనాల్లో రవి ఊగిపోయాడు.

ఇన్‌స్పెక్టర్ తుపాకి గుండు తగిలినట్టయి పోయాడు. రవికేసి ఆశ్చర్యంగా తలెత్తి చూశాడు.

''వీడు ఇంగ్లీషు చదువుకొన్నాడు ఇంకా డేంజర్!'' అన్నాడు కనకయ్య.

''గాంధీగారూ ఇంగ్లీషు చదువుకున్న వారేగా కనకయ్యా'' రామానందం అప్రయత్నంగానే అనేశాడు.

''అవతల పెట్టవయ్యా నీ గాంధీగార్ని, అహింసనూ! ఇన్‌స్పెక్టరూ! మీ డ్యూటీ మీరు చెయ్యండి. లేకపోతే హోం మినిష్టర్‌దాకా వెళ్ళాల్సి వస్తుంది తెలుసా?'' కనకయ్య కండువా సర్దుకుంటూ ఇన్‌స్పెక్టర్‌కు కర్తవ్యబోధ చేశాడు.

ఇన్‌స్పెక్టర్ పోలీసులకేసి తిరిగి తల ఎగరేశాడు.

ఊరుబోయిన వెంకయ్యగారి సాంబయ్య మనవడు రవిని పెడరెక్కలు విరిచి పట్టుకొన్న పోలీసులు పంటచేలోనుంచి బయటికి ఈడ్చుకొని పోసాగారు.

పడమటి దిక్కున తాటితోపులో రవి అస్తమించాడు.

తూర్పు దిక్కున ఎర్రటోపీల మధ్య రవి ముఖం జేవురించింది.

''ఒరే! బాబూ! ఈ భూమి నీదేరా! ఈ పంట నీదేరా!'' సాంబయ్య తాత కంఠం - నింగీ నేలా నిండిపోయి మనుమడి అణువణువునా ప్రతిధ్వనించింది.

కొత్త కాలువ వంతె నెక్కుతూ రవి ఆగి నిలబడ్డాడు. సాంబయ్య మృతకళేబరం పక్కన దిగులుగా, గుబులుగా కూర్చున్న నరశిమ్మను చూసి ఎలుగెత్తి అరిచాడు రవి.

''దిబ్బ మీద తాతయ్యకు గుడి కట్టు!''

''ఏం రా! మీ తాతయ్య శంకరాచార్యులా, గాంధీమహాత్ముడా? గుళ్ళూ, గోపురాలూ కట్టటానికి?'' ఇన్‌స్పెక్టర్ పక్కన భుజం భుజం రాసుకుంటూ నడుస్తోన్న కనకయ్య అన్నాడు.

''ఏయ్? కనకయ్యా?'' రవి కసిగా అరిచాడు.

''అవ్వనా! మరి! మట్టి పిసుక్కునే వాడిక్కూడా రాజ్‌ఘాటులూ, శాంతి వనాలూ కట్టిస్తే ఈ దేశంలో ఉన్న చోటు చాలదురా!''

''ఆ దిబ్బ మా తాతయ్యది. మా ఇష్టం వచ్చినట్టు చేసుకుంటాం. నువ్వెవడివిరా అడగటానికి?''

''ఆఁ. మీ తాతయ్యది? మా పొలాల మధ్యా ఇళ్ళ మధ్యా సమాధులు కడ్తావంటారా? ఇది ఊరా వల్లకాడా?''

''రేయ్! కనిగ్గాడా! నీ ఊరు వల్లకాడు చేస్తానా! నీ ఇల్లు తగలపెట్తానా!'' రవి కంఠంలో అగ్నిగోళాలు ప్రజ్వరిల్లాయి.

''పోరా! కుంకా! ముందు ఇనప కటకటాల్నుంచి బయటికి రా రా చూస్తాను!''

''వస్తానా! తిరిగొస్తానా!''

''ఆఁ! వస్తావ్! వస్తావ్!'' కనకయ్య గొంతులో ఏదో అడ్డుపడ్డట్టయి, ఇన్‌స్పెక్టర్ బెల్టులోవున్న రివాల్వర్‌కేసి చూశాడు.

''వస్తానా

వస్తా-

తెస్తా నీ కోసం-

తుపాకి!''